శ్రీరామాయనమః.



శ్రీమద్వాల్మీకిమహర్షిప్రణీత

# శ్రీమద్రామాయణము.

## అయోధ్యాకాండము.

చెదలవాడ * సుందరరామశాస్త్రులచే

వ్రాయఁబడిన ప్రతిపదాంధ్రటీకా తాత్పర్యవిశేషార్థ

సమన్వితమగు

పరమార్థచంద్రికయను వ్యాఖ్యానముతో

వావిళ్ల * రామస్వామిశాస్త్రులవారిచే

పరిష్కరింపఁబడి ప్రతిమాయుతముగ

ఆదిసరస్వతీనిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

౧౮౯౦, సం||

శ్రీః

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యపదవాక్య ప్రమాణ పారావారపారీణ యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధ్యష్టాంగ యోగానుష్ఠాన నిష్ఠ తపశ్చక్రవర్త్యనాద్యవిచ్ఛిన్న గురు పరంపరాప్రాప్తషడ్దర్శనస్థాపనాచార్య వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర సకల నిగమాగమ సారహృదయసాంఖ్య త్రయ ప్రతిపాదక వైదికమార్గప్రవర్తక సర్వతంత్ర స్వతంత్రాది రాజధానీ విద్యానగర మహారాజధానీ కర్ణాటక సింహాసనప్రతిష్ఠాపనాచార్య శ్రీమద్రాజాధిరాజగురు భూమండలాచార్య ఋశ్యశృంగ పురవరాధీశ్వరతుంగభద్రాతీరవాసి శ్రీమద్విద్యాశంకర పాదపద్మారాధక శ్రీమన్నృసింహభారతీస్వామి గురు కరకమలసంజాత శృంగేరి శ్రీసచ్చిదానంద శివాభినవ నృసింహభారతీస్వామి చరణారవిందయోః,

అఖిలావగ్రహ నిగ్రహణావ్యగ్ర సమగ్రబలేన, శ్రీమతాఽనుగ్రహేణ, విజయతేతరామయమ్.

శ్రీరస్తు.

ప్రతిపదాంధ్రటీకావిశేషార్థతాత్పర్య ప్రతిమాదిసహిత

శ్రీమద్రామాయణము.

ప్రధానపోషకులు.

శ్రీమన్మహారాజరాజాధిరాజా శ్రీమహారాజా సాహేబు

మెహర్బాన్ దోస్తాన్ ముష్ఫక్ ఖదరదాన్ కరంపమార్మా

య మొగలీషాన్ మీర్జారాజాది హానరేబిల్ హిజ్ హైనెస్స్

మన్నెసుల్తాన్ బహదూర్, కె, సీ, ఐ, ఇ,

ఇత్యాద్యనేక బిరుదావళీ విరాజమానులగు

శ్రీమద్రాజాధిరాజమహారాజ

శ్రీమద్విజయనగరపట్టణాధీశ్వర

శ్రీమదానందగజపతిమహారాజులుం

గారు

రూ (౫౦౦) అయిదువందలురూపాయలువిరాళమిప్పించి

మహాసాహాయ్యముచేసి

ఈగ్రంథమునకుప్రధానపోషకత్వము నంగీకరించిరి.

మంగళమస్తు.

శ్రీ

## —(*) పోషకులు (*)—

బ్రహ్మశ్రీ,మహారాజరాజశ్రీ

౧ శ్రీబ్రహ్మానందసరస్వతీస్వాములవారు,యోగానందేశ్వరమఠం,ఎడతొరె.
౨ శ్రీరంగస్థలంశ్రీపరాశరభట్టరైన శ్రీమాన్ మహామహోపాధ్యాయ శ్రీరంగరాజభట్టర్ అయ్యంగాలున్‌గారు.
౩ దీ, హానరేబిల్, పల్లె,చెంచలరావుపంతులుగారు.సి-ఐ-ఇ.
౪ దివాన్ బహాదర్ పతికి,శ్రీనివాసరావుగారుస్మాల్ కాస్‌కోర్టున్ జడ్జి.
౫ సి, జి-కుప్పుసామిఅయ్యర్,బి,ఏ,బి,ఎల్, మద్రాస్ ప్రసిడెన్సిమ్యాజస్ట్రీట్
౬ వెంబాకం,కృష్ణమాచార్యులుగారు,రిజష్ట్రార్ ఆఫ్ బుక్స్.
౭ చివుకులరామయ్యగారు.పింఛన్ తాశీల్‌దార్
౮ చివుకుల,సుబ్బయ్యశాస్త్రులుగారు,విజయనగరమునసఫ్.
౯ రాజా-దిహానరేబల్,టి,రామరావుగారు,హైకోర్టున్‌వకీల్.
౧౦ స్వి,వి,సుందరశాస్త్రులగ్గారు,బి,ఏ,బిఎల్,హైకోర్టున్‌వకీల్.
౧౧ రాయబహదూర్-పి,అనంతాచార్యులుగారు,బి,ఎల్,హైకోర్టున్‌వకీల్
౧౨ తల్లాప్రగడ,సుబ్బారావుగారు-బి,ఎ బి,ఎల్,హైకోర్టున్‌వకీల్.
౧౩ శ్రీరాజా,కావలి-వేంకటపెద్దసీతారామయ్యవారు-జాగిదార్ ఆఫ్ తిన్ననూర్.
౧౪ శ్రీరాజా,కావలి-వేంకటచిన్నసీతారామయ్యవారు,జమీందార్ అఫ్ విస్సన్నపేట.
౧౫ సాహుకార్,అంబాశంకరదవేజీవారు.
౧౬ మాడభూషి,విద్వాన్ వేంకటాచార్యులువారు.
౧౭ వి,కే, రంగాచార్యులవారు
౧౮ మందపాటిరామకృష్ణయ్యపంతులువారు.
౧౯ నాగరాజువీరరాఘవరావువారు-నెల్లూరురంగనాయకులపేట.
౨౦ అడివి,శ్రీరామపంతులవారు,బి,ఎ,గవర్నర్ మెంట్ సెక్రటేరిఆఫీస్‌క్లర్కున్.
౨౧ జి,సుబ్బరామయ్యవారు,కొంగనపురంముతా వర్ శంకరిదుగ్గం.
౨౨ జక్కరాజు,లక్ష్మీనారాయణప్పగారు,నంజంపేట,పుంగనూరు.
౨౩ కున్నత్తూరు,తిరువేంగడాచార్యులగారు.
౨౪ నేలటూరు, వెంకటరంగాచార్యులు అయ్యంగారు, పడార్‌పల్లెశ్రోత్రియదారులు
౨౫ విశ్వనాథయ్యర్ వారు,బిఎ,బిఎల్ హైకోర్టున్‌వకీల్.
౨౬ జిడ్డుపూర్ణయ్యవారు,సబ్‌రిజస్ట్రార్,గుంటూరు.
౨౭ ధూళిపాటీసుబ్బరాయలుఅయ్యవారు-ధూళిపాటికృష్ణయ్యవారిఅన్నకుమారులు.
౨౮ కోవి-సుందరరామయ్యవారు-సూపరెంటెండింగ్ ఇంజనియర్స్ఆఫీస్.
౨౯ కుందవరం-సుందరయ్యవారు
౩౦ పిన్నపాకం సుందరాచార్యులువారు
౩౧ రామచంద్రరావుగారు-అంబూరుపేట ముఠాయిజారాదారుగారు,ఆమూరివద్దతుత్తి
౩౨ పానగంటి,వెంకట్రామానాయనివారు కొమ్మాలపేటజాగీర్‌దార్ (శెట్టు-
౩౩ మోకా,వెంకటాద్రిశాస్త్రులవారు.
౩౪ కొప్పరపు,రామరావుగారు-మునసఫ్.
౩౫ సోమేశ్వరతర్వాడిగారు.
౩౬ ముడియంనాగేశ్వరరావుగారు. వకీలు గుత్తి
౩౭ కలిచెలన్,వెంకటరెడ్డివారు, మదనపల్లె
౩౮ తంబళ్లపల్లె,సుబ్బారెడ్డివారు. మదనపల్లె

౩౯ బొజ్జిరెడ్డివారి సీతారామరెడ్డివారు.
౪౦ శ్రీనివాసరంగాచార్యులవారు, దేవస్థానం సంస్కృతపాఠశాల, తిరుపతి
౪౧ జంగంకోట శ్రీనివాసరావు గారు-
౪౨ నాగేశ్వరయ్యర్ వకీలు తిరుత్తిర పూండి
౪౩ జిడ్డు నారాయణయ్యవారు సబ్ కలెక్టరాఫీస్ హెడ్ క్లర్కు
౪౪ వ, సామయ్యవారు-రివిన్యూఇనిస్పెక్టర్
౪౫ వంకాయలకృష్ణస్వామిశెట్టివారు
౪౬ నాగేశ్వరశాస్త్రిలవారు, మిడిల్ స్కూల్ హెడ్ మాస్టరు, పుంగనూరు.
౪౭ బాడాలశ్రీనివాసయ్యవారు-తాలూకాకచ్చేరిగుమస్తా, వావిల్ పాడు-

మహారాజరాజశ్రీ

౪౮ కొల్లావెంకటకన్నయ్యసెట్టివారు-
౪౯ సాహుకార్, కృష్ణదాస్ బాలముకుందదాసువారు-
౫౦ సాహుకారుచతుర్భుజదాసుకుశాల్ దాస్ వారు-
౫౧ సమ్మధిఁ రంగయ్యసెట్టిగారు, బి-ఎ, ప్రొఫసర్ క్రిష్టియన్ కాలేజ్.
౫౨ పి, కృష్ణస్వామిసెట్టివారు; బి; ఎ; బి; ఎల్ హైకోర్టువకీలు.
౫౩ అజ్జిపణ్ముఖప్పవారు; ఎమ్ప్రెస్ ఆఫ్ ఇండియా ప్రెస్
౫౪ తెల్లనాకులమల్లయ్యసెట్టివారు-
౫౫ విడవలపాటిసుబ్బరామయ్యసెట్టివారు-
౫౬ నాళం; అప్పలరాజువారు-
౫౭ శిరంకోటిలింగంవారు-
౫౮ సూరంపల్లి రెడ్డివారు
౫౯ తాటికొండనంబెరుమాళ్ సెట్టివారు; బి; ఎ
౬౦ పిట్టి; త్యాగరాయసెట్టివారు-బి, ఎ
౬౧ గోనుగుంట్ల; నారాయణవారు-
౬౨ కామిసెట్టి; చిన్నకొండయ్యసెట్టివారు-
౬౩ శ్రీరేకంమనవాళయ్యవారు-యేలూరుసబ్ జడ్జి (యజమానులు-
౬౪ మాంబళం-వెంకటస్వామినాయుఁడువారు - తంజావూరి రామానాయుడి సత్రము
౬౫ పి-రంగయ్యనాయుఁడువారు- హైకోర్టువకీల్-
౬౬ బి-బాలయ్యనాయుఁడువారు-హయికోర్టు-
౬౭ వంకాయలకుప్పయ్యసెట్టివారు-
౬౮ రాయబహదూర్ ఆర్కాడు-ధనకోటిముదల్యారివారు-మేల్పాకం-జమీందారు
౬౯ బండ్లరామస్వామినాయుఁడువారు-వేలూరుడిస్ట్రిక్టుమునసఫ్-
౭౦ అల్లత్తూరు-నారాయణసెట్టివారు-
౭౧ పుదుచ్చేరితిరువేంగడస్వామిపిళ్లవారు-అటర్నీ-
౭౨ మణ్నారుపేట-రామస్వామినాయుఁడువారు-తంజావూరురామానాయుడిధర్మం
౭౩ యస్-రామస్వామిమొదలారిగారు-హయికోర్టువకీల్- (మానేజర్-
౭౪ యస్-గోపాలస్వామిమొదలారివారు-మిరాదార్-సేలం-
౭౫ ది-హానరేబిల్ శ్రీరాజాగొడెనారాయణగజపతిరాయనింగారు-విశాఖపట్నం-
౭౬ గ్రంధి-రామయ్యసెట్టివారు-
౭౭ దొడ్డి-యోగప్పగారు-పింఛన్ మున్సఫు-
౭౮ పి; వి; కృష్ణస్వామిశెట్టివారు బి.ఎ అకౌంటెంటుజనరల్ ఆఫీస్.

౭౯ మధుర-రంగరావువారు-
౮౦ ధర్మపురి-వెంకోబరావువారు వకీలు-
౮౧ మండి-శ్రీసరాపువరదప్ప శెట్టిగారు-
౮౨ నంబూరు-సుబ్బారావుగారు-
౮౩ పుదుచ్చేరి-లక్ష్మణస్వామిశెట్టిగారు-
౮౪ పి-సాంబయ్యగారు-నందలూరుమునసఫు

—(※) చందాదారులు- (※)—

మహారాజరాజశ్రీ.

సి-వి-సుందరంశాస్త్రులుగారు-
కోపల్లె-కృష్ణరావుగారు-
ముట్లూరు ఆదినారాయణయ్యగారు-
ఆమంచెర్ల-సూరయ్యగారు-
నెమలి-మాడభూషిసుబ్రహ్మణ్యయ్యగారు-
కొప్పరపు-రంగరావుగారు-
పువ్వాడ-సూర్యనారాయణరావుగారు-
పిడుగు-సుబ్బరామయ్యగారు-
పడకల్-కిషన్ రావుగారు.
మాచవరం-రామకృష్ణయ్యగారు-
వసంగురుస్వామయ్యగారు-
దేవళ్ల-రామస్వామయ్యగారు-
వి-లక్ష్మణరావుగారు-
ఆ-పరశురామయ్యగారు-
ధూళిపాటి-కృష్ణయ్యగారు-
క-సీతాపతయ్యగారు-
టి-వెంకటకన్నయ్యగారు-
పులుగు-వెంకట్రామయ్యగారు-
ధూళిపాటిసుబ్బరామయ్యగారు-
పేరత్తూరు-శ్రీనివాసాచార్యులుగారు-
దిగవిల్లి-తిమ్మరాజుగారు-
జనమంచి-వెంకట్రామయ్యగారు-
పడసాల-సుబ్బరామయ్యగారు-
ఎన్-రాఘవయ్యగారు-
కోడూరు-వెంకటకన్నయ్యగారు-
అద్దంకి-రఘునాథరావుగారు-
ములుకట్ల-వెంకటప్పయ్యగారు-
మైసూరు వెంకట్రావువారు-
పరహాభట్ల-అణ్ణాజిరావుగారు-
పి-అనంతాచార్యులగారు-
మాంబట్టు-లక్ష్మీనరసయ్యగారు-
చివుకులజానకీరామయ్యవారు-

మహారాజరాజశ్రీ.

గుండ్లపూడి-రామకృష్ణయ్యగారు-
బీరకుతీర్-సుబ్బరావు-
ముంగమూర్-నరసింహపంతులు-
వెంపటి-వెంకటాచలంపంతులు-
వెన్నలగంటి-హనుమంతరావు-
బ్రహ్మసముద్రం-శేషగిరిరావు-
నెమలి-పట్టాభిరామరావు-
ఎ-త్యాగరాజయ్యగారు-
దేశిరాజు-కృష్ణయ్యగారు-
పరికుంట-వెంకటసుబ్బారావు-
భోగరాజు-రామచంద్రరావు-
గుడిపాటి-వెంకట్రావు-
గుండావఝుల-రామకృష్ణయ్యగారు-
కోరంకి-రామలింగయ్యగారు-
బైడిపాటి-వీరాస్వామయ్యగారు-
మహాంకాళి-సుబ్బరాయలుగారు-
య-అప్పయ్యపంతులు-
నరసరాజువారు-
వడిగెపల్లి-శేషయ్యగారు
హులుల్లూరువాసుదేవప్పగారు-
మలిరెడ్డికొండ్రాయుడుగారు-
బుర్రా శంకరశాస్త్రులుగారు-
గుండు-గురుస్వామయ్యవారు-
గురుజాడశ్రీరామమూర్తివారు-
ఓరుగంటి-లక్ష్మీనారాయణప్పవారు-
నెడామారువీరరాఘవాచార్యులు-
కూనపరాజు-శేషాద్రిరావువారు-
రోజుకుతీర్-తిరుమలరావుగారు-
రేవూరులక్ష్మీనరుసుపంతులవారు-
కృత్తివెంటి-కృష్ణమూర్తివారు-
శంకవరంపరదాచార్యులవారు-
నాచేరిరామానుజాచార్యులువారు-

మహారాజరాజశ్రీ

పొట్టపల్లి-వెంకటఅప్పారావువారు-
అక్కిరాజు-చెంగల్రావువారు-
శివరాజు-రంగయ్యవారు-
కానుగోలు-నాగేశ్వరరావువారు-
వానమామల నరసింహాచార్యులవారు-
కరణం వెంకట్రావువారు
శ్రీపూసపాటి-వెంకటపతిరాజువారు-
అద్దంకికేశవాచార్యులవారు-
వళాంకుప్పం-కృష్ణమాచార్యులవారు-
రావుసాహేబు-పోరూరుకోటయ్యవారు-
అరింబాకం-సామయ్యవారు-
యన్-సుబ్రహ్మణ్యయ్యర్ వారు-
వి.గోపాలాచార్యులవారు-
ఉప్పలధడియం-వెంకయ్యవారు-
వేలామూరు-శింగరాచార్యులవారు-
గొడవర్తి-కృష్ణయ్యవారు-
యమ్-పార్థసారథిఅయ్యంగారు-
కరణం-వెంకోబరావు-
లక్ష్మణశర్మగారు-
శే-రామానుజాచార్యులువారు-
ము-విశ్వనాథశాస్త్రిలవారు-
తిరుమలనల్లాన్ చక్రవర్తి- శ్రీనివాసవెంకటరాఘవచక్రవర్తిగారు-
పంగులూరుమునుస్వామిసెట్టివారు-
కరాలపాటి-రామానుజయ్యవారు-
చిలముత్తూరు-నంబెరుమాళ్లసెట్టిగారు-
వంకాయల-కృష్ణస్వామిసెట్టివారు-
మన్నలూరు-నరసింహులసెట్టివారు
భువనగిరి-చెన్నకేశవులసెట్టివారు-
సత్రసాల-వెంకటకృష్ణమసెట్టిగారు-
నాగులకొండ-శ్రీరాములు
మాఘం-వెంకట్రామానుజశ్రేష్ఠివారు-
వేమూరు-వెంకటకృష్ణమశ్రేష్ఠిగారు-
తుంమడిసెట్టిగురవప్పశ్రేష్ఠిగారు-
యం-వెంకట్రామయ్యగారు-
కామిశెట్టి-శేషయ్యగారు-
పాలూరు-రాజంసెట్టివారు-
మన్నారు-వెంకట్రామస్వామిశ్రేష్ఠిగారు-
చల్లా గురుస్వామిశ్రేష్ఠివారు-
చుండూరు-పురుషోత్తమశ్రేష్ఠిగారు-

మహారాజరాజశ్రీ.

పోరూరు-తిరువెంగడత్తాన్ శ్రేష్ఠిగారు-
గంధపొడి-చెంగల్రాయశ్రేష్ఠిగారు-
కలవల-తిరువెంగడత్తాన్ శ్రేష్ఠిగారు-
సి-సాంబశివశ్రేష్ఠిగారు-
ఎస్-సుబ్బయ్యశ్రేష్ఠిగారు-
జి-విజయరాఘవులశ్రేష్ఠిగారు-
మద్దిఅప్పయ్యగారు-
శింగిరి-భాష్యంశ్రేష్ఠిగారు-
కోటానంమాళ్వారయ్యగారు-
టి-రామశింగుగారు-
మాధవరాజుగారు-
టి-రామయ్యశ్రేష్ఠిగారు-
కాకాణి-కృష్ణయ్యశ్రేష్ఠిగారు-
శ్రీరాజా శ్రీరంగభూపాలబాళేరావుగారు-
కంబినాయనిజవ్వాజి-రామప్పనాయనింగారు (కంగొందిజమీందారు-
కుప్పాలకృష్ణస్వామినాయుఁడుగారు-
బి-వాసుదేవనాయుడుగారు-
కొటిబోయిన-భాష్యంపిళ్లగారు-
నీలిజగన్నాయకులునాయుడుగారు-
కావనూరుమంత్రాలపద్మనాభరెడ్డిగారు-
శేషాకులవరదరాజులశ్రేష్ఠిగారు-
సైదాపేట-అప్పాసామిశ్రేష్ఠిగారు-
పంమి-చిన్నస్వామిశ్రేష్ఠిగారు-
వ-తిరువేంగడస్వామినాయుడువారు.
మైలాపూరు-ధనికాచలమొదలారిగారు-
అనంతయ్యనాయుడువారు-
పి-గోవిందరాజులునాయుడువారు-
మెండు-రామస్వామినాయుడువారు-
చిట్టెం-కుప్పరావునాయుడువారు-
కుప్పసామిసెట్టివారు-
కుమారస్వామినాయుడువారు-
పి-గోవిందనాయుడువారు-
మాంబలం-తిరువేంగడత్తాన్నాయుడుగారు
బండ్ల-కృష్ణయ్యనాయుడుగారు-
గడ్డిపాటి - కోటప్పనాయుడుఅండుసన్ గారు
ఇసికపల్లి-చిన్నయ్యనాయుఁడువారు.
ఆ-రామానుజయ్యవారు-
ముద్దం-కేశవులునాయుడుగారు-
మద్దెరి-వరదరాజులునాయుడుగారు-

మహారాజరాజశ్రీ.

కు-రామస్వామినాయుడుగారు-
నిశ్చింత-ఎంబారయ్యగారు-
యమ్-రామాంజులనాయుఁడుగారు-
టి-గోవిందరాజులునాయుడుగారు-
టి-ఎల్-రంగయ్యానాయుడుగారు-
జమ్మి-కుప్పుసామినాయుడుగారు-
ముద్దుకృష్ణపిళ్లగారు-
చిన్నికృష్ణమనాయుడుగారు-
కరణం-హరివెంకట్రామయ్యగారు-
కర్వదిరాఘవయ్యగారు-
అణ్ణంగా నెల్లూరుకృష్ణస్వామయ్యగారు-
వి-వెంకట్రావుగారు-ప్రఫసర్ ఆఫ్ మోరల్సు మహారాజాస్ కాలేజ్ విజయనగరం-
ధారాపురం-కొండలుసెట్టిగారు-
శాత్తనూరు-కల్యాణసుందరశాస్త్రులు-
చిరివెళ్ల - గుర్వరాజుగారు - బోరేవాళ్లపల్లె గ్రామకరణం.
వెలివర్తి-భాస్కరప్పగారు- బొమ్మయ్యగారిపల్లెకరణం-
రామచంద్రరావుగారుఅసిస్టాంటుకమీషనర్
సదాశివశాస్త్రులగారు- తిరువడి-
కృష్ణస్వామినాయుడువారు - కుంభకోణం. పోలీసుయినస్పెక్టరు-
జిడ్డుకృష్ణస్వామయ్యగారు
అయ్యగారిత్రియంబకంగారు - నర్సాపురం-
టి-చిదంబరరావుగారు- కర్నూలు-
టి-నాగేశ్వరయ్యర్- కోట
జి-కృష్ణయ్యర్ · సేందమంగళం-
మేకలపార్థసారథీనాయుడువారుకావలి-
కే-వెంకటరావుగారు-
యం-సి-కాశిరామయ్యగారు-పంద్రుట్టి
ముంగమూరునరహరిరావుపంతులగారు-డిప్టీ తాశీల్ దార్ అల్లూరు.
పి-సుబ్బరామయ్యగారుకావలి
వొవ్వేటివెంకట్రాజుగారు-పిఠాపురం.
సి-హనుమంతరావుగారు-గుత్తి
కోవ్వూరుకృష్ణరావుపంతులగారు-తహశీల్దారు
స్వయంపాకులవెంకటసుబ్బారావుగారు- నెల్లూరు-

మహారాజరాజశ్రీ

మోదరపురామస్వామినాయుఁడుగారు-(త్రి
మేకలబాలకృష్ణమనాయుఁడుగారు-మదనప
గడ్డంనారప్పగారు-మదనపల్లె
డా-నారాయణరెడ్డివారు-కదిరి-
యం-రామచంద్రరావుగారు-పలవనేరి-
యల్లాప్రగడ-వెంకటకృష్ణరావుగారు-కొత్తపేట గుంటూరు-
జె-యల్లప్పగారుగుత్తి
ఎస్-అంబాజీరావుగారు-వకీలుగుత్తి-
వల్లూరుజగన్నాథరావుగారు-బొబ్బిలి-
చెన్నారెడ్డిగారు-కుమ్మెత్తపాటల్
కోనా-వరదయ్యశ్రేష్ఠిగారు
ఏ-రామానుజాచార్యులుగారు-సిద్ధవటం,
శ్యామజీరాఘవేంద్రరావుగారుఅనంతపురం
గోపాలకృష్ణయ్యగారు- రేపల్లే
పాపాశాస్త్రులుగారు- గుత్తి
తోటచెలర్వీరేశలింగంశాస్త్రులుగారు-
కనకరాయమొదలారిగారు-పొన్నేరి
కృష్ణరాజుగారు-కోడూరుగ్రామం శ్రోత్రియదారుపొన్నేరి
యేకామ్రయ్యగారు- శిరస్తెదార్ పొన్నేరి-
దీనదయాళునాయుడుగారు-
మోటపల్లి వాసుదేవనాయుడుగారు - కడలూరు
శాలకృష్ణదాసుగారు-
ధర్మపురిసర్వోత్తమరావుగారు-వకీలు చిత్తూరు-
టి-దేశికాచార్యులుగారు- సబ్ రిజిస్ట్రార్ వేలూరు-
చిలకలమర్రి లక్ష్మణాచార్యులురాజమండ్రి-
మంగేపూడిరామశాస్త్రులువారు
శ్రీనివాసులమొదలియారుగారు తహశీలుదారువేలూరు-
రాళ్ళపల్లి ఆదిశేషయ్యగారు-
కృష్ణంవెంకటసుబ్బయశెట్టివారు-
ఆదుర్తివిశ్వంరాజుగారు-వకీల్ కడప-
కరణంశింగరాజుపాపరాజుగారు-
తుంమలపల్లి వరదరావుగారు హెడ్ అసిస్టాంటుకలక్టరు-

మహారాజ రాజశ్రీ.

సరిపెల్లగోపాలకృష్ణమ్మగారు-
శ్రీపాదంనాగయ్యగారు-
వెంకటేశ్వరరావుగారు-
గొల్లాపిన్నినరసింహయ్యగారు-
పాలపూడి-శివరామయ్యవారు-
అరుణాచలయ్యగారిసుబ్రహ్మణ్య శాస్త్రిలువారు-
కప్పగంతుల సావిత్రిపంతులువారు-
హనుమంతుఅప్పళనాయుడుగారు-
సుబ్బారెడ్డివారు-జూటూరుతాటిపత్రి
వేలూరునరసింహంగారు-భీమవరం-
వల్లభ శేషయ్యవారు-తహశీల్ దారు
శిష్టాసూర్యనారాయణశాస్త్రిలువారు
యన్-రాఘవేంద్రరావుపంతులుగారు- పెట్టీతహశ్శీల్దార్ గుత్తి

మహారాజ రాజశ్రీ

టి-రామచంద్రరావుగారుడిస్ట్రిక్టు మునసఫ్ నెలూరు
పి-భీమరావుగారు-ఆత్మకూరుకర్నూలు
కొమిలక్ష్మినరసునాయుడుగారు-
శంకరప్పగారుకరణం- గుంతకల్లు
డి-శ్యామరావుగారు-తిరుకోవిలూరు
కొప్పలకొండనరసప్పరెడ్డిగారు-
ఉదరపికొండవొడ్డనాయుడుగారు
తాకరాజుసుబ్బన్నగారు-
కరణంతిమ్మప్పగారు-
కరణంకేశవరాజువారు-
కరణంరంగప్పవారు-
పరిగెహనుమంతరావువారు
బెంగుళూరు-పుట్టాసాని-
బళ్లారి-రంగాసాని-

శ్రీరామచంద్రశ్శ్రితపారిజాతః, సమస్తకల్యాణగుణాభిరామః
సీతాముఖాంభోరుహచంచరీకో, నిరంతరంమంగళమాతనోతు.





## ఇటీవల చేరిన పోషకులు.



కొట్టైదీనదయాళునాయఁడుగారు, తాశీల్దార్ కుళి త్తలై-
యస్, రాఘవేంద్రరావుగారు- పింఛిన్ తాశీల్దార్ గుత్తిరైల్వేస్టేషన్-
అత్తియూరు, శ్రీనివాసాచార్యులుగారు-రాయపురం-
ఆలీ, అప్పడుగారుకురుప్పాంజమీందారిలీగల్ యడ్వైజర్, అండ్ సెక్రటేరి; పార్వతీ
ఆమంచర్ల, సూరయ్యగారు. రాయపుర- (పురం.



## ఇటీవల చేరిన చందాదారులు.



ముద్దం- యతిరాజులునాయఁడుగారు.

కోటంరాజు, కృష్ణారావుపంతులుగారు.

విజయరాఘవులుశెట్టిగారు.

రామానుజులునాయఁడుగారు.

మధురకవులయ్యగారు.

జి, కుప్పుసామినాయఁడుగారు.

మాధవరాజుగారు.

అప్పయ్యశెట్టిగారు.

రామయ్యశెట్టిగారు.

చెదలవాడ, వెంకయ్యగారు. చిత్తూరు-

వెలగపూడి రామయ్యగారు- పేటుపురం-అనంతవరం, యీతముక్కల, నెల్లూరు-

మంగిపూడి- రామశాస్త్రిలుగారు-

కోటంరాజు, సుబ్బరావుపంతులుగారు.

టి, చిదంబరరావుగారు.

పూళ్ల, శేషయ్యగారు.

కూనపరాజు, శేషాద్రిరావుగారు.

నడాదూరు, వీరరాఘవాచార్యులుగారు.

యరగుడిపాటి, అప్పయ్యపంతులుగారు-

రోజుకుతిక్, తిరుమలరావుగారు.

వడల, కచ్ఛపేశ్వరయ్యగారు-

కంది, వెంకటరావుపంతులుగారు-

సాళ్వపంతుల, సీతాపతిరావుగారు-

వరగంటి, రామరావుగారు-

ఓరుగంటి, లక్ష్మీనరసుపంతులుగారు.

యస్-వి-బాలకృష్ణమ్మ, డిస్ట్రిక్టుఅండుసస్ కోర్టుక్ పేటబరంపురంగంజాం-

రాళ్లపల్లి, లక్ష్మీనరసింహయ్యగారు, రివిన్యూయిక్ స్పెక్టర్-

ముత్తలూరు, చెంచయ్యగారు, కరణం

ఎనమంద్రము, సూరయ్యగారు- మదనపల్లె-

వీరిసహాయముతో

శాలివాహనశకము ౧౮౦౯ వదగుసర్వజిన్నామసంవత్సరము

జ్యేష్ఠశుద్ధపూర్ణిమాభానువారముప్రారంభమైన శ్రీరా

మాయణమునందు- వికృతినామ సంవత్సరజ్యేష్ఠ

శుద్ధ౧౩ భానువారము అయోధ్యాకాండ

సంపూర్ణంబయ్యె,



స్త్రీనిగాని, బాలునిగానివృద్ధునిగాని, చంపినను, భృత్యునిబోషింపకవిడిచినను, ఏపాపంబుగలుగునో, ఆపాపము నాకుంగలుగుగాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన, ఇతరులంజంపుటకన్న, రాజునుగాని స్త్రీనిగానిబాలునిగానివృద్ధునిగాని,చంపిన,నధికదోషంబుగలుగుననియు, భృత్యులంబోషింపకున్నచోనధికదోషంబుగలుగుననియు,సూచింపఁబడుచున్నది.

లాక్షయా మధుమాంసేన లోహేనచ విషేణచ
సదైవ బిభృయా ద్భృత్యాన్ యస్యార్యో నుమతే గతః. ౩౮

టీక॥యస్య=ఎవ్వనియొక్క; అనుమతే=సమ్మతియుండఁగా; ఆర్యః= పూజ్యుఁడగురాముఁడు; గతః = పోయినాఁడో; సః(అధ్యాహృతము)= ఆతండు; సదైవ=ఎల్లప్పుడును;లాక్షయా= లత్తుకచేతను; మధుమాంసేన= మద్యముచేతను మాంసముచేతను; లోహేన=లోహముచేతను; విషేణచ= విషముచేతను, వీనిని విక్రయించుట చేతననుట;భృత్యాన్=పోషింపఁదగినవారలను; బిభృయాత్=పోషించునుగాక.

రాముండడవికిఁబోవుటకు, నేనుసమ్మతించియుందునేని, యెల్లప్పుడును, లత్తుక, మద్యము, మాంసము, లోహము, విషము, ఇవిమొదలగు నిషిద్ధద్రవ్యంబుల విక్రయించి, కుటుంబపోషణముచేసికొనుచుండువానికింగల్గు పాపంబునాకుఁగలుగుఁగాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన ఆపత్సమయంబునందుఁగూడ, లత్తుక, మద్యము, మాంసము, లోహము, విషము, ఇవిమొదలగువాని,విక్రయించి, జీవింపఁగూడదనియు,నట్లుచేసినవానికిమహాదోషంబనియు, సూచింపఁబడుచున్నది.

సంగ్రామే సముపోఢేస్మ శత్రుపక్షభయంకరే
పలాయమానో వధ్యేత యస్యార్యోనుమతే గతః. ౩౯

టీక॥ యస్య=ఎవ్వనియొక్క; అనుమతే = సమ్మతియుండఁగా ; ఆర్యః =




పూజ్యుఁడగు రాముఁడు; గతః= పోయినాఁడో, సః(అధ్యాహృతము)= అతఁడు; సమువోఢే = సమీపమునందు; శత్రుపక్షభయంకరే=శత్రుపక్షంబునకు భయంబు గల్గించునట్టి; సంగ్రామే = యుద్ధము; తిష్ఠతి(అధ్యాహృతము)= ఉండగా; పలాయమానః= పరుగెత్తుచు; వధ్యేత=చంపఁబడును.

రాముండడవికిఁ బోవుటకు, నేనుసమ్మతించి యుందునేని, భయంకరంబగు, యుద్ధంబునందు, భయంబున వెనుకకుఁదిరిగి పాఱిపోవుచుఁ జంపఁబడినవానికిఁగల్గు పాపంబు నాకుఁగలుగుఁగాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన, యుద్ధంబున, వెనకకుఁదిరిగి పాఱిపోయి నపాపంబుగలుగుననియు, నట్లు పాఱిపోవువాఁడు, బ్రతికినను, చంపఁబడినను, నరకంబునె పొందుననియు; సూచింపబడినది.

కపాలపాణిః పృథివీ మటతాం చీరసంవృతః
భిక్షమాణో యథోన్మత్తో యస్యార్యో నుమతే గతః. ౪౦

టీక॥ యస్య= ఎవ్వనియొక్క; అనుమతే=సమ్మతియుండఁగా; ఆర్యః= పూజ్యుఁడగు రాముండు; గతః= పోయినాఁడో; సః(అధ్యాహృతము)=అతండు; కపాలపాణిః = పుఱ్ఱెచేతం గలవాఁడై; చీరసంవృతః= గుడ్డపేలికలచేఁజుట్టఁబడినవాఁడై; భిక్షమాణః= బిచ్చమడుగుచు; ఉన్మత్తోయథా = పిచ్చిపట్టినవాఁడువలె; పృథివీం=భూమిని, భూమియందనుట; అటతాం=సంచరించుఁగాక.

రాముం డడవికిఁ బోవుటకు సమ్మతించియుందునేని, నేను, కపాలంబు దాల్చి, గుడ్డపేలికలంగట్టుకొని, యున్మత్తుండుంబోలె నీభూమియంతయుఁదిరిగి, బిచ్చమెత్తుదును గాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— సత్పురుషులకపకారము చేసినవానికి, అట్టినిందితవృత్తి గలుగును. అని, సూచింపబడినది.

పానే ప్రసక్తో భవతు స్త్రీష్వక్షేషుచ నిత్యశః
కామక్రోధాభిభూతస్తు యస్యార్యో నుమతే గతః. ౪౧




టీక॥ యస్య=ఎవ్వనియొక్క; అనుమతే = సమ్మతియుండఁగా ; ఆర్యః=పూజ్యుఁడగు రాముఁడు; గతః=పోయినాఁడో;సః(అధ్యాహృతము)—వాఁడు; నిత్యశః= ఎల్లప్పుడు ; కామక్రోధాభిభూతస్తు = కామక్రోధములచేఁ దిరస్కరింపఁబడినవాఁడై యే;పానే=త్రాఁగుటయందును; స్త్రీషు=స్త్రీలయందును; అక్షేషుచ= పాచికలయందును; ప్రసక్తః=ప్రవర్తించినవాఁడు ; భవతు=అగుఁగాక.

రాముండడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందునేని, ఎల్లప్పుడును , గామక్రోధంబులకులోఁబడి, మద్యపానంబుసేయుచు , స్త్రీ పరవశుండనై జూదమాడుచు , నుందునుగాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— సత్పురుషునకపకారముచేసినవానికి, మద్యపానంబు, స్త్రీపరవశత,జూదమాడుట, ఇవి మొదలగుచెడుపుగలిగించువానియందుఁ బ్రవృత్తిగలుగును. అనియు, నెవ్వండేని, యొకపాపముసేయునేని,యది, యతనిమఱలనట్లు పాపముసేయుటయందే ప్రవర్తింపఁజేయును, అనియు, సూచింపఁబడినది.

మాస్మ ధర్మే మనోభూయా దధర్మం స నిషేవతామ్
అపాత్రవర్షీ భవతు యస్యార్యో నుమతే గతః. ౭౨

టీక॥యస్య=ఎవ్వనియొక్క; అనుమతే = సమ్మతియుండఁగా; ఆర్యః=పూజ్యుఁడగురాముండు;గతః= పోయినాఁడో; తస్య(అధ్యాహృతము)— అతనికి; ధర్మే = ధర్మమునందు; మనః=మనస్సు; మాభూయాత్ =కలుగకుండుఁగాక. ("స్మ" అనునది వాక్యాలంకారార్థము) సః=అతండు; అధర్మం=అధర్మమును; నిషేవతాం = సేవించుఁగాక. అపాత్రవర్షీ= పాత్రముకానివారలయందువర్షించువాఁడు;భవతు=అగుఁగాక.

రాముండడవికిఁ బోవుటకు నేనుసమ్మతించియుందునేని , నాకుధర్మబుద్ధిలేక, యధర్మమునందేప్రవృత్తిగలుగుఁగాక; మఱియుయోగ్యులగు వారలకుఁ గొంచెమైననివ్వక , యయోగ్యులకెవిపరీతముగా దానంబుసేయుచుందునుగాక.అని, తాత్పర్యము.

విశేషార్థము.—సత్పురుషుల క

పకారముగావించునేని, యాపాపము వలన, నతనికిధర్మబుద్ధిగలుగదు ; అతండధర్మమునే చేయుచుండును; మఱియునతండు, బహుదానముచేసినను, ఆదానమును, ఆపాపమహిమవలన, నపాత్రప్రయుక్తమయి, పుణ్యమునుగలిగింపకుండుటయేకాక, పాపమునుగూడఁగలిగించును. అని, సూచింపఁబడినది.

సంచితా న్యస్య విత్తాని వివిధాని సహస్రశః
దస్యుభి ర్విప్రలుప్యంతాం యస్యార్యో నుమతే గతః. ౪౩

టీక॥ యస్య=ఎవ్వనియొక్క ; అనుమతే= సమ్మతియుండఁగా; ఆర్యః= పూజ్యుఁడగురాముఁడు ; గతః=పోయినాఁడో; అస్య=ఇతనియొక్క ; సహస్రశః= వేయివిధములుగా; సంచితాని=కూర్పఁబడిన; వివిధాని=నానావిధములయిన; విత్తాని= ధనములు; దస్యుభిః=దొంగలచేత; విప్రలుప్యంతాం= నశింపఁజేయఁబడుఁగాక.

రాముండడవికిఁ బోవుటకు నేనుసమ్మతించియుందునేని, నేనునానావిధములుగాసంపాదించిన ధనమంతయు, దొంగలపాలగునుగాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము. — సత్పురుషులకపకారముచేసినవానికి, తనధనమంతయుదొంగలుదోచుకొనుపోవుట మొదలగుఁ గష్టములుగలుగును. అనిసూచింపబఁడినది.

ఉభే సంధ్యే శయానస్య యత్పాపం పరికల్ప్యతే
తచ్చ పాపం భవే త్తస్య యస్యార్యో నుమతే గతః. ౪౪

టీక॥ యస్య= ఎవ్వనియొక్క; అనుమతే=సమ్మతియుండఁగా; ఆర్యః= పూజ్యుఁడగురాముఁడు ; గతః = పోయినాఁడో; తస్య= అతనికి; ఉభే = రెండైన; సంధ్యే= సంధ్యాకాలములను; శయానస్య=పరుండియున్నవానికి; యత్ =ఏ; పాపం= పాపము; పరికల్ప్యతే = ఏర్పఱుపఁబడుచున్నదో ; తత్ =ఆ; పాపంచ=పాపమును ; భవేత్ =కలుగును.




రాముండడవికిఁ బోవుటకు నేనుసమ్మతించియుండు నేని, సూర్యోదయ కాలంబునను సూర్యాస్తమయ కాలంబునను, నిద్రించినవానికిఁగలుగుపాపమునాకుఁగలుగును గాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన, సంధ్యాకాలంబున నిద్రించిననధిక పాపముగలుగునని, సూచింపఁబడినది.

యదగ్నిదాయకే పాపం యత్పాపం గురుతల్పగే
మిత్రద్రోహేచ యత్పాపం తత్పాపం ప్రతిపద్యతామ్. ౭౫

టీక॥("యస్యార్యోనుమతేగతః" అనియధ్యాహృతము)యస్య=ఎవ్వనియొక్క; అనుమతే=సమ్మతియుండఁగా; ఆర్యః = పూజ్యుండగురాముఁడు; గతః=పోయినాఁడో; సః(అధ్యాహృతము)=అతఁడు; అగ్నిదాయకే= నిప్పుపెట్టినవానియందు; యత్ = ఏ; పాపం=పాపమో; గురుతల్పగే = గురుభార్యనుబొందినవానియందు; యత్= ఏ; పాపం=పాపమో; మిత్రద్రోహేచ= మిత్రద్రోహముచేసినవానియందును; యత్=ఏ; పాపం=పాపమో; తత్=ఆ; పాపం= పాపము; ప్రతిపద్యతాం=పొందునుగాక.

రాముండడవికిఁ బోవుటకు నేనుసమ్మతించియుండు నేని, ఇండ్లపైనిప్పుపెట్టినవానికే పాపంబుగలుగునో, గురుభార్యనుబొందినవానికే పాపంబుగలుగునో, మిత్రద్రోహముచేసినవానికే పాపంబుగలుగునో, ఆ పాపంబులన్నియు నాకుఁగలుగుగాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము.—ఇందువలన కాపురముండువారి యిండ్లపై నిప్పుపెట్టిన మహాపాపంబుగలుగుననియు, గురుభార్యంబొందిన మహాపాతకంబు సంభవించుననియు, మిత్రద్రోహంబు గావించినను మహాపాపంబునొందుననియు, సత్పురుషులకుఁగాని, తోఁబుట్టువునకుఁగాని, యపకారంబు గావించినను, అట్టి మహాపాపంబు గలుగుననియు, సూచింపంబడినది.

దేవతానాం పితౄణాంచ మాతాపిత్రో స్తథైవచ
మాస్మకార్షీత్స శుశ్రూషాం యస్యార్యోనుమతే గతః. ౭౬




టీక॥ యస్య=ఎవ్వనియొక్క ; అనుమతే= సమ్మతియుండఁగా; ఆర్యః= పూజ్యుఁడగు రాముఁడు; గతః=పోయినాఁడో; సః=అతఁడు; దేవతానాం= దేవతలకును ; పితౄణాంచ=పితృదేవతలకును; తథైవ=అట్లె ; మాతాపిత్రోశ్చ = తలిదండ్రులకును; శుశ్రూషాం=సేవను ; మాకార్షీత్ =చేయకుండుఁగాక. "స్మ" అనునదివాక్యాలంకారార్థకము.

రాముండడవికిఁబోవుటకు నేనుసమ్మతించియుందునేని, దేవతలకుఁగాని పితృదేవతలకుఁగాని , తలిదండ్రులకుఁగాని సేవసేయనివానికిఁగలుగు బునాకుఁగలుగుగాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన, దేవతలకుఁబ్రతిదినమును బూజాదులు సేయవలయుననియు, నట్లు సేయకున్న మహాదోషమనియు, నయ్యాకాలంబులఁబితృదేవతలకు శ్రాద్ధాదులిడకుండిన మహాపాపంబుగలుగుననియు, తలిదండ్రులకుశుశ్రూష సేయకుండినమహాపాపంబుగలుగుననియు, సూచింపఁబడినది.

సతాం లోకా త్సతాం కీర్త్యా త్సజ్జుష్టా త్కర్మణ స్తథా
భ్రశ్యతు క్షిప్ర మద్యైవ యస్యార్యో నుమతే గతః. ౪౭

టీక॥ యస్య= ఎవ్వనియొక్క; అనుమతే=సమ్మతియుండఁగా; ఆర్యః= పూజ్యుఁడగు రాముఁడు ; గతః = పోయినాఁడో ; సః(అధ్యాహృతము)= అతఁడు; అద్యైవ=ఇప్పుడే; క్షిప్రం= శీఘ్రముగా ; సతాం = సత్పురుషులయొక్క; లోకాత్ = సమూహమునుండియు ; తథా=అట్లు; సతాం = పెద్దలకు; కీర్త్యాత్ =కొనియాడఁదగిన; సజ్జుష్టాత్ = సత్పురుషులచే సేవింపఁబడిన; కర్మణః= కర్మబుననుండియు; భ్రశ్యతు=జాఱునుగాక.

రాముండడవికిఁబోవుటకు, నేనుసమ్మతించియుందునేని, నేనుసత్పురుషులచేవిడువఁబడుదును గాక;మఱియు, సత్పురుషులాచరించునట్టి సత్కర్మములాచరింపక, భ్రష్టుండనగుదును గాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన,సత్పురుషులతో సహవాసము సేయకుండరాదనియుసత్పురుషులుగొనియాడుచునాచరించునట్టికర్మంబుల విడువఁగూడదనియు,సూచింపఁబడినది.

అపాస్య మాతృశుశ్రూషా మనర్థే సో వతిష్ఠతామ్
దీర్ఘబాహు ర్మహావక్షా యస్యార్యోను మతే గతః. ౪౮

టీక॥యస్య=ఎవ్వనియొక్క; అనుమతే=సమ్మతియుండఁగా ; దీర్ఘబాహుః = నిడుపులయినచేతులుగలవాఁడును; మహావక్షాః=పెద్దఱొమ్ముగలవాఁడునగు; ఆర్యః=పూజ్యుఁడైన రాముండు; గతః=పోయినాఁడో; సః = అతఁడు; మాతృశుశ్రూషాం=మాతృసేవను; అపాస్య=విడిచి; అనర్థే=అనర్థమునందు; అవతిష్ఠతాం= ఉండునుగాక.

ఆజానుబాహుండును విశాలమగు ఱొమ్ముగలవాఁడునగు రాముఁడడవికిఁబోవుటకు నేను సమ్మతించి యుందునేని, మాతృశుశ్రూషను జేయక యనర్థంబు నొందుదునుగాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన , మాతృశుశ్రూష సేయకుండు నేని, అన్నిటికన్న మహాపాపంబునొందునని , సూచింపంబడినది.

బహుపుత్రో దరిద్రశ్చ జ్వరరోగసమన్వితః
సభూయా త్సతతక్లేశీ యస్యార్యోనుమతే గతః. ౪౯

టీక॥యస్య=ఎవ్వనియొక్క; అనుమతే= సమ్మతియుండఁగా; ఆర్యః = పూజ్యుఁడగు రాముఁడు; గతః=పోయినాఁడో; సః=అతండు;బహుపుత్రః=పెక్కుకొడుకులు గలవాఁడై; దరిద్రశ్చ=దరిద్రుండునై ; జ్వరరోగసమన్వితః= జ్వరము మొదలగు రోగములతోఁగూడినవాఁడై ; సతతక్లేశీ = ఎల్లప్పుడును దుఃఖము గలవాఁడుగా ; భూయాత్ =అగునుగాక.

రాముండడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందు నేని, నేను, బహుపుత్రులనొంది,దరిద్రుండనై , యందును జ్వరాదిరోగంబులచేఁ బీడింపఁబడుచు, నిల్లెల్లప్పుడునుదుఃఖపడుచుండఁగలను.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— సత్పురుషులకపకారంబు సేయుట మొదలగు మహాపాపము గావించిన , దారిద్ర్యమును , అందుఁబెక్కు కొడుకులు గలిగి యుండుటయు, బిచ్చమెత్తుకొని యైనను సంపాదించుకొనుటకు లేక , మహా

రోగగ్రస్తుండగుటయు, నిట్లు, ఎల్లప్పుడును దుఃఖంబు నొందునట్లు సంభవించును. అని, సూచింపఁబడినది.

ఆశా మాశంసమానానాం దీనానా మూర్ధ్వచక్షుషామ్
అర్థినాం వితథాం కుర్యా ద్యస్యార్యోనుమతే గతః. ౫౦

టీక॥ యస్య=ఎవ్వనియొక్క; అనుమతే= సమ్మతియుండఁగా; మాన్యః=పూజ్యుఁడగు రాముండు; గతః=పోయినాడో; సః (అధ్యాహృతము)=అతండు; ఆశంసమానానాం= స్తుతించుచున్నవారలును; ఊర్ధ్వచక్షుషాం= పైకిచూచెడుకండ్లుగలవారలును; దీనానాం= దైన్యమునొందినవారలునగు; అర్థినాం= యాచకులయొక్క; ఆశాం= ఆశను; వితథాం=వ్యర్థమునుగా; కుర్యాత్ = చేయునుగాక.

రాముండడవికిఁ బోవుటకు నేనుసమ్మతించియుండు నేని, యున్నతాసనంబునం గూర్చుండియున్న తన్నుఁదలపైకెత్తిచూచుచు నానావిధంబులం బ్రస్తుతింపుచున్న దీనులగు యాచకులయాశను, వ్యర్థముచేసినవానికిఁ గలుగు పాపము, నాకుంగలుగుఁగాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన, దీనులయియాచించువారి యాశను వ్యర్థముగావించిన, మహాపాపముగలుగునని, సూచింపబడినది.

మాయయా రమతాం నిత్యం పరుషః పిశునోఽశుచిః
రాజ్ఞో భీత స్త్వధర్మాత్మా యస్యార్యోనుమతే గతః. ౫౧

టీక॥ యస్య=ఎవ్వనియొక్క; అనుమతే=సమ్మతియుండఁగా; ఆర్యః = పూజ్యుఁడగు రాముఁడు; గతః=పోయినాఁడో; సః(అధ్యాహృతము)= అతండు; నిత్యం = ఎల్లప్పుడును; అధర్మాత్మా= అధర్మబుద్ధిగలవాఁడై; పరుషః=కఠినుఁడై; పిశునః= కపటియై; అశుచిః= అపరిశుద్ధుఁడై; రాజ్ఞః = రాజువలన; భీతస్తు = భయపడినవాఁడై యె; మాయయా= మోసముచేత; రమతాం=క్రీడించుఁగాక,

రాముం డడవికిఁబోవుటకు నేను

సమ్మతించియుందునేని, నేను, అధర్మిష్ఠుండనై, కఠినుండనై, పాపినై, రాజభయంబునొంది, మోసముచేజీవింపుచుందును గాక. అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన, రాజవిరుద్ధంబులగు కార్యంబులు సేయరాదనియు, కాఠిన్యమును కపటంబును వహించియుండరాదనియు, మోసము సేయరాదనియు, సత్పురుషులబాధించినవారలకు, రాజభయంబు మొదలగు కష్టంబులుగలుగుననియు, సూచింపఁబడినది.

ఋతుస్నాతాం సతీం భార్యా మృతుకాలానురోధినీమ్
అతివర్తేత దుష్టాత్మా యస్యార్యో నుమతే గతః. ౫౨

టీక॥ యస్య=ఎవ్వనియొక్క; అనుమతే= సమ్మతియుండఁగా; ఆర్యః = పూజ్యుఁడగు రాముఁడు; గతః=పోయినాఁడో; సః(అధ్యాహృతము) = ఆ; దుష్టాత్మా=దుష్టబుద్ధిగలవాఁడు; ఋతుస్నాతాం= ఋతుస్నానముచేసినదియు; సతీం = పతివ్రతయును; ఋతుకాలానురోధినీం=ఋతుకాలముననుసరించుచున్నదియునగు; భార్యాం= భార్యను; అతివర్తేత=అతిక్రమించును.

రాముండడవికిఁబోవుటకు నేను సమ్మతించియుందునేని, పతివ్రతయగు భార్య, ఋతుస్నాతయయి, ఋతుకాలనియమంబు ననుసరించి యుండఁగాఁ, నాబిడను, విడనాడినవానికిఁగల్గుపాపము, నాకుంగల్గుఁగాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన, పతివ్రతయగుభార్య, ఋతుస్నాతయయి, ఋతుకాలంబునంజేరరాఁగా, నాబిడనువిడిచినవానికి మహాపాపముగలుగునని, సూచింపఁబడినది.

ధర్మదారాన్ పరిత్యజ్య పరదారాన్నిషేవతామ్
త్యక్తధర్మరతి మూఢో యస్యార్యో నుమతే గతః. ౫౩

టీక॥ యస్య=ఎవ్వనియొక్క; అనుమతే=సమ్మతియుండఁగా; ఆర్యః= పూజ్యుఁడగు రాముండు; గతః=పోయినాఁడో; సః(అధ్యాహృతము) = ఆతఁడు; త్యక్తధర్మరతిః=విడువఁబడినధర్మమునందాసక్తిగలవాఁడై; మూఢః=




తెలివిలేనివాఁడై; ధర్మదారాన్ = ధర్మార్థమైనభార్యను; పరిత్యజ్య=విడిచి; పరదారాన్ = పరస్త్రీలను; నిషేవతాం=సేవించుఁగాక.

రాముండడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందునేని, ధర్మంబువిడిచి మూఢుండైతనభార్యనువిడిచి, పరస్త్రీలంబొందుచున్న వానికిఁ గలుగుపాపము, నాకుఁగలుగుఁగాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము. — ఇందువలన, పరస్త్రీలంబొందెనేని , మహాపాపంబుగలుగుననియు,నందుఁదనభార్యంబరిత్యజించి, పరస్త్రీలందగిలియున్నచో, మఱియుమహాపాపంబునొందుననియు సూచింపఁబడినది.

విప్రలుప్త ప్రజాతస్య దుష్కృతం బ్రాహ్మణస్య యత్
తదేవ ప్రతిపద్యేత యస్యార్యో నుమతే గతః. ౫౪

టీక॥ యస్య=ఎవ్వనియొక్క; అనుమతే= సమ్మతియుండఁగా; ఆర్యః= పూజ్యుఁడగు రాముఁడు; గతః= పోయినాఁడో;సః(అధ్యాహృతము)= అతండు; విప్రలుప్తప్రజాతస్య= లోపించిన సంతానముగల; బ్రాహ్మణస్య = బ్రాహ్మణునకు;యత్ =ఏ;దుష్కృతం= పాపమో;తదేవ=ఆపాపమునే;ప్రతిపద్యేత=పొందును.

రాముండడవికిఁబోవుటకు నేను సమ్మతించియుందునేని , భార్యయందు సంతానంబుసంపాదించుకొనక, వేశ్యాపరవశుండై, యుండు బ్రాహ్మణునకుఁ గలుగుపాపమునాకుఁగలుగుఁగాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము.—భార్యయందుసంతానముగలిగించుకొని పితరుల ఋణంబుదీర్చుకొనక వేశ్యాదులందగిలియున్నచో మహాపాపంబు గలుగునని సూచింపఁబడినది.

పానీయదూషకే పాపం తథైవ విషదాయకే
యత్తదేక స్స లభతాం యస్యార్యో నుమతే గతః. ౫౫

టీక॥ యస్య=ఎవ్వనియొక్క ; అనుమతే=సమ్మతియుండఁగా; ఆర్యః= పూజ్యుఁడగు రాముఁడు; గతః=పోయినాఁడో;సః=అతఁడు,ఏకః=ఒక్కఁడే;




పానీయదూషకే = జలమునుదూషించువానియందును; తథైవ=అట్లె; విషదాయకే=విషమునిచ్చువానియందును; యత్=ఏ; పాపం=పాపమో; తత్=దానిని ; లభతాం=పొందుఁగాక.

రాముండడవికిఁ బోవుటకు నేనుసమ్మతించియుందునేని, జలమునుదూషించినను ఎవ్వరికైనవిషంబిచ్చిచంపినను, ఏపాపంబుగలుగునో , ఆపాపంబంతయు, నాకొక్కనికెకలుగుఁగాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన,జలమునుదూషించినంబాపంబుగలుగుననియు,విషంబిడినచో, మహాపాపంబుగలుగుననియు , సూచింపంబడినది.

బ్రాహ్మణాయోద్యతాం పూజాం విహంతు కలుషేంద్రియః
బాలవత్సాంచ గాం దోగ్ధుం యస్యార్యోను మతే గతః. ౫౮

టీక॥ యస్య=ఎవ్వనియొక్క; అనుమతే=సమ్మతియుండఁగా;ఆర్యః=పూజ్యుఁడగు రాముఁడు;గతః= పోయినాఁడో;సః(అధ్యాహృతము)=అతఁడు; కలుషేంద్రియః = పాపిష్ఠమగు నింద్రియములుగలవాఁడై; బ్రాహ్మణాయ=బ్రాహ్మణునికొఱకు; ఉద్యతాం= యత్నింపఁబడిన;పూజాం=పూజను;విహంతు=కొట్టివేయుఁగాక;బాలవత్సాం=లేతదూడగల; గాంచ=ఆవును ; దోగ్ధు=పితుకుఁగాక.

రాముండడవికిఁ బోవుటకు నేనుసమ్మతించియుందునేని,బ్రాహ్మణునకుఁజేయ నిశ్చయింపఁబడినసత్కారమునకు విఘాతము గావించినవానికిఁ గలుగుపాపమును , ఈనిపదిదినములుగాకమును పెయ్యావును బితుకువానికిఁగలుగుపాపమును, నాకుఁగలుగుఁగాక.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన , బ్రాహ్మణునకుఁ జేయనిశ్చయించిన సత్కారమునకువిఘాతము గావింపరాదనియు, ఆవు , ఈనినపిదపఁ బదిదినములుగడచుటకుమునుపు, పాలుపితుకరాదనియు , సూచింపంబడినది.

తృష్ణార్తం సతి పానీయే విప్రలంభేన యోజయేత్
లభేతతస్య యత్పాపం యస్యార్యోను మతే గతః. ౫౯

టీక॥యస్య=ఎవ్వనియొక్క ; అనుమతే= సమ్మతియుండఁగా; ఆర్యః=పూజ్యుఁడగు రాముఁడు; గతః=పోయినాఁడో; సః (అధ్యాహృతము)= అతఁడు; యః(అధ్యాహృతము)=ఎవ్వఁడు; పానీయే సతి=జలముండఁగా; తృష్ణార్తం=దప్పి చేఁబీడింపఁబడినవాని ; విప్రలంభేన= మోసముతో; యోజయేత్=కూర్చునో; తస్య=అతనికి;యత్= ఏ;పాపం=పాపమో; తత్ (అధ్యాహృతము)=ఆపాపమును ; లభేత = పొందును.

రాముండడవికిఁబోవుటకు, నేనుసమ్మతించియుందునేని , తనయొద్దజలముండఁగా,దప్పిగొన్నవానికిజలంబివ్వక మోసపుచ్చినవానికిఁ గలుగుపాపము నాకుఁగలుగుఁగాక. అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన , దప్పిగొన్నవానికి, అవశ్యముజలంబివ్వవలయుననియు, నట్లు , ఇవ్వకున్నచో దోషంబుగలుగుననియు, నందుఁ , దనయొద్దజలంబుంచుకొనియివ్వకుండిన, మఱియుమహాదోషంబుగలుగుననియు , సూచింపఁబడినది.

భక్త్యా వివదమానేషు మార్గ మాశ్రిత్య పశ్యతః
తస్య పాపేన యుజ్యేత యస్యార్యోఽనుమతే గతః. ౫౮

టీక॥ యస్య=ఎవ్వనియొక్క ; అనుమతే=సమ్మతియుండఁగా; ఆర్యః=పూజ్యుఁడగు రాముండు;గతః=పోయినాఁడో; సః(అధ్యాహృతము)=అతండు; వివదమానేషు=జగడమాడువారియందు; భక్త్యా=స్నేహముచేత;మార్గం=జయోపాయమును; ఆశ్రిత్య= ఆశ్రయించి; పశ్యతః=చూచుచున్న, చెప్పుచున్నయనుట; తస్య= అతనియొక్క; పాపేన=పాపముతో; యుజ్యేత=కూడును.

రాముండడవికిఁబోవుటకు నేనుసమ్మతించియుందునేని. ఇద్దఱుజగడమాడుచుండఁగా, నందొకనియందలిస్నేహంబున , నతనికిమాత్రముజయోపాయముఁజెప్పువానికిఁగలుగుపాపమునాకుఁగలుగుఁగాక. అని, భరతుండు , శపథముచేసెను.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన , ఇద్దఱుజగడమాడుచుండఁగాఁ , బక్షపాతంబున , నొకనికిమాత్రము,యు

_క్తిఁజెప్పినవానికి, మహాపాపముగలుగునని, సూచింపఁబడుచున్నది.

విహీనాం పతిపుత్రాభ్యాం కౌసల్యాం పార్థివాత్మజః
ఏవ మాశ్వాస యన్నేవ దుఃఖార్తో నిపపాత హ. ౫౯

టీక॥ పార్థివాత్మజః = రాచకొమరుండగు భరతుండు; పతిపుత్రాభ్యాం= పెనిమిటిచేతను గొడుకు చేతను; విహీనాం = విడువఁబడిన; కౌసల్యాం=కౌసల్యను;ఏవం=ఇట్లు; ఆశ్వాసయన్నేవ= నమ్మకము నొందించుచునే; దుఃఖార్తః=దుఃఖముచేఁబీడింపఁబడినవాఁడై;నిపపాత=పడెను. "హ" అనునది పాదపూరణార్థము,

రాచకొమరుండగు భరతుండు పెనిమిటికొడుకులయిద్దఱచేతనువిడువఁబడియుండుకౌసల్యకుఁ, దనయందునమ్మకంబుగలిగించుమాటలనిట్లుచెప్పుచునె, పరమదుఃఖితుండై నేలంబడెను.

అని, తాత్పర్యము.

తథాతు శపథైః కష్టైః శ్శపమాన మచేతనమ్
భరతం శోకసంతప్తం కౌసల్యా వాక్య మబ్రవీత్. ౬౦

టీక॥ కౌసల్యాతు= కౌసల్యయు; తథా=అట్లు;కష్టైః=సహింపఁగూడని; శపథైః=శపథములచేత ; శపమానం= శపథములు సేయుచున్నవాఁడును; అచేతనం=సంజ్ఞలేనివాఁడును;శోకసంతప్తం= దుఃఖముచేమిక్కిలియుఁదపింపఁజేయఁబడినవాఁడునగు ; భరతం=భరతునిగూర్చి; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

కౌసల్యయంత, నట్లుదుస్సహంబులగు శపథంబులుచేసి, పరమదుఃఖితుండైమూర్ఛిల్లిపడియున్న, భరతుంజూచి, యిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

మమ దుఃఖ మిదం పుత్ర భూయ స్సముపజాయతే
శపథై శ్శపమానోహి ప్రాణా నుపరుణత్సి మే. ౬౧

టీక॥ పుత్ర=కొడుకా! మమ=నాయొక్క; ఇదం=ఈ ; దుఃఖం=దుఃఖ




ము; భూయః=అధికముగా ; సముపజాయతే=అగుచున్నది. త్వం (అధ్యాహృతము)= నీవు; శపథైః=శపథములచేత; శపమానః= శపథములు సేయుచున్నవాఁడవై; మే=నాయొక్క ; ప్రాణాన్=ప్రాణములను ; ఉపరుణత్సి= పీడించుచున్నావుగదా!

పుత్త్రుఁడా! నీవిట్లు శపథములు సేయుటచేత, నాదుఃఖము మఱిమఱి హెచ్చుగుచున్నది ; నాప్రాణంబులేపోవునట్లున్నవి. అని, తాత్పర్యము.

దిష్ట్యా నచలితో ధర్మా దాత్మా తే సహలక్ష్మణః
వత్స సత్యప్రతిజ్ఞో మే సతాం లోక మవాప్స్యసి- ౬౨

టీక॥ మే= నాయొక్క ; వత్స=బిడ్డఁడవగుభరతుఁడా! సహలక్ష్మణః=లక్ష్మణునితోఁగూడిన; తే=నీయొక్క ; ఆత్మా=మనసు; దిష్ట్యా=భాగ్యముచేత ; ధర్మాత్=ధర్మముననుండి ; నచలితః=కదలకున్నది! త్వం (అధ్యాహృతము)=నీవు ; సత్యప్రతిజ్ఞః= సత్యమయినప్రతిజ్ఞగలవాఁడవై ; సతాం = సత్పురుషులయొక్క ; లోకం=లోకమును; అవాప్స్యసి=పొందఁగలవు.

భరతుఁడా! భాగ్యవశంబువలన , లక్ష్మణుండువలె, నీవును, ధర్మంబు విడువకున్నావు! ఇట్లునీవు , సత్యప్రతిజ్ఞుండవై , సత్పురుషులుపొందులోకంబునొందఁగలవు. అని, కౌసల్య, భరతునితోఁ జెప్పినది. అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా చాంక మానీయ భరతం భ్రాతృవత్సలమ్
పరిష్వజ్య మహాబాహుం రురోద భృశదుఃఖితా. ౬౩

టీక॥ కౌసల్యా(అధ్యాహృతము)= కౌసల్య; ఇతి=అని; ఉక్త్వాచ= చెప్పియు; భ్రాతృవత్సలం= తోఁబుట్టువులయందతిప్రీతిగల ; మహాబాహుం = పెద్దచేతులుగల; భరతం=భరతుని ; అంకం=తొడను ; ఆనీయ= పొందించి; పరిష్వజ్య=కవుఁగిలించి; భృశదుఃఖితా = మిక్కిలియుదుఃఖమునొందినదై; రురోద=ఏడ్చినది.

కౌసల్య, ఇట్లుచెప్పి, తోఁబుట్టువులయందతిప్రేమగల వాఁడును మహాబాహుండునగు భరతునిందనతొడపైఁగూ




చుండఁబెట్టుకొని, కవుఁగిలించి, పరమదుఃఖితయయి, రోదనంబుచేసినది.

అని, తాత్పర్యము.

ఏవం విలపమానస్య దుఃఖార్తస్య మహాత్మనః
మోహాచ్చ శోకసంరోధా ద్బభూవ లులితం మనః. ౭౪

టీక॥ఏవం=ఇట్లు; విలపమానస్య=విలపించుచున్నవాఁడును; దుఃఖార్తస్య=దుఃఖముచేఁబీడింపఁబడిన వాఁడును; మహాత్మనః= పూజ్యమయిన మనస్సుగలవాఁడునగుభరతునియొక్క; మనః=మనస్సు; మోహాచ్చ= మూర్ఛవలనను; శోకసంరోధాత్= దుఃఖముయొక్క యడ్డగించుటవలనను; లులితం=చలించినది; బభూవ=అయినది.

ఇట్లు, విలపించుచుదుఃఖితుండైయున్నమహాత్ముండగు భరతునిమనస్సు, దుఃఖాతిశయమునను మూర్ఛవలనను, జలనంబునొందినది,

అని, తాత్పర్యము.

లాలప్యమానస్య విచేతనస్య
ప్రణష్టబుద్ధేః పతితస్య భూమౌ
ముహుర్ముహు ర్నిశ్శ్వసతశ్చ ఘర్మం
సా తస్య శోకేన జగామ రాత్రిః. ౭౫

టీక॥లాలప్యమానస్య = మిక్కిలియువిలపించుచున్నవాఁడును; విచేతనస్య = సంజ్ఞలేనివాఁడును; ప్రణష్టబుద్ధేః=నశించినబుద్ధిగలవాఁడును; భూమౌ=నేలయందు; పతితస్య = పడినవాఁడును;ఘర్మం= వేఁడిగా;ముహుర్ముహుః = మాటిమాటికి; నిశ్శ్వసతశ్చ=నిట్టూర్పువిడుచుచున్నవాఁడునగు తస్య=ఆభరతునకు; సా=ఆ;రాత్రిః=రాత్రి; శోకేన=దుఃఖముచేత; జగామ=పోయినది.

అట్లుభరతుండు, విలపించుచుమూర్ఛిల్లి, విసంజ్ఞుండై, నేలంబడి, వేఁడినిట్టూర్పులువుచ్చుచు, ఇట్లుదుఃఖించుచుండఁగానే, యారాత్రియంతయుఁగడచినది. అని, తాత్పర్యము.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,

అయోధ్యాకాండే, పంచసప్తతితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండపంచసప్తతితమసర్గటీక, ముగిసినది.



శ్రీ

షట్సప్తతితమ సర్గప్రారంభః.

తమేవం శోకసంతప్తం భరతం కేకయీసుతమ్
ఉవాచ వదతాం శ్రేష్ఠో వసిష్ఠ శ్శ్రేష్ఠవా గృషిః. ౧

టీక॥ వదతాం=వచించువారలలోపల; శ్రేష్ఠః=ఉత్తముండును; శ్రేష్ఠవాక్=ఉత్తమమయినమాటగలవాఁడునగు; ఋషిః=ఋషియైన; వసిష్ఠః=వసిష్ఠమహాముని; ఏవం=ఇట్లు; శోకసంతప్తం=దుఃఖముచేమిక్కిలియుఁదపింపఁజేయఁబడిన; కేకయీసుతం=కైకేయికొడుకైన; తం=ఆ; భరతం=భరతునిగూర్చి; ఉవాచ=చెప్పెను.

మాటలాడువారలలో శ్రేష్ఠుండును, మంచిమాటలుగల వాఁడునగు వసిష్ఠమహర్షి, ఇట్లుపరమదుఃఖితుండైయున్న కైకేయికొడుకైన భరతుంజూచి, ఇట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అలం శోకేన భద్రం తే రాజపుత్ర మహాయశః
ప్రాప్తకాలం నరపతేః కురు సంయాన ముత్తమమ్. ౨

టీక॥ మహాయశః=అధికమయినకీర్తిగల; రాజపుత్ర=రాచకొమరుఁడవగుభరతుఁడా! శోకేన=దుఃఖముచేత; అలం=చాలును. తే=నీకు; భద్రం=మంగళము; అస్తు (అధ్యాహృతము)=అగుఁగాక; నరపతేః=దశరథమహారాజునకు; ప్రాప్తకాలం=పొందఁబడినకాలముగల; ఉత్తమం=శ్రేష్ఠమయిన;

సంయానం= ఉత్తరక్రియను ; కురు= చేయుము.

మహాకీర్తిశాలివగుభరతుఁడా! దుఃఖంబువిడువుము ; నీకుమంగళముగలుగుఁగాక; దశరథమహారాజునకుఁజేయవలసినయుత్తరక్రియంజేయుము; అని,వసిష్ఠుండు, భరతునకుంజెప్పెను.

అని, తాత్పర్యము.

వసిష్ఠస్య వచ శ్శ్రుత్వా భరతో ధారణాం గతః
ప్రేతకార్యాణి సర్వాణి కారయామాస ధర్మవిత్. ౩

టీక॥ ధర్మవిత్=ధర్మమునెఱింగిన; భరతః = భరతుఁడు ; వసిష్ఠస్య=వసిష్ఠునియొక్క;వచః= మాటను; శ్రుత్వా=విని;ధారణాం=ధైర్యమును; గతః=పొందినవాఁడై;సర్వాణి= సమస్తములయిన;ప్రేతకార్యాణి=ప్రేతకర్మములను; కారయామాస=చేయించెను.

ధర్మవేత్తయగుభరతుండు వసిష్ఠునిమాటనువిని, కొంత ధైర్యంబునొంది, తండ్రికిఁజేయవలసిన ప్రేతకార్యములన్నింటిని, గావించెను.

అని, తాత్పర్యము.

ఉద్ధృతం తైలసంరోధా త్సతు భూమౌ నివేశితమ్
ఆపీతవర్ణవదనం ప్రసుప్తమివ భూమిపమ్. ౪
సంవేశ్య శయనే చాగ్ర్యే నానారత్నపరిష్కృతే
తతో దశరథం పుత్రో విలలాప సుదుఃఖితః. ౫

టీక॥ సః=ఆ; పుత్రస్తు= కొడుకయినభరతుండును; తైలసంరోధాత్=తైలద్రోణియందుండి;ఉద్ధృతం=ఎత్తఁబడినవాఁడును; భూమౌ= నేలయందు; నివేశితం= ఉంచఁబడినవాఁడును; ఆపీతవర్ణవదనం = పసుపువన్నెగలముఖముగలవాఁడును; ప్రసుప్తమివ(స్థితం)= నిద్రించినట్లున్నవాఁడునగు;భూమిపం = రాజయిన; దశరథం = దశరథుని;నానారత్నపరిష్కృతే= నానావిధమణులచేత నలంకరింపబడిన ; అగ్ర్యే=శ్రేష్ఠమైన;శయనే= పాన్పునందు; సంవేశ్యచ=పరుండఁబెట్టియు; తతః=అటుపిమ్మట;సుదుఃఖితః= మిక్కి-

లియుదుఃఖమునొందినవాఁడై; విలలాప= ఏడ్చెను.

భరతుండు, తైలద్రోణియందుండి యెత్తినేలం బెట్టఁబడి ముఖంబునఁబసుపువన్నెగదుర నిద్రవోయినట్లున్న దశరథమహారాజు కళేబరంబును, నానావిధమణులచే నలంకృతంబయిన యుత్తమశయనంబుననునిచి, యంతం బరమదుఃఖితుండై, రోదనంబు చేసెను.

అని, తాత్పర్యము.

కిం తే వ్యవసితం రాజన్ ప్రోషితే మయ్యనాగతే
వివాస్య రామం ధర్మజ్ఞం లక్ష్మణంచ మహాబలమ్. ౬

టీక॥ రాజన్=దశరథమహారాజా! ప్రోషితే= దూరదేశమునకుఁబోయిన; మయి=నేను; అనాగతే= రాకుండఁగా, ధర్మజ్ఞం=ధర్మము నెఱింగిన; రామం=రాముని; మహాబలం=అధికమయినబలముగల; లక్ష్మణంచ=లక్ష్మణుని; వివాస్య= అడవికిఁబంపి; తే= నీయొక్క; వ్యవసితం=ప్రయత్నము; కిం=ఏమి?

దశరథమహారాజా! నేనుదూరదేశముననుండునప్పుడు, ధర్మజ్ఞుండగు రాముని, మహాబలుండగులక్ష్మణుని, మనసులో నేమియుంచుకొని వనంబునకుబంపినావు? నీయభిప్రాయమేమి?

అని, తాత్పర్యము.

క్వ యాస్యసి మహారాజ హిత్వేమం దుఃఖితం జనమ్
హీనం పురుషసింహేన రామేణాక్లిష్టకర్మణా. ౭

టీక॥ మహారాజ=దశరథమహారాజా! అక్లిష్టకర్మణా = దుఃఖములేని కార్యములుగల; పురుషసింహేన=పురుషశ్రేష్ఠుండగు; రామేణ = రామునిచేత; హీనం=విడువఁబడినదియును; దుఃఖితం=దుఃఖమునొందినదియునగు; ఇమం=ఈ; జనం=జనమును; హిత్వా= విడిచి; త్వం(అధ్యాహృతము)= నీవు; క్వ = ఎచ్చటికి; యాస్యసి = పోయెదవు?

దశరథమహారాజా! అందఱకును సుఖకరంబులగుకార్యములు చేయునట్టి పురుషశ్రేష్ఠుండగు రామునివిడిచిపరమదుఃఖితులమయియున్నమమ్ము విడిచి, నీవెచ్చటికిఁబోయెదవు?

అని, తాత్పర్యము.

యోగక్షేమంతు తే రాజన్ కోఽస్మిన్ కల్పయితా పురే
త్వయి ప్రయాతే స్వ స్తాత రామేచ వన మాశ్రితే. ౮

టీక॥ తాత=నాయనా! రాజన్= దశరథమహారాజా! త్వయి = నీవు; స్వః=స్వర్గమును;ప్రయాతే=పొందఁగా; రామేచ= రాముండును; వనం= అడవిని; ఆశ్రితే=పొందఁగా; తే= నీ యొక్క; అస్మిన్=ఈ; పురే= పట్టణమునందు ; కః= ఎవ్వఁడు; యోగక్షేమంతు= యోగక్షేమమును; కల్పయితా= చేయును?

నాయనా ! దశరథమహారాజా! నీవు మృతుండవైతివి; రాముండడవికిఁబోయెను; ఇంకనీరాజ్యంబునకు, నెవ్వరు యోగక్షేమంబులుసేయుదురు?

అని, తాత్పర్యము.

విధవా పృథివీ రాజం స్త్వయా హీనా న రాజతే
హీనచంద్రేవ రజనీ నగరీ ప్రతిభాతి మా. ౯

టీక॥రాజన్= దశరథమహారాజా! పృథివీ=భూమి; త్వయా=నీచేత; హీనా=విడువఁబడినదై ; విధవా=భర్తలేనిదై ; నరాజతే=ప్రకాశింపకున్నది. త్వయా=నీచేత; హీనా= విడువఁబడిన; నగరీ=పట్టణము; హీనచంద్రా = చంద్రుండులేని ; రజనీ = రాత్రివలె; మా = నన్నుఁగూర్చి ; ప్రతిభాతి= తోఁచుచున్నది.

దశరథమహారాజా! నీవు లేకుండుటవలన, నీభూమివిధవయయిప్రకాశింపకున్నది; నీవులేకుండుటవలన,నీపట్టణము, చంద్రుండులేనిరాత్రివలెనున్నది. అని , భరతుండు,విలపించెను.

అని,తాత్పర్యము.

ఏవం విలపమానం తం భరతం దీనమానసమ్
అబ్రవీ ద్వచనం భూయో వసిష్ఠస్తు మహామునిః. ౧౦

టీక॥మహామునిః= పూజ్యుఁడైనమునియగు;వసిష్ఠస్తు=వసిష్ఠుఁడును;ఏవం= ఇట్లు; విలపమానం = విలపించుచున్నవాఁడును; దీనమానసం=దుఃఖితమయి




నమనస్సుగలవాఁడునగు; తం=ఆ ; భరతం=భరతునిగూర్చి; భూయః=మఱల; వచనం=మాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంత, వసిష్ఠమహాముని, యిట్లువిలపించుచుదీనచేతనుండైయున్న భరతుంజూచి, మఱల, నిట్లని, చెప్పెను.
అని, తాత్పర్యము.

ప్రేతకార్యాణి యాన్యస్య కర్తవ్యాని విశాంపతేః
తాన్యవ్యగ్రం మహాబాహో క్రియంతా మవిచారితమ్. ౧౧

టీక॥ మహాబాహో= పెద్దచేతులుగలభరతుఁడా! అస్య= ఈ; విశాంపతేః= రాజునకు; యాని=ఏ; ప్రేతకార్యాణి= ప్రేతకర్మములు; కర్తవ్యాని= చేయఁబడవలయునో ; తాని= అవి ; అవ్యగ్రం = ఏమఱుపాటులేనట్లుగా; అవిచారితం= ఆలోచనలేనట్లుగా; క్రియంతాం= చేయఁబడుఁగాక.

మహాబాహువుండవగు భరతుఁడా! దశరథమహారాజున కిప్పుడు ప్రేతకార్యంబులేమిసేయవలయునో, అలస్యంబుసేయక, వానినన్నింటిని ; గావింపుము; అని,వసిష్ఠుండు , భరతునకుఁజెప్పెను. అని,తాత్పర్యము.

తథేతి భరతో వాక్యం వసిష్ఠస్యాభిపూజ్య తత్
ఋత్విక్పురోహితాచార్యాం స్త్వరయామాస సర్వశః. ౧౨

టీక॥ భరతః= భరతుఁడు; వసిష్ఠస్య= వసిష్ఠునియొక్క; తత్=ఆ; వాక్యం=మాటను; తథేతి=అలాగేయని; అభిపూజ్య= గౌరవించి; సర్వశః=అన్నివిధంబులను ; ఋత్విక్పురోహితాచార్యాన్= ఋత్విజులనుబురోహితులనుఆచార్యులను; త్వరయామాస=వేగిరపఱచెను.

భరతుండు, వసిష్ఠుండుచెప్పినందుకు , ఆలాగేయనిచెప్పి, ఋత్విజులను బురోహితుల నాచార్యులను, శీఘ్రముగాఁ, గావింపుడని, త్వరపఱచెను.
అని,తాత్పర్యము.

యే త్వగ్నయో నరేంద్రస్య చాగ్న్యగారా ద్బహిష్కృతాః




ఋత్విగ్భి ర్యాజకై శ్చైవ తేఽ హ్రియంత యథావిధి. ౧౩

టీక॥ నరేంద్రస్య= దశరథమహారాజుయొక్క; యే=ఏ; అగ్నయః= అగ్నిహోత్రములు; అగ్న్యగారాత్ = అగ్నిహోత్ర గృహముననుండి ; బహిష్కృతాః=వెలువరింపఁబడినవో; తే= ఆయగ్నిహోత్రములు; ఋత్విగ్భిః = ఋత్విజులచేతను ; యాజకైశ్చైవ= పురోహితులచేతను; యథావిధి= శాస్త్రమునతిక్రమింపక; అహ్రియంత= తేఁబడినవి.

లోపల శవంబుండుటవలన, బైట నుంచఁబడియున్న యగ్నిహోత్రంబులనుఋత్విజులునుబురోహితులును , దెచ్చిరి. అని, తాత్పర్యము.

శిబికాయా మథాఽరోప్య రాజానం గతచేతసమ్
బాష్పకంఠా విమనస స్త మూహుః పరిచారకాః. ౧౪

టీక॥ అథ= అటుపిమ్మట; పరిచారకాః=పనివాండ్రు; గతచేతసం= పోయినమనసుగల; రాజానం= దశరథమహారాజును; శిబికాయాం= పల్లకియందు; ఆరోప్య= ఉంచి ; బాష్పకంఠాః= కన్నీళ్లుకంఠమునందుఁగలవారై ; విమనసః=దుఃఖమునొందినమనస్సుగలవారలై ; తం=ఆదశరథమహారాజును; ఊహుః=మోసిరి.

అంతఁ, బరిచారకులు , మృతుండయినదశరథమహారాజుకళేబరంబును, బల్లకియందుంచి, పరమదుఃఖితులయి కన్నీళ్లు గార్చుచు, మోసికొనిపోయిరి. అని, తాత్పర్యము.

హిరణ్యంచ సువర్ణంచ వాసాంసి వివిధానిచ
ప్రకిరంతో జనా మార్గం నృపతే రగ్రతో యయుః. ౧౫

టీక॥ జనాః=జనులు ; హిరణ్యంచ= వెండిని; సువర్ణంచ = బంగారమును; వివిధాని= నానావిధములయిన; వాసాంసిచ= వస్త్రములను; మార్గం= మార్గమునుగూర్చి, మార్గమందనుట; ప్రకిరంతః = వెదజల్లుచు; నృపతేః= దశరథమహారాజునకు; అగ్రతః=ముందట; యయుః=పోయిరి.

జనులు, వెండినాణెములను బంగా

రునాణెములను, నానావిధములగు వస్త్రములను, మార్గంబున వెదజల్లుచు, దశరథమహారాజునకు, ముందు నడచిరి. అని, తాత్పర్యము.

చందనాగరునిర్యాసాన్ సరళం పద్మకం తథా
దేవదారూణిచాహృత్య క్షేపయంతి తథాపరే. ౧౬
గంధానుచ్చావచాంశ్చాన్యాం స్తత్ర గత్వాథ భూమిపమ్
తత స్సంవేశయామాసు శ్చితామధ్యే తమృత్విజః. ౧౭

టీక॥ అపరే=ఇతరులు; తథా=అట్లు; చందనాగరునిర్యాసాన్ = చందనమును అగరువును గుగ్గిలమును ; సరళం = సరళాఖ్య ధూపమును ; తథా=అట్లు; పద్మకం = పద్మకమనుసుగంధికాష్ఠమును; దేవదారూణిచ=దేవదారువులను; అన్యాన్=ఇతరములయిన; ఉచ్చావచాన్ = నానావిధములగు; గంధాంశ్చ= గంధద్రవ్యములను; ఆహృత్య=తెచ్చి; క్షేపయంతి=వెదజల్లుచుండిరి, అథ= అటుపిమ్మట ; తత్ర= అచ్చటికి; గత్వా=పోయి ; తతః= అంత; ఋత్విజః=ఋత్విజులు ; తం=ఆ; భూమిపం= దశరథమహారాజును; చితామధ్యే = చితనడుమను; సంవేశయామాసుః=పరుండఁబెట్టిరి.

అట్లు, మఱికొందఱు, చందనాగరుచూర్ణంబులను గుగ్గిలమును, చల్లుచు, ధూపంబులు వేయుచు, పద్మచూర్ణమును దేవదారు చూర్ణంబును మఱియు నానావిధంబులగు గంధద్రవ్యంబులను జల్లుచుండిరి; అంత, నచ్చటికిఁ, బోయినపిదప, ఋత్విజులు, దశరథమహారాజ కళేబరంబును, చితిపైఁబరుండఁబెట్టిరి.

అని, తాత్పర్యము.

తథా హుతాశనం దత్వా జేపు స్తస్య తమృత్విజః
జగుశ్చ తే యథాశాస్త్రం తత్ర సామాని సామగాః. ౧౮

టీక॥ తథా=అట్లు; తస్య= ఆదశరథమహారాజునకు; తం = ఆ; హుతాశనం = అగ్నిహోత్రమును; దత్వా=ఇచ్చి, ఇప్పించియునుట ; ఋత్విజః=ఋత్విజులు; జేపుః = జపించిరి. తే=ఆ; సామగాః = సామగాన

ము సేయువారలు ; తత్ర = అచ్చట; యథాశాస్త్రం= శాస్త్రమునతిక్రమింపక; సామాని = సామములను; జగుశ్చ=పాడిరియు.

అట్లు, భరతుండు , దశరథమహారాజున కగ్నిహోత్రమునొసంగినపిదప, ఋత్విజులు , పైతృమేధికమంత్రంబులంబఠించిరి; అందు, సామగులు , యథాశాస్త్రంబుగా, సామగానములు చేసిరి. అని, తాత్పర్యము.

శిబికాభిశ్చ యానైశ్చ యథార్హం తస్య యోషితః
నగరా న్నిర్యయు స్తత్ర వృద్ధైః పరివృతా స్తదా. ౧౯

టీక॥ తదా=అప్పుడు;తస్య=ఆదశరథునియొక్క;యోషితః=భార్యలు; యథార్హం=యథాయోగ్యముగా;శిబికాభిశ్చ=పల్లకీలచేతను;యానైశ్చ= ఇతరవాహనములచేతను; వృద్ధైః=ముసలివారలచేత; పరివృతాః= చుట్టఁబడినవారలై ;నగరాత్= పట్టణముననుండి; తత్ర=అచ్చటికి ; నిర్యయుః= వెడలివచ్చిరి.

అప్పుడు, వృద్ధులుపరివేష్టింప, నాదశరథునిభార్యలు, యథాయోగ్యంబుగాఁ , పల్లకీలనురథంబులనుఆరోహించి, పట్టణంబుననుండివెడలి, యచ్చటికేతెంచిరి. అని, తాత్పర్యము.

ప్రసవ్యంచాపి తం చక్రుః ఋత్విజోగ్నిచితం నృపమ్
స్త్రియశ్చ శోకసంతప్తాః కౌసల్యాప్రముఖా స్తదా. ౨౦

టీక॥ తదా = అప్పుడు; ఋత్విజః=ఋత్విజులును; శోకసంతప్తాః = దుఃఖముచేమిక్కిలి యుడుకఁబడిన; కౌసల్యాప్రముఖాః= కౌసల్యమొదలుగాఁగల; స్త్రియశ్చ = స్త్రీలును; అగ్నిచితం= అగ్నిచయనముచేసిన; తం=ఆ; నృపం=దశరథమహారాజునుగూర్చి; ప్రసవ్యంచాపి= అప్రదక్షిణమును; చక్రుః=చేసిరి.

అప్పుడు , ఋత్విజులును దుఃఖితలయియున్న కౌసల్యాది స్త్రీలును భరతుండును; పెక్కుయాగంబులు చేసిన దశరథమహారాజునకు , అప్రదక్షిణంబునుంగావించిరి. అని, తాత్పర్యము.

క్రౌంచీనా మివ నారీణాం నినాద స్తత్ర శుశ్రువే

ఆర్తానాం కరుణం కాలే క్రోశంతీనాం సహస్రశః. ౨౧

టీక॥ తత్ర=అచ్చట; కాలే= ఆకాలమునందుక్ ఆర్తానాం= దుఃఖితలును; సహస్రశః=వేయివిధములుగా;కరుణం=దుఃఖముగల్గునట్లు గా;క్రోశంతీనాం=అఱచుచున్నవారలునగు ; నారీణాం=స్త్రీలయొక్క. నినాదః=ధ్వని ; క్రౌంచీనాం= ఆడుక్రౌంచపక్షులయొక్క;నినాదః(అధ్యాహృతము) ఇవ = ధ్వనివలె; శుశ్రువే=వినఁబడినది.

అంతనప్పుడు , కౌసల్యామొదలగు స్త్రీలు,దుఃఖితలయి,వేయివిధంబులఁ, గ్రౌంచపక్షులుంబోలె, మనోహరస్వరంబున,రోదనంబుగావించిరి.

అని, తాత్పర్యము.

తతో రుదంత్యో వివశా విలప్యచ పునఃపునః
యానేభ్య స్సరయూతీర మవతేరు ర్వరాంగనాః. ౨౨

టీక॥ తతః=అటుపిమ్మట; వరాంగనాః=ఉత్తమస్త్రీలు; రుదంత్యః=ఏడ్చుచు; వివశాః=స్వాధీనతదప్పినవారలై; పునఃపునః=మాటిమాటికి; విలప్యచ= విలపించియు; యానేభ్యః= వాహనములవలన; సరయూతీరం= సరయూనదిగట్టును గూర్చి ; అవతేరుః = దిగిరి.

అంత, నుత్తమవనితలగు నాకౌసల్యాదిస్త్రీలు , అట్లురోదనంబుసేయుచుఁ, బరవశలయి , మాటిమాటికివిలపించి, రథాదివాహనంబులనారోహించి, సరయూనదికివచ్చిరి.

అని, తాత్పర్యము.

కృత్వోదకం తే భరతేనసార్ధం
నృపాంగనా మంత్రిపురోహితాశ్చ
పురం ప్రవిశ్యా శ్రుపరీతనేత్రా
భూమౌ దశాహం వ్యనయంత దుఃఖమ్. ౨౩

టీక॥ తే=ఆ;నృపాంగనాః=రాజభార్యలును; మంత్రిపురోహితాశ్చ = మంత్రులును బురోహితులును ; భరతేనసార్ధం = భరతునితోఁగూడ ;

ఉదకం=ఉదకదానమును; కృత్వా=చేసి; పురం=పట్టణమును; ప్రవిశ్య=చొచ్చి; అశ్రుపరీతనేత్రాః = కన్నీళ్లచే వ్యాపింపఁబడినకండ్లుగలవారలై; భూమౌ=నేలయందు; శయానాః(అధ్యాహృతము)=పరుండినవారలై ; దశాహం=పదిదినములను ; దుఃఖం=దుఃఖమును; వ్యనయంత=కడపిరి.

రాజభార్యలునుమంత్రులునుపురోహితులును, భరతునితోఁగూడ, దశరథమహారాజునకు , నుదకదానంబుగావించి , పట్టణంబుఁబ్రవేశించి, కన్నీళ్లొలుక, రోదనంబుగావింపుచు, నేలపైశయనింపుచు , నిట్లు , పదిదినంబులునియమంబుననుండి ఆశౌచంబుఁగడపిరి. అని, తాత్పర్యము.

విశేషార్థము.—"షోడశేనభూపాలాః" క్షత్రియులుపదునారుదినములచేశుద్ధులగుదురు) అనియుండినను , భరతాదులు, "క్షత్రియస్తుదశాహేన స్వకర్మనిరతశ్శుచిః" (తనకువిధింపఁబడి యుండు కర్మంబులం జక్కఁగాజరపుకొనుచుఁబరిశుద్ధుండైయుండు క్షత్రియుండుమాత్రము , పదిదినములచేశుద్ధుఁడగును) అను, విశేషశాస్త్రమునననుసరించి , పదిదినములెయాశౌచమువహించిరి.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
అయోధ్యాకాండే,షట్సప్తతితమస్సర్గః.
ఇది,స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండషట్సప్తతితమసర్గటీక , ముగిసినది.



స ౭౭

శ్రీ

సప్తసప్తతితమసర్గప్రారంభః.

తతో దశాహేఽతిగతే కృతశౌచో నృపాత్మజః
ద్వాదశేఽహని సంప్రాప్తే శ్రాద్ధకర్మాణ్యకారయత్. ౧

టీక॥ తతః=అటుపిమ్మట; దశాహే=పదిదినములు; అతిగతే=అతిక్రమించినవగుచుండఁగా; నృపాత్మజః= రాచకొమరుండగు భరతుండు; కృతశౌచః=చేయఁబడిన పారిశుద్ధ్యముగలవాఁడై; ద్వాదశే=పండ్రెండవదగు; అహని=దినము; సంప్రాప్తే= వచ్చినదగుచుండఁగా; శ్రాద్ధకర్మాణి = శ్రాద్ధకార్యములను; అకారయత్=చేసెను.

అంత, పదిదినములుగడచినపిదప, భరతుండు అశౌచంబు దీర్చుకొని, పదునొకండవ దినంబునం జేయవలసిన శ్రాద్ధకార్యంబులను, పండ్రెండవనాటి శ్రాద్ధకార్యంబులను, గావించెను.

అని, తాత్పర్యము.

బ్రాహ్మణేభ్యో దదౌ రత్నం ధన మన్నంచ పుష్కలమ్
వాసాంసిచ మహార్హాణి రత్నాని వివిధానిచ. ౨

టీక॥ భరతః (అధ్యాహృతము)=భరతుఁడు; బ్రాహ్మణేభ్యః= బ్రాహ్మణులకొఱకు; రత్నం=మణులను; ధనం=ధనమును; అన్నంచ= అన్నమును; మహార్హాణి = శ్రేష్ఠములయిన; వాసాంసిచ=వస్త్రములను; వివిధాని=నానావిధములయిన; రత్నానిచ= శ్రేష్ఠపదార్థములను; పుష్కలం= సంపూర్ణముగా; దదౌ=ఇచ్చెను.

భరతుండప్పుడు, బ్రాహ్మణులకు, మణులను, ధనమును, అన్నమును, ఉత్తమవస్త్రంబులను, మఱియు నానావిధంబులగు నుత్తమ పదార్థంబులను, పుష్కలంబుగా నొసంగెను.

అని, తాత్పర్యము.

బాస్తికం బహు శుక్లంచ గాశ్చాపి శతశ స్తథా
దాసీదాసంచ యానంచ వేశ్మాని సుమహాంతిచ. ౩

బ్రాహ్మణేభ్యో దదౌ పుత్రో రాజ్ఞ స్తస్యౌ ర్ధ్వదేహికమ్

టీక॥ పుత్రః= కొడుకైనభరతుండు; తదా=అప్పుడు; బాస్తికం=మేకలసమూహమును; బహు=అధికమయిన; శుక్లంచ=వెండిని; శతశః= నూఱునూఱులుగా; గాశ్చాపి= ఆవులను; దాసీదాసంచ= దాసీలను దాసులను; యానంచ= వాహనంబులను; సుమహాంతి= మిక్కిలియుఁ బెద్దవైన; వేశ్మానిచ=ఇండ్లను; తస్య=ఆ; రాజ్ఞః=దశరథమహారాజుయొక్క; ఔర్ధ్వదేహికం= ఊర్ధ్వదేహ క్రియనుద్దేశించి ; బ్రాహ్మణేభ్యః= బ్రాహ్మణులకొఱకు; దదౌ=ఇచ్చెను.

భరతుండు, మఱియు , నప్పుడు, ఛాగంబులసమూహమును , వెండిని, గోవులను , దాసీజనంబులను దాసజనంబులను, వాహనంబులను, విశాలంబులగుగృహంబులను, దశరథునిపరలోకక్రియనుద్దేశించి , బ్రాహ్మణులకుఁబుష్కలంబుగానొసంగెను.

అని, తాత్పర్యము.

తతః ప్రభాతసమయే దివసేథ త్రయోదశే. ౪
విలలాప మహాబాహు ర్భరత శ్శోకమూర్ఛితః
శబ్దాపిహితకంఠస్తు శోధనార్థ ముపాగతః. ౫

టీక॥ తతః=అంత; అథ=పిమ్మట; త్రయోదశే=పదుమూఁడవదగు ; దివసే=దినమునందు; ప్రభాతసమయే = ప్రాతఃకాలమునందు; మహాబాహుః= పెద్దచేతులుగల; భరతః=భరతుఁడు; శోధనార్థం= దహనప్రదేశమునుశోధించుటకొఱకు, అస్థిసంచయనముకొఱకనుట; ఉపాగతః=వచ్చినవాఁడై; శోకమూర్ఛితః= దుఃఖముచేవ్యాపింపఁబడినవాఁడై; శబ్దాపిహితకంఠస్తు=ధ్వనిచేఁగప్పఁబడినకంఠము గలవాఁడునై, విలలాప=విలపించెను.

అంతఁ, బదుమూఁడవదినంబు, ప్రాతఃకాలంబున, భరతుండు , అస్థిసంచయనార్థమయి, దహనప్రదేశంబునకు వచ్చి , పరమదుఃఖితుండయి, పేరెలుంగున, రోదనంబుఁ జేసెను.

అని, తాత్పర్యము.

చితామూలే పితు ర్వాక్య మిద మాహ సుదుఃఖితః

టీక॥ సః=(అధ్యాహృతము)= ఆ భరతుఁడు; సుదుఃఖితః= మిక్కిలియు దుఃఖమునొందినవాఁడై; పితుః= తండ్రియొక్క; చితామూలే= చితిసమీపమునందు; ఇదం=ఈ; వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

అట్లు, భరతుండు, పరమదుఃఖితుండై, తండ్రిచితియొద్ద నీమాటలం జెప్పకొనుచు, రోదనంబుచేసెను.

అని, తాత్పర్యము.

తాత యస్మిన్ నిసృష్టోహం త్వయా భ్రాతరి రాఘవే. ౬
తస్మిన్ వనం ప్రవ్రజితే శూన్యే త్యక్తో స్మ్యహం త్వయా

టీక॥ తాత=నాయనా! త్వయా= నీచేత; అహం= నేను; యస్మిన్=ఎవ్వనియందు; నిసృష్టః=ఇవ్వఁబడినానో; తస్మిన్=అట్టి; భ్రాతరి= అన్నయయిన; రాఘవే=రాముండు; వనం= అడవిని; ప్రవ్రజితే= పొందినవాఁడగుచుండఁగా; అహం= నేను; త్వయా= నీచేత; శూన్యే= దిక్కులేనిస్థలమునందు; త్యక్తః= విడువఁబడినవాఁడను; అస్మి= అగుచున్నాను.

నాయనా! నీవు, నన్ను, ఎవ్వరి కప్పగించి పోవలయునో, అట్టినాయన్న రాముండును, అడవికిఁబోయినాఁడే! ఇట్లు నన్ను దిక్కులేనిచోట, విడిచిపోతివి. అని, తాత్పర్యము.

యస్యా గతి రనాథాయాః పుత్రః ప్రవ్రాజితో వనమ్. ౭
తా మంబాం తాత కౌసల్యాం త్యక్త్వా త్వం క్వగతో నృప

టీక॥ నృప=రాజవగు ; తాత= నాయనా! అనాథాయాః=నాథుండులేనట్టి; యస్యాః= ఎవ్వతెయొక్క; గతిః= గతియయిన; పుత్రః = కొడుకగు రాముండు; వనం= అడవినిగూర్చి; ప్రవ్రాజితః=పంపఁబడినాఁడో; తాం= అట్టి; అంబాం= తల్లియయిన ; కౌసల్యాం= కౌసల్యను; త్యక్త్వా= విడిచి; త్వం= నీవు; క్వ= ఎచ్చటికి; గతః=పోయినావు?

మహారాజుండవగు నాయనా! అనాథయగు కౌసల్య కొడుకును రాముని వనంబునకుఁబంపి ఆవిడను దిక్కులేనిదానిఁగాఁజేసితివే! నీవుగూడ నావి

డను, విడిచి, మెచ్చటికిఁ బోతివి! అని, భరతుండు, రోదనంబుఁ జేసెను.

అని, తాత్పర్యము.

దృష్ట్వా భస్మారుణం తచ్చ దగ్ధాస్థి స్థానమండలమ్. ౮
పితు శ్శరీరనిర్వాణం నిష్టనన్ విషసాద సః

టీక॥ సః=ఆభరతుఁడు ; భస్మారుణం= బూడిదచేనెఱ్ఱనైనదియు, నిప్పచేనెఱ్ఱగానుండు బూడిదగలదియును నుట; దగ్ధాస్థి=దహింపఁబడినయెముకలుగలదియు; స్థానమండలం = మండలాకారమయినప్రదేశముగలదియు ;పితుః= తండ్రియొక్క; శరీరనిర్వాణం= దేహమునునశింపఁజేసినదియునగు; తత్= ఆచితామూలమును ; దృష్ట్వా చ=చూచినంతనె;నిష్టనన్=గట్టిగానఅఱచుచు; విషసాద=దుఃఖించెను.

ఆభరతుండట్లు, కాలియెఱ్ఱఁగానున్నదియు , దగ్ధములయినయస్థులుగలదియు, మండలాకారమయినదియు,తండ్రిశరీరమును దగ్ధముగావించినదియునగు, నాచితిం జూచి , గట్టిగానఅఱచుచు, రోదనంబు జేసెను.

అని, తాత్పర్యము.

సతు దృష్ట్వా రుదన్ దీనః పపాత ధరణీతలే. ౯
ఉత్థాప్యమాన శ్శక్రస్య యంత్రధ్వజఇవ చ్యుతః

టీక॥ సః=ఆభరతుండు; దృష్ట్వా తు=చూచినంతనే;దీనః=దుఃఖితుండై; రుదన్=ఏడ్చుచు; ఉత్థాప్యమానః= ఎత్తఁబడుచున్నదియు; చ్యుతః=జాఱినదియునగు; శక్రస్య=ఇంద్రునియొక్క; యంత్రధ్వజఇవ= యంత్రబద్ధమగుధ్వజమువలె;ధరణీతలే= భూతలమునందు; పపాత=పడెను.

భరతుండట్లుదీనుండై , రోదనంబు సేయుచు , ఇంద్రధ్వజముపగ్గములచేఁ బైకెత్తఁబడుచుఁ , గొంచెముతప్పిజాఱి నేలంబడునట్లు, నేలంబడెను.

అని, తాత్పర్యము.

అభిపేతు స్తత స్సర్వే తస్యామాత్యా శ్శుచివ్రతమ్. ౧౦

అంతకాలే నిపతితం యయాతి మృషయో యథా

టీక॥ తతః=అటుపిమ్మట; తస్య=అతనియొక్క; అమాత్యాః=మంత్రులు; సర్వే=అందఱును; శుచివ్రతం= పరిశుద్ధములయిన వ్రతములుగల భరతునిగూర్చి; అంతకాలే = పుణ్యక్షయకాలమునందు; నిపతితం= పడిన ; యయాతిం= యయాతినిగూర్చి; ఋషయో యథా=ఋషులువలె; అభిపేతుః = కూడఁబ్రాలిరి.

అంత , నాభరతునిమంత్రులుమొదలగువారలు , భరతుండుపడుటనుజూచి , యతనిలేవనెత్తుటకై , పుణ్యక్షయంబునం బడినయయాతిని లేవనెత్తుటకుఋషులుంబోలె , నతనితోఁగూడఁబ్రాలిరి.

అని, తాత్పర్యము.

శత్రుఘ్నశ్చాపి భరతం దృష్ట్వా శోకపరిప్లుతః. ౧౧
విసంజ్ఞో న్యపత ద్భూమౌ భూమిపాల మనుస్మరన్

టీక॥ శత్రుఘ్నశ్చాపి= శత్రుఘ్నుఁడును; శోకపరిప్లుతం= దుఃఖముచేవ్యాపింపఁబడిన; భరతం= భరతుని; దృష్ట్వా=చూచి; భూమిపాలం= రాజయినదశరథుని; అనుస్మరన్= తలంచుచు; విసంజ్ఞః=తెలివిలేనివాఁడై; భూమౌ = నేలయందు ; న్యపతత్ = పడెను.

శత్రుఘ్నుండును, భరతుండట్లుదుఃఖితుండై నేలంబడుటనుజూచి, తండ్రిందలంచుకొని, పరమదుఃఖితుండై, మైమఱచి, నేలంబడెను. అని, తాత్పర్యము.

ఉన్మత్త ఇవ నిశ్చేతా విలలాప సుదుఃఖితః. ౧౨
స్మృత్వా పితు ర్గుణాంగాని తాని తాని తథాతథా

టీక॥ సః(అధ్యాహృతము)= ఆశత్రుఘ్నుఁడు; పితుః = తండ్రియొక్క; తానితాని=ఆయా ; గుణాంగాని = గుణంబులను అవయవంబులును ; స్మృత్వా=తలంచి; తథాతథా= అట్లట్లు; సుదుఃఖితః=మిక్కిలియు దుఃఖముగలవాఁడై; నిశ్చేతాః=సంజ్ఞలేని వాఁడై; ఉన్మత్తఇవ=పిచ్చివానివలె; విలలాప= ఏడ్చెను.

ఆశత్రుఘ్నుండు , అయ్యోతండ్రిగు

ణంబులను అవయవంబులను దలంచుకొని, పరమదుఃఖితుండై, మైమఱచి, యున్మత్తునియట్లు, రోదనంబుచేసెను. అని, తాత్పర్యము.

మంథరాప్రభవ స్తీవ్రః కైకేయీగ్రాహసంకులః. ౧౩
వరదానమయోఽక్షోభ్యోఽ మజ్జయచ్ఛోకసాగరః

టీక॥ మంథరాప్రభవః = మంథరయేకారణముగాఁగలదియు; కైకేయీగ్రాహసంకులః= కైకేయియనుమొసలిచేనిండినదియు; వరదానమయః= వరదానవికారమయినదియు; తీవ్రః= తీక్ష్ణమయినదియు;అక్షోభ్యః=కలఁపరానిదియునగు;శోకసాగరః=దుఃఖసముద్రము; అమజ్జయత్=ముంచినది.

మంథరవలనంబుట్టినదియుఁ, గైకేయియను మొసలిగలదియు, వరదానమనుజలముగలదియు,తీవ్రంబునునక్షోభ్యంబునగు, దుఃఖసముద్రంబున, మునింగినాము. అని, తాత్పర్యము.

సుకుమారంచ బాలంచ సతతం లాలితం త్వయా. ౧౪
క్వ తాత భరతం హిత్వా విలపంతం గతో భవాన్

టీక॥ తాత=నాయనా! త్వయా= నీచేత; సతతం = ఎల్లప్పుడును; లాలితం=బుజ్జగింపఁబడినవాఁడును;సుకుమారంచ= కోమలుఁడైనవాఁడును;బాలంచ= చిన్నవాఁడును; విలపంతం = ఏడ్చుచున్నవాఁడునగు; భరతం=భరతుని; హిత్వా=విడిచి; భవాన్ = నీవు; క్వ=ఎచ్చటికి; గతః=పోయినావు?

నాయనా! నీచేతనెల్లప్పుడునుపలాలింపఁబడుచున్నవాఁడును సుకుమారశరీరుండును బాలుండునగు భరతుండు, రోదనంబుసేయుచుండఁగా, నీవతనివిడచి, యెచ్చటికిఁ బోయి యున్నావు? అని, తాత్పర్యము.

నను భోజ్యేషు పానేషు వస్త్రేష్వా భరణేషుచ. ౧౫
ప్రవారయసి న స్సర్వాం స్త న్నః కోన్యః కరిష్యతి

టీక॥ నను=అయ్యా! భోజ్యేషు= తినఁదగినవానియందును ; పానేషు =




పానద్రవ్యములందును ; వస్త్రేషు=వస్త్రములయందును ; ఆభరణేషుచ=సొమ్ములయందును ; నః=మమ్ము ; సర్వాన్= అందఱను ; ప్రవారయసి= ఇష్టమయిన దానిఁదీసికొను నట్లుసేయుచుందువు. తత్=అట్టిపనిని; నః= మాకు; అన్యః=ఇతరుఁడు; కః=ఎవ్వఁడు; కరిష్యతి=చేయఁగలఁడు.

అయ్యా ! భోజ్యపదార్థములయందును పానద్రవ్యములయందును వస్త్రంబులయందును ఆభరణములయందును, మీకెద్దియిష్టమో దానిందీసికొనుఁడని, నిర్బంధముగా, మాకిష్టమయినదాని మేమేదీసికొనునట్లు , చేయుచుందువుగదా ! అట్లుమాకింకనెవ్వరు చేయుదురు?

అని, తాత్పర్యము.

అవదారణకాలేతు పృథివీ నావదీర్యతే. ౧౬
యా విహీనా త్వయా రాజ్ఞా ధర్మజ్ఞేన మహాత్మనా

టీక॥ యా=ఏభూమి; రాజ్ఞా=రాజవును; ధర్మజ్ఞేన=ధర్మంబునెఱింగినవాఁడవును; మహాత్మనా= పూజ్యమయినహృదయముగలవాఁడవునగు ; త్వయా=నీచేత; విహీనా=విడువఁబడినదై; నావదీర్యతే= భిన్నముగాకున్నదో ; సా (అధ్యాహృతము)= అట్టి; పృథివీ=భూమి; అవదారణకాలేతు= ప్రళయకాలము నందును ; నావదీర్యతే (అధ్యాహృతము) = భిన్నము కాదు.

ధర్మజ్ఞుండవుమహాత్ముండవు రాజవునగునిన్నువిడిచియుఁ , బగిలిపోకున్నదికావున , నీభూమి,ప్రళయకాలమునందునుబగులదని,తోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

పితరి స్వర్గ మాపన్నే రామే చారణ్య మాశ్రితే. ౧౭
కిం మే జీవితసామర్థ్యం ప్రవేక్ష్యామి హుతాశనమ్

టీక॥పితరి=తండ్రి;స్వర్గం = స్వర్గమును;ఆపన్నే=పొందఁగా; రామే చ=రాముండును; అరణ్యం=అడవిని; ఆశ్రితే=పొందఁగా;మే=నాకు; జీవితసామర్థ్యం=ప్రాణధారణశక్తి;కిం= ఎక్కడిది?హుతాశనం=అగ్నిహోత్ర




మును; ప్రవేక్ష్యామి=ప్రవేశించెదను.

తండ్రివగునీవు మృతిఁబొంది, రాముండును వనంబునకుఁబోయినపిదప, నాకు, జీవించియుండుటకుసామర్థ్యంబులేదు; అగ్నిహోత్రంబుఁ జొచ్చియయినంబ్రాణంబులువిడిచెదను.

అని, తాత్పర్యము.

హీనో భ్రాత్రా చ పిత్రా చ శూన్యా మిక్ష్వాకుపాలితామ్. ౧౮
అయోధ్యా న్న ప్రవేక్ష్యామి ప్రవేక్ష్యామి తపోవనమ్

టీక॥అహం=నేను; భ్రాత్రా చ=అన్నచేతను; పిత్రా చ=తండ్రిచేతను; హీనః=విడువఁబడినవాఁడనై; శూన్యాం=పాడు పడియున్న; ఇక్ష్వాకుపాలితాం = ఇక్ష్వాకువంశంబునం బుట్టిన రాజులచేత పాలింపఁబడిన; అయోధ్యాం = అయోధ్యా పట్టణమును; నప్రవేక్ష్యామి = ప్రవేశింపను. తపోవనం=తపోవనమును; ప్రవేక్ష్యామి= ప్రవేశించెదను.

ఇట్లు, అన్నను దండ్రిని విడిచి, పాడు పడియున్న యిక్ష్వాకుపరిపాలితంబగు నయోధ్యాపట్టణంబును, నేనెంతమాత్రము ప్రవేశింపను; తపోవనంబునకుఁ బోయి తపంబుచేసికొనెదను. అని, శత్రుఘ్నుండు, రోదనంబు చేసెను.

అని, తాత్పర్యము.

తయో ర్విలపితం శ్రుత్వా వ్యసనంచా న్వవేక్ష్య తత్. ౧౯
భృశమార్తతరా భూయ స్సర్వ ఏవానుగామినః

టీక॥అనుగామినః=వెంబడిఁబోయినవారలు; సర్వఏవ= అందఱునే; తయోః= ఆభరత శత్రుఘ్నులయొక్క; విలపితం= రోదనమును; శ్రుత్వా=విని; తత్=ఆ; వ్యసనంచ=కష్టంబును; అన్వవేక్ష్య =చూచి; భూయః= మఱల; భృశం= మిక్కిలియు; ఆర్తతరాః= దుఃఖము నొందినవారలు; ఆసక్ (అధ్యాహృతము)= అయిరి.

ఆభరత శత్రుఘ్నులట్లురోదనంబు సేయుటను, ఆదుఃఖంబునుంజూచి, వారి వెంబడివచ్చినవారలందఱు, మఱల, మహాదుఃఖంబునొందివిలపించిరి.

అని, తాత్పర్యము.

స ౭౭

తతో విషణ్ణౌ శ్రాంతౌచ శత్రుఘ్నభరతా వుభౌ. ౨౦
ధరణ్యాం సంవ్యవేష్టేతాం భగ్నశృంగా వివర్షభౌ

టీక॥ తతః=అటుపిమ్మట; శత్రుఘ్న భరతౌ= శత్రుఘ్నుండును భరతుండును; ఉభౌ= ఇద్దఱును; విషణ్ణౌ= దుఃఖితులును; శ్రాంతౌచ=అలసటనొందినవారలునై; భగ్నశృంగా=విఱిగినకొమ్ములుగల; ఋషభావివ=వృషభములువలె; ధరణ్యాం=భూమియందు; సంవ్యవేష్టేతాం= పొరలిరి.

అంత, నాభరతశత్రుఘ్నులు, ఇర్వురును, దుఃఖితులయి, విలపించివిలపించి, యలసటనొంది, కొమ్ములువిఱిగినవృషభంబులువలె, నేలంబడిపొరలిరి. అని, తాత్పర్యము.

తతః ప్రకృతిమాన్ వైద్యః పితురేషాం పురోహితః. ౨౧
వసిష్ఠో భరతం వాక్య ముత్థాప్య త ముఖాచ హ

టీక॥ తతః= అటుపిమ్మట; ప్రకృతిమాన్ ప్రశస్తమయినస్వభావముగలవాఁడును; వైద్యః= సర్వజ్ఞుండును; ఏషాం= వీరలయొక్క; పితుః= తండ్రియొక్క; పురోహితః= పురోహితుండునగు; వసిష్ఠః= వసిష్ఠుండు; తం= ఆభరతుని; ఉత్థాప్య = లేవనెత్తి; వాక్యం= మాటను; ఉవాచ=చెప్పెను.

అంతఁ, బ్రశస్తంబగు స్వభావంబుగలవాఁడును సర్వజ్ఞుండును దశరథమహారాజ పురోహితుండునగు వసిష్ఠుండు, నేలం బొరలుచున్న భరతునిలేవనెత్తి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

త్రయోదశోఽయం దివసః పితుర్వృత్తస్య తే విభో. ౨౨
సావశేషాస్థినిచయే కిమిహ త్వం విలంబసే

టీక॥ విభో= ప్రభుండవగుభరతుఁడా! తే=నీయొక్క; పితుః= తండ్రి; వృత్తస్య = పోయినవాఁడు గాఁగా; అయం= ఇది; త్రయోదశః=పదుమూఁడవదగు; దివసః=దినము. సావశేషాస్థినిచయే = మిగతతోఁ గూడినయస్థిసంచయనమగుచుండఁగా, అస్థిసంచయనముసావశేషముగా నుండఁగానను

ట; ఇహ=ఇచ్చట; త్వం=నీవు;కిం=ఎందుకు ; విలంబసే= జాగుసేయుచున్నావు?

ప్రభుండవగు భరతుఁడా! నీతండ్రి చనిపోయి, యిదిపదుమూఁడవదినము; ఇంకను, అస్థిసంచయనము కొంతతపడియున్నది;ఇట్లుండఁగా, నీవిచ్చట జాగుసేయుచున్నావేల?

అని, తాత్పర్యము.

త్రీణి ద్వంద్వాని భూతేషు ప్రవృత్తా న్య విశేషతః. ౨౩
తేషుచా పరిహార్యేషు నైవం భవితు మర్హసి

టీక॥ త్రీణి=మూఁడైన; ద్వంద్వాని= జంటలు, క్షుత్పిపాసలు , శోకమోహములు, జరామరణములు , అనునవి; భూతేషు= జంతువులందు;అవిశేషతః=భేదములేక;ప్రవృత్తాని=ప్రవర్తించియున్నవి ; అపరిహార్యేషు=నివారింపఁగూడనట్టి; తేషుచ=వానివిషయమయ్యును; ఏవం=ఇట్లు;భవితుం=అగుటకు; నార్హసి=తగవు.

క్షుత్పిపాసలు, శోకమోహములు, జరామరణములు , ఇవిమూఁడును, సమస్త ప్రాణులకును గలవు ; ఇవిలేనిప్రాణియేదియులేదు; అనివార్యములగు, వీనినిగుఱించి , నీయట్టివాఁడు, మూఢునియట్లు, దుఃఖింపందగదు. అనివసిష్ఠుండు,భరతునకుంజెప్పెను.

అని, తాత్పర్యము.

సుమంత్రశ్చాపి శత్రుఘ్న ముత్థాప్యా భిప్రసాద్యచ. ౨౪
శ్రావయామాస తత్త్వజ్ఞ స్సర్వభూతభవాభవమ్

టీక॥ తత్త్వజ్ఞః=తత్త్వమునెఱింగినట్టి; సుమంత్రశ్చాపి= సుమంతుఁడును; శత్రుఘ్నం= శత్రుఘ్నుని; ఉత్థాప్య=లేవనెత్తి; అభిప్రసాద్యచ=ప్రసన్నునిఁగాఁజేసియు;సర్వభూతభవాభవం=సమస్తభూతంబుల జన్మమరణములను;శ్రావయామాస=వినిపించెను.

అంత,సమస్తతత్త్వంబుల నెఱింగినట్టిసుమంత్రుండుశత్రుఘ్నుని లేవనెత్తి మంచిమాటలందేర్చి, “సమస్తభూతములకునుజన్మమరణంబులుస్వాభావికంబులు, వానినివారింపనలవిగాదు, కావు

న, నిప్పుడు దుఃఖించుటచే నేమియు నుపయోగంబు లేదు " అని బోధించెను. అని, తాత్పర్యము.

ఉత్థితౌచ నరవ్యాఘ్రౌ ప్రకాశేతే యశస్వినౌ. ౨౫
వర్షాతపపరిక్లిన్నౌ పృథ గింద్ర ధ్వజా వివ

టీక॥ యశస్వినౌ=ప్రశస్తమయిన కీర్తిగల; నరవ్యాఘ్రౌ=పురుషశ్రేష్ఠులగు భరతశత్రుఘ్నులు; ఉత్థితౌచ= లేచినవారలునై ; పృథక్ = తిరిగి ; వర్షాతపపరిక్లిన్నౌ= వానయెండలచే గాసిలియున్న ; ఇంద్రధ్వజా వివ = ఇంద్రధ్వజంబులువలె ; ప్రకాశేతే = ప్రకాశించుచుండిరి.

ప్రశస్తంబగుకీర్తిగల పురుషశ్రేష్ఠులగు భరతశత్రుఘ్నులు, లేచి, వర్షాతపంబులకు గాసిలియున్న యింద్రధ్వజంబులువలెఁబ్రకాశించుచుండిరి.

అని, తాత్పర్యము.

అశ్రూణిపరి మృద్నంతౌ రక్తాక్షౌ దీనభాషిణౌ. ౨౬
అమాత్యా స్త్వరయంతిస్మ తనయౌ చాపరాః క్రియాః

టీక॥ అమాత్యాశ్చ=మంత్రులును; అశ్రూణి= కన్నీళ్లను; పరిమృద్నంతౌ= తుడుచు కొనుచున్న వారలును; రక్తాక్షౌ=ఎఱ్ఱనికండ్లుగలవారలును; దీనభాషిణౌ= దైన్యముగలుగునట్లు మాటలాడుచున్నవారలునగు; తనయౌ=కొడుకులను; అపరాః=వెనుకఁజేయవలసిన; క్రియాః=కర్మములను ద్దేశించి; త్వరయంతిస్మ=వేగిరపఱచిరి.

అంతమంత్రులును, కన్నీళ్లుతుడుచుకొనుచు నెఱ్ఱనికండ్లతో దీనస్వరంబున మాటలాడుచున్న భరత శత్రుఘ్నులను, శీఘ్రముగా నపరక్రియలంజేయుండని, వేగిరపఱచిరి; అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, సప్తసప్తతితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ సప్తసప్తతితమసర్గటీక, ముగిసినది.

---

౭౮

## అష్టసప్తతితమసర్గప్రారంభః.

అథ యాత్రాం సమీహంతం శత్రుఘ్నో లక్ష్మణానుజః
భరతం శోక సంతప్త మిదం వచన మబ్రవీత్. ౧

టీక॥ అథ=అటుపిమ్మట; లక్ష్మణానుజః= లక్ష్మణునితమ్ముఁడగు; శత్రుఘ్నః = శత్రుఘ్నుఁడు ; యాత్రాం= యాత్రను; సమీహంతం= కోరుచున్న వాఁడును; శోకసంతప్తం= దుఃఖముచేమిక్కిలియుఁ దపింపఁ జేయఁబడిన వాఁడునగు; భరతం= భరతునిగూర్చి; ఇదం= ఈ; వచనం=మాటను; అబ్రవీత్ =చెప్పెను.

అటుపిమ్మట, లక్ష్మణునితమ్ముండడగుశత్రుఘ్నుండు, గృహంబునకుఁబోయిన వెనుక రామునియొద్దకుఁబోఁగోరుచున్న దుఃఖితుండగుభరతుంజూచి, యిట్లని , చెప్పెను.

అని, తాత్పర్యము.

గతి ర్య స్సర్వభూతానాం దుఃఖే కిం పున రాత్మనః
స రామ స్సత్వ సంపన్న స్త్రియా ప్రవ్రాజితో వనమ్. ౨

టీక॥ యః=ఎవ్వఁడు ; దుఃఖే= దుఃఖముకలుగఁగా;సర్వభూతానాం= సమస్తప్రాణులకును ; గతిః = గతియో;సః(అధ్యాహృతము)= అట్టి;రామః=రాముండు;ఆత్మనః=తనకు;గతిరితి (అధ్యాహృతము)= గతియని ; కింపునః (వక్తవ్యం) = చెప్పఁబడవలయునాయేమి ? సః=అట్టి ; సత్త్వసంపన్నః=బలముతోఁగూడినవాఁడగు; రామః=రాముఁడు;స్త్రియా= ఆఁడుదాని

చేత; వనం= అడవినిగూర్చి ; ప్రవ్రాజితః=పంపఁబడినాఁడు.

దుఃఖంబుగలుగునప్పుడు, సమస్తప్రాణులకును దుఃఖంబుఁబోఁగొట్టి క్షేమంబుగలుగఁ జేయంజాలినట్టి రాముండు, తనకష్టంబుఁ బోఁగొట్టుకొనంజాలునని చెప్పనేల? అట్టిమహాబలశాలియగు రాముండు, ఒకస్త్రీచేత, నడవికిఁ బంపబడినాఁడు!

అని, తాత్పర్యము.

బలవాన్ వీర్యసంపన్నో లక్ష్మణో నామ యోప్యసౌ
కిం న మోచయతే రామం కృత్వాస్య పితృనిగ్రహమ్. ౩

టీక॥ బలవాన్= అధికమయినబలముగలవాఁడును; వీర్యసంపన్నః=పరాక్రమముతోఁగూడినవాఁడునగు; లక్ష్మణో నామ = లక్ష్మణుండనువాఁడు ; యః=ఎవ్వఁడు; అస్తి (అధ్యాహృతము)=ఉన్నాఁడో; అసావపి=ఇతండైనను; పితృనిగ్రహం = తండ్రియొక్క నిగ్రహమును; కృత్వా=చేసి; రామం=రాముని; కిం= ఎందుకు; న మోచయతే స్మ=విడిపింపఁడయ్యె?

రాముండు సరే, యపకీర్తిభయంబునఁ, దండ్రిమాటకులోఁబడియుండును గాక; మహాబలపరాక్రమ శాలియగు వాఁడు లక్ష్మణుండనియొకఁడున్నాఁడే, అతండయినను, దండ్రినినిగ్రహించి, రామునివనంబునకుఁ బంపకుండునట్లు, ఎందుకుఁ జేయ లేదు? అని, తాత్పర్యము.

పూర్వమేవతు నిగ్రాహ్య స్సమవేక్ష్య నయానయౌ
ఉత్పథం య స్సమారూఢో రాజాఽనార్యావశం గతః. ౪

టీక॥ యః = ఎవ్వఁడు; అనార్యావశంగతః=దుష్టురాలగు కైకేయివశమును బొందినవాఁడై ; ఉత్పథం = ఉన్మార్గమును; సమారూఢః=అవలంబించినాఁడో; సః=అట్టి; రాజా = దశరథమహారాజు; నయానయౌ= న్యాయాన్యాయములను; సమవేక్ష్య= విచారించి; పూర్వమేవతు = ముందే; నిగ్రాహ్యః= నిగ్రహింపఁదగినవాఁడు.

దుష్టురాలగు కైకేయి చెప్పిన మాటనువిని, దుర్మార్గమునం బ్రవృత్తుఁడై యున్న, దశరథమహారాజును, న్యా

యాన్యాయంబులం బరిశీలించి, యిట్టి యనర్థము సంభవించుటకుమున్నె, నిగ్రహింపవలసియుండెను. అని శత్రుఘ్నుండు, భరతునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి సంభాషమాణేతు శత్రుఘ్నే లక్ష్మణానుజే
ప్రాగ్ద్వారేఽభూ త్తదా కుబ్జా సర్వాభరణభూషితా. ౫

టీక॥ లక్ష్మణానుజే = లక్ష్మణునితమ్ముఁడగు; శత్రుఘ్నే = శత్రుఘ్నుఁడు; ఇతి=ఇట్లు; సంభాషమాణేతు= మాటలాడుచుండఁగానే; తదా = అప్పుడు; కుబ్జా= మంధర; సర్వాభరణభూషితా = సమస్తాభరణములచేస లంకరింపఁబడినదై; ప్రాగ్ద్వారే=తూర్పువాకిలియందు; అభూత్ = ఉండెను.

లక్ష్మణుని తమ్ముండగు శత్రుఘ్నుండు, ఇట్లుమాటలాడుచుండఁగానే, మంధర, అప్పుడు, సమస్తాభరణాలంకృతయయి, దైవవశంబుననాభరతశత్రుఘ్నులున్న యింటితూర్పుతట్టువాకిలి యొద్దకు వచ్చెను- అని, తాత్పర్యము.

లిప్తా చందనసారేణ రాజవస్త్రాణి బిభ్రతీ
వివిధం వివిధై స్తై స్తై ర్భూషణైశ్చ విభూషితా. ౬

టీక॥ సా(అధ్యాహృతము)= ఆ మంధర; చందనసారేణ= చందనశ్రేష్ఠముచేత; లిప్తా = పూయఁబడినదై; రాజవస్త్రాణి=రాజయోగ్యములగు వస్త్రములను; బిభ్రతీ= ధరించుచు; వివిధం=నానావిధములుగా; వివిధైః= నానావిధములయిన; తైస్తైః=ఆయా; భూషణైః= సొమ్ములచేత ; విభూషితా చ= అలంకరింపఁబడినదియునై ; అభూత్(అధ్యాహృతము)=ఉండినది.

అప్పుడుమంధర , యుత్తమంబగు చందనంబుఁబూసికొని, రాజయోగ్యంబులగు వస్త్రంబులుధరించి, నానావిధంబులగు నద్వ్యోభూషణంబులు ధరించి, యొంతయునొప్పుచుండినది.

అని, తాత్పర్యము.

మేఖలాదామభి శ్చిత్రై రన్యైశ్చ శుభభూషణైః

బభాసే బహుభి ర్బద్ధా రజ్జుబద్ధేవ వానరీ. ౭

టీక॥ సా(అధ్యాహృతము) = ఆ మంథర; చిత్రైః = నానావర్ణముల గు; మేఖలాదామభిః = మొలనూళ్ల చేతను; అన్యైః = ఇతరములయిన; బహుభిః = పెక్కులయిన; శుభభూషణైః = మంచిసొమ్ములచేతను; బద్ధా = కట్టఁబడినదై; రజ్జుబద్ధా = త్రాటిచేఁగట్టఁబడిన; వానరీవ = ఆఁడుకోఁతివలె; బభాసే = ప్రకాశించినది.

మంథర, మఱియు, నానావర్ణంబులగు మొలనూళ్లచేతను, మఱియుఁ బెక్కు భూషణంబుల చేతం గట్టఁబడి, త్రాటం గట్టినకోఁతివలెఁ బ్రకాశించుచుండినది. అని, తాత్పర్యము.

తాం సమీక్ష్య తదా ద్వాస్థాః సుభృశం పాపకారిణీమ్
గృహీత్వాఽకరుణాం కుబ్జాం శత్రుఘ్నాయ న్యవేదయన్. ౮

టీక॥ తదా = అప్పుడు; ద్వాస్థాః = ద్వారంబుననున్నవారలు; సుభృశం = మిక్కిలియు నధికముగా; పాపకారిణీం = పాపముసేయునదియు; అకరుణాం = దయలేనిదియునగు; తాం = ఆ; కుబ్జాం = మంథరను; సమీక్ష్య = చూచి; గృహీత్వా = పట్టుకొని; శత్రుఘ్నాయ = శత్రుఘ్నునికొఱకు; న్యవేదయన్ = అప్పగించిరి.

అప్పుడు, ద్వారపాలకులు, మహాపాపిష్ఠురాలునునిర్దయురాలునగు నామంథరంజూచి, దానింబట్టుకొని, శత్రుఘ్నునకప్పగించిరి.

అని, తాత్పర్యము.

యస్యాః కృతే వనే రామో న్యస్తదేహశ్చ వః పితా
సేయం పాపా నృశంసాచ తస్యాః కురు యథామతి. ౯

టీక॥ యస్యాఃకృతే = ఎవ్వతెనిమిత్తము; రామః = రాముఁడు; వనే = అడవియందు; అభూత్ (అధ్యాహృతము) = ఉండెనో; వః = మీయొక్క; పితాచ = తండ్రియగుదశరథమహారాజును; న్యస్తదేహః = విడువఁబడినదేహముగలవాఁడో; సా = అట్టి; పాపా = పాపిష్ఠురాలును; నృశంసాచ =

క్రూరురాలును; ఇయం=ఈబిడ . తస్యాః= అట్టిదానికి; యథామతి=బుద్ధికిందోఁచునట్లు; కురు=చేయుము.

ఎవ్వతెవలన, రాముండడవికిఁబోయెనో, మీతండ్రిదశరథ మహారాజును, మృతుండయ్యెనో, అట్టిపాపిష్ఠురాలును క్రూరురాలును, ఈమంథరే; ఈబిడకు, నీమనసునకువచ్చినట్లుశిక్షచేయుము. అనిద్వారపాలకులు, శత్రుఘ్నునకుఁజెప్పిరి.

అని, తాత్పర్యము.

శత్రుఘ్నశ్చ తదాజ్ఞాయ వచనం భృశ దుఃఖితః
అంతఃపురచరాన్ సర్వా నిత్యువాచ ధృతవ్రతః. ౧౦

టీక॥ధృతవ్రతః= ధరింపఁబడినవ్రతముగల; శత్రుఘ్నశ్చ = శత్రుఘ్నుండును, తత్=ఆ; వచనం= మాటను; ఆజ్ఞాయ= ఎఱింగి; భృశదుఃఖితః=మిక్కిలియుదుఃఖమునొందినవాఁడై ;అంతఃపురచరాన్ = అంతఃపురంబునందిరుగువారలను; సర్వాన్= అందఱనుగూర్చి; ఇతి=అని; ఉవాచ=చెప్పెను.

వ్రతనియమంబు గల శత్రుఘ్నుండు, ద్వారపాలకులుచెప్పినమాటనువిని, పరమదుఃఖితుండై, యంతఃపురంబుననున్న వారలనందఱంజూచి, యిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

తీవ్ర ముత్పాదితం దుఃఖం భ్రాతౄణాం మే తథా పితుః
యయా సేయం నృశంసస్య కర్మణః ఫల మశ్నుతామ్. ౧౧

టీక॥ యయా= ఎవ్వతెచేత; మే= నాయొక్క; భ్రాతౄణాం= అన్నలకును; తథా=అట్లు; పితుః=తండ్రికిని; తీవ్రం= తీక్ష్ణమయిన; దుఃఖం= దుఃఖము; ఉత్పాదితం= కలిగింపఁబడినదో; సా=అట్టి; ఇయం= ఈమంథర; నృశంసస్య=క్రూరమయిన; కర్మణః=కార్యముయొక్క; ఫలం=ఫలమును; అశ్నుతాం=అనుభవించుఁగాక.

ఎవ్వతెవలన, నాయన్నలకును తండ్రికిని ఇట్లుతీవ్రదుఃఖంబుగలిగినదో, అట్టియీమంథర, తనక్రూరకార్యమునకుం గల్గుఫలమునిప్పుడనుభవించుఁగాక. అని, శత్రుఘ్నుండుచెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తాతు తేనా శు సఖీజనసమావృతా
గృహీతా బలవ త్కుబ్జా సాత ద్గృహ మనాదయత్. ౧౨

టీక॥ సఖీజనసమావృతా=చెలికత్తెజనములచేఁజుట్టఁబడిన; సా=ఆ; కుబ్జా=మంథర; తేన=అశత్రుఘ్నునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తాతు=చెప్పఁబడినదైయే; ఆశు=శీఘ్రముగా; బలవత్=బలాత్కారముచేత; గృహీతా=పట్టుకొనఁబడినదై; తత్=ఆ; గృహం=ఇంటిని; అనాదయత్=ధ్వనింపఁజేసెను.

అంత, శత్రుఘ్నుం, డిట్లుచెప్పి, చెలికత్తెలచేఁబరివేష్టింపఁబడియున్న మంథరను బలాత్కారంబునంబట్టుకొనఁగానే, యాబిడ, యాగృహంబంతయు ధ్వనించునట్లు, గట్టిగానఱచినది. అని, తాత్పర్యము.

తత స్సుభృశసంత ప్త స్తస్యా స్సర్వ స్సఖీజనః
కృద్ధ మాజ్ఞాయ శత్రుఘ్నం విపలాయత సర్వశః. ౧౩

టీక॥ తతః=అటుపిమ్మట; తస్యాః=ఆమంథరయొక్క; సఖీజనః=చెలికత్తెజనము; సర్వః=అంతయు; శత్రుఘ్నం=శత్రుఘ్నుని; కృద్ధం=కోపించినవానిఁగా; ఆజ్ఞాయ=తెలిసికొని; సుభృశసంతప్తః=మిక్కిలియుదుఃఖితయయి; సర్వశః=అన్నివిధములను; విపలాయత=పరుగెత్తినది.

అంత, నామంథరచెలికత్తెలందఱు, శత్రుఘ్నుండు కృద్ధుండై యుండుటం జూచి, పరమదుఃఖితలయి, నానావిధంబులం బాఱిరి. అని, తాత్పర్యము.

ఆమంత్రయత కృత్స్న శ్చ తస్యా స్సర్వ స్సఖీజనః

టీక॥ తస్యాః=ఆమంథరయొక్క; సర్వః=సమస్తమైన; సఖీజనః=చెలికత్తెజనము; కృత్స్న శ్చ=అంతయు; ఆమంత్రయత=ఆలోచించినది.

ఆమంథరచెలికత్తె లందఱు, నిట్లని, యాలోచించుకొనిరి. అని, తాత్పర్యము.

యథా యం సముపక్రాంతో నిశ్శేషా న్నః కరిష్యతి. ౧౪

టీక॥అయం=ఈశత్రుఘ్నుండు;యథా=ఎట్లు; సముపక్రాంతః=ఆరంభించినాఁడో;తథా(అధ్యాహృతము)=అట్లు;నః=మమ్ము లను;నిశ్శేషాన్=మిగతలేనివారలనుగా;కరిష్యతి= చేయఁగలఁడు.

ఈశత్రుఘ్నుని యారంభంబుఁజూడఁగా,నితండు,మనలనందఱు, నిశ్శేషంబుగావధించునట్లున్నది.

అని, తాత్పర్యము.

సానుక్రోశాం వదాన్యాంచ ధర్మజ్ఞాంచ యశస్వినీమ్
కౌసల్యాం శరణం యామ సాహినోస్తు ధ్రువా గతిః. ౧౫

టీక॥సానుక్రోశాం= దయతోఁగూడినదియు;వదాన్యాంచ=మధురముగామాటలాడునదియు; ధర్మజ్ఞాంచ=ధర్మంబునెఱింగినదియు;యశస్వినీం=ప్రశస్తమయినకీర్తిగలదియునగు; కౌసల్యాం=కౌసల్యను; శరణం= రక్షకురాలనుగా ; యామ = పొందుదము ; సా= ఆబిడయే; నః = మనకు; ధ్రువా=నిశ్చితమయిన; గతిః=గతి; అస్తు=అగుఁగాక.

దయగలదియు మధురముగా మాటలాడునదియు ధర్మజ్ఞయుమహాకీర్తిశాలినియునగుకౌస్యనుశరణుజొత్తము; ఆబిడయేమనలంగా పాడగలదు, అని, యామంథర చెలికత్తెలు,పరస్పరమునాలోచించుకొనిరి.

అని, తాత్పర్యము.

సచ రోషేణ తామ్రాక్షః శ్శత్రుఘ్న శ్శత్రుతాపనః
విచకర్ష తదా కుబ్జాం క్రోశంతీం ధరణీతలే. ౧౬

టీ॥శత్రుతాపనః=శత్రువులఁదపింపఁజేయునట్టి;సః=ఆ;శత్రుఘ్నశ్చ=శత్రుఘ్నుండును;రోషేణ= కోపముచేత; తామ్రాక్షః==ఎఱ్ఱనికండ్లుగలవాఁడై; తదా=అప్పుడు;క్రోశంతీం=అఱచుచున్న; కుబ్జాం=మంథరను; ధరణీతలే=భూతలమునందు;విచకర్ష=ఈడ్చెను.

అంత; శత్రువులందపింపఁజేయునట్టిశత్రుఘ్నుండు, కోపంబునఁ,గన్నులనెఱ్ఱఁదనంబుగదుర,రోదనంబుసేయుచున్నమంథరను;నేలంబడవైచి , యీడ్చుకొనిపోయెను.అని, తాత్పర్యము.

తస్యాహ్యా కృష్యమాణాయా మంథరాయా స్తత స్తతః
చిత్రం బహు విధం భాండం పృథివ్యాం తద్వ్యశీర్యత. ౧౭

టీక॥ ఆకృష్యమాణాయాః= ఈడ్వఁబడుచున్న ; తస్యాః= ఆ; మంథరాయాః=మంథరయొక్క; చిత్రం=ఆశ్చర్యకరమయిన; బహువిధం= పెక్కువిధమయిన;తత్=ఆ; భాండం= సొమ్ము; పృథివ్యాం=భూమియందు; తతస్తతః=అంతనంత;వ్యశీర్యతహి=రాలినదిగదా

శత్రుఘ్నుండట్లు , మంథరం బట్టియీడ్వఁగానే, యప్పుడామంథర యొడలిపైనున్న నానావిధంబులగు భూషణంబులు నేలపై రాలినవి,

అని, తాత్పర్యము.

తేన భాండేన సం స్తీర్ణం శ్రీమ ద్రాజనివేశనమ్
అశోభత తదా భూయ శ్శారదం గగనం యథా. ౧౮

టీక॥ తదా=అప్పుడు ; తేన=ఆ; భాండేన= సొమ్ముచేత; సం స్తీర్ణం= వ్యాపింపఁబడిన;శ్రీమత్= అధికమయిన కాంతిగల;రాజనివేశనం= రాజగృహము; శారదం = శరదృతువునందలి; గగనంయథా= ఆకాశమువలె; భూయః= మిక్కిలియు; అశోభత=ప్రకాశించినది.

అప్పుడు , ఆభూషణంబులు రాలియుండుటంజేసి , కాంతిమంతంబగు, రాజగృహంబంతయు , శరదృతువునందు స్వచ్ఛ నక్షత్రంబులతోఁ గూడియుండునాకాశంబువలె, మిక్కిలియుఁ బ్రకాశించినది. అని, తాత్పర్యము.

స బలీ బలవ త్క్రోధా ద్గృహీత్వా పురుషర్షభః
కైకేయీ మభినిర్భర్త్స్య బభాషే పరుషం వచః. ౧౯

టీక॥ పురుషర్షభః = పురుషశ్రేష్ఠుండగు; బలీ=అధికంబగుబలముగల; సః = ఆశత్రుఘ్నుండు;క్రోధాత్= కోపమువలన; బలవత్ =బలాత్కారముగా ; గృహీత్వా= పట్టుకొని;కైకేయీం=కైకేయిని; అభినిర్భర్త్స్య= నిందించి; పరుషం= కఠినమగు ; వచః=మాటను;బభాషే=చెప్పెను.

పురుషశ్రేష్ఠుండును బలవంతుండు నగు నాశత్రుఘ్నుండు, పరమకోపంబున, బలాత్కారముచే, నామంథరంబట్టుకొని, యాబిడనువిడిపింప వచ్చిన కైకేయి నదలించి, పరుషంబులగుమాటలందిరస్కరించెను.

అని, తాత్పర్యము.

తైర్వాక్యైః పరుషైర్దుఃఖైః కైకేయీ భృశదుఃఖితా
శత్రుఘ్నభయసంత్రస్తా పుత్రం శరణ మాగతా. ౨౦

టీక॥ కైకేయీ= కైకేయి; తైః= ఆ; పరుషైః=కఠినములును;దుఃఖైః= దుఃఖకరంబులునగు;వాక్యైః=మాటల చేత; భృశదుఃఖితా=మిక్కిలియుదుఃఖమునొందినదై ; శత్రుఘ్నభయసంత్రస్తా=శత్రుఘ్నునివలని భయమువలన భయపడినదై; పుత్రం=కొడుకైనభరతుని; శరణం= రక్షకునిగా ఆగతా= పొందినది.

కైకేయి, శత్రుఘ్నుండు చెప్పినపరుష వచనంబులకుం బరమ దుఃఖితయయి,శత్రుఘ్నుండేమిసేయునోయని మిక్కిలియు భయమునొంది, తన కొడుకును భరతుని శరణుచొచ్చినది.

అని, తాత్పర్యము.

తాం ప్రేక్ష్య భరతః క్రుద్ధం శత్రుఘ్న మిద మబ్రవీత్
అవధ్యా స్సర్వభూతానాం ప్రమదాః క్షమ్యతా మితి. ౨౧

టీక॥ భరతః=భరతుఁడు; తాం= ఆకైకేయిని;ప్రేక్ష్య=చూచి;క్రుద్ధం= కోపించిన; శత్రుఘ్నం= శత్రుఘ్నుని గూర్చి; "సర్వభూతానాం=సమస్తప్రాణులలోపలను; ప్రమదాః= స్త్రీలు; అవధ్యాః= చంపఁదగనివారలు; క్షమ్యతాం=ఓర్చుటయగుఁగాక" ఇతి=అని; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, భరతుం, డాకైకేయిపాటుంజూచి, శత్రుఘ్నుండు క్రుద్ధుండై యుండుట నెఱింగి,యతనింజూచి, "సమస్తప్రాణులయందును స్త్రీలంజంపరాదు; కావున, ఓర్పుదెచ్చుకొనుము" అనియీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

హన్యా మహ మిమాం పాపాం కైకేయీం దుష్టచారిణీమ్
యదిమాం ధార్మికో రామో నాసూయేన్మాతృఘాతకమ్. ౨౨

టీక॥ధార్మికః = ధర్మమునాచరించునట్టి; రామః= రాముఁడు; మాతృఘాతకం=తల్లినిజంపినట్టి; మాం= నన్ను; నాసూయేద్యది=నిందింపఁడేని; అహం=నేను; పాపాం=పాపిష్ఠురాలును; దుష్టచారిణీం= దుష్టకార్యములుచేయునదియునగు ; కైకేయీం = కైకేయిని;హన్యాం= చంపుదును.

ధార్మికుండగు రాముండు, మాతృఘాతకుండని నన్నునిందింపకుండునేని , నేనే పాపిష్ఠురాలును దుష్టురాలునగు నీ కైకేయిం జంపివేయుదును;అతండట్లు సేయఁడు; నాముఖమైనం జూడఁడు.

అని, తాత్పర్యము.

ఇమామపి హతాం కుబ్జాం యది జానాతి రాఘవః
త్వాంచ మాంచహి ధర్మాత్మా నాభిభాషిష్యతే ధ్రువమ్. ౨౩

టీక॥ధర్మాత్మా = ధర్మస్వభావుండగు; రాఘవః=రాముండు; ఇమామపి=ఈమంధరనైనను; హతాం=చంపఁబడినదానిఁగా; జానాతియది= ఎఱుంగునేని; త్వాంచ = నిన్నుఁగూర్చియు;మాంచ=నన్నుఁగూర్చియు; నాభిభాషిష్యతేహి= మాటలాడఁడుగదా! ధ్రువం=నిశ్చయము.

రాముండు, ఈమంధరనైనను మన ముచంపినట్లువినునేని ధర్మాత్ముండు కావున, స్త్రీవధ గావించితిమని,నీతోఁగాని, నాతోఁగాని యెంతమాత్రము మాటలాడఁడు; ఇది,నిశ్చయము. అని, భరతుండు,శత్రుఘ్నునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

భరతస్య వచశ్శ్రుత్వా శత్రుఘ్నో లక్ష్మణానుజః
న్యవర్తత తతో రోషాత్తాం ముమోచచ మంథరామ్. ౨౪

టీక॥లక్ష్మణానుజః=లక్ష్మణుని తమ్ముండగు; శత్రుఘ్నః = శత్రుఘ్నుండు;భరతస్య=భరతునియొక్క;వచః= మాటను; శ్రుత్వా=విని; తతః=అటు

విమ్మట; రోషాత్=కోపమునసుండి ; న్యవర్తత=మఱలెను. తాం=ఆ; మంథరాం=మంథరను;ము మోచచ= విడిచెను.

లక్ష్మణునితమ్ముండగు శత్రుఘ్నుండు, భరతునిమాటనువిని, యంతఁ గోపంబుచాలించి, యామంథరను విడిచిపెట్టెను. అని, తాత్పర్యము.

సా పాదమూలే కైకేయ్యా మంథరా నిపపాత హ
నిశ్శ్వసంతీ సుదుఃఖార్తా కృపణం విలలాపచ. ౨౫

టీక॥సా=ఆ;మంథరా=మంథర;కైకేయ్యాః=కైకేయియొక్క;పాదమూలే=పాదంబులమూలమునందు;నిపపాత=పడెను("హ"అనునది పాదపూరణార్థము)సుదుఃఖార్తా=మిక్కిలియుఁదుఃఖముచేఁబీడింపఁబడినదై; నిశ్శ్వసంతీ=నిట్టూర్పులువుచ్చుచు;కృపణం=దుఃఖము గలుగునట్లుగా; విలలాపచ= ఏడ్చెను.

అంత,నామంథర,కైకేయి పాదంబులంబడి, పరమదుఃఖితయయి,నిట్టూర్పువుచ్చుచు,రోదనంబుచేసెను.

అని, తాత్పర్యము.

శత్రుఘ్నవిక్షేపవిమూఢసంజ్ఞాం
సమీక్ష్య కుబ్జాం భరతస్య మాతా
శనైస్సమాశ్వాసయ దార్తరూపాం
క్రౌంచీం విలగ్నామివ వీక్షమాణామ్. ౨౬

టీక॥భరతస్య=భరతునియొక్క ; మాతా=తల్లియగుకైకేయి;శత్రుఘ్నవిక్షేపవిమూఢ సంజ్ఞాం = శత్రుఘ్నునిచేఁద్రిప్పుటచే మోహము నొందిన తెలివిగలదియు; ఆర్తరూపాం=దుఃఖితయయియున్నదియునగు; విలగ్నాం= వలలోఁదగులుకొన్న;వీక్షమాణాం=చూచుచున్న;క్రౌంచీమివ(స్థితాం)= ఆఁడుక్రౌంచపక్షివలెనున్నదియునగు; కుబ్జాం=మంథరను;శనైః=మెల్లఁగా; సమాశ్వాసయత్=ఊఱడించెను.

భరతునితల్లియగుకైకేయి, శత్రుఘ్నుండుపట్టి యీడ్చుటచే మూర్ఛితయయివలలోఁదగులుకొనిభయంబునన లుదిక్కులంజూచుచున్న క్రౌంచ పక్షివలెఁ,బరమదుఃఖితయయి రోదనంబుసే

యుచున్న సుంధరంబూచి, యాబిడను, మెల్ల మెల్లఁగానాశ్వాసించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, అష్టసప్తతితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండాష్టసప్తతితమసర్గటీక, ముగిసినది.

---

శ్రీః

ఏకోనాశీతితమసర్గప్రారంభః.

తతః ప్రభాతసమయే దివసేచ చతుర్దశే
సమేత్య రాజకర్తారో భరతం వాక్య మబ్రువన్. ౧

టీక॥ తతః= అటుపిమ్మట; చతుర్దశే= పదునాలవదగు; దివసేచ= దినమునందును; ప్రభాతసమయే= ప్రాతఃకాలమునందు; రాజకర్తారః= రాజుగాఁజేయువారలు; సమేత్య=చేరి; భరతం= భరతునిగూర్చి; వాక్యం= మాటను; అబ్రువన్= చెప్పిరి.

అంత, బదునాల్గవ దినంబు ప్రాతఃకాలంబున, రాజునకుఁ బట్టాభిషేకము సేయువారలందఱువచ్చి, భరతుంజూచి, యిట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

గతో దశరథ స్స్వర్గం యో నో గురుతరో గురుః
రామం ప్రవ్రాజ్యవై జ్యేష్ఠం లక్ష్మణంచ మహాబలమ్. ౨

టీక॥ యః=ఎవ్వఁడు; నః=మనకు; గురుతరః=మిక్కిలియునధికుఁడైన; గురుః= గురువో; సః(అధ్యాహృతము)=అట్టి; దశరథః=దశరథమహారాజు; జ్యేష్ఠం=

పెద్దకొడుకయిన; రామం=రామునిః మహాబలం= అధికమైనబలముగల; లక్ష్మణంచ=లక్ష్మణుని ; ప్రవ్రాజ్య= అడవికిఁబంపి; స్వర్గం=స్వర్గంబును; గతః=పొందినాఁడు.

మనకుఁబరమగురువైన; దశరథ మహారాజు, జ్యేష్ఠపుత్రుండగురాముని, మహాబలుండగులక్ష్మణుని, వనంబునకుఁబంపి, తానునుమృతిఁబొందెను.

అని, తాత్పర్యము.

త్వ మద్య భవ నో రాజా రాజపుత్ర మహాయశః
సంగత్యా నాపరాధ్నోతి రాజ్య మేత దనాయకమ్. ౩

టీక॥ మహాయశః= అధికమయినకీర్తిగల; రాజపుత్ర=రాచకొమరుఁడవగు భరతుఁడా! త్వం=నీవు ; అద్య= ఇప్పుడు; నః=మాకు; రాజా= రాజవు; భవ=అగుము. అనాయకం= ప్రభుత్వములేని; ఏతత్=ఈ; రాజ్యం= రాజ్యము; సంగత్యా= దైవగతిచేత= నాపరాధ్నోతి= అపరాధముసేయకున్నది.

మహాబలశాలివయిన రాజపుత్రుండవగుభరతుఁడా! ఇప్పుడు, నీవు, మాకురాజవగుము; ఈరాజ్యంబింతవఱకు ననాయకంబయ్యు, దైవయోగంబున, జనులు, పరస్పరముహింసించుకొనకున్నారు, గాని, వేఱుకాదు; గావునజాగుసేయక; నీవుపట్టాభిషిక్తుండవగుము.

అని, తాత్పర్యము,

ఆభిషేచనికం సర్వ మిద మాదాయ రాఘవ
ప్రతీక్షతే త్వాం స్వజన శ్శ్రేణయశ్చ నృపాత్మజ. ౪

టీక॥ నృపాత్మజ=రాచకొమరుండవగు; రాఘవ=భరతుఁడా! ఇదం= ఈ; ఆభిషేచనికం=పట్టాభిషేకయోగ్యమగుపదార్థమును; సర్వం= అంతను; ఆదాయ=తీసికొని; స్వజనః=నీయొక్కజనము; త్వాం=నిన్ను; ప్రతీక్షతే= ఎదురుచూచుచున్నది. శ్రేణయశ్చ = పట్టణవాసిజలును ; ప్రతీక్షంతే (అధ్యాహృతము)= ఎదురుచూచుచున్నారు.

రాచకొమరుండవగుభరతుఁడా! పట్టాభిషేకమునకుఁగావలసిన పదార్థం

బులనన్నింటినిం దీసికొని, మంత్రులు మున్నగువారలును, బట్టణంబున నుండుజనులును, నీకెదురుసూచుచున్నారు.

అని, తాత్పర్యము.

రాజ్యం గృహాణ భరత పితృపైతామహం ధ్రువమ్
అభిషేచయ చాత్మానం పాహి చాస్మా న్నరర్షభ. ౫

టీక॥ భరత=భరతుఁడా! పితృపైతామహం= తండ్రితాతలనుండివచ్చినదియు; ధ్రువం=చంచలముకానిదియునగు; రాజ్యం=రాజ్యమును; గృహాణ=పుచ్చుకొనుము. ఆత్మానం = నిన్ను; అభిషేచయచ=అభిషేకించుకొనుము. నరర్షభ = పురుషశ్రేష్ఠుండవగుభరతుఁడా! అస్మాంశ్చ = మమ్ములను; పాహి=కాపాడుము.

పురుషశ్రేష్ఠుండవగు భరతుఁడా! తండ్రితాతలనాఁటనుండి పరంపరాక్రమంబునవచ్చినదియు స్థిరంబునగు రాజ్యంబునుగ్రహించి, పట్టాభిషేకంబుగావించుకొని, మాబోంట్లనందఱంగాపాడుము. అని, రాజాభిషేకముసేయువారలు, భరతునికింజెప్పిరి.

అని, తాత్పర్యము.

ఆభిషేచనికం భాండం కృత్వా సర్వం ప్రదక్షిణమ్
భరత స్తం జనం సర్వం ప్రత్యువాచ ధృతవ్రతః. ౬

టీక॥ భరతః=భరతుఁడు; ధృతవ్రతః=ధరింపఁబడినవ్రతముగలవాఁడై; సర్వం=సమస్తమయిన; ఆభిషేచనికం=పట్టాభిషేకోపయుక్తమగు; భాండం=పదార్థమును గూర్చి ; ప్రదక్షిణం= ప్రదక్షిణమును; కృత్వా=చేసి; తం=ఆ; జనం= జనమును; సర్వం= అంతనుగూర్చి; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

భరతుండు, తననియమంబువదలక, పట్టాభిషేకంబునకై సంపాదింపఁబడియున్నపదార్థంబులనన్నింటికిని, బ్రదక్షిణంబుఁగావించి, రాజాభిషేకకర్తలగునాపురుషులనందఱంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

జ్యేష్ఠస్య రాజతా నిత్య ముచితా హి కులస్య నః
నైవం భవంతో మాం వక్తు మర్హంతి కుశలా జనాః. ౭

టీక॥నః= మాయొక్క; కులస్య= వంశమునకు; నిత్యం=ఎల్లప్పుడును; జ్యేష్ఠస్య=పెద్దకొడుకుయొక్క; రాజతా= రాజగుట; ఉచితాహి= తగినదిగదా! కుశలాః=సమర్థులగు; జనాః=జనులయిన; భవంతః=మీరు; మాం= నన్ను గూర్చి; ఏవం=ఇట్లు;వక్తుం= చెప్పుటకు;నార్హంతి=తగరు;

మావంశంబున,జ్యేష్ఠుండు రాజగుట యేకదాయుక్తము! అట్లుండుట వలన సమస్తమును దెలిసినట్టిమీరు, నన్నుఁజూచి,యిట్టిమాటలాడందగదు.

అని, తాత్పర్యము.

రామః పూర్వో హి నో భ్రాతా భవిష్యతి మహీపతిః
అహం త్వరణ్యే వత్స్యామి వర్షాణి నవ పంచ చ. ౮

టీక॥నః=మాకు;పూర్వః=మొదటఁబుట్టిన;భ్రాతా= తోఁబుట్టువైన; రామోహి= రాముండే;మహీపతిః=భూమికిఁబ్రభువు;భవిష్యతి=కాఁగలఁడు.అహంతు=నేనును; నవ= తొమ్మిదియు; పంచచ=ఐదును,పదునాలుగుననుట;వర్షాణి=సంవత్సరములను;అరణ్యే=అడవియందు;వత్స్యామి=ఉండెదను.

మాకుజ్యేష్ఠభ్రాతయగు రాముండే, రాజుకావలయును; నేను,అతనికిబదులుగాఁ, బదునాలుగుసంవత్సరంబులు, వనంబుననుండెదను.

అని, తాత్పర్యము.

యుజ్యతాం మహతీ సేనా చతురంగమహాబలా
ఆనయిష్యామ్యహం జ్యేష్ఠం భ్రాతరం రాఘవం వనాత్. ౯

టీక॥ చతురంగమహాబలా=నాలుగంగములుగలదియు, నధికమయినబలముగలదియునగు; మహతీ=పెద్దదగు; సేనా=సేన; యుజ్యతాం=సూపఁబడుఁగాక. అహం=నేను; జ్యేష్ఠం=పెద్దవాఁడైన;భ్రాతరం=తోఁబుట్టువగు;

రాఘవం=రాముని; వనాత్=అడవినుండి; ఆనయిష్యామి(ఆనేష్యామి)= తోడొ్కొనివచ్చెదను.

నేను, వనంబునకుఁబోయి, నాజ్యేష్ఠభ్రాతయగు రామునిం దోడొ్కొనివచ్చెదను; చతురంగబలంబులతోఁ గూడిన గొప్పసేనను రావింపుఁడు; దానితోఁగూడఁ, బోయెదను. అని, తాత్పర్యము.

అభిషేచనికం చైవ సర్వ మేత దుపస్కృతమ్
పురస్కృత్య గమిష్యామి రామహేతో ర్వనంప్రతి. ౧౦

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను; ఉపస్కృతం= సంస్కరింపఁబడిన; ఏతత్=ఈ; అభిషేచనికం= అభిషేకోపయుక్తమగుపదార్థమును; సర్వంచైవ=అంతను; పురస్కృత్య= మున్నిడుకొని; రామహేతోః=రామునినిమిత్తమయి; వనంప్రతి = అడవినిగూర్చి; గమిష్యామి=పోయెదను.

ఇప్పుడు, పట్టాభిషేకంబునకై సంపాదించియున్న పట్టాభిషేకోపయుక్తద్రవ్యంబులనన్నింటిని, రామపట్టాభిషేకంబునకై, నాతోఁగూడం దీసికొని, వనంబునకుఁబోయెదను.

అని, తాత్పర్యము.

తత్రైవ తం నరవ్యాఘ్ర మభిషిచ్య పురస్కృతమ్
ఆనేష్యామి తు వై రామం హవ్యవాహ మివాధ్వరాత్. ౧౧

టీక॥ అహం(అధ్యాహృతము)= నేను; తత్రైవ = అచ్చటనే; పురస్కృతం=పూజింపఁబడినవాఁడును; నరవ్యాఘ్రం=పురుషశ్రేష్ఠుండునగు; తం=ఆ; రామంతువై=రాము; నే అభిషిచ్య=అభిషేకించి; అధ్వరాత్=యాగముననుండి, యాగశాలనుండియనుట; హవ్యవాహమివ= అగ్నిహోత్రమునువలె; ఆనేష్యామి=తోడొ్కొనివచ్చెదను.

పూజ్యుండునుబురుషశ్రేష్ఠుండునగు రామునకు, ఆవనంబుననే, పట్టాభిషేకంబుగావించి, యాగశాలనుండి, యగ్నిహోత్రంబును గృహంబునకుఁ గొనివచ్చునట్లు, ఆయనను, వనంబుననుండి, యిచ్చటికిఁదోడొ్కొనివచ్చెదను.

అని, తాత్పర్యము.

న సకామాం కరిష్యామి స్వా మిమాం మాతృగంధినీమ్

వనే వత్స్యామ్యహం దుర్గే రామో రాజా భవిష్యతి. ౧౨

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;ఇమాం=ఈ; మాతృగంధినీం=తల్లి వాసనగల;సకామాం = కోర్కెతోఁ గూడినదానిఁగా;నకరిష్యామి= చేయను.అహం= నేను;దుర్గే=ఘోరనలవిగాని;వనే=అడవియందు;వత్స్యామి=ఉండెదను.రామః = రాముండు;రాజ్ఞా=రాజు;భవిష్యతి=కాఁగలఁడు.

తల్లియనే పేరుమాత్రముగలయీ కైకేయి కోరికని మట్టుకు, నేనెంత మాత్రము,సఫలముగావింపను; నేను,గహనంబగునరణ్యంబుననుండెదను; రాముండురాజుకాఁగలఁడు.

అని,తాత్పర్యము.

క్రియతాం శిల్పిభిః పంథా స్సమాని విషమాణిచ
రక్షిణ శ్చానుసంయాంతు పథి దుర్గవిచారకాః. ౧౩

టీక॥శిల్పిభిః= శిల్పులచేత;విషమాణి=మిట్టపల్లములు ; సమానిచ=సములుగాను; పంథాః = మార్గము; క్రియతాం=చేయఁబడుఁగాక. పథి=మార్గమునందు; దుర్గవిచారకాః=ఘోనలవిగాని స్థలంబులువిచారించునట్టి; రక్షిణశ్చ=రక్షకపురుషులను; అనుసంయాంతు= వెంబడింతురుగాక.

శిల్పులు,విషమస్థలంబుల సములుగాఁజేసిమార్గంబుసేయునట్లాజ్ఞాపింపుఁడు ; మఱియు, మార్గంబున,దుర్గమప్రదేశంబులుదెలిసిన రక్షకపురుషులనువెంబడింతురుగాక. అని , భరతుఁడు రాజాభిషేకకర్తలగు వారితోఁజెప్పెను. అని,తాత్పర్యము.

ఏవం సంభాషమాణం తం రామహేతో నృపాత్మజమ్
ప్రత్యువాచ జన స్సర్వ శ్శ్రీమ ద్వాక్య మనుత్తమమ్. ౧౪

టీక॥జనః=జనము ; సర్వః=అంతయు; ఏవం=ఇట్లు;రామహేతోః=రామునినిమిత్తమయి;సంభాషమాణం=చెప్పుచున్న;తం=ఆ ; నృపాత్మజం=రాచకొమరుండగు భరతునిగూర్చి , శ్రీమత్=ఉత్తమంబును; అనుత్తమం=తనక




న్ననుత్తమ మయినది లేనిదియునగు; వాక్యం=మాటను; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

రాజాభిషేక కర్తలగు జనులు, ఇట్లు రామునియందతిభక్తితో మాటలాడుచున్నయాభరతుంజూచి, పరమార్థంబగు,నీమాటం, జెప్పిరి

అని, తాత్పర్యము.

ఏవం తే భాషమాణస్య పద్మా శ్రీ రుపతిష్ఠతాత్
యస్త్వం జ్యేష్ఠే నృపసుతే పృథివీం దాతు మిచ్ఛసి. ౧౫

టీక॥ యః=ఏ; త్వం=నీవు; జ్యేష్ఠే=పెద్దవాఁడగు; నృపసుతే= రాచకొమరుండగు రామునియందు; పృథివీం = భూమినిః దాతుం=ఇచ్చుటకు; ఇచ్ఛసి= కోరుచున్నావో; తస్య (అధ్యాహృతము)=అట్టి; ఏవం=ఇట్లు; భాషమాణస్య=చెప్పుచున్న; తే = నీయొక్క; పద్మా = కమలంబుననుండునట్టి; శ్రీః=లక్ష్మీ; ఉపతిష్ఠతాత్= సమీపమునందుండుఁగాక.

నీవు, జ్యేష్ఠుండగు రామునికి, రాజ్యంబివ్వవలయునని, కోరుచున్నావే; అట్టిధర్మిష్ఠంబులగు మాటలు చెప్పుచున్న నీకుఁ బద్మాలయయగు లక్ష్మిప్రసన్నయయినీయొద్ద నెల్లప్పుడునుండుఁగాక.
అని, రాజాభిషేకకర్తలగు పురుషులు భరతునితోఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

అనుత్తమం తద్వచనం నృపాత్మజ
ప్రభాషితం సంశ్రవణే నిశమ్య చ
ప్రహర్షజా స్తం ప్రతి బాష్పబిందవో
నిపేతు రార్యాననేత్ర సంభవాః. ౧౬

టీక॥ సంశ్రవణే=ప్రతిజ్ఞావిషయమునందు; నృపాత్మజప్రభాషితం=రాచకొమరుఁడగుభరతునిచేఁ జెప్పఁబడిన; అనుత్తమం=తనకన్న నుత్తమములేని; తత్=ఆ; వచనం= మాటను; నిశమ్య చ=వినియు; తం ప్రతి= ఆభరతునిగూర్చి; ప్రహర్షజాః= సంతోషంబునం గలిగిన; ఆర్యాననేత్రసంభవాః = పూజ్యులగు రాజ్యాభిషేకకర్తలయొక్క ముఖములందలికండ్లవలనంగలిగిన;




బాష్పబిందవః=కన్నీళ్లబిందువులు;నిపే తుః=పడినవి.

రామునిందోడ్కొని రావలయున నుప్రతిజ్ఞ విషయమయి, రాచకొమరుం డగుభరతుండు చెప్పిన, యుత్తమంబగు మాటనువిని,పూజ్యులగు రాజాభిషేక కర్తలుమున్నగువారలు, పరమసంతో షంబునొంది, యానందబాష్పంబులొ లికించిరి. అని, తాత్పర్యము.

ఊచు స్తే వచన మిదం నిశమ్య హృష్టా
స్సామాత్యా స్సపరిషదో వియాతశోకాః
పంథానం నరవర భక్తిమాన్ జనశ్చ
వ్యాదిష్ట స్తవ వచనాచ్చ శిల్పివర్గః. ౧౭

టీక॥సామాత్యాః= మంత్రులతోఁ గూడినవారలును;సపరిషదః= సభతోఁ గూడినవారలునగు;తే=ఆరాజాభిషేక కర్తలు; నిశమ్య=విని;హృష్టాః=సంత సించినవారలై; వియాతశోకాః = పో యినదుఃఖముగలవారలై; "నరవర= పురుషశ్రేష్ఠుఁడవగు భరతుఁడా;తవ= నీయొక్క;వచనాత్=మాటవలన;భక్తి మాన్=రాజభక్తిగల; జనశ్చ=జనము ను; శిల్పివర్గశ్చ=శిల్పులసమూహమును; పంథానం=మార్గమునుగూర్చి=వ్యా దిష్టః=ఆజ్ఞాపింపఁబడినది" ఇతి (అధ్యా హృతము) అని;ఇదం=ఈ; వచనం= మాటను;ఊచుః=చెప్పిరి.

అంత, నా రాజాభిషేకకర్తలును మంత్రులును, మఱియు;నితరులునుసభి కులును, భరతునిమాటనువిని, దుఃఖం బువిడిచిపరమసంతుష్టులయి, భరతుం జూచి,"పురుషశ్రేష్ఠుఁడా!నీయాజ్ఞచొ ప్పున, రాజభక్తిగలరక్షకులనుమార్గ ముననుండుఁడనియు, మార్గంబుసరిసే యుఁడని, శిల్పులనుదిట్టము చేసినాము" అనియీమాటంజెప్పిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే,ఏకోనాశీతితమస్సర్గః.
ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ ద్వ్యశీతితమసర్గటీక, ముగిసినది.

---

(శ్రీ)

## అశీతితమసర్గప్రారంభః.

అథ భూమిప్రదేశజ్ఞా స్సూత్రకర్మవిశారదాః
స్వకర్మాభిరతా శ్శూరాః ఖనకా యంత్రకా స్తథా. ౧
కర్మాంతికా స్థపతయః పురుషా యంత్ర కోవిదాః
తథా వార్ధకయ శ్చైవ మార్గిణో వృక్షతక్షకాః. ౨
కూపకారా స్సుధాకారా వంశకర్మకృత స్తథా
సమర్థా యేచ ద్రష్టారః పురత స్తే ప్రతస్థిరే. ౩

టీక॥ అథ=అటుపిమ్మట; భూమిప్రదేశజ్ఞాః =భూమిప్రదేశంబుల నెఱింగినవారలును; సూత్రకర్మవిశారదాః= సూత్రములతోఁజేయు కార్యములయందుఁబండితులయినవారలును; స్వకర్మాభిరతాః= తమకార్యమునందాసక్తులును; శూరాః= యుద్ధమునందుభయము లేనివారలునగు రక్షకులును; ఖనకాః= త్రవ్వువారలును; తథా = అట్లు; యంత్రకాః = యంత్రములు సేయువారలును; కర్మాంతికాః = కూలివాండ్రును; స్థపతయః = పెద్దశిల్పులును; పురుషాః= అధ్యక్షులగు రాజపురుషులును; యంత్రకోవిదాః = యంత్రములందుఁ బండితులయినవారలును; తథా = అట్లు; వర్ధకయశ్చైవ= వడ్లవాండ్రును; మార్గిణః= మార్గములు సేయువారలును; వృక్షతక్షకాః=వృక్షములను నఱకువారలును; కూపకారాః= బావులు సేయువారలును; సుధాకారాః=సున్నపుపని చేయువారలును; తథా = అట్లు; వంశకర్మకృతః= వెదురుపనులను జేయువారలును; సమర్థాః = సమర్థులును; ద్రష్టారశ్చ= చూచువారలును, మార్గంబుఁజూచియున్నవారలనుట; యే=ఎవ్వరో; తే=వారలు; పుర

తః=ముందు; ప్రతస్థిరే=తరలిరి.

అంత, నమ్యైభూప్రదేశంబుల స్వభావంబు దెలిసినవారలును, అగాధంబులగు వాపీకూపంబులనుండిజలంబుఁజేఁదుటకుపయుక్తంబులగు సూత్రంబులు సేయువారలును, దమకార్యంబునం దతిజాగ్రత్తగల శూరులయిన రక్షకపురుషులును, ద్రవ్వువారలును, యంత్రంబులు సేయువారలును, గూలిపనివాండ్రును, శిల్పులును, అధ్యక్షులగు రాజపురుషులును, యంత్రకార్యంబుల సమర్థులగువారలును, వడ్లవాండ్రును, మార్గంబేర్పఱచువాండ్రును, మార్గంబునకడ్డముగానుండువృక్షంబుల నఱకివేయువారలును, బావులుద్రవ్వువారలును, సున్నంబుఁబూయువారలును, వెదుళ్లతోఁ బుటికెలు చేటలు మొదలగువానిని జేయువారలును, సమర్థులును బెక్కుమార్లు మార్గంబుఁజూచియనుభవంబుగలవీరలందఱును, ముందుగాఁబోయిరి.

అని, తాత్పర్యము.

సతు హర్షాత్తముద్దేశం జనౌఘో విపులః ప్రయాన్
అశోభత మహావేగ స్సముద్రఇవ పర్వణి. ౪

టీక॥ విపులః=అధికమయిన; సః=ఆ; జనౌఘః= జనసమూహము; హర్షాత్=సంతోషమువలన; తం=ఆ; ఉద్దేశం=ప్రదేశమునుగూర్చి; ప్రయాన్=పోవుచు; పర్వణి=పూర్ణిమయందు; మహావేగః=అధికమయినవేగముగల ; సముద్రఇవ=సముద్రమువలె ; అశోభత=ప్రకాశించినది.

అసంఖ్యంబగునామార్గముసరిసేయుజనులసమూహము, రామునింజూడఁగల్గునను సంతోషంబున, వేగంబున వనంబులకుఁబోవుచుండునపుడు, పూర్ణిమయందధికవేగంబుగల సముద్రంబువలెఁబ్రకాశించెను.

అని, తాత్పర్యము.

తే స్వవారం సమాస్థాయ వర్త్మకర్మణి కోవిదాః
కరణై ర్వివిధోపేతైః పురస్తాత్సంప్రతస్థిరే. ౫

టీక॥వర్త్మకర్మణి=మార్గకార్యమునందు; కోవిదాః= పండితులగు; తే=

వారలు; స్వవారం= తమసమూహము ను; సమాస్థాయ=పొంది ; వివిధోపే తైః = నానావిధములతోఁగూడిన; క రణైః=సాధనములతో; పురస్తాత్ = ముందుగా; సంప్రతస్థిరే=తరలిరి.

మార్గంబు బాగుపఱుచుటయందు సమర్థులగునాపనివాండ్రు , ఒక్కొ కపనివారు ఒక్కొకగుంపుగాఁజేరి, నా నావిధసాధనంబులం దీసికొని, ముందు గాఁబోయిరి. అని, తాత్పర్యము.

లతావలీశ్చ గుల్మాంశ్చ స్థాణూ నశ్మన ఏవచ
జనయాంచక్రిరే మార్గం ఛిందంతో వివిధాన్ ద్రుమాన్. ౬

టీక॥ తే(అధ్యాహృతము)= వార లు; లతావలీశ్చ = తీఁగెలపట్టుకలను; గుల్మాంశ్చ= బోదెలేనిచెట్లను ; స్థా ణూన్ = స్తంభములను; అశ్మనఏవ చ=ఱాళ్లను; వివిధాన్ = నానావిధ ములయిన; ద్రుమాన్=వృక్షములను ; ఛిందంతః=నఱుకుచు; మార్గం=మా ర్గమును; జనయాంచక్రిరే=కలుగఁజే సిరి.

వారలు,లతలను,గుల్మంబులను ఎం డిపోయిన స్తంభాకారంబులయి యుం డువృక్షములను, నానావిధ వృక్షముల ను, ఛేదించి, గహనంబగు నరణ్యంబు నమార్గంబుకలుగఁజేసిరి.

అని, తాత్పర్యము.

అవృక్షేషు చ దేశేషు కేచి ద్వృక్షా నరోపయన్
కేచి త్కుఠారై ష్టంకైశ్చ దాత్రై శ్ఛిం దన్ క్వచిత్క్వచిత్. ౭

టీక॥ కేచిత్=కొందఱు; అవృక్షే షు=చెట్లులేని; దేశేషుచ= ప్రదేశము లందును; వృక్షాన్=వృక్షములను; అరో పయన్=నాటిరి. కేచిత్=కొందఱు; క్వచిత్క్వచిత్= కొన్నికొన్నిచోట్లను; కుఠారైః=గొడ్డళ్లచేతను; టంకైశ్చ= గడ్డపాఱలచేతను; దాత్రైశ్చ= అంప ములచేతను; ఛిందన్ (అచ్ఛిందన్)= నఱికిరి.

కొందఱు, వృక్షంబులేనిస్థలంబులం దు, వృక్షంబులునాటిరి; కొందఱు , దారికడ్డమువచ్చువృక్షంబులు మున్నగు వానిని, గొడ్డళ్ల చేతను గడ్డపాఱలచే తను అంపములచేతను ఛేదించిరి.

అని, తాత్పర్యము.

అపరే వీరణ స్తంబాన్ బలినో బలవత్తరాః
విధమంతిస్మ దుర్గాణి స్థలానిచ తత స్తతః. ౮

టీక॥బలవత్తరాః= అధికమయినబలముగల;అపరే = మఱికొందఱు;బలినః=అధికమయినబలముగల;వీరణ స్తంబాన్=అవురుగడ్డిపుడకలను;విధమంతిస్మ=దహించిరి.తత స్తతః = అంతనంత;దుర్గాణి= చొరరానిప్రదేశములను;స్థలానిచ=సమములనుగాను; చక్రుః (అధ్యాహృతము)=చేసిరి.

బలవంతులగుమఱికొందఱు, ఛేదింపనలవిగాక,దట్టముగా మొలిచియున్న యవురుగడ్డిని,దహించి , పోనలవిగాని ప్రదేశంబులసమములుగాఁజేసిరి.

అని, తాత్పర్యము.

అపరే పూరయన్ కూపాన్ పాంసుభి శ్శ్వభ్రి మాయతమ్
నిమ్నభాగాం స్తతః కేచి త్సమాం శ్చక్రు స్సమంతతః. ౯

టీక॥అపరే=మఱికొందఱు; పాంసుభిః=మట్టిచేత;కూపాన్ = బావులను;ఆయతం=విశాలమయిన;శ్వభ్రిం=రంధ్రమును;అపూరయన్=నిండించిరి. తతః=అంత;కేచిత్=కొందఱు; సమంతతః=అంతటను; నిమ్నభాగాన్= పల్లపుప్రదేశములను; సమాన్=సమములనుగా;చక్రుః=చేసిరి.

మఱికొందఱు, దారికడ్డముగానుండుబావులను పెద్దపెద్దరంధ్రములను, మట్టిపోసిపూడ్చిరి;అంతఁ,గొందఱు, పల్లపునేలలను, మట్టిపోసి, సమప్రదేశంబులుగావించిరి.అని,తాత్పర్యము.

బబంధు ర్బంధనీయాం శ్చ క్షోద్యాన్ సంచుక్షుదు స్తదా
బిభిదు ర్భేదనీయాంశ్చ తాంస్తాన్ దేశా న్నరా స్తదా. ౧౦

టీక॥తదా=అప్పుడు;నరాః= ఆజనులు;తాంస్తాన్=ఆయా; దేశాన్=ప్రదేశములను,ప్రదేశములయందనుట;బంధనీయాన్=కట్టఁదగినవానిని;బబంధుః=బంధించిరి.క్షోద్యాన్= చూర్ణముచేయఁదగినవానిని;సంచుక్షుదుః = చూ

ణము చేసిరి. భేదనీయాంశ్చ= పగులఁగొట్టఁదగినవానిని; బిభిదుః= పగులఁగొట్టిరి.

అప్పుడు, వారలు, అమ్మై(?) దేశంబులందు, నదులు మొదలగువానికి సేతువులుగట్టిరి; చూర్ణము సేయఁదగిన మార్గమునందలి పొడిరాళ్లనుజూర్ణము గావించిరి; చెఱువులు మొదలగువానిజలంబుపోవుటకై, వానికట్టలంబగులఁగొట్టిరి. అని, తాత్పర్యము.

అచిరేణైవ కాలేన పరివాహాన్ బహూదకాన్
చక్రుర్బహువిధాకారాన్ సాగరప్రతిమాన్ బహూన్. ౧౧

టీక॥ తే(అధ్యాహృతము)= వారలు; అచిరేణ = శీఘ్రమయిన; కాలేనైవ= కాలముచేతనే; బహూన్= పెక్కులయిన; పరివాహాన్= అల్పప్రవాహములను; బహూదకాన్= అధికమయినజలముగలవానిఁగాను; సాగరప్రతిమాన్= సముద్రముతోఁబోలికగలవానిఁగాను; బహువిధాకారాన్= పెక్కువిధములైనయాకారములుగలవానిఁగాను; చక్రుః= చేసిరి.

వారలు, అతిశీఘ్రంబున, నల్పప్రవాహంబులకనేకములకుఁగట్టలుగట్టి, యవి, యధికజలంబుగలిగి, సముద్రంబునకు సాటియయియుండునట్లు, నానావిధంబులంగావించిరి. అని, తాత్పర్యము.

నిర్జలేషుచ దేశేషు ఖానయామాసు రుత్తమాన్
ఉదపానాన్ బహువిధాన్ వేదికా పరిమండితాన్. ౧౨

టీక॥ తే(అధ్యాహృతము)=వారలు; నిర్జలేషు= జలములేని; దేశేషుచ= దేశములందును; ఉత్తమాన్= శ్రేష్ఠములయినవియు; బహువిధాన్= పెక్కువిధములయినవియు; వేదికాపరిమండితాన్= తిన్నెలచేనలంకరింపంబడినవియునగు; ఉదపానాన్= నడబావులను; ఖానయామాసుః= త్రవ్వించిరి.

వారలు, నిర్జలప్రదేశములందు, మనుష్యులకునుపశువులకు నుపయోగమగునట్లు, నానావిధములగు నడబావులనుద్రవ్వి, నీళ్లుదీసికొనివచ్చునప్పుడలసటదీర్చుకొనుటకై యచ్చటచ్చట వేదికలును, నిర్మించిరి. అని, తాత్పర్యము.

స సుధాకుట్టిమతలః ప్రపుష్పితమహీరుహః
మత్తోద్ఘుష్ట ద్విజగణః పతాకాభి రలంకృతః. ౧౩
చందనోదకసంసిక్తో నానాకుసుమభూషితః
బహ్వ శోభత సేనాయాః పంథా స్సురపథోపమః. ౧౪

టీక॥ సుధాకుట్టిమతలః=సున్నముచేగట్టనచేసినభూమిగలదియు; ప్రపుష్పితమహీరుహః=చక్కఁగాఁబుష్పించినవృక్షములుగలదియు;మత్తోద్ఘుష్టద్విజగణః=మదించినవియుఁగూయుచున్నవియునగు పక్షుల సమూహముగలదియు;పతాకాభిః=పెకెక్కముల చేత;అలంకృతః = అలంకరింపఁబడినదియు; చందనోదకసంసక్తః = చందనజలముచేఁదడుపఁబడినదియు; నానాకుసుమభూషితః=నానావిధంబులగుపుష్పములచేనలంకరింపఁబడినదియు;సురపథోపమః = దేవతలమార్గముతోఁబోలికగలదియునగు;సః=ఆ;సేనాయాః=సేనయొక్క; పంథాః= మార్గము; బహు=మిక్కిలియు;అశోభత=ప్రకాశించినది.

అంత,నా సేనామార్గము, సున్నముతోగట్టనచేసిన నేలగలదై, చక్కఁగాఁబుష్పించినవృక్షంబులతోనొప్పుచు, మదించి మధురంబుగాఁగూయుచుండు పక్షులుగలదై, యచ్చటచ్చటఁ బతాకలచేనలంకృతమై, సుగంధి చందనజలముచేఁ దడుపఁబడినదై, నానావిధపుష్పోపహారాలంకృతమై, దేవమార్గముంబోలె, నెంతయుఁబ్రకాశించుచుండినది.అని, తాత్పర్యము.

ఆజ్ఞాప్యాథ యథాజ్ఞప్తి యుక్తా స్తేధికృతా నరాః
రమణీయేషు దేశేషు బహుస్వాదు ఫలేషుచ. ౧౫
యో నివేశ స్త్వభిప్రేతో భరతస్య మహాత్మనః
భూయ స్తం శోభయామాసు ర్భూషాభి ర్భూషణోపమమ్. ౧౬

టీక॥ తే=ఆ; అధికృతాః= అధికారముగల;నరాః=మనుష్యులు; అథ=అటుపిమ్మట; యుక్తాః=కూడినవారలై; యథాజ్ఞప్తి=బుద్ధికిఁదోఁచినట్లు;ఆజ్ఞాప్య=ఆజ్ఞాపించి; బహుస్వాదు ఫలేషుచ=పెక్కురుచ్యములగుఫలములుగలవి

యః; రమణీయేషు= సుందరమయినవి యునగు; దేశేషు= ప్రదేశములందు; మహాత్మనః=పూజ్యమయినమనసుగల; భరతస్య=భరతునకు; యః=ఏ ; నివేశస్తు=స్థలముమాత్రము; అభిప్రేతః = ఇష్టమో; భూషణోపమం= భూషణముతోఁబోలికఁగల; తం= ఆప్రదేశమును; భూమయః= మజలు; భూషాభిః = భూషణములచేత;శోభయామాసుః = ప్రకాశింపఁజేసిరి.

మార్గంబుచేయఁబడినపిదప, అచ్చటనధికృతులగు రాజపురుషులు , శిబిరనిర్మాణమునకై ,యందఱుచేరియాలోచించి, పెక్కురుచ్యఫలంబులుగలరమణీయప్రదేశములందు , మహాత్ముండగుభరతునిమనంబునకు, ఏది యభిమతంబుగానుండునో , అట్టిమార్గాలంకారభూతంబులగు ప్రదేశములను, గనకకలశాదులచేమఱియునలంకరించిరి.

అని, తాత్పర్యము.

నక్షత్రేషు ప్రశస్తేషు ముహూర్తేషు చ తద్విదః
నివేశాన్ స్థాపయామాసు ర్భరతస్య మహాత్మనః. ౧౭

టీక॥ ప్రశస్తేషు=శ్రేష్ఠములైన ; నక్షత్రేషు=నక్షత్రములయందును; ముహూర్తేషుచ = ముహూర్తములయందును; తద్విదః= వానిందెలిసినవారలు; మహాత్మనః = పూజ్యమగుహృదయముగల; భరతస్య=భరతునకు; నివేశాన్ = శిబిరములను; స్థాపయామాసుః=స్థాపించిరి.

జ్యోతిశ్శాస్త్ర వేత్తలగువారలుప్రశస్తంబగునక్షత్రంబులందు, మంచిముహూర్తములను, మహాత్ముండగుభరతుండువిడియుటకు , అర్హ్యస్థలంబుల, శిబిరంబులుస్థాపించిరి.

అని, తాత్పర్యము.

బహుపాంసుచయాశ్చాపి పరిఖాపరివారితాః
తత్రేంద్రకీల ప్రతిమాః ప్రతోళీవరశోభితాః. ౧౮
ప్రాసాద మాలావితతా స్సౌధప్రాకారసంవృతాః
పతాకాశోభితా స్సర్వే సునిర్మితమహాపథాః. ౧౯
విసర్పద్భిరివాకాశే విటంకాగ్రవిమానకైః
సముచ్ఛ్రితై ర్నివేశాస్తే బభు శ్శక్రపురోపమాః. ౨౦

స ౮౦




టీక॥తత్ర= ఆమార్గము నందు;బహుపాంసుచయాశ్చాపి=అధికమయిన యిసుకసమూహముగలవియు; పరిఖాపరివారితాః=అగడ్తలచేఁజుట్టఁబడినవియు; ఇంద్రకీలప్రతిమాః= ఇంద్రకీలపర్వతముతో సమానములయినవియు;ప్రతోళీవరశోభితాః=వీధులలో శ్రేష్ఠములగువానిచేఁ బ్రకాశించుచున్న వియు; ప్రాసాదమాలావితతాః= దేవాలయముల పఙ్క్తిచేవ్యాపింపఁ బడినవియు; సౌధప్రాకారసంవృతాః=సున్నముపూసినప్రాకారములచేఁజుట్టఁబడినవియును; పతాకశోభితాః=టెక్కెములచేనలంకరింపఁబడినవియును; సునిర్మితమహాపథాః=చక్కఁగానిర్మింపఁబడినరాజవీధులుగలవియును;సముచ్ఛ్రితైః = ఉన్నతములయినవియు;ఆకాశే=ఆకాశమునందు; విసర్పద్భిరివ(స్థితైః)=వ్యాపించుచున్నట్లున్నవియు ; విటంకాగ్రవిమానకైః= గువ్వగూడులుకొనయందుగలవిమానములతో; యుక్తాః (అధ్యాహృతము) = కూడినవియునగు; తే= ఆఃనివేశాః=శిబిరములు; సర్వే= అంతయు; శక్రపురోపమాః= ఇంద్రపట్టణముతోఁబోలికగలవై;బభుః=ప్రకాశించినవి.

మార్గంబునందలి యాశిబిరములన్నియు, మంచియిసుక నేలలుగలవై, చుట్టునగడ్తలచేఁ బరివేష్టితములయి, ఇంద్రకీలపర్వతంబునకు సాటియైనవై, మంచివీధులుగలిగి, దేవాలయంబులతోఁగూడి, సున్నముఁ బూసి తెల్లఁగానుండుప్రాకారములచేఁ బరివృతములయి, పతాకాలంకృతములయి , సుందరములగు రాజవీధులతో నొప్పుచు , నత్యున్నతంబులగుటచేనాకాశంబునారయునట్లున్న,విటంకాగ్రంబులగు మేడలతోఁగూడి, దేవేంద్రపట్టణసదృశంబులయి, యెంతయుంబ్రకాశించుచుండినవి.

అని, తాత్పర్యము.

జాహ్నవీంతు సమాసాద్య వివిధద్రుమకాననామ్
శీతలామలపానీయాం మహామీనసమాకులామ్. ౨౧

టీక॥వివిధద్రుమకాననాం= నానావిధములగువృక్షములుగలయడవులుగలదియు;శీతలామలపానీయాం = చల్లనిస్వచ్ఛమయిననీళ్లుగలదియు; మహామీనసమాకులాం=పెద్దమత్స్యములచేనిండినదియునగు; జాహ్నవీం=గంగానదిని; సమాసాద్యతు=పొందియు,అంతపటికననుట; తాని(అధ్యాహృతము)= ఆశిబి




రములు; బభుః (అధ్యాహృతము)= ప్రకాశించినవి.

నానావిధవృక్షంబులుగలయడవులతోఁగూడినదియు, స్వచ్ఛమయిన చల్లని నీళ్లుగలదియు మహామీనంబులతో నిండినదియునగు గంగానదివఱకు, నాశిబిరములు ప్రకాశించుచుండినవి; అటువెనుక, నసాధ్యమగుటంజేసి, శిబిరంబులుస్థాపింపరైరి, అని, తాత్పర్యము.

స చంద్రతారాగణమండితం యథా
నభః క్షపాయా మమలం విరాజతే
నరేంద్ర మార్గ స్స తథా వ్యరాజత
క్రమేణ రమ్య శ్శుభశిల్పినిర్మితః. ౨౨

టీక॥ యథా=ఎట్లు; క్షపాయాం= రాత్రియందు; అమలం=స్వచ్ఛమయినదియు; సచంద్రతారాగణమండితం = చంద్రునితోఁగూడిన నక్షత్ర సమూహముచేనలంకరింపఁ బడినదియునగు; నభః=ఆకాశము; విరాజతే= ప్రకాశించునో; తథా=అట్లు; రమ్యః= సుందరమును; శుభశిల్పినిర్మితః=మంచిశిల్పులచేనిర్మింపఁబడినదియునగు; సః = ఆ; నరేంద్రమార్గః = భరతుని మార్గము; క్రమేణ=వరుసచేత; వ్యరాజత=ప్రకాశించినది.

రాత్రియందు , నక్షత్రంబులతోను జంద్రునితోనుంగూడినయాకాశంబు ప్రకాశించునట్లు, సుందరంబును సమర్థులగుశిల్పులచే నిర్మితమునగు నాభరతునిమార్గంబు, మిక్కిలియుఁ బ్రకాశించుచుండినది. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, అశీతితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండాశీతితమసర్గటీక ,
ముగిసినది.

౮౨

ఏ కా శీ తి త మ స ర్గ ప్రా ర ం భః.

తతో నాందీముఖీం రాత్రిం భరతం సూతమాగధాః
తుష్టువు ర్వాగ్విశేషజ్ఞా స్తవై ర్మంగళసంహితైః. ౧

టీక॥ తతః=అటుపిమ్మట; నాందీముఖీం=అభ్యుదయప్రారంభముగల; రాత్రిం = (అత్యంతసంయోగమందుద్వితీయ) రాత్రియందు; వాగ్విశేషజ్ఞాః=మాటలవిశేషమునెఱింగిన; సూతమాగధాః=వందిమాగధులు; భరతం=భరతుని; మంగళసంహితైః = మంగళంబులతోఁగూడిన; స్తవైః= స్తోత్రములచేత; తుష్టువుః=పొగడిరి.

అంత, నభ్యుదయయుక్తంబగునపరరాత్రియందు, మాటలంబండితులగు వందిమాగధులు, మంగళయుక్తంబులగుస్తోత్రంబుల, భరతుంబ్రస్తుతించిరి.

అని, తాత్పర్యము.

సువర్ణకోణాభిహతః ప్రాణద ద్యామదుందుభిః

టీక॥ యామదుందుభిః= జాములను దెలుపునట్టిభేరి ; సువర్ణకోణాభిహతః=బంగారుదండములచేఁగొట్టఁబడినదై; ప్రాణదత్ = చక్కఁగాధ్వనించినది.

జాములుదెలుపుటకై యుంచియున్నభేరి , కనకదండముచేవాయింపఁబడినదై, మిక్కిలియుధ్వనించినది.

అని, తాత్పర్యము.

దధ్ము శ్శంఖాంశ్చ శతశో నాదాం శ్చోచ్చావచస్వరాన్. ౨

టీక॥ శతశః= నూఱునూఱులుగా; శంఖాంశ్చ = శంఖంబులను ; దధ్మః= ఊదిరి . ఉచ్చావచస్వరాన్= నానావిధధ్వనులుగల ; నాదాంశ్చ= వాద్యములను; అవాదయన్ (అధ్యాహృతము)=వాయించిరి.

అంత , వేలువేలుగా శంఖంబులు పూరించిరి; నానావిధధ్వనులగు, కాహళ్యాదివాద్యంబులవాయించిరి.

అని, తాత్పర్యము.

స తూర్యఘోష స్సుమహాన్ దివ మాపూరయన్నివ
భరతం శోకసంతప్తం భూయ శ్శోకై రరంధ్రయత్. ౩

టీక॥ సుమహాన్ = మిక్కిలియుఁ బెద్దదియు; దివం = ఆకాశమును; పూరయన్నివ (స్థితః) = నిండించుచున్నట్లున్నదియునగు; సః = ఆ; తూర్యఘోషః = వాద్యధ్వని; శోకసంతప్తం = దుఃఖముచే మిక్కిలి యుఁదపింపఁజేయఁబడిన; భరతం = భరతుని; భూయః = మిక్కిలియు; శోకైః = దుఃఖములచేత; అరంధ్రయత్ = భేదించెను.

ఆవాద్యధ్వని, మిక్కిలియుఁ బెద్దదై యాకాశంబంతయు నిండి చెలంగుచు, దుఃఖితుండగు భరతునకు, మఱియు, మహాదుఃఖంబు గావించెను.

అని, తాత్పర్యము.

తతః ప్రబుద్ధో భరత స్తం ఘోషం సన్నివర్త్యచ
నాహం రాజేతిచా ప్యుక్త్వా శత్రుఘ్న మిద మబ్రవీత్. ౪

టీక॥ తతః = అటుపిమ్మట; భరతః = భరతుఁడు; ప్రబుద్ధః = మేలొన్నవాఁడై; తం = ఆ; ఘోషం = ధ్వనిని; సన్నివర్త్యచ = నిలిపించియు; "అహం = నేను; రాజా = రాజు; న = కాను." ఇతి = అని; ఉక్త్వాచాపి = చెప్పియు; శత్రుఘ్నం = శత్రుఘ్నునిగూర్చి; ఇదం = ఈమాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంత, నాధ్వనికి, భరతుండు మేల్కొని, "నేను రాజును గాను; రాజును బోలెడునట్లు నన్నుఁ బొగడరాదు; ఈమంగళవాద్యంబులవాయింపవలదు" అని, చెప్పి, యాధ్వనినిలిపించి, శత్రుఘ్నునింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

పశ్య శత్రుఘ్న కైకేయ్యా లోకస్యాపకృతం మహత్

టీక॥ శత్రుఘ్న = శత్రుఘ్నుఁడా! కైకేయ్యా = కైకేయిచేత; లోకస్య = జనమునకు; మహత్ = అధికమయిన; అపకృతం = అపకారము చేయఁబడినదాని; పశ్య = చూడుము.

శత్రుఘ్నుఁడా! కైకేయి, లోకంబునకు, ఎంతగొప్ప యపకారము చేసినదో, చూడుము. అని, తాత్పర్యము.

విసృజ్య మయి దుఃఖాని రాజా దశరథో గతః. ౫

టీక॥ రాజా=రాజైన; దశరథః=దశరథుఁడు; మయి=నాయందు; దుఃఖాని=దుఃఖములను, విసృజ్య = విడిచి; గతః=పోయినాఁడు.

దశరథమహారాజు, దుఃఖంబుల నన్నింటిని, నన్ననుభవించునట్లు చేసి, మృతిఁబొందినాఁడు. అని, తాత్పర్యము.

తస్యైషా ధర్మరాజస్య ధర్మమూలా మహాత్మనః
పరిభ్రమతి రాజశ్రీ ర్నౌరివా కర్ణికా జలే. ౬

టీక॥ మహాత్మనః=పూజ్యమయినమనసుగలవాఁడును; ధర్మరాజస్య = ధర్మరాజునగు; తస్య = ఆదశరథమహారాజుయొక్క; ధర్మమూలా= ధర్మమె కారణముగాఁగల; ఏషా = ఈ; రాజశ్రీః=రాజలక్ష్మి; జలే=జలమునందు; అకర్ణికా=ఓడనడుపువాఁడు లేని; నౌరివ=ఓడవలె; పరిభ్రమతి = అల్లాడుచున్నది.

మహాత్ముఁడును ధర్మరాజునగు నా దశరథమహారాజు రాజలక్ష్మి మిక్కిలి యు ధర్మిష్ఠయయినది; అట్టిది, యిప్పుడు, జలమునందు, కర్ణధారుఁడు లేని యోడయుంబోలె, నల్లాడుచున్నది.

అని, తాత్పర్యము.

యో హి నస్సుమహా న్నాథ స్సోపి ప్రవ్రాజితో వనమ్
అనయా ధర్మ ముత్సృజ్య మాత్రా మే రాఘవ స్స్వయమ్. ౭

టీక॥ యః=ఎవ్వఁడు; నః=మనకు; సుమహాన్= మిక్కిలియుఁబూజ్యుఁడైన; నాథః=నాథుఁడో; సః=ఆ; రాఘవోపి=రాముఁడును; అనయా = ఈ; మే=నాయొక్క; మాత్రా=తల్లి చేత; ధర్మం=ధర్మమును; ఉత్సృజ్య= విడిచి; స్వయం=తన చేతనే; వనం= అడవిని; ప్రవ్రాజితోహి=పొందింపఁబడినాఁడుగదా!

ఎవ్వఁడు మనకందఱకును బరమనాథుఁడో, అట్టి రాముని గూడ, నాతల్లికైకేయి, యధర్మంబునవలంబించి ,

వనంబునకుం బంపినది, అని , భరతుండు,శత్రుఘ్నునితోం జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యేవం భరతం ప్రేక్ష్య విలపంతం విచేతనమ్
కృపణం రురుదు స్సర్వా స్సస్వరం యోషిత స్తదా. ౮

టీక॥తదా=అప్పుడు; యోషితః=స్త్రీలు; సర్వాః=అందఱును; ఏవం=ఇట్లు; విలపంతం= ఏడ్చుచున్నవాండును; విచేతనం=సంజ్ఞలేనివాండునగు ; భరతం=భరతుని; ప్రేక్ష్య=చూచి;కృపణం=దుఃఖముగలుగునట్లుగా; సస్వరం = ధ్వనితోంగూడునట్లుగా; రురుదుః=ఏడ్చిరి.

అప్పుడు, ఈప్రకారమువిలపించుచు విసంజ్ఞుండైయున్నభరతుంజూచి, స్త్రీలందఱును , బరమదుఃఖితలయి,పేరెలుంగున,రోదనంబు చేసిరి.

అని, తాత్పర్యము,

తథా తస్మిన్ విలపతి వసిష్ఠో రాజధర్మవిత్
సభా మిక్ష్వాకునాథస్య ప్రవివేశ మహాయశాః. ౯

టీక॥తస్మిన్ = ఆభరతుండు; తథా=అట్లు; విలపతి=విలపించుచుండంగా; రాజధర్మవిత్ = రాజధర్మంబుదెలిసినవాండును; మహాయశాః=అధికమయినకీర్తి గలవాండునగు ; వసిష్ఠః=వసిష్ఠుండు; ఇక్ష్వాకునాథస్య = ఇక్ష్వాకువంశమునం బుట్టిన వారలకు నాథుండగుదశరథునియొక్క; సభాం=సభను; ప్రవివేశ=చొచ్చెను.

ఆభరతుండట్లు , విలపించుచుండంగా, రాజధర్మంబు దెలిసినవాండును మహాకీర్తిశాలియునగు వసిష్ఠమహాముని, రాజసభం బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

శాతకుంభమయీం రమ్యాం మణిరత్నసమాకులామ్
సుధర్మా మివ ధర్మాత్మా సగణః ప్రత్యపద్యత. ౧౦

టీక॥ధర్మాత్మా = ధర్మస్వభావుండగు వసిష్ఠమహామునిః; సగణః= స

మూహముతోఁగూడినవాఁడై ; శాతకుంభమయీం= బంగారువికారమయినదియు;రమ్యాం = సుందరమయినదియు; మణిరత్నసమాకులాం = మణిశ్రేష్ఠములచేనిండినదియు; సుధర్మామివ (స్థితాం) = దేవసభవలెనున్నదియునగు; సభాం (అధ్యాహృతము)= సభను; ప్రత్యపద్యత=పొందెను.

సువర్ణమయంబై, మనోహరంబై, యుత్తమంబులగు మణులచేనలంకృతంబై, దేవసభయుంబోలె వెలుంగుచున్న యారాజసభను, ధర్మాత్ముండగువసిష్ఠుండు, శిష్యసమూహంబుతోఁ, బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

స కాంచనమయం పీఠం సుఖాస్తరణసంవృతమ్
అధ్యాస్త సర్వవేదజ్ఞో దూతా ననుశశాసచ. ౧౧

టీక॥ సర్వవేదజ్ఞః= సమస్తవేదంబులదెలిసినట్టి; సః=ఆవసిష్ఠమహాముని ; సుఖాస్తరణసంవృతం = సుఖకరమయినపఱుపుచేఁగప్పఁబడిన ; కాంచనమయం= బంగారువికారమయిన; పీఠం= ఆసనమును; అధ్యాస్త=అధిష్ఠించెను. దూతాన్=దూతలను; అనుశశాసచ= ఆజ్ఞాపించెను.

సమస్తవేదంబులుదెలిసిన యావసిష్ఠమహాముని, సుఖకరంబైన యాస్తరణంబువేసియున్న బంగారుపీఠంబుపైఁ గూర్చుండి, దూతలంబూచి, యిట్లని యాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యా నమాత్యాన్ గణవల్లభాన్
క్షిప్ర మానయతా వ్యగ్రాః కృత్య మాత్యయికం హి నః. ౧౨

టీక ॥ యూయం (అధ్యాహృతము)= మీరలు ; అవ్యగ్రాః=ఏమఱుపాటులేనివారలై ; బ్రాహ్మణాన్ = బ్రాహ్మణులను; క్షత్రియాన్ = క్షత్రియులను; వైశ్యాన్= వైశ్యులను; అమాత్యాన్= మంత్రులను ; గణవల్లభాన్= గణాధ్యక్షులను; క్షిప్రం=శీఘ్రముగా; ఆనయత= తోడ్కొనిరండు. నః=మాకు; ఆత్యయికం= కష్టముచేసాధ్యమయిన; కృత్యం=పని; అ

స్తి (అధ్యాహృతము) హి = ఉన్నదిగదా!

మాకుగొప్పకార్యమున్నది; కావున, మీరు, ఆలస్యంబుసేయక బ్రాహ్మణులను, క్షత్త్రియులను, వైశ్యులను, మంత్రులను, గణాధ్యక్షులను, శీఘ్రముగాఁదోడ్కొనిరండు.

అని, తాత్పర్యము.

స రాజ భృత్యం శత్రుఘ్నం భరతంచ యశస్వినమ్
యుధాజితం సుమంత్రంచ యేచ తత్ర హితా జనాః. ౧౩

టీక॥ సరాజభృత్యం=రాజునకంతరంగులయిన భృత్యులతోఁ గూడిన; శత్రుఘ్నం=శత్రుఘ్నుని; యశస్వినం=ప్రశస్తమైన కీర్తిగల; భరతంచ= భరతుని; యుధాజితం = యుధాజిత్తునుమంత్రిని; సుమంత్రంచ=సుమంత్రుని; తత్ర=ఆవిషయమందు;హితాః= మేలుసేయునట్టి,జనాః=జనులు;యే= ఎవ్వరో; తాన్(అధ్యాహృతము)చ=వారలను; ఆనయత = తోడ్కొనిరండు.

రాజాంతరంగభృత్యులుగల,శత్రుఘ్నుని,యశశ్శాలియగు భరతుని, యుధాజిత్తును, సుమంత్రుని, మఱియు రాజ్యమునకుహితపరులగు వారలెవ్వరుగలరో వారలను, దోడ్కొనిరండు. అని, వసిష్ఠమహాముని దూతల కాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

తతో హలహలా శబ్ద స్సుమహాన్ సమపద్యత
రథై రశ్వై ర్గజైశ్చాపి జనానా ముపగచ్ఛతామ్. ౧౪

టీ॥తతః=అటుపిమ్మట;జనానాం= జనులు; రథైః = రథములచేతను; అశ్వైః=గుఱ్ఱములచేతను; గజైశ్చాపి= ఏనుంగులచేతను;ఉపగచ్ఛతాం=వచ్చుచుండఁగా;సుమహాన్=మిక్కిలియుఁబెద్దదైన; హలహలాశబ్దః= హలహలాయనుధ్వని;సమపద్యత;కలిగెను.

అంత,వసిష్ఠాజ్ఞచొప్పున,జనులందఱు, వారివారి గౌరవంబునకుఁదగినట్లు, రథంబులను గుఱ్ఱంబులను ఏనుంగులను ఆరోహించి , వచ్చుచుండుటంజేసి, మహాధ్వనియొక్కటి, కలిగినది.

అని, తాత్పర్యము.

తతో భరత మాయాంతం శతక్రతు మివామరాః
ప్రత్యనందన్ ప్రకృతయో యథా దశరథం తథా. ౧౫

టీక॥ తతః=అటుపిమ్మట; ప్రకృతయః=జనులు; ఆయాంతం = వచ్చుచున్న; భరతం= భరతుని; అమరాః = దేవతలు; శతక్రతుమివ= దేవేంద్రుని వలె; దశరథం=దశరథుని; యథా = ఎట్లో ; తథా=అట్లు; ప్రత్యనందన్ = కొనియాడిరి.

అంత, జనులు, వచ్చుచున్నా భరతుం జూచి, దేవతలు దేవేంద్రునిం గొనియాడునట్లు, మున్ను దశరథుసింబోలెc, గొనియాడిరి. అని, తాత్పర్యము.

హ్రద ఇవ తిమినాగసంవృత
స్తిమితజలో మణిశంఖశర్కరః
దశరథసుతశోభితా సభా
సదశరథేవ బభౌ యథాపురా. ౧౬

టీక॥ తిమినాగసంవృతః = పెద్దమత్స్యముల చేతను ఏనుంగుల చేతను జుట్టcబడినదియు ; మణిశంఖశర్కరః=మణులును శంఖంబులును స్థూలమయిన యిసుకగాc గలదియు; స్తిమితజలః=నిశ్చలమయినజలముగలదియునగు ; హ్రద ఇవ=మడుcగువలె, సముద్రమునందలిమడుcగువలెననుట; దశరథసుతశోభితా= దశరథుని కొడుకులచేc బ్రకాశించుచున్న; సభా=సభ; సదశరథేవ=దశరథునితోcగూడినదివలె; పురాయథా= మునుపువలె; బభౌ=ప్రకాశించెను.

పెద్దపెద్దమత్స్యంబులతోను నీటియేనుంగులతోనుంగూడి నిశ్చలజలంబై మణులు శంఖంబులు నెయిసుకగాcగల్గియున్న సముద్రంబునందలిమడుcగువలె, దశరథునికొడుకులయినభరతశత్రుఘ్నులతోను వసిష్ఠునితోను మంత్రులు మున్నగువారలతోను ఒప్పుచున్న యీ రాజసభ, మున్ను దశరథుండుండి నప్పుడువలెనె, యెంతయుం బ్రకాశించుచుండినది. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

అయోధ్యాకాండే,ఏకాశీతితమస్సర్గః.

ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు,అయోధ్యాకాండైకాశీతితమసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

ద్వ్యశీతితమసర్గప్రారంభః.

తామార్యగణసంపూర్ణాం భరతః ప్రగ్రహాం సభామ్
దదర్శ బుద్ధిసంపన్నః పూర్ణచంద్రో నిశామివ. ౧

టీక॥ బుద్ధిసంపన్నః= బుద్ధితోఁగూడిన; భరతః=భరతుఁడు;ఆర్యగణసంపూర్ణాం=పూజ్యుల సమూహముచే నిండినదగు; తాం = ఆ; సభాం = సభను;పూర్ణచంద్రః=నిండుచంద్రుఁడు;ప్రగ్రహాం= మంచిగ్రహములతోఁ గూడిన, బృహస్పతితోఁ గూడినయనుట; నిశామివ= రాత్రివలె; దదర్శ= చూచెను.

బుద్ధిమంతుండగు భరతుండు, పూజ్యులగు వసిష్ఠాదులతోఁగూడినసభను, పూర్ణచంద్రుండు , బృహస్పత్యాదియుక్తంబగు రాత్రింజూచునట్లు, పరమసంతోషంబునంజూచెను.

అని, తాత్పర్యము.

ఆసనాని యథాన్యాయ మార్యాణాం విశతాం తదా
వస్త్రాంగరాగప్రభయా ద్యోతితా సా సభోత్తమా. ౨

టీక॥ తదా=అప్పుడు;సా=ఆ; సభోత్తమా= సభలలోనుత్తమమయిన రాజసభ; యథాన్యాయం= న్యాయమునతిక్రమింపక;ఆసనాని= ఆసనములను; విశతాం = పొందుచున్న; ఆర్యాణాం = పూజ్యులగు వారలయొక్కయు; వస్త్రాంగరాగప్రభయా=వస్త్రములయొక్కయు మైపూఁతయొక్కయు

కాంతిచేత ; ద్యోతితా = ప్రకాశించినది.

అప్పుడు, పూజ్యులగు,సభికులు, సభం బ్రవేశించి; వారివారి యోగ్యతకుఁ దగినట్లు,ఆసనంబులపైఁగూర్చుండునప్పుడు, వారుధరించియున్న వస్త్రంబుల కాంతిచేతచందనాద్యంగరాగ కాంతిచేతను,ఆసభ యెంతయుం బ్రకాశించినది. అని, తాత్పర్యము.

సా విద్వజ్జనసంపూర్ణా సభా సురుచిరా తదా
అదృశ్యత ఘనాపాయే పూర్ణచంద్రేవ శర్వరీ. ౩

టీక॥తదా = అప్పుడు;విద్వజ్జనసంపూర్ణా= పండితులగుజనులచేతనిండినదియు;సురుచిరా=మిక్కిలియుసుందరమునగు;సా=ఆ,సభా = సభ;ఘనాపాయే = శరదృతువునందు;పూర్ణచంద్రా=నిండుచంద్రుఁడుగల; శర్వరీవ=రాత్రివలె;అదృశ్యత = చూడఁబడెను.

అప్పుడు, భరతునకుఁ బట్టాభిషేకముజరగునని చక్కఁగానలంకరించికొని వచ్చియున్నపండితులతో నిండిమనోహరంబై యున్న,ఆసభ,శరదృతువునందు నిండుచంద్రునితోఁగూడినరాత్రివలె, మిక్కిలియొప్పుచుండినది.

అని, తాత్పర్యము.

రాజ్ఞస్తు ప్రకృతీ స్సర్వా స్సమగ్రాః ప్రేక్ష్య ధర్మవిత్
ఇదం పురోహితో వాక్యం భరతం మృదు చా బ్రవీత్. ౪

టీక॥ధర్మవిత్= ధర్మముఁదెలిసిన;పురోహితః= పురోహితుండగువసిష్ఠుండు;రాజ్ఞస్తు=రాజులను;సర్వాః= సమస్తములయిన;ప్రకృతీః= జనములను;సమగ్రాః = అందఱను;ప్రేక్ష్య= చూచి;భరతం=భరతునిగూర్చి;ఇదం= ఈ;మృదు= మెత్తనైన;వాక్యం=చ=మాటను;అబ్రవీత్ =చెప్పెను.

ధర్మవేత్తయగునావసిష్ఠుండు,నానాదేశపురాజులును ముఖ్యముగారావలసినజనులును , అందఱువచ్చియుండుటంజూచి, మృదువాక్యంబున, భరతుంజూచి,యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

తాత రాజా దశరథ స్స్వర్గతో ధర్మ మాచరన్
ధనధాన్యవతీం స్ఫీతాం ప్రదాయ పృథివీం తవ. ౫

టీక॥ తాత=నాయనా! రాజా=రాజయిన ; దశరథః= దశరథుఁడు; ధర్మం= ధర్మమును ; ఆచరన్= చేయుచు; ధనధాన్యవతీం= అధికమయిన ధనంబును ధాన్యంబును గలదియు; స్ఫీతాం=సమృద్ధంబునగు ; పృథివీం= భూమిని; తవ=నీకు ; ప్రదాయ=ఇచ్చి ; స్వర్గతః= స్వర్గము నొందెను.

నాయనా! దశరథమహారాజు, ధర్మంబును వదలక , ధనధాన్యసమృద్ధంబగుభూమిని , నీకొసంగి , మృతుండయ్యెను. అని, తాత్పర్యము.

రామ స్తథా సత్యధృతి స్సతాం ధర్మ మనుస్మరన్
నాజహా త్పితు రాదేశం శశీ జ్యోత్స్నామివో దితః. ౬

టీక ॥ తథా=అట్లు ; సత్యధృతిః=సత్యమునందుఁబ్రీతిగల; రామః=రాముఁడు ; సతాం= సత్పురుషుల యొక్క; ధర్మం=ధర్మమును ; అనుస్మరన్= తలంచుచు; పితుః=తండ్రి యొక్క ; ఆదేశం=ఆజ్ఞను ; ఉదితః=ఉదయించిన ; శశీ=చంద్రుఁడు; జ్యోత్స్నామివ = వెన్నెలనువలె ; నాజహాత్=విడువఁడయ్యె.

అట్లు, సత్యవ్రతుండగు , రాముండు , సత్పురుషులయాచారంబుఁదలంచి , ఉదయించినచంద్రుండు చంద్రికనువదలకుండునట్లు , తండ్రియాజ్ఞనువిడువక,యరణ్యంబునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

పిత్రా భ్రాత్రాచ తే దత్తం రాజ్యం నిహతకంటకమ్
తద్భుఙ్క్ష్వ ముదితా మాత్యః క్షిప్రమేవా భిషేచయ. ౭

టీక॥ తే=నీకొఱకు;పిత్రా = తండ్రిచేతను;భ్రాత్రాచ=అన్నచేతను; నిహతకంటకం=కొట్టఁబడినవిరోధులుగల; రాజ్యం=రాజ్యము;దత్తం=ఇవ్వఁబడి

నది. త్వం(అధ్యాహృతము) = నీవు; తత్ = దానిని; భుఙ్క్ష్వ = భుజింపుము. క్షిప్రమేవ = శీఘ్రముగనే; అభిషేచయ = అభిషేకించుకొనుము.

నీతండ్రియును, నీయన్నయును, ఎంతమాత్రము విరోధి జనము లేకుండుటవలనఁ బరమసుఖంబగు, రాజ్యంబును, నీకొసంగినారు; కావున, నీవు, దాని, సుఖంబుగాననుభవింపుము; శీఘ్రంబుగాఁబట్టాభిషేకంబుఁ జేసికొనుము.

అని, తాత్పర్యము.

ఉదీచ్యాశ్చ ప్రతీచ్యాశ్చ దాక్షిణాత్యాశ్చ కేవలాః
కోట్యాపరాంతాః సాముద్రా రత్నా న్యభిహరంతు తే. ౮

టీక॥ ఉదీచ్యాశ్చ = ఉత్తరపు దేశపు రాజులును; ప్రతీచ్యాశ్చ = పశ్చిమ దేశపు రాజులును; దాక్షిణాత్యాశ్చ = దక్షిణ దేశపు రాజులును; కేవలాః = సింహాసనము లేని రాజులును; అపరాంతాః = పశ్చిమ దేశ వాసులగు యవనులును; సాముద్రాః = సముద్రముననుండు రాజులును, సముద్ర మధ్యమున ద్వీపములందుండు రాజులననుట; కోట్యా = కోటిసంఖ్య చేత; రత్నాని = రత్నములను; తే = నీకొఱకు; అభిహరంతు = కానుకలొసంగుదురుగాక.

ఉత్తర దేశపు రాజులును, బశ్చిమ దేశపు రాజులును దూర్పు దేశపు రాజులును దక్షిణ దేశపు రాజులును, యవనులును, సముద్రమధ్యంబున ద్వీపంబులనుండు రాజులును, నీకుఁగోట్లసంఖ్యను, రత్నంబులం దెచ్చి, కానుకలొసంగుదురుగాక. అని, వసిష్ఠమహాముని, భరతునకుఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా భరతో వాక్యం శోకేనాభి పరిప్లుతః
జగామ మనసా రామం ధర్మజ్ఞో ధర్మకాంక్షయా. ౯

టీక॥ ధర్మజ్ఞః = ధర్మములఁ దెలిసిన; భరతః = భరతుఁడు; తత్ = ఆ; వాక్యం = మాటను; శ్రుత్వా = విని; శోకేన = దుఃఖముచేత; అభిపరిప్లుతః = ముంపఁబడినవాఁడై; ధర్మకాంక్షయా = ధర్మమునందలికోర్కిచేత; మనసా = మనసుచేత; రామం = రాముని; జగామ = పొందెను.

ధర్మజ్ఞుండగు భరతుండు, వసిష్ఠమహాముని చెప్పినమాటను విని, పరమదుఃఖితుండై, జ్యేష్ఠానువర్తనరూపంబగు ధర్మంబుఁగోరి, మనంబున, రాముని. సంస్మరించెను.

అని, తాత్పర్యము.

స బాష్ప కళయా వాచా కలహంస స్స్వరో యువా
విలలాప సభా మధ్యే జగర్హేచ పురోహితమ్ ౧౦

టీక॥ కలహంసస్వరః= కలహంసపక్షియొక్క కంఠధ్వనివంటికంఠధ్వనిగలవాఁడును; యువా=యౌవనముగలవాఁడునగు; సః=ఆభరతుండు; బాష్పకళయా= కన్నీటిచేనస్పష్టమయిన; వాచా=మాటచేత; సభామధ్యే=సభనడుమను; విలలాప=విలపించెను. పురోహితం= వసిష్ఠమహామునిని; జగర్హేచ= నిందించెను.

కలహంసపక్షికింబోలె మధురంబగుకంఠధ్వనిగలయా భరతుండు, యౌవనవంతుండైనను, దత్కాలయోగ్యంబులగు భోగంబులయందు మనంబుంచక కేవలధర్మంబునెగోరి, రాముని దలంచుకొని, సభామధ్యంబునఁ, గన్నీళ్లొలుక, రోదనంబుచేసెను; "ఇంతటియధర్మంబు నుపదేశించితివే" యని పురోహితుండగు వసిష్ఠమహామునిని నిందించెను. అని, తాత్పర్యము.

చరితబ్రహ్మచర్యస్య విద్యాస్నాతస్య ధీమతః
ధర్మే ప్రయతమానస్య కో రాజ్యం మద్విధో హరేత్. ౧౧

టీక॥ చరితబ్రహ్మచర్యస్య= ఆచరింపఁబడినబ్రహ్మచర్యము గలవాఁడును; విద్యాస్నాతస్య=వేదాధ్యయనానంతరము చేయవలసినస్నానముతోఁ గూడినవాఁడును; ధీమతః = అధికమయిన బుద్ధిగలవాఁడును, ఆవేదంబుల యర్థముఁ దెలిసినవాఁడుననుట; ధర్మే=ధర్మమునందు; ప్రయతమానస్య=ప్రయత్నించువాఁడునగు, వేదోక్తధర్మానుష్ఠానంబు చేయుచున్నవాఁడుననుట, రామునియొక్క; రాజ్యం= రాజ్యమును; మద్విధః=నాయట్టివాఁడు; కః=ఎవ్వఁడు; హరేత్ =అపహరించును?

బ్రహ్మచర్యవ్రతంబు నాచరించి,

సమస్తవేదంబుల నధ్యయనించి, స్నానంబునొంది,తదర్థంబుఁ దెలిసి, తదుక్తధర్మంబులం దప్పకయనుష్ఠించు చున్న రాముని రాజ్యంబును, నాయట్టి శాస్త్రంబునకులోఁబడినవాఁ డెవ్వఁ డపహరించును? అని, తాత్పర్యము.

కథం దశరథా జ్జాతో భవే ద్రాజ్యాపహారకః
రాజ్యంచా హంచ రామస్య ధర్మం వక్తు మిహా ర్హసి. ౧౨

టీక॥ దశరథాత్=దశరథునివలన; జాతః= పుట్టినవాఁడు ; కథం = ఎట్లు; రాజ్యాపహారకః= రాజ్యమునపహరించువాఁడు ; భవేత్= అగును. రాజ్యంచ=రాజ్యమును ; అహంచ= నేనును; రామస్య= రామునివారము, ఇహ=ఈవిషయమందు ; ధర్మం= ధర్మమును ; వక్తుం= చెప్పుటకు;అర్హసి= తగుదువు.

దశరథునకుఁబుట్టినవాఁడు, తనయన్నకు రావలసిన రాజ్యంబు నపహరించునా? ఈరాజ్యంబును రామునిది; నేనును రామునివాఁడనే; ఈవిషయమందు,నీవుధర్మంబుఁ జెప్పవలయును.

అని, తాత్పర్యము.

జ్యేష్ఠ శ్శ్రేష్ఠశ్చ ధర్మాత్మా దిలీపనహుషోపమః
లబ్ధు మర్హతి కాకుత్థ్సో రాజ్యం దశరథో యథా. ౧౩

టీక॥జ్యేష్ఠః= పెద్దవాఁడును;శ్రేష్ఠశ్చ=ఉత్తముండును;ధర్మాత్మా = ధర్మస్వభావుండును; దిలీపనహుషోపమః= దిలీపునితోనునహుషునితోనుబోల్కిగలవాఁడునగు,కాకుత్థ్సః = రాముఁడు;దశరథోయథా= దశరథుండువలె;రాజ్యం= రాజ్యమును ; లబ్ధుం= పొందుటకు; అర్హతి=తగును.

జ్యేష్ఠుండునుత్తముండును ధర్మాత్ముండునుదిలీపనహుషాది సదృశుండునుఇట్లు సమస్తసద్గుణ సంపన్నుండగు రాముండె, దశరథునియట్లు,రాజ్యంబునొందఁదగియున్నాఁడు.

అని,తాత్పర్యము.

అనార్యజుష్ట మస్వర్గ్యం కుర్యాం పాప మహం యది

ఇక్ష్వాకూణా మహం లోకే భవేయం కులపాంసనః. ౧౪

టీక॥ అహం = నేను; అనార్యజుష్టం= దుష్టులచే సేవింపఁబడినదియు; అస్వర్గ్యం=స్వర్గార్హంబుగానిదియు నగు; పాపం=పాపమును; కుర్యాం యది=చేయుదునేని; అహం=నేను; ఇక్ష్వాకూణాం= ఇక్ష్వాకువంశంబునంబుట్టిన వారలయొక్క; లోకే = జనమునం దు; కులపాంసనః = వంశంబుఁజెఱుపువాఁడను, భవేయం=అగుదును.

ఇట్టు దుష్టులు చేయఁదగినదియు నరకప్రదంబునగు పాపంబు సేయుదునేని, నేను ఇక్ష్వాకువంశంబుఁజెఱుపం బుట్టినవాఁడనగుదును.

అని, తాత్పర్యము.

యద్ధి మాత్రా కృతం పాపం నాహంతదపి రోచయే

టీక॥ మాత్రా=తల్లిచేత; కృతం= చేయఁబడిన; పాపం=పాపము ; యత్ (అస్తి)=ఏదిగలదో; తదపి = దానిని; అహం= నేను; నరోచయేహి=సమ్మతింపనుగదా!

నాతల్లి కైకేయి చేసినయధర్మంబునకు, నేనెంతమాత్రములోఁబడను.

అని, తాత్పర్యము.

ఇహస్థో వన దుర్గస్థం నమస్యామి కృతాంజలిః ౧౫

టీక॥ అహం (అధ్యాహృతము) = నేను; ఇహస్థః=ఇచ్చటనున్నవాఁడనై; వనదుర్గస్థం= చొరరానివనంబుననున్నరామునిగూర్చి; కృతాంజలిః = చేయఁబడినచేమోడ్పుగలవాఁడనై ; నమస్యామి=నమస్కరించుచున్నాఁను.

నేను, ఇచ్చటనుండియే , గహనంబగు నరణ్యంబుననున్న రామునకుఁ, జేమోడ్పుగీలించి, నమస్కారంబుఁజేసెదను. అని, తాత్పర్యము.

రామ మేవాను గచ్ఛామి రాజా సద్విపదాం వరః

టీక॥ రామమేవ= రామునే; అనుగచ్ఛామి = అనుసరించెదను . ద్విపదాం= రెండుపాదములుగలవారలలోపల; వరః= శ్రేష్ఠుఁడగు; సః= ఆరాముఁడు; రాజా= రాజు.

నేనును రామునేయనుసరించుచుండె

దను; పురుషశ్రేష్ఠుండగు నా రాముండే రాజు కాని, మఱెవ్వరును గారు. అని, తాత్పర్యము.

త్రయాణామపి లోకానాం రాజ్య మర్హతి రాఘవః. ౧౬

టీక॥ రాఘవః= రాముఁడు; త్రయాణాం=మూఁడైన; లోకానామపి= లోకములయొక్కయు; రాజ్యం= దొరతనమును; అర్హతి=పొందఁదగును.

రాముండు, ఈ రాజ్యమునకుమాత్రమే కాదు; ముల్లోకములకునుంగూడ రాజుగాఁదగును. అని, భరతుఁడు వసిష్ఠమహామునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

త ద్వాక్యం ధర్మసంయుక్తం శ్రుత్వా సర్వే సభాసదః
హర్షా న్ముముచు రశ్రూణి రామే నిహితచేతసః. ౧౭

టీక॥సభాసదః = సభయందుండువారలు;సర్వే=అందఱును; ధర్మసంయుక్తం = ధర్మముతోఁ గూడిన ; తత్=ఆ;వాక్యం=మాటను;శ్రుత్వా=విని;హర్షాత్=సంతోషమువలన;రామే=రామునందు; నిహితచేతసః=ఉంచఁబడినమనస్సుగలవారలై;అశ్రూణి=కన్నీళ్లను;ముముచుః=విడిచిరి.

సభికులందఱును, ధర్మయుక్తంబగు నామాటనువిని, పరమసంతుష్టులయి, రామాసక్తమానసులయి, ఆనందబాష్పంబులొలికించిరి. అని, తాత్పర్యము.

యది త్వార్యం నశక్ష్యామి వినివర్తయితుం వనాత్
వనే తత్రైవ వత్స్యామి యథార్యో లక్ష్మణ స్తథా. ౧౮

టీక॥ఆర్యః=పూజ్యుండగు రాముని; వనాత్= అడవినుండి ; వినివర్తయితుం=మఱలించుటకు; నశక్ష్యామి యదితు=చాలకపోవుదునేని;యథా= ఎట్లు; ఆర్యః = పూజ్యుండగు; లక్ష్మణః=లక్ష్మణుఁడో;తథా=అట్లు; అహమపి(అధ్యాహృతము) = నేనును; తత్రైవ=అచ్చటనే; వనే=అడవియం

దు; వత్స్యామి=ఉండెదను.

నేనెంతప్రార్థించినను, పూజ్యుండగు రాముండు వనంబువిడిచియిచ్చటికి రాకయుండునేని, పూజ్యుండగు లక్ష్మణునితోఁగూడ నేనును అచ్చట నె వనంబునను ఉండెదను. అని, తాత్పర్యము.

సర్వోపాయంతు వర్తిష్యే వినివర్తయితుం బలాత్
సమక్ష మార్య మిశ్రాణాం సాధూనాం గుణవర్తినామ్ ౧౯

టీక ॥ సాధూనాం=సత్పురుషులును; గుణవర్తినాం= గుణమునందుండువారలునగు; ఆర్యమిశ్రాణాం= సభికులయొక్క; సమక్షం= ఎదుటను; బలాత్=బలాత్కారమువలన ; వినివర్తయితుం= మఱలించుటకు ; సర్వోపాయం = సమస్తమయిన యుపాయమును; వర్తిష్యే= చేసెదను.

సత్పురుషులును గుణవంతులు నగు మీసమక్షమునందె, రాముని, వనంబుననుండితోడొని వచ్చుటకు , నాచేతనైనంతవఱకు సమస్తోపాయంబులం గావించెదను. అని, తాత్పర్యము.

విష్టికర్మాంతికా స్సర్వే మార్గశోధక రక్షకాః
ప్రస్థాపితా మయా పూర్వం యాత్రాపి మమ రోచతే. ౨౦

టీక॥ మార్గశోధకరక్షకాః=మార్గమును శోధించువారును గాపాడువారలునగు; విష్టికర్మాంతికాః=కూలిలేక గ్రామంబులనుండివచ్చినవారలును,(వెట్టికివచ్చిన)వారలుననుట, పనిచేసికూలిపుచ్చుకొనువారలును; మయా=నాచేత; పూర్వం=మున్ను; ప్రస్థాపితాః = పంపఁబడిరి. మమ=నాయొక్క; యాత్రాపి=ప్రయాణమును; రోచతే= రుచించుచున్నది.

నేను, మున్నె, వెట్టికివచ్చినవారలను, కూలికిఁబనిచేయువాలను మార్గంబునుసరిచేసి, రక్షించుచుండుటకై, పంపియున్నాను ; ఇంక నేనుబోవలయును, అని, భరతుండు, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వాతు ధర్మాత్మా భరతో భ్రాతృవత్సలః
సమీపస్థ మువాచేదం సుమంత్రం మంత్ర కోవిదమ్. ౨౧




టీక॥ ధర్మాత్మా = ధర్మస్వభావుండును; భ్రాతృవత్సలః = తోఁబుట్టువునందతిప్రేమగలవాఁడునగు; భరతః = భరతుఁడు; ఏవం = ఇట్లు; ఉక్త్వాతు = చెప్పినంతనే; సమీపస్థం = సమీపంబుననున్న; మంత్రకోవిదం = ఆలోచనయందుఁబండితుండగు; సుమంత్రం = సుమంత్రునిగూర్చి; ఇదం = ఈమాట ను; ఉవాచ = చెప్పెను.

ధర్మాత్ముండును జ్యేష్ఠభ్రాతయం దతిభక్తిగలవాఁడునగు భరతుండు, వసిష్ఠాదులతో నీప్రకారము చెప్పి, తనసమీపంబుననున్న, యాలోచనలం బండితుండగు సుమంత్రుం జూచి, యిట్లని, పలికెను. అని, తాత్పర్యము.

తూర్ణ ముత్థాయ గచ్ఛ త్వం సుమంత్ర మమ శాసనాత్
యాత్రా మాజ్ఞాపయ క్షిప్రం బలం చైవ సమానయ. ౨౨

టీక॥ సుమంత్ర = సుమంత్రుఁడా! త్వం = నీవు; మమ = నాయొక్క; శాసనాత్ = ఆజ్ఞ వలన; తూర్ణం = శీఘ్రముగా; ఉత్థాయ = లేచి; గచ్ఛ = పొమ్ము. క్షిప్రం = శీఘ్రముగా; యాత్రాం = పయనమును; ఆజ్ఞాపయ = ఆజ్ఞాపించుము. బలం చైవ = సైన్యమును; సమానయ = తెమ్ము.

సుమంత్రుఁడా! నీవు, నాయాజ్ఞచే, శీఘ్రముగా లేచిపోయి, పయనము కావలెనని యాజ్ఞాపించి, సైన్యంబును దెమ్ము. అని, భరతుండు, సుమంత్రునకాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త స్సుమంత్రస్తు భరతేన మహాత్మనా
హృష్ట స్తదాదిశ త్సర్వం యథా సందిష్ట మిష్టవత్. ౨౩

టీక॥ సుమంత్రస్తు = సుమంత్రుండును; మహాత్మనా = పూజ్యమయినస్వభావముగల; భరతేన = భరతునిచేత; ఏవం = ఇట్లు; ఉక్తః = చెప్పఁబడినవాఁడై; హృష్టః = సంతోషించినవాఁడై; యథాదిష్టం = ఆజ్ఞాపింపఁబడినట్లు; ఇష్టవత్ = కోర్కికనురూపమయిన; తత్ = ఆమాటను; సర్వం = అంతను; ఆదిశత్ = ఆజ్ఞాపించెను.

సుమంత్రుండు, మహాత్ముండగుభ

రతుండు చెప్పినదివిని, పరమసంతుష్టుం డై, తమకోర్కెకనురూపంబు గా భరతుండు గావించినయాజ్ఞను, సైనికులకుం జెప్పెను. అని, తాత్పర్యము.

తాః ప్రహృష్టాః ప్రకృతయో బలాధ్యక్షా బలస్య చ
శ్రుత్వా యాత్రాం సమాజ్ఞప్తాం రాఘవస్య నివర్తనే. ౨౪

టీక॥ తాః=ఆ ; ప్రకృతయః = ప్రజలును; బలస్య=సైన్యముయొక్క; బలాధ్యక్షాః= సేనాధ్యక్షులును; రాఘవస్య = రామునియొక్క ; నివర్తనే = మఱలించుటనిమిత్తమయి; యాత్రాం=ప్రయాణమును;సమాజ్ఞప్తాం= ఆజ్ఞాపింపఁబడినదానిఁగా; శ్రుత్వా= విని; ప్రహృష్టాః = మిక్కిలియుసంతసించినారు.

ప్రజలును, సేనాధ్యక్షులును, భరతుండు రామునింబిలిచికొనివచ్చుటకై పయనంబగుటకాజ్ఞాపించెనని, యాలకించి, పరమసంతుష్టులయిరి.

అని, తాత్పర్యము.

తతో యోధాంగనా స్సర్వా భర్తౄన్ సర్వాన్గృహేగృహే
యాత్రాగమన మాజ్ఞాయ త్వరయంతిస్మ హర్షితాః. ౨౫

టీక॥ తతః=అటుపిమ్మట;గృహేగృహే=ప్రతిగృహమునందును;యోధాంగనాః = సైనికులభార్యలు; సర్వాః= అందఱును; యాత్రాగమనం=ప్రయాణలాభమును;ఆజ్ఞాయ= తెలిసికొని;హర్షితాః = సంతసించినవారలై; భర్తౄన్=పెనిమిటులను; సర్వాన్= అందఱను;త్వరయంతిస్మ = వేగిరపఱిచిరి.

అంతఁ, బ్రతిగృహమునందును, సైనికులభార్యలందఱును, రామునియొద్దకుఁ బ్రయాణంబుసిద్ధించెనని తెలిసి, సంతుష్టలయి,తమతమభర్తలను, శీఘ్రముగాఁ బొండని, వేగిరపఱిచిరి.

అని, తాత్పర్యము.

తే హయై ర్గోరథైః శీఘ్రై స్స్యందనైశ్చ మహాజవైః
సహయోధై ర్బలాధ్యక్షా బలం సర్వ మచోదయన్. ౨౬

టీక॥ తే=ఆ; బలాధ్యక్షాః = సేనాధ్యక్షులు; హయైః=గుఱ్ఱములతోను; శీఘ్రైః=వడిగల ; గోరథైః = ఎద్దుబండ్లతోను ; మహాజవైః = అధికమయినవడిగల; స్యందనైశ్చ= రథములతోను ; యోధైస్సహ = సైనికులతోను; సర్వం=సమస్తమయిన; బలం=సైన్యమును; అచోదయన్=ఆజ్ఞాపించిరి.

ఆసేనాధ్యక్షులు , గుఱ్ఱంబులువడిగాంచుబోవునెద్దులబండ్లు మహావేగంబుల గురథంబులుయోధులుమొదలగుసైన్యంబునంతయునాయత్తంబుగావించిరి.

అని, తాత్పర్యము.

సజ్జంతు తద్బలం దృష్ట్వా భరతో గురుసన్నిధౌ
రథం మే త్వరయస్వేతి సుమంత్రం పార్శ్వతోఽబ్రవీత్. ౨౩

టీక॥ భరతః=భరతుండు; సజ్జః=ఆయత్తమయిన; తత్=ఆ; బలం = సైన్యమును; దృష్ట్వాతు=చూచినంతనె; గురుసన్నిధౌ=వసిష్ఠునిసమీపమునందు; పార్శ్వతః=ప్రక్కన(ఉన్న); సుమంత్రం=సుమంత్రునిగూర్చి; మే= నాయొక్క; రథం=రథమును; త్వరయస్వ=వేగిరపఱుపుము. ఇతి=అని; అబ్రవీత్=చెప్పెను.

భరతుండు, సైన్యంబంతయునాయత్తంబగుటంజూచి, వసిష్ఠసన్నిధానంబున, "వేగంబనారథంబుందె"మ్మని , తనపార్శ్వభాగంబుననున్నసుమంత్రునకాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

భరతస్యతు తస్యాజ్ఞాం ప్రతిగృహ్యచ హర్షితః
రథం గృహీత్వా ప్రయయౌ యుక్తం పరమవాజిభిః. ౨౫

టీక॥ సుమంత్రః(అధ్యాహృతము)=సుమంత్రుఁడు; తస్య=ఆ; భరతస్య=భరతునియొక్క; ఆజ్ఞాం=ఆజ్ఞను; ప్రతిగృహ్యచ=స్వీకరించియు; హర్షితః=సంతసించినవాఁడై; పరమవాజిభిః=ఉత్తమములగుగుఱ్ఱములతో; యుక్తం=కూడిన; రథం=రథమును; గృహీత్వా=తీసికొని; ప్రయయౌ=పోయెను.

సుమంత్రుండు, భరతునాజ్ఞనుశిరసావహించి, సంతోషంబునొంది, యుత్తమాశ్వంబులంబూన్చి, రథంబుందెచ్చెను. అని, తాత్పర్యము.

స రాఘవ స్సత్యధృతిః ప్రతాపవాన్
బ్రువన్ సుయుక్తం దృఢసత్యవిక్రమః
గురుం మహారణ్యగతం యశస్వినం
ప్రసాదయిష్యన్ భరతో బ్రవీ త్తదా. ౨౯

టీక॥ తదా= అప్పుడు; రాఘవః= రఘువంశమునందుఁబుట్టినవాఁడును; సత్యధృతిః= ఎప్పటికినిదఱుగనిధైర్యము గలవాఁడును; ప్రతాపవాన్= అధికమయినప్రతాపముగలవాఁడును; దృఢసత్యవిక్రమః = దృఢమునుసత్యమునగుపరాక్రమంబుగలవాఁడునగు; సః=ఆ; భరతః=భరతుఁడు; సుయుక్తం= మిక్కిలియుయుక్తముగా; బ్రువన్=చెప్పుచు; మహారణ్యగతం=కాఱడవినొందిన; యశస్వినం = అధికమయినకీర్తిఁగల; గురుం=అన్నయగురామునిఁ; ప్రసాదయిష్యన్ = ప్రసన్నునిఁజేయువాఁడై; అబ్రవీత్=చెప్పెను.

అప్పుడు, రఘువంశజాతుండునుమహాధైర్యుండునుమహా ప్రతాపుఁడునుమహాపరాక్రమశాలియునగుభరతుండు, పరమయుక్తంబుగా, మాటలాడి, మహారణ్యంబుననున్నయశస్వియగు రామునిఁబ్రసన్నుంజేయదలఁచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

తూర్ణం సముత్థాయ సుమంత్ర గచ్ఛ
బలస్య యోగాయ బలప్రధానాన్
ఆనేతు మిచ్ఛామి హితం వనస్థం
ప్రసాద్య రామం జగతో హితాయ. ౩౦

టీక॥ సుమంత్ర= సుమంత్రుఁడా! తూర్ణం=శీఘ్రముగా; సముత్థాయ= లేచి; బలస్య=సైన్యముయొక్క; యోగాయ = చేరుటకొఱకు ; బలప్రధానాన్ = సేనాధ్యక్షులనుగూర్చి; గచ్ఛ=పొమ్ము. జగతః = లోకముయొక్క; హితాయ=మేలుకొఱకు; వనస్థం=అడవియందున్న; తం=ఆ; రామం=రాముని ; ప్రసాద్య= ప్రసన్నునిగాఁజేసి; ఆనేతుం= తోడ్కొనివచ్చుటకు; ఇచ్ఛామిహి=కోరుచున్నానుగదా.

సుమంత్రుఁడా! నీవు , శీఘ్రంబున

లేచి, సేనాధ్యక్షులయొద్దకుఁబోయి, సైన్యంబులంగూర్చునట్లు, చేయుము; నేను; లోకహితంబుకొఱకు, వనంబునకుఁబోయి, రామునిఁబ్రసన్నుంజేసి, తోడ్కొని రావలయును. అని, భరతుండు, చెప్పెను. అని, తాత్పర్యము

స సూతపుత్రో భరతేన సమ్య
గాజ్ఞాపిత స్సంపరిపూర్ణకామః
శశాస సర్వాన్ ప్రకృతిప్రధానాన్
బలస్య ముఖ్యాంశ్చ సుహృజ్జనంచ. ౩౧

టీక॥ సః=ఆ; సూతపుత్రః= సుమంత్రుఁడు; భరతేన=భరతునిచేత; సమ్యక్=చక్కఁగా; ఆజ్ఞాపితః = ఆజ్ఞాపింపఁబడినవాఁడై; సంపరిపూర్ణకామః=చక్కఁగానిండినకోర్కులుగలవాఁడై; ప్రకృతిప్రధానాన్=జనులలో ముఖ్యులయిన వారలను; బలస్య = సైన్యమునకు; ముఖ్యాంశ్చ=ముఖ్యులగువారలను; సుహృజ్జనంచ= స్నేహితజనమును; సర్వాన్ = అందఱను; శశాస=ఆజ్ఞాపించెను.

సుమంత్రుండు, అట్లు; భరతునిచేనాజ్ఞాపింపఁపడినవాఁడై, తనకోర్కులన్నియుఫలించుటచేఁబరమసంతోషంబునొంది, ప్రజలలో ముఖ్యులగువారలకును, సేనానాయకులకును, సుహృజ్జనులకును. అందఱకును, బయనమయిరావలయునని, భరతాజ్ఞం దెలిపెను. అని, తాత్పర్యము.

తత స్స ముత్థాయ కులేకులే తే
రాజన్య వైశ్యా వృషలాశ్చ విప్రాః
అయూయుజ న్నుష్ట్రరథా న్రథాంశ్చ
నాగాన్ హయాంశ్చైవ కులప్రసూతాన్. ౩౨

టీక॥ తతః=అంత; కులేకులే=ప్రతిగృహమునందును; తే=ఆ; విప్రాః=బ్రాహ్మణులును; రాజన్యవైశ్యాః = క్షత్రియులును వైశ్యులును; వృషలాశ్చ; శూద్రులును; సముత్థాయ= లేచి; ఉష్ట్రరథాన్=ఒంటెలనుగాడిదలను; రథాంశ్చ=రథములను; నాగాన్= ఏనుఁగులను; కులప్రసూతాన్= మం

చివంశమునం దుఁబుట్టిన; హయాంశ్చ వ=గుఱ్ఱములను; అయోయుజశ్ = కూర్చుకొనిరి.

అంతఁ, బ్రతిగృహంబునందును, బ్రాహ్మణులును క్షత్రియులును వైశ్యులునుశూద్రులును, కొందఱు ఒంటెలనుగొందఱు గర్దభంబులనుగొందఱు రథంబులను, గొందఱుగజంబులనుగొందఱు త్తమాశ్వంబులను, ఆరోహించి, పయనంబయిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, ద్వ్యశీతితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండద్వ్యశీతితమ సర్గటీక ముగిసినది.

---

శ్రీ

త్ర్యశీతితమసర్గప్రారంభః.

తత స్సముత్థితః కాల్య మాస్థాయ స్యందనోత్తమమ్
ప్రయయౌ భరత శ్శీఘ్రం రామదర్శనకాంక్షయా. ౧

టీక॥ తతః=అటుపిమ్మట; భరతః= భరతుఁడు; కాల్యం = ఉషఃకాలమునందు; సముత్థితః = లేచినవాఁడై; స్యందనోత్తమం=రథంబులలోను త్తమమగురథమును; ఆస్థాయ=అధిష్ఠించి; రామదర్శనకాంక్షయా = రామునిచూచుకోరికచేత; శీఘ్రం = శీఘ్రముగాఁ; ప్రయయౌ=పోయెను.

అంత, భరతుండు, ఉషఃకాలంబున నెలేచి, యుత్తమంబగు రథంబునారోహించి, రామునింజూచు కౌతుకంబున శీఘ్రంబుగాఁబోయెను.

అని, తాత్పర్యము.

అగ్రతః ప్రయయు స్తస్య సర్వే మంత్రిపురోధసః
అధిరుహ్య హయై ర్యుక్తాన్ రథాన్ సూర్యరథోపమాన్. ౨

టీక॥ మంత్రిపురోధసః=మంత్రులును పురోహితులును; సర్వే= అందఱు; హయైః = గుఱ్ఱములతోఁ; యుక్తాన్= కూడిన; సూర్యరథోపమాన్=సూర్యరథములతోఁ బోల్కి గల; రథాన్=రథములను; అధిరుహ్య=ఎక్కి; తస్య=ఆభరతునియొక్క; అగ్రతః=ముందట; ప్రయయుః=పోయిరి.

మంత్రులుపురోహితులందఱు, సూర్యరథంబునకు సాటివచ్చుచున్న యశ్వయుక్తంబులగురథంబులనారోహించి, భరతునకుముందునడచిరి.

అని, తాత్పర్యము.

నవనాగసహస్రాణి కల్పితాని యథావిధి
అన్వయు ర్భరతం యాంత మిక్ష్వాకుకులనందనమ్. ౩

టీక॥యథావిధి= ఆజ్ఞనతిక్రమింపక; కల్పితాని = ఏర్పఱుపఁబడిన; నాగసహస్రాణి = ఏనుంగులయొక్క వేలు; నవ=తొమ్మిది; యాంతం=పోవుచున్న; ఇక్ష్వాకుకులనందనం= ఇక్ష్వాకువంశమును సంతసింపఁజేయునట్టి; భరతం=భరతుని; అన్వయుః=వెంబడించినవి.

భరతునియాజ్ఞచొప్పున, నయోధ్యయందలియేనుంగులలోఁ దొమ్మిదివేలయేనుంగులు, ఇక్ష్వాకువంశమునకు సంతోషంబుగల్గించునట్టి, భరతుని వెంబడించినడచినవి. అని, తాత్పర్యము.

షష్టీ రథసహస్రాణి ధన్వినో వివిధా యుధాః
అన్వయు ర్భరతం యాంతం రాజపుత్రం యశస్వినమ్. ౪

టీక॥రథసహస్రాణి=రథంబులయొక్క వేలు; షష్టిః = అఱువదియు; ధన్వినః=ధనుస్సుగలవారలును; వివిధాయుధాః= నానావిధములయినయాయుధములుగల వారలునగు, యోధులును; యాంతం=పోవుచున్న; యశస్వినం= అధికమయినకీర్తిగల; రాజపుత్రం=రాచకొమరుండగు; భరతం=భరతుని; అ

న్వయుః=వెంబడించిరి.

అఱువదివేలరథికులును, మఱియు నానావిధాయుధధరులగుయోధులును, యశస్వియగురాజకుమారుండునగుభరతుని, వెంటనడచిరి.

అని, తాత్పర్యము.

శతం సహస్రా ణ్యశ్వానాం సమారూఢాని రాఘవమ్
అన్వయు ర్భరతం యాంతం సత్య సంధం జితేంద్రియమ్. ౫

టీక॥సమారూఢాని = (యోధులచే) ఎక్కఁబడిన;అశ్వానాం= గుఱ్ఱములయొక్క;సహస్రాణి = వేలు;శతం = నూఱు; యాంతం = పోవుచున్న ; రాఘవం = రఘువంశమునందుఁబుట్టిన;సత్యసంధం = సత్యప్రతిజ్ఞుండయిన; జితేంద్రియం=జయింపఁబడినయింద్రియములుగల;భరతం= భరతుని;అన్వయుః=వెంబడించినవి.

అశ్వసాదులులక్షమంది , రఘువంశజాతుండునుసత్యసంధుండును ఇంద్రియనిగ్రహంబు గలవాఁడునగుభరతుని వెంబడింబోయిరి.అని, తాత్పర్యము.

కైకేయీచ సుమిత్రాచ కౌసల్యాచ యశస్వినీ
రామానయన సంహృష్టా యయు ర్యానేన భాస్వతా. ౬

టీక॥ కైకేయీ=కైకేయియు ; సుమిత్రాచ=సుమిత్రయు; యశస్వినీ=అధికమయినకీర్తిగల ; కౌసల్యాచ=కౌసల్యయు ; రామానయనసంహృష్టాః=రామునిదోడ్కొనివచ్చుటకు సంతసించినవారలయి; భాస్వతా = ప్రకాశించుచున్న; యానేన= వాహనముచేత; యయుః=పోయిరి.

కైకేయియుసుమిత్రయుయశస్వినియగుకౌసల్యయు, రామునిందోడ్కొనివచ్చుటకుఁబరమసంతుష్టలయియుత్తమవాహనంబులనెక్కిపోయిరి; అందుఁగైకేయి , తానుజేసినయకార్యంబునకుమిక్కిలియుఁ బశ్చాత్తాపమునొంది, మునుముందుగానడచినది.

అని, తాత్పర్యము.

ప్రయాతా శ్చార్యసంఘాతా రామం ద్రష్టుం సలక్ష్మణమ్

స౮౩

తస్యైవచ కథాశ్చిత్రాః కుర్వాణా హృష్టమానసాః. ౭

టీక॥ఆర్యసంఘాతాశ్చ= పూజ్యుల గుంపులును;సలక్ష్మణం=లక్ష్మణునితోఁగూడిన;రామం= రాముని;ద్రష్టుం=చూచుటకు;తస్య = ఆరాముని యొక్క;చిత్రాః= నానావిధములయిన;కథాఏవ=కథలనే; కుర్వాణాశ్చ= చేయుచును;హృష్టమానసాః = సంతసించినమనస్సుగలవై;ప్రయాతాః=పోయినవి.

పూజ్యులగుజనులు, గుంపులుగుంపులుగా, లక్ష్మణసహితుండగు రాముం జూచుటకై, యతనికథలనే నానావిధములం జెప్పుకొనుచుఁ, బరమసంతోషంబునంబోయిరి అని, తాత్పర్యము.

మేఘశ్యామం మహాబాహుం స్థిరసత్త్వం దృఢవ్రతమ్
కదా ద్రక్ష్యామహే రామం జగతశ్శోకనాశనమ్. ౮

టీక॥మేఘశ్యామం= మేఘమువలెన ల్లనైనవాఁడును;మహాబాహుం= పెద్దచేతులుగలవాఁడును;స్థిరసత్త్వం=చలనములేని బలముగలవాఁడును; దృఢవ్రతం= తిరుగుపాటులేనివ్రతముగలవాఁడును;జగతః= లోకముయొక్క; శోకనాశనం= దుఃఖముపోఁగొట్టువాఁడునగు;రామం=రాముని;కదా= ఎప్పుడు; ద్రక్ష్యామహే=చూడఁగలము?

మేఘంబువలెనల్లనిమేనుగలిగిదర్శనమాత్రంబునఁ దాపశాంతిం జేయువాఁడును, మహాబాహుండును మహాబలుండును దృఢవ్రతుండును లోకమునకంతయుదుఃఖంబుఁబోఁగొట్టి పరమానందంబుసేయువాఁడునగు, రాముని,ఎప్పుడు చూడఁగలము?అని, తాత్పర్యము.

దృష్టఏవ హి నశ్శోకమపనేష్యతి రాఘవః
తమస్సర్వస్య లోకస్య సముద్యన్నివ భాస్కరః. ౯

టీక॥రాఘవః= రాముఁడు;దృష్టఏవ=చూడఁబడినవాఁడైనంతనే;నః=మనయొక్క;శోకం = దుఃఖమును;సర్వస్య=సమస్తమయిన;లోకస్య = లోకముయొక్క;తమః = చీఁకటిని; సముద్యన్ = ఉదయించుచున్న;భాస్కరఇ

వ=సూర్యుఁడువలె;అపనేష్యతి= పోఁగొట్టఁగలఁడు.

రాముండు,మనల, మంచిమాటలం జేర్పనక్కఱలేదు; మందస్మితకటాక్షాదులనైనను,సమ్మానింపవలసినదిలేదు; దూరంబున నుదితుండగుసూర్యుండు, లోకంబునందలిచీఁకటినంతయునశింపఁజేయునట్లు,రాముండు, మనచేదూరంబునదృష్టుఁడయినంతనే,మనదుఃఖంబులన్నింటినింబోఁగొట్టఁగలఁడు. అని,వారలుపరస్పరముచెప్పుకొనిరి.

అని, తాత్పర్యము.

ఇత్యేవం కథయంత స్తే సంప్రహృష్టాః కథా శ్శుభాః
పరిష్వజానా శ్చాన్యోన్యం యయు ర్నాగరికా జనాః. ౧౦

టీక॥ తే=ఆ;నాగరికాః=పట్టణమునందలి;జనాః = జనులు;ఇతి=అని;ఏవం=ఇట్లు;శుభాః = మంగళకరంబులగు;కథాః=కథలను;కథయంతః=చెప్పుకొనుచు; సంప్రహృష్టాః=సంతోషించినవారలయి;అన్యోన్యం=ఒండొరులను; పరిష్వజానాః (పరిష్వజమానాః) = కౌఁగిలించుకొనుచు; యయుః = పోయిరి.

వారలీప్రకారము మంచిమంచిమాటలం జెప్పుకొనుచుఁ,బరమసంతోషంబునొండొరులం గవుఁగిలించుకొనుచుఁ, బోయిరి.అని, తాత్పర్యము.

యే చ తత్రాపరే సర్వే సమ్మతా యే చ నైగమాః
రామం ప్రతి యయు హృష్టా స్సర్వాః ప్రకృతయ స్తథా. ౧౧

టీక॥ సమ్మతాః=ఇష్టులగువారలు; అపరే=ఇతరులు;యే(సంతి)= ఎవ్వరు [illegible]; తే(అధ్యాహృతము) = వారలు;సర్వేచ= అందఱును;నైగమాః=వర్తకులు; యే (సంతి)= ఎవ్వరుగలరో. తే(అధ్యాహృతము)చ=వారలును; తథా=అట్లు;ప్రకృతయః = ప్రజలు;సర్వాః=అందఱును; హృష్టాః=సంతసించినవారలయి;రామంప్రతి = రామునిగూర్చి;యయుః=పోయిరి.

మఱియు, రామునకిష్టులయినవారులెవ్వరెవ్వరుగలరో, వారలందఱునువర్తకులును,అట్లు, పట్టణంబునందలిప్రజలందఱు,రామునొద్దకుఁ,బరమసంతో

షంబునంబోయిరి. అని, తాత్పర్యము.

మణికారాశ్చ యే కేచి త్కుంభకారాశ్చ శోభనాః
సూత్రకర్మకృతశ్చైవ యేచ శస్త్రోపజీవినః. ౧౨
మాయూరకాః క్రాకచికా రోచకా వేధకా స్తథా
దంతకారా స్సుధాకారా స్తథా గంధోప జీవినః. ౧౩
సువర్ణకారాః ప్రఖ్యాతా స్తథా కంబళధావకాః
స్నాపకోచ్ఛాదకా వైద్యా ధూపకా శ్శౌండికా స్తథా. ౧౪
రజకా స్తున్నవాయాశ్చ గ్రామఘోష మహత్తరాః
శైలూషాశ్చ సహస్త్రీభి ర్యయుః కైవర్తకా స్తథా. ౧౫

టీక॥ కేచిత్=కొందఱు; మణికారాః=రత్నములనుసానపెట్టువారలు; యే(సంతి)=ఎవ్వరుగలరో; తే(అధ్యాహృతము)చ= వారలును; శోభనాః= మంచివారలగు; కుంభకారాశ్చ= కుమ్మరవాండ్రును;సూత్రకర్మకృతశ్చైవ= గుడ్డలునేయువారలును;శస్త్రోపజీవినః= ఆయుధములనాశ్రయించిజీవించువారలు;యే(సంతి)=ఎవ్వరుగలరో; తే(అధ్యాహృతము)చ = వారలును; మాయూరకాః = నెమలిపింఛములచేవిసనకఱ్ఱలు మొదలగువానింజేయువారలును; క్రాకచికాః= అంపముచేనటుకువారలును; రోచకాః= తిన్నెలు మొదలగువానికివన్నెలుదీర్చువారలును ; తథా=అట్లు; వేధకాః= రత్నములుకొయ్యలు మొదలగువానికి రంధ్రములువేయువారలును; దంతకారాః= దంతపుపనిచేయువారలును ; సుధాకారాః= సున్నపుపనిచేయువారలును;తథా=అట్లు;గంధోపజీవినః= గంధద్రవ్యములనాశ్రయించి జీవించువారలును; ప్రఖ్యాతాః= ప్రసిద్ధులగు; సువర్ణకారాః= బంగారుపనిచేయు కంసలివాండ్రును;తథా=అట్లు;కంబళధావకాః= కంబళులనుశోధించువారలును; స్నాపకోచ్ఛాదకాః= తైలాభ్యంగాదిస్నానములుచేయించువారలును , ఒళ్లుపట్టువారలును;వైద్యాః=వైద్యులును; ధూపకాః = గృహంబులందు సుగంధిధూపంబులువేయువారలును; తథా= అట్లు; శౌండికాః=మద్యములుసేయువా




గలును;రజకాః= చాకలివారలునుస్తుతు న్నవాయాశ్చ = వస్త్రపువారలును; గ్రామఘోషమహత్తరాః=గ్రామం బులందునుగొల్లపల్లెలందును ప్రధాను లగువారలును;స్త్రీభిస్సహ=స్త్రీలతోఁ గూడ(ఉన్న). శైలూషాశ్చ=కూర్చిపె ట్టువారలును;తథా=అట్లు;కైవర్తకాః= చెంబడివాండ్రును;యయుః=పోయిరి.

మఱియుఁ బద్మరాగాది మణులంజ కట్టఁ జేయువారలును, కుమ్మరవాండ్రు ను గుడ్డలు సేయువారలును, ఆయుధో పజీవులును, నెమలిపింఛములచే విసనక ఱ్ఱలు మొదలగునవిచేయువారలునుజంప ముచే మాంత్రికులునఱకువారలునుదిన్నె లు గోడలు మొదలగు వానికివన్నెలుదీ ర్చువారలును,కొయ్యలురత్నములు ము న్నగువానికిరంధ్రములు వేయువారలును, జంతపుపనిసేయువారలును,సున్నపుప నివారలును, సుగంధద్రవ్యంబులనమ్మి కొనిజీవించు వారలును, చకచకఁగా బంగారుపనిసేయుకంసలి వాండ్రును, గంబళములలోనిముఱికిఁ దీయువారలు ను, తైలాభ్యంగనాదిస్నానంబులు సే యించువారలును, ఒత్తుపట్టు వాండ్రు ను,వైద్యులును,గృహంబులందు సుగం ధిధూపంబు వేయువారలును నానావి ధమద్యంబులుసేయువారలును, చాకలి వాండ్రును , వస్త్రపు పనివాండ్రును, గ్రామంబులం దేమి గొల్ల పల్లెలందేమి ప్రధానులగువారలును భార్యలంగూర్చి యిచ్చి జీవించునట్టి వారలును చెంబడి వారలును, రామునింజూచుటకు , భర తుని వెంబడిం బోయిరి.

అని, తాత్పర్యము.

సమాహితా వేదవిదో బ్రాహ్మణా వృత్తసమ్మతాః
గోరథై ర్భరతం యాంత మనుజగ్ముస్సహస్రశః. ౧౬

టీక॥సమాహితాః= సమాధియు క్తులును; వేదవిదః = వేదంబులు దెలిసి నవారలును;వృత్తసమ్మతాః= ఆచార ముచేఁబూజితులునగు;బ్రాహ్మణాః= బ్రాహ్మణులు; సహస్రశః= వేనవేలు గా; గోరథైః= ఎద్దుబండ్లచే; యాం తం=పోవుచున్న; భరతం= భరతుని; అనుజగ్ముః=వెంబడించిరి.

యోగసిద్ధులును వేదవేత్తలును స దాచారవంతులునగుబ్రాహ్మణులు వే నవేలుగా నెద్దుబండ్ల నెక్కి , భరతుని వెంబడింబోయిరి.

అని, తాత్పర్యము.




సువేషా శ్శుద్ధవసనా స్తామ్రమృష్టానులేపనాః
సర్వే తే వివిధై ర్యానై శ్శనై ర్భరత మన్వయుః. ౧౭

టీక॥ తే=వారలు; సర్వే=అందఱు ను; సువేషాః=మంచియలంకారముగలవారలై; శుద్ధవసనాః = నిర్మలములగువస్త్రములుగలవారలై; తామ్రమృష్టానులేపనాః = ఎఱ్ఱనిసంపూర్ణమైనపూఁతగలవారలై; వివిధైః = నానావిధములగు; యానైః=వాహనములచేత; శనైః = మెల్లఁగా; భరతం=భరతుని; అన్వయుః = వెంబడించిరి.

అట్లువారలందఱు, చక్కఁగానలంకరించికొని, నిర్మలంబులగు వస్త్రంబులుగట్టుకొని, రక్తచందనంబుఁ బూసికొని, నానావిధవాహనంబుల నెక్కి, మెల్లఁగా, భరతుని వెంబడించి, పోయిరి. అని, తాత్పర్యము.

ప్రహృష్ట ముదితా సేనా సాన్వయా త్కైకయీసుతమ్
భ్రాతు రానయనే యాంతం భరతం భ్రాతృవత్సలమ్. ౧౮

టీక॥ సా=ఆ; సేనా=సేన; ప్రహృష్టముదితా= గగుర్పాటునొందినదై సంతసించినదై; భ్రాతుః=అన్నయొక్క; ఆనయనే = తోడ్కొనివచ్చుటనిమిత్తము; యాంతం=పోవుచున్న; భ్రాతృవత్సలం = తోఁబుట్టువులందధికప్రేమగల; కైకయీసుతం= కైకేయికొడుకైన; భరతం=భరతుని; అన్వయాత్ = వెంబడించినది.

అట్లుసైనికులు, సంతోషంబున మేనులంబులకలువొడమ, నన్నయగు రాముం దోడ్కొనివచ్చు నిమిత్తమయిపోవుచున్న భ్రాతృభక్తిగలభరతుని వెంబడింబోయిరి. అని, తాత్పర్యము.

తే గత్వా దూర మధ్వానం రథయానాశ్వకుంజరైః
సమాసేదు స్తతో గంగాం శృంగిబేరపురంప్రతి. ౧౯
యత్ర రామసఖో వీరో గుహో జ్ఞాతిగణై ర్వృతః
నివసత్య ప్రమాదేన దేశం తం పరిపాలయన్. ౨౦

టీక॥ తే = వారలు; రథయానాశ్వకుంజరైః = రథములచేతనుఇతరవాహనములచేతనుగుఱ్ఱములచేతనుఏనుంగులచేతను; దూరం = దూరమయిన; అధ్వానం = మార్గమును; గత్వా = పోంది; తతః = అంత; యత్ర = ఎచ్చట; వీరః = పరాక్రమశాలియు; రామసఖః = రాముని స్నేహితుండగు; గుహః = గుహుండు; జ్ఞాతిగణైః = బంధుసమూహములచే; వృతః = పరివేష్టింపఁబడినవాఁడై; అప్రమాదేన = ఏమఱుపాటులేమిచేత; తం = ఆ; దేశం = దేశమును; పరిపాలయన్ = పాలింపుచు; నివసతి = ఉన్నాఁడో; తత్ = ఆ; శృంగిబేరపురం ప్రతి = శృంగిబేరపట్టణమునుగూర్చి, శృంగిబేరపట్టణసమీపమునందనుట ; గంగాం = గంగానదిని; సమాసేదుః = పొందిరి.

వారలు, రథంబులుగుఱ్ఱంబులుగజంబులుమొదలగునానావిధవాహనంబులచే, బహుదూరంబుపోయి, రామమిత్రుండును వీరుండునగుగుహుండుబంధుజనపరివృతుండై, యేమఱుపాటులేక, యాదేశంబంతయుఁ, బరిపాలింపుచు, నెచ్చట వాసంబుసేయుచుండునో, ఆ శృంగిబేరపురంబుసమీపంబున, గంగానదింజేరిరి. అని, తాత్పర్యము.

ఉపేత్య తీరం గంగాయా శ్చక్రవాకై రలంకృతమ్
వ్యవాతిష్ఠత సా సేనా భరతస్యా నుయాయినీ. ౨౧

టీక॥ భరతస్య = భరతునియొక్క ; అనుయాయినీ = వెంబడించునదైన ; సా = ఆ; సేనా = సేన; చక్రవాకైః = చక్రవాకపక్షులచేత ; అలంకృతం = అలంకరింపఁబడిన; గంగాయాః = గంగానదియొక్క; తీరం = గట్టును; ఉపేత్య = పొంది ; వ్యవాతిష్ఠత = నిలిచినది.

భరతునివెంబడించిపోయినయాసేన, చక్రవాకపక్షులతోనొప్పుచున్నగంగానదీతీరంబుఁజేరి, యచ్చటనిలిచినది. అని, తాత్పర్యము.

నిరీక్ష్యా నుగతాం సేనాం తాంచ గంగాం శివోదకామ్
భరత స్సచివాన్ సర్వా నబ్రవీ ద్వాక్య కోవిదః. ౨౨

టీక॥ వాక్యకోవిదః = మాటలయందుఁబండితుండగు ; భరతః = భరతు

డు; అనుగతాం= వెంబడివచ్చిన; సే
నాం=సేనను; శివోదకాం= మంగళ
కరంబగు; తాం=ఆ; గంగాంచ =
గంగానదిని; నిరీక్ష్య = చూచి; సచి
వాన్=మంత్రులను;సర్వాన్= అందఱ
నుగూర్చిన్; అబ్రవీత్=చెప్పెను.

మాటలయందుండిడితుండగు భ
రతుండు,తనవెంబడివచ్చినసేనను,మం
గళకరంబులగు జలంబులతో నొప్పుచు
న్నగంగానదినింజూచి, మంత్రులయం
దఱితో, నిట్లని, చెప్పెను-

అని,తాత్పర్యము-

నివేశయత మే సైన్య మభిప్రాయేణ సర్వతః
విశ్రాంతాః ప్రతరిష్యామ శ్శ్వ ఇదానీ మిమాం నదీమ్. ౨౩

టీక॥ మే=నాయొక్క; సైన్యం=సై
న్యమును; అభిప్రాయేణ=అభిప్రాయ
ముచేత;సర్వతః=అంతట;నివేశయత=
విడియునట్లుచేయుండు. ఇదానీం= ఇ
ప్పుడు ; విశ్రాంతాః=అలసటదీర్చుకొ
న్నవారలమయి ; శ్వః = రేపు; ఇ
మాం=ఈ; నదీం = నదిని; ప్రతరి
ష్యామః=దాటుదము.

మీయభిప్రాయముచొప్పుననిచ్చటనే,
నాసైన్యమును, అచ్చటచ్చటవిడియున
ట్లు చేయుండు; ఇప్పుడిచ్చటవిశ్రమించి
యీగంగానదిని రేపుదాటుదము.

అని,తాత్పర్యము.

దాతుంచ తావదిచ్ఛామి స్వర్గతస్య మహీపతేః
ఔర్ధ్వదేహనిమిత్తార్థ మవతీర్యోదకం నదీమ్. ౨౪

టీక॥నదీం=నదినిగూర్చి; అవతీర్య=
దిగి;స్వర్గతస్య= స్వర్గమునొందిన;
మహీపతేః = దశరథమహారాజునకు;
ఔర్ధ్వదేహనిమిత్తార్థం= ఊర్ధ్వ
దేహమునందలిసుఖప్రయోజనముకొఱ
కు;ఉదకం=జలమును, జలతర్పణమున
నుట; దాతుంచతావత్=ఇచ్చుటకును;
ఇచ్ఛామి=కోరుచున్నాను.

మఱియు,నేను,నదిలోనికిడిగ్గి, స్వ
ర్గతుండగుదశరథమహారాజునకు, స్వ
ర్గసౌఖ్యంబుగలుగుటకై, జలతర్పణం
బునుంజేయందలచియున్నాను.అని,భర
తుండు,మంత్రులకుంజెప్పెను.

అని, తాత్పర్యము.

తస్యైవం బ్రువతో మాత్యా స్తథే త్యుక్త్వా సమాహితాః
న్యవేశయం స్తాం ఛందేన స్వేన స్వేన పృథక్పృథక్. ౨౪

టీక॥ తస్య = ఆభరతుఁడు; ఏవం = ఇట్లు; బ్రువతః = చెప్పుచుండఁగా; అమాత్యాః = మంత్రులు; తథా = అట్లు, ఇతి = అని; ఉక్త్వా = చెప్పి; సమాహితాః = ఎచ్చరికగలవారలై; స్వేనస్వేన = తనతన; ఛందేన = ఇచ్ఛచేత; పృథక్పృథక్ = వేఱువేఱుగా; తాం = ఆసేనను; న్యవేశయన్ = విడియఁజేసిరి-

భరతుండు చెప్పినమాటను విని, యామంత్రులు, ఎచ్చరికతోఁ, దమయిష్టప్రకారము, వేఱు వేఱు, నాసేనకంతయు విడుదు లేర్పఱిచిరి. అని, తాత్పర్యము.

నివేశ్య గంగా మను తాం మహానదీం
చమూం విధానైః పరిబర్హశోభినీమ్
ఉవాస రామస్య తదా మహాత్మనో
విచింతయానో భరతో నివర్తనమ్. ౨౫

టీక॥ భరతః = భరతుఁడు; తదా = అప్పుడు; మహానదీం = గొప్పనదియగు; తాం = ఆ; గంగాం = గంగానదిని; అను = అనుసరించి; పరిబర్హశోభినీం = డేరాలచేఁ బ్రకాశించుచున్న; చమూం = సేనను; విధానైః = ఏర్పాటులచేత; నివేశ్య = విడియఁజేసి; మహాత్మనః = పూజ్యమగు స్వభావముగల; రామస్య = రామునియొక్క; నివర్తనం = మఱలించుటనుగూర్చి; విచింతయానః = ఆలోచించుచు; ఉవాస = ఉండెను.

భరతుండు, మహానదియగు గంగగట్టున, డేరాలలో సేనను విడియఁజేసి, మహాత్ముండగు రాముని నందోడ్కొని వచ్చువిషయంబుఁ గుఱించి, యాలోచించుచుండెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, త్ర్యశీతితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండత్ర్యశీతితమ సర్గటీక ముగిసినది.

---

శ్రీ

## చతురశీతితమసర్గః ప్రారంభః

తతో నివిష్టాం ధ్వజినీం గంగా మన్వాశ్రితాం నదీమ్
నిషాదరాజో దృష్ట్వైవ జ్ఞాతీ న్సంత్వరితోఽబ్రవీత్. ౧

టీక॥ తతః=అటుపిమ్మట; నిషాదరాజః=బోయలరాజయినగుహుండు; గంగాం=గంగయను; నదీం=నదిని; అన్వాశ్రితాం=పొందినదియు; నివిష్టాం=విడిసియున్నదియునగు; ధ్వజినీం=సేనను; దృష్ట్వైవ = చూచినంతనె; సంత్వరితః=వేగిరపడినవాఁడై; జ్ఞాతీన్ = బంధువులనుగూర్చి; అబ్రవీత్ =చెప్పెను.

అంత, నిషాదరాజుండగుగుహుండు, గంగానదిగట్టున, విడిసియున్న సేనంజూచినంతనె, త్వరితంబుగా, బంధువులంబిలిచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

మహతీయ మితః సేనా సాగరాభా ప్రదృశ్యతే
నాస్యాంత మధిగచ్ఛామి మనసాపి విచింతయన్. ౨

టీక॥ ఇతః=ఇచ్చట; మహతీ = గొప్పదియు; సాగరాభా = సముద్రముతో సమానమయినదియునగు; ఇయం=ఈ; సేనా=సేన; ప్రదృశ్యతే=చూడఁబడుచున్నది. విచింతయన్=ఆలోచించుచు; మనసాపి=మనసుచేనైనను; అస్య = ఈసైన్యముయొక్క; అంతం=తుదను; నాధిగచ్ఛామి= తెలియకున్నాను.

ఇచ్చట, సముద్రంబువలె నతివిస్తీర్ణమయిన సేనయగుపడుచున్నది; ఎంత చూచినను, దీనియంతము, మనంబునందలంచుటకును, అలవిగాకున్నది. అని, తాత్పర్యము.

యథాతు ఖలు దుర్బుద్ధి ర్భరత స్స్వయ మాగతః
స ఏష హి మహాకాయః కోవిదారధ్వజో రథే. ౩

టీక॥ దుర్బుద్ధిః=దుష్టబుద్ధిగల; భరతః=భరతుఁడు; స్వయం=తానే; ఆగతః=వచ్చినాఁడు. యథాతుఖలు=నిశ్చయము. సః=అట్టి; ఏషః=ఈ; మహాకాయః = పెద్దశరీరముగల; కోవిదారధ్వజః=కాంచనపుచెట్టురూపమయినధ్వజము; రథే=రథమునందు; అస్తి(అధ్యాహృతము) హి=ఉన్నదిగదా!

దుర్బుద్ధియగుభరతుండు, తానే, రాముని బాధింప వచ్చి యున్నాఁడు కాఁబోలు; ఇదినిశ్చయము; రథంబునందు, మహాకాయంబగు కోవిదారధ్వంజంబుకనుపడుచున్నదే! అని, తాత్పర్యము.

బంధయిష్యతివా దాశా నథవా స్మా న్వధిష్యతి

టీక॥ అయం(అధ్యాహృతము) = ఈభరతుఁడు; దాశాన్=చెంబడివాండ్రను; బంధయిష్యతివా= కట్టివేయునో; అథవా=లేక; అస్మాన్= మనలను; వధిష్యతి=చంపునోయేమో.

ఈభరతుండు, మన చెంబడివారలనందఱను, బంధించినను బంధించును; లేక, మనలనందఱును, వధించినను వధించును.

అని, తాత్పర్యము.

అథ దాశరథిం రామం పిత్రా రాజ్యా ద్వివాసితమ్. ౪
సంపన్నాం శ్రియ మన్విచ్ఛం స్తస్య రాజ్ఞ స్సుదుర్లభామ్
భరతః కైకయీపుత్రో హంతుం సమధిగచ్ఛతి. ౫

టీక॥ అథ = ఇంక ; కైకయీపుత్రః=కైకేయికొడుకైన; భరతః = భరతుఁడు; రాజ్ఞః=రాజయిన, రాజుకాఁదగినయనుట; తస్య=ఆరామునకు; సుదుర్లభాం=పొందనలవిగాని ; సంపన్నాం=సంపూర్ణమయిన ; శ్రియం=సంపదను; అన్విచ్ఛన్= కోరుచు; పిత్రా=తండ్రిచేత; రాజ్యాత్=రాజ్యంబుననుండి; వివాసితం=వెడలఁగొట్టఁబడిన; దాశరథిం=దశరథునికొడుకైన; రామం = రాముని ; హంతుం=చంపుటకు; సమధిగచ్ఛతి= పోవుచున్నాఁడు.

ఇంకనీకైకేయికొడుకుభరతుండు,

రాజగుటకునర్హుండగు రాముండుమఱల వచ్చినచోఁదనకురాజ్యంబుదక్కదని, యతనికిదుర్లభంబగునట్లు,సమస్తసంపదలనుదానెపొందఁగోరి, తండ్రిచే నూరువెడలఁగొట్టఁబడియరణ్యంబుననున్నరాముని, వధించుటకై, వచ్చుచున్నాఁడు. అని,తాత్పర్యము.

భర్తాచైవ సఖాచైవ రామో దాశరథి ర్మమ
తస్యార్థకామా స్సన్నద్ధా గంగానూపే ప్రతిష్ఠత. ౬

టీక॥ దాశరథిః= దశరథునికొడుకైన; రామః=రాముఁడు; మమ=నాయొక్క; భర్తాచైవ=ప్రభుండును; సఖాచైవ= స్నేహితుండును. యూయం (అధ్యాహృతము)=మీరలు; తస్య = ఆరామునియొక్క; అర్థకామాః = ప్రయోజనముగోరువారలై; సన్నద్ధాః = సన్నాహముతోఁగూడినవారలై;గంగానూపే= గంగాతీరంబునందు;ప్రతిష్ఠత=ఉండుఁడు.

దశరథపుత్రుండగురాముండు, నాకుఁబ్రభుండును,మిత్రుండును; కావున, మీరలు,రామునికార్యంబునిమిత్తమయి సన్నద్ధులరయి, గంగాతీరంబున, నుండుఁడు. అని; తాత్పర్యము.

తిష్ఠంతు సర్వే దాశాశ్చ గంగా మన్వాశ్రితా నదీమ్
బలయుక్తా నదీరక్షా మాంసమూలఫలాశనాః. ౭

టీక॥ దాశాః=చెంబడివారలు; సర్వేచ=అందఱును; గంగాం=గంగయను;నదీం=నదిని; అన్వాశ్రితాః=పొందినవారలయి; బలయుక్తాః= సైన్యముతోఁగూడినవారలయి; మాంసమూలఫలాశనాః=మాంసమునుగడ్డలును ఫలములునె యాహారము గాఁగలవారలయి;నదీరక్షాః = నదినిరక్షించువారలయి;తిష్ఠంతు=ఉందురుగాక.

మనచెంబడివారలందఱును,సైన్యసమేతులయియోడలమీఁద గంగానదికడ్డముగానుండి,యోడలలోనే,మాంసమునుగడ్డలనుఫలంబులనుందినుచు, నేటిరేవునురక్షించుకొనుచుందురుగాక.

అని, తాత్పర్యము.

నావాం శతానాం పంచానాం కైవర్తానాం శతంశతమ్
సన్నద్ధానాం తథా యూనాం తిష్ఠం త్విత్య భ్యచోదయత్. ౮

టీక॥నావాం=ఓడలయొక్క; శతానాం=నూఱులయొక్క; పంచానాం=అయిదింటికిని;సన్నద్ధానాం=కవచము: దొడుగుకొన్నవారలును;తథా=అట్లు; యూనాం = యౌవనముగలవారలునగు;కైవర్తానాం=చెంబడివారలయొక్క ; శతంశతం=నూఱుగురు నూర్గురు;తిష్ఠంతు=ఉండురుగాక. ఇతి=అని; అభ్యచోదయత్=ఆజ్ఞాపించెను.

అయిదువందలయోడలింటికి, ఓడ యొకటింటికి,యుద్ధసన్నద్ధులునుయౌవనవంతులునగుకైవర్తులు నూగుఱారు వంతునఁ గాచియుండుఁడు. అని, గుహుండు,చెంబడివారలకాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

యదా౽దుష్టస్తు భరతో రామస్యేహ భవిష్యతి
సేయం స్వస్తిమతీ సేనా గంగా మద్య తరిష్యతి. ౯

టీక॥ఇహ=ఇప్పుడు;భరతః= భరతుఁడు;రామస్య = రామునివిషయమయి;అదుష్టః=దోషములేనివాఁడు; యదాతుభవిష్యతి=అగునేని;సా = ఆ;ఇయం=ఈ;సేనా=సేన;అద్య = ఇప్పుడు; స్వస్తిమతీ = మంగళముగలదై; గంగాం=గంగానదిని; తరిష్యతి=దాఁటఁగలదు.

భరతుండు, రామునిపట్లద్రోహచింతలేనివాఁడగునేని,యతనిసైన్యమునుసుఖముగా గంగానదిని దాఁటనిత్తము. అని, గుహుండు, చెంబడివారలతోఁజెప్పెను.అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వోపాయనం గృహ్య మత్స్యమాంసమధూని చ
అభిచక్రామ భరతం నిషాదాధిపతి గుహః. ౧౦

టీక॥నిషాదాధిపతిః= బోయలకుఁ బ్రభువైన;గుహః=గుహుఁడు;ఇతి=ఇట్లు;ఉక్త్వా= చెప్పి;మత్స్యమాంసమధూని= మత్స్యములను మాంసములను

తేనెను; ఉపాయనం=కానుకను; గృహ్యా (గృహీత్వా)చ=తీసికొనియు; భరతం= భరతునిగూర్చి; అభిచక్రామ=పోయెను.

నిషాదాధీశ్వరుండగుగుహుండు ప్రకారమాజ్ఞాపించి, మత్స్యములను మాంసములను తేనెను గానుకగాఁ దీసికొని, భరతునొద్దకుం బోయెను,

అని, తాత్పర్యము.

త మాయాంతం తు సంప్రేక్ష్య సూతపుత్రః ప్రతాపవాన్
భరతాయా చచక్షే థ వినయజ్ఞో వినీతవత్. ౧౧

టీక॥ అథ=అంత; ప్రతాపవాన్= అధికమయినప్రతాపముగలవాఁడును; వినయజ్ఞః=వినయంబుదెలిసిన వాఁడునగు; సూతపుత్రః=సుమంత్రుండు; ఆయాంతం=వచ్చుచున్న; తం= ఆగుహుని; సంప్రేక్ష్యతు=చూచినంతనే; వినీతవత్= వినయంబుగలవాఁడై; భరతాయ= భరతునికొఱకు; ఆచచక్షే = చెప్పెను.

అంత, ప్రతాపవంతుండును రాజుల యెడ వినయంబుతోనుండుటం జక్కఁగాఁదెలిసినవాఁడునగు సుమంత్రుండు, గుహుండు వచ్చుటంజూచి, వినయంబున నాసంగతినిభరతునకుం జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏష జ్ఞాతిసహస్రేణ స్థపతిః పరివారితః
కుశలో దండకారణ్యే వృద్ధో భ్రాతుశ్చ తే సఖా. ౧౨

టీక॥ ఏషః=ఈ; స్థపతిః= ప్రభుండగుగుహుఁడు; జ్ఞాతిసహస్రేణ=బంధుజనసహస్రము చేత; పరివారితః=చుట్టఁబడినవాఁడు; వృద్ధః=ముసలివాఁడు; దండకారణ్యే=దండకారణ్యమునందు; కుశలః=సమర్థుఁడు; తే=నీయొక్క; భ్రాతుః=అన్నయొక్క; సఖాచ=స్నేహితుండును.

నిషాదప్రభుండగునీగుహుండు బంధుజనంబెచ్చుగాఁగలవాఁడు, వృద్ధుండు దండకారణ్యంబునందు సంచరించుటయందుమిక్కిలియు సమర్థుఁడు; నీయన్నరామునకు స్నేహితుండును.

అని, తాత్పర్యము.

తస్మా త్పశ్యతు కాకుత్స్థ త్వాం నిషాదాధిపో గుహః
అసంశయం విజానీతే యత్ర తౌ రామలక్ష్మణౌ. ౧౩

టీక॥ కాకుత్స్థ=భరతుఁడా! తస్మాత్=అందువలన; నిషాదాధిపః= బోయవాండ్రకుఁ బ్రభువైన; గుహః= గుహుఁడు; త్వాం=నిన్ను; పశ్యతు=చూచుఁగాక. యత్ర=ఎచ్చట; తౌ=ఆ; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు; వర్తేతే (అధ్యాహృతము) = ఉన్నారో; తత్ (అధ్యాహృతము) = ఆస్థలమును; అయం(అధ్యాహృతము) = ఈగుహుండు; అసంశయం=సందేహములేనట్లుగా; విజానీతే=ఎఱుంగును.

భరతుఁడా! అందువలన, నీవునిషాదాధీశ్వరుండగు, నీగుహునకు దర్శనమియ్యవలయును; మనరామలక్ష్మణులెచ్చటనున్నారో, అసంగతియితనికి, నిస్సంశయంబుగాఁ దెలిసి యుండును. అనిసుమంత్రుండు, భరతునకుఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏతత్తు వచనం శ్రుత్వా సుమంత్రా ద్భరత శ్శుభమ్
ఉవాచ వచనం శీఘ్రం గుహః పశ్యతు మా మితి. ౧౪

టీక॥ భరతః = భరతుఁడు; సుమంత్రాత్=సుమంత్రునివలన; శుభం = మంగళకరమగు; ఏతత్ = ఈ; వచనం=మాటను; శ్రుత్వాతు= విన్నంతనె; "గుహః=గుహుఁడు; శీఘ్రం= శీఘ్రముగా; మాం=నన్ను; పశ్యతు = చూచుఁగాక." ఇతి=అని; వచనం = మాటను; ఉవాచ=చెప్పెను.

భరతుండు, సుమంత్రుండు చెప్పిన మంగళకరంబగుమాటను వినినంతనె, "శీఘ్రంబుగాగుహునినాయొద్దకు రానిమ్ము" అని, సుమంత్రునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

లబ్ధ్వా భ్యనుజ్ఞాం సంహృష్టో జ్ఞాతిభిః పరివారితః
ఆగమ్య భరతం ప్రహ్వో గుహో వచన మబ్రవీత్. ౧౫

టీక॥ గుహః=గుహుఁడు; అభ్యనుజ్ఞాం=అనుమతిని; లబ్ధ్వా=పొంది; సం

హృష్టః = సంతసించినవాఁడై; జ్ఞాతిభిః=బంధువులచేత ; పరివారితః=పరివేష్టింపఁబడినవాఁడై; ఆగమ్య= వచ్చి ప్రహ్వః=నమ్రుండై; భరతం=భరతునిగూర్చి;వచనం= మాటను;అబ్రవీత్ = చెప్పెను.

గుహుండు,ఇట్లనుజ్ఞనొంది, సంతుష్టుండై, బంధువులంగూడి, లోనికింబోయి,భరతుంజూచి, నమ్రుండై, యిట్లని,చెప్పెను. అని,తాత్పర్యము.

నిష్కుటశ్చైవ దేశోయం వంచితాశ్చాపి తే వయమ్
నివేదయామ స్తే సర్వే స్వకే దాసకులే వస. ౧౮

టీక॥అయం=ఈ;దేశః= దేశము; నిష్కుటశ్చైవ=పెరటివంటిదే. తే=అట్టి;వయంచాపి = మేమును; వంచితాః=వంచింపఁబడినాము. స్వకే=నీదైన;దాసకులే=దాసునియింటియందు;వస=ఉండుము.ఇతి(అధ్యాహృతము)=అని;సర్వే=అందఱమును; తే=నీకు;నివేదయామః= తెల్పుకొనెదము.

ఈనాదేశము,నీయింటిపెరటివంటిదేకదా!నీరాకదెలియకపోవుటచే, మేమందఱమును మోసపోతిమి;మాకుఁదెలిసియుండునేని,నీకుఁజేయవలసినప్రత్యుత్థానాదులుగావింతుము;ఇప్పుడును, నీదాసులమయినమాయింటనుండిపోవలసినదని, మేమందఱమునుప్రార్థించుచున్నాము.అని,తాత్పర్యము.

అస్తి మూలం ఫలంచైవ నిషాదై స్సముపాహృతమ్
ఆర్ద్రంచ మాంసం శుష్కంచ వన్యంచోచ్చావచంమహత్. ౧౯

టీక॥ నిషాదైః= బోయవాండ్రచేత;సముపాహృతం= సంపాదింపఁబడిన;మూలం=గడ్డలును;ఫలంచైవ= పండ్లును;ఆర్ద్రం=తడిదైన;మాంసంచ=మాంసమును;శుష్కంచ=ఎండినమాంసంబును;ఉచ్చావచం=నానావిధమయిన;వన్యంచ= అడవియందుఁబుట్టినధాన్యంబులును; మహత్ =అధికముగా;అస్తి=కలదు.

మూలంబులునుఫలంబులునుఆర్ద్రమాంసంబునుఎండినమాంసంబును, మఱియునానావిధంబులయిన నీవారంబులు మొదలగునడవిధాన్యంబులును,సిద్ధంబుగావించికొనియున్నాము.

అని, తాత్పర్యము.

ఆశంసే స్వాశితా సేనా వత్స్యతీ మాం విభావరీమ్
అర్చితో వివిధైః కామై శ్శ్వ స్ససైన్యో గమిష్యసి. ౧౭

టీక॥ సేనా = సేన; స్వాశితా = చక్కఁగా భుజింపఁజేయఁబడినదై; ఇమాం = ఈ; విభావరీం = రాత్రియంతయు; వత్స్యతి = ఉండఁగలదు. త్వం (అధ్యాహృతము) = నీవు; వివిధైః = నానావిధంబులగు; కామైః = కోరఁదగినపదార్థములచేత; అర్చితః = పూజింపఁబడినవాఁడవై; శ్వః = రేపు; ససైన్యః = సైన్యముతోఁగూడినవాఁడవై; గమిష్యసి = పోఁగలవు. ఇతి (అధ్యాహృతము) = అని; ఆశంసే = ప్రార్థించుచున్నాను.

ఈ సేనయంతయు, మాయింటం జక్కఁగా భుజించి యీ రాత్రియంతయు నుండఁగలదు. నీవును, మేము గావించు నానావిధ పూజలం గైకొని, రేపు సైన్యసమేతుండవై పోవచ్చునని ప్రార్థించుచున్నాను. అని గుహుండు భరతునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, చతురశీతితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండచతురశీతితమసర్గటీక ముగిసినది.



౩౭

పంచాశీతితమసర్గప్రారంభః.

ఏవ ముక్తస్తు భరతో నిషాదాధిపతిం గుహమ్
ప్రత్యువాచ మహాప్రాజ్ఞో వాక్యం హేత్వర్థ సంహితమ్. ౧

టీక॥ మహాప్రాజ్ఞః = మహాపండితుండగు ; భరతస్తు = భరతుండును; ఏవం=ఇట్లు; ఉక్తః= చెప్పఁబడినవాఁడై;నిషాదాధిపతిం = బోయలకుఁబ్రభువైన; గుహం=గుహునిగూర్చి ; హేత్వర్థసంహితం = కారణముతోను బ్రయోజనముతోను గూడిన ; వాక్యం=మాటను; ప్రత్యువాచ = బదులుచెప్పెను.

మహాపండితుండగుభరతుండు , నిషాదాధీశ్వరుండగుగుహుండు చెప్పినది విని, యతనింజూచి,సహేతుకంబుగా సప్రయోజనంబుగా , నీమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

ఊర్జితః ఖలు తే కామః కృతో మమ గురో స్సఖే
యో మే త్వ మీదృశీం సేనా మేకో౽భ్యర్చితు మిచ్ఛసి. ౨

టీక॥మమ=నాయొక్క; గురోః= అన్నయగురామునియొక్క ; సఖే = స్నేహితుఁడా! యః=ఏ; త్వం=నీవు; ఏకః=ఒక్కఁడవే ; మే=నాయొక్క; ఈదృశీం=ఇట్టి; సేనాం = సేనను ; అభ్యర్చితుం = పూజించుటకు ; ఇచ్ఛసి=కోరుచున్నావో;తస్య (అధ్యాహృతము)=అట్టి; తే=నీయొక్క; ఊర్జితః=అధికమయిన; కామః= కోరిక; కృతః ఖలు=చేయఁబడినదేకదా!

నాయన్నయగురామునిస్నేహితుండవగుగుహుఁడా! నీవు,ఒక్కఁడవె,నాయింతటిసేనకునుం బూజసేయఁ గోరుచున్నావే;ఈమాటవలననే,నీకోరిక కన్నన దికముగా, మాకుఁబూజగావించినవాఁడవగుచున్నావు. అని,భరతుండు,గుహునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా తు మహాతేజా గుహం వచన ముత్తమమ్

అబ్రవీ ద్భరత శ్శ్రీమాన్ నిషాదాధిపతిం పునః. ౩

టీక॥ మహాతేజాః=అధికమయినపరాక్రమముగలవాఁడును; శ్రీమాన్=అధికమయినకాంతిగలవాఁడునగు; భరతః=భరతుఁడు; గుహం=గుహునిఁగూర్చి; ఇతి=ఇట్లు; ఉత్తమం=శ్రేష్ఠమయిన; వచనం=మాటను; ఉక్త్వాతు=చెప్పియు; పునః= మఱల; నిషాదాధిపతిం=బోయలకుఁ బ్రభుండగు గుహుంగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

మహాతేజుండును శ్రీమంతుండు నగు భరతుండు, ఇట్లు, నిషాదాధీశ్వరుండగు గుహునితో నుత్తమంబగు మాటం జెప్పి, మఱల, నతనిఁ జూచి, యిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

కతరేణ గమిష్యామి భరద్వాజాశ్రమం గుహ
గహనోయం భృశం దేశో గంగానూపో దురత్యయః. ౪

టీక॥ గుహ=గుహుఁడా! అహం(అధ్యాహృతము)=నేను; కతరేణ=ఏమార్గముచేత; భరద్వాజాశ్రమం=భరద్వాజాశ్రమమునుగూర్చి; గమిష్యామి=పోఁగలను. అయం=ఈ; దేశః=దేశము; భృశం=మిక్కిలియు; గహనః=ప్రవేశింపనలవిగానిది. గంగానూపః=గంగాజలప్రదేశము; దురత్యయః=అతిక్రమింపఁగూడనిది.

గుహుఁడా! భరద్వాజాశ్రమంబునకేమార్గంబునఁబోవలెను? ఈదేశంబుమిగులదుష్ప్రవేశంబయియున్నది; ఈగంగాజలంబులం దరించుట యెంతికిలియుఁగష్టము. అని, భరతుండు, గుహునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా రాజపుత్రస్య ధీమతః
అబ్రవీ త్ప్రాంజలి ర్వాక్యం గుహో గహనగోచరః. ౫

టీక॥ గహనగోచరః = అడవియందుండునట్టి; గుహః=గుహుఁడు; రాజపుత్రస్య=రాచకొమరుండును; ధీమతః=బుద్ధిమంతుఁడునగు; తస్య=ఆభరతునియొక్క; తత్=ఆ; వచనం = మాటను ; శ్రుత్వా=విని ; ప్రాంజలిః = మంచిచేమోడ్పుగలవాఁడై; వాక్యం = మాటను ; అబ్రవీత్=చెప్పెను.

అడవులందుఁదిరుగునట్టిగుహుండు, రాచకొమరుండును బుద్ధిమంతుండున గుభరతునిమాటనువిని , చేతులు మొగిడ్చి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

దాశా స్త్వానుగమిష్యంతి ధన్వినస్సుసమాహితాః
అహం త్వానుగమిష్యామి రాజపుత్ర మహాయశః. ౬

టీక॥ మహాయశః= అధికమయినకీర్తిఁగల; రాజపుత్ర=రాచకొమరుండవగుభరతుఁడా! దాశాః= చెంబడివారలు;ధన్వినః=విల్లుగలవారలై ;సుసమాహితాః=మిక్కిలియు నెచ్చరికగలవారలై; త్వా= నిన్ను; అనుగమిష్యంతి= వెంబడింపఁగలరు. అహం = నేను ; త్వా=నిన్ను; అనుగమిష్యామి= వెంబడింపగలను.

మహాయశుండవు రాజపుత్రుండవగు, భరతుఁడా! మా చెంబడివారలు, ధనుర్ధరులయి మిక్కిలియు నెచ్చరికతోనీ వెంబడి రాఁగలరు; నేనునునీ వెంబడి వచ్చెదను; నీకుమాగఱచింతయుక్కఱ లేదు. అని, తాత్పర్యము.

కచ్చి న్నదుష్టో వ్రజసి రామస్యా క్లిష్టకర్మణః
ఇయం తే మహతీ సేనా శంకాం జనయతీవ మే. ౭

టీక॥త్వం(అధ్యాహృతము)=నీవు; అక్లిష్టకర్మణః=దుఃఖముగలిగింపనికార్యములుగల; రామస్య= రామునివిషయమయి;దుష్టః= దోషముతోఁగూడినవాఁడవై ;నవ్రజసికచ్చిత్ = పోవువాఁడవు కావుగదా? తే = నీయొక్క;మహతీ= గొప్పదగు;ఇయం=ఈ; సేనా= సేన; మే=నాకు; శంకామివ=కొంచెముసందేహమును; జనయతి = కలిగించుచున్నది.

నీవు, ఎవ్వరికినిదుఃఖంబు గల్గింపని కార్యంబులేచేయునట్టిరామునకు,ద్రోహంబు సేయుటకై,పోవువాఁడవుకావు గదా? నీతోఁగూడవచ్చినయింతగొప్ప సేనంజూడఁగా,నాకుఁగొంచెముసందేహముగలుగుచున్నది.అని,గుహుండుభరతునితోఁజెప్పెను.అని, తాత్పర్యము.

తమేవ మభిభాషంత మాకాశఇవ నిర్మలః
భరత శ్శ్లక్ష్ణయా వాచా గుహం వచన మబ్రవీత్. ౮

టీక॥ఆకాశఇవ=ఆకాశమువలె; నిర్మలః=స్వచ్ఛుండగు;భరతః = భరతుఁడు;ఏవం=ఇట్లు; అభిభాషంతం=చెప్పుచున్న;గుహం=గుహునిగూర్చి;శ్లక్ష్ణయా=మృదువయిన; వాచా=మాటచేత;వచనం=మాటను;అబ్రవీత్ = చెప్పెను.

ఆకాశంబువలె నిర్దోషుండై యున్న భరతుండు, ఈవిధంబునం జెప్పుచున్న గుహుంజూచి,మృదువాక్యంబున, నిట్లని, చెప్పెను.అని, తాత్పర్యము.

మాభూ త్సకాలో యత్కష్టం న మాం శంకితు మర్హసి
రాఘవ స్స హి మే భ్రాతా జ్యేష్ఠః పితృసమో మతః.౯

టీక॥యత్ = ఏకాలమునందు;కష్టం=ఇట్టి,కష్టము; స్యాత్(అధ్యాహృతము)=కలుగునో; సః=అట్టి;కాలః=కాలము;మాభూత్=కలుగకుండుఁగాక.మాం=నన్నుఁగూర్చి;శంకితుం=సందేహించుటకు; నార్హసి = తగవు.సః=ఆ; రాఘవః=రాముఁడు;మే=నాయొక్క; జ్యేష్ఠః,భ్రాతా=అన్నయు;పితృసమః=తండ్రితోసమానుఁడుగా; మతోహి=ఎన్నఁబడినవాఁడునుగదా!

నేను రామునకుద్రోహముచేయుదునని నీకు సందేహముగలిగినదే! ఇట్టికష్టకాలమింక సంభవింపకుండుఁగాక; నీవు నాయందుసందేహంబుంచవలదు; రాముండు,నాకుజ్యేష్ఠభ్రాత, కావునఁ,దండ్రివంటివాఁడేకదా!

అని, తాత్పర్యము.

తం నివర్తయితుం యామి కాకుత్థ్సం వనవాసినమ్
బుద్ధి రన్యా న తే కార్యా గుహ సత్యం బ్రవీమి తే. ౧౦

టీక॥గుహ=గుహుఁడా! వనవాసినం=అడవియందున్న; తం=ఆ; కాకుత్థ్సం=రాముని;నివర్తయితుం=మఱలించుటకు;యామి=పోవుచున్నాను. తే




(త్వయా)=నీచేత;అన్యా=ఇతరమయి నః;బుద్ధిః=తలంపు; నకార్యా=చేయఁదగినదికాదు. తే=నీకు;సత్యం= సత్యమును;బ్రవీమి=చెప్పుచున్నాను.

గుహుఁడా! అడవియందున్న రాముని మఱలించితోడ్కొనివచ్చుటకై , పోవుచున్నాను ;నీవు వేఱువిధమునందలంపవలదు; నీకుసత్యముఁజెప్పుచున్నాను; అని భరతుఁడు,గుహునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

సతు సంహృష్టవదన శ్శ్రుత్వా భరతభాషితమ్
పునరేవాబ్రవీ ద్వాక్యం భరతం ప్రతి హర్షితః. ౧౧

టీక॥సతు=ఆగుహుండు;భరతభాషితం=భరతునిమాటను;శ్రుత్వా= విని;సంహృష్టవదనః = సంతసించినముఖముగలవాఁడై, ప్రసన్నమయినముఖముగలవాఁడైయనుట ; హర్షితః = సంతోషమునొందినవాఁడై ; పునరేవ= మఱలనే; భరతంప్రతి = భరతునిగూర్చి; వాక్యం=మాటను;అబ్రవీత్= చెప్పెను.

ఆగుహుండు , భరతుండుచెప్పిన మాటనువిని, ప్రసన్నవదనుండై పరమసంతుష్టుండై,భరతుంజూచి, మఱలనిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ధన్య స్త్వం న త్వయా తుల్యం పశ్యామి జగతీతలే
అయత్నా దాగతం రాజ్యం య స్త్వం త్యక్తు మిహేచ్ఛసి. ౧౨

టీక॥ యః=ఏ;త్వం=నీవు;ఇహ = ఇప్పుడు; అయత్నాత్= ప్రయత్నములేమివలన; ఆగతం=ప్రాప్తించిన;రాజ్యం=రాజ్యమును ; త్యక్తుం=విడుచుటకు; ఇచ్ఛసి=కోరుచున్నావో ; సః (అధ్యాహృతము)=అట్టి; త్వం=నీవు; ధన్యః=పుణ్యవంతుఁడవు! త్వయా = నీతోః తుల్యం=సమానుఁడగువాని; జగతీతలే = భూతలమునందు; నపశ్యామి=చూడను.

అప్రయత్నంబుగాఁబ్రాప్తంబయిన రాజ్యంబునుగూడ విడువం గోరుచున్నావే; నీవెపుణ్యవంతుఁడవు; నీయట్టి ధార్మికుని, భూలోకంబున నెచ్చట నేని, నేనిదివఱకుఁజూడలేదు.

అని, తాత్పర్యము.




శాశ్వతీ ఖలు తే కీర్తి ర్లోకా ననుచరిష్యతి
యస్త్వం కృచ్ఛ్రగతం రామం ప్రత్యానయితు మిచ్ఛసి. ౧౩

టీక॥యః=ఏ;త్వం= నీవు;కృచ్ఛ్రగతం=కష్టమునొందిన;రామం=రాముని;ప్రత్యానయితుం (ప్రత్యానేతుం)=మఱలందోడ్కొనివచ్చుటకు; ఇచ్ఛసి=కోరుచున్నావో; తస్య (అధ్యాహృతము)= అట్టి; తే=నీయొక్క; కీర్తిః=కీర్తి;శాశ్వతీ = నాశములేనిదై; లోకాన్=లోకంబులను;అనుచరిష్యతి=అనుసరించియుండఁగలదు.

నీవు కష్టంబునొందియున్నరాముని మఱలఁదోడ్కొనివచ్చిసుఖింపఁజేయం గోరుచున్నావుకావున, నీకీర్తి శాశ్వతంబుగా, సమస్తలోకంబులందును, వ్యాపించియుండఁగలదు, అని,గుహుండుభరతునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవం సంభాషమాణస్య గుహస్య భరతం తదా
బభౌ నష్టప్రభ స్సూర్యో రజనీ చాభ్యవర్తత. ౧౪

టీక॥తదా= అప్పుడు; గుహస్య=గుహుఁడు;భరతం= భరతునిఁగూర్చి; ఏవం=ఇట్లు;సంభాషమాణస్య= మాటలాడుచుండఁగా;సూర్యః= సూర్యుఁడు;నష్టప్రభః= నశించినకాంతిగలవాఁడై;బభౌ=ప్రకాశించెను.రజనీచ=రాత్రియు; అభ్యవర్తత=వచ్చినది.

అప్పుడు, గుహుండిట్లు, భరతునితోమాటలాడుచుండఁగానె, సూర్యుం డస్తమించెను; నంతరాత్రియువచ్చినది.

అని; తాత్పర్యము.

సన్నివేశ్య స తాం సేనాం గుహేన పరితోషితః
శత్రుఘ్నేన సహ శ్రీమాన్ శయనం సముపాగమత్. ౧౫

టీక॥శ్రీమాన్=అధికమయినసంపదగల;సః=ఆభరతుఁడు;తాం=ఆ; సేనాం= సేనను;సన్నివేశ్య=విడియఁజేసి; గుహేన=గుహునిచేత; పరితోషితః=సంతోషింపఁజేయఁబడినవాఁడై; శత్రుఘ్నేనసహ= శత్రుఘ్నునితోఁగూడ ;

శయనం=పాన్పును; సముపాగమత్=పొందెను.

అంత, శ్రీమంతుండగు భరతుండు, సేనను అన్యైక్షస్థలంబుల విడియనియమించి, గుహునిచే సంతోషింపఁజేయఁబడినవాఁడై, శత్రుఘ్నుండును దానును, బవ్వళించిరి. అని, తాత్పర్యము.

రామచింతామయ శ్శోకో భరతస్య మహాత్మనః
ఉపస్థితో హ్యనర్హస్య ధర్మప్రేక్షస్య తాదృశః. ౧౬

టీక॥ మహాత్మనః=అధికమయినధైర్యముగలవాఁడును; అనర్హస్య=దుఃఖంబునకుఁదగనివాఁడును; ధర్మప్రేక్షస్య=ధర్మబుద్ధిగలవాఁడునగు; భరతస్య=భరతునకు; తాదృశః=అట్టి; రామచింతామయః= రామచింతావికారమయిన; శోకః=దుఃఖము; ఉపస్థితోహి=సంభవించినదిగదా!

ఆగర్భశ్రీమంతుఁడుకావున దుఃఖంబనుభవింపఁదగనివాఁడును, ధర్మబుద్ధిగలవాఁడునగు భరతుండు, ఎంతధైర్యశాలియయినను, అపరిమితంబగు, రామనిమిత్తంబయినదుఃఖంబు సహింపఁజాలక, మిక్కిలియుఁ వగచుచుండెను.

అని, తాత్పర్యము.

అంతర్దాహేన దహన స్సంతాపయతి రాఘవమ్
వనదాహాభిసంతప్తం గూఢోగ్నిరివ పాదపమ్. ౧౭

టీక॥ దహనః = దుఃఖాగ్ని; అంతర్దాహేన= లోపలఁదపింపఁజేయుటచేత; రాఘవం=భరతుని; వనదాహాభిసంతప్తం= అడవిమండుటచేఁదపింపఁజేయఁబడిన; పాదపం=వృక్షమును; గూఢః= అగపడని; అగ్నిరివ=అగ్నిహోత్రమువలె; సంతాపయతి=తపింపఁజేయుచుండెను.

సమీపంబుననుండు నడవిదహింపఁబడుచుండఁగా, నావేఁడిమికి సంతప్తమగుచున్నవృక్షంబును, అగ్నిహోత్రము, పైకిఁగానరాకయే, తపింపఁజేయునట్లు, శోకాగ్ని, లోపలనుండియే, భరతునిమిక్కిలియుఁదపింపఁజేయుచుండినది.

అని, తాత్పర్యము.

ప్రస్రుత స్సర్వగాత్రేభ్య స్స్వేదం శోకాగ్నిసంభవమ్
యథా సూర్యాంశుసంతప్తో హిమవాన్ ప్రస్రుతోహిమమ్. ౧౮

టీక॥ యథా=ఎట్లు; హిమవాన్=హిమవత్పర్వతము; సూర్యాంశుసంతప్తః=సూర్యునికిరణములచేఁదపింపఁజేయఁబడినదై; హిమం= మంచును; ప్రస్రుతః=కాఱునో; తథా(అధ్యాహృతము)=అట్లు; భరతః (అధ్యాహృతము)=భరతుఁడు; సర్వగాత్రేభ్యః=సమస్తావయవంబులనుండి; శోకాగ్నిసంభవం=దుఃఖమనునగ్నివలనఁబుట్టిన; స్వేదం=చెమటను; ప్రస్రుతః=కాఱినాఁడు-

సూర్యునికిరణంబు వేఁడిమికి, హిమవత్పర్వతంబుననుండి, మంచునీళ్లు కాఱునట్లు, భరతునియన్నియవయవంబులనుండియు, దుఃఖాగ్నిచేఁ, జెమటనీళ్లు గాఱినవి. అని, తాత్పర్యము-

ధ్యానవిదరశైలేన వినిశ్శ్వసితధాతునా
దైన్యపాదపసంఘేన శోకాయాసాధిశృంగిణా. ౧౯
ప్రమోహానంతసత్త్వేన సంతాపౌషధివేణునా
ఆక్రాంతో దుఃఖశైలేన మహతా కైకయీసుతః- ౨౦

టీక॥ కైకయీసుతః = కైకేయికొడుకైన, భరతుండు; ధ్యానదరశైలేన = ధ్యానమే పగులనిఱాళ్లుగాఁ గలదియు; వినిశ్శ్వసితధాతునా= నానావిధములగునిట్టూర్పులె ధాతువులుగాఁగలదియు; దైన్యపాదపసంఘేన=దైన్యమనువృక్షసమూహము గలదియు; శోకాయాసాధిశృంగిణా దుఃఖమునాయాసమునుమనోవ్యథయు నేశిఖరములుగాఁగలదియు; సంతాపౌషధివేణునా= సంతాపములెఓషధులును వెదుళ్లునుగాఁగలదియునగు; మహతా=గొప్పదగు; మజ్జతా (పాఠాంతరము)=మగ్నంబైన, అవయవంబులం బ్రవేశించినయనుట; దుఃఖశైలేన= దుఃఖమనుపర్వతముచేత; ఆక్రాంతః= ఆక్రమింపఁబడినాఁడు,

కైకేయికొడుకయిన భరతుండు, ధ్యానంబె పెనుఱాళ్లుగా, నిట్టూర్పులె నానావిధంబులగు ధాతువులుగా, దైన్య

మెవృక్షసమూహముగా, దుఃఖమునాయాసముమనోవ్యథయునెశిఖరంబులుగా, మోహమెలెక్కలేనిమృగములుగా, సంతాపమెయోషధులును వెదుళ్లునుగాఁ, బర్వతాకారంబగుయొప్పదున్నమహాదుఃఖంబునొందిపరితపించుచుండెను. అని, తాత్పర్యము.

వినిశ్వసన్ వై భృశదుర్మనా స్తతః
ప్రమూఢసంజ్ఞః పరమాపదం గతః
శమం న లేభే హృదయజ్వరార్దితో
నరర్షభో యూథహతో యథర్షభః. ౨౧

("నరర్షభోయూథగతోయథర్షభః" ఇతిపాఠాంతరం.)

టీక॥నరర్షభః= పురుషశ్రేష్ఠుండగుభరతుండు;తతః = అంత;భృశదుర్మనాః= మిక్కిలియుదుఃఖమునొందినమనస్సుగలవాఁడై;వినిశ్వసన్ = నిట్టూర్పులువుచ్చుచు("వై" అనునదిపాదపూరణార్థము);ప్రమూఢసంజ్ఞః=నష్టసంజ్ఞుండై;పరమాపదం=అధికమయినయాపదను;గతః = పొందినవాఁడై;హృదయజ్వరార్దితః= మనోజ్వరముచేఁ బీడింపఁబడినవాఁడై; యూథహతః=కొట్టఁబడినగుంపుగలఁ; పాఠాంతరపక్షమందు;అయూథగతః=గుంపుఁజేరని,లేక, యూథగతః= గుంపుదప్పిన;ఋషభో యథా = వృషభమువలె;శమం=శాంతిని;నలేభే= పొందఁడయ్యె.

పురుషశ్రేష్ఠుండగు,భరతుండు, అట్లు,పరమదుఃఖితుండై,నిట్టూర్పులు వుచ్చుచుఁ,మూర్ఛఁబొందుచు , నిట్లుపరమాపదంబొంది,మనోజ్వరంబున బాధపడుచు,సహింపంజాలక , గుంపుదప్పినవృషభంబుకరణిం బరితపించుచుండెను. అని,తాత్పర్యము.

గుహేన సార్ధం భరత స్సమాగతో
మహానుభావ స్సజన స్సమాహితః
సుదుర్మనా స్తం భరతం తదాపున
గుహ స్సమాశ్వాసయ దగ్రజంప్రతి. ౨౨

టీక॥మహానుభావః= అధికమయిన ప్రభావముగలవాఁడును;సజనః = పరిచారకజనముతోఁ గూడినవాఁడును; సమాహితః=ఏకాగ్రచిత్తుండునగు; భరతః=భరతుఁడు; గుహేనసార్ధం=గుహునితోఁగూడ;సమాగతః=చేరియుండెను. తదాపునః=అప్పుడు;గుహః=గుహుండు;సుదుర్మనాః= మిక్కిలియు దుఃఖమునొందినమనస్సుగలవాఁడై; అగ్రజంప్రతి=అన్నయగు రామునిగూర్చి; తం=ఆ;భరతం=భరతుని; సమాశ్వాసయత్ =ఊఱడించెను.

అట్లు, మహానుభావుండగుభరతుండు,పరిచారకజనసహితుండై, యేకాగ్రచిత్తుండై , గుహునితోఁగూడనుండెను;గుహుండు, భరతునిదుఃఖంబుఁజూచి, తానునుబరమదుఃఖితుండై, రాముని విషయమయిమాటలుచెప్పుచు, భరతునాశ్వాసించెను.అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే,పంచాశీతితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,అయోధ్యాకాండపంచాశీతితమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

షడశీతితమసర్గప్రారంభః.

ఆచచక్షే థ సద్భావం లక్ష్మణస్య మహాత్మనః
భరతాయా ప్రమేయాయ గుహో గహనగోచరః.

టీక॥అథ= అటుపిమ్మట;గహనగోచరః=అడవియందుండునట్టి;గుహః=గుహుండు; మహాత్మనః= పూజ్యమయినస్వభావముగల; లక్ష్మణస్య= లక్ష్మ

ణునియొక్క ; సద్భావం = మంచి స్వభావమును; అప్రమేయాయ= కొలఁదిసేయరానట్టి; భరతాయ=భరతుని కొఱకు; ఆచచక్షే=చెప్పెను.

అంత, వనంబుననుండునట్టిగుహుండు, కొలందిలేనిమాహాత్మ్యంబుగలభరతునకు, మహాత్ముండగులక్ష్మణుని జ్యేష్ఠభ్రాతృభక్తిరూపమయిన సత్స్వభావంబుఁజెప్పనారంభించెను.

అని, తాత్పర్యము.

తం జాగ్రతం గుణై ర్యుక్తం శరచాపాసిధారిణమ్
భ్రాతృగుప్త్యర్థ మత్యంత మహం లక్ష్మణ మబ్రవమ్. ౨

టీక॥ అహం = నేను; భ్రాతృగుప్త్యర్థం=అన్నయొక్కరక్షణముకొఱకు; అత్యంతం= మిక్కిలియు; జాగ్రతం=మేలుకొనుచున్నవాఁడును ; శరచాపాసిధారిణం= బాణంబునువింటిని ఖడ్గంబునుధరించియున్న వాఁడును ; గుణైః=గుణంబులతో; యుక్తం= కూడినవాఁడునగు; లక్ష్మణం= లక్ష్మణుని గూర్చి; అబ్రువం=చెప్పితిని.

అన్ననురక్షించుటకై , ధనుర్బాణంబులనుఖడ్గంబునుధరించి, కంటిపై ఱెప్పయయినను వేయక మేలుకొని యున్న గుణవంతుండగులక్ష్మణునింజూచి, నేనిట్లని చెప్పితిని. అని, తాత్పర్యము-

ఇయం తాత సుఖా శయ్యా త్వదర్థ ముపకల్పితా
ప్రత్యాశ్వసిహి శేష్వాస్యాం సుఖం రాఘువనందన. ౩

టీక॥ రాఘువనందన = రఘువంశమునందుఁబుట్టినవారల సంతసింపఁ జేయునట్టిలక్ష్మణుఁడా! తాత=నాయనా! ఇయం=ఈ; సుఖా=సుఖకరమయిన; శయ్యా=పాన్పు; త్వదర్థం=నీకొఱకు ; ఉపకల్పితా = ఏర్పఱుపఁబడినది. ప్రత్యాశ్వసిహి=ఊఱడిల్లుము. అస్యాం= దీనియందు; సుఖం = సుఖముగా; శేష్వ=పరుండుము.

రఘువంశంబునం బుట్టిన వారలకు సంతోషంబుగలుగఁజేయునట్టిలక్ష్మణుఁడా! సుఖకరంబగు నీపాన్పు నీకొఱకై యేర్పఱుపఁబడినది. నీవుదీనిపైసుఖంబుగాఁబరుండి, యలసటదీర్చుకొనుము. అని, తాత్పర్యము.

ఉచితోఽయం జన స్సర్వో దుఃఖానాం త్వం సుఖోచితః
ధర్మాత్మం స్తస్య గుప్త్యర్థం జాగరిష్యామహే వయమ్. ౪

టీక॥ధర్మాత్మన్=ధర్మబుద్ధిగలలక్ష్మణుఁడా! అయం=ఈ; జనః=జనము; సర్వః = అంతయు ; దుఃఖానాం= దుఃఖములకు ; ఉచితః = తగినది. త్వం = నీవు; సుఖోచితః= సుఖమునకుఁదగినవాఁడవు. తస్య= ఆరాముని యొక్క; గుప్త్యర్థం= రక్షణముకొఱకు; వయం = మేము; జాగరిష్యామహే= మేలుకొనెదము.

ధర్మాత్ముండవగులక్ష్మణుఁడా! మేమందఱమును, దుఃఖం బనుభవింపందగినవారలమే; నీవుసుఖంబునకు మాత్రమెతగినవాఁడవు; కావున,నిద్రింపుము; రామునిసంరక్షణమునకై, మేమందఱమును మేలుకొనియుండెదము.

అని, తాత్పర్యము.

నహి రామా త్ప్రియతరో మమాస్తి భువి కశ్చన
మోత్సుకో భూ ద్బ్రవీమ్యేత దప్యసత్యం తవాగ్రతః. ౫

టీక॥భువి=భూమియందు; మమ= నాకు; రామాత్= రామునికన్న; ప్రియతరః=అధికప్రియుఁడు; కశ్చన= ఒకానొకఁడును; నాస్తిహి = లేఁడుగదా! త్వం(అధ్యాహృతము)= నీవు; ఉత్సుకః = ఉత్సాహముగలవాఁడవు ; మాభూః=కావలదు;తవ=నీయొక్క; అగ్రతః=ముందఁట; ఏతత్=దీనిని; అసత్యం=అసత్యమునుగా; బ్రవీమ్యపి= చెప్పుదునా?

ఈభూలోకంబున రామునికన్నఁ బ్రియుండు నాకెవ్వండునులేఁడు; కావున, నీవు రామరక్షణార్థమయి మేలుకొనియుండవలసినదిలేదు; నీయెదుట నేను దీనిఁగుఱించి యసత్యం బాడుదునా? అని, తాత్పర్యము.

అస్య ప్రసాదా దాశంసే లోకేస్మిన్ సుమహ ద్యశః
ధర్మావాప్తించ విపులా మర్థావాప్తించ కేవలామ్. ౬

టీక॥అహం=నేను;అస్య= ఈరాముని యొక్క;ప్రసాదాత్ = అనుగ్రహ

మువలన;అస్మిన్=ఈ;లోకే=లోకమునందు; సుమహత్=మిక్కిలియునధికమయిన;యశః=కీర్తిని; విపులాం=అధికమయిన;ధర్మావాప్తించ=ధర్మప్రాప్తిని;కేవలాం= న్యాయప్రాప్తమయిన;అర్థావాప్తించ=ధనప్రాప్తిని; ఆశంసే=కోరుచున్నాను.

ఈరామునియనుగ్రహంబుననె, నేను,ఈలోకంబునగొప్పకీర్తిని, అధికమయిన పరలోకసాధనభూతంబగు ధర్మంబును,మఱియున్యాయప్రాప్తంబగుధనాదికంబునుబొందవలెనని కోరుచున్నాను. అని, తాత్పర్యము.

సోహం ప్రియసఖం రామం శయానం సహసీతయా
రక్షిష్యామి ధనుష్పాణి స్సర్వైః స్వై ర్జ్ఞాతిభి స్సహ. ౭

టీక॥సః=అట్టి;అహం=నేను; ధనుష్పాణిః=ధనుస్సుహస్తమునంగలవాఁడనై;స్వైః= నావారలయిన;జ్ఞాతిభిః=బంధువులతో;సర్వైస్సహ= అందఱితోఁగూడ; ప్రియసఖం=ప్రియస్నేహితుండును;సీతయాసహ=సీతాదేవితోఁగూడ;శయానం = పరుండియున్నవాఁడునగు;రామం = రాముని;రక్షిష్యామి=రక్షించెదను.

అట్లుకావున, నేను, ధనుస్సుధరించి, నాబంధువులయందఱితోఁగూడ, సీతాదేవింగూడి పరుండినిద్రించుచున్నానాప్రియమిత్రు రామునిరక్షింపుచుండెదను. అని, తాత్పర్యము.

న హి మే విదితం కించి ద్వనేస్మిన్ చరత స్సదా
చతురంగం హ్యపి బలం ప్రసహేమ వయం యుధి. ౮

టీక॥సదా=ఎల్లప్పుడు; అస్మిన్=ఈ;వనే=అడవియందు;చరతః=తిరుగుచున్న;మే=నాకు;అవిదితం=తెలియఁబడనిది;కించిత్ = కొంచెమయినను;న హి=లేదుగదా ! వయం=మేము;యుధి=యుద్ధమునందు; చతురంగం=నాలుగంగములుగల; బలమపి=సైన్యమునైనను;ప్రసహేమహి=ఓర్తుముగదా!

ఎల్లప్పుడును, ఈయడవిలోనేతిరుగుచున్నవాఁడనుగావున, నీవనంబునందు, నాకుఁదెలియని కంపువలేవియులేవు;యుద్ధంబున, మేము, చతురంగసై

న్యంబువచ్చినను, సరకుసేయము. అని. నే
నులక్ష్మణునితోఁజెప్పినాను.

అని, తాత్పర్యము.

ఏవ మస్మాభి రుక్తేన లక్ష్మణేన మహాత్మనా
అనునీతా వయం సర్వే ధర్మ మేవా నుపశ్యతా. ౯

టీక॥ఏవం=ఇట్లు; అస్మాభిః= మాచేత; ఉక్తేన=చెప్పఁబడిన; మహాత్మనా = పూజ్యమయినహృదయము గలవాఁడును; ధర్మమేవ= ధర్మమునే; అనుపశ్యతా=చూచువాఁడునగు ; లక్ష్మణేన=లక్ష్మణునిచేత; వయం= మేము ; సర్వే=అందఱమును; అనునీతాః=అనునయింపఁబడినాము.

మేముచెప్పినదివిని, మహాత్ముండును ధర్మమునుమాత్రమె చూచువాఁడు నగులక్ష్మణుండు, మమ్మందఱను, ఈ ప్రకారముగా, మంచిమాటలననునయించెను. అని, తాత్పర్యము.

కథం దాశరథౌ భూమౌ శయానే సహసీతయా
శక్యా నిద్రా మయా లబ్ధుం జీవితంవాసుఖాని వా. ౧౦

టీక॥ దాశరథౌ= దశరథునికొడుకైనరాముండు; సీతయాసహ = సీతాదేవితోఁగూడ; భూమౌ= నేలయందు; శయానే=పరుండియుండఁగా; మయా=నాచేత; నిద్రా=నిదుర; లబ్ధుం=పొందుటకు; కథం=ఎట్లు; శక్యా= అలవియగును? జీవితంవా=బ్రతుకుట గాని; సుఖానివా=సుఖములుగాని; లబ్ధుం(అధ్యాహృతము)=పొందుటకు; కథం(అధ్యాహృతము)=ఎట్లు; శక్యాని(అధ్యాహృతము)=అలవియగును?

దశరథమహారాజకుమారుండగు రాముండు, సీతతోఁగూడ, నేలబరుండియుండఁగా, నేను, బ్రతికియుండుటయెబహు కష్టముగానున్నదే! ఇంకనిద్రగాని, ఇతరసుఖంబులనుగాని, పొందుటకెట్లలవియగును?

అని, తాత్పర్యము.

యేన దేవాసురైః సర్వైః శ్శక్యః ప్రసహితుం యుధి

తం పశ్య గుహ సంవిష్టం తృణేషు సహసీతయా. ౧౧

టీక॥ గుహ=గుహుఁడా; యః= ఎవ్వఁడు; యుధి=యుద్ధమునందు; దేవాసురైః= దేవతలచేతను అసురులచేతను; సర్వైః= అందఱిచేతను; ప్రసహితుం=ఓర్చుటకు; నశక్యః = అలవిగాఁడో; సీతయాసహ=సీతతోఁగూడ; తృణేషు=పచ్చికలయందు; సంవిష్టం= పరుండియున్న; తం=అట్టి రాముని; పశ్య= చూడుము.

గుహుఁడా! దేవాసురలందఱుం జేరియొక్కపెట్టునవచ్చినను, యుద్ధంబున, నెవ్వనిపరాక్రమంబు సహింపనలవిగాదో! అట్టిమహాపరాక్రమశాలియగు రాముండిప్పుడు, భార్యతోఁగూడ పచ్చికనేలపైఁ బరుండియున్నాఁడు; చూడుము. అని, తాత్పర్యము.

మహతా తపసా లబ్ధో వివిధైశ్చ పరిశ్రమైః
ఏకో దశరథస్యైష పుత్ర స్సదృశలక్షణః. ౧౨

టీక॥ ఏషః=ఈరాముఁడు; దశరథస్య=దశరథునియొక్క; మహతా= గొప్పదగు; తపసా= తపస్సుచేతను; వివిధైః=నానావిధంబులగు; పరిశ్రమైశ్చ=కష్టములచేతను; లబ్ధః= పొందఁబడిన; సదృశలక్షణః= సమానమయినలక్షణముగల; ఏకః=ముఖ్యుఁడగు; పుత్రః=కొడుకు.

ఈరాముండు, దశరథునిచే, మహాతపస్సుచేసి పెక్కువ్రతంబులు యాగంబులు గావించి, పొందఁబడినపుత్రుండు; తండ్రియుంబోలె, సమస్తసద్గుణంబులు గలవాఁడు. అని, తాత్పర్యము.

అస్మిన్ ప్రవ్రజితే రాజా న చిరం వర్తయిష్యతి
విధవా మేదినీ నూనం క్షిప్రమేవ భవిష్యతి. ౧౩

టీక॥ అస్మిన్=ఈరాముండు; ప్రవ్రజితే=వనంబునొందఁగా; రాజా= దశరథమహారాజు; చిరం= బహుకాలము; నవర్తయిష్యతి=జీవింపఁడు. మేదినీ=భూమి; క్షిప్రమేవ= శీఘ్రముగనే; విధవా= పెనిమిటిలేనిది; భవిష్యతి= కాఁగలదు; నూనం=నిశ్చయము.

రాముండువనంబునకువచ్చినపిదప,

నింక దశరథమహారాజు బహుకాలము జీవింపఁజాలఁడు; ఇంక శీఘ్రముగనే, భూమి విధవ కాఁగలదు; ఇది, నిశ్చయము. అని, తాత్పర్యము.

వినద్య సుమహానాదం శ్రమేణోపరతా స్త్రియః
నిర్ఘోషోపరతం తాత మన్యే రాజనివేశనమ్. ౧౪

టీక॥ తాత=నాయనా! స్త్రియః=స్త్రీలు; సుమహానాదం=మిక్కిలియు గొప్పధ్వనిగలుగునట్లు; వినద్య=అఱచి; శ్రమేణ=అలసటచేత; ఉపరతాః=విరమించినవారలు; స్యుః(అధ్యాహృతము)= అగుదురు. రాజనివేశనం=రాజగృహము; నిర్ఘోషోపరతం=ధ్వనిలేనిదికావుననే విరమించినది; స్యాత్(అధ్యాహృతము)=అగును. ఇతి (అధ్యాహృతము)=అని; మన్యే=తలంచెదను.

నాయనా! అంతఃపురస్త్రీలు, మహాధ్వని గల్గునట్లు, రోదనంబుగావించి, యంతనలసి, యూరకుండఁగలరు; అట్లు, రాజగృహంబు నిశ్శబ్దంబయి యుపరతంబయి యుండఁగలదు; అని, తలంచెదను. అని, తాత్పర్యము.

కౌసల్యా చైవ రాజా చ తథైవ జననీ మమ
నాశంసే యది జీవేయు స్సర్వే తే రజనీ మిమామ్. ౧౫

టీక॥ కౌసల్యాచైవ=కౌసల్యయును; రాజాచ=దశరథమహారాజును; తథైవ=అట్లు; మమ=నాయొక్క; జననీ=తల్లియగుసుమిత్రయు; తే=వారలు; సర్వే=అందఱును; జీవేయురితి=(అధ్యాహృతము) బ్రతుకుదురని; నాశంసే=తలంపను. యది జీవేయుః=బ్రతుకుదురేని; ఇమాం=ఈ; రజనీం=రాత్రిమాత్రము; జీవేయుః (అధ్యాహృతము)=బ్రతుకుదురు.

కౌసల్యయు దశరథుండును నాతల్లి సుమిత్రయు, వీరలింకనెంతమాత్రము జీవింపరు; అట్లు జీవించియుండిరేని, యీ రాత్రిమాత్రము, జీవించియుందురుగాని, యాపైజీవింపఁజాలరు.

అని, తాత్పర్యము.

జీవేదపి చ మే మాతా శత్రుఘ్నస్యాన్వవేక్షయా

దుఃఖితాయాతు కౌసల్యా వీరసూ ర్వినశిష్యతి. ౧౬

టీక॥ మే=నాయొక్క ; మాతాపి చ= తల్లియయినసుమిత్రగూడ; శత్రుఘ్నస్య= శత్రుఘ్నునియొక్క; అన్వవేక్షయా=చూచుటచేత;జీవేత్= బ్రతికియుండును . దుఃఖితా=దుఃఖము నొందిన;వీరసూః= వీరునిఁగన్నతల్లి యయిన; కౌసల్యా=కౌసల్య;యా(అస్తి)= ఎవ్వతెగలదో;సా(అధ్యాహృతము)= అబిడమాత్రము;వినశిష్యతి=నశింపక లదు.

నాతల్లి సుమిత్రిగూడ, రెండవకొడుకుశత్రుఘ్నునిం జూచుచుబ్రతికియుండంగలదు; దుఃఖితయగు, వీరునిఁగన్నతల్లి కౌసల్యమాత్రిము , నాశము నొందకతప్పదు. అని, తాత్పర్యము.

అతిక్రాంత మతిక్రాంత మనవాప్య మనోరథమ్
రాజ్యే రామ మనిక్షిప్య పితామే వినశిష్యతి. ౧౭

టీక॥అతిక్రాంతమతిక్రాంతం=అతిక్రమించిపోయినది! అతిక్రమించిపోయినది! మే=నాయొక్క; పితా=తండ్రియగుదశరథమహారాజు;మనోరథం= కోరికని;అనవాప్య = పొందక;రామం=రాముని;రాజ్యే=దొరతనమునందు; అనిక్షిప్య=ఉంచక; వినశిష్యతి=నశింపఁగలఁడు.

అతిక్రిమించిపోయినది! అతిక్రిమించిపోయినది! అంతయు వ్యర్థమయినది!నాతండ్రిదశరథమహారాజు, రాజ్యమునందు రామునుంచక,తనకోరిక నొందకయె,నాశమునొందుచున్నాఁడే!
అని, తాత్పర్యము.

సిద్ధార్థాః పితరం వృత్తం తస్మిన్ కాలే హ్యుపస్థితే
ప్రేతకార్యేషు సర్వేషు సంస్కరిష్యంతి భూమిపమ్. ౧౮

టీక॥ తస్మిన్=అట్టి; కాలే=కాలము; ఉపస్థితే=రాఁగా;సిద్ధార్థాః=కృతార్థులగువారలు; వృత్తం= మృతిఁబొందిన;పితరం = తండ్రియయిన; భూమిపం=దశరథమహారాజును;సర్వేషు=సమస్తములయిన;ప్రేతకార్యేషు=

ప్రేతకృత్యములందు; సంస్కరిష్యంతి= సంస్కారంబు సేయఁగలరు.

తండ్రియగు దశరథమహారాజుమృతిఁబొందినప్పుడు, ఆయనకు, అన్త్యైకాలంబులందు, సమస్తసంస్కారంబులుగావించునట్టి, భరతశత్రుఘ్నులు, కృతార్థులు. అని, తాత్పర్యము.

రమ్యా చత్వరసంస్థానాం సువిభక్త మహాపథామ్
హర్మ్యప్రాసాదసంపన్నాం సర్వరత్నవిభూషితాం. ౧౯
గజాశ్వరథసంబాధాం తూర్యనాదవినాదితామ్
సర్వకళ్యాణసంపూర్ణాం హృష్టపుష్టజనాకులామ్. ౨౦
ఆరామోద్యానసంపూర్ణాం సమాజోత్సవశాలినీమ్
సుఖితా విచరిష్యంతి రాజధానీం పితు ర్మమ. ౨౧

టీక॥సుఖితాః = సుఖముగలవారలు; రమ్యచత్వరసంస్థానాం = సుందరములయినముంగళ్ల సన్నివేశములుగలదియు;సువిభక్తమహాపథాం = చక్కఁగా నేర్పఱుపఁబడిన రాజమార్గంబులుగలదియు ; హర్మ్యప్రాసాద సంపన్నాం= మేడలచేతను దేవాలయములచేతనునిండినదియు ; సర్వరత్న విభూషితాం= సమస్తములయినశ్రేష్ఠవస్తువులచేసలంకరింపఁబడినదియు; గజాశ్వరథసంబాధాం= ఏనుంగులచేతనుగుఱ్ఱములచేతనురథములచేతనునిండినదియు;తూర్యనాదవినాదితాం=వాద్యములధ్వనులచేధ్వనింపఁ జేయఁబడినదియు; సర్వకల్యాణసంపూర్ణాం= సమస్తములయినమంగళములచేతనునిండినదియు; హృష్టపుష్టజనాకులాం= సంతసించినవారలునుబలిసినవారలునగుజనులచేనిండినదియు; ఆరామోద్యానసంపూర్ణాం= తోఁటలచేతను ఉద్యానవనంబులచేతను నిండినదియు;సమాజోత్సవశాలినీం= ఉత్సవసమూహములచేఁ బ్రకాశించుచున్నదియునగు;మమ = నాయొక్క;పితుః=తండ్రియొక్క;రాజధానీం= రాజధానియగు నయోధ్యను, అయోధ్యయందనుట; విచరిష్యంతి=సంచరింపఁగలరు.

రమణీయంబులగుచతుష్పథంబులుగ

లదియుఁ;జక్కఁగా నేర్పఱుపఁబడిన రాజమార్గంబులుగలదియు, మేడలును దేవాలయములును ఎచ్చుగాఁగలదియు, సమస్తములయిన యుత్తమద్రవ్యంబులచే నలంకృతంబును, ఏనుంగులచేతను గుఱ్ఱంబులచేతను రథంబులచేతను నిండినదియు, నానావిధవాద్యధ్వనులనొప్పుచున్నదియు, సమస్తమంగళసంయుతంబును, సంతుష్టులును ధనాఢ్యులంబుష్టులునగుజనులచే నిండినదియు, తోఁటలును ద్యాన వనంబులును మెండుగాఁగలదియు, నానావిధోత్సవంబులుగలదియునగు, నాతండ్రి రాజధానియయినయయోధ్యాపురియందు, సుఖంబునొందుభాగ్యంబు గలవారలు, విహరింపుచుండంగలరు. అని, తాత్పర్యము.

అపి సత్య ప్రతిజ్ఞేన సార్థం కుశలినా వయమ్
నివృత్తే సమయే హ్యస్మిన్ సుఖితాః ప్రవిశేమహి. ౨౨

టీక॥వయం=మేము;అస్మిన్=ఈ; సమయే=కాలము; ("హి"అనునది పాదపూరణార్థము); నివృత్తే=కడవఁగా; కుశలినా=క్షేమముగల; సత్యప్రతిజ్ఞేన సార్థం = సత్యమయినప్రతినగలరామునితోఁగూడ;సుఖితాః=సుఖమునొందినవారలమయి; పురీం (అధ్యాహృతము)=అయోధ్యాపట్టణమును;అపిప్రవిశేమ=ప్రవేశింతుమా? "హి" అనునది పాదపూరణార్థము.

మేమును ఈపదునాలుగు సంవత్సరంబులునుగడచినపిమ్మట, సత్యప్రతిజ్ఞుండగు రామునితోఁగూడ క్షేమంబున, సుఖితులమై, యయోధ్యానగరంబుఁబ్రవేశింపఁగలమా? అని, లక్ష్మణుండు, మాతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

పరిదేవయమానస్య తస్యైవం సుమహాత్మనః
తిష్ఠతో రాజపుత్రస్య శర్వరీ సా త్యవర్తత. ౨౩

టీక॥ సుమహాత్మనః=మిక్కిలియుఁ బూజ్యమగుహృదయముగల; రాజపుత్రస్య=రాచకొమరుండగు; తస్య=ఆ లక్ష్మణుండు;ఏవం=ఇట్లు; పరిదేవయమానస్య= దుఃఖించుచు; తిష్ఠతః=ఉండఁగానే;సా=ఆ;శర్వరీ=రాత్రి; అత్య

వర్తతే=కడచెను.

మహాత్ముండగు రాజపుత్రుండయిన లక్ష్మణుండు, ఇట్లు విలపించుచుండఁగా నే యారాత్రికడచినది.

అని, తాత్పర్యము.

ప్రభాతే విమలే సూర్యే కారయిత్వా జటా ఉభౌ
అస్మిన్ భాగీరథీ తీరే సుఖం సంతారితౌ మయా. ౨౪

టీక॥ విమలే=నిర్మలుండగు; సూర్యే=సూర్యుఁడు; ప్రభాతే=ఉదయింపఁగా; అస్మిన్=ఈ; భాగీరథీతీరే=గంగాతీరమునందు; ఉభౌ=ఇద్దఱును; జటాః=జటలను; కారయిత్వా=చేయించుకొని; మయా=నాచేత; సుఖం=సుఖముగా; సంతారితౌ=దాఁటింపఁబడినారు.

అంత, స్వచ్ఛంబుగా సూర్యుండుదయించినపిదప, ఈగంగానది గట్టుననే, రామలక్ష్మణులిద్దఱును, జటలుగావించుకొనిరి; అంత నేనువారలను, సుఖంబుగా గంగను దాఁటించితిని. అని, తాత్పర్యము.

జటాధరౌ తౌ ద్రుమచీరవాససౌ
మహాబలౌ కుంజర యూధపోపమౌ
వరేషుచాపాసిధరౌ పరంతపౌ
వ్యపేక్షమాణౌ సహసీతయా గతౌ. ౨౫

టీక॥ మహాబలౌ= అధికమయినబలముగలవారలును; కుంజరయూధపోపమౌ=ఏనుంగులసమూహమును పాలించునట్టి యేనుంగులతోఁబోలికగలవారలునగు; పరంతపౌ=శత్రువులనుదపింపఁజేయువారలునగు; తౌ=ఆరామలక్ష్మణులు; జటాధరౌ=జటలనుధరించినవారలై; ద్రుమచీరవాససౌ= నారచీరలెవస్త్రములుగాఁగలవారలై; వరేషుచాపాసిధరౌ=ఉత్తమములైనబాణంబులనువింటిని ఖడ్గంబునుదాల్చినవారలయి; వ్యపేక్షమాణౌ= ఎచ్చరికగలవారలై; సీతయా సహ=సీతతోఁగూడ; గతౌ=పోయినారు.

మహాబలశాలులును, గజరాజంబులతో సమానులును, శత్రువులందపింపఁజేయువారలునగు నారామలక్ష్మణులు, జటలుధరించి నారచీరంగట్టుకొని, యు

త్తమంబులగుధనుర్బాణంబులును ఖడ్గంబులునుధరించి, మిక్కిలియు నెచ్చరికతో, సీతంగూడి, పోయిరి. అనిగుహుండు భరతునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
అయోధ్యాకాండే,షడశీతితమస్సర్గః.
ఇది,స్పష్టార్థము.
ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండషడశీతితమసర్గ టీక,
ముగిసినది.

---

శ్రీః
సప్తాశీతితమసర్గప్రారంభః.

గుహస్య వచనం శ్రుత్వా భరతో భృశ మప్రియమ్
ధ్యానం జగామ తత్రైవ యత్ర తచ్ఛ్రుత మప్రియం. ౧

టీక॥ భరతః = భరతుఁడు; గుహస్య = గుహునియొక్క; భృశం = మిక్కిలియు; అప్రియం = దుఃఖకరమయిన; వచనం = మాటను; శ్రుత్వా = విని; యత్ర = ఏవిషయమందు; తత్ = ఆ; అప్రియం = దుఃఖవార్త; శ్రుతం = వినఁబడినదో; తత్రైవ = ఆవిషయమునందు; ధ్యానం = చింతను; జగామ = పొందెను.

భరతుండు, గుహుండు చెప్పినదుఃఖకరంబగు మాటనువిని, ఆరామలక్ష్మణులు, జటలనుధరించియరణ్యమునకుఁ బోయిరనువిషయమును గుఱించియే, తనకోర్కి యీ డేటునో యీ డేటదో యని,మిక్కిలియుఁజింతఁ బొందెను.

అని, తాత్పర్యము.

సుకుమారో మహాసత్త్వ స్సింహ స్కంధో మహాభుజః
పుండరీక విశాలాక్ష స్తరుణః ప్రియదర్శనః. ౨

ప్రత్యాశ్వస్య ముహూర్తం తు కాలం పరమదుర్మనాః
పపాత సహసా తోత్రై ర్హృద్యతివిద్ధ ఇవ ద్విపః. ౩

టీక॥ సుకుమారః=కోమలుండును; మహాసత్త్వః= అధికమయినబలముగలవాఁడును; సింహస్కంధః= సింహంబుయొక్క మూఁపులవంటి మూఁపులుగలవాఁడును; మహాభుజః= గొప్పభుజములుగలవాఁడును; పుండరీకవిశాలాక్షః= తెల్లదామర పువ్వువలె విశాలంబులగు కండ్లుగలవాఁడును; తరుణః=యౌవనంబుగలవాఁడును; ప్రియదర్శనః=సంతోషకరంబగుచూచుటగలవాఁడునగు; భరతః(అధ్యాహృతము)=భరతుఁడు; పరమదుర్మనాః = మిక్కిలియదుఃఖము నొందిన మనస్సుగలవాఁడై; ముహూర్తం=స్వల్పమయిన; కాలంతు=కాలముమాత్రము; ప్రత్యాశ్వస్య = ఊఱడిల్లి; తోత్రైః= బరిగోలలచే; అతివిద్ధః= మిక్కిలియుఁబొడువఁబడిన; ద్విపఃఇవ= ఏనుంగువలె; సహసా = తటాలున; పపాత హి=పడెనుగదా!

సుకుమారశరీరుండును, మహాబలుండును సింహంబునకుంబోలెనున్నతంబులగు భుజశిఖరంబులుగలవాఁడును, మహాబాహుండును, బుండరీకంబులుంబోలె విశాలసుందరంబులగు నయనంబులవాఁడును, యౌవనవంతుండును బ్రియదర్శనుండునగుభరతుండు, పరమదుఃఖితుండై, కొంచెము సేపు, దుఃఖంబుననణఁచికొనియుండి, యంతసహింపంజాలక, బరిగోలలనధికంబుగాఁబొడువంబడిన యేనుంగుభంగిఁ, దటాలున నేలంబడెను.

అని, తాత్పర్యము.

తదవస్థం తు భరతం శత్రుఘ్నో నంతరస్థితః
పరిష్వజ్య రురోదోచ్చై ర్విసంజ్ఞః శోకకర్శితః. ౪

టీక॥ అనంతరస్థితః= సమీపంబుననున్న; శత్రుఘ్నస్తు= శత్రుఘ్నుండు; తదవస్థం=అట్టియవస్థగల; భరతం=భరతుని; పరిష్వజ్య=కౌఁగిలించికొని; విసంజ్ఞః= స్మృతిదప్పినవాఁడై; శోకకర్శితః=దుఃఖముచేఁగృశింపఁజేయఁబడినవాఁడై; ఉచ్చైః=గట్టిగా; రురోద= ఏడ్చెను.

సమీపంబుననున్న శత్రుఘ్నుండు, అట్టియవస్థనొందియున్న భరతుంగవుఁ

గిలించుకొని, పరమదుఃఖితుండై, విసంజ్ఞుండై, పేరెలుంగున రోదనంబుఁ జేసెను.

అని, తాత్పర్యము.

తత స్సర్వా స్సమాపేతు ర్మాతరో భరతస్య తాః
ఉపవాస కృశా దీనా భర్తృ వ్యసన కర్శితాః. ౫

టీక॥ తతః=అటుపిమ్మట; ఉపవాస కృశాః=ఉపవాసముచేఁగృశించినవారలును; దీనాః=దైన్యము నొందినవారలును; భర్తృవ్యసనకర్శితాః=పెనిమిటి దుఃఖముచేఁగృశింపఁ జేయఁబడినవారలునగు; తాః=ఆ; భరతస్య=భరతుని యొక్క; మాతరః=తల్లులు; సర్వాః=అందఱును; సమాపేతుః=వచ్చిరి.

అంత, నుపవాసము చేసిచేసి కృశించినవారలును దీనలును భర్తృదుఃఖంబునం బరితపించు చున్నవారలు నగు నాభరతుని తల్లులందఱును, అచ్చటికి, వచ్చిరి.

అని, తాత్పర్యము.

తాశ్చ తం పతితం భూమౌ రుదంత్యః పర్యవారయన్

టీక॥ తాశ్చ=వారలును; రుదంత్యః=రోదనము సేయుచు; భూమౌ=నేలయందు; పతితం=పడిన; తం=ఆభరతుని; పర్యవారయన్=పరివేష్టించిరి.

వారలును, నేలంబడియున్నభరతుం బరివేష్టించిరోదనంబుచేసిరి.

అని, తాత్పర్యము.

కౌసల్యా త్వనుసృత్యైనం దుర్మనాః పరిషస్వజే. ౬

టీక॥ కౌసల్యాతు=కౌసల్యమాత్రము; దుర్మనాః=దుఃఖమునొందినమనసు గలదై; ఏనం=ఈభరతుని; అనుసృత్య=సమీపించి; పరిషస్వజే=కవుఁగిలించినది.

అందుఁ, గౌసల్యమాత్రము, పరమదుఃఖితయయి, భరతునిసమీపంబునకుఁ బోయి, కవుఁగిలించికొనినది.

అని, తాత్పర్యము.

వత్సలాస్వం యథావత్స ముపగూహ్య తపస్వినీ
పరిపప్రచ్ఛ భరతం రుదంతీ శోకలాలసా. ౭

టీక॥ తపస్విని= శోచనీయయగు కౌసల్య; శోకలాలసా= దుఃఖముచేఁ జపలయయి; రుదంతీ = ఏడ్చుచు ; భరతం=భరతుని; వత్సలా= దూడయందధికప్రీతిగలయావు; స్వం= తనదైన ; వత్సంయథా=దూడనువలె ; ఉపగూహ్య= కౌఁగిలించుకొని; పరిపప్రిచ్ఛ=ఏడ్చెను.

శోచనీయయగు కౌసల్య , గోవుతనదూడనుంబోలె ; భరతుంగవుఁగిలించుకొని, పరమదుఃఖితయయి , రోదనంబుసేయుచు, భరతుని, నిట్లని, యడిగెను- అని, తాత్పర్యము.

పుత్ర వ్యాధి ర్నతే కచ్చి చ్ఛరీరం పరిబాధతే

టీక॥ పుత్ర= కొడుకా! తే = నీయొక్క; శరీరం=దేహమును ; వ్యాధిః= రోగము; పరిబాధతేనుకచ్చిత్= బాధించుచున్నదా యేమి?

కొడుకా!నీదేహంబునకేమైన వ్యాధిగలిగియున్నదా యేమి?
అని, తాత్పర్యము.

అద్య రాజకులస్యాస్య త్వదధీనం హి జీవితమ్. ౮

టీక॥అద్య=ఇప్పుడు;అస్య=ఈ;రాజకులస్య=రాజవంశముయొక్క; జీవితం=ప్రాణము; త్వదధీనంహి=నీయధీనముగదా!

ఇప్పుడు, మాప్రాణమంతయు,నీయధీనముగానున్నది.
అని, తాత్పర్యము.

త్వాం దృష్ట్వా పుత్ర జీవామి రామే సభ్రాతృకే గతే
వృత్తే దశరథే రాజ్ఞి నాథ ఏక స్త్వ మద్య నః. ౯

టీక॥ పుత్ర=కొడుకా! సభ్రాతృకే=తమ్మునితోఁగూడిన; రామే= రాముఁడు; గతే=పోయినవాఁడగుచుండగా; రాజ్ఞి=రాజయిన; దశరథే = దశరథుఁడు;వృత్తే=మృతుండుగాఁగా; త్వాం=నిన్ను; దృష్ట్వా = చూచి ; జీవామి=బ్రతికియున్నాను. అద్య= ఇప్పుడు; నః=మాకు; త్వం=నీవు ; ఏకః= ఒక్కఁడవె; నాథః = నాథుఁడవు.

కొడుకా! రాముండు లక్ష్మణునితోఁ గూడ వనంబునకుఁ బోయి, దశరథ మహారాజు మరణంబు నొందిన పిదప, నిన్నుఁ జూచి, జీవించియున్నానుగాని, వేఱుగాదు; ఇప్పుడు, మాకందఱకు, నీవా కఱండ వె నాథుండవు.

అని, తాత్పర్యము.

కచ్చిన్న లక్ష్మణే పుత్ర శ్రుతం తే కించి దప్రియమ్
పుత్రేవా హ్యేకపుత్రాయా స్సహభార్యే వనం గతే. ౧౦

టీక॥ పుత్ర=కొడుకా! లక్ష్మణే=లక్ష్మణుని విషయమయి గాని; సహభార్యే=భార్యతోఁ గూడినవాఁడును; వనం=అడవిని; గతే=పొందినవాఁడునగు; ఏకపుత్రాయాః=ఒకఁడే కొడుకుగల; మమ(అధ్యాహృతము)=నాయొక్క; పుత్రేవా = కొడుకు విషయమయి గాని; ("హి" అనునది పాదపూరణార్థము); తే(త్వయా)=నీచేత; కించిత్=కొంచెము; అప్రియం=దుఃఖవార్త; శ్రుతన్నకచ్చిత్=వినఁబడినదా యేమి?

కొడుకా! లక్ష్మణుని విషయమయి గాని, భార్యతోఁ గూడ నడవికిఁ బోయిన, యేకపుత్రనగు, నాకొడుకు రాముని విషయమయి గాని, నీ కెవ్వరైన దుఃఖవార్తం జెప్పిరా యేమి? అని. కౌసల్య, భరతు నడిగెను. అని, తాత్పర్యము.

స ముహూర్తం సమాశ్వస్య రుదన్నేవ మహాయశాః
కౌసల్యాం పరిసాంత్వ్యేదం గుహం వచన మబ్రవీత్. ౧౧

టీక॥ మహాయశాః=అధికమయిన కీర్తిగల; సః=ఆభరతుఁడు; ముహూర్తం=కొంచెము సేపు; సమాశ్వస్య=ఊఱడిల్లి; రుదన్నేవ=ఏడ్చుచునే; కౌసల్యాం=కౌసల్యను; పరిసాంత్వ్య=ఊఱడించి; గుహం=గుహుని గూర్చి; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

మహాయశుండగు నాభరతుండు, కొంచెము సేపునకుఁ దేఱి, రోదనంబు సేయుచునే, కౌసల్యనాశ్వాసించి, గుహునింజూచి, యీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

భ్రాతా మే క్వావస ద్రాత్రౌ క్వ సీతా క్వ చలక్ష్మణః
అస్వప చ్ఛయనే కస్మిన్ కిం భుక్త్వా గుహ శంస మే. ౧౨

టీక॥ గుహ=గుహుఁడా! మే=నా యొక్క; భ్రాతా=అన్న; రాత్రౌ=రాత్రియందు; క్వ=ఎచ్చట; అవసత్=ఉండెను? సీతా=సీతాదేవి; క్వ=ఎచ్చట; అవసత్ (అధ్యాహృతము)=ఉండెను? లక్ష్మణశ్చ=లక్ష్మణుండును; క్వ=ఎచ్చట; అవసత్ (అధ్యాహృతము)=ఉండెను. కిం=దేనిని; భుక్త్వా=భుజించి; కస్మిన్=ఏ; శయనే=పాన్పునందు; అస్వపత్=నిద్రించెను? మే=నాకొఱకు; శంస=చెప్పుము.

గుహుఁడా! నాయన్నరాముండు, రాత్రియం దెచ్చటనుండెను? లక్ష్మణుం డెచ్చటనుండెను? సీతాదేవి యెచ్చటనుండెను? మఱియువార లేమిభుజించిరి? ఎచ్చట నిద్రించిరి? దీనినంతయు నాకుఁ జెప్పుము. అని, భరతుండు, గుహునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

సో౽బ్రవీ ద్భరతం హృష్టో నిషాదాధిపతి ర్గుహః
యద్విధం ప్రతిపేదే చ రామే ప్రియహితే తథౌ. ౧౩

టీక॥ నిషాదాధిపతిః=బోయలకుఁ బ్రభువైన; సః=ఆ; గుహః=గుహుఁడు; హృష్టః=సంతసించినవాఁడై; ప్రియహితే=సంతోషకరుండును మేలుసేయువాఁడునగు; అతిథౌ=అతిథియయిన; రామే=రామునందు; యద్విధం=ఏవిధమును; ప్రతిపేదే=పొందెనో, చేసెనోయనుట; తత్ (అధ్యాహృతము)=దానినిగూడ; భరతం=భరతుని గూర్చి; అబ్రవీత్=చెప్పెను.

నిషాదేశ్వరుండగు గుహుండు, భరతునకు రామునందుమిక్కిలియు భక్తి యున్నదనియుఁ దనకు రామవృత్తాంతంబుఁ జెప్పుభాగ్యంబుగల్గెననియు సంతోషంబునొంది, రాముం డేమేమిచేసెనో, ప్రియుండును హితుండునగు నతిథియయిన రామునకుఁ దా నేమేమిగావించెనో, దానినంతయు, భరతునకుం జెప్పనారంభించెను.

అని, తాత్పర్యము.

అన్న ముచ్చావచం భక్ష్యాః ఫలాని వివిధాని చ
రామాయా భ్యవహారార్థం బహుచో పహృతం మయా. ౧౪

టీక॥ మయా = నాచేత; రామా యః=రామునికొఱకు ; అభ్యవహారార్థం = భోజనముకొఱకు; ఉచ్చావచం=నానావిధమయిన; అన్నం= అన్నమును; భక్ష్యాః = భక్ష్యములును ; వివిధాని= నానావిధములైన; ఫలాని చ=పండ్లును; బహుచ=అనేకమును ; ఉపహృతం= తేఁబడినది.

నేను , రామునిభోజనంబునకై , నానావిధంబగునన్నంబును,భక్ష్యములును నానావిధంబులగుఫలంబులును , మఱియుఁజోష్యలేహ్యాదులనేకంబులును, దెచ్చినాను. అని, తాత్పర్యము.

త త్సర్వం ప్రత్యనుజ్ఞాసీ ద్రామ స్సత్యపరాక్రమః
న తు త త్ప్రత్యగృహ్ణా త్స క్షత్రధర్మ మనుస్మరన్. ౧౫

టీక॥సత్యపరాక్రమః=ఎచ్చటనువ్యర్థముకాని పరాక్రమముగల;రామః= రాముఁడు;తత్ =దానిని;సర్వం=అంతను;ప్రత్యనుజ్ఞాసీత్= తీసికొనిపొమ్మనెను. సః=ఆరాముఁడు; క్షత్రధర్మం= క్షత్రియధర్మమును; అనుస్మరన్=తలంచుచు; తత్ =దాని ; నప్రత్యగృహ్ణాత్=ప్రతిగ్రహింపనేలేదు.

సత్యపరాక్రముండగు రాముండు , వానినన్నిటినిమఱలనన్నేదీసికొనిపొమ్మనెను; తనదైనక్షత్రియధర్మంబుఁదలంచుకొని, దానిలోనెంతమాత్రము ప్రతిగ్రహింపనేలేదు. అని, తాత్పర్యము.

న హ్యస్మాభిః ప్రతిగ్రాహ్యం సఖే దేయంతు సర్వదా
ఇతి తేన వయం రాజ న్ననునీతా మహాత్మనా. ౧౬

టీక॥ రాజన్ =భరతుఁడా!" సఖే= చెలికాఁడా ! అస్మాభిః = మాచేత; నప్రతిగ్రాహ్యంహి = ప్రతిగ్రహింపఁ గూడదుగదా ! సర్వదా=ఎల్లప్పుడును; దేయంతు=ఇవ్వవలసినదిమాత్రమె." ఇతి=అని ; మహాత్మనా= పూ

జ్యమగుస్వభావముగల; తేన = ఆరాముని చేత; వయం=మేము;అనునీతాః= అనునయింపఁబడినాము.

భరతుఁడా! మహాత్ముండగు రాముండు, "చెలికాఁడా! మేముక్షత్రియులము కావునఁ,బ్రతిగ్రహింపఁగూడదు ; దానమునుమాత్రమే చేయవలసినది." అని మాకు సమాధానముఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

లక్ష్మణేన సమానీతం పీత్వా వారి మహాయశాః
ఔపవాస్యం తదా కార్షీ ద్రాఘవ స్సహసీతయా. ౧౭

టీక॥మహాయశాః= అధికమయిన కీర్తిఁగల; రాఘవః = రాముఁడు; తదా=అప్పుడు; లక్ష్మణేన= లక్ష్మణుని చేత; సమానీతం=తేఁబడిన; వారి = జలమును; పీత్వా= త్రావి ; సీతయా సహ=సీతతోఁగూడ; ఔపవాస్యం = ఉపవాసమును;అకార్షీత్ =చేసెను.

మహాయశుండగు రాముండు, అప్పుడులక్ష్మణుండు దెచ్చియిచ్చిన జలంబుఁ ద్రావి, సీతయుఁదానును, ఉపవాసముండిరి. అని, తాత్పర్యము.

తతస్తు జలశేషేణ లక్ష్మణోప్య కరో త్తదా
వాగ్యతా స్తే త్రయ స్సంధ్యాం సముపాసత సంహితాః. ౧౮

టీక॥తతస్తు= అటుపిమ్మటను; తదా=అప్పుడు; లక్ష్మణోపి= లక్ష్మణుండును; జలశేషేణ= జలంబులోనిమిగతచేత; ఆహారం (అధ్యాహృతము)= ఆహారమును ; అకరోత్ = చేసెను. తే=ఆ;త్రయః= ముగ్గురును; వాగ్యతాః= వాక్కునునిగ్రహించినవారలై; సంహితాః= ఏకాగ్రచిత్తులయి; సంధ్యాం= సంధ్యను ; సముపాసత=చక్కఁగానుపాసించిరి.

అంతనప్పుడు, లక్ష్మణుండును, రాముండుద్రావిమిగిలిన జలంబుద్రావెను; వారలుముగ్గురును, మౌనంబువహించి,యేకాగ్రచిత్తులయిసంధ్యనుపాసించిరి.అని, తాత్పర్యము.

స ౮౭

సౌమిత్రిస్తు తతః పశ్చా దకరో త్స్వాస్తరం శుభమ్
స్వయ మానీయ బర్హీంషి క్షిప్రం రాఘవకారణాత్. ౧౯

టీక॥ తతః=అంత; పశ్చాత్=వెనుక; సౌమిత్రిస్తు=లక్ష్మణుఁడుమాత్రము; క్షిప్రం=శీఘ్రముగా; స్వయం=తానే; బర్హీంషి=దర్భలను; ఆనీయ=తెచ్చి; రాఘవకారణాత్=రామునిమిత్తమయి; శుభం=మంచిదయిన; స్వాస్తరం=శయనమును; అకరోత్=చేసెను.

అటు వెనుక, లక్ష్మణుండు, తానే, శీఘ్రముగాఁబోయి దర్భలం దెచ్చి, రామునికొఱకుఁ, జక్కఁగా శయనంబు నేర్పఱిచెను. అని, తాత్పర్యము.

తస్మిన్ సమావిశ ద్రామ స్స్వాస్తరే సహ సీతయా
ప్రక్షాళ్యచ తయోః పాదా వపచక్రామ లక్ష్మణః. ౨౦

టీక॥ రామః=రాముఁడు; తస్మిన్=ఆ; స్వాస్తరే=శయనమునందు; సీతయాసహ=సీతతోఁగూడ; సమావిశత్=పరుండెను. లక్ష్మణః=లక్ష్మణుఁడు; తయోః=ఆసీతారాములయొక్క; పాదౌ=పాదములను; ప్రక్షాళ్యచ=కడిగియు; అపచక్రామ=అవ్వలికిఁబోయెను.

రాముండును సీతయును, ఆదర్భశయనంబునం బవ్వళించిరి; లక్ష్మణుండు, సీతారాములపాదంబులను, గంగాతీరంబుననడచుటచేనంటుకొనిన బురదపోవునట్లు, కడిగి, యవ్వలికిఁబోయి, దూరంబునం గాచియుండెను.

అని, తాత్పర్యము.

ఏత త్తదింగుదీమూల మిదమేవ చ త త్తృణమ్
యస్మిన్ రామశ్చ సీతాచ రాత్రిం తాం శయితా వుభౌ. ౨౧

టీక॥ యస్మిన్=దేనియందు; రామశ్చ=రాముండును; సీతాచ=సీతయును; ఉభౌ=ఇద్దఱును; తాం=ఆ; రాత్రిం=రాత్రియంతయు; శయితౌ=పరుండిరో; తత్=ఆ; ఇంగుదీమూలం=గారచెట్టుక్రిందు; ఏతత్=ఇది. తత్=

ఆః తృణంచ=దర్భలయును; ఇదమేవ= ఇదే.

రాముండును సీతయు, నిర్వురు, నా రాత్రియంతయు, నీ గార చెట్టుక్రింద, నీ దర్భలపైన నే పరుండియుండిరి. అని, తాత్పర్యము.

నియమ్య పృష్ఠేతు తలాంగుళిత్రవాన్
శరైః స్సుపూర్ణా విషుధీ పరంతపః
మహ ద్ధను స్సజ్య ముపోహ్య లక్ష్మణో
నిశా మతిష్ఠ త్పరితోఽస్య కేవలమ్. ౨౨

టీక॥ పరంతపః= శత్రువులందపింపఁజేయునట్టి ; లక్ష్మణః= లక్ష్మణుఁడు; తలాంగుళిత్రవాన్ = అల్లెత్రాటిదెబ్బ దగులకుండఁ జేతికిఁ దొడుగుకొనెడియత్రమును హస్తకవచమును గలవాఁడై; పృష్ఠేతు=వీపునను; శరైః= బాణములచేత; సుపూర్ణా= చక్కఁగానిండిన; ఇషుధీ= రెండమ్ముల పొదులను; నియమ్య=కట్టుకొని; మహత్= గొప్పదయిన ; సజ్యం = అల్లెత్రాటితోఁగూడిన; ధనుః = వింటిని ; ఉపోహ్య=ధరించి; అస్య = ఈ రాముని యొక్క; పరితః=చుట్టును; అతిష్ఠత్ కేవలం=నిలుచుకొనేయుండెను.

శత్రువులందపింపఁజేయునట్టి లక్ష్మణుండు, తలంబును హస్తకవచమును ధరించి, బాణంబులచే నిండిన నమ్ములపొదులను వీపునఁగట్టికొని, ఎక్కుఁబెట్టిన గొప్పధను హస్తమునం దాల్చి, కొంచెమయిననుగంటిపై ఱెప్పవేయక, రాముని చుట్టుం దిరుగుచుఁ గాచియుండెను. అని, తాత్పర్యము.

తత స్త్వహం చో త్తమబాణచాపధృత్
స్థితో భవం తత్ర స యత్ర లక్ష్మణః
అతంద్రిభి ర్జ్ఞాతిభి రా త్తకార్ముకై
ర్మహేంద్రకల్పం పరిపాలయం స్తదా. ౨౩

టీక॥ తతః=అంత; తదా=అప్పుడు; అహంచతు=నేను; ఉత్తమబాణచాపధృత్ = ఉత్తమములగు బాణములను ధనుస్సును ధరించినవాఁడనై; సః=ఆ; లక్ష్మ

ణః=లక్ష్మణుఁడు; యత్ర=ఎచ్చటనో; తత్ర=అచ్చటనే; అతంద్రిభిః=ఏమఱుపాటు లేనివారలును; ఆత్తకార్ముకైః=పొందఁబడినవిల్లుగలవారలునగు; జ్ఞాతిభిః=బంధువులతోఁగూడ; మహేంద్రకల్పం = దేవేంద్రునితోసమానుండగురామునిఁ; పరిపాలయన్ = రక్షించుచు; స్థితః=ఉన్నవాఁడను; అభవం = అయితిని.

అంత, నప్పుడు, నేను, ధనుర్బాణంబులుధరించి, ధనుర్ధరులగుబంధువులతోఁగూడినవాఁడనై, లక్ష్మణుండున్నచోటనె, యేమఱక, దేవేంద్రసమానుండగురామునుంబరిపాలింపుచు, నుంటిని. అని, గుహుండు, భరతునకుం జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, సప్తాశీతితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ సప్తాశీతితమసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

అష్టాశీతితమసర్గప్రారంభః.

తచ్ఛ్రుత్వా నిపుణం సర్వం భరత స్సహమంత్రిభిః
ఇంగుదీమూల మాగమ్య రామశయ్యా మవేక్ష్య తామ్. ౧
అబ్రవీ జ్జననీ స్సర్వా ఇహ తేన మహాత్మనా
శర్వరీశయితం భూమా విద మస్య విమర్దితమ్. ౨

టీక॥ భరతః=భరతుఁడు; మంత్రిభిస్సహ=మంత్రులతోఁగూడ; తత్=దానిఁ; సర్వం=అంతను; నిపుణం=చక్కగా; శ్రుత్వా = విని; ఇంగుదీమూలం = గారచెట్టుక్రిందును; ఆగమ్య=పొంది; తాం=ఆ; రామశయ్యాం =

రామునిపాన్పును; అవేక్ష్య= చూచి; జననీః=తల్లులను; సర్వాః= అందఱను గూర్చి; "ఇహ = ఇచ్చట; మహాత్మనా=పూజ్యమయినస్వభావముగల; తేన=ఆ రాముని చేత; శర్వరీశయితం = రాత్రియందుఁబరుండుటయయినది ఇదం=ఇది; అస్య=ఈ రామునియొక్క; విమర్దితం=మర్దింపఁబడినపాన్పు" ఇతి(అధ్యాహృతము) = అని ; అబ్రవీత్=చెప్పెను.

భరతుఁడు, మంత్రులతోఁగూడ , గుహుండుచెప్పిన మాటనంతయుఁ జక్కఁగా విని , యాగార చెట్టుక్రిందికివచ్చి, యారామశయ్యంజూచి, తల్లులయందఱంబిలిచి, "ఇచ్చట, మహాత్ముండగు రాముండు , రాత్రిఁబరుండిన, స్థలము; ఇది,యతండు , పరుండుటచే, మర్దితంబయినశయనము" అని, చెప్పెను. అని, తాత్పర్యము.

మహాభాగకులీనేన మహాభాగేన ధీమతా
జాతో దశరథే నోర్వ్యాం నరామ స్స్వప్తు మర్హతి. ౩

టీక॥మహాభాగకులీనేన = పూజ్యమయినభాగ్యముగలయిక్ష్వాకువు యొక్కసత్కులమునందుఁబుట్టినవాఁడును; మహాభాగేన= పూజ్యమైనభాగ్యముగలవాఁడును; ధీమతా=బుద్ధిమంతుండు నగు;దశరథేన=(పంచమ్యర్థమందుఁ దృతీయ) దశరథునివలన; జాతః= పుట్టిన; రామః=రాముఁడు;ఉర్వ్యాం= భూమియందు; స్వప్తుం= నిద్రించుటకు; నార్హతి=తగఁడు.

మహాభాగ్యవంతుండగునిక్ష్వాకువుసత్కులంబునంబుట్టినవాఁడును , మహాభాగ్యశాలియు,బుద్ధిమంతుండునగుదశరథమహారాజుకడుపునంబుట్టినరాముండు, నేఁలంబరుండి నిద్రింపఁదగఁడు.

అని, తాత్పర్యము.

అజినో త్తరసంస్తీర్ణే వరా స్తరణసంచయే
శయిత్వా పురుషవ్యాఘ్రః కథం శేతే మహీతలే. ౪

టీక॥పురుషవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠుండగు రాముండు; అజినోత్తరసంస్తీర్ణే = చర్మరూపమయినపైఁబఱచెడువస్త్రముచేఁబఱుపఁబడిన ; వరాస్త

స ౮౮

రణసంచయే=శ్రేష్ఠములయిన పఱచెడు వస్త్రముల సమూహముగలపాన్పునందు;శయిత్వా = పరుండి;మహీతలే= భూతలమునందు;కథం=ఎట్లు; శేతే= పరుండును?

పురుషశ్రేష్ఠుండగు రాముండు,ఇంత వఱకు, పైనమేలయినచమఱముపఱచినవియు , సమూల్యంబులగుననేకాస్తరణంబులుగలవియునగు, వరాహఙపర్యంకంబులంబరుండి, యిప్పుడు, నేలపైనెట్లుపరుండును?అని, తాత్పర్యము.

ప్రాసాదాగ్రవిమానేషు వలభీషుచ సర్వదా
హైమరాజతభౌమేషు వరాస్తరణశాలిషు. ౫
పుష్పసంచయచిత్రేషు చందనాగరుగంధిషు
పాండరాభ్రప్రకాశేషు శుకసంఘరుతేషుచ. ౬
ప్రాసాదవరవర్యేషు శీతవత్సు సుగంధిషు
ఉషిత్వా మేరుకల్పేషు కృతకాంచనభిత్తిషు. ౭
గీతవాదిత్రనిర్ఘోషై ర్వరాభరణనిస్స్వనైః
మృదంగవరశబ్దైశ్చ స తత్ర ప్రతిబోధితః. ౮
వందిభి ర్వందితః కాలే బహుభి స్సూతమాగధైః
గాథాభీ రనురూపాభి స్స్తుతిభిశ్చ పరంతపః. ౯

టీక॥పరంతపః = శత్రువులందపింపఁజేయునట్టి; సః=ఆరాముండు;సర్వదా=ఎల్లప్పుడు;ప్రాసాదాగ్రవిమానేషు=విమానాకారములగు ప్రాసాదశిఖరములయందును; వలభీషుచ = మేడమీఁదియిండ్లయందును; హైమరాజతభౌమేషు=బంగారువికారములును వెండివికారంబులునగు నేలలుగలవియు; వరాస్తరణశాలిషు=ఉత్తమము లగుపఱచువస్త్రములచేఁ బ్రకాశించునవియు; పుష్పసంచయచిత్రేషు= నానావిధపుష్పసమూహములుగలవియు; చందనాగరుగంధిషు=చందనాగరు ధూపముల సువాసనగలవియు; పాండరాభ్రప్రకాశేషు= తెల్లనిమేఘంబులయొక్క కాంతివంటికాంతిగలవియు;శుకసంఘరుతేషుచ= చిలుకలసమూహములయొక్క ధ్వనులుగలవియు; శీతవత్సు=చల్లఁదన




ముగలవియు; సుగంధిషు=మంచివాసనగలవియు; కృతకాంచనభిత్తిషు=చేయఁబడినబంగారుగోడలుగలవియు;కావుననే; మేరుకల్పేషు=మేరుపర్వతముతోసమానములయినవియునగు; ప్రాసాదవరవర్యేషు= రాజగృహశ్రేష్ఠములలోనుత్తమములయినగృహములయందు;ఉషిత్వా=పరుండి; తత్ర=అచ్చట; గీతవాదిత్రనిర్ఘోషైః= పాటలయొక్కయువాద్యములయొక్కయు ధ్వనులచేతను; వరాభరణనిస్స్వనైః=శ్రేష్ఠములయినయాభరణములయొక్కధ్వనులచేతను;మృదంగవరశబ్దైశ్చ=మద్దెళలలోనుత్తమములగు వానిధ్వనులచేతను;ప్రతిబోధితః= మేలుకొలుపఁబడినవాఁడై;బహుభిః=పెక్కులయిన; వందిభిః=స్తుతిపాఠకులచేతను; సూతమాగధైః=పూర్వరాజచరిత్రములనుబాగఁ డుసూతుల చేతను, బరాక్రమాదులం బొగడుమాగధులచేతను; కాలే=యుక్తకాలంబునందు;అనురూపాభిః=యుక్తములయిన; గాథాభిః=పాటలచేతను; స్తుతిభిశ్చ=స్తోత్రములచేత; వందితః=స్తుతింపఁబడినాఁడు.

శత్రువులం దపింపఁజేయునట్టి రాముండు,విమానాకారంబులగు ప్రాసాదశిఖరంబులందును, మేడమీదిగృహంబులందును, గాంచనమయంబులును రజతమయంబులునగు నేలలుగలవియు, నుత్తమంబులగునాస్తరణంబులనొప్పుచున్నవియు,నానావిధపుష్పంబులు చల్లఁబడియుండునవియు, చందనాగరుధూపంబుల సుగంధంబు గుబాళించుచున్నవియుఁ, దెల్లనిమేఘంబుభంగి భాసిల్లునవియు, మనోహరంబులగు చిలుకలపలుకులతో నొప్పుచున్నవియుఁ, జల్లఁగానుండునవియు, మంచివాసనగలవియు, బంగారుగోడలుగలవికావున , మేరుపర్వతంబుంబోలెనున్నవియునగునుత్తమప్రాసాదంబులందును,బరుండి, నానావిధగీతంబులచేతను,వీణాదివాద్యధ్వనులచేతను, పరిచారికలమేఖలానూపురాద్యాభరణధ్వనులచేతను,నిద్రమేల్కొని,ప్రాతఃకాలంబున, స్తుతిపాఠకులునుసూతులును మాగధులునవేకులు సేయునానావిధస్తోత్రంబులు,వినుచు, నానందించుచుండెనే!ఇంక,నడవినేలలంబరుండి,క్షుద్రమృగంబుల భయంకరారావంబులకుమేల్కొని,యేకాకియయి, యెట్లుండునుకో!అని, తాత్పర్యము.

అశ్రద్ధేయ మిదం లోకే న సత్యం ప్రతిభాతి మా




ముహ్యా తేఖలు మే భావ స్స్వప్నోయ మితి మే మతిః. ౧౦

టీక॥ఇదం=ఇది; అశ్రద్ధేయం= నమ్మఁదగనిదానిఁగా;పశ్యామి= చూచుచున్నాను. మా=నన్నుఁగూర్చి, నాకనుట; సత్యం=సత్యముగా;నప్రతిభాతి=తోఁచదు. మే=నాయొక్క; భావః=మనస్సు ;ముహ్యా తేఖలు=భ్రమించుచున్నదా యేమి? అయం=ఇది;స్వప్నః=కల.ఇతి=అని; మే=నాయొక్క;మతిః=బుద్ధి.

ఇట్లు రాముండు నేలంబరుండుట మొదలగు దానియందు, నాకెంతమాత్రము నమ్మకముగలుగ లేదు ; ఇదంతయు సత్యముగాజరగుచున్నదనినాకుఁ దోఁచలేదు; నామనసున కేమయిన భ్రమంబు గలిగిన దేమో; లేక, నాకిట్లు స్వప్నమే యయినదో! అని, తాత్పర్యము.

న నూనం దైవతం కించి త్కాలేన బలవ త్తరమ్
యత్ర దాశరథీ రామో భూమావేవ శయీత సః. ౧౧

టీక॥యత్ర=ఎందువలన; సః=ఆ; దాశరథిః = దశరథపుత్రుండగు;రామః=రాముఁడు; భూమావేవ= నేలయందే; శయీత=పరుండునో; తత్ (అధ్యాహృతము) = అందువలన ; దైవతం=దైవము;కాలేన=(పంచమ్యర్థమందుఁదృతీయ)= కాలముకన్న ; కించిత్=కొంచమైనను; బలవ త్తరం=అధికబలముగలది;న=కాదు; నూనం=నిశ్చయము.

కాలముకన్న దైవ మెంతమాత్రము బలిష్ఠముకాదు; కాలమేబలిష్ఠము;అట్టి దశరథమహారాజుకొడుకు రాముండు, నేలపైఁబరుండుచున్నాఁడే!
అని, తాత్పర్యము.

విదేహ రాజస్య సుతా సీతాచ ప్రియదర్శనా
దయితా శయితా భూమౌ స్నుషా దశరథస్యచ. ౧౨

టీక॥విదేహరాజస్య=జనకమహారాజుయొక్క;సుతా=కొమార్తెయు; దశరథస్య = దశరథమహారాజుయొక్క; స్నుషాచ=కోడలును; దయితా= రా

మునకుఁ బ్రియురాలును; ప్రియదర్శనా= సంతోషకరంబగు చూచుటగలది యునగు; సీతాచ=సీతాదేవియు;భూమౌ=నేలయందు; శయితా=పరుండినది!

జనకమహారాజుకొమార్తెయు దశరథమహారాజుకోడలును రామునిప్రియురాలును జూపరులకుసంతోషంబు గలిగించునదియునగు సీతాదేవియు, నేలపైబరుండినదే! అని, తాత్పర్యము.

ఇయం శయ్యా మమ భ్రాతు రిదంహి పరివర్తితమ్
స్థండిలే కఠినే సర్వం గాత్రై ర్విమృదితం తృణమ్. ౧౩

టీక॥ఇయం=ఇది; మమ= నాయొక్క; భ్రాతుః = అన్నయొక్క; శయ్యా=పాన్పు;ఇదం=ఇది.పరివర్తితం హి=పొరలుటగదా! కఠినే= కఠినమయిన;స్థండిలే=నేలయందు;తృణం= పచ్చిక;సర్వం= అంతయు; గాత్రైః= అవయవములచేత ; విమృదితం = మర్దింపఁబడినది.

ఇది,నాయన్నగారిపాన్పు,ఇదిగో, ఆయన,కఠినంబగు నేలయందుశ్రమవశంబునఁబొరలుటచే,శయ్యారూపంబగుదర్భలన్నియు,నలఁగియున్నవి.

అని, తాత్పర్యము.

మన్యే సాభరణా సుప్తా సీతా స్మిన్ శయనోత్తమే
తత్రతత్ర హి దృశ్యంతే సక్తాః కనకబిందవః. ౧౪

టీక॥సీతా=సీతాదేవి; అస్మిన్=ఈ; శయనోత్తమే= శయనశ్రేష్ఠమునందు; సాభరణా= సొమ్ములతోఁగూడినదై; సుప్తా=నిదురించినది.ఇతి(అధ్యాహృతము)=అని;మన్యే=తలంచెదను. తత్రతత్ర=అచ్చటచ్చట;సక్తాః = అంటుకొనిన;కనకబిందవః=బంగారుపొడులు; దృశ్యంతేహి=చూడఁబడుచున్నవిగదా!

ఈగొప్పపాన్పునందు, సీతాదేవి, మార్గశ్రమంబున, నాభరణంబులువిడువకయాభరణంబులతోనేపరుండినదనితలంచెదను;కావుననే, యచ్చటచ్చట బంగారుపొడియంటుకొనియున్నది.

అని, తాత్పర్యము.

ఉత్తరీయ మిహా సక్తం సువ్యక్తం సీతయా తదా
తథా హ్యేతే ప్రకాశంతే సక్తాః కౌశేయ తంతవః. ౧౫

టీక॥తదా=అప్పుడు; సీతయా=(షష్ఠ్యర్థమందుఁదృతీయ)సీతయొక్క; ఉత్తరీయం=పైఁటగుడ్డ; ఇహా=ఇచ్చట; ఆసక్తం=తగిలినది. ఇతి(అధ్యాహృతము)=అని;సువ్యక్తం=మిక్కిలియుస్పష్టము.తథాహి = అదియుక్తమె. సక్తాః=అంటుకొనిన;కౌశేయతంతవః=పట్టునూళ్లు;ప్రకాశంతే= ప్రకాశించుచున్నవి.

అప్పుడు,సీతాదేవియుత్తరీయమీదగ్ఘలందుఁదగిలియుండినదనుట,స్పష్టము; పలయనఁగా, నచ్చటచ్చటఁ దగులుకొనియుండుపట్టుపోఁగులు,ఎంతయుఁబ్రకాశించుచున్నవి.అని, తాత్పర్యము.

మన్యే భర్తుః సుఖా శయ్యా యేన బాలా తపస్వినీ
సుకుమారీ సతీ దుఃఖం నహి జానాతి మైథిలీ. ౧౬

టీక॥యేన = ఏకారణముచేత;బాలా=చిన్నదియు;తపస్వినీ=శోచనీయయు;సుకుమారీ = కోమలాంగియు;సతీ=పతివ్రతయునగు;మైథిలీ=సీత; దుఃఖం=దుఃఖమును; నవిజానాతి=ఎఱుఁగకున్నదో; తేన(అధ్యాహృతము) = ఆకారణముచేత;భర్తుః = పెనిమిటియొక్క;శయ్యా=పాన్పు; సుఖా=సుఖకరము. ఇతి(అధ్యాహృతము)=అని;మన్యే=తలంచెదను.

శోచనీయయుఁ బతివ్రతయునగు సీతాదేవి; బాలయుఁ గోమలాంగియునయ్యు, నేలపైనిట్టిశయనంబునంబరుఁడి, దుఃఖంబెఱుంగకున్నది;కావున, పతివ్రతలకు, ఎచ్చటనైనను,భర్తతోఁగూడఁబరుండుటయెసుఖకరమని,తలంచెదను. అని, తాత్పర్యము.

హాహం తాస్మి నృశంసోహం యత్సభార్యః కృతే మమ
ఈదృశీం రాఘవ శ్శయ్యా మధిశేతే హ్యనాథవత్. ౧౭

టీక॥ యత్ = ఏకారణమువలన; మమకృతే=నానిమిత్తమయి ; రాఘ

వః=రాముఁడు; సభార్యః=భార్యతో గూడినవాఁడై ; అనాథవత్=అనాథ వోలె; ఈదృశీం=ఇట్టి; శయ్యాం = పాన్పును; అధిశేతే = అధిష్ఠించిప రుండుచున్నాఁడో. ("హి" అనునది పాదపూరణార్థము.) తత్ (అధ్యాహృతము) = ఆకారణమువలన; అహం=నేను; నృశంసః=క్రూరుండను; అస్మి=అగుచున్నాను. హాహంత = అయ్యో!

నానిమిత్తమయి, రాముండుభార్యతోఁగూడ,ననాథయుంబోలె, నిట్టి కఠినశయనంబునందుఁ, బరుండినాఁడు; కావున, నేను, మిక్కిలియుఁబాపిష్ఠుండనైతిని! అయ్యో! అనితాత్పర్యము.

సార్వభౌమకులే జాత స్సర్వలోకస్య సమ్మతః
సర్వలోకప్రియ స్త్యక్త్వా రాజ్యం సుఖ మనుత్తమమ్. ౧౮
కథ మిందీవరశ్యామో రక్తాక్షః ప్రియ దర్శనః
సుఖ భాగీ నదుఃఖార్హ శ్శయితో భువి రాఘవః. ౧౯

టీక॥ సార్వభౌమకులే=చక్రవర్తి వంశమునందు; జాతః=పుట్టినవాఁడును; సర్వలోకస్య= సమస్తజనమునకును; సమ్మతః=ఇష్టుండును; సర్వలోకప్రియః = సమస్తజనులకునుసంతోషకరుండును; ఇందీవరశ్యామః=నల్లకలువలవలెనల్లనైనవాఁడును;రక్తాక్షః=ఎఱ్ఱనికండ్లుగలవాఁడును; ప్రియదర్శనః= సంతోషకరంబగు చూచుటగలవాఁడును;సుఖభాగీ=సుఖమునొందఁదగినవాఁడును;నదుఃఖార్హః=దుఃఖమునొందఁదగనివాఁడునగు;రాఘవః=రాముఁడు; సుఖం=సుఖకరమును; అనుత్తమం=తనకన్న శ్రేష్ఠములేనిదియు నగు; రాజ్యం=రాజ్యమును; త్యక్త్వా= విడిచి; భువి=నేలయందు; కథం=ఎట్లు; శయితః=పరుండినాఁడు?

చక్రవర్తులవంశంబునంబుట్టినవాఁడును, సమస్తలోకసమ్మతుండును, సమస్తజనులకుఁబ్రియుండును, ఇందీవరశ్యామల దేహుండును, రక్తాంగనయనుండును,జూపరులకుసంతోషంబు గలిగించువాఁడును,ఇట్లు జన్మంబునను, గుణంబులను, సౌందర్యసౌకుమార్యాదులవలనను,సుఖంబునొందుటకెతగినవాఁడును, దుఃఖానర్హుండునగు,రాముం

డు, సుఖకరంబగునుత్తమరాజ్యంబు విడిచి నేలపై నెట్లుపరుండియుండెనః?

అని, తాత్పర్యము.

ధన్యః ఖలు మహాభాగో లక్ష్మణ శ్శుభలక్షణః
భ్రాతరం విషమే కాలే యో రామ మనువర్తతే. ౨౦

టీక॥ యః=ఎవ్వఁడు; భ్రాతరం= అన్ననుః విషమే=చెడ్డదైన; కాలే= కాలమునందు; అనువర్తతే= అనుసరించియున్నాఁడో; సః (అధ్యాహృతము)= అట్టి; మహాభాగః=పూజ్యమయిన భాగ్యముగలవాఁడును; శుభలక్షణః= మంగళకరంబులగులక్షణంబులుగలవాఁడునగు; లక్ష్మణః=లక్ష్మణుఁడు; ధన్యః ఖలు= పుణ్యవంతుఁడుగదా!

మహాభాగుండును, శుభలక్షణంబులుగలవాఁడునగు, లక్ష్మణుండు, అన్నయగురాముని, ఆపత్కాలమునందు, అనుసరించియున్నాఁడు, కావున, నతండుపుణ్యవంతుఁడు,

అని, తాత్పర్యము.

సిద్ధార్థాః ఖలు వైదేహీ పతిం యాను గతా వనమ్

టీక॥ యా=ఎవ్వతె; వనం= అడవినిగూర్చి; పతిం= పెనిమిటిని; అనుగతా= వెంబడించిపోయినదో; సా (అధ్యాహృతము)= అట్టి; వైదేహీ=సీతాదేవి; సిద్ధార్థాః ఖలు=కృతార్థురాలుగదా.

సీతాదేవి, పెనిమిటిని వెంబడించియడవికిఁబోయినదికావున, నాబిడకృతార్థయయినది. అని, తాత్పర్యము.

వయం సంశయితా స్సర్వే హీనా స్తేన మహాత్మనా. ౨౧

టీక॥ వయం=మనము; సర్వే=అందఱమును; మహాత్మనా=అధికమయినప్రభావముగల; తేన=ఆరామునిచేత; హీనాః=విడువఁబడినవారలమయి; సంశయితాః=సందేహమునొందినాము.

మనము, అట్టిమహాత్ముండగురామునిం బాసియున్నాము; అతండు, ఇంకమనలనంగీకరించునో, అంగీకరింపఁడో, యనిసందేహముగానున్నది.

అని, తాత్పర్యము.

అకర్ణధారా పృథివీ నౌరివ ప్రతిభాతిమా
గతే దశరథే స్వర్గం రామే చారణ్య మాశ్రితే. ౨౨

టీక॥ దశరథే = దశరథుఁడు; స్వర్గం = స్వర్గమును; గతే = పొందఁగా; రామేచ = రాముఁడును; అరణ్యం = అడవిని; ఆశ్రితే = పొందఁగానే; పృథివీ = భూమి; అకర్ణధారా = నడపువాఁడు లేని; నౌరివ = ఓడవలె; మా = నన్నుఁగూర్చి, నాకనుట; ప్రతిభాతి = తోఁచుచున్నది.

దశరథమహారాజు స్వర్గంబునొంది, రాముండును, వనంబునకుఁబోయినపిదప, నీభూమియనాథయయి, కర్ణధారుండులేనియోడపగిది, నాకుఁదోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

నచ ప్రార్థయతే కశ్చి న్మనసాపి వసుంధరామ్
వనేపి వసత స్తస్య బాహు వీర్యాభి రక్షితామ్. ౨౩

టీక॥ కశ్చిచ్ఛ = ఒకానొకఁడును; వనే = అడవియందు; వసతోపి = ఉన్నవాఁడయినను; తస్య = ఆరామునియొక్క; బాహువీర్యాభిరక్షితాం = భుజపరాక్రమముచే రక్షింపఁబడిన; వసుంధరాం = భూమిని; మనసాపి = మనసుచేనైనను; నప్రార్థయతే = కోరఁడు.

ఇట్లు, రాజ్యంబంతయునునాయకంబయినను, రాముండువనంబులో నున్నను, అతనిబాహుపరాక్రంబునకుభయపడి, ఇరుగుపొరుగురాజులెవ్వరును, రామునిరాజ్యంబు, నాక్రమింప, మనసునందునైనను, దలంపరు.

అని, తాత్పర్యము.

శూన్యసంవరణారక్షా మయంత్రిత హయద్విపామ్
అపావృత పుర ద్వారాం రాజధానీ మరక్షితామ్. ౨౪
అప్రహృష్ట బలాం న్యూనాం విషమస్థా మనావృతామ్
శత్రవో నాభిమన్యంతే భక్ష్యా న్విష కృతానివ. ౨౫

టీక ॥ శూన్యసంవరణారక్షాం = లేనిప్రాకారరక్షకులుగలదియు;

అయంత్రితహయద్విపాం=సన్నద్ధములు కానిగుఱ్ఱములు నేనుంగులునుగలదియు; అపావృతపురద్వారాం=మూయఁబడనిపట్టణద్వారములుగలదియు ; అప్రహృష్టబలాం= సంతసింపనిసైన్యము గలదియు; న్యూనాం = తక్కువయినదియు; విషమస్థాం= దుర్దశయందున్నదియు;అనావృతాం= కప్పఁబడనిదియు , బాహ్యరక్షకులు లేనిదియునను టయు; అరక్షితాం = రక్షింపఁబడనిదియునగు ; రాజధానీం=అయోధ్యను; శత్రవః = శత్రురాజులు ; విషకృతాన్ = విషముతోఁజేయఁబడిన ; భక్ష్యానివ=పిండివంటలంబోలె; నాభిమన్యంతే=తలంపరు.

ప్రాకారరక్షకులు లేనిదియు సన్నద్ధంబులుగానిగుఱ్ఱంబులును గజంబులునుగలదియు, తెఱవఁబడినద్వారంబులుగలదియు , దుఃఖితంబులగు సైన్యంబుగలదియు,నిట్లుదుర్దశనొంది , రక్షణము లేకయున్న యయోధ్యాపట్టణమును, శత్రురాజులు, రామభయంబున విషంబు గలిపిన పిండివంటలంబోలె , నిచ్ఛింపకున్నారు- అని, తాత్పర్యము.

అద్య ప్రభృతి భూమౌతు శయిష్యేఽహం తృణేషు వా
ఫలమూలాశనో నిత్యం జటాచీరాణి ధారయన్. ౨౬

టీక॥అహం=నేను;అద్యప్రభృతి=ఇప్పుడు మొదలు;నిత్యం=ఎల్లప్పుడును;ఫలమూలాశనః=పండ్లునుగడ్డలును ఆహారముగాఁగలవాఁడనై; జటాచీరాణి=జటలనునారచీరలను; ధారయన్=ధరింపుచు;భూమౌతు=నేలయందే; తృణేషువా=పచ్చికలయందే;శయిష్యే=పరుండెదను.

నేను,ఇదిమొదలు,ఫలమూలంబుల నేదినుచు,నారచీరలుగట్టుకొని, జటాధారుండనై,యిట్లు, నేలపైననై, తృణంబులుపఱచుకొనిపరుండెదను.

అని, తాత్పర్యము.

తస్యార్థ ముత్తరం కాలం నివత్స్యామి సుఖం వనే
తం ప్రతిశ్రవ మాముచ్య నాస్య మిథ్యా భవిష్యతి. ౨౭

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను; తం=ఆ;ప్రతిశ్రవం=ప్రతిజ్ఞను;ఆ

ముచ్య=ధరించి; తస్యార్థం=ఆ రాముని నిమిత్తమయి; ఉత్తరం=ఇంకనుండవలసిన; కాలం=కాలమును; సుఖం=సుఖముగా; వనే=అడవియందు; నివత్స్యామి=ఉండెదను. అస్య=ఈ రాముని యొక్క; ప్రతిజ్ఞా(అధ్యాహృతము)=ప్రతిన; మిథ్యా=అబద్ధము; నభవిష్యతి=కాదు.

రాముండు చేసిన ప్రతిజ్ఞను, నేనవలంబించి, యిదివఱకుఁ గడిచినది పోను, ఇంకనుండవలసిన కాలంబంతయు, సుఖంబుగా, వనంబుననుండెదను; రాముని ప్రతిజ్ఞ యెంతమాత్రము, అసత్యము కానేరదు. అని, తాత్పర్యము.

వసంతం భ్రాతు రర్థాయ శత్రుఘ్నో మానువత్స్యతి

టీక॥ శత్రుఘ్నః = శత్రుఘ్నుండు; భ్రాతుః=అన్నయొక్క; అర్థాయ=ప్రయోజనము కొఱకు; వసంతం=ఉన్న; మా=నన్ను; అనువత్స్యతి= వెంబడించియుండఁగలఁడు.

అన్నయగు రాముని నిమిత్తమై వనంబుననున్న నాతోఁగూడ, శత్రుఘ్నుండునుండును, అని, తాత్పర్యము.

లక్ష్మణేన సహా త్వార్యో హ్యయోధ్యాం పాలయిష్యతి. ౨౮

టీక॥ ఆర్యస్తు = పూజ్యుండగు రాముఁడుమాత్రము; లక్ష్మణేనసహ= లక్ష్మణునితోఁగూడ; అయోధ్యాం= అయోధ్యాపట్టణమును; పాలయిష్యతిహి= పాలింపఁగలఁడుగదా!

పూజ్యుండగు రాముండు, లక్ష్మణునింగూడి, యయోధ్యం బాలింపుచుండగలఁడు. అని, తాత్పర్యము.

అభిషేక్ష్యంతి కాకుత్స్థ మయోధ్యాయాం ద్విజాతయః

టీక॥ ద్విజాతయః = బ్రాహ్మణులు; కాకుత్స్థం=రాముని; అయోధ్యాయాం = అయోధ్యయందు; అభిషేక్ష్యంతి= అభిషేకింపఁగలరు.

అయోధ్యయందు, రామునకు, బ్రాహ్మణులు, పట్టాభిషేకముగావింతురు అని, తాత్పర్యము.

అపి మే దేవతాః కుర్యు రిమం సత్యం మనోరథమ్. ౨౯

సఠ౮

టీక॥ మే=నాయొక్క; దేవతాః=దేవతలు; ఇమం=ఈ; మనోరథం=కోరిక్కని; సత్యం=సత్యమునుగా; కుర్యురపి=చేయుదురా?

నాయిష్టదేవతలు, నాకోరిక్కని, ఫలింపఁజేయుదురా?

అని, తాత్పర్యము.

ప్రసాద్యమాన శ్శిరసా మయా స్వయం
బహుప్రకారం యది న ప్రపత్స్యతే
తతోనువత్స్యామి చిరాయ రాఘవం
వనే వస న్నార్హతి మాముపేక్షితుమ్. ౩౦

టీక॥ రామః(అధ్యాహృతము)=రాముఁడు; మయా=నాచేత; స్వయం=నాచేతనే; శిరసా=తలచేత; బహుప్రకారం=అనేకవిధములుగా; ప్రసాద్యమానః=వేఁడుకొనఁబడినవాఁడై; న ప్రపత్స్యతే యది=అంగీకరింపఁడేని; తతః=అంత; చిరాయ=బహుకాలము; వనే=అడవియందు; వసన్=ఉండుచు; రాఘవం=రాముని; అనువత్స్యామి=అనుసరించియుండెదను. మాం=నన్ను; ఉపేక్షితుం=ఉపేక్షించుటకు; నార్హతి=తగఁడు.

నేనుస్వయముగాఁ బ్రణామపూర్వకంబుగా, నానావిధంబులంబ్రార్థించినను, రాముండు, నాప్రార్థననంగీకరింపఁడేని, యంత, నేను, వనంబున రాముండుండువఱకు, అతనితోఁగూడ నుండెదను; ఇంతమాత్రమయినను, రాముండు, నన్నంగీకరింపకుండఁడు. అని, భరతుండు, విలపించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, అష్టాశీతితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండాష్టాశీతితమసర్గటీక,
ముగిసినది.

శ్రీ

ఏకోననవతితమసర్గ ప్రారంభః.

ఉష్య రాత్రింతు తత్రైవ గంగాకూలే స రాఘవః
భరతః కాల్య ముత్థాయ శత్రుఘ్న మిద మబ్రవీత్. ౧

టీక॥ రాఘవః=రఘువంశమునందు బుట్టిన; సః=ఆ; భరతః=భరతుఁడు; తత్ర=ఆ; గంగాకూలఏవ=గంగాతీరమునందే; రాత్రింతు=రాత్రియంతయు; ఉష్య(ఉషిత్వా)ఉండి; కాల్యం=ప్రాతః కాలమునందు; ఉత్థాయ=లేచి; శత్రుఘ్నం=శత్రుఘ్నునిఁగూర్చి; ఇదం=ఈ మాటను; అబ్రవీత్=చెప్పెను.

రఘువంశజాతుండగు నాభరతుండు, రాత్రియంతయు, నాగంగాతీరంబుననేయుండి, ప్రాతఃకాలంబుననేలేచి, శత్రుఘ్నుంబిలిచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

శత్రుఘ్నో త్తిష్ఠ కిం శేషే నిషాదాధిపతిం గుహమ్
శీఘ్ర మానయ భద్రం తే తారయిష్యతి వాహినీమ్. ౨

టీక ॥ శత్రుఘ్న=శత్రుఘ్నుఁడా! ఉత్తిష్ఠ=లెమ్ము. కిం=ఎందుకు; శేషే=పరుండియున్నావు? నిషాదాధిపతిం=బోయలప్రభుఁడయిన; గుహం=గుహుని; శీఘ్రం=శీఘ్రముగా; ఆనయ = తోడ్కొనిరమ్ము. తే=నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక. సః(అధ్యాహృతము)=ఆగుహుఁడు; వాహినీం=నదిని; తారయిష్యతి=దాఁటించును.

శత్రుఘ్నుఁడా! లెమ్ము; పరుండియున్నావేమి? శీఘ్రముగా నిషాదేశ్వరుండగుగుహుందోడ్కొనిరమ్ము; నీకుమంగళంబగుఁగాక; యతండు, మనల, నేఱు దాఁటించును. అనిభరతుండు, శత్రుఘ్ననితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

జాగర్మి నాహం స్వపిమి తమేవార్యం విచింతయన్
ఇత్యేవ మబ్రవీ ద్భ్రాతా శత్రుఘ్నోపి ప్రచోదితః. ౩

టీక॥ భ్రాతా=తమ్ముఁడగు; శత్రుఘ్నోపి= శత్రుఘ్నుండును; ప్రచోదితః=ప్రేరింపఁబడినవాఁడై; "అహం= నేను; ఆర్యం=పూజ్యుఁడగు; తమేవ=ఆ రామునే; విచింతయన్=తలంచుకొనుచు; జాగర్మి=మేలుకొనియున్నాను. నస్వపిమి= నిద్రపోలేదు" ఇతి = అని; ఏవం=ఇట్లు; అబ్రవీత్ =చెప్పెను.

తమ్ముండగు శత్రుఘ్నుండు, అన్నచేనిట్లు ప్రేరింపఁబడినవాఁడై, "నేనును, ఆర్యుండగు నా రామునే చింతింపుచు, మేలుకొనియే యున్నాను; నిద్రింపలేదు" అని చెప్పెను. అని, తాత్పర్యము.

ఇతి సంవదతో రేవ మన్యోన్యం నరసింహయోః
ఆగమ్య ప్రాంజలిః కాలే గుహో భరత మబ్రవీత్. ౪

టీక॥ నరసింహయోః = పురుషశ్రేష్ఠులగు భరతశత్రుఘ్నులు; ఇతి=అని; ఏవం=ఇట్లు; అన్యోన్యం= ఒండొరులం గూర్చి; సంవదతోః=మాటలాడుకొనుచుండఁగా; గుహః=గుహుఁడు; కాలే= తగినకాలమునందు; ఆగమ్య=వచ్చి; భరతం=భరతునిగూర్చి; ప్రాంజలిః= మంచి చేమోడ్పు గలవాఁడై; అబ్రవీత్=చెప్పెను.

పురుషశ్రేష్ఠులగు నా భరత శత్రుఘ్నులీప్రకారము గాఁ బరస్పరము మాటలాడుకొనుచుండఁగానే, గుహుండును, తాను భరతుం జూచుటకుఁదగిన సమయంబని తలంచి, లోనికింబోయి, భరతుంజూచి, చేతులు మొగుడ్చుకొని, యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

కచ్చి త్సుఖం నదీతీరే వాత్సీః కాకుత్థ్స శర్వరీమ్
కచ్చి త్తే సహసైన్యస్య తావ త్సర్వ మనామయమ్. ౫

టీక॥ కాకుత్థ్స= భరతుఁడా! శర్వరీం=రాత్రియంతయు; నదీతీరే = ఏటిగట్టునందు; సుఖం = సుఖముగా; అవాత్సీః కచ్చిత్= ఉంటివా యేమి? సహసైన్యస్య = సైన్యముతోఁగూడిన; తే=నీకు; సర్వం తావత్ =అంతయు; అనామయం కచ్చిత్ = బాధలేమియే కదా!

భరతుఁడా! నదీతీరంబున, నీరాత్రి, నీకు సుఖంబుగానే యుండినదా? నీ

కేమిసీసైన్యంబునకేమి, యేమియుబా ధగలుగలేదుగదా? అని, గుహుండుభర తునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

గుహస్య వచనం శ్రుత్వా తత్తు స్నేహా దుదీరితమ్
రామస్యానువశో వాక్యం భరతోఽపీ ద మబ్రవీత్. ౬

టీక॥ రామస్య=రామునియొక్క; అనువశః= అధీనుండగు; భరతోఽపి= భరతుండును; స్నేహాత్= చెలిమివలన; ఉదీరితం=పలుకఁబడిన; గుహస్య= గుహునియొక్క; తత్=ఆ; వచనం= మాటను; శ్రుత్వాతు= విన్నంతనే, ఇదం=ఈ; వాక్యం=మాటను; అబ్రవీత్=పలికెను.

రామాధీనుండగుభరతుండు, గుహుండు స్నేహంబునంబలికినమాటనువిని, యాతనింజూచి, యిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

సుఖా న శ్శర్వరీ రాజన్ పూజితాశ్చాపి తే వయమ్

టీక॥ రాజన్=నిషాదరాజుండవగు గుహుఁడా! నః=మాకు; శర్వరీ=రాత్రి=సుఖా = సుఖమయినది. తే=అట్టి; వయం= మేము; పూజితాశ్చాపి=పూజింపఁబడినవారలమును.

నిషాదరాజుండవగుగుహుఁడా! మాకు రాత్రిసుఖంబుగనేయుండినది; మఱియు, మమ్ము, నానావిధంబులంబూజించినావు. అని, తాత్పర్యము.

గంగాంతు నౌభిర్బహ్వీభిర్దాశాః స్సంతారయంతు నః. ౭

టీక॥ దాశాః=చెంబడివారలు; నః=మమ్ములను; గంగాంతు= గంగానదిని మాత్రము; బహ్వీభిః=పెక్కులయిన; నౌభిః=ఓడలచేత; సంతారయంతు= దాఁటింతురుగాక.

చెంబడివారలు, ఓడలనేకంబులుదెచ్చి, మమ్మందఱను; ఈగంగానదినిమాత్రము దాఁటింపవలయును. అనిభరతుండు, గుహునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తతో గుహ స్సంత్వరితం శ్రుత్వా భరతశాసనమ్
ప్రతిప్రవిశ్య నగరం తం జ్ఞాతిజన మబ్రవీత్. ౮

టీక॥తతః=పిమ్మట; గుహః = గుహుఁడు;సంత్వరితం=మిక్కిలియు వేగిరపడిన; భరతశాసనం= భరతునాజ్ఞను; శ్రుత్వా=విని; తతః=అంత; నగరం=పట్టణమును;ప్రతిప్రవిశ్య=మఱలఁ బ్రవేశించి; తం=ఆ; జ్ఞాతిజనం= బంధుజనమును/గూర్చి;అబ్రవీత్=పలికెను.

గుహుండు,భరతుండు , త్వరపడి యాజ్ఞాపించినమాటనువిని, మఱలఁ బట్టణంబుఁబ్రవేశించి , తనబంధువులం జూచి యిట్లని,చెప్పెను.

అని,తాత్పర్యము.

ఉత్తిష్ఠత ప్రబుధ్యధ్వం భద్ర మస్తు చ వ స్సదా
నావ స్సమనుకర్షధ్వం తారయిష్యామ వాహినీమ్. ౯

టీక॥ఉత్తిష్ఠత = లెండు. ప్రబుధ్యధ్వం=మేలుకొనుఁడు. వః=మీకు; సదాచ=ఎల్లప్పుడును;భద్రం = మంగళము; అస్తు=అగుఁగాక.నావః= ఓడలను; సమనుకర్షధ్వం= ఈడ్చికొనిరండు. వాహినీం = నదిని; తారయిష్యామ(తారయిష్యామః)= దాఁటింతము.

మేల్కొనుఁడు; లెండు;మీకెప్పుడును మంగళంబుగలుగుఁగాక; ఓడలు దీసికొనిరండు; భరతాదులను,ఏఱుదాఁటింతము. అనిగుహుండు ; బంధువులతోఁజెప్పెను. అని,తాత్పర్యము.

తే తథో క్తా స్సముత్థాయ త్వరితా రాజశాసనాత్
పంచ నావాం శతాన్యా శు సమానిన్యు స్సమంతతః. ౧౦

టీక॥ తే=ఆబంధువులు;తథా=అట్లు, ఉక్తాః=చెప్పఁబడినవారలయి; సముత్థాయ=లేచి; రాజశాసనాత్=రాజాజ్ఞవలన; త్వరితాః=వేగిరపడినవారలయి; పంచనావాం=అయిదుఓడలయొక్క; శతాని = నూఱులను;ఆశు=శీఘ్రముగా; సమంతతః=అంతటను;సమానిన్యుః=తీసికొనివచ్చిరి.

అంతవారలు,గుహునిమాటనువిని, రాజాజ్ఞవలనలేచి,త్వరితంబుగాఁబో




యి, యచ్చటచ్చటనుండి, యయిదు నూఱుల యోడలందీసికొనివచ్చిరి.

అని, తాత్పర్యము.

అన్యా స్స్వస్తికవిజ్ఞేయా మహాఘంటాధరా వరాః
శోభమానాః పతాకాభి ర్యుక్తవాతా స్ససంహతాః. ౧౧

టీక॥ మహాఘంటాధరాః = గొప్ప ఘంటలనుధరించినవియు; వరాః = శ్రేష్ఠములును; పతాకాభిః = పెక్కెములచేత; శోభమానాః = ప్రకాశించుచున్నవియు; యుక్తవాతాః = తగినగాలిగలవియు; సుసంహతాః = చక్కనిసంధిబంధములుగలవియునగు; అన్యాః = ఇతరములయిన; స్వస్తికవిజ్ఞేయాః = స్వస్తికములని యెఱుంగఁదగినయోడలను; సమానిన్యుః (అధ్యాహృతము) = తెచ్చిరి.

మఱియు, నాయయిదువందలయోడలె గాక, గొప్పఘంటలుగట్టినవియును త్తమంబులును ధ్వజంబులంబ్రకాశించుచున్నవియు పైనమూయఁబడికిటికీలుంచియుండుటచే యుక్తమయినవాయుసంచారంబుగలవియుఁజీలలుమొదలగునవిగొట్టి దృఢముగానిర్మింపఁబడినవియునగు, స్వస్తికంబులనునోడలనుం, దీసికొనివచ్చిరి. అని, తాత్పర్యము.

తత స్స్వస్తికవిజ్ఞేయాం పాండుకంబళసంవృతామ్
సనందిఘోషాం కల్యాణీం గుహో నావ ముపాహరత్. ౧౨

టీక॥ తతః = అంత; గుహః = గుహుఁడు; స్వస్తికవిజ్ఞేయాం = స్వస్తికమని యెఱుంగఁదగినదియు; పాండుకంబళసంవృతాం = తెల్లనికంబళిచేఁగప్పఁబడినదియు; సనందిఘోషాం = సంతోషకరంబగుగంటలుమొదలగువానిధ్వనిగలదియు; కల్యాణీం = మంగళకరంబునగు; నావం = ఓడను; ఉపాహరత్ = కొనివచ్చెను.

అంత, గుహుండు, స్వస్తికంబనుపేరుగలయుత్తమంబులగు నోడలలోనొకటి తెల్లకంబళితోఁ గప్పఁబడినతలప్రదేశముగలదియు గంటలధ్వనులతోనొప్పుచున్నదియునుందరంబునగు నోడం దెచ్చెను. అని, తాత్పర్యము.

తా మారురోహ భరత శ్శత్రుఘ్నశ్చ మహాబలః







టీక॥ తాం = అయోడను; భరతః= భరతుఁడు; ఆరురోహ=ఎక్కెను. మహాబలః=అధికమయినబలముగల; శత్రుఘ్నశ్చ=శత్రుఘ్నుఁడును ; ఆరురోహ(అధ్యాహృతము)=ఎక్కెను.

ఆయోడపై , భరతుండును మహాబలుండగు శత్రుఘ్నుండును , ఆరోహించిరి. అని, తాత్పర్యము.

కౌసల్యాచ సుమిత్రాచ యాశ్చాన్యా రాజయోషితః. ౧౩
పురోహితశ్చ తత్పూర్వం గురవో బ్రాహ్మణాశ్చ యే
అనంతరం రాజదారా స్తథైవ శకటాపణాః. ౧౪

టీక॥ కౌసల్యాచ = కౌసల్యయు; సుమిత్రాచ=సుమిత్రయును; అన్యాః= ఇతరలయిన; రాజయోషితః = రాజభార్యలు;యాః(సంతి)=ఎవ్వరుగలరో; తాః(అధ్యాహృతము)చ=వారలును ; తత్పూర్వం=వారలకన్నముందు;పురోహితశ్చ = పురోహితుండును; గురవః=పెద్దలయిన; బ్రాహ్మణాః=బ్రాహ్మణులు; యే(సంతి) = ఎవ్వరుగలరో; తే(అధ్యాహృతము)చ= వారలును; ఆరురుహుః (అధ్యాహృతము)= ఎక్కిరి. అనంతరం=పిమ్మట; రాజదారాః=రాజభార్యలు;ఆరురుహుః (అధ్యాహృతము)= ఎక్కిరి. తథైవ=అట్లే;శకటాపణాః=బండ్లును అంగళ్లును; ఆరురుహుః (అధ్యాహృతము)=ఎక్కినవి,ఎక్కింపఁబడినవనుట.

అంతఁ,పురోహితుండగువసిష్ఠుండును,మఱియుఁబెద్దలగు బ్రాహ్మణులును, ఆరోహించిరి;ఆపిమ్మట, రాజభార్యలగుకౌసల్యాదులారోహించిరి; అంత,రథశకటాగులను అంగడిపదార్థంబులను,ఎక్కించిరి. అని, తాత్పర్యము.

ఆవాస మాదీపయతాం తీర్థం చాప్యవగాహతామ్
భాండాని చాదదానానాం ఘోష స్త్రిదివ మస్పృశత్. ౧౫

టీక॥ఆవాసం =నివాసస్థానమును; ఆదీపయతాం= వెలిగించువారలును; తీర్థం= రేవునుగూర్చి ; అవగాహతాం చాపి=దిగుచున్నవారలును;భాండాని=




ఉపకరణములను;ఆదదానానాం=తీసుకొనుచున్నవారలునగు వారలయొక్క; ఘోషః=ధ్వని;త్రిదివం=స్వర్గమును; అస్పృశత్=తాఁకినది.

అంత,విడిసినస్థానమును దహించువారలుసేయు ధ్వనియు, నోడలపైనెక్కుటకైనీళ్లలోనికి దిగువారలశబ్దంబును,అన్యోన్యయుపరణంబులనోడలోనికిఁ జేర్చఁకొనువారలధ్వనియును, స్వర్గలోకంబుముట్టి,చెలంగినది.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— రాజభటులు, పోవునపుడు, లక్ష్మీసమాగమంబుకొఱకైనివాసస్థానంబునుదహించు వాడుక కలదు.

పతాకిన్య స్తు తా నావ స్స్వయం దాశై రధిష్ఠితాః
వహంత్యో జన మారూఢం తదా సంపేతు రాశుగాః. ౧౬

టీక॥తదా=అప్పుడు; పతాకిన్యః=ధ్వజంబులుగల;తాః=ఆ;నావస్తు=ఓడలును;దాశైః=చెంబడివారలచేత; స్వయం=తమచేతనే;అధిష్ఠితాః=అధిష్ఠింపఁబడినవై; ఆరూఢం = ఎక్కిన;జనం=జనమును; వహంత్యః=తీసుకొనుచు;ఆశుగాః= వేగముగాఁబోవునవై; సంపేతుః=పోయినవి.

అప్పుడు, ఓడలు, గాలిబలంబుగలుగుటకైధ్వజంబులు గట్టియుండుటం జేసి, చెంబడివారలెక్కి యూరకుండఁగానే, యతివేగంబునం, బోయినవి. అని,తాత్పర్యము.

నారీణా మభిపూర్ణా స్తు కాశ్చి త్కా శ్చిచ్చ వాజినామ్
కాశ్చి దత్ర వహంతిస్మ యానయుగ్యం మహాధనమ్. ౧౭

టీక॥కాశ్చిత్=కొన్నియోడలు; నారీణాం=(తృతీయార్థమందుషష్ఠి) స్త్రీలచేత;అభిపూర్ణాః = నిండినవి.కాశ్చిత్=కొన్ని;వాజినాం = (తృతీయార్థమందుషష్ఠి)గుఱ్ఱములచేత; అభిపూర్ణాః(అధ్యాహృతము)చ= నిండినవియు.అత్ర=ఇందు; కాశ్చిత్=కొన్ని; మహాధనం=అధికమయినవెలగల; యా

నయుగ్యం= రథాదులను ఎద్దులు మొదలగువానిని; వహంతిస్మ=మోసినవి.

అందుఁ గొన్ని యోడలందు, స్త్రీలె నిండియుండిరి; కొన్ని, గుఱ్ఱంబులనిండియుండినవి; మఱికొన్ని, యుత్తమంబులగు రథశకటాదులను, వానికిఁ గట్టు నశ్వవృషభాదులను, నిండియుండినవి.

అని, తాత్పర్యము.

తాస్స్మ గత్వా పరం తీర మవరోప్యచ తం జనమ్
నివృత్తాః కాండచిత్రాణి క్రియంతే దాశబంధుభిః. ౧౮

టీక॥ తాః=ఆయోడలు; పరం=అవ్వలి; తీరం=గట్టును; గత్వా = పొంది; తం=ఆ; జనం= జనమును; అవరోప్య చ=పొందియు; నివృత్తాః= మఱలిన; దాశబంధుభిః = నీచులగు చెంబడివారలచేత; కాండచిత్రాణి=నీళ్లయందుఁ జిత్రగతులు; క్రియంతేస్మ=చేయఁబడినవి.

అంత, నాయోడలు, అవ్వలిగట్టుఁ జేరి, జనులను దింపి, మఱలివచ్చునపుడు, చెంబడివారలు, భారము దిగుటవలన, నతిలాఘవంబున, జలంబులందుఁ జిత్రగతులు గావించిరి. అని, తాత్పర్యము.

సవైజయంతాస్తు గజా గజారోహప్రచోదితాః
తరంతస్స్మ ప్రకాశంతే సధ్వజా ఇవ పర్వతాః. ౧౯

టీక॥ సవైజయంతాః=టెక్కెములతోఁ గూడిన; గజాస్తు=ఏనుంగులును; గజారోహ ప్రచోదితాః=మావటివారలచేఁ బ్రేరింపఁబడినవై; తరంతః=దాఁటుచు; సధ్వజాః= టెక్కెములతోఁ గూడిన; పర్వతాః ఇవ = పర్వతంబులువలె; ప్రకాశంతేస్మ=ప్రకాశించినవి.

ధ్వజంబులతోఁ గూడిన యేనుంగులు, మావటీలు ప్రేరింప, నీళ్ల కుడిగ్గి, నదిని దాఁటుచు, ధ్వజసహితంబులగు పర్వతంబులకరణిం బ్రకాశించినవి.

అని, తాత్పర్యము.

నావశ్చారురుహు స్త్వన్యే ప్లవై స్తేరు స్తథా పరే
అన్యే కుంభఘటై స్తేరు రన్యే తేరుశ్చ బాహుభిః. ౨౦

టీక॥ అన్యేచ=ఇతరులును; నావశ్చ= ఓడలను; ఆరురుహుః= ఎక్కిరి.




తథా=అట్లు; అపరే= ఇతరులు; ప్లవైః=తెప్పలచేత ; తేరుః=దాఁటిరి, అన్యే=ఇతరులు; కుంభఘటైః=కుండలచేత; తేరుః=దాఁటిరి. అన్యే=ఇతరులు; బాహుభిశ్చ = చేతులచేతను; తేరుః=దాఁటిరి.

కొందఱు,ఓడలనెక్కి దాఁటిరి ; కొందఱు, తెప్పలపై దాఁటిరి; కొందఱుకుండలచే దాఁటిరి; మఱికొందఱు, చేతులతో నీఁదుకొనుచు దాఁటిరి.

అని, తాత్పర్యము.

సా పుణ్యా ధ్వజినీ గంగాం దాశైః సంతారితా స్వయమ్
మైత్రే ముహూర్తే ప్రయయౌ ప్రయాగవన ముత్తమమ్. ౨౧

టీక॥ పుణ్యా=పరిశుద్ధమగు; సా=ఆ; ధ్వజినీ=సేన; దాశైః = చెంబడివారలచేత; స్వయం=తమచేతనె; గంగాం=గంగను;సంతారితా=దాఁటింపఁబడినదై;మైత్రే=మైత్రమను; ముహూర్తే=కాలమునందు;ఉత్తమం= శ్రేష్ఠమగు;ప్రయాగవనం=ప్రయాగవనమును; ప్రయయౌ= పొందినది.

గంగాస్నానంబునం బరిశుద్ధమయిన యా సేన, అట్లు, చెంబడివారల సాహాయ్యంబున గంగానదిని దాఁటి; మైత్రాఖ్య ముహూర్తంబునందుఁ బ్రయాగవనంబుఁ జేరినది. అని, తాత్పర్యము.

ఆశ్వాసయిత్వాచ చమూం మహాత్మా
నివేశయిత్వాచ యథోపజోషమ్
ద్రష్టుం భరద్వాజ మృషిప్రవర్య
మృత్విగ్వృతస్సన్ భరతః ప్రతస్థే. ౨౨
( "భరద్వాజమృషింప్రవర్షణం" ఇతిపాఠాంతరం. )

టీక॥మహాత్మా=పూజ్యమయిన స్వభావముగల; భరతః=భరతుఁడు; చమూం = సేనను; ఆశ్వాసయిత్వాచ (ఆశ్వాస్యచ)=ఊఱడించియు; యథోపజోషం=సుఖము నతిక్రమింపక ; నివేశయిత్వాచ (నివేశ్యచ) = విడియఁజేసియు; ఋత్విగ్వృతః= ఋత్విజులచేతఁ గోరఁబడినవాఁడై ; ఋషిప్రవ




ర్యం=ఋషి శ్రేష్ఠుండగు; (పాఠాంతర పక్షమందు) ప్రవయసం= అధికమయిన వయస్సుగల; ఋషిం=ఋషియయిన; భరద్వాజం=భరద్వాజుని; ద్రష్టుం=చూచుటకు; ప్రతస్థే=పోయెను.

మహాత్ముండగుభరతుండు, సైన్యమునాశ్వాసించి, ప్రయాగవనంబుననె సుఖప్రదేశంబున సైన్యంబునంతయువిడియ నియమించి, వసిష్ఠాదులచేఁ బ్రేరితుండై, ఋషి శ్రేష్ఠుండును అధికవయస్కుండు నగుభరద్వాజమహర్షిం జూచుటకై, పోయెను.

అని, తాత్పర్యము.

స బ్రాహ్మణస్యాశ్రమ మభ్యుపేత్య
మహాత్మనో దేవపురోహి తస్య
దదర్శ రమ్యోటజవృక్షషండం
మహ ద్వనం విప్రవరస్య రమ్యమ్. ౨౩

టీక॥ సః=ఆభరతుఁడు; బ్రాహ్మణస్య = వేదంబులనధ్యయనించినవాఁడును; మహాత్మనః= మహానుభావుండును; దేవపురోహితస్య = దేవతలఁబురోహితుండును (బృహస్పతిపుత్రుండగుట చే, భరద్వాజుండు దేవపురోహితుండని చెప్పఁబడినది); విప్రవరస్య=బ్రాహ్మణశ్రేష్ఠుండునగు, భరద్వాజునియొక్క; ఆశ్రమం=ఆశ్రమమును; అభ్యుపేత్య= సమీపించి= రమ్యోటజవృక్షషండం=రమణీయములయినపర్ణశాలలును వృక్షసమూహములునుగలదియు; రమ్యం= మనోహరమునగు; మహత్=అధికమైన; వనం=వనమును; దదర్శ=చూచెను.

ఆభరతుఁడు, సమస్తవేదవేత్తయును మహానుభావుండును దేవపురోహితుండును బ్రాహ్మణోత్తముండునగు భరద్వాజ మహర్షియాశ్రమంబునొద్దకుఁబోయి, యచ్చట, రమణీయంబులగుపర్ణశాలలును నానావిధవృక్షంబులునుగలరమణీయంబగుగొప్పవనముం, జూచెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, ఏకోననవతితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండైకోన నవతితమసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

నవతితమ సర్గ ప్రారంభః.

భరద్వాజాశ్రమం దృష్ట్వా క్రోశాదేవ నరర్షభః
బలం సర్వ మవస్థాప్య జగామ సహమంత్రిభిః. ౧
పద్భ్యామేవహి ధర్మజ్ఞో న్యస్త శస్త్రపరిచ్ఛదః
వసానో వాససీ క్షౌమే పురోధాయ పురోధసమ్. ౨

టీక॥నరర్షభః=పురుషశ్రేష్ఠుండును; ధర్మజ్ఞః=ధర్మంబునెఱింగినవాఁడునగు భరతుండు; క్రోశాదేవ= కోసు ననుండియె; భరద్వాజాశ్రమం= భరద్వాజమహర్షియాశ్రమమును ; దృష్ట్వా=చూచి; సర్వం=సమస్తమయిన; బలం=సైన్యమును; అవస్థాప్య=నిలిపి; న్యస్తశస్త్రపరిచ్ఛదః = విడువఁబడిన యాయుధములును ఆభరణములునుగలవాఁడై; క్షౌమే= తెల్లపట్టువైన; వాససీ=వస్త్రములను; వసానః=కట్టుకొనుచు; పురోధసం=పురోహితుని; పురోధాయ = ముందిడుకొని; మంత్రిభిస్సహ=మంత్రులతోఁగూడ; పద్భ్యామేవ=కాళ్లచేతనె; జగామ=పోయెను.

పురుషశ్రేష్ఠుండును ధర్మజ్ఞుండునగు భరతుండు, కోసుదూరంబు ముందుగానే, భరద్వాజమహర్షియాశ్రమంబుఁజూచి, సైన్యంబునంతయునిలిపి, ఆయుధంబులను ఆభరణంబులను విడిచి, పట్టువస్త్రంబులనుగట్టుకొని, పురోహితుని ముందిడుకొని, మంత్రులంగూడి, యాశ్రమంబునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

తత స్సందర్శనే తస్య భరద్వాజస్య రాఘవః
మంత్రిణ స్తా నవస్థాప్య జగామా నుపురోహితమ్. 3

టీక॥ తతః=అటుపిమ్మట ; రాఘవః=భరతుఁడు; తస్య=ఆ; భరద్వాజస్య=భరద్వాజమహర్షియొక్క ; సందర్శనే = చూచునిమిత్తమయి ; తాన్=ఆ; మంత్రిణః=మంత్రులను ; అవస్థాప్య=నిలిపి ; అనుపురోహితం=పురోహితునివెంబడి; జగామ = పోయెను.

అంత, భరతుండు , భరద్వాజాశ్రమంబుఁబ్రవేశించినపిదప, మంత్రులనుంగూడనిలిపి, పురోహితుండగు వసిష్ఠునితోఁ గూడఁదాను, భరద్వాజుం జూడఁబోయెను.

అని, తాత్పర్యము.

వసిష్ఠ మథ దృష్ట్వైవ భరద్వాజో మహాతపాః
సంచచాలా సనా త్తూణం శిష్యా నర్ఘ్య మితి బ్రువన్. ౪

టీక॥ అథ=అంత; మహాతపాః=అధికమయిన తపస్సుగల ; భరద్వాజః=భరద్వాజుఁడు; వసిష్ఠం= వసిష్ఠ మహామునిని;దృష్ట్వైవ= చూచినంతనె; శిష్యాన్=శిష్యులనుగూర్చి; "అర్ఘ్యం=పూజాద్రవ్యమును ; ఆనయత (అధ్యాహృతము) =తెండు"ఇతి=అని;బ్రువన్=చెప్పుచు; ఆసనాత్=ఆసనంబుననుండి; తూర్ణం= శీఘ్రముగా; సంచచాల=లేచెను.

అంత, మహాతపస్వియగు , భరద్వాజమహాముని, వసిష్ఠమహర్షిం జూచినంతనె , శిష్యులంజూచి, "యర్ఘ్యంబు దె"మ్మని, చెప్పుచు,శీఘ్రంబునఁనాసనంబుననుండిలేచెను.

అని, తాత్పర్యము.

సమాగమ్య వసిష్ఠేన భరతే నాభివాదితః
అబుధ్యత మహాతేజా స్సుతం దశరథస్యతమ్. ౫

టీక॥మహాతేజాః=అధికమయినప్రభావముగల భరద్వాజుండు ; వసిష్ఠేన=వసిష్ఠమహర్షితో; సమాగమ్య=చేరి; భరతేన=భరతునిచేత; అభివాదితః = నమస్కరింపఁబడినవాఁడై ; తం=ఆభరతుని;దశరథస్య=దశరథుని యొక్క; సుతం=కొడుకునుగా; అబుధ్యత= తెలిసికొనెను.

మహాప్రభావుండగు నాభరద్వాజుండు, వసిష్ఠునితోఁ,జేరి, యంతభర

తుండభివాదనంబుఁజేసినపిదప, నతండు దశరథపుత్త్రుండని, యెఱింగెను.

అని, తాత్పర్యము.

తాభ్యా మర్ఘ్యంచ పాద్యంచ దత్వా పశ్చా త్ఫలానిచ
అనుపూర్వ్యాచ్చ ధర్మజ్ఞః ప్రప్రచ్ఛ కుశలం కులే. ౬

టీక॥ధర్మజ్ఞః= ధర్మము నెఱింగినభరద్వాజుండు ; అనుపూర్వ్యాచ్చ=క్రమమువలనను; తాభ్యాం=ఆవసిష్ఠభరతులకొఱకు;అర్ఘ్యంచ=అర్ఘ్యమును; పాద్యంచ= పాద్యమును; పశ్చాత్=పిమ్మట; ఫలానిచ=పండ్లను;దత్వా=ఇచ్చి;కులే=ఇంటియందు; కుశలం=క్షేమమును;ప్రప్రచ్ఛ=అడిగెను.

అంత, ధర్మజ్ఞుండగునాభరద్వాజుండు,క్రమంబున,వసిష్ఠమహర్షికిని, భరతునకును,అర్ఘ్యపాద్యంబులొసంగి ఫలంబులనిచ్చి, యింతటనందఱు క్షేమం బెకదా?యని,యడిగెను.

అని, తాత్పర్యము.

అయోధ్యాయాం బలే కోశే మిత్రేష్వపిచ మంత్రిషు

టీక॥అయోధ్యాయాం=అయోధ్యయందును;బలే=సైన్యమునందును; కోశే = బొక్కసమునందును;మిత్రేష్వపిచ=స్నేహితులయందును; మంత్రిషు= మంత్రులయందును; కుశలం (అధ్యాహృతము) = క్షేమమును;పప్రచ్ఛ(అధ్యాహృతము)=అడిగెను.

మఱియు, నయోధ్యయందును సైన్యంబునందునుబొక్కసమునందును, అన్నియు క్షేమంబెగదా? స్నేహితులును మంత్రులును క్షేమముగనున్నారా ? అని,యడిగెను. అని, తాత్పర్యము.

జానన్ దశరథం వృత్తం న రాజాన ముదాహరత్. ౭

టీక॥ సః(అధ్యాహృతము)= ఆభరద్వాజుఁడు; దశరథం= దశరథమహారాజును; వృత్తం= మృతిఁబొందినవానిఁగా; జానన్=ఎఱింగినవాఁడై; రాజానం=దశరథమహారాజును; నోదాహరత్=ఉదారింపఁడయ్యె.

భరద్వాజుఁడు, దశరథమహారాజు మృతిఁబొందెనని యెఱింగిన వాఁడుకావున, దశరథమహారాజు సమాచారమెత్తలేదు.అని, తాత్పర్యము.

సర్గ ౯౦

వసిష్ఠో భరతశ్చైనం పప్రచ్ఛతు రనామయమ్
శరీరే గ్నిషు వృక్షేషు శిష్యేషు మృగపక్షిషు. ౮

టీక॥ వసిష్ఠః=వసిష్ఠుఁడును; భరతశ్చ=భరతుడును; ఏనం= ఈభరద్వాజుని; శరీరే=దేహమునందును ; అగ్నిషు=అగ్నిహోత్రములందును; వృక్షేషు=వృక్షములయందును ; శిష్యేషు=శిష్యులయందును; మృగపక్షిషు = మృగంబులందునుపక్షులందును ; అనామయం=బాధలేమిని;పప్రచ్ఛతుః=అడిగిరి.

అంత,వసిష్ఠుండును భరతుండును, "దేహమునందు ఆరోగ్యముగానున్నదా? అగ్నిహోత్రములుచక్కఁగా జరగుచున్నవా? వృక్షంబులుచక్కఁగానున్నవా?శిష్యులు క్షేమంబుగా నున్నారా?వనంబునందలిమృగంబులును పక్షులును క్షేమంబుగానున్నవా?"యని,భరద్వాజునడిగిరి. అని, తాత్పర్యము.

తథేతి తత్ప్రతిజ్ఞాయ భరద్వాజో మహాతపాః
భరతం ప్రత్యువాచే దం రాఘవస్నేహబంధనాత్. ౯

టీక॥మహాతపాః= అధికమయినతపస్సుగల;భరద్వాజః=భరద్వాజుఁడు; తథేతి=అట్లేయని;తత్ = దాని;ప్రతిజ్ఞాయ=ఒప్పుకొని;రాఘవస్నేహబంధనాత్= రామునందలిస్నేహబంధమువలన;భరతంప్రతి = భరతునిగూర్చి;ఇదం=ఈమాటను;ఉవాచ=చెప్పెను.

మహాతపశ్శాలియగు భరద్వాజుండు,వసిష్ఠభరతులకుఅన్నిటను క్షేమమెయనిచెప్పి,యంత,రామునియందలిస్నేహంబున, భరతుంజూచి,యిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

కిమిహాగమనే కార్యం తవ రాజ్యం ప్రశాసతః
ఏతదాచక్ష్వ మే సర్వం నహి మే శుద్ధ్యతే మనః. ౧౦

టీక॥రాజ్యం=రాజ్యమును;ప్రశాసతః=పాలించుచున్న; తవ = నీకు ; ఇహ=ఇచ్చటికి;ఆగమనే=వచ్చుటయందు; కార్యం=పని;కిం=ఏమి? ఏతత్=దీనిని;సర్వం=అంతను; మే=నాకొఱకు;ఆచక్ష్వ=చెప్పుము. మే=నాయొక్క; మనః=మనస్సు;నశుద్ధ్యతేహి= పరిశుద్ధముకాలేదుగదా!

నీవు రాజ్యంబుఁబాలించువాఁడవు; ఇప్పుడిచ్చటికేలవచ్చితివి? నాకుసవిస్తరముగాఁజెప్పుము; నామనంబునకుసంశయముగలుగుచున్నది.

అని, తాత్పర్యము.

సుషువే య మమిత్రఘ్నం కౌసల్యానందవర్ధనమ్
భ్రాత్రా సహ సభార్యో య శ్చిరం ప్రవ్రాజితో వనమ్. ౧౧
నియుక్త స్స్త్రీనియుక్తేన పిత్రా యో౽సౌ మహాయశాః
వనవాసీ భవే తీహ సమాః కిల చతుర్దశ. ౧౨
కచ్చి న్న తస్యాపాపస్య పాపం కర్తు మిహేచ్ఛసి
అకంటకం భోక్తుమనా రాజ్యం తస్యానుజస్యచ. ౧౩

టీక॥ కౌసల్యా=కౌసల్య; అమిత్రఘ్నం= శత్రువులంజంపునట్టివాఁడును; ఆనందవర్ధనం= సంతోషమునువృద్ధిఁబొందించువాఁడునగు; యం=ఎవ్వని; సుషువే=కన్నదో; యః=ఎవ్వఁడు; సభార్యః=భార్యతోఁగూడినవాఁడై; భ్రాత్రాసహ = తమ్మునితోగూడ ; చిరం=బహుకాలము; వనం= అడవిని; ప్రవ్రాజితః= పొందింపఁబడినాఁడో; యః=ఏ; అసౌ=ఈ; మహాయశాః= అధికమయినకీర్తిగలవాఁడు ; స్త్రీనియుక్తేన=భార్యచేనాజ్ఞాపింపఁబడిన; పిత్రా=తండ్రిచేత; చతుర్దశ= పదునాలుగు; సమాః=సంవత్సరములు ; ఇహ=ఇప్పుడు; వనవాసీ = అడవినుండువాఁడవు; భవ=అగుము." ఇతి = అని; నియుక్తః కిల= ఆజ్ఞాపింపఁబడినవాఁడేయామెనో; త్వం(అధ్యాహృతము)=నీవు; రాజ్యం=రాజ్యమును; అకంటకం=విరోధములేనట్లుగా; భోక్తుమనాః= అనుభవింపమనస్సుగలవాఁడవై; ఇహ=ఇప్పుడు; తస్య=అట్టి; అపాపస్య= పాపరహితుండగురామునకును; తస్య= అతనియొక్క; అనుజస్యచ=తమ్ముండగులక్ష్మణునకును ; పాపం=కష్టమును; కర్తుం = చేయుటకు; నేచ్ఛసికచ్చిత్ = కోరువాఁడవు కావుగదా?

కౌసల్యాదేవి, శత్రువులనుసంహరించువాఁడునుసమస్త జంతువులకును బరమానందంబుగలిగించువాఁడునగు నెవ్వనింగన్నదో, యెవ్వండు, భార్యతోను

దమ్మునితోనుంగూడబహుకాలమరణ్యం బుననుండుటకుఁ బంపఁబడెనో, మఱి యు నేమహాయశునిఁదండ్రిదశరథుండు భార్యయాజ్ఞకు లోఁబడి "నీవిప్పుడె పోయిపదునాలుగుసంవత్సరంబు లడవి లోనుండు"మనియాజ్ఞాపించెనో, అట్టి పాపరహితుండగు రామునకును, అత నితమ్ముండులక్ష్మణునకును, నీవు, ఎదు రులేకయెల్లప్పుడును రాజ్యంబుననుభ వింపంగోరి,ఏమియు నపకారంబు సే యంగోరవుగదా? అని,భరద్వాజుండు భరతునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తో భరద్వాజం భరతః ప్రత్యువాచ హ
పర్యశ్రు నయనో దుఃఖా ద్వాచా సంసజ్జమానయా. ౧౪

టీక॥ భరతః=భరతుఁడు; ఏవం= ఇట్లు;ఉక్తః=చెప్పఁబడినవాఁడై; దుః ఖాత్= దుఃఖమువలన; పర్యశ్రునయ నః= కన్నీళ్లతోఁజుట్టఁబడిన కండ్లుగల వాఁడై;సంసజ్జమానయా= తొట్రుప డుచున్న; వాచా=మాటచేత;భరద్వా జంప్రతి= భరద్వాజమహర్షినిగూర్చి; ఉవాచ= చెప్పెను. "హ" అనునది పాదపూరణార్థము.

భరతుండు,భరద్వాజమహర్షిచె ప్పినమాటనువిని, యిట్టిమాటలు వినవ లసివచ్చెనుగదాయనిదుఃఖితుండై, కం డ్లునిండఁగన్నీళ్లుగాఱ,మాటలుదొట్రు పడ,భరద్వాజమహామునింజూచి,యిట్ల నిచెప్పెను.

అని, తాత్పర్యము.

హతోస్మి యది మా మేవం భగవా నపి మన్యతే
మత్తో న దోష మాశంకే నైవం మా మనుశాస్తు హి. ౧౫

టీక॥భగవానపి=మాహాత్మ్యముగ లనీవును;మాం=నన్ను;ఏవం=ఈప్రకా రముగా;మన్యతేయది=తలంతువేని; అ హం(అధ్యాహృతము)=నేను;హతః= కొట్టఁబడినవాఁడను;అస్మి = అగుచు న్నాను.మత్తః=నావలన; దోషం=దో షమును;నాశంకే = సందేహింపను. మాం=నన్ను;ఏవం = ఇట్లు;నానుశా స్తు=ఆజ్ఞాపింపవలదు ("హి"అనునది పాదపూరణార్థము).

భగవంతుండవగునీవును, నన్నుదోషినిగా నేతలంతువేని, నేనుహతుండనైతిని; నాయందుదోషంబుండునట్లు నాకెంతమాత్రముసందేహములేదు; సర్వజ్ఞుండవగునివిట్లానతీయరాదు.

అని, తాత్పర్యము.

నచైత దిష్టం మాతా మే యదవోచ న్మదంతరే
నాహ మేతేన తుష్టశ్చ న తద్వచన మాదదే. ౧౬

టీక॥మే=నాయొక్క; మాతా=తల్లి; మదంతరే=నేనులేనికాలమునందు; యత్=ఏమాటను; అవోచత్=చెప్పినదో; ఏతత్ = ఇది; మమ(అధ్యాహృతము)=నాకు; ఇష్టంచ = కోరఁబడినదియు; న=కాదు. ఏతేన = దీనిచేత; అహం= నేను; తుష్టశ్చ = సంతోషించినవాఁడను; న=కాను. తద్వచనం= ఆబిడమాటను; నాదదే=అంగీకరింపలేదు.

నేనులేనప్పుడు, నాతల్లికైకేయిగావించినకార్యము, నేనుగోరినదికాదు; దానిచే నాకుసంతోషంబును గలుగలేదు; నేనుదానికిసమ్మతింపనులేదు.

అని, తాత్పర్యము.

అహంతు తం నరవ్యాఘ్ర ముపయాతః ప్రసాదకః
ప్రతినేతు మయోధ్యాంచ పాదౌ తస్యాభి వందితుమ్. ౧౭

టీక॥అహంతు = నేనో; నరవ్యాఘ్రం=పురుషశ్రేష్ఠుండగు; తం=ఆరాముని; ప్రసాదకః=సంతోషపఱచువాఁడనై; తస్య=అతనియొక్క; పాదౌ=పాదములను; అభివందితుం=నమస్కరించుటకును; అయోధ్యాం= అయోధ్యనుగూర్చి; నేతుంచ=తీసికొనిపోవుటకును; ఉపయాతః=వచ్చినాను.

నేను, బురుషశ్రేష్ఠుండగునారాముని(బసన్నుంగావించికొనియతనిపాదంబులపైఁబడి, యతనినయోధ్యకుఁగొనిపోవుటకై, వచ్చినాను. అని, తాత్పర్యము.

త్వం మా మేవం గతం మత్వా ప్రసాదం కర్తుమ ర్హసి
శంస మే భగవన్ రామః క్వ సంప్రతి మహీపతిః. ౧౮

స ౯౦




టీక॥ భగవన్ = అధికమయినమాహత్మ్యముగల భరద్వాజుఁడా! మాం = నన్ను; ఏవం = ఇట్లు; గతం = వచ్చినవానిఁగా; మత్వా = తలంచి; ప్రసాదం = అనుగ్రహమును; కర్తుం = చేయుటకు; అర్హసి = తగుదువు. మహీపతిః = భూమికిఁ బ్రభువైన; రామః = రాముఁడు; సంప్రతి = ఇప్పుడు; క్వ = ఎచ్చట? మే = నాకు; శంస = చెప్పుము.

భగవంతుండవగు భరద్వాజుఁడా! నేనువచ్చినకారణంబు నెదనుంచి నన్ననుగ్రహింప వలయు; భూనాయకుండగు రాముండిప్పు డెచ్చటనున్నాఁడు? నాకుఁ జెప్పుము అని, భరతుండు భరద్వాజునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

వసిష్ఠాదిభి ఋత్విగ్భి ర్యాచితో భగవాం స్తతః
ఉవాచ తం భరద్వాజః ప్రసాదా ద్భరతం వచః. ౧౯

టీక॥ భగవాన్ = అధికమయినమాహాత్మ్యముగల; భరద్వాజః = భరద్వాజమహర్షి; తతః = అంత; వసిష్ఠాదిభిః = వసిష్ఠుఁడుమున్నుగాఁగల; ఋత్విగ్భిః = ఋత్విజులచేత; యాచితః = ప్రార్థింపఁబడినవాఁడై; ప్రసాదాత్ = అనుగ్రహమువలన; తం = ఆ; భరతం = భరతునిగూర్చి; వచః = మాటను; ఉవాచ = చెప్పెను.

భగవంతుండగు భరద్వాజ మహర్షి, వసిష్ఠవామదేవాదిఋత్విజులు భరతునివిషయమయి యనుగ్రహింపుమని ప్రార్థింపం బ్రసన్నుండై, యాభరతుంజూచి యీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

త్వయ్యే త త్పురుషవ్యాఘ్ర యుక్తం రాఘవవంశజే
గురువృత్తి ర్దమశ్చైవ సాధూనా మనుయాయితా. ౨౦

టీక॥ పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుండవగు భరతుఁడా; గురువృత్తిః = గురుశుశ్రూష ( అన్ననను సరించుట ) యు; దమశ్చైవ = ఇంద్రియనిగ్రహమును; సాధూనాం = పెద్దలయొక్క; అనుయాయితా = అనుసరించుటయు; ఏతత్ = ఇది; రాఘవవంశజే = రఘువంశంబునంబుట్టిన; త్వయి = నీయందు; యు







_క్తం=తగినది.

పురుషశ్రేష్ఠుండవగు భరతుఁడా! జ్యేష్ఠానువర్తనంబును, ఇంద్రియనిగ్రహంబును, సత్పురుషుల ననుసరించుట యు, ఇవన్నియు, రఘువంశంబునం బుట్టిననీకుఁదగియున్నవి.

అని, తాత్పర్యము.

జానే చైత న్మనస్స్థం త ద్దృఢీకరణ మస్త్వితి
అపృచ్ఛం త్వాం తదాత్యర్థం కీర్తిం సమభి వర్ధయన్. ౨౧

టీక॥ మనస్స్థం=మనసుననున్న ; ఏతత్=దీనిని ; జానే చ=ఎఱుంగుదునే; తద్దృఢీకరణం=దానిదృఢీకరించుట; అస్తు=అగుఁగాక. ఇతి=అని; కీర్తిం=కీర్తిని; అత్యర్థం=మిక్కిలియు; సమభివర్ధయన్=వృద్ధిఁబొందించువాఁడనై ; త్వాం=నిన్ను; అపృచ్ఛం=అడిగితిని-

నేనునీమనసులోనున్న యీసంగతిని యోగదృష్టిం దెలిసికొనియేయున్నాను. అయినను, అది,దృఢీకృతంబగుటకును, నీకు,జ్యేష్ఠభ్రాత్రనువర్తనంబునంగలుగుకీర్తినిమిక్కిలియువృద్ధిఁబొందించుటకును, నిన్నట్లడిగితిని.

అని, తాత్పర్యము.

జానే చ రామం ధర్మజ్ఞం ససీతం సహలక్ష్మణమ్

టీక॥ ససీతం=సీతతోఁగూడినవాఁడును; సహలక్ష్మణం=లక్ష్మణునితోఁగూడినవాఁడునగు; ధర్మజ్ఞం=ధర్మమునెఱింగిన; రామంచ=రామునింగూడ; జానే=ఎఱుంగుదును.

ధర్మజ్ఞుండగురాముండును సీతాదేవియులక్ష్మణుండును, ఎచ్చటనున్నారో, ఆసంగతియు నాకుఁ దెలిసి యున్నది. అని, తాత్పర్యము.

అసౌ వసతి తే భ్రాతా చిత్రకూటే మహాగిరౌ. ౨౨

టీక॥ అసౌ=ఈ ; తే=నీయొక్క; భ్రాతా= అన్నయగురాముండు ; చిత్రకూటే= చిత్రకూటమను; మహాగిరౌ= మహాపర్వతమునందు; వసతి=




ఉన్నాఁడు. నీయన్నరాముండు, చిత్రకూటంబనుమహాపర్వతంబుననున్నాఁడు. అని, తాత్పర్యము.

శ్వస్తు గంతాసి తం దేశం వసాద్య సహామంత్రిభిః

టీక॥ శ్వస్తు=రేపే; తం = ఆ; దేశం=ప్రదేశమునుగూర్చి; గంతాసి= పోఁగలవు. అద్య=ఇప్పుడు; మంత్రిభిస్సహ=మంత్రులతోఁగూడ; వస=ఉండుము.

ఆచిత్రకూటపర్వతంబునకు రేపుపోఁగలవు; ఇప్పుడిచ్చటమంత్రులతోఁగూడ నుండుము. అని, తాత్పర్యము.

ఏతన్మే కురు సుప్రాజ్ఞ కామం కామార్థకోవిద. ౨౩

టీక॥సుప్రాజ్ఞ= మిక్కిలియుఁబండితుండవు; కామార్థకోవిద= కోరఁబడినవానియందుఁబండితుండవు (కోరఁబడినవానినిచ్చుటయందుఁబండితుండవు) నగుభరతుఁడా! మే = నాయొక్క; ఏతత్=ఈ; కామం=కోర్కిని; కురు=చేయుము.

మహాపండితుండవు వాంఛితంబుల నొసంగుటయందుసమర్థుండవగుభరతుఁడా! నేనుగోరినట్లు సేయుము. అని, భరద్వాజమహాముని భరతునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తత స్తథే త్యేవ ముదారదర్శనః
ప్రతీతరూపో భరతో౽ బ్రవీద్వచః
చకార బుద్ధించ తదా తదా శ్రమే
నిశానివాసాయ నరాధిపాత్మజః. ౨౪

టీక॥తతః=అటుపిమ్మట; ఉదారదర్శనః = గొప్పబుద్ధిగల; నరాధిపాత్మజః=రాచకొమరుండగు; భరతః= భరతుండు; ప్రతీతరూపః=మిక్కిలియుసంతసించినవాఁడై; తథేతి=ఆలాగేయని; ఏవం=ఇట్లు; తదా=అప్పుడు; తదాశ్రమే=ఆభరద్వాజునియాశ్రమమునందు; నిశానివాసాయ= రాత్రియందుండుట

కొఱకు; బుద్ధించ = బుద్ధినిం గూడ; చకార = చేసెను.

అంత, సుదారంబగు బుద్ధిగల భరతుండు, పరమసంతుష్టుండై, యాలాగే యని, యారాత్రి, భరద్వాజమహర్షి యాశ్రమంబుననుండుటకు, అంగీకరించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, అయోధ్యాకాండే, నవతితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రి వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ నవతితమసర్గటీక, ముగిసినది.



శ్రీ

ఏకనవతితమసర్గప్రారంభః

కృతబుద్ధిం నివాసాయ తత్రైవ స మునిస్తదా
భరతం కైకయీపుత్ర మాతిథ్యేన న్యమంత్రయత్. ౧

టీక॥ సః = ఆ; మునిః = భరద్వాజమహాముని; తదా = అప్పుడు; తత్రైవ = అచ్చటనే; నివాసాయ = ఉండుటకు; కృతబుద్ధిం = చేయంబడినబుద్ధిగల; కైకయీపుత్రం = కైకేయికొడుకైన; భరతం = భరతుని; ఆతిథ్యేన = అతిథిసత్కారముచేత; న్యమంత్రయత్ = ప్రార్థించెను.

ఆభరద్వాజమహాముని, యట్లచ్చటనెయుండుట కొప్పుకొనినకైకేయీపుత్రుండగుభరతుని, భోజనపర్యంతాతిథిసత్కారంబు గైకొనవలయునని, ప్రార్థించెను. అని, తాత్పర్యము.

అబ్రవీ ద్భరత స్త్వేనం నన్విదం భవతా కృతమ్
పాద్య మర్ఘ్యం తథాతిథ్యం వనే య దుపపద్యతే. ౨




టీక॥భరతస్తు = భరతుండుమాత్రము; ఏనం=ఈభరద్వాజునిగూర్చి; "నను=అయ్యా! యత్=ఏది; వనే= అడవియందు; ఉపపద్యతే = దొరకునో; తత్ (అధ్యాహృతము)= అట్టి; పాద్యం=పాదోదకమును; అర్ఘ్యం= అర్ఘ్యమును; తథా=అట్లు;ఆతిథ్యం = అతిథిసత్కారము;భవతా = నీచేత; కృతం=చేయఁబడినది." ఇతి (అధ్యాహృతము)=అని; అబ్రవీత్=చెప్పెను.

భరతుండును, "మీరలు,పాద్యంబు నర్ఘ్యంబును ఫలాదులనుఒసంగి,యడవియందు దొరకుకొలంది నాతిథ్యంబు గావించితిరే !ఇంకనేమి?" అని, భరద్వాజునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

అథో వాచ భరద్వాజో భరతం ప్రహసన్నివ

టీక॥అథ=అటుపిమ్మట; భరద్వాజః=భరద్వాజుండు;ప్రహసన్= నవ్వుచు("ఇవ" అనునదివాక్యాలంకారార్థము);భరతం=భరతునిగూర్చి; ఉవాచ=చెప్పెను.

అంత,భరద్వాజుండు, చిఱునగవు మొగంబునందోఁప,భరతుంజూచి, యిట్లని,చెప్పెను.అని, తాత్పర్యము.

జానే త్వాం ప్రీతిసంయుక్తం తుష్యే స్త్వం యేన కేనచిత్. ३

టీక॥త్వాం = నిన్ను;ప్రీతిసంయుక్తం = ప్రేమతోఁగూడినవానిఁగా;జానే=ఎఱుంగుదును.త్వం=నీవు; యేనకేనచిత్=దేనిచేతనైనను; తుష్యేః=సంతోషింతువు.

నీకునాయందధికముగాఁ బ్రేమయున్నసంగతినాకుందెలియును,కావున, నీవు,ఎంతమాత్రముపచారముచేసినను, సంతోషంబునొందువాఁడవే.

అని, తాత్పర్యము.

సేనాయాస్తు తవైతస్యాః కర్తుమిచ్ఛామి భోజనమ్
మమ ప్రీతి ర్యథా రూపా త్వ మర్హో మనుజర్షభ. ४

టీక॥మనుజర్షభ= పురుషశ్రేష్ఠుఁడవగుభరతుఁడా!తవ=నీయొక్క; ఏతస్యాః=ఈ;సేనాయాస్తు=సేనకుమాత్రము;భోజనం=భోజనమును; కర్తుం=




చేయుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను. మమ=నాయొక్క; ప్రీతిః=కోర్కె; యథారూపా=ఎట్టిదో; తథా=అట్లు; అర్హః= అంగీకరింపఁదగినవాఁడవు.

పురుషశ్రేష్ఠుండవగుభరతుఁడా! నీ సేనకంతయు విందు సేయవలెనని కోరుచున్నాను; నాకోర్కెప్రకారము నీవంగీకరింపవలయును, అని, తాత్పర్యము.

కిమర్థంచాపి నిక్షిప్య దూరే బల మిహాగతః
కస్మాన్నేహోపయాతోఽసి స బలః పురుషర్షభ. ౫

టీక॥ పురుషర్షభ= పురుషశ్రేష్ఠుండవగుభరతుఁడా! త్వం (అధ్యాహృతము)= నీవు-కిమర్థంచాపి= ఎందుకొఱకును; బలం=సైన్యమును; దూరే=దూరమునందు; నిక్షిప్య=ఉంచి; ఇహ=ఇచ్చటికి ; ఆగతః = వచ్చినావు ? కస్మాత్= ఎందువలన; సబలః= సైన్యముతోఁ గూడినవాఁడవై; ఇహ=ఇచ్చటికి; ఉపయాతః=వచ్చినవాఁడవు; నాసి= కావు ?

పురుషశ్రేష్ఠుండవగు భరతుఁడా! నీవేల సైన్యమంతయుదూరంబుననుంచి నీవుమాత్రమిచ్చటికివచ్చినావు, సైన్యసహితంబుగా నేల రాకపోతివి? అని, భరద్వాజుండుభరతునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

భరతః ప్రత్యువాచేదం ప్రాంజలి స్తం తపోధనమ్

టీక॥ భరతః=భరతుఁడు; తం=ఆ; తపోధనం=తపస్సేధనముగాఁగల భరద్వాజమహామునినిగూర్చి; ప్రాంజలిః=మంచిచేమోడ్పుగలవాఁడై; ఇదం=ఈ మాటను; ప్రత్యువాచ = బదులుచెప్పెను.

భరతుండు, అందుకుఁ జేమోడ్పు గీలించి యాభరద్వాజమహామునింజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

న సైన్యేనోపయాతోఽస్మి భగవన్ భగవద్భయాత్. ౬

టీక॥ భగవన్= అధికమయినమాహాత్మ్యముగలభరద్వాజుఁడా! భగవద్భయాత్= భగవంతుండవగునీభయమువలన; స సైన్యః= సైన్యముతోఁగూ

డినవాఁడనై; ఉపయాతః = వచ్చిన వాఁడను; నాస్మి=కాను.

భగవంతుండవగు భరద్వాజుఁడా! నీకుఁగోపంబుగలుగుననుభయంబున, సైన్యంబుఁదీసికొనిరాలేదు.

అని, తాత్పర్యము.

రాజ్ఞాచ భగవ న్నిత్యం రాజపుత్రేణవా సదా
యత్నతః పరిహర్తవ్యా విషయేషు తపస్వినః. ౭

టీక॥భగవన్ = భగవంతుండవగు భరద్వాజుఁడా! రాజ్ఞాచ= రాజుచేతనుగాని; రాజపుత్రేణవా= రాచకొమరునిచేతఁగాని; నిత్యం = ఎల్లప్పుడును; విషయేషు=దేశములందు; తపస్వినః = తపస్సుచేయువారలు; యత్నతః=ప్రయత్నమువలన; పరిహర్తవ్యాః=విడువఁబడవలసినవారలు.

భగవంతుఁడా! రాజుగాని రాజపుత్రుండుగాని, ప్రయాణకాలంబునఁ, దమదేశంబులఁ దపోధనులుండు మార్గంబుదప్పించి, వారలకుసేనాదులచే బాధగలుగకుండునట్లు, వేఱుమార్గంబునంబోవలయును.

అని, తాత్పర్యము.

వాజిముఖ్యా మనుష్యాశ్చ మత్తాశ్చ వరవారణాః
ప్రచ్ఛాద్య భగవన్ భూమిం మహతీ మనుయాంతి మామ్. ౮

టీక॥భగవన్ = భగవంతుఁడవగు భరద్వాజుఁడా! వాజిముఖ్యాః = అశ్వోత్తమంబులును; మనుష్యాశ్చ= మనుష్యులును; మత్తాః=మదించిన; వరవారణాశ్చ=ఉత్తమంబులయినయేనుంగులును; మహతీం = అధికమయిన; భూమిం=భూమిని; ప్రచ్ఛాద్య=ఆచ్ఛాదించి; మాం=నన్ను; అనుయాంతి = వెంబడించుచున్నవి.

భగవంతుఁడా! అశ్వోత్తమంబులునుమనుష్యులును మదపుటేనుంగులును, ఇట్లుఅనంతసైన్యంబు, అతివిశాలంబుగాభూమినావరించి, నన్నువెంబడించి వచ్చుచున్నది.

అని, తాత్పర్యము.

తే వృక్షా నుదకం భూమిం మాశ్రమేషూటజాం స్తథా

నహింస్యా రితి తేనాహ మేకఏవ సమాగతః. ౯

టీక॥ తే=అవి; ఆశ్రమేషు= ఆశ్రమములయందు; వృక్షాన్=వృక్షములను; ఉదకం=జలమును; భూమిం= నేలను తథా=అట్లు; ఉటజాన్=పర్ణశాలలను; మానహింస్యాః= చెఱుపకుండవు; ఇతి=అని; తేన=దానిచేత; అహం=నేను; ఏకఏవ = ఒకరుఁడనే; సమాగతం=వచ్చినాను.

అవన్నియు, నిచ్చటికివచ్చినపక్షంబున, నాశ్రమంబునందలి, వృక్షంబులను, సరస్సులను, భూమిని, పర్ణశాలలను, నశింపఁ జేయకపోవని, యీ కారణంబున నేనొక్కరుండనే వచ్చినాను. అనిభరతుండు, భరద్వాజునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఆనీయ తా మిత స్సేనేత్యా జ్ఞప్తః పరమర్షిణా
తతస్తు చక్రే భరత స్సేనాయా స్సముపాగమమ్. ౧౦

టీక॥ తతస్తు=అటుపిమ్మటను; భరతః=భరతుఁడు; పరమర్షిణా= మహర్షియగుభరద్వాజునిచేత; "ఇతః=ఇచ్చటికి; సేనా=సైన్యము; ఆనీయతాం= తేఁబడుఁగాక." ఇతి=అని; ఆజ్ఞప్తః=ఆజ్ఞాపింపఁబడినవాఁడై; సేనాయాః= సైన్యముయొక్క; సముపాగమం = రాకను; చక్రే=చేసెను.

అంత, "సేననిచ్చటికి రావింపుము" అని భరద్వాజమహర్షియాజ్ఞాపింప, భరతుండు, సేననయ్యాశ్రమంబునకు రావించెను. అని, తాత్పర్యము.

అగ్నిశాలాం ప్రవిశ్యాథ పీత్వాపః పరిమృజ్యచ
ఆతిథ్యస్య క్రియాహేతో ర్విశ్వకర్మాణ మాహ్వయత్. ౧౧

టీక॥ సః(అధ్యాహృతము)= ఆభరద్వాజుండు; అథ=అంత; అగ్నిశాలాం= అగ్నిహోత్రగృహమును; ప్రవిశ్య=ప్రవేశించి; అపః=జలమును; పీత్వా=త్రాఁగి; పరిమృజ్యచ=తుడుచుకొనియు; ఆతిథ్యస్య=అతిథిసత్కారముయొక్క; క్రియాహేతోః= చేయుటనిమిత్తమయి; విశ్వకర్మాణం=విశ్వకర్మను; ఆహ్వా

యత్=పిలిచెను.

అంత, భరద్వాజమహాముని, యగ్నిహోత్రగృహంబునకుఁబోయి, ముమ్మారాచమించి, రెండుమాఱులు పెదవులు తుడిచికొని, యాతిథ్యసన్నాహంబునకై విశ్వకర్మంబిలిచెను.

అని, తాత్పర్యము.

ఆహ్వయే విశ్వకర్మాణ మహం త్వష్టార మేవచ
ఆతిథ్యం కర్తు మిచ్ఛామి తత్ర మే సంవిధీయతామ్. ౧౨

టీక॥ అహం=నేను; త్వష్టారం=గృహాదులనునిర్మించునట్టి; విశ్వకర్మాణమేవచ=విశ్వకర్మనుగూడ; ఆహ్వయే=పిలిచెదను. ఆతిథ్యం = అతిథిసత్కారమును; కర్తుం= చేయుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను. మే=నాకొఱకు; తత్ర= అందు; సంవిధీయతాం=సంవిధానము సేయఁబడుగాక.

నేను, దక్షిణంబుననె మహాగృహాదులనిర్మించునట్టివిశ్వకర్మం బిలుచుచున్నాను; భరతునకును, నతనిసేనకును ఆతిథ్యంబు సేయఁగోరియున్నాను; దానికిఁగా, విశ్వకర్మ గృహాదుల నిర్మించుఁగాక. అని, తాత్పర్యము.

ఆహ్వయే లోకపాలాం స్త్రీన్ దేవాన్ శక్రముఖాం స్తథా
ఆతిథ్యం కర్తు మిచ్ఛామి తత్ర మే సంవిధీయతామ్. ౧౩

టీక॥ తథా=అట్లు; లోకపాలాన్=లోకపాలురను; త్రీన్= ముగ్గురను; శక్రముఖాన్=ఇంద్రుఁడుముఖ్యుఁగాఁగల; దేవాన్=దేవులను; ఆహ్వయే=పిలుచుచున్నాను; ఆతిథ్యం = అతిథిసత్కారమును; కర్తుం=చేయుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను. మే= నాకొఱకు; తత్ర=అందు; సంవిధీయతాం=సంవిధానము సేయఁబడుఁగాక.

అట్లు, యమవరుణకుబేరుల ముగ్గురదిక్పాలకులను, దేవేంద్రాది దేవతలనుంబిలిచెదను; భరతునకును అతని సేనకును ఆతిథ్యంబు గావింప వలెనని యున్నాను; దానికి వారలందఱుఁ దోడ్పడియుందురుగాక.

అని, తాత్పర్యము.

ప్రాక్స్రోతస శ్చ యా నద్యః ప్రత్యక్స్రోతస ఏవచ

పృథివ్యా మంతరిక్షేచ సహాయాం త్వద్య సర్వశః- ౧౪

టీక॥పృథివ్యాం=భూమియందును; అంతరిక్షేచ=ఆకాశమునందును; ప్రాక్స్రోతసః = తూర్పు=తట్టుప్రవాహముగల;నద్యః=ఏఱులు;యాః (సంతి)= ఏవిగలవో;తాః(అధ్యాహృతము) చ= అవియు;ప్రత్యక్స్రోతసః= పడమటితట్టుప్రవాహముగలయేఱులు; యాఃసంతి(అధ్యాహృతము)=ఏవిగలవో ; తాః (అధ్యాహృతము)ఏవచ=అవియు; సర్వశః=అన్నియు;అద్య= ఇప్పుడు; సహ=ఏకకాలంబుననె; ఆయాంతు=వచ్చుఁగాక.

భూమియందును అంతరిక్షంబునందును, తూర్పుతట్టుగాఁబాఱునవిగాని పడమరతట్టుగాఁ బ్రవహించునవిగాని, నదులెన్నిగలవో, అవన్నియు, నొక్కమాఱుగానే, యిచ్చటికిప్పుడువచ్చుఁగాక.అని, తాత్పర్యము.

అన్యాః స్రవంతు మైరేయం సురా మన్యాః స్సునిష్ఠితామ్
అపరా శ్చోదకం శీత మిక్షుకాండరసోపమమ్. ౧౫

టీక॥ అన్యాః=ఇతరములయిననదులు;మైరేయం= మిరాదేశమునందుఁబుట్టినఒకవిధమయిన మద్యమును; స్రవంతు=ప్రవహించునుగాక.అన్యాః=ఇతరనదులు;సునిష్ఠితాం= చక్కఁగాఁజేయఁబడిన;సురాం = సురను;స్రవంతు (అధ్యాహృతము)= ప్రవహించునుగాక.అపరాశ్చ = ఇతరనదులును;ఇక్షుకాండరసోపమం= చెఱకులసమూహముయొక్కరసముతోఁబోలికగల ; శీతం=చల్లని;ఉదకం= జలమును;స్రవంతు=ప్రవహించుఁగాక.

కొన్నినదులు జలంబునకు బదులుగా,ఖర్జూరాదులతోఁజేసినమైరేయంబనుమద్యంబునొసంగుఁగాక;కొన్నిమంచిసురనొసంగుఁగాక; మఱికొన్నినదులు,చెఱకురసంబువంటి చల్లనిజలంబులనొసంగుఁగాక.అని, తాత్పర్యము.

ఆహ్వయే దేవగంధర్వాన్ విశ్వావసుహాహాహూహూన్
తథైవాఽప్సరసో దేవీ గంధర్వీశ్చాపి సర్వశః- ౧౬

టీక॥దేవగంధర్వాన్ = దేవగంధర్వులయిన ; విశ్వావసు హాహాహూ

హూహూః ( విశ్వావసు హాహా హూహూహూః)= విశ్వావసువును హాహా యనువానిని హూహూహూ అనువానిని; తథైవ= అట్లే; దేవీః= దేవజాతులును; గంధర్వీశ్చ= గంధర్వజాతులునగు; అప్సరసః= అప్సరసలను; సర్వశః = అందఱును; ఆహ్వయే= పిలిచెదను.

మఱియు, గానంబు సేయుటకై, దేవగంధర్వజాతులగు విశ్వావసువును హాహా యనువానిని హూహూహూ యనువానిని, గంధర్వజాతులగు నప్సరసలను దేవజాతులగు నప్సరసలను, అందఱనుం బిలిచెదను. అని, తాత్పర్యము.

ఘృతాచీ మథ విశ్వాచీం మిశ్రకేశీ మలంబుసామ్
నాగదంతాంచ హేమాంచ హిమా మద్రి కృతస్థలామ్. ౧౭

టీక॥ అథ= ఇంక; ఘృతాచీం = ఘృతాచియను నప్సరసను; విశ్వాచీం= విశ్వాచియను నప్సరసను; మిశ్రకేశీం= మిశ్రకేశిని; అలంబుసాం= అలంబుసను; నాగదంతాంచ= నాగదంతను; హేమాంచ= హేమయనుదానిని ; అద్రికృతస్థలాం= పర్వతంబునం జేయఁబడినని వాసస్థలముగల; హిమాం= హిమయనుదానిని ; ఆహ్వయే (అధ్యాహృతము)= పిలిచెదను.

మఱియు, ఘృతాచి, విశ్వాచి, మిశ్రకేశి, యలంబుస, నాగదంత, హేమ, పర్వతంబుననుండు హిమ, వీరలు మున్నగు నప్సరసలం బిలుచుచున్నాను. అని, తాత్పర్యము.

శక్రం యాశ్చో పతిష్ఠంతి బ్రహ్మాణం యాశ్చ యోషితః
సర్వా స్తుం బురుణా సార్ధ మాహ్వయే సపరిచ్ఛదాః. ౧౮

టీక॥ యాః= ఏ; యోషితః= స్త్రీలు; శక్రం= ఇంద్రుని; ఉపతిష్ఠంతి= కొలుచుచున్నారో; తాః (అధ్యాహృతము) చ= వారలను; యాః= ఏ స్త్రీలు; బ్రహ్మాణం= బ్రహ్మదేవుని ; ఉపతిష్ఠంతి (అధ్యాహృతము)= సేవింపుచుందురో ; తాః (అధ్యాహృతము) చ= వారలను ; సర్వాః= అందఱను; సపరిచ్ఛదాః= ఉపకరణములతోఁ గూడిన వారలనుగా; తుంబురుణా సార్ధం= తుంబురువుతోఁ గూడ; ఆహ్వయే= పిలిచెదను.

ఏయప్సరసలు, దేవేంద్రుం గొలిచి

యుందురో, ఎవ్వారుబ్రహ్మదేవునింగొలిచియుందురో, వారలనందఱను, వారిన్నృత్తగీతాద్యుపకరణంబులతోను, వారి గానశిక్షకుండగు తుంబురువుతోనుంగూడ, రావించెదను.

అని, తాత్పర్యము-

వసనం కురుషు యద్దివ్యం వాసోభూషణ పత్రవత్
దివ్యనారీఫలం శశ్వత్తత్ కౌబేర మిహైతుచ. ౧౯

టీక॥ కురుషు=ఉత్తరకురుదేశములందు; శశ్వత్=ఎల్లప్పుడు; వాసోభూషణపత్రవత్=వస్త్రములును ఆభరణములు నేపత్రములు గాఁగలదియు; దివ్యనారీఫలం=ఉత్తమస్త్రీలేఫలములు గాఁగలదియు; దివ్యం=దేవతార్హంబునగు; వనం=చైత్రరథవనము ; యత్ (అస్తి)= ఏదిగలదో; తత్=ఆ; కౌబేరంచ=కుబేరునివనంబును; ఇహ=ఇచ్చటికి; ఏతు=వచ్చుఁగాక.

మంచివస్త్రాభరణంబులె పత్రంబులుగాను త్తమవనితలే ఫలంబులుగాఁగల్గి, యుత్తరకురుదేశంబునఁజెన్నొందుచున్న, దేవతార్హంబగు ; కుబేరునిచైత్రరథవనంబును , ఇచ్చటికేతెంచుఁగాక. అని, తాత్పర్యము.

ఇహ మే భగవాన్ సోమో విధత్తా మన్న ముత్తమమ్
భక్ష్యం భోజ్యంచ చోష్యంచ లేహ్యంచ వివిధం బహు- ౨౦

టీక॥ భగవాన్=అధికమయినమాహాత్మ్యముగల; సోమః= చంద్రుఁడు; ఇహ=ఇచ్చట; మే=నానిమిత్తమయి; భక్ష్యం=తినఁదగినపిండివంటలను ; భోజ్యంచ= భుజింపఁదగినశాల్యన్నాదులను ; చోష్యంచ=పీల్చదగినచారుమొదలగువాని; లేహ్యంచ = నాకఁదగినరసాయనాదులను; వివిధం=నానావిధంబును; బహు=అధికమును; ఉత్తమం=శ్రేష్ఠమునగు; అన్నం=అన్నమును; విధత్తాం=చేయుఁగాక.

భగవంతుండగుచంద్రుండు, ఇచ్చట, నానిమిత్తమయి, భక్ష్యభోజ్యచోష్యలేహ్యంబులను చతుర్విధాన్నంబులను, ఒకొక్కటివేర్వేఱనేకవిధంబులుగా, సుత్తమంబగునన్నంబు, యథేష్టంబుగాఁ గల్పించుఁగాక-అని, తాత్పర్యము.

విచిత్రాణిచ మాల్యాని పాదపప్రచ్యుతానిచ
సురాదీనిచ పేయాని మాంసాని వివిధానిచ. ౨౧

టీక॥సః(అధ్యాహృతము)= ఆచంద్రుఁడు;విచిత్రాణిచ= నానావిధముల గు;పాదపప్రచ్యుతాని= చెట్లనుండివీడి న(నవీనములయినయనుట); మాల్యాని చ=పుష్పమాలికలను; సురాదీని= సుర మొదలుగాఁగల;పేయానిచ= పానద్రవ్యంబులను; వివిధాని=నానావిధంబుల గు;మాంసానిచ=మాంసములను; విధత్తాం=చేయుఁగాక.

మఱియు, నోషధీశుండగు నాచంద్రుండు, చెట్లనుండియప్పుడుకోసిననానావిధపుష్పమాలికలను, నానావిధపానద్రవ్యంబులను,నానావిధమాంసంబులను,ఒసంగుఁగాక.అని,యాభరద్వాజుండుసంకల్పించెను.అని, తాత్పర్యము.

ఏవం సమాధి నాయుక్త స్తేజసాఽ ప్రతిమేనచ
శీక్షాస్వరసమాయుక్తం తపసాచా బ్రవీ న్మునిః. ౨౨

టీక॥ సమాధినా=యోగముతోను; అప్రతిమేన=సరిలేని; తేజసా=ప్రభావముతోను;తపసాచ=తపస్సుతోను;యుక్తః=కూడిన; మునిః=భరద్వాజమహాముని;ఏవం=ఇట్లు;శీక్షాస్వరసమాయుక్తం= శిక్షలయందుఁజెప్పఁబడినస్వరముతోఁగూడినట్లుగా;అబ్రవీత్ = చెప్పెను.

యోగబలంబును,అప్రతిమంబగుప్రభావంబును , మహాతపస్సునుంగలయమ్మునీంద్రుండు,శిక్షలయందుఁజెప్పంబడినస్వరంబులతో,నీమాటలంజెప్పెను.

అని, తాత్పర్యము.

మనసా ధ్యాయత స్తస్య ప్రాఙ్ముఖస్య కృతాంజలేః
ఆజగ్ము స్తాని సర్వాణి దైవతాని పృథక్పృథక్. ౨౩

టీక॥తస్య= ఆభరద్వాజమహామునిః;ప్రాఙ్ముఖస్య= తూర్పుమొగంబుగలవాఁడైః;కృతాంజలేః = చేయఁబడినచేమోడ్పుగలవాఁడైః;మనసా= మనస్సుచేతః;ధ్యాయతః= ధ్యానింపుచుండఁగాః;తాని=ఆః;దైవతాని= దేవతలు; సర్వా




ణీ=అందఱును;పృథక్పృథక్ = వేఱువేఱుగా;ఆజగ్ముః=వచ్చిరి.

ఆభరద్వాజమహాముని , యిట్లు, తూర్పుమొగంబై, చేమోడ్పుగీలించి, మనంబునధ్యానింపుచుండఁగానే, యాదేవతలందఱు, వేఱువేఱ,నయ్యాశ్రమంబునకువచ్చిచేరిరి.

అని, తాత్పర్యము.

మలయం దుర్దరం చైవ తత స్స్వేదనుదోఽనిలః
ఉపస్పృశ్య వవౌ యుక్త్యా సుప్రియాత్మా సుఖ శ్శివః. ౨౪

టీక॥ తతః=అటుపిమ్మట; అనిలః=వాయువు;మలయం=మలయపర్వతమును; దుర్దరంచైవ= దుర్దరపర్వతమును; ఉపస్పృశ్య=తాఁకి ; యుక్త్యా=సంబంధముచేత; స్వేదనుదః = చెమటనుబోఁగొట్టువాఁడై; సుప్రియాత్మా=మిక్కిలియుసంతోషకరంబగుస్వభావముగలవాఁడై; సుఖః=సుఖకరుండై; శివః=మంగళకరుఁడై ; వవౌ = వీచెను.

అంత,వాయువు, మలయదుర్దరపర్వతములమీఁదుగావచ్చి, చెమటనీళ్లనార్పుచుమంచి,సువాసనతో, నెల్లరకునుసుఖంబుగల్గునట్లుగా, మంగళకరంబుగా , వీచుచుండెను.

అని, తాత్పర్యము.

తతోఽభ్యవర్తంత ఘనా దివ్యాః కుసుమవృష్టయః
దివ్యదుందుభిఘోషశ్చ దిక్షు సర్వాసు శుశ్రువే. ౨౫

టీక॥ తతః=అటుపిమ్మట;దివ్యాః=స్వర్గంబునఁ బుట్టిన ; కుసుమవృష్టయః=పుష్పవర్షములు; ఘనాః= దట్టంబులయి;అభ్యవర్తంత=కలిగినవి. దివ్యదుందుభిఘోషశ్చ= స్వర్గమునందుఁబుట్టినభేరులధ్వనియును ; సర్వాసు=సమస్తములయిన; దిక్షు=దిక్కులయందు; శుశ్రువే=వినఁబడినది.

అంత, దేవతలుస్వర్గంబుననుండి, పుష్పవర్షంబులుసాంద్రంబుగాఁ గురిపించిరి. సమస్తదిక్కులందును , స్వర్గభేరీధ్వనులువినంబడుచుండెను.

అని, తాత్పర్యము.

ప్రవవు శ్చోత్తమా వాతా ననృతు శ్చాప్సరో గణాః




జగుశ్చ దేవగంధర్వా వీణాః ప్రముముచు స్స్వరాన్. ౨౬

టీక॥ఉత్తమాః=శ్రేష్ఠములగు; వాతాశ్చ=వాయువులును; ప్రవవృః= వీచినవి. అప్సరోగణాశ్చ = అప్సరసల సమూహములును; ననృతుః = ఆడిరి. దేవగంధర్వాశ్చ= దేవగంధర్వులును; జగుః=పాడిరి. వీణాః=వీణెలును;స్వరాన్=ధ్వనులను; ప్రముముచుః=విడిచినవి.

మిక్కిలియుసుఖకరంబుగా వాయువువీచినది, అప్సరసలుఆడిరి; దేవగంధర్వులుపాడిరి; మఱియు వీణెలు వాయించిరి. అని,తాత్పర్యము.

స శబ్దో ద్యాంచ భూమించ ప్రాణినాం శ్రవణానిచ
వివేశోచ్చారిత శ్లక్ష్ణ స్సమో లయసమన్వితః. ౨౭

టీక॥ఉచ్చారితః=వీణాదులచేఁ గలిగింపఁబడిన; శ్లక్ష్ణః = మధురమయినదియు; సమః=శ్రుతిసామ్యము గలదియు; లయగుణాన్వితః=లయమనుగుణముతోఁ గూడినదియునగు;సః= ఆ;శబ్దః=ధ్వని; ద్యాంచ=ఆకాశమును; భూమించ=భూమిని; ప్రాణినాం= ప్రాణులయొక్క; శ్రవణానిచ=చెవులను; వివేశ=ప్రవేశించినది.

నృత్తగీత వాద్యంబులచేఁ బుట్టినయాధ్వని, యతికోమలంబై శ్రుతిసామ్యంబుననులయగుణంబుననుఒప్పుచు, నాకాశంబు భూమియువ్యాపించి శ్రవణానందకరంబై చెలంగినది.

అని, తాత్పర్యము.

తస్మిన్ను పరతే శబ్దే దివ్యే శ్రోత్రసుఖే నృణామ్
దదర్శ భారతం సైన్యం విధానం విశ్వకర్మణః. ౨౮

టీక॥నృణాం=మనుష్యులయొక్క; శ్రోత్రసుఖే= చెవులకుసుఖముగల్గించునట్టి;దివ్యే=స్వర్గమునందుఁబుట్టిన; తస్మిన్=ఆ; శబ్దే=ధ్వని; ఉపరతే=నిలువఁగా; భరతం = భరతునిదైన ; సైన్యం=సేన ; విశ్వకర్మణః=విశ్వకర్మయొక్క; విధానం= నిర్మాణమును; దదర్శ=చూచెను.

శ్రవణానందకరంబగునాదివ్యధ్వని నిలిచినంతనె, భరతునిసైనికులు, విశ్వకర్మునిని నిర్మాణవైచిత్ర్యంబుఁజూడంగనిరి. అని, తాత్పర్యము.

బభూవహి సమా భూమి స్సమంతా త్పంచయోజనా
శాద్వలై ర్బహుభిశ్ఛన్నా నీలవైడూర్యసన్నిభైః. ౨౯

టీక॥ పంచయోజనా=అయిదామడలుగల; భూమిః=నేల; సమంతాత్=అంతటను; సమా=మిట్టపల్లములులేనిదిగాను; నీలవైడూర్యసన్నిభైః=నీలమణులతోను వైడూర్యమణులతోనుసమానములయిన; బహుభిః=పెక్కులయినను; శాద్వలైః = పచ్చికలచే; ఛన్నా= కప్పఁబడినదిగాను; బభూవహి=అయినదిగదా!

భూమియెటుచూచినను అయిదామడలవఱకు, ఎంతమాత్రమును మిట్టపల్లములేక, నీలవైడూర్యమణులవంటిపచ్చికచేఁగప్పఁబడినదిగానైనది.
అని, తాత్పర్యము.

తస్మిన్ బిల్వాః కపిత్థాశ్చ పనసా బీజపూరకాః
ఆమలక్యో బభూవుశ్చ చూతాశ్చ ఫలభూషణాః. ౩౦

టీక॥ తస్మిన్=ఆప్రదేశమునందు; ఫలభూషణాః=ఫలములేభూషణములుగాఁగల; బిల్వాః=మారేడుచెట్లును; కపిత్థాశ్చ=వెలగచెట్లును; పనసాః=పనసచెట్లును; బీజపూరకాః= మాదిఫలపుచెట్లును; ఆమలక్యశ్చ = ఉసిరిగచెట్లును; చూతాశ్చ=మామిడిచెట్లును; బభూవుః=ఉండినవి.

ఆప్రదేశంబున, మంచిఫలంబులుగలబిల్వవృక్షంబులును వెలగచెట్లును, బనసవృక్షంబులును మాతులుంగవృక్షంబులును, ఉసిరిగచెట్లును మామిడిచెట్లును, ఉండినవి. అని, తాత్పర్యము.

ఉత్తరేభ్యః కురుభ్యశ్చ వనం దివ్యోపభోగవత్
ఆజగామ నదీ దివ్యా తీరజై ర్బహుభి ర్వృతా. ౩౧

టీక॥ఉత్తరేభ్యః= ఉత్తరదిక్కుననుండునట్టి;కురుభ్యః = కురుదేశంబుననుండి ; దివ్యోపభోగవత్ = శ్రేష్ఠములయిన భోగ్యద్రవ్యంబులు గల ; వనంచ = చైత్రరథవనంబును ; ఆజగామ = వచ్చినది. దివ్యాః = శ్రేష్ఠములగు;నదీ(నద్యః) = ఏఱులును;బహుభిః=పెక్కులయిన;తీరజైః=వృక్షములచేత;వృతా= చుట్టఁబడినవై ; ఆజగామ(అధ్యాహృతము)=వచ్చినవి.

ఉత్తరకురుదేశంబుననుండి , దివ్యభోగద్రవ్యంబులుగల చైత్రరథవనంబునువచ్చినది; దివ్యనదులును:దీరంబులఁబెక్కు వృక్షంబులతో నొప్పుచు,నచ్చట,నావిర్భవించినవి.

అని, తాత్పర్యము.

చతుశ్శాలాని శుభ్రాణి శాలాశ్చ గజవాజినామ్
హర్మ్య ప్రాసాద సంబాధా స్తోరణాని శుభానిచ. ౩౨

టీక॥శుభ్రాణి=పరిశుద్ధములయిన; చతుశ్శాలాని = నాలుగిండ్లబవంతులును;హర్మ్యప్రాసాదసంబాధాః= మేడలచేతను రాజగృహంబులచేతనునిండిన;గజవాజినాం = ఏనుంగులయొక్కయుగుఱ్ఱములయొక్కయు; శాలాశ్చ= గృహంబులును;శుభాని= మంగళకరంబులగు;తోరణానిచ= ద్వారంబులును; అభూవన్(అధ్యాహృతము) = అయినవి.

స్వచ్ఛంబులగునాలుగిండ్లబవంతులును మేడలును రాజగృహంబులునుఏనుంగులుగట్టు గృహంబులునుగుఱ్ఱంబులుగట్టు గృహంబులును మంగళతోరణంబులును,ఆవిర్భవించినవి.

అని, తాత్పర్యము.

సితమేఘనిభంచాపి రాజవేశ్మ సుతోరణమ్
శుక్ల మాల్య కృతాకారం దివ్యగంధసముక్షితమ్. ౩౩
చతురశ్ర మసంబాధం శయనాసనయానవత్
దివ్యై స్సర్వరసై ర్యుక్తం దివ్యభోజనవస్త్రవత్. ౩౪
ఉపకల్పితసర్వాన్నం ధౌతనిర్మలభాజనమ్
క్లృప్తసర్వాసనం శ్రీమత్ స్వాస్తీర్ణశయనోత్తమమ్. ౩౫

టీక॥ సితమేఘనిభం=తెల్లనిమేఘముతో సమానమయినదియు ; సుతోరణం=మంచిద్వారంబులుగలదియు ; శుక్లమాల్యకృతాకారం = తెల్లనిపుష్పమాలికలచేఁ జేయఁబడిన యలంకారముగలదియు ; దివ్యగంధసముత్క్షిప్తం=శ్రేష్ఠమయినగంధముచే వ్యాపింపఁ బడినదియు ; చతురశ్రం= చదరమయినదియు ; అసంబాధం=ఇఱుకు లేనిదియు ; శయనాసనయానవత్=పాన్పులును ఆసనంబులునువాహనంబులునుగలదియు ; దివ్యైః=శ్రేష్ఠములయిన ; సర్వరసైః=సమస్తములయిన రసములతో ; యుక్తం=కూడినదియు ; దివ్యభోజనవస్త్రవత్=శ్రేష్ఠములగునన్నములును వస్త్రములుగలదియు ; ఉపకల్పితసర్వాన్నం=ఏర్పఱుపఁబడిన సమస్తాన్నంబులును గలదియు ; ధౌతనిర్మలభాజనం=కడుగఁబడినస్వచ్ఛములయిన పాత్రలు గలదియు ; క్లృప్తసర్వాసనం = ఏర్పఱుపఁబడినసమస్తాసనంబులునుగలదియు ; స్వాస్తీర్ణశయనోత్తమం = చక్కఁగాబఱుపఁబడిన శయనశ్రేష్ఠముగలదియు ; శ్రీమత్=అధికమయినకాంతిగలదియు నగు ; రాజవేశ్మ చాపి=రాజగృహంబును ; అభూత్ (అధ్యాహృతము) = అయినది.

మఱియు, శరత్కాలమేఘంబుంబోలె ధవళంబునుమంచిద్వారంబులు గలదియుఁ, దెల్లనిపుష్పమాలికలచే నలంకరింపఁబడినదియు దివ్యగంధంబు చల్లఁబడినదియుఁ జతురశ్రాకారంబును నతివిశాలంబును నానావిధంబులగుపాన్పులును ఆసనంబులును వాహనంబులును గలదియు సమస్తదివ్యరసంబులతో నిండినదియు, నానావిధములయినయన్నంబులతోఁగూడినదియుఁ, జక్కఁగాఁ గడుగఁబడి నిర్మలంబులయియుండుభోజనపాత్రంబులతో నొప్పుచున్నదియు, వేఱువేఱుజక్కఁగా నేర్పఱుపఁ బడిన భోజన స్నానాద్యాసనంబులు గలదియు, నుత్తమాస్తరణాస్తీర్ణంబగునుత్తమశయనంబుతోఁ గూడినదియునగు గొప్పరాజగృహంబు నొకటియావిర్భవించినది. అని, తాత్పర్యము.

ప్రవివేశ మహాబాహు రనుజ్ఞాతో మహర్షిణా
వేశ్మ తద్రత్న సంపూర్ణం భరతః కైకయీసుతః. ౩౬

టీక॥ మహాబాహుః=పెద్దచేతులుగలవాఁడగు ; కైకయీసుతః = కైకే

యుఁకోడుకైన; భరతః=భరతుఁడు; మహర్షిణా=భరద్వాజమహర్షిచేత; అనుజ్ఞాతః = అనుమతింపఁబడినవాఁడై; రత్నసంపూర్ణం= ఉత్తమద్రవ్యములచేనిండిన; తత్=ఆ; వేశ్మ= గృహమును; ప్రవివేశ=చొచ్చెను.

మహాబాహుండగు కైకేయి కొడుకుభరతుండు, భరద్వాజమహర్షిచే నాజ్ఞాపితుండై, నానావిధోత్తమద్రవ్యసంయుతంబగు నాగృహంబుఁబ్రవేశించెను. అని, తాత్పర్యము.

అనుజగ్ముశ్చ తం సర్వే మంత్రిణ స్సపురోహితాః
బభూవుశ్చ ముదా యుక్తా దృష్ట్వా తం వేశ్మసంవిధిమ్. ౩౭

టీక॥ సపురోహితాః= పురోహితునితోఁగూడిన ; మంత్రిణః = మంత్రులు ; సర్వేచ = అందఱును ; తం = ఆభరతుని ; అనుజగ్ముః= వెంబడించిరి- తం=ఆ; వేశ్మసంవిధిం= గృహము యొక్క సంవిధానమును ; దృష్ట్వా=చూచి; ముదా= సంతోషముతో; యుక్తాశ్చ= కూడినవారలును ; బభూవుః=అయిరి-

అంతఁ, బురోహితులును, మంత్రులందఱును, భరతుని వెంబడించిప్రవేశించిరి; వారలాశ్చర్యకరంబగు నాగృహసంవిధానంబుఁజూచి మహాసంతోషంబునొందిరి. అని, తాత్పర్యము.

తత్ర రాజాసనం దివ్యం వ్యజనం ఛత్రమేవచ
భరతో మంత్రిభిస్సార్ధ మభ్యవర్తత రాజవత్. ౩౮

టీక ॥ తత్ర = అచ్చట ; భరతః=భరతుఁడు; దివ్యం=స్వర్గంబునఁ బుట్టిన; రాజాసనం=సింహాసనమును; వ్యజనం= వింజామరమును; ఛత్రమేవచ=గొడుగును; రాజవత్= రాజునువలె; మంత్రిభిస్సార్ధం= మంత్రులతోఁగూడ; అభ్యవర్తత=ప్రదక్షిణించెను-

భరతుండు, అచ్చటనుండు దివ్యసింహాసనంబునకును, వింజామరమునకును, శ్వేతఛత్రంబునకును, రాజునకుంబోలె, మంత్రులతోఁగూడఁ, బ్రదక్షిణంబు చేసెను- అని, తాత్పర్యము-

ఆసనం పూజయామాస రామాయా భిప్రణమ్యచ

వాలవ్యజన మాదాయ న్యషీద త్సచివాసనే. ౩౯

టీక॥సః(అధ్యాహృతము)=ఆభరతుఁడు; రామాయ=రామునికొఱకు; అభిప్రణమ్యచ=నమస్కరించియు; ఆసనం = సింహాసనమును; పూజయామాస=పూజించెను. వాలవ్యజనం=వింజామరను; ఆదాయ=గ్రహించి; సచివాసనే=మంత్రులయాసనంబునందు; న్యషీదత్=కూర్చుండెను.

అప్పుడు, భరతుండు, రాముందలంచుకొనినమస్కరించి, యాయనకూర్చుండఁదగినయాసింహాసనంబుఁబూజించి, తాను, జామరంబుఁబట్టుకొని, మంత్రులుకూర్చుండఁదగినయొకయాసనంబునం గూర్చుండెను. అని, తాత్పర్యము.

ఆనుపూర్వ్యా న్నిషేదుశ్చ సర్వే మంత్రిపురోహితాః
తత స్సేనాపతిః పశ్చా త్ప్రశాస్తాచ నిషేదతుః. ౪౦

టీక॥మంత్రిపురోహితాశ్చ = మంత్రులునుబురోహితులును; సర్వే=అందఱును; ఆనుపూర్వ్యాత్= క్రమమువలన; నిషేదుః=కూర్చుండిరి. తతః=అటుపిమ్మట; సేనాపతిః= సేనానాయకుండును; పశ్చాత్=పిమ్మట; ప్రశాస్తాచ=శిబిరనాయకుండును; నిషేదతుః=కూర్చుండిరి.

అంత, మంత్రులునుబురోహితులునుయథాక్రమంబుగాఁగూర్చుండిరి; అటుపిమ్మటసేనానాయకుండును, అతనికిఁబిమ్మటశిబిర నాయకుండునుగూర్చుండిరి. అని, తాత్పర్యము.

తత స్తత్ర ముహూర్తేన నద్యః పాయస కర్దమాః
ఉపాతిష్ఠంత భరతం భరద్వాజస్య శాసనాత్. ౪౧

టీక॥తత్ర=అచ్చట; తతః=అటుపిమ్మట; భరద్వాజస్య=భరద్వాజునియొక్క; శాసనాత్=ఆజ్ఞవలన; ముహూర్తేన= అల్పకాలముచేత; పాయసకర్దమాః= క్షీరాన్నమే బురదగాఁగల; నద్యః=నదులు; భరతం= భరతుని; ఉపాతిష్ఠంత=సేవించినవి.

అంత, నప్పుడు, స్వల్పకాలంబుననే, భరద్వాజమహర్షియాజ్ఞవలన, క్షీరాన్నమేబురదగాఁగలయేఱులు, భరతుని

ముందటం బ్రవహింపనారంభించినవి-అని, తాత్పర్యము.

తాసా ముభయతః కూలం పాండుమృత్తికలేపనాః
రమ్యాశ్చ వసధా దివ్యా బ్రహ్మణస్తు ప్రసాదజాః. ౪౨

టీక॥ తాసాం=ఆనదులయొక్క ; ఉభయతఃకూలం= రెండుగట్టులయం దును; బ్రహ్మణస్తు= భరద్వాజమహా మునియొక్కయె ; ప్రసాదజః= అను గ్రహమువలనంగలిగిన ; పాండుమృత్తికలేపనాః =తెల్లనిమృత్తికతోంబూయుటగలవియు; రమ్యాః=సుందరములును;దివ్యాః=ఉత్తమంబులునగు; అవసధాశ్చ = గృహములును ; అభూవన్=అయినవి.

ఆనదులరెండుగట్టులందును, భరద్వాజమహర్షియనుగ్రహంబువలన, తెల్లనిపాలగారతోంగూడినరమణీయంబులునుదివ్యంబులునగు గృహంబులు, నావిర్భవించినవి. అని,తాత్పర్యము.

తేనైవచ ముహూర్తేన దివ్యాభరణభూషితాః
ఆగుర్వింశతిసాహస్రా బ్రహ్మణా ప్రహితా స్త్రియః. ౪౩

టీక॥ తేన=ఆ ; ముహూర్తేనైవచ=కాలముచేతనె ; దివ్యాభరణభూషితాః=శ్రేష్ఠములయినయాభరణములచేనలంకరింపంబడినవారలగు;స్త్రియః=స్త్రీలు; వింశతిసాహస్రాః=ఇరువదివేలమంది ; బ్రహ్మణా=బ్రహ్మదేవునిచేత; ప్రహితాః=పంపంబడినవారయి; ఆగుః=వచ్చిరి.

ఆక్షణంబుననే, బ్రహ్మదేవునిపనుపున , దివ్యాభరణాలంకృతలగు నిరువదివేలమందియప్సరసలువచ్చిరి. అని,తాత్పర్యము.

సువర్ణమణిముక్తేన ప్రవాళేనచ శోభితాః
ఆగు ర్వింశతి సాహస్రాః కుబేర ప్రహితా స్త్రియః. ౪౪

టీక॥సువర్ణమణిముక్తేన= బంగారముచేతనురత్నములచేతనుముత్తెములచేతను;ప్రవాళేచన=పవడముచేతను; శోభితాః = అలంకరింపంబడిన; స్త్రీ




యః=స్త్రీలు; వింశతిసాహస్రాః= ఇరువదివేలమంది; కుబేరప్రహితాః=కుబేరునిచేఁబంపఁబడినవారలై; ఆగుః=వచ్చిరి.

అంతఁ, గుబేరునిపనుపున, సువర్ణాభరణంబులచేతనురత్నమయభూషణంబులచేతను ముక్తాఫలమయాభరణంబులచేతనుబ్రవాళభూషణంబులచేతను అలంకృతలగు నిరువదివేల మంది యప్సరసలు, వచ్చిరి. అని, తాత్పర్యము.

యాభి ర్గృహీతః పురుష స్సోన్మాదఇవ లక్ష్యతే
ఆగు ర్వింశతి సాహస్రా నందనా దప్సరోగణాః. ౪౫

టీక॥యాభిః(స్త్రీభిః)=వేనిచేత; గృహీతః=గ్రహింపఁబడిన; పురుషః=పురుషుఁడు ; సోన్మాదఇవ= పిచ్చితోఁగూడినవాఁడువలె; లక్ష్యతే=చూడఁబడుచున్నాఁడో; తే(అధ్యాహృతము)=అట్టి; అప్సరోగణాః = అప్సరసలసమూహములు;వింశతిసాహస్రాః=ఇరువదివేలు; నందనాత్= నందనవనమునుండి;ఆగుః=వచ్చినవి.

పురుషుండెవ్వరిచేఁగవుఁగిలింపఁ బడినచో నున్మాదంబునొందినట్లు పరవశుండగునో, అట్టియుత్తమలగు నప్సరసలుఇరువదివేలమంది, నందనవనంబుననుండి, దేవేంద్రునిపనుపున; నేతెంచిరి అని, తాత్పర్యము.

నారద స్తుంబురు ర్గోపః ప్రవరా స్సూర్యవర్చసః
ఏతే గంధర్వ రాజానో భరతస్యాగ్రతో జగుః. ౪౬

టీక॥నారదః=నారదుండును; తుంబురుః=తుంబురుఁడును;గోపః=గోపుండును;ప్రవరాః=ఉత్తములును; సూర్యవర్చసః= సూర్యునియొక్క-కాంతివంటికాంతిగలవారలునగు;ఏతే=ఈ; గంధర్వరాజానః(గంధర్వరాజాః)= గంధర్వరాజులు;భరతస్య = భరతునియొక్క-;అగ్రతః=ముందట;జగుః=పాడిరి.

నారదుండును దుంబురుండును గోపుండుననునీగంధర్వరాజులు , సూర్యసమానతేజంబున వెలుంగుచు, భరతుని ముందటంబాడిరి.అని, తాత్పర్యము-

అలంబుసా మిశ్రకేశీ పుండరీకాథ వామనా




ఉపానృత్యంస్తు భరతం భరద్వాజస్య శాసనాత్. ౪౭

టీక॥అథ=అంత; భరద్వాజస్య=భరద్వాజునియొక్క; శాసనాత్=ఆజ్ఞవలన;అలంబుసా=అలంబుసయు; మిశ్రకేశీ=మిశ్రకేశియు; పుండరీకా= పుండరీకయు;వామనా=వామనయు;భరతం=భరతుని;ఉపానృత్యన్=అనుసరించియాడిరి."తు"అనునది పాదపూరణార్థము

అంత, భరద్వాజమహర్షియాజ్ఞవలన,నలంబుసయుమిశ్రకేశియుఁబుండరీకయువామనయునను నీయప్సరసలు, భరతునిముందట,నృత్తంబు గావించిరి.

అని, తాత్పర్యము.

యాని మాల్యాని దేవేషు యాని చైత్రరథే వనే
ప్రయాగే తాన్యదృశ్యంత భరద్వాజస్య శాసనాత్. ౪౮

టీక॥యాని=ఏ; మాల్యాని=పుష్పమాలికలు; దేవేషు = దేవతలయందు; సంతి(అధ్యాహృతము)=కలవో; యాని=ఏపుష్పమాలికలు;చైత్రరథే=చైత్రరథమను; వనే =వనమునందు;సంతి(అధ్యాహృతము)=కలవో;తాని= అవి; భరద్వాజస్య = భరద్వాజమహర్షియొక్క;తేజసా=ప్రభావముచేత; ప్రయాగే=ప్రయాగక్షేత్రమునందు;అదృశ్యంత=చూడఁబడినవి.

దేవేంద్రుని నందనవనంబుననుగుబేరునిచైత్రరథవనంబునను,ఏయేపుష్పంబులుగలవో,అవన్నియు,భరద్వాజప్రభావంబువలనఁ,బ్రయాగక్షేత్రంబున,నావిర్భవించియుండినవి.

అని,తాత్పర్యము.

బిల్వా మార్దంగికా ఆసన్ శమ్యాగ్రాహావిభీతకాః
అశ్వత్థా నర్తకా శ్చాసన్ భరద్వాజస్య శాసనాత్. ౪౯

టీక॥ భరద్వాజస్య=భరద్వాజమహర్షియొక్క;శాసనాత్=ఆజ్ఞవలన; బిల్వాశ్చ=బిల్వవృక్షములును;మార్దంగికాః=మృదంగమువాయించువారలు;ఆసన్=అయినవి. విభీతకాః=తాండ్రచెట్లు;శమ్యాగ్రాహాః=తాళముఁబట్టుకొనువారలు;ఆసన్(అధ్యాహృతము)=అయినవి.అశ్వత్థాశ్చ=అశ్వత్థవృక్షములును; నర్తకాః=నర్తనము సేయువారలు; ఆసన్=అయినవి.

భరద్వాజమహర్షియాజ్ఞవలన, బిల్వవృక్షములుమృదంగంబులువాయించినవి; తాండ్రచెట్లు తాళంబులువాయించినవి. అశ్వత్థవృక్షంబులు, నృత్తంబు గావించినవి. అని, తాత్పర్యము.

తత స్సరళ తాలాశ్చ తిలకానక్తమాలకాః
ప్రహృష్టా స్తత్ర సంపేతుః కుబ్జా భూత్వాథ వామనాః. ౫౦

టీక॥ తతః=అటుపిమ్మట; సరళతాలాశ్చ= సరళవృక్షములును దాటిచెట్లును; తిలకాః=బొట్టుగుచెట్లును; నక్తమాలకాః= కానుగుచెట్లును; ప్రహృష్టాః=సంతసించినవై; కుబ్జాః = గూనివారును; అథ=ఇంక; వామనాః= పొట్టివారును; భూత్వా = అయి; తత్ర=అచ్చట; సంపేతుః= వచ్చినవి.

అంత, భరద్వాజప్రభావమువలన, సరళవృక్షములును దాళవృక్షములును బొట్టుగుచెట్లును, గానుగుచెట్లును, కుబ్జవామనరూపంబులందాల్చి, తిరుగుచుండినవి. అని, తాత్పర్యము.

శింశుపా మలకీ జంబ్వో యాశ్చాన్యాః కాననేషు తాః
మాలతీ మల్లికా జాతి ర్యాశ్చాన్యాః కాననేలతాః. ౫౧
ప్రమదా విగ్రహం కృత్వా భరద్వాజాశ్రమేఽవదన్

టీక॥ శింశుపామలకీజంబ్వః=శింశుపావృక్షములునుఉసిరిగచెట్లునునేరేడుచెట్లును; కాననేషు= అడవులయందు; అన్యాః= ఇతరములయినవృక్షములు; యాః(సంతి)=ఏవిగలవో; తాశ్చ=అవియు; మాలతీ = సన్నజాజియు; మల్లికా=మల్లెయు; జాతిః = జాజియు; కాననే = అడవియందు; అన్యాః=ఇతరములయిన; లతాః = తీఁగెలు; యాః(సంతి)= ఏవిగలవో; తాః(అధ్యాహృతము)చ=అవియును; భరద్వాజాశ్రమే = భరద్వాజమహర్షియాశ్రమమునందు; ప్రమదావిగ్రహం=స్త్రీరూపమును; కృత్వా = చేసి; అవదన్=చెప్పినవి.

మఱియునబ్భరద్వాజాశ్రమంబున శింశుపావృక్షములును, ఉసిరిగచెట్లును, జంబూవృక్షంబులునుమఱియునడవియందుంగలయితరవృక్షములును, సన్నజాజి మల్లె జాజి మొదలగు నడవి

యందలిలతలును, స్త్రీరూపంబులుదాల్చి, భరతసైనికులకుస్నట్లని, చెప్పినవి. అని, తాత్పర్యము.

సురా స్సురాపాః పిబత పాయసంచ బుభుక్షితాః. ౫౨
మాంసానిచసుమేధ్యాని భక్ష్యం తాం యావదిచ్ఛథ

టీక॥ యావత్=ఎంత; ఇచ్ఛథ = కోరుచున్నారో; తావత్(అధ్యాహృతము)=అంత; సురాపాః = సారాయిౘ్రాగువారలారా! సురాః=సురలను; పిబత = త్రాగుఁడు. బుభుక్షితాః=భుజింపఁగోరినవారలారా! పాయసంచ=పరమాన్నమును ; పిబత(అధ్యాహృతము) = త్రాఁగుఁడు. సుమేధ్యాని=మిక్కిలియుఁబరిశుద్ధములయిన; మాంసానిచ= మాంసములును;భక్ష్యంతాం=భక్షింపఁబడుఁగాక.

జనులారా! వారివారికెంతకావలయునో, అంత,సారాయిౘ్రాగువారలుసారాయిౘ్రాఁగుఁడు ;భుజింపఁగోరువారలు, యథేచ్ఛంబుగాఁ, బాయసంబుఁగ్రోలుఁడు ; పరిశుద్ధంబులగునీమాంసంబులనుభక్షింపుఁడు.అని, యాస్త్రీరూపంబుదాల్చినవృక్షంబులుచెప్పినవి.అని, తాత్పర్యము.

ఉచ్ఛాద్య స్నాపయంతిస్మ నదీతీరేషువల్గుషు. ౫౩
అప్యేక మేకం పురుషం ప్రమదాస్సప్త చాష్టచ

టీక॥ ప్రమదాః=స్త్రీలు సప్తచ= ఏడుగురును; అష్టచ = ఎనిమిదిమందియును; ఏకమేకం=ఒక్కొక్క; పురుషమపి=పురుషునిని; ఉచ్ఛాద్య = నలుగిడి; వల్గుషు=రమణీయములగు ; నదీతీరేషు=ఏటిగట్టులయందు; స్నాపయంతిస్మ=స్నానముసేయించిరి.

ఒక్కొక్కపురుషునికి , ఏడెనిమిదిమందిస్త్రీలుచేరి, నలుగుపెట్టి, రమణీయంబులగు నదీతీరంబుల; స్నానముసేయించిరి, అని, తాత్పర్యము.

సంవాహంత్య స్సమాపేతు ర్నార్యో రుచిర లోచనాః. ౫౪

పరిమృజ్య తథాన్యోన్యం పాయయంతి వరాంగనాః

టీక॥ రుచిరలోచనాః = సుందరములగు కండ్లుగల; నార్యః = స్త్రీలు; సంవాహంత్యః (సంవాహయంత్యః) = కాళ్లుపట్టువారలై; సమాపేతుః = వచ్చిరి. తథా = అట్లు; వరాంగనాః = ఉత్తమస్త్రీలు; పరిమృజ్య = తుడిచి; అన్యోన్యం = పరస్పరమును; పాయయంతి = త్రాగించిరి.

సుందరంబులగు కండ్లుగల స్త్రీలు, అంతట, పాదసంవాహనంబు సేయుటకై వచ్చి, యాపురుషుల దేహమందలి తడి యొత్తి, వారల చేఁ బరస్పరమును రాపానంబు సేయించిరి. అని, తాత్పర్యము.

హయాన్ గజాన్ ఖరానుష్ట్రాన్ తథైవ సురభేస్సుతాన్. ౫౫
అభోజయన్ వాహనపాస్తేషాం భోజ్యం యథావిధి

టీక॥ వాహనపాః = వాహనంబులం బాలించువారలు; హయాన్ = గుఱ్ఱములను; గజాన్ = ఏనుంగులను; ఖరాన్ = గాడిదలను; ఉష్ట్రాన్ = ఒంటెలను; తథైవ = అట్లే; సురభేః = కామధేనువుయొక్క; సుతాన్ = కొడుకులను, ఎద్దులననుట; తేషాం = వానియొక్క; భోజ్యం = ఆహారమును; యథావిధి = యథాశాస్త్రముగా; అభోజయన్ = తినిపించిరి.

అంత, భరద్వాజప్రభావంబున నేర్పడిన వాహనపాలకులు, గుఱ్ఱంబులకును ఏనుంగులకును గాడిదలకును ఒంటెలకును ఎద్దులకును, యథాశాస్త్రముగా వానివానికిఁ దగిన యాహారంబులనొసంగిరి. అని, తాత్పర్యము.

ఇక్షూంశ్చ మధులాజాంశ్చ భోజయంతిస్మ వాహనాన్. ౫౬
ఇక్ష్వాకువరయోధానాం చోదయంతో మహాబలాః

టీక॥ మహాబలాః = అధికమయిన బలముగల వాహనపాలకులు, ఇక్ష్వాకువరయోధానాం = ఇక్ష్వాకువంశపురాజుల యొక్క; యుత్తమభటుల యొక్క;



వాహనాన్ = ఏనుంగు మొదలగువానిని; చోదయంతః= ప్రేరించుచు; ఇక్షూంశ్చ= చెఱుకులను; మధులాజాంశ్చ = తేనె గలిసిన పేలాలను; భోజయంతిస్మ=భుజింపఁజేసిరి.

బలవంతులగువాహనపాలకులు, భరతభటులయేనుంగులు మొదలగువాహనంబులం బ్రేరేపించుచు, వానికి, చెఱుకుగడలను తేనియ గలసిన పేలాలనుదినఁబెట్టిరి. అని, తాత్పర్యము.

నాశ్వబంధోశ్వ మాజానా న్నగజం కుంజరగ్రహః, ౫౭
మత్తప్రమత్తముదితా చమూ స్సా తత్ర సంబభౌ

టీప॥ అశ్వబంధః= గుఱ్ఱములగట్టువాడు; అశ్వం=గుఱ్ఱమును; నాజానాత్= ఎఱుంగఁడయ్యె. కుంజరగ్రహః=ఏనుగుగ్రహించువాఁడు; గజం=ఏనుంగును; న(అజానాత్)=ఎఱుంగఁడయ్యె. తత్ర= అచ్చట; సా=ఆ; చమూః= సేన; మత్తప్రమత్తముదితా=మదించినదియు దేహముమఱచినదియు సంతసించినదియునై; సంబభౌ=ప్రకాశించినది.

గుఱ్ఱపువాఁడు తనగుఱ్ఱము సమాచారము నేమఱచెను; ఏనుఁగువాఁడును తనయేనుంగును విచారింపఁడయ్యె; ఆ సైనికులందఱును, మదించి, మద్యపానంబున దేహంబుమఱచి స్త్రీచ్ఛందనవనితాది సమస్తభోగంబులఁబరమసంతుష్టులయియుండిరి. అని, తాత్పర్యము.

తర్పితా స్సర్వకామైస్తే రక్తచందన రూషితాః. ౫౮
అప్సరో గణసంయుక్తా స్సైన్యా వాచ ముదైరయన్

టీక॥ తే= ఆ; సైన్యాః=సైనికులు; సర్వకామైః=సమస్తములగునకామ్యద్రవ్యములచేతను; తర్పితాః=తృప్తిఁబొందింపఁబడినవారలై; రక్తచందనరూషితాః= ఎఱ్ఱనిచందనముచేఁబూయఁబడినవారలయి; అప్సరోగణసంయుక్తాః= అప్సరసలసమూహములతోఁగూడినవారలై; వాచం= మాటను; ఉదైరయన్=చెప్పిరి.

అట్లా సైనికులు సమస్తభోగంబులనుఅనుభవింపుచు, రక్తచందనాలంకృతులయియొకొ్కొకరు పెక్కుమంది య



ప్పరసలంగూడి, పరమసంతుష్టులయి, యీమాటంజెప్పిరి. అని, తాత్పర్యము.

నైవా యోధ్యాం గమిష్యామో నగమిష్యామ దండకాన్. ౫౯
కుశలం భరతస్యాస్తు రామస్యాస్తు తథా సుఖమ్

టీక॥ వయం (అధ్యాహృతము) = మేము; అయోధ్యాం = అయోధ్యను గూర్చి ; నగమిష్యామః = పోనేపో ము. దండకాన్ = దండకారణ్యమును గూర్చి; నగమిష్యామి = (నగమిష్యా మః)=పోము. భరతస్య=భరతునకు ; కుశలం=క్షేమము; అస్తు=అగుఁగాక. తథా=అట్లు; రామస్య=రామునకు ; సుఖం=సుఖము;అస్తు=అగుఁగాక.

మేము,అయోధ్యకునుబోము ; దం డకారణ్యంబునకునుబోము; ఇచ్చటనె యుండెదము ; భరతునకుక్షేమంబు గలుగుఁగాక;రాముండును సుఖపడుఁ గాక_అని, తాత్పర్యము.

ఇతిపాదాతయోధాశ్చ హస్త్యశ్వారోహబంధకాః. ౬౦
అనాథాస్తం విధిం లబ్ధ్వా వాచ మేతా ముదైరయన్

టీక॥ పాదాతయోధాశ్చ=పదాతి భటులును ; హస్త్యశ్వారోహబంధ కాః= ఏనుంగులయొక్కయుగుఱ్ఱముల యొక్కయునెక్కువారలును కట్టువా రలును;తం=ఆ;విధిం = సత్కారము ను;లబ్ధ్వా=పొంది;అనాథాః= నాథుఁ డులేనివారలయి, స్వతంత్రులయియను ట;ఇతి=అని;ఏతాం=ఈ;వాచం=మా టను;ఉదైరయన్=చెప్పిరి.

ఇట్లు,పదాతులును గజసాదులును అశ్వసాదులును,ఏనుంగులనుగుఱ్ఱంబుల నుగట్టుటమొదలగు పని సేయు వారలు ను, భరద్వాజమహర్షి గావించినస త్కారంబునొంది,ప్రమత్తులయి, తమ కునాథుండులేడనుకొని , స్వతంత్రుల పగిది,నీమాటంజెప్పిరి.

అని, తాత్పర్యము-

సంప్రహృష్టా వినేదుస్తే నరాస్తత్ర సహస్రశః. ౬౧
భరతస్యాను యాతార స్స్వర్గోఽయ మితిచాబ్రువన్

టీక॥ భరతస్య=భరతునియొక్క; అనుయాతారః=వెంబడించువారలగు; తే=ఆ; నరాః=మనుష్యులు; తత్ర = అచ్చట ; సహస్రశః = వేనవేలుగా; సంప్రహృష్టాః= మిక్కిలిసంతసించిన వారలై; వినేదుః=అఱచిరి. అయం= ఇది; స్వర్గః=స్వర్గము; ఇతిచ = అనియు; అబ్రువన్=చెప్పిరి.

భరతునివెంబడివచ్చిన సైనికులచ్చట వేలువేలుగాఁ బరమసంతుష్టులయి, గట్టిగానఱచుచు, "ఇదేస్వర్గము, ఇంతకన్న వేఱుస్వర్గముండదు" అని, చెప్పిరి-అని, తాత్పర్యము-

నృత్యంతిస్మ హసంతిస్మ గాయంతిస్మచ సైనికాః. ౬౨
సమంతా త్పరిధావంతి మాల్యోపేతా స్సహస్రశః

టీక॥ సైనికాః = సైనికులు; మాల్యోపేతాః= పుష్పమాలికలతోఁగూడినవారలు; సహస్రశః=వేనవేలుగా ; నృత్యంతిస్మ= ఆడుచుండిరి. హసంతిస్మ=నవ్వుచుండిరి. గాయంతిచస్మ = పాడుచునుండిరి. సమంతాత్ = అంతటను; పరిధావంతి= పరుగెత్తుచుండిరి.

ఆసైనికులందఱు, మంచిపుష్పమాలికలుధరించి, గుంపులుగుంపులుగా , నృత్తంబుసేయుచును, నవ్వుచును,బాటలుపాడుచును, నలుప్రక్కలఱుంబరులెత్తుచునుండిరి.అని,తాత్పర్యము.

తతో భుక్తవతాం తేషాం త దన్న మమృతోపమమ్. ౬౩
దివ్యా నుద్వీక్ష్య భక్ష్యాం స్తా నభవ ద్భక్షణే మతిః

టీక॥ తతః= అటుపిమ్మట; అమృతోపమం=అమృతముతోఁబోలిక గల ; తత్= ఆ; అన్నం = అన్నమును; భుక్తవతాం=భుజించినట్టి; తేషాం=వారలకు;దివ్యాన్=శ్రేష్ఠములయిన; తాన్ = ఆ; భక్ష్యాన్=పిండివంటలను ; ఉద్వీక్ష్య=చూచి;భక్షణే=తినుటయందు; మతిః=బుద్ధి; అభవత్=కల్గినది.

అంత, వారలు , అమృతంబువంటియాయన్నంబును యథేష్టంబుగాఁదినియు, దివ్యంబులగునందలిభక్ష్యంబులంజూచి,దనివిచెందక, మఱలందినసాగిరి. అని, తాత్పర్యము.

ప్రేష్యాశ్చేట్యశ్చ వధ్వశ్చ బలస్థాశ్చ సహస్రశః. ౬౪
బభూవుస్తే భృశందృప్తా స్సర్వేచాహతవాససః

టీక॥ ప్రేష్యాః=పరిచారికలును; చేట్యశ్చ=దాసీలును; వధ్వశ్చ=స్త్రీలును; బలస్థాః=సైన్యంబుననున్న; తే= వారలు; సర్వేచ=అందఱును; సహస్రశశ్చ=వేనవేలుగాను; అహతవాససః=క్రొత్తవస్త్రములుగలవారలై; భృశం=మిక్కిలియు; దృప్తాః= గర్వించినవారలు; బభూవుః=అయిరి.

ఆసేనయందలి పరిచారికలునుదాసీలునుసైనికాంగనలును, మఱియునందున్నవారలందఱును, నూతనవస్త్రంబులు గట్టుకొని, పరమగర్వితులయియుండిరి. అని, తాత్పర్యము.

కుంజరాశ్చ ఖరోష్ట్రాశ్చ గోశ్వాశ్చ మృగపక్షిణః. ౬౫
బభూవు స్సుభృతా స్తత్ర నాన్యో హ్యన్య మకల్పయత్

టీక॥ తత్ర=అచ్చట; కుంజరాశ్చ=ఏనుంగులును; ఖరోష్ట్రాశ్చ=గాడిదలును ఒంటెలును; గోశ్వాశ్చ= గోవులును గుఱ్ఱములును; మృగపక్షిణః= మృగంబులును బత్తులును; సుభృతాః= చక్కఁగాఁబోషింపఁబడినవి; బభూవుః=అయినవి. అన్యః=ఇతరమయినది; అన్యం= ఇతరమయినయాహారమును; నాకల్పయద్ధి=చేయలేదుగదా!

ఆసేనయందు, ఏనుంగులును గాడిదలునుఒంటెలునుగోవులునుగుఱ్ఱములును మృగంబులునుబత్తులును, భరద్వాజమహర్షి ప్రభావంబునంగలిగిన పదార్థంబులచేమిక్కిలియుఁదృప్తిఁజెందినవి; ఏదియునెవ్వండును, వేఱేమఱియే ఆహారంబునుంజేయలేదు; అందఱుభరద్వాజునిచేత నేతృప్తిఁబొందింపఁబడిరి. అని, తాత్పర్యము.

నాశుక్లవా సాస్తత్రాసీ త్క్షుధితో మలినోపివా. ౬౬
రజసా ధ్వస్త కేశోవా నరః కశ్చి దదృశ్యత

టీక॥ తత్ర=ఆసేనయందు; అశుక్లవాసాః=నల్లనివస్త్రము గలవాఁడుగాని; క్షుధితః= ఆఁకలిగొన్నవాఁడుగాని; మలినోపివా= ముఱికిగలవాఁడుగాని;

నాసీత్=ఉండలేదు. నరః= మనుష్యుండు; కశ్చిత్=ఒకానొకండైనను; రజసా=దుమ్ము చేత; ధ్వస్తకేశో వా= చెడిన వెంద్రుకగలవాఁడు గాని; (న) అదృశ్యత=చూడఁబడలేదు.

ఆసేనయందు, ఒకండైనను, నల్లనిబట్టలుగట్టుకొనిగాని, యాఁకలి గొనిగాని, మఱికిదగిలిగానియుండలేదు; అందఱును తెల్లనివస్త్రములు ధరించిమృష్టాన్నంబుఁ గుడిచి పరమతృప్తులయి స్వచ్ఛదేహులయియుండిరి; ఎవ్వండునుమఱికిదగిలిన వెంద్రుకలతోనుండలేదు; అందఱకును అభ్యంగస్నానమయియుండినది. అని, తాత్పర్యము.

ఆజైశ్చాపి చ వారాహై ర్నిష్ఠాన వరసంచయైః. ౬౭
ఫలనిర్యూహసంసిద్ధైః సూపై ర్గంధరసాన్వితైః
పుష్పధ్వజవతీః పూర్ణా శ్శుక్లస్యాన్నస్య చాభితః. ౬౮
దదృశు ర్విస్మితా స్తత్ర నరా లౌహీ స్సహస్రశః

టీక॥నరాః=ఆసైనికులు; తత్ర=అచ్చట; ఆజైశ్చాపిచ= మేకమాంసములచేతను; వారాహైః=పందిమాంసములచేతను; నిష్ఠానవరసంచయైః= వ్యంజనశ్రేష్ఠములసమూహములచేతను; ఫలనిర్యూహసంసిద్ధైః=చక్కఁగా నేర్పఱుపఁబడిన పండ్లరసములచేతను; గంధరసాన్వితైః=మంచివాసనతోనురుచితోనుగూడినవగు; సూపైః=పప్పులచేతను; శుక్లస్య=తెల్లని; అన్నస్య(అన్నేనచ)= అన్నముచేతను; పూర్ణాః=నిండిన; పుష్పధ్వజవతీః=పూలపెకెఱములుగల; లౌహీః=లోహపాత్రములను; సహస్రశః=వేనవేలుగా; అభితః=అంతటను; విస్మితాః=ఆశ్చర్యమునొందినవారలై; దదృశుః=చూచిరి.

ఆసైనికులందఱు, మేకమాంసములతోను బందిమాంసములతోను, ఉత్తమంబులగు వ్యంజనంబులతోను శర్కరకలిపిసంస్కరింపఁబడినఫల రసములతోను సుగంధరసంబులతోఁగూడినసూపములతోనుమంచితెల్లనియన్నముతోను నిండియసంఖ్యంబులుగానున్న లోహపాత్రలంబూచి యత్యాశ్చర్యంబు నొందిరి. అని, తాత్పర్యము.

బభూవు ర్వనపార్శ్వేషు కూపాః పాయసకర్దమాః. ౬౯
తాశ్చ కామదుఘా గావో ద్రుమా శ్చాస న్మధుశ్చ్యుతః




టీక॥ వనపార్శ్వేషు = అడవిప్రక్కలయందు; కూపాః=బావులు; పాయసకర్దమాః= పరమాన్నమెబురదగాఁగలవిగా; బభూవుః = అయినవి. తాః=ఆ; గావశ్చ=ఆవులును ; కామదుఘాః=కోరినకొలందిఁబితుకునవిగా; బభూవుః(అధ్యాహృతము)= అయినవి. దుర్మాః=వృక్షములును;మధుశ్చ్యుతః = తేనియను స్రవించునవిగా; ఆసన్=అయినవి.

అప్పుడరణ్యంబుననుండుబావులన్నియుఁబరమాన్నంబుతోనిండినవై నవి ; అచ్చటియావులు, ఎంతకోరినను అంత పాలుపితుకునవిగానుండినవి. ; అచ్చటి వృక్షంబులన్నియుఁ దేనియలు గారుచుండినవి. అని, తాత్పర్యము.

వాప్యో మైరేయపూర్ణాశ్చ మృష్టమాంసచయై ర్వృతాః. ౭౦
ప్రతప్త పిఠరై శ్చాపి మార్గమాయూర కౌక్కుటైః

టీక॥ వాప్యః= నడబావులు; మైరేయపూర్ణాశ్చ=మైరేయమనుమద్యముచేనిండినవిగాను ; మృష్టమాంసచయైః= ఉత్తమంబులగుమాంసములసమూహములచేతను; ప్రతప్తపిఠరైః= కుండలయందువండఁబడిన;మార్గమాయూరకౌక్కుటైః= మృగమాంసములచేతను నెమిలిమాంసములచేతను గోడిమాంసములచేతను;వృతాః=చుట్టఁబడినవిగాను; ఆసన్(అధ్యాహృతము)= ఉండినవి.

అచ్చటినడబావులు, మద్యంబుతో నిండి, కుండలందుఁజక్కఁగావండఁబడినమృగమాంసముమయూరమాంసము కోడిమాంసముమొదలగునుత్తమమాంసంబులచేఁ బరివేష్టింపఁ బడియుండినవి.అని, తాత్పర్యము.

పాత్రీణాంచ సహస్రాణి స్థాలీనాం నియుతానిచ. ౭౧
న్యర్బుదాని చ పాత్రాణి శాతకుంభమయాని చ
స్థాల్యః కుంభ్యః కరంభ్యశ్చ దధిపూర్ణా స్సుసంస్కృతాః. ౭౨

టీక॥ పాత్రీణాం= అన్నముంచుపాత్రలయొక్క;సహస్రాణిచ = వేలును; స్థాలీనాం=వ్యంజనములుంచుపాత్రములయొక్క; నియుతానిచ= లక్షలును;




శాతకుంభమయానిచ=బంగారువికారములయినట్టి; పాత్రాణి= భోజనపాత్రలు; వ్యర్బుదానిచ= పదికోటులును; సుసంస్కృతాః= చక్కఁగా సంస్కరింపఁబడిన; దధిపూర్ణాః= పెరుఁగుచేనిండిన; స్థాల్యః=పాత్రములును; కుంభ్యః= చిన్నపాత్రములును; కరంభ్యశ్చ=నోరువెడల్పుపెద్దపాత్రములును; ఆసన్ (అధ్యాహృతము)=ఉండినవి.

వేలకొలఁదియన్నపాత్రలునులక్షలకొలఁది వ్యంజనపాత్రలునుకోటులకొలఁదిబంగారుభోజనపాత్రలును, శుంఠిమొదలగునవివేసిచక్కఁగా సంస్కరింపఁబడినపెరుఁగుతోనిండినపాత్రంబులునుజిన్నపాత్రంబులునునోరువెడల్పుగలపెద్దపాత్రలును, ఉండినవి.

అని, తాత్పర్యము.

యావనస్థస్య గౌరస్య కపిత్థస్య సుగంధినః
హ్రదాః పూర్ణా రసాలస్య దధ్నశ్శ్వేతస్య చాపరే. ౭౩
బభూవుః పాయసస్యాన్యే శర్కరా యావసంచయాః

టీక॥హ్రదాః=సరస్సులు; యావనస్థస్య=అంతపాఁతదియునంతక్రొత్తదియుఁగాని; గౌరస్య = తెల్లనిది; సుగంధినః=మంచివాసనగల; కపిత్థస్య=(తృతీయార్థమందుషష్ఠి) వెలగపండువాసనవంటివాసనగలమజ్జిగచేత; పూర్ణాః= నిండినవి; బభూవుః(అధ్యాహృతము)= అయినవి. కేచిత్(అధ్యాహృతము)= కొన్నిగుంటలు; రసాలస్య=(చతుర్థ్యర్థమందుషష్ఠి)శుంఠిపిప్పలిమిరియాలునుపలకులునులవంగంబులునుదక్కోలంబునుశర్కరయునుఅల్లమునుజిలకఱ్ఱయునువేసితాళింపుచేసినపెరుఁగుచేత; పూర్ణాః (అధ్యాహృతము)=నిండినవి; బభూవుః (అధ్యాహృతము)=అయినవి. అపరేచ= మఱికొన్నియు; శ్వేతస్య = తెల్లని; దధ్నః=(తృతీయార్థమందుషష్ఠి)పెరుఁగుచేత; పూర్ణాః బభూవుః (అధ్యాహృతము)=నిండినవైనవి. అన్యే=ఇతరములు; పాయసస్య=(తృతీయార్థమందుషష్ఠి)పరమాన్నముచేత; పూర్ణాః (అధ్యాహృతము) = నిండినవి. బభూవుః = అయినవి. శర్కరాయావసంచయాః=చక్కెరతోఁగూడినయవలపిండివంటలసమూహములు; ఆసన్(అధ్యాహృతము)=ఉండినవి.

కొన్నిసరస్సులు, అంతపాఁతదియు నంత క్రొత్తదియుఁగాని తెల్లనివెలఁగ పండువాసనగల మంచిమజ్జిగతోనిండి యుండినవి; కొన్ని, శుంఠిపిప్పలిమిరియాలు మొదలగునవివేసి తాళింపుచేసిన పెరుఁగుతోనిండియుండినవి; మఱికొన్నిస్వచ్ఛమయినపెరుఁగుతోఁ బూర్ణంబులయియుండినవి ; కొన్నిపాయసపూర్ణంబులయినవి; శర్కరతోఁగూడిన యవాపూపంబులు రాసులురాసులు గానుండినవి. అని, తాత్పర్యము.

కల్కాం శ్చూర్ణ కషాయాంశ్చ స్నానాని వివిధానిచ. ౭౪
దదృశు ర్భాజనస్థాని తీర్థేషు సరితాం నరాః

టీక॥ నరాః=సేనయందలిమనుష్యులు; సరితాం=నదులయొక్క; తీర్థేషు=రేవులయందు; కల్కాన్= ఉసిరిగకాయ మొదలగు వానితోఁ జేసిన కల్కములను; చూర్ణకషాయాంశ్చ= గంధపుఁబొడులను; భోజనస్థాని=పాత్రములందున్న; వివిధాని; నానావిధములయిన; స్నానాని=స్నానయోగ్యద్రవ్యంబులను; దదృశుః=చూచిరి.

ఆసైనికులు, నదీతీరంబులందుఁ, బాత్రంబులనుంచఁబడియున్న, యామలక్యాదికల్కంబులను గంధ చూర్ణంబులను, అట్లు నానావిధస్నానద్రవ్యంబులనుంజూచిరి. అని, తాత్పర్యము.

శుక్లా నంశుమత శ్చాపి దంతధావనసంచయాన్. ౭౫
శుక్లాం శ్చందనకల్కాంశ్చ సముద్గే ష్వవతిష్ఠతః
దర్పణాన్ పరిమృష్టాంశ్చ వాససాంచాపి సంచయాన్. ౭౬
పాదుకోపానహాం చైవ యుగ్మానిచ సహస్రశః
అంజనీః కంకతాన్ కూర్చాన్ వస్త్రాణిచ ధనూంషిచ. ౭౭
మర్మత్రాణాని చిత్రాణి శయనాన్యా సనానిచ
ప్రతిపానహ్రదాన్ పూర్ణాన్ ఖరోష్ట్ర గజవాజినామ్. ౭౮
అవగాహ్యా సుతీర్థాంశ్చ హ్రదాన్ సోత్పలపుష్కరాన్
ఆకాశవర్ణప్రతిమాన్ స్వచ్ఛతోయాన్ సుఖప్లవాన్. ౭౯

నీపవైడూర్య వర్ణాంశ్చ మృదూన్ యవససంచయాన్
నిర్వా పార్థాన్ పశూనాం తే దదృశుస్తత్ర సర్వశః. ౮౦

టీక॥ తే=ఆసైనికులు;తత్ర=అచ్చట;శుక్లాన్=నిర్మలములయిన;అంశుమతశ్చాపి=కూర్చములుగలవియునగు;దంతధావనసంచయాన్= దంతకాష్ఠముల సమూహములను;సముద్గేషు= దొప్పలయందు;అవతిష్ఠతః= ఉన్న;శుక్లాన్= తెల్లని;చందనకల్కాంశ్చ= చందనపు ముద్దలను;పరిమృష్టాన్= తుడువఁబడిన; దర్పణాంశ్చ=అద్దములను; వాససాం= వస్త్రములయొక్క ; సంచయాంశ్చాపి=సమూహములను; సహస్రశః=వేనవేలుగానున్న; పాదుకోపానహాంశ్చైవ=పావకోళ్లయొక్కయు చెప్పలయొక్కయు; యుగ్మానిచ=జంటలను; అంజనీః=కాటుకబరిణలను; కంకతాన్= దువ్వెనలను;కూర్చాన్= మీసములఁజక్కఁజేయువానిని; శస్త్రాణిచ=ఆయుధములను; ధనూంషిచ = ధనుస్సులను; మర్మత్రాణాని = కవచములను; చిత్రాణి= నానావిధములయిన;శయనాని=పాన్పులను;ఆసనానిచ = పీఠములను; పూర్ణాన్=నిండిన; ఖరోష్ట్రగజవాజినాం = గాడిదలయొక్కయు నేనుంగులయొక్కయు గుఱ్ఱములయొక్కయు; ప్రతిపానహ్రదాన్ = నీళ్లుత్రాఁగు గుంటలను ; అవగాహ్యసుతీర్థాన్ = మునుఁగుటకుఁదగినమంచిరేవులుగలవియు ; సోత్పలపుష్కరాన్= నల్లకలువలతోను దామరపూలతోనుఁగూడినవియు; ఆకాశవర్ణప్రతిమాన్ = ఆకాశముయొక్కవన్నెతోఁబోల్కి గలవియు;స్వచ్ఛతోయాన్=స్వచ్ఛమయిననీళ్లుగలవియు;సుఖప్లవాన్= సుఖకరమయినస్నానముగలవియునగు; హ్రదాంశ్చ = మడుఁగులను; పశూనాం=పశువులకు;నిర్వాపార్థాన్= ఇచ్చుటయెప్రయోజనముగాఁగల; నీపవైడూర్యవర్ణాన్=నీపవృక్షములయొక్కయు వైడూర్య రత్నములయొక్కయువన్నెవంటివన్నెగల; మృదూన్= మెత్తనివైన;యవససంచయాంశ్చ=తృణములసమూహములను;సర్వశః= అంతను;దదృశుః=చూచిరి.

అచ్చట,నాసైనికులు,నిర్మలములై కూర్చములతోఁగూడినదంతకాష్ఠంబులను,సంపుటంబులందుంచఁ బడియున్న తెల్లనిచందనంబులను,జక్కఁగాఁదుడువఁబడిననిర్మలములయియున్నఅద్దంబు




లను,వస్త్రసమూహంబులను, చెక్క
వేలపావకోళ్ల జతలనుచెప్పుజోళ్లను ,
గాటుకబరణులనుదువ్వెనలను మీసము
లఁజక్క జేయుచిన్న దువ్వెనలను, ఖ
డ్గాద్యాయుధంబులనుధనుస్సులను,గప
చంబులనునానావిధంబులగుశయనంబు
లనుఆసనంబులను, గాడిదలునొంటెలు
నేనుంగులు గుఱ్ఱంబులుఁ ద్రాఁగుటకై
యేర్పఱుపబడినసీళ్లు నిండియున్నగుం
టలను,నల్లకలువలునుకమలంబులునుగ
లిగియాకాశమువలె స్వచ్ఛములయినసీ
ళ్లుగలిగి యవగాహించి స్నానముసే
యఁదగిన మంచి రేవులతో నొప్పుచు
స్నానంబు సేయువారలకుసౌఖ్యంబుగ
లిగించునట్టి,సరస్సులను,నీపచ్చైన దూర్వాం
బులకుంబోలె వన్నెగల్గి మృదువులయి
యున్న పశువులకై సంపాదింపఁ బడి
నతృణసమూహంబులను, వీనినన్నింటి
నిం, జూచిరి-

అని, తాత్పర్యము.

వ్యస్మయంత మనుష్యాస్తే స్వప్నకల్పం తదద్భుతమ్
దృష్ట్వాతిథ్యం కృతం తాదృ గ్భరత స్య మహర్షిణా. ౮౧

టీక॥ తే=ఆ;మనుష్యాః= మనుష్యు
లు; మహర్షిణా = భరద్వాజమహ
ర్షిచేత; భరతస్య= భరతునకు; కృ
తం=చేయఁబడిన; స్వప్నకల్పం= కల
తోసమానమయినదియు;అద్భుతం=ఆ
శ్చర్యకరంబునునగు; తాదృక్= అట్టి;
ఆతిథ్యం = అతిథిసత్కారమును;దృ
ష్ట్వా=చూచి; వ్యస్మయంత= ఆశ్చర్య
పడిరి.

ఆసైనికులు, భరద్వాజమహాముని
భరతునకుఁగావించిన, స్వప్నసదృశం
బును ఆత్యాశ్చర్యకరంబునగునిదివఱకె
న్నఁడైనవిన్నదియుఁగన్నదియుఁ గాని,
యనిర్వాచ్యంబగు , విందుంబూచి,మి
కిలియునాశ్చర్యంబునొందిరి.

అని, తాత్పర్యము-

ఇత్యేవం రమమాణానాం దేవానా మివ నందనే
భరద్వాజాశ్రమే రమ్యే సారాత్రి ర్వ్యత్యవర్తత. ౮౨

టీక॥ ఇతి=అని; ఏవం=ఇట్లు;నం
దనే=నందనవనమునందు ; దేవానా
మివ=దేవతలువలె; తేషాం (అధ్యా
హృతము)= వారలు; రమ్యే= రమణీ




సర్గ ౯౧

యమగు; భరద్వాజాశ్రమే= భరద్వాజాశ్రమమునందు; రమమాణానాం= క్రీడింపుచుండఁగానే; సా=ఆ; రాత్రిః= రాతిరి; వ్యత్యవర్తత=కడచినది.

నందనవనంబునందు దేవతలు క్రీడించునట్లు, రమణీయంబగునబ్భరద్వాజాశ్రమంబున, నీప్రకారము, ఆభరతుని సైనికులు, నానావిధక్రీడలం దేలుచుండఁగానే, యారాత్రిగడచినది.

అని, తాత్పర్యము.

ప్రతిజగ్ముశ్చ తా నద్యో గంధర్వాశ్చ యథాగతమ్
భరద్వాజ మనుజ్ఞాప్య తాశ్చ సర్వా వరాంగనాః. ౮౩

టీక॥ తాః=ఆ; నద్యశ్చ= నదులును; గంధర్వాశ్చ=గంధర్వులును; తాః= ఆ; వరాంగనాశ్చ=ఉత్తమస్త్రీలును; సర్వాః=అందఱును; భరద్వాజం = భరద్వాజమహామునిని; అనుజ్ఞాప్య = సమ్మతింపఁజేసి; యథాగతం= వచ్చినట్లు; ప్రతిజగ్ముః=మఱలఁబోయిరి.

అంత, నానదులును, దేవగంధర్వులును ఆయుత్తమస్త్రీలును, అందఱును భరద్వాజమహామునినిఁ వీడ్కొని, వచ్చినరీతినే, తమతమనెలవులకుంబోయిరి.

అని, తాత్పర్యము.

తథైవ మత్తా మదిరోత్కటా నరా
స్తథైవ దివ్యాగరుచందనోక్షితాః
తథైవ దివ్యా వివిధా స్స్రగుత్తమాః
పృథక్ప్రకీర్ణా మనుజైః ప్రమర్దితాః. ౮౪

టీక॥ నరాః= మనుష్యులు; తథైవ=అట్లే; మదిరోత్కటాః= మద్యముచే హద్దుమీఱినవారలై; మత్తాః= మదించినవారలై; తథైవ=అట్లే; దివ్యాగరుచందనోక్షితాః= శ్రేష్ఠములగునగరుగంధముచేతనుజందనముచేతనుతడుపఁబడినవారలై; స్థితాః(అధ్యాహృతము)=ఉండిరి. తథైవ=అట్లే; దివ్యాః= స్వర్గమునఁబుట్టిన; వివిధాః= నానావిధములైన; స్రగుత్తమాః=మాల్యశ్రేష్ఠములు; మనుజైః=మనుష్యులచేత; పృథక్=వేఱువేఱుగా; ప్రకీర్ణాః= చల్లఁబడినవై; ప్రమర్దితాః = నలఁపఁబడినవై; స్థితాః(అధ్యాహృతము) =




ఉండినవి.

తెల్లవాఱిన పిమ్మటనుంగూడ, మనుష్యులు, ఆప్రకారంబుననే; మద్యమదంబుచే మోహితులయి, యదేప్రకారంబునదివ్యాగరుచందనాలంకృతులయి యుండిరి; మఱియుదివ్యంబులగుపుష్పమాలికలును, అదేప్రకారంబున, నచ్చటచ్చట వెదచల్లఁబడి, నలఁగిపోయి యుండినవి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, ఏకనవతితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండైకనవతితమసర్గటీక, ముగిసినది.



శ్రీః

## ద్వినవతితమసర్గప్రారంభః

తత స్తాం రజనీం వ్యుష్య భరత స్సపరిచ్ఛదః
కృతా తిథ్యో భరద్వాజం కామా దభిజగామహ. ౧

టీక॥ తతః= అంత; భరతః= భరతుఁడు; సపరిచ్ఛదః= పరివారముతోఁగూడినవాఁడై; కృతాతిథ్యః= చేయఁబడినయాతిథ్యముగలవాఁడై; తాం= ఆ; రజనీం= రాత్రియంతయు; వ్యుష్య= ఉండి; కామాత్= కోరికవలన; భరద్వాజం= భరద్వాజుని; అభిజగామ= పొందెను. "హ" అనునది పాదపూరణార్థము.

అంత, భరతుండు సపరివారుండై, యాతిథ్యంబువడసి, రామునుంజూచుకోరికచే, భరద్వాజమహాముని యొద్దకుఁబోయెను. అని, తాత్పర్యము.

త మృషిః పురుషవ్యాఘ్రం ప్రాంజలిం ప్రేక్ష్యచాగతమ్




హుతాగ్ని హోత్రో భరతం భరద్వాజోభ్యభాషత. ౨

టీక॥ఋషిః= సర్వజ్ఞుండగు; భరద్వాజః= భరద్వాజుఁడు; హుతాగ్ని హోత్రః=వేల్వఁబడినయగ్నిహోత్రముగలవాఁడై; ఆగతం=వచ్చినవాఁడును; ప్రాంజలిం= మంచిచేమోడ్పుగలవాఁడును; పురుషవ్యాఘ్రం = పురుషశ్రేష్ఠుండునగు; తం=ఆ; భరతం=భరతుని; ప్రేక్ష్యచ= చూచియు; అభ్యభాషత=చెప్పెను.

భరద్వాజమహర్షి, యగ్నిహోత్రకార్యంబయినపిమ్మటఁ, దనయొద్దకు వచ్చి చేమోడ్పు గీలించి నిలువఁబడియున్న పురుష శ్రేష్ఠుండగు నాభరతుంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

కచ్చిదత్ర సుఖా రాత్రి స్తవాస్మద్విషయే గతా
సమగ్ర స్తే జనః కచ్చి దాతిథ్యే శంస మేఽనఘ. ౩

టీక॥అనఘ= పాపరహితుండవగు భరతుఁడా!అత్ర = ఇచ్చట;అస్మద్విషయే=మాయాశ్రమమునందు;తవ= నీకు;రాత్రిః=రాత్రి; సుఖా=సుఖకరముగా;గతాకచ్చిత్ =కడచినదా యేమి?ఆతిథ్యే=ఆతిథ్యమువిషయమును; తే=నీయొక్క;జనః=జనము;సమగ్రఃకశ్చిత్= సంపూర్ణమా యేమి?మే=నాకు; శంస=చెప్పుము.

పాపరహితుఁడవగుభరతుఁడా!నీకు, మాయాశ్రమంబున,నీరాత్రి, సుఖంబుగా నేయుండినదా యేమి? నేనుగావించినయాతిథ్యంబునకు, నీసైనికులందఱుఁదప్తులయియున్నా రాయేమి? ఇదినాకుఁ జెప్పుము. అనిభరద్వాజుండు, భరతునితోఁ జెప్పెను.అని, తాత్పర్యము.

త ముహాచాంజలిం కృత్వా భరతోభి ప్రణమ్యచ
ఆశ్రమా దభినిష్క్రాంత మృషి ముత్తమతేజసమ్. ౪

టీక॥భరతః = భరతుఁడు; ఆశ్రమాత్= ఆశ్రమముననుండి; అభినిష్క్రాం

తం=వెడలిన;ఉత్తమతేజసం= శ్రేష్ఠముయినప్రభావముగల;తం=ఆ;ఋషిం=భరద్వాజమహర్షినిగూర్చి;అంజలిం=చేమోడ్పును;కృత్వా=చేసి; అభిప్రణమ్యచ=నమస్కరించియు; ఉవాచ = చెప్పెను.

భరతుండు, ఈప్రకారముచెప్పి తనవెంబడినాశ్రమంబువెడలివచ్చినమహాప్రభావుండగు నాభరద్వాజమహర్షికిఁజేమోడ్పుగీలించి,నమస్కరించి,యిట్లని,చెప్పెను. అని, తాత్పర్యము.

సుఖోషితోఽస్మి భగవన్ సమగ్రబలవాహనః
తర్పిత స్సర్వకామైశ్చ సామాత్యో బలవత్త్వయా. ౫

టీక॥ భగవన్=అధికమాహాత్మ్యముగలభరద్వాజుఁడా!త్వయా= నీచేత;సామాత్యః= మంత్రులతోఁగూడినవాఁడనై;సమగ్రబలవాహనః=సంపూర్ణములయినసైన్యములునువాహనములునుగలవాఁడనై;బలవత్ = మిక్కిలియనధికముగా;సర్వకామైశ్చ=సమస్తములయినకామ్యద్రవ్యంబులచేతను; తర్పితః = తృప్తిఁబొందింపఁబడినవాఁడనై;సుఖోషితః= సుఖంబుగానున్నవాఁడను;అస్మి=అయితిని.

భగవంతుఁడవగు భరద్వాజుఁడా! నేనును నామంత్రులును నాసైనికులును గుఱ్ఱంబులుమొదలగు వాహనంబులును, సమస్తకామంబులచేతను,దృప్తిఁబొందియున్నాము అని, తాత్పర్యము.

అపేతక్లమసంతాపా స్సుభక్ష్యా స్సుప్రతిశ్రయాః
అపిప్రేష్యా నుపాదాయ స్సర్వేస్మ సుసుఖోషితాః. ౬

టీక॥వయం(అధ్యాహృతము)=మేము; ప్రేష్యాన్=పరిచారకులను ; ఉపాదాయాపి=ఆరంభించియు;సర్వే=అందఱమును;అపేతక్లమసంతాపాః= పోయిశ్రమమును సంతాపమును గలవారలమై;సుభక్ష్యాః=మంచిభక్ష్యములుగలవారలమై;సుప్రతిశ్రయాః = మంచిగృహములు గలవారలమయి ; సుసుఖోషితాః= మిక్కిలియుసుఖముగానున్నవారలము;స్మ(స్మః)=అయితిమి.

మాపరిచారకుల నారంభించి, మేమందఱమును, గతశ్రములమయి గతసంతాపులమయి, మంచిభక్ష్యంబులందిని, మంచిగృహంబుల, మిక్కిలియు సుఖంబుగానుంటిమి. అని, తాత్పర్యము.

ఆమంత్రయేహం భగవన్ కామం త్వా మృషిసత్తమ
సమీపం ప్రస్థితం భ్రాతు ర్మైత్రే ణేక్షస్వ చక్షుషా. ౭

టీక॥ భగవన్ = అధికమయినమాహాత్మ్యముగల; ఋషిసత్తమ=ఋషిశ్రేష్ఠుండవగు భరద్వాజుఁడా! అహం= నేను; త్వాం = నిన్ను ; కామం=మిక్కిలియు; ఆమంత్రయే = వీడ్కొనెదను. భ్రాతుః=అన్న యొక్క; సమీపం=సమీపమునుగూర్చి; ప్రస్థితం= బయలుదేఱిన; మాం(అధ్యాహృతము)=నన్ను; మైత్రేణ = స్నేహముతోఁగూడిన; చక్షుషా=కంటిచేత; ఈక్షస్వ=చూడుము,

భగవంతుఁడవు ఋషిశ్రేష్ఠుండవునగు భరద్వాజుఁడా! నిన్ను వినయంబున వీడ్కొనెదను; నేను నాయన్న సమీపంబునకుఁ బోవుచున్నాను; నన్ను స్నేహదృష్టిం జూడుము. అని, తాత్పర్యము.

ఆశ్రమం తస్య ధర్మజ్ఞ ధార్మికస్య మహాత్మనః
ఆచక్ష్వ కతమో మార్గః కియానితి చ శంస మే. ౮

టీక॥ ధర్మజ్ఞ= ధర్మంబు నెఱింగినట్టి భరద్వాజుఁడా! ధార్మికస్య = ధర్మము నాచరించునట్టి; మహాత్మనః= పూజ్యమయిన స్వభావముగల; తస్య= ఆ రాముని యొక్క; ఆశ్రమం= ఆశ్రమమును; ఆచక్ష్వ=చెప్పుము. మార్గః= దారి; కతమః= ఏది; కియాన్ = ఎంత? ఇతిచ=అనియు; మే= నాకు ; శంస= చెప్పుము.

ధర్మజ్ఞుండవగు భరద్వాజుఁడా ! ధార్మికుండును మహాత్ముండునగు నా రాముండుండు నాశ్రమంబు నాకుఁ జెప్పుము; అది యిచ్చటికెంత దూరము? అచ్చటికిఁ బోవు మార్గమెద్ది? ఇదంతయు సవిస్తరముగాఁ జెప్పుము. అని, భరతుండు, భరద్వాజునితోఁ జెప్పెను-

అని, తాత్పర్యము.

ఇతి పృష్టస్తు భరతం భ్రాతృదర్శనలాలసమ్
ప్రత్యువాచ మహాతేజా భరద్వాజో మహాతపాః. ౯

టీక॥ మహాతేజాః=అధికమయినప్రభావముగలవాఁడును; మహాతపాః = అధికమయిన తపస్సుగలవాఁడునగు; భరద్వాజః=భరద్వాజుండు; ఇతి=అని; పృష్టస్తు= అడుగఁబడినవాఁడైనంతనె; భ్రాతృదర్శనలాలసం= అన్నయొక్క-చూచుటయందు అధికేచ్ఛగల; భరతం=భరతునిగూర్చి; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

మహాతేజుండును మహాతపశ్శాలియునగు భరద్వాజమహాముని, భరతుండు చెప్పినదివిని, యన్నం జూచుటకుఁ దొందర బడుచున్న భరతుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

భరతార్ధతృతీయేషు యోజనేష్వజనే వనే
చిత్రకూటో గిరి స్తత్ర రమ్యనిర్దరకాననః. ౧౦

టీక॥ భరత=భరతుఁడా! అజనే= జనులులేని; వనే=అడవియందు; అర్ధతృతీయేషు=సగముమూఁడవదిగాఁగల; యోజనేషు=ఆమడలు; అతీతేషు= కడఁచఁగా; తత్ర= అచ్చట; రమ్యనిర్ధరకాననః=సుందరములయిన సెలయేళ్లును అడవులునుగల; చిత్రకూటః=చిత్రకూటమను; గిరిః=పర్వతము; అస్తి(అధ్యాహృతము)=కలదు.

భరతుఁడా! నిర్జనంబగువనంబునందు, రెండున్నరామడదూరంబుపోయినవెనుక, సుందరంబులగు సెలయేళ్లంబులునువనంబులునుంగల చిత్రకూటంబను నొకపర్వతంబున్నది.

అని, తాత్పర్యము.

ఉత్తరం పార్శ్వమాసాద్య తస్య మందాకినీ నదీ
పుష్పితద్రుమసంఛన్నా రమ్యపుష్పితకాననా. ౧౧

టీక॥ తస్య= ఆచిత్రకూటపర్వతముయొక్క; ఉత్తరం= ఉత్తరపుదిక్కునందలి; పార్శ్వం=ప్రక్కను; ఆసాద్య=పొంది; పుష్పితద్రుమసంఛన్నా=

పూచినచెట్లచేఁగప్పఁబడినదియు; రమ్య పుష్పితకాననా=సుందరములగుపూచిన యడవులుగలదియునగు ; మందాకినీ= మందాకినియను; నదీ = ఏఱు; వర్తతే(అధ్యాహృతము)=ఉన్నది.

ఆచిత్రకూటపర్వతంబున కుత్తర పార్శ్వంబునఁదీరంబులఁబుష్పితవృక్షంబులుగలదియుఁ జక్కఁగాఁ, బుష్పించియుండు వనంబులుగలదియునగు మందాకినియనునొకనదియున్నది.

అని, తాత్పర్యము.

అనంతరం తత్సరిత శ్చిత్రకూటశ్చ పర్వతః
తయోః పర్ణకుటీ తాత తత్ర తౌ వసతో ధ్రువమ్. ౧౨

టీక॥ తాత=నాయనా! తత్సరితః= ఆమందాకినీనదికన్న; అనంతరం= అవల ; చిత్రకూటః=చిత్రకూటమను; పర్వతశ్చ=పర్వతంబును; అస్తి ( అధ్యాహృతము)= ఉన్నది. తత్ర(అధ్యాహృతము)= ఆచిత్రకూటపర్వతమునందు. తయోః=ఆరామలక్ష్మణులయొక్క; పర్ణకుటీ=పర్ణశాల. తత్ర= ఆపర్ణశాలయందు; తౌ= ఆరామలక్ష్మణులు; వసతః=ఉన్నారు. ధ్రువం=నిశ్చయము.

నాయనా! ఆమందాకినీనదికిఁ బ్రక్కనె చిత్రకూటపర్వతమున్నది; అందు రామలక్ష్మణులపర్ణశాల; ఆపర్ణశాలయందు వారున్నారు; నిశ్చయము.

అని, తాత్పర్యము.

దక్షిణేనైవ మార్గేణ సవ్యదక్షిణమేవవా
గజవాజిరథాకీర్ణాం వాహినీం వాహినీపతే. ౧౩
వాహయస్వ మహాభాగ తతోద్రక్ష్యసి రాఘవమ్

టీక॥ వాహినీపతే = సేనానాయకుండవు; మహాభాగ=పూజ్యమయినయదృష్టముగలవాఁడవునగు భరతుఁడా! దక్షిణేన=దక్షిణపుదిక్కునందలి ; మార్గేణైవ= మార్గముచేతనేకాని ; సవ్యదక్షిణమేవవా= నిరృతిదిక్కుతట్టుగాఁగాని; గజవాజిరథాకీర్ణాం= ఏనుంగులచేతనుగుఱ్ఱంబులచేతను రథములచేతనునిండిన; వాహినీం= సైన్యమును; వాహయస్వ= కొనిపొమ్ము. త




తతః=అంత; రాఘవం=రాముని; ద్రక్ష్యసి=చూడఁగలవు.

సేనానాయకుండవు మహాభాగుండవగు భరతుఁడా! నీవిచ్చటనుండి, దక్షిణదిక్కుగాఁబోవుమార్గంబునంగాని, నిరృతిదిక్కునఁబోవుమార్గంబునంగాని యేది సేనడచుటకుయుక్తముగానున్నదో, ఆమార్గంబున, రథగజతురంగసమూహసంయుతంబగు సైన్యంబుఁగొని పొమ్ము; అంత, రామునింజూడఁగలవు. అని, భరద్వాజుండు భరతునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ప్రయాణ మితి తచ్ఛ్రుత్వా రాజరాజస్య యోషితః. ౧౪
హిత్వా యానాని యానార్హా బ్రాహ్మణం పర్యవారయన్

టీక॥ ఇతి=ఇట్లు; తత్=ఆ; ప్రయాణం=ప్రస్థానమును; శ్రుత్వా=విని; రాజరాజస్య=రాజరాజయినదశరథునియొక్క; యోషితః=భార్యలు; యానార్హాః(అపి)=వాహనములకుఁదగినవారయ్యు; యానాని=వాహనములను; హిత్వా=విడిచి; బ్రాహ్మణం=భరద్వాజుని; పర్యవారయన్=పరివేష్టించిరి.

ఇట్లు, ప్రయాణవార్తవిని, దశరథమహారాజభార్యలు, కౌసల్యమొదలగువారలు, వాహనంబులువిడువఁదగనివారలయ్యు, వాహనంబులుడిగ్గి, నమస్కారంబు సేయుటకై, భరద్వాజమహర్షిం బరివేష్టించిరి. అని, తాత్పర్యము.

వేపమానా కృశా దీనా సహ దేవ్యా సుమిత్రయా. ౧౫
కౌసల్యా తత్ర జగ్రాహ కరాభ్యాం చరణౌ మునేః

టీక॥ తత్ర=అందు; కృశా=కృశించినదియు; దీనా=దుఃఖితయునగు; కౌసల్యా=కౌసల్యాదేవి; వేపమానా=వడఁకుచు; దేవ్యా=రాణియగు; సుమిత్రయా సహ=సుమిత్రతోఁగూడ; కరాభ్యాం=చేతులచే; మునేః=భరద్వాజునియొక్క; చరణౌ=పాదములను; జగ్రాహ=పట్టుకొనెను.

అందుఁబుత్రదుఃఖంబునఁగృశించిదీనయయియున్నకౌసల్యాదేవి, గడగడవడంకుచు, సుమిత్రతోఁగూడ, భరద్వాజమహాముని పాదంబులఁ జేతులం బ




ట్టుకొని, నమస్కారముచేసెను. అని, తాత్పర్యము.

అసమృద్ధేన కామేన సర్వలోకస్య గర్హితా. ౧౬
కైకేయీ తస్య జగ్రాహ చరణౌ సవ్యపత్రపా

టీక॥ అసమృద్ధేన= సఫలము కానట్టి; కామేన=కోర్కెచేత; సర్వలోకస్య= సమస్తలోకమునకును; గర్హితా=నిందితయయిన; కైకేయీ=కైకేయి; సవ్యపత్రపా = సిగ్గుతోఁగూడినదై; తస్య= ఆభరద్వాజమహామునియొక్క; చరణౌ=పాదములను; జగ్రాహ= పట్టుకొనెను.

అంత, నిష్ఫలమయిన కోరికఁగోరిసమస్తలోకంబులకునునిందితయయిన కైకేయి, యింతటి యకార్యంబుగావించినతన్నేమందురోయనిసిగ్గుగదురఁ, నమ్మునీంద్రునిపాదంబులకునమస్కరించెను.

అని, తాత్పర్యము.

తం ప్రదక్షిణ మాగమ్య భగవంతం మహామునిమ్. ౧౭
అదూరా ద్భరత స్యైవ తస్థౌ దీనమనా స్తదా

టీక॥తదా= అప్పుడు;సా (అధ్యాహృతము)= ఆకైకేయి; దీనమనాః= దైన్యమునొందినమనస్సుగలదై; భగవంతం=అధికమయినమాహాత్మ్యముగల; తం=ఆ; మహామునిం=పూజ్యమైనమునియగుభరద్వాజునిఁగూర్చి;ప్రదక్షిణం= ప్రదక్షిణముగా; ఆగమ్య=వచ్చి; భరతస్య= భరతునియొక్క; అదూరాదేవ=సమీపంబుననే;తస్థౌ= ఉండినది.

అప్పుడాకైకేయి, దీనయయి,కౌసల్యాదులుంబోలె, భరద్వాజునెదుట నిలువమొగంబులేక, భగవంతుండగునమ్మహామునిం బ్రదక్షిణించు సాకున,భరతునిసమీపంబునకువచ్చియుండినది.

అని, తాత్పర్యము.

తతః పప్రచ్ఛ భరతం భరద్వాజో దృఢవ్రతః. ౧౮

టీక॥తతః = అటుపిమ్మట;దృఢవ్రతః=చలనములేనివ్రతముగల ; భరద్వా

జః=భరద్వాజుఁడు; భరతం=భరతుని; పప్రచ్ఛ=అడిగెను.

అంత, దృఢవ్రతుండగు భరద్వాజమహాముని, భరతుంజూచి, యిట్లని, యడిగెను. అని, తాత్పర్యము.

విశేషం జ్ఞాతు మిచ్ఛామి మాతౄణాం తవ రాఘవ

టీక॥ రాఘవ=రఘువంశమునంబుట్టినభరతుఁడా! తవ = నీయొక్క ; మాతౄణాం=తల్లులయొక్క ; విశేషం= వారివారి పేళ్లు మొదలగు భేదమును; జ్ఞాతుం=తెలియుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను.

భరతుఁడా! నీతల్లులలో, వారివారి పేళ్లు మొదలగునవి తెలియఁగోరెదం జెప్పుము. అని, భరద్వాజుండు భరతునడిగెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు భరతో భరద్వాజేన ధీమతా. ౧౯
ఉవాచ ప్రాంజలి ర్భూత్వా వాక్యం వచనకోవిదః

టీక॥ వచనకోవిదః= మాటలయందుఁబండితుండగు; భరతః=భరతుఁడు ; ఏవం=ఇట్లు; ధీమతా=బుద్ధిమంతుండగు; భరద్వాజేన=భరద్వాజునిచేత ; ఉక్తస్తు = చెప్పఁబడినవాఁడైనంతనే ; ప్రాంజలిః= మంచిచేమోడ్పుగలవాఁడు; భూత్వా=అయి; వాక్యం= మాటను; ఉవాచ=చెప్పెను.

మాటలు చెప్పుటయందుఁ బండితుండగు భరతుండు , బుద్ధిమంతుండగు భరద్వాజమహాముని చెప్పినమాటను విని, చేమోడ్పుగిలించి, యీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

యా మిమాం భగవన్ దీనాం శోకా నశనకర్శితామ్. ౨౦
పితుర్హి మహిషీం దేవీం దేవతామివ పశ్యసి
ఏషా తం పురుషవ్యాఘ్రం సింహవిక్రాంతగామినమ్. ౨౧
కౌసల్యా సుషువే రామం ధాతార మదితిర్యథా

టీక॥ భగవన్= అధికమయినమాహాత్మ్యముగలభరద్వాజుఁడా! దీనాం= దుఃఖితయును; శోకానశనకర్శితాం= దుఃఖముచేతను ఆహారము లేమిచేతను

గృశింపఁజేయఁబడినదియు; పితుః=తండ్రియొక్క ("హి" అనునది పాదపూరణార్థము) మహిషీం = పట్టపురాణియునగు; యాం=ఏ; ఇమాం=ఈ; దేవీం=రాణిని; దేవతామివ= దేవతనువలె; పశ్యసి = చూచుచున్నావో; ఏషా= ఈ; కౌసల్యా = కౌసల్యాదేవి; పురుషవ్యాఘ్రం= పురుషశ్రేష్ఠుండును; సింహవిక్రాంత గామినం= సింహమువలెఁ బరాక్రమంబుతోఁగూడునట్లుగానడుచువాఁడునగు; తం= అట్టి; రామం=రాముని; ధాతారం=విష్ణుని; అదితిర్యథా=అదితియుఁబోలె; సుషువే= కన్నది.

భగవంతుఁడవగుభరద్వాజుఁడా! ఇదిగో దుఃఖితయయిదుఃఖంబుచేతనుఁభోజనంబులేమిచేతనుగృశించిదేవతయుంబోలెనున్నదే ; ఈబిడ నాతండ్రికగ్రభార్య; ఈబిడపేరుకౌసల్య ; పురుషశ్రేష్ఠుండును , సింహంబువలెఁబరాక్రమయుక్తంబుగా నడచువాఁడునగు నారాముండు , ఈబిడకుమారుఁడే.

అని, తాత్పర్యము.

అస్యా వామభుజం శ్లిష్టా యైషా తిష్ఠతి దుర్మనాః. ౨౨
కర్ణికారస్య శాఖేవ శీర్ణపుష్పా వనాంతరే
ఏతస్యాస్తు సుతౌ దేవ్యాః కుమారౌ దేవవర్ణినౌ. ౨౩
ఉభౌ లక్ష్మణశత్రుఘ్నౌ వీరౌ సత్యపరాక్రమౌ

టీక॥ యా=ఏ; ఏషా=ఈబిడ; దుర్మనాః= దుఃఖితమయినమనస్సుగలదై; వనాంతరే=అడవినడుమను ; శీర్ణపుష్పా=రాలినపూలుగల; కర్ణికారస్య= కొండగోఁగుయొక్క; శాఖేవ = కొమ్మవలె; అస్యాః=ఈకౌసల్యయొక్క; వామభుజం=ఎడమభుజంబును ; శ్లిష్టా పట్టుకొన్నదై; తిష్ఠతి=ఉన్నదో; దేవవర్ణినౌ=అశ్వినీదేవతలతోసమానులును ; వీరౌ= పరాక్రమముగలవారలును; సత్యపరాక్రమౌ=సత్యమయినపరాక్రమముగలవారలును; కుమారౌ = చిన్నవారలునగు; లక్ష్మణశత్రుఘ్నౌ=లక్ష్మణుండునుశత్రుఘ్నుండును; ఉభౌ = ఇద్దఱును; ఏతస్యాః=ఈబిడయొక్క; సుతౌతు=కొడుకులే.

దుఃఖితయయి యడవియందు రాలినపూలుగలకొండగోఁగుకొమ్మవలె దీనయయి, యాకౌసల్యయెడమచేయిం బట్టుకొనియున్నదే, యాబిడసుమిత్ర;

అశ్వినీదేవతలతోసమానులును సత్యప రాక్రములునగు లక్ష్మణశత్రుఘ్నులిర్వురును, ఈబిడకొడుకులు.

అని, తాత్పర్యము.

యస్యాః కృతే నరవ్యాఘ్రౌ జీవనాశ మితో గతౌ. ౨౮
రాజా పుత్రవిహీనశ్చ స్వర్గందశరథో గతః
క్రోధనా మకృతప్రజ్ఞాం దృప్తాం సుభగ మానినీమ్; ౨౯
ఐశ్వర్యకామాం కైకేయీ మనార్యా మార్యరూపిణీమ్
మమైతాం మాతరం విద్ధి నృశంసాం పాపనిశ్చయామ్- ౩౦
యతో మూలంహి పశ్యామి వ్యసనం మహదాత్మనః.

టీక॥యస్యాఃకృతే=ఏబిడనిమిత్తమయి;నరవ్యాఘ్రౌ= పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులు;ఇతః=ఇచ్చటనుండి;జీవనాశం = ప్రాణనాశమును;గతౌ= పొందినారో;రాజా=రాజయిన; దశరథశ్చ=దశరథుండును; పుత్రవిహీనశ్చ= కొడుకులచేవిడువఁబడినవాఁడై ; స్వర్గం=స్వర్గమును; గతః=పొందినాఁడో;యతోమూలం= ఏబిడకారణము గాఁగల ("హి" అనునది పాదపూరణార్థము) ; ఆత్మనః = నాయొక్క;మహత్=గొప్పదగు; వ్యసనం= దుఃఖమును ; పశ్యామి = చూచుచున్నానో; ఏతాం =ఈబిడను; క్రోధనాం= కోపముగలదియు; అకృతప్రజ్ఞాం = నేర్పఁబడనిబుద్ధిగలదియు;దృప్తాం = గర్వించినదియు;సుభగమానినీం= సౌందర్యముగలదానిఁగాఁదన్నుఁదలంచు కొనునదియు ; ఐశ్వర్య కామాం=ఐశ్వర్యముఁగోరునదియు;అనార్యాం=దుష్టురాలును; ఆర్యరూపిణీం= పూజ్యురాలిరూపముగలదియు; నృశంసాం = క్రూరురాలును ; పాపనిశ్చయాం= పాపముసేయనిశ్చయముగలదియునగు;మమ = నాయొక్క;మాతరం=తల్లియగు;కైకేయీం=కైకేయినిగా;విద్ధి=ఎఱుంగుము.

ఎవ్వతెనిమిత్తమయి, పురుషశ్రేష్ఠులగురామలక్ష్మణులు మహారణ్యంబునకుఁబోయి జీవనాశంబు నొందినట్లయ్యెరో,దశరథమహారాజునుగొడుకులనువిడిచి స్వర్గంబు నొందెనో , మఱియు నెవ్వతెవలన , నాకిట్టి మహాదుఃఖంబు సంభవించెనో, అట్టికోప

స్వభావురాలును బుద్ధిలేనిదియు సౌందర్యంబు గల దాన నని గర్వించియున్నదియు నైశ్వర్యంబుఁ గోరునదియు దుష్టురాలును యోగ్యురాలువలెఁజూపట్టునదియుఁ గ్రూరురాలునుబాపంబు సేయుస్వభావంబుగలదియునగు , నాతల్లి కైకేయి,యీబిడ;అని,భరతుండు,భరద్వాజునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా నరశార్దూలో బాష్పగద్గదయా గిరా. ౨౭
స నిశశ్వాస తామ్రాక్షో నాగః క్రుద్ధ ఇవ శ్వసన్

టీ॥సః=ఆ;నరశార్దూలః= పురుష శ్రేష్ఠుఁడగు భరతుండు; తామ్రాక్షః = ఎఱ్ఱనికండ్లుగలవాఁడై; ఇతి=ఇట్లు; బాష్పగద్గదయా= కన్నీరుచేడగ్గుత్తికగల;గిరా=మాటచేత; ఉక్త్వా = చెప్పి; క్రుద్ధః= కోపించినదియు ; శ్వసన్=నిట్టూర్పువిడుచుచున్నదియునగు; నాగఇవ= సర్పమువలె; నిశశ్వాస = నిట్టూర్పువిడిచెను.

పురుషశ్రేష్ఠుండగు నాభరతుండు, కన్నులనెఱ్ఱఁదనంబునుడగ్గుత్తికయునుగదుర, నీప్రకారముచెప్పి,కోపంబునొందిన సర్పంబుకరణి, నిట్టూర్పులువిడుచుచునుండెను. అని,తాత్పర్యము.

భరద్వాజో మహర్షి స్తం బ్రువంతం భరతం తథా. ౨౮
ప్రత్యువాచ మహాబుద్ధి రిదం వచన మర్థవత్

టీ॥మహాబుద్ధిః= అధికమయినబుద్ధిగల;మహర్షిః= పూజ్యుఁడయినఋషియగు; భరద్వాజః=భరద్వాజుఁడు; తథా=అట్లు;బ్రువంతం= చెప్పుచున్న; తం=ఆ;భరతం=భరతునిగూర్చి;అర్థవత్ = అధికమయినయర్థముగల;ఇదం=ఈ;వచనం=మాటను; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

మహాబుద్ధిశాలియగు భరద్వాజమహాముని, యట్లుచెప్పుచున్న యాభరతుంజూచి, అధికార్థంబుగలయీమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

న దోషేణావగంతవ్యా కైకేయీ భరత త్వయా. ౨౯

టీ॥ భరత = భరతుఁడా! త్వయా=నీచేత ; కైకేయీ=కైకేయి ;

దోషేణ=దోషము చేత; అవగంతవ్యా=తెలియఁబడఁదగినది; న=కాదు.

భరతుఁడా! నీవు, కైకేయియందు దోషంబున్నదనితలంపవలదు.

అని, తాత్పర్యము.

రామప్రవ్రాజనం హ్యేత త్సుఖోదర్కం భవిష్యతి

టీక॥ ఏతత్= ఈ; రామప్రవ్రాజనం=రామునడవికిఁబంపుట ; సుఖోదర్కం=ముందుసుఖంబుగలిగించునది ; భవిష్యతిహి=కాఁగలదుగదా!

రామునడవికిఁబంపుటవలన , నింక ముందుఁజాలసుఖంబులు గలుగును.

అని, తాత్పర్యము.

దేవానాం దానవానాంచ ఋషీణాం భావితాత్మనామ్. ౩౦
హితమేవ భవిష్యద్ధి రామ ప్రవ్రాజనా దిహ

టీక॥ ఇహ= ఇప్పుడు ; రామప్రవ్రాజనాత్= రామునడవికిఁబంపుటవలన; దేవానాం= దేవతలకును; దానవానాంచ=దానవులకును; భావితాత్మనాం= ధ్యానింపఁబడినయాత్మగల; ఋషీణాంచ=ఋషులకును;హితమేవ= మేలే; భవిష్యద్ధి= కాఁగలదుగదా!

ఇప్పుడు, రామునడవికిఁబంపుటవలన; దేవతలకును దానవులకునుపరమాత్మవేత్తలగుఋషులకునుహితమేకలుగఁగలదు; కావున , దైవప్రేరితయయి కైకేయి యట్లుచెప్పినది కానివేఱుకాదు. అని, భరద్వాజమహాముని , భరతునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

అభివాద్యతు సంసిద్ధః కృత్వాచైనం ప్రదక్షిణమ్. ౩౧
ఆమంత్ర్య భరత స్సైన్యం యుజ్యతా మిత్యచోదయత్

టీక॥భరతః = భరతుఁడు;ఏనం= ఈభరద్వాజ మహర్షిని; అభివాద్యతు=నమస్కరించియు; సంసిద్ధః=సిద్ధిఁబొందినవాఁడై,యాశీర్వాదంబునొందినవాఁడైయనుట; ప్రదక్షిణం=ప్రదక్షిణమును;కృత్వాచ = చేసియు;సైన్యం= సైన్యమును;ఆమంత్ర్య= పిలిచి; యుజ్యతాం = సన్నాహము సేయఁబడుఁ

గాక. ఇతి=అని; అచోదయత్=ఆజ్ఞాపించెను.

భరతుండు, భరద్వాజమహర్షికి నమస్కరించి, యాశీర్వాదంబుగొని, యానకుం బ్రదక్షిణంబు గావించి, సైన్యంబుం బిలిచి, ప్రయాణంబునకు సన్నాహంబు గావింపుండని యాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

తతో వాజిరథాన్ యుక్తాన్ దివ్యాన్ హేమపరిష్కృతాన్. ౩౨
అధ్యారోహ త్ప్రయాణార్థీ బహూన్ బహువిధో జనః

టీక॥ తతః=అంత; బహువిధః= పెక్కువిధములయిన; జనః = జనము; ప్రయాణార్థీ = పయనముంగోరినదై; హేమపరిష్కృతాన్=బంగారముచేనలంకరింపఁబడిన; దివ్యాన్=శ్రేష్ఠములయిన; యుక్తాన్=సన్నద్ధములగు; వాజిరథాన్=గుఱ్ఱపురథములను; అధ్యారోహత్=ఎక్కెను.

అంత, సేనయందలి జనులు, పయనమయి, నానావిధంబులుగా, బంగారముచేనలంకరింపఁబడిన దివ్యంబులయినగుఱ్ఱపుబండ్లనెక్కెరి. అని, తాత్పర్యము.

గజకన్యా గజాశ్చైవ హేమకక్ష్యాః పతాకినః. ౩౩
జీమూతా ఇవ ఘర్మాంతే సఘోషా స్సంప్రతస్థిరే

టీక॥ గజకన్యాః=ఆఁడేనుంగులును; గజాశ్చైవ = ఏనుంగులును; హేమకక్ష్యాః= బంగారునడిమిత్రాఁడుగలవై; పతాకినః = పెకెక్కములుగలవై; ఘర్మాంతే=వర్షఋతువునందు; జీమూతాఇవ=మేఘములువలె; సఘోషాః=ధ్వనితోఁగూడినవై; సంప్రతస్థిరే=బయలుదేఱినవి.

అంత, నాఁడేనుంగులును మగయేనుంగులును, బంగారుతోఁజేయఁబడిననడిమిత్రాటితోను పెక్కెంబులతోను గూడినవై, వర్షాకాలంబున మేఘంబులువలె, గర్జించుచు, బయలుదేఱినవి.

అని, తాత్పర్యము.

వివిధాన్యపి యానాని మహాంతిచ లఘూనిచ. ౩౪
ప్రయయు స్సుమహార్హాణి పాదై రేవ పదాతయః




టీక॥ వివిధాని= నానావిధములయినవి; మహాంతిచ= గొప్పవియు; లఘూనిచ=చిన్నవియునగు; సుమహార్హాణి = మిక్కిలియు శ్రేష్ఠములయిన; యానాని=వాహనములు; యయుః= పోయినవి. పదాతయః= కాలిబంటులు; పాదైరేవ=కాళ్లచేతనె; ప్రయయుః (అధ్యాహృతము)=పోయిరి!

పెద్దవియుఁ జిన్నవియు నానావిధములయిన యుత్తమములగు వాహనములు బయలుదేఱినవి; పదాతులు, పాదంబులనే నడచుచుఁ బోయిరి.

అని, తాత్పర్యము.

అథ యాన ప్రవేకైస్తు కౌసల్యాప్రముఖాః స్త్రియః. ౩౫
రామదర్శనకాంక్షిణ్యః ప్రయయు ర్ముదితా స్తదా

టీక॥ అథ=అంత; తదా= అప్పుడు; కౌసల్యాప్రముఖాః= కౌసల్యమొదలుగాఁగల; స్త్రియస్తు=స్త్రీలు; రామదర్శనకాంక్షిణ్యః= రామదర్శనంబుఁగోరుచు; ముదితాః = సంతసించినవారలయి; యానప్రవేకైః= వాహనశ్రేష్ఠములచేత; ప్రయయుః=పోయిరి.

అంత, నప్పుడు, కౌసల్యమొదలగు స్త్రీలును, రాముంజూడఁగలుగునని సంతుష్టలయి, యుత్తమంబులగు వాహనంబులనారోహించి, పోయిరి.

అని, తాత్పర్యము.

చంద్రార్కతరుణాభాసాం నిర్యుక్తాం శిబికాం శుభామ్. ౩౬
ఆస్థాయ ప్రయయౌ శ్రీమాన్ భరత స్సపరిచ్ఛదః

టీక॥ శ్రీమాన్=అధికమయినకాంతిగల; భరతః=భరతుఁడు; చంద్రార్కతరుణాభాసాం= యౌవనముగలచంద్రసూర్యులకాంతివంటికాంతిగలదియు; నిర్యుక్తాం= ఆయత్తంబుగాఁజేయఁబడినదియునగు; శుభాం=మంగళకరంబగు; శిబికాం=పల్లకిని; ఆస్థాయ=అధిష్ఠించి; సపరిచ్ఛదః = పరివారముతోఁగూడినవాఁడై; ప్రయయౌ=పోయెను.

శ్రీమంతుండగు భరతుండు, చంద్రసూర్యులకాంతివంటికాంతిగలదియు మంగళకరంబునగు సజ్జీకృతంబయిన పల్లకినెక్కి పరివారసమేతుండై పోయెను.

అని, తాత్పర్యము.




సా ప్రయాతా మహాసేనా గజవాజిరథాకులా. ౩౭
దక్షిణాం దిశ మావృత్య మహామేఘఇవో త్థితః
వనాని తువ్యతిక్రమ్య జుష్టాని మృగపక్షిభిః. ౩౮
గంగాయాః పరవేలాయాం గిరిష్వపి నదీషుచ

టీక॥ గజవాజిరథాకులా= ఏనుంగులచేతను గుఱ్ఱంబులచేతను రథంబులచేతనునిండిన; సా=ఆ;మహాసేనా=గొప్పసేన; గంగాయాః = గంగానదియొక్క; పరవేలాయాం= ఆవలిగట్టునందు ; దక్షిణాం = దక్షిణపు ; దిశం=దిక్కును; ఆవృత్య=ఆవరించి; ఉత్థితః=లేచిన; మహామెఘఇవ= గొప్పమేఘమువలె ; గిరిష్వపి=పర్వతంబులందును; నదీషుచ=ఏఱులందును; మృగపక్షిభిః= మృగంబులచేతనుబత్తులచేతను; జుష్టాని=సేవింపఁబడిన ; వనాని=అరణ్యంబులను; వ్యతిక్రమ్యతు = దాఁటియు ; ప్రయాతా = పోయినది.

ఏనుంగులునుగుఱ్ఱంబులును రథంబులును మెండుగానిండియున్న , యామహాసేన , గంగా నది దక్షిణపు గట్టునందు , ఉత్తరదిక్కుననుండిదక్షిణదిక్కునకువచ్చుమహామేఘంబుకరణి,దక్షిణదిక్కునావరించి,పర్వతంబులందునునదులందును,మృగంబులతోనుబత్తులతోనుంగూడిన, వనంబులనతిక్రమించి, పోయినది. అని, తాత్పర్యము.

సా సంప్రహృష్టద్విపవాజియోధా
విత్రాసయంతీ మృగపక్షిసంఘాన్. ౩౯
మహద్వనం తత్ప్రతిగాహమానా
రరాజ సేనా భరతస్య తత్ర

టీక॥తత్ర=అప్పుడు;సంప్రహృష్టద్విపవాజియోధా= మిక్కిలియుసంతోషమునొందినయేనుంగులునుగుఱ్ఱంబులును భటులునుగల; భరతస్య=భరతునియొక్క;సా=ఆ;సేనా=సేన;తత్ = ఆ; మహత్=గొప్పదగు;వనం= అడవిని; ప్రతిగాహమానా=ప్రవేశించుచు; మృగపక్షిసంఘాన్ = మృగంబులయొక్కయుఁబత్తులయొక్కయుసమూహంబులను;విత్రాసయంతీ = వెఱపించుచు;ర

రాజ=ప్రకాశించినది.

అప్పుడు, ఏనుంగులునుగుఱ్ఱంబులును భటులునుమిక్కిలియుసంతోషంబునొందియుండుటంజేసి, యాభరతునిసేనయు మహావనంబునందు, సింహనాదంబులచే, మృగపక్షులను వెఱపించుచు, నెంతయునొప్పుచుండినది.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, అయోధ్యాకాండే, ద్వినవతితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ ద్వినవతితమసర్గటీక, ముగిసినది.



శ్రీ

## త్రిణవతితమసర్గప్రారంభః

తయా మహత్యా యాయిన్యా ధ్వజిన్యా వనవాసినః
అర్దితా యూథపా మత్తా స్సయూథాస్సంప్రదుద్రువుః. ౧

టీక॥ యాయిన్యా=పోవుచున్న; మహత్యా=గొప్పదగు; తయా=ఆ; ధ్వజిన్యా=సేనచేత; వనవాసినః = అడవియందుండునట్టి; మత్తాః=మదించిన; యూథపాః=సమూహములంబాలించునట్టియేనుంగులు; అర్దితాః=భయపఱుపఁబడినవై; సయూథాః=గుంపులతోఁగూడినవై; సంప్రదుద్రువుః=పఱుగెత్తినవి.

అట్లు, పోవుచున్న యాగొప్పసేనంజూచి, యడవులందుండు మదించినగజయూథపంబులు, భయపడి, గజయూథంబులతోఁ బఱుగెత్తినవి.

అని, తాత్పర్యము.

ఋక్షాః పృషత సంఘాశ్చ రురవశ్చ సమంతతః
దృశ్యంతే వనరాజీషు గిరిష్వపి నదీషుచ. ౨

టీక॥ వనరాజీషు = వనసమూహం బులందును; గిరిష్వపి = పర్వతములయం దును; నదీషుచ = ఏఱులయందును; సమంతతః = అంతటను; ఋక్షాః = ఎలుఁగుగొడ్డులును; పృషతసంఘాశ్చ = చుక్కలుగలజింకల సమూహములును; రురవశ్చ = చుక్కలులేని పెద్ద శరీరము నువికటంబులగు కొమ్ములునుగలజింకలు ను; దృశ్యంతే = చూడఁబడుచుండినవి.

అడవులయందును బర్వతంబులయందును నదులయందును అంతటను, ఎలుఁగుగొడ్డులను దేహమునందుఁ జుక్కలు గలజింకలను జుక్కలులేక పెద్దశరీరంబునువికటంబులగుకొమ్ములునుగల జింకలనుంజూచుచుఁబోయిరి.

అని, తాత్పర్యము.

స సంప్రతస్థే ధర్మాత్మా ప్రీతో దశరథాత్మజః
వృతో మహత్యా నాదిన్యా సేనయా చతురంగయా. ౩

టీక॥ ధర్మాత్మా = ధర్మస్వభావుండును; దశరథాత్మజః = దశరథుని కుమారుండునగు; సః = ఆభరతుండు; ప్రీతః = సంతసించినవాఁడై; నాదిన్యా = ధ్వనించుచున్న; చతురంగయా = నాలుగంగములుగల; మహత్యా = గొప్పదగు; సేనయా = సేనచే; వృతః = చుట్టఁబడినవాఁడై; సంప్రతస్థే = పోయెను.

ధర్మాత్ముండు దశరథపుత్రుండు నగు నాభరతుండు, సంతుష్టుండై, మహాధ్వనితోఁ గూడిన గొప్ప సైన్యము చేఁబరివేష్టితుండై, పోయెను.

అని, తాత్పర్యము.

సాగరౌఘనిభా సేనా భరతస్య మహాత్మనః
మహీం సంఛాదయామాస ప్రావృషి ద్యామివాంబుదః. ౪

టీక॥ మహాత్మనః = పూజ్యమయిన స్వభావముగల; భరతస్య = భరతునియొక్క; సాగరౌఘనిభా = సముద్రప్రవాహముతో సమానమయిన; సేనా = సేన; ప్రావృషి = వర్షాకాలమునందు, అంబుదః = మేఘము; ద్యామివ = ఆకాశము నువలె; మహీం = భూమిని; సంఛాదయామాస = ఆవరించెను.

మహాత్ముండగు నాభరతుని, సముద్రంబువంటిగొప్పసేన, వర్షాకాలం

బున మేఘంబాకాశమునావరించునట్లు।భూమినావరించి,నడచినది.

అని, తాత్పర్యము.

తురంగౌఘై రవతతా వారణైశ్చ మహాజవైః
అనాలక్ష్యా చిరంకాలం తస్మిన్ కాలే బభూవ భూః. ౫

టీక॥తస్మిన్=ఆ;కాలే= కాలమునందు;భూః=భూమి;మహాజవైః=అధికమయినవేగముగల;తురంగౌఘైః=గుఱ్ఱములయొక్క సమూహముల చేతను; వారణైశ్చ = ఏనుంగులచేతను;అవతతా=వ్యాపింపఁబడినదై; చిరంకాలం=బహుకాలము; అనాలక్ష్యా=చూడరానిది;బభూవ=అయినది.

అప్పుడుభూమి,అధిక వేగంబుగలగుఱ్ఱంబులచేతను ఏనుంగులచేతనుగప్పఁబడినదై, బహుకాలమువఱకుఁగానరాకయెయుండినది.అని,తాత్పర్యము.

స యాత్వా దూరమధ్వానం సుపరిశ్రాంత వాహనః
ఉవాచ భరత శ్శ్రీమాన్ వసిష్ఠం మంత్రిణాం వరమ్. ౬

టీక॥శ్రీమాన్=అధికమయినకాంతిగల;సః=ఆ;భరతః=భరతుఁడు; దూరం=దూరమయిన;అధ్వానం = మార్గమును;యాత్వా = పొంది;సుపరిశ్రాంతవాహనః= మిక్కిలియునలసటనొందినవాహనంబులుగలవాఁడై; మంత్రిణాం=మంత్రులలో;వరం= శ్రేష్ఠుఁడగు;వసిష్ఠం = వసిష్ఠునిగూర్చి;ఉవాచ=చెప్పెను.

శ్రీమంతుండగు నాభరతుండు, అట్లు, వాహనంబులలసటనొందఁ,గొంతదూరంబుపోయి, మంత్రిశ్రేష్ఠుండగు వసిష్ఠుంజూచి, యిట్లని,చెప్పెను.

అని,తాత్పర్యము.

యాదృశం లక్ష్యతే రూపం యథాచైవ శ్రుతం మయా
వ్యక్తం ప్రాప్తాస్మ తం దేశం భరద్వాజోయ మబ్రవీత్. ౭

టీక॥ యాదృశం=ఎట్టి; రూపం = ఆకారము ; లక్ష్యతే = ఊహింపఁబడునో; యథాచైవ = ఎట్లును ; మయా=నాచేత;శ్రుతం=వినఁబడినదో;

యం=దేనిని; భరద్వాజః= భరద్వాజమహర్షి ; అబ్రవీత్ = చెప్పెనో; తం=ఆ; దేశం= ప్రదేశమును; ప్రాప్తాః=పొందినవారము; స్మ(స్మః) = అగుచున్నాము, వ్యక్తం=స్పష్టము.

మనము మొదట నెట్లు, ఊహించితిమో, నేనెట్లువినియున్నానో, భరద్వాజమహాముని యెట్లుమనకుఁ జెప్పెనో, అట్టిప్రదేశమునకువచ్చినాము; ఇది స్పష్టము;చూడు. అని, తాత్పర్యము.

అయం గిరి శ్చిత్రకూట ఇయం మందాకినీ నదీ
ఏత త్ప్రకాశతే దూరా న్నీలమేఘనిభం వనమ్. ౮

టీక॥ అయం=ఈ ; గిరిః=పర్వతము; చిత్రకూటః= చిత్రకూటపర్వతము. ఇయం=ఈ; నదీ = ఏఱు; మందాకినీ=మందాకిని; దూరాత్= దూరంబున; నీలమేఘనిభం = నల్లనిమేఘముతోసమానమయిన; ఏతత్ = ఈ; వనం=వనము ; ప్రకాశతే = ప్రకాశించుచున్నది.

ఇదిగో! ఈపర్వతమె చిత్రకూటపర్వతము ; ఇదేమందాకినియనునది;ఇదిగో, దూరంబున , నల్లనిమేఘంబువంటి, వనంబునుగనుపట్టుచున్నది.

అని, తాత్పర్యము-

గిరే స్సానూని రమ్యాణి చిత్రకూటస్య సంప్రతి
వారణై రవమృద్యంతే మామకైః పర్వతోపమైః. ౯

టీక॥ సంప్రతి = ఇప్పుడు; మామకైః=నావైన; పర్వతోపమైః= కొండలతోఁబోలికగల; వారణైః= ఏనుంగులచేత; చిత్రకూటస్య = చిత్రకూటమను; గిరేః = పర్వతముయొక్క; రమ్యాణి=సుందరములగు; సానూని=నెత్తములు; అవమృద్యంతే= మర్దింపఁబడుచున్నవి,

ఇదిగో? చూడు; కొండలవంటినా యేనుంగులు,ఇప్పుడు, సుందరంబులగు చిత్రకూటపర్వతము నెత్తములనే ,త్రొక్కి-మర్దించుచున్నవి.

అని, తాత్పర్యము.

ముంచంతి కుసుమా న్యేతే నగాః పర్వతసానుషు

నీలాఇవా తపాపాయే తోయం తోయ ధరా ఘనాః. ౧౦.

టీక॥ ఏతే=ఈ; నగాః= వృక్షములు, పొగడచెట్లనుట; ఆతపాపాయే= వర్షఋతువునందు; నీలాః = నల్లనివయిన; ఘనాః=గొప్పవగు ; తోయధరాః=మేఘములు; తోయమివ=జలమునువలె; పర్వతసానుషు= కొండనెత్తములందు; కుసుమాని=పూలను; ముంచంతి=విడుచుచున్నవి.

వర్షాకాలంబున , నల్లనిమేఘంబులు, నీళ్లువిడుచునట్లు , ఈపొగడచెట్లు, కొండనెత్తములందుఁ, బుష్పంబులవిడుచుచున్నవి, చూడుము. అని,వసిష్ఠునితోఁజెప్పెను. అని,తాత్పర్యము.

కిన్నరా చరితం దేశం పశ్య శత్రుఘ్నపర్వతమ్
మృగై స్సమంతా దాకీర్ణం మకరైరివ సాగరమ్. ౧౧

టీక॥శత్రుఘ్న=శత్రుఘ్నుఁడా! సమంతాత్=అంతటను;మృగైః= మృగములచేత;ఆకీర్ణం= వ్యాపింపఁబడినదియు; మకరైః = మొసళ్లచేత; ఆకీర్ణం(అధ్యాహృతము)= వ్యాపింపఁబడిన;సాగరమివ(స్థితం)= సముద్రమువలెనున్నదియునగు;కిన్నరాచరితం= కిన్నరులచేసంచరింపఁబడిన; దేశం= ప్రదేశమయిన; పర్వతం=చిత్రకూటపర్వతమును;పశ్య=చూడుము.

శత్రుఘ్నుఁడా!సముద్రంబుమొసళ్లచేనిండియుండునట్లు,మృగంబులచేనిండిన,కిన్నరసంచారముగల, యీచిత్రకూటపర్వతముంజూడుము.

అని, తాత్పర్యము.

ఏతే మృగగణా భాంతి శీఘ్రవేగాః ప్రచోదితాః
వాయు ప్రవిద్ధా శరది మేఘరాజి రివాంబరే. ౧౨

టీక॥శరది=శరదృతువునందు; అంబరే= ఆకాశమునందు; వాయుప్రవిద్ధా=వాయువుచేఁగొట్టఁబడిన; మేఘరాజిరివ = మేఘసమూహమువలె;ఏతే=ఈ;మృగగణాః = జింకలసమూహములు; ప్రచోదితాః=ప్రేరింపఁబడి

నవై; శీఘ్రవేగాః = శీఘ్రమయిన వేగముగలవై; భాంతి = ప్రకాశించుచున్నవి.

శరదృతువునందు వర్షము గురిసితేలిక గానుండు మేఘంబులు, వాయుప్రేరితంబులయి యాకాశంబున నతివేగంబుగాఁబోవునట్లు, ఈ జింకలు, మనసైనికులచే దఱుమఁబడినవై, యతివేగంబుగాఁ బరుగెత్తుచున్నవి, చూడుము.

అని, తాత్పర్యము.

కుర్వంతి కుసుమాపీడాన్ శిరస్సు సురభీ నమీ
మేఘప్రకాశైః ఫలకై ర్దాక్షిణాత్యా యథానరాః. ౧౩

టీక॥ అమీ = ఈ వృక్షములు; మేఘప్రకాశైః = మేఘముయొక్క కాంతివంటి కాంతిగల; ఫలకైః = పలకలచే; దాక్షిణాత్యాః = దక్షిణదేశమునందుండునట్టి; నరాయథా = మనుష్యులవలె; శిరస్సు = తలలందు; కుసుమాపీడాన్ = పుష్పశేఖరములను; కుర్వంతి = చేయుచున్నవి, ధరించుచున్నవనుట.

దాక్షిణాత్యులు మేఘంబువంటి వెండ్రికలను పలకలుగాఁ దీర్చియందుఁ బుష్పంబులు దాల్చునట్లు, ఈ వృక్షంబులును, మేఘసమానంబగు శిఖరంబునఁ, బుష్పంబులు దాల్చియున్నవి.

అని, తాత్పర్యము.

నిషూర్జ మివ భూత్వేదం వనం ఘోర ప్రదర్శనమ్
అయోధ్యేవ జనాకీర్ణా సంప్రతి ప్రతిభాతి మాం. ౧౪

టీక॥ ఘోరప్రదర్శనం = భయంకరంబగు చూచుటగల; ఇదం = ఈ; వనం = అడవి; పురా (అధ్యాహృతము) = మున్ను; నిషూర్జమివ = మనుష్యధ్వనిలేనిదిగానే; భూత్వా = అయి; సంప్రతి = ఇప్పుడు; మాం = నన్నుఁగూర్చి; జనాకీర్ణా = జనులచే వ్యాపింపఁబడిన; అయోధ్యేవ = అయోధ్యవలె; ప్రతిభాతి = తోఁచుచున్నది.

భయంకరంబగు నీయరణ్యంబు, మున్నుమనుష్యుల చప్పుడే లేనిదిగా నుండియుండవచ్చును; ఇప్పుడు, నాకిది జనులచే నిండిన యయోధ్యానగరంబు పగిదింగాన్పించుచున్నది.

అని, తాత్పర్యము.

ఖురై రుదీరితో రేణు ర్దావం ప్రచ్ఛాద్య తిష్ఠతి
"దివం ప్రచ్ఛాద్యతిష్ఠతి" ఇతిపాఠాంతరం.
తం వహ త్యనిల శ్శీఘ్రం కుర్వన్నివ మమ ప్రియమ్. ౧౫

టీక॥ ఖురైః = గిట్టలచేత ; ఉదీరితః = ఎగురగొట్టఁపడిన; రేణుః = పరాగము; దావం = అరణ్యమును (పాఠాంతరపక్షమందు) దివం = ఆకాశమును; ప్రచ్ఛాద్య = ఆవరించి; తిష్ఠతి = ఉన్నది. తం = ఆపరాగమును; అనిలః = వాయువు; మమ = నాకు; ప్రియం = సంతోషమును; కుర్వన్నివ = చేయువాఁడువలె; శీఘ్రం = శీఘ్రముగా; వహతి = కొనిపోవుచున్నాఁడు.

గుఱ్ఱంబులు, మొదలగువాని పాదఘట్టనము వలన రేఁగిన పరాగంబు ఏమియు గానరానట్లు, అరణ్యంబంతయు (ఆకాశంబంతయు) నావరించు చున్నది; అట్లుండిన, నాకు రామాశ్రమంబుఁ జూడనలవిగాదు కావున, వాయుదేవుండు, నాకు సంతోషంబు సేయుటకుంబోలె, శీఘ్రంబుగ నాపరాగముం జాఱఁదోలుచున్నాఁడు. అని, తాత్పర్యము.

స్యందనాం స్తు రగోపేతా న్సూతముఖ్యై రధిష్ఠితా న్
ఏతా న్సంపతత శ్శీఘ్రం పశ్య శత్రుఘ్న కాననే. ౧౬

టీక॥ శత్రుఘ్న = శత్రుఘ్నుఁడా! సూతముఖ్యైః = సారథిశ్రేష్ఠులచేత ; అధిష్ఠితాన్ = అధిష్ఠింపఁబడినవియు; తురగోపేతాన్ = గుఱ్ఱములతోఁగూడినవియు; కాననే = అడవియందు; శీఘ్రం = శీఘ్రముగా; సంపతతః = పోవుచున్నవి యునగు; ఏతాన్ = ఈ; స్యందనాంస్తు = రథములను; పశ్య = చూడుము.

శత్రుఘ్నుఁడా! ఉత్తములగు సారథులు, రామదర్శనకౌతుకంబున, నడవియందు, గుఱ్ఱపురథంబులను శీఘ్రముగాఁ, దోలుచున్నారు-చూడుము-

అని, తాత్పర్యము.

ఏతా న్విత్రాసితా న్పశ్య బర్హిణః ప్రియదర్శనాన్
ఏత మావిశత శ్శీఘ్ర మధివాసం పతత్రిణః. ౧౭



టీక॥విత్రాసితాన్=వెఱపింపఁబడినవియు; శీఘ్రం=శీఘ్రముగా; ఏతం=ఈ; అధివాసం=నివాసస్థానమును; ఆవిశతః=ప్రవేశించుచున్నవియు; పతత్రిణః=మంచిఱెక్కలుగలవియు; ప్రియదర్శనాన్=సంతోషకరంబులగుచూచుటగలవియునగు; ఏతాన్=ఈ; బర్హిణః=నెమళ్లను; పశ్య=చూడుము.

మంచిఱెక్కలుగలవియుఁజూపరులకుసంతోషంబు గలిగించునవియునగు నీమయూరంబులు, ఈరథంబులధ్వనికిభయముపడి, శీఘ్రంబునఁదమనెలవులం జేరుచున్నవి, చూడుము. అని, తాత్పర్యము.

అతిమాత్ర మయం దేశో మనోజ్ఞః ప్రతిభాతి మా
తాపసానాం నివాసోయం వ్యక్తం స్వర్గ పథో యథా. ౧౮

టీక॥అయం=ఈ; దేశః=ప్రదేశము; అతిమాత్రం=మిక్కిలియు; మనోజ్ఞః=మనోహరంబయినది. మా=నన్నుఁగూర్చి; స్వర్గపథోయథా=స్వర్గమార్గమువలె; ప్రతిభాతి=తోఁచుచున్నది. అయం=ఈప్రదేశము; తాపసానాం=ఋషులయొక్క; నివాసః=నివాసస్థానము. వ్యక్తం=స్పష్టము.

ఈమార్గము, మిక్కిలియుమనోహరముగానున్నది; నాకు, స్వర్గమార్గంబోయనితోఁచుచున్నది; కావున, నిది, ఋషులుండుస్థలంబనుటస్పష్టము. అని, తాత్పర్యము.

మృగా మృగీభి స్సహితా బహవః పృషతా వనే
మనోజ్ఞరూపా లక్ష్యంతే కుసుమైరివ చిత్రితాః. ౧౯

టీక॥వనే=అడవియందు; బహవః=పెక్కులయిన; పృషతాః=తెల్లచుక్కలుగల; మృగాః=జింకలు; మృగీభిః=ఆఁడుజింకలతో; సహితాః=కూడినవై; మనోజ్ఞరూపాః=మనోహరంబగునాకారంబులుగలవై; కుసుమైః=పూలచేత; చిత్రితాఇవ=చిత్రములుగాఁజేయఁబడినవివలె; లక్ష్యంతే=చూడఁబడుచున్నవి.

అడవియందుఁ, దెల్లచుక్కలుగలజింకలనేకంబులుఆఁడు జింకలంగూడి, మేనంబుష్పంబులు చల్లఁబడియుండునట్లు, మనోహరంబుగాఁ జూపట్టుచున్నవి; చూడుము. అని, తాత్పర్యము.



సాధు సైన్యాః ప్రతిష్ఠంతాం విచిన్వంతుచ కాననే
యథా తౌ పురుషవ్యాఘ్రౌ దృశ్యేతే రామలక్ష్మణౌ. ౨౦

టీక॥ యథా=ఎట్లు; తౌ=ఆ; పురుషవ్యాఘ్రౌ=పురుషశ్రేష్ఠులగు; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు; దృశ్యేతే=చూడఁబడుదురో; తథా(అధ్యాహృతము)=అట్లు; సైన్యాః=సైనికులు; ప్రతిష్ఠంతాం=పోవుదురుగాక. కాననే=అడవియందు; సాధు=లెస్సగా; విచిన్వంతు=వెదకుదురుగాక.

పురుషశ్రేష్ఠులగునా రామలక్ష్మణులు లగపడునట్లు, సైనికులుపోయి, యరణ్యంబుననంతయుఁజక్కఁగా వెదకుదురుగాక. అని, భరతుండు, చెప్పెను.

అని, తాత్పర్యము.

భరతస్య వచ శ్శ్రుత్వా పురుషా శ్శస్త్రపాణయః
వివిశు స్తద్వనం శూరా ధూమంచ దదృశు స్తతః. ౨౧

టీక॥ భరతస్య=భరతునియొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని; శూరాః=యుద్ధమునందుభయంబులేనట్టి; పురుషాః=పురుషులు; శస్త్రపాణయః=ఆయుధములుహస్తములందుఁగలవారలై; తత్=ఆ; వనం=అడవిని, వివిశుః=ప్రవేశించిరి. తతః=అంత; ధూమంచ=పొగను; దదృశుః=చూచిరి.

భరతునిమాటనువిని, శూరులగు పురుషులుకొందఱు, ఆయుధపాణులయి; యాయడవింబ్రవేశించి, యంతంగొంతవడికి, ధూమంబుఁబొడగనిరి.

అని, తాత్పర్యము.

తే సమాలోక్య ధూమాగ్ర మూచు ర్భరత మాగతాః

టీక॥ తే=వారలు; ధూమాగ్రం=పొగయొక్కకొనను; సమాలోక్య=చూచి; ఆగతాః=వచ్చినవారలయి; భరతం=భరతునిగూర్చి; ఊచుః=చెప్పిరి.

అట్లు, వారలు, ధూమశిఖంబొడగాంచి, మఱలభరతునొద్దకువచ్చి, యిట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

నామనుష్యే భవత్యగ్ని ర్వ్యక్త మత్రైవ రాఘవౌ. ౨౨

టీక॥ అమనుష్యే= మనుష్యులు లేని ప్రదేశమునందు; అగ్నిః=నిప్పు; నభతి=ఉండదు. అత్రైవ=ఇచ్చటనే; రాఘవౌ = రామలక్ష్మణులు; తిష్ఠతః(అధ్యాహృతము)=ఉన్నారు. వ్యక్తం=స్పష్టము-

మనుష్యులు లేనిప్రదేశమునందు, అగ్నియుండదు; కావున, నిచ్చటనే రామలక్ష్మణులున్నారు; స్పష్టము.

అని, తాత్పర్యము.

అథవాత్ర నరవ్యాఘ్రౌ రాజపుత్రౌ పరంతపౌ
మన్యే రామోపమా స్సంతి వ్యక్త మత్ర తపస్వినః. ౨౩

టీక॥ అథవా=అటుగాదేని ; నరవ్యాఘ్రౌ=పురుషశ్రేష్ఠులును ; పరంతపౌ=శత్రువులఁదపింపఁజేయువారలునగు;రాజపుత్రౌ=రాచకొమరులగు రామలక్ష్మణులు; నస్తోయది (అధ్యాహృతము)=ఉండరేని;రామోపమాః=రామునితోఁబోలికగల; తపస్వినః = ఋషులు; అత్ర=ఇచ్చట; సంతి= ఉన్నారు. మన్యే = తలంచెదము. వ్యక్తం=స్పష్టము-

ఒకవేళఁ,బురుషశ్రేష్ఠులును, శత్రువులందపింపఁజేయువారలునగు రామలక్ష్మణులు లేకున్నను, ఇచ్చట, రామునితోసమానులగు మునులయినను, ఉన్నారు; ఇందుసందియములేదు; అనితలంచెదము- అని,యాపురుషులుభరతునకుఁజెప్పిరి. అని, తాత్పర్యము-

తచ్ఛ్రుత్వా భరత స్తేషాం వచనం సాధుసమ్మతమ్
సైన్యా నువాచ సర్వాం స్తా నమిత్రబలమర్దనః. ౨౪

టీక॥ అమిత్రబలమర్దనః= శత్రుసైన్యములనుమర్దించునట్టి;భరతః= భరతుఁడు;తేషాం=వారలయొక్క; సాధుసమ్మతం=పెద్దలకు సమ్మతమయిన; తత్ =ఆ;వచనం=మాటను;శ్రుత్వా=విని;తాన్ =ఆ;సైన్యాన్= సైనికులను; సర్వాన్=అందఱనుగూర్చి ; ఉవాచ= చెప్పెను.

శత్రుసైన్యంబులనుమర్దించునట్టిభరతుండు వారలు చెప్పినసాధుసమ్మతం

బగుమాటనువిని, సైనికులనందఱంజూచి యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

యత్తా భవంత స్తిష్ఠంతు నేతో గంతవ్య మగ్రతః
అహమేవ గమిష్యామి సుమంత్రో గురు రేవచ. ౨౫

టీక॥ భవంతః=మీరలు; యత్తాః=నిశ్శబ్దులరై; తిష్ఠంతు=ఉందురుగాక. ఇతః = ఇఁక; అగ్రతః=ముందు; నగంతవ్యం=పోవుటగూడదు. అహమేవ=నేనుమాత్రమే; గమిష్యామి= పోయెదను. సుమంత్రః=సుమంత్రుఁడును; గురురేవచ=వసిష్ఠుండునుమాత్రమె; గమిష్యతః (అధ్యాహృతము) = పోయెదరు.

మీరలు, ఇచ్చట నేనిశ్శబ్దంబుగా నుండుఁడు; ఇంతకుఁబైని మీరు రావలదు; నేనును సుమంత్రుండును వసిష్ఠుండును మాత్రమె, పోయెదము. అని, భరతుండు, సైనికులకాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తా స్తత స్సర్వే తత్ర తస్థు స్సమంతతః

టీక॥ సర్వే=అందఱును; ఏవం= ఇట్లు; ఉక్తాః=చెప్పఁబడినవారలై; తతః=అంత; తత్ర=అచ్చట; సమంతతః=అంతటను; తస్థుః=ఉండిరి.

ఆసైనికులందఱు, ఇట్లాజ్ఞాపింపఁబడినవారలై, యచ్చట నేయుండిరి.

అని, తాత్పర్యము.

భరతో యత్ర ధూమాగ్రం తత్ర దృష్టిం సమాదధాత్. ౨౬

టీక॥ భరతః=భరతుఁడు; యత్ర=ఎచ్చట; ధూమాగ్రం=పొగకొనయో; తత్ర=అచ్చట; దృష్టిం=చూపును; సమాదధాత్=ధరించెను.

అంత, భరతుండు, ఆధూమశిఖ కనుపడినస్థలంబును, నిదానించి, చూచెను.

అని, తాత్పర్యము.

వ్యవస్థితా యా భరతేన సా చమూ

నిరీక్షమాణాపిచ ధూమ మగ్రతః
బభూవ హృష్టా నచిరేణ జానతీ
ప్రియస్య రామస్య సమాగమం తదా. ౨౭

టీక॥యా=ఏసేన;భరతేన=భరతుని చేత;వ్యవస్థితా = నిలుపఁబడినదో; సా=ఆ;చమూః=సేన;తదా = అప్పుడు;నచిరేణ=శీఘ్రముననే; ప్రియస్య=ఇష్టుండగు;రామస్య=రామునియొక్క; సమాగమం=చేరుటను; జానతీ=ఎఱింగినదై;హృష్టా=సంతసించినదై; అగ్రతః=ముందట;ధూమం=పొగను; నిరీక్షమాణాపిచ = చూచుచును;బభూవ= ఉండినది.

అప్పుడు,భరతునిచేనిల్వరింపఁబడిన సైనికులును,ఇంకశీఘ్రింబుననె,ప్రియుండగు రాముంజూడఁగల్గునని, యెఱింగి, సంతుష్టులయి,విడువకయాధూమశిఖనే చూచుచుండిరి.అని,తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, త్రిణవతితమస్సర్గః.

ఇది,స్పష్టార్ధము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు,అయోధ్యాకాండ త్రిణవతితమసర్గటీక, ముగిసినది.

౯౪

చతుర్నవతితమసర్గప్రారంభః.

దీర్ఘకాలోషిత స్తస్మి౯ గిరౌ గిరివనప్రియః
వైదేహ్యాః ప్రియ మాకాంక్ష౯ స్వంచ చిత్తం విలోభయ౯. ౧
అథ దాశరథి శ్చిత్రం చిత్రకూట మదర్శయత్
భార్యా మమరసంకాశ శ్శచీ మివ పురందరః. ౨

టీక॥ అథ=అటుపిమ్మట; అమరసంకాశః=దేవతతోసమానుండును; గిరివనప్రియః= గిరులయందునుఅరణ్యంబులయందును బ్రీతిగలవాఁడునగు; దాశరథిః=రాముండు; తస్మి౯=ఆ; గిరౌ=చిత్రకూటపర్వతమునందు; దీర్ఘకాలోషితః = బహుకాలమువాసముచేసినవాఁడై; వైదేహ్యాః=సీతాదేవియొక్క; ప్రియం=సంతోషమును; ఆకాంక్ష౯=కోరుచు; స్వం=తనదైన; చిత్తంచ=మనస్సును; విలోభయ౯= ఆనందింపఁజేసికొనువాఁడై; భార్యాం= భార్యయగుసీతను; శచీం=శచీదేవిని; పురందరఇవ= దేవేంద్రుఁడువలె; చిత్రం = ఆశ్చర్యమగు; చిత్రకూటం= చిత్రకూటపర్వతమును; అదర్శయత్ =చూచునట్లుచేసెను.

అంత, నచ్చట, దేవసమానుండును బర్వతంబులందును అరణ్యంబులందును బ్రీతిగలవాఁడునగు రాముండు, ఆచిత్రకూటపర్వతంబున, నొకమాసంబువఱకు వాసముచేసి, భరతుండువచ్చుదినంబున సీతాదేవికిసంతోషంబుసేయఁగోరి, తనమనంబునకును గొంచెమువినోదంబుగలిగించుటకై, దేవేంద్రుండుశచీదేవికింబోలెఁ, దనభార్యయగుసీతాదేవికిఁ, జిత్రంబగునాచిత్రకూటపర్వతంబునందలివిశేషంబులం, జూపెను.

అని, తాత్పర్యము.

న రాజ్యా ద్భ్రంశనం భద్రే న సుహృద్భి ర్వినా భవః
మనో మే బాధతే దృష్ట్వా రమణీయ మిమం గిరిమ్. ౩

టీక॥ భద్రే=మంగళరూపిణివగుసీతా! రమణీయం = సుందరమయిన; ఇమం=ఈ; గిరిం= చిత్రకూటపర్వతమును; దృష్ట్వా=చూచి; మే= నాయొక్క;

మనః=మనస్సును; రాజ్యాత్ = రాజ్యంబుననుండి; భ్రంశనం=జాఱుట; నబాధతే=బాధింపలేదు. సుహృద్భిః=స్నేహితులతో; వినాభవః=వేఱుపాటును; న (బాధతే)=బాధింపలేదు.

మంగళరూపిణివగు సీతా ! రమణీయంబగు నీచిత్రకూటపర్వతంబుఁ జూచుచుండుటవలన, రాజ్యభ్రంశంబుగాని, స్నేహితులవిడిచివచ్చుటగాని, నామంబున కెంతమాత్రను దుఃఖంబు సేయకున్నవి. అని, తాత్పర్యము.

పశ్యేద మచలం భద్రే నానాద్విజగణాయుతమ్
శిఖరైః ఖమివోద్విద్ధై ర్ధాతుమద్భి ర్విభూషితమ్. ౪

టీక॥ భద్రే= మంగళరూపిణివగు సీతా! నానాద్విజగణాయుతం = నానావిధపక్షులసమూహములతోఁ గూడినదియు, ధాతుమద్భిః= ధాతువులుఁ గలవియును; ఖం=ఆకాశమును; ఉద్విద్ధైః ఇవ(స్థితైః)=ఒరయునట్లున్నవియు నగు; శిఖరైః=శిఖరముచేత; విభూషితం= అలంకరింపఁబడినదియునగు; ఇదం=ఈ; అచలం=చిత్రకూటపర్వతమును; పశ్య=చూడుము.

మంగళరూపిణివగు సీతా! ఈపర్వతము, నానావిధ పక్షులతోఁగూడి ధాతుమంతంబులయి యాకాశంబు నొరయునట్లత్యున్నతంబులయియున్న శిఖరంబులచే నలంకృతంబయి యున్నది. చూడుము. అని, తాత్పర్యము.

కేచి ద్రజతసంకాశాః కేచిత్ క్షతజసన్నిభాః
పీతమాంజిష్ఠవర్ణాశ్చ కేచి న్మణివరప్రభాః. ౫
పుష్యార్క కేతకాభాశ్చ కేచి జ్జ్యోతీరసప్రభాః
విరాజంతేఽచలేంద్రస్య దేశా ధాతువిభూషితాః. ౬

టీక॥ ధాతువిభూషితాః= ధాతువులచేనలంకృతములగు; అచలేంద్రస్య= పర్వతశ్రేష్ఠమగు చిత్రకూట పర్వతము యొకటి; దేశాః=ప్రదేశములు; కేచిత్=కొన్ని; రజతసంకాశాః= వెండితో సమానముగాను; కేచిత్= కొన్ని; క్షతజసన్నిభాః=నెత్తురుతోసమానములుగాను; కేచిత్ (అధ్యాహృతము)=

కొన్ని; పీతమాంజిష్ఠవర్ణాశ్చ= పసపువన్నెగలవియుఁజిత్రవర్ణము గలవియుఁగాను; కేచిత్= కొన్ని;మణివరప్రభాః=రత్నశ్రేష్ఠమగు నింద్రనీలము యొక్క కాంతివంటి కాంతిగలవి గాను; కేచిత్ (అధ్యాహృతము)=కొన్ని; పుష్యార్క కేతకాభాశ్చ = పుష్యరాగముయొక్కయు స్ఫటికముయొక్కయు మొగిలిపూవుయొక్కయుఁగాంతివంటి కాంతితలవిగాను; కేచిత్= కొన్ని;జ్యోతీరసప్రభాః= నక్షత్రములయొక్కయు పాదరసము యొక్కయుఁ గాంతివంటి కాంతిగలవియుఁగాను; విరాజంతే=ప్రకాశించుచున్నవి.

పర్వతోత్తమంబగు నీచిత్రకూటంబు, నానావిధధాతువులతోఁగూడినదగుటంజేసి, యిందుఁగొన్నిప్రదేశంబులురజతంబువంటివిగాను,గొన్ని నెత్తురువలె నెఱ్ఱనివిగాను , గొన్ని పీతంబులుగాను, గొన్ని, చిత్రవర్ణంబులుగాను, గొన్ని యింద్రనీలమణివర్ణంబులుగాను, గొన్ని పుష్యరాగవర్ణంబులుగాను,గొన్ని స్ఫటికవర్ణంబులుగాను,గొన్ని మొగిలిపూవన్నెగలవిగాను,గొన్నినక్షత్రకాంతిగలవిగాను, గొన్ని, పాదరసప్రభంలుగానునెంతయు నొప్పుచున్నవి చూడుము.

అని, తాత్పర్యము.

నానామృగగణద్వీపి తరక్ష్వృక్షగణైర్వృతః
అదుష్టైర్భాత్యయం శైలో బహుపక్షిసమాయుతః ౭

టీక॥ అయం=ఈ; శైలః= చిత్రకూటపర్వతము; అదుష్టైః= దుష్టములుగానట్టి ; నానామృగగణద్వీపితరక్ష్వృక్షగణైః=నానావిధములగుజింకల సమూహములచేతను బెద్దపులులయొక్కయుఁ జిఱుతపులుల యొక్కయు నెలుఁగుగొడ్డులయొక్కయుసమూహములచేతను; వృతః=చుట్టఁబడినదై; బహుపక్షిసమాయుతః=పెక్కుపక్షులతోఁగూడినదై ; భాతి = ప్రకాశించుచున్నది.

ఈచిత్రకూటపర్వతంబు , మునులసన్నిధానంబునంజేసి, యతిశాంతంబులయియుండునట్టి , నానావిధంబుల గుజింకలును, బెద్దపులులును జిఱుతపులులును నెలుఁగుగొడ్డులును నానావిధంబులగుపక్షులునుంగల్గి, యెంతయు నొప్పుచున్నది, చూడుము-

అని, తాత్పర్యము.

ఆమ్రజంబ్వసనై ర్లోధ్రైః ప్రియాలైః పనసైర్ధవైః
అంకోలైర్భవ్యతినిశై ర్బిల్వతిందుకవేణుభిః. ౮
కాశ్మర్యరిష్టవరుణై ర్మధూకై స్తిలకై స్తథా
బదర్యామలకై ర్నీపై ర్వేత్రధన్వనబీజకైః. ౯
పుష్పవద్భిః ఫలోపేతై శ్ఛాయావద్భి ర్మనోరమైః
ఏవమాదిభి రాకీర్ణ శ్శ్రియం పుష్యత్యయం గిరిః. ౧౦

టీక॥ అయం=ఈ; గిరిః= పర్వతము; పుష్పవద్భిః=పూలుగలవియు; ఫలోపేతైః= పండ్లతోఁగూడినవియు; ఛాయావద్భిః= అధికమయిననీడగలవియు;మనోరమైః = మనోహరములునగు;ఆమ్రజంబ్వసనైః= మామిడిచెట్లచేతను నేరేడుచెట్లచేతను వేఁగిసచెట్లచేతను;లోధ్రైః= లొద్దుగుచెట్లచేతను;ప్రియాలైః = మోరటిచెట్లచేతను; పనసైః=పనసచెట్లచేతను; ధవైః=చండ్రచెట్లచేతను;అంకోలైః=ఊడుగుచెట్లచేతను;భవ్యతినిశైః=మంచితిననపుచెట్లచేతను;బిల్వతిందుకవేణుభిః= మారేడుచెట్లచేతనుతుమ్మికిచెట్లచేతను వెదుళ్లచేతను;కాశ్మర్యరిష్టవరుణైః= గుమ్ముడుచెట్లచేతను వేఁపచెట్లచేతనుఉలిమిరిచెట్లచేతను;తథా=అట్లు;మధూకైః= ఇప్పచెట్లచేతను;తిలకైః= బొట్టుగుచేతను;బదర్యామలకైః= రేఁగుచెట్లచేతనుఉసిరిగచెట్లచేతను;నీపైః=మంకెనచెట్లచేతను;వేత్రధన్వనబీజకైః= పేములచేతను ఏఱుమద్దిచెట్లచేతను దాడిమిచెట్లచేతను;ఏవమాదిభిః= ఇవిమొదలగువృక్షములచేతను;శ్రియం = లక్ష్మిని;పుష్యతి=పోషించుచున్నది.

ఈచిత్రకూటపర్వతంబు, చక్కఁగాఁబుష్పించి, ఫలవంతంబులయిమనోహరంబులై యున్న మామిడిచెట్లును నేరేడుచెట్లును వేఁగిసచెట్లును లొద్దుగచెట్లును మోరటిచెట్లునుపనసచెట్లునుచండ్రచెట్లును ఊడుగుచెట్లునుమంచితినాసపుచెట్లునుబిల్వవృక్షంబులును తుమ్మికివృక్షములును వెదుళ్లును గుమ్ముడుచెట్లును వేఁపవృక్షములును ఉలిమిరివృక్షములును ఇప్పవృక్షములును బొట్టుగుచెట్లును రేఁగుచెట్లునుఉసిరిగవృక్షములును మంకెనచెట్లును పేము తీఁగెలునుఏఱుమద్దివృక్షములును దాడిమీవృక్షంబులును, ఇవిమొదలగునానేకవృక్షంబులతోనిండి, మిక్కిలియుఁగాంతిమం




తంబయివఱలుచున్నది,చూడుము.     అని, తాత్పర్యము.

శైలప్రస్థేషు రమ్యేషు పశ్యేమాన్ రోమహర్షణాన్
కిన్నరాన్ ద్వంద్వశో భద్రే రమమాణాన్ మనస్వినః. ౧౧

టీక॥భద్రే=మంగళరూపిణివగు సీతా! రమ్యేషు = సుందరములగు;శైలప్రస్థేషు=కొండనెత్తములందు;ద్వంద్వశః=జంటజంటగా; రమమాణాన్ = క్రీడించుచున్న; రోమహర్షణాన్ = వెండ్రుకలనుగగుర్పు నొందునట్లు సేయునట్టి; మనస్వినః= మంచిమనస్సుగల;ఇమాన్ =ఈ; కిన్నరాన్= కిన్నరులను; పశ్య=చూడుము.

మంగళరూపిణివగుసీతా! సుందరంబులగుకొండనెత్తములందు, దర్శనమాత్రంబుననె గగుర్పునొందించునట్టి కిన్నరులు దంపతులుదంపతులుగా బరస్పరబద్ధానురాగులయి, క్రీడించు చున్నారు. చూడుము అని, తాత్పర్యము.

శాఖావసక్తాన్ ఖడ్గాంశ్చ ప్రవరాణ్యంబరాణిచ
పశ్య విద్యాధరస్త్రీణాం క్రీడోద్దేశాన్ మనోరమాన్. ౧౨

టీక॥విద్యాధరస్త్రీణాం= విద్యాధరులయొక్క-యువారిస్త్రీలయొక్క యు శాఖావసక్తాన్= కొమ్మలయందుంచఁబడిన; ఖడ్గాంశ్చ=కత్తులను ; ప్రవరాణి=శ్రేష్ఠములగు; అంబరాణిచ = వస్త్రంబులను; మనోరమాన్=మనోహరంబులగు; క్రీడోద్దేశాన్= క్రీడాప్రదేశములను; పశ్య=చూడుము.

విద్యాధరులు, వృక్షశాఖలందు ఖడ్గంబులను నుత్తమంబులగు వస్త్రంబులనుంచియున్నారు చూడుము ; మఱియుమనోహరంబులగువారలు క్రీడించు స్థలంబులంజూడుము.

అని, తాత్పర్యము.

జలప్రపాతైరుద్భేదై ర్నిష్యందైశ్చ క్వచిత్క్వచిత్
స్రవద్భి ర్భాత్యయం శైలస్స్రవన్మద ఇవ ద్విపః. ౧౩

టీక॥ అయం=ఈ; శైలః= పర్వతము; క్వచిత్క్వచిత్ = ఒకానొకచో




ట; స్రవద్భిః=కారుచున్నట్టి; జలప్రవాహైః=సెలయేఱులచేతను; ఉద్భేదైః=భూమినిభేదించివచ్చునట్టి; నిష్యందైశ్చ=ఊటలచేతను; స్రవన్మదః=కారుచున్నట్టిమదముగల; ద్విపఇవ=ఏనుంగువలె; భాతి=ప్రకాశించుచున్నది.

జలంబులుస్రవించుచున్న సెలయేఱులచేతను భూమిని భేదించివచ్చునట్టి యూటలచేతను, ఈచిత్రకూటపర్వతంబు, మదమునుస్రవించుచున్నయేనుంగుకైవడిం, బ్రకాశించుచున్నది.

అని, తాత్పర్యము-

గుహాసమీరణోగంధా న్నానాపుష్పభవాన్ వహన్

ఘ్రాణతర్పణ మభ్యేత్య కం నరం న ప్రహర్షయేత్. ౧౪

టీక॥ నానాపుష్పభవాన్=నానావిధపుష్పంబులవలనఁగలిగిన; గంధాన్=వాసనలను; వహన్=వహించుచున్న; గుహాసమీరణః=గుహయందలివాయువు; ఘ్రాణతర్పణం=నాసికనుదృప్తిఁబొందించుటయగునట్లుగా; అభ్యేత్య=వచ్చి; కం=ఏ; నరం=మనుష్యుని; నప్రహర్షయేత్=సంతసింపంజేయదు.

గుహనుండివచ్చునట్టియీ వాయువు, నానావిధంబులగుపూవులతావులగుబాళించుచు, ఘ్రాణేంద్రియంబునకు, మిక్కిలియు సౌఖ్యంబు గల్గించుచున్నదే; దీనికెవ్వఁడుసంతోషింపఁడు?

అని, తాత్పర్యము.

యదీహ శరదోనేకా స్త్వయా సార్ధ మనిందితే

లక్ష్మణేనచ వత్స్యామి న మాం శోకః ప్రధక్ష్యతి. ౧౫

టీక॥అనిందితే=నిందింపఁబడనట్టిసీతాదేవీ! ఇహ=ఇచ్చట; అనేకాః=పెక్కులయిన; శరదః=సంవత్సరములను; త్వయా=నీతోను; లక్ష్మణేనచసార్ధం=లక్ష్మణునితోనుంగూడ; వత్స్యామియది=ఉందునేని; మాం=నన్ను; శోకః=దుఃఖము; నప్రధక్ష్యతి=దహింపదు.

నిందితురాలవుకానట్టిసీతాదేవీ! ఇచ్చట, నిన్నునులక్ష్మణునింగూడి, యనేకసంవత్సరంబులున్నను, నాకెంతమాత్రమును, దుఃఖముదోఁచదు.

అని, తాత్పర్యము.

బహుపుష్పఫలే రమ్యే నానాద్విజగణాయుతే
విచిత్రశిఖరే హ్యస్మిన్ రతవా నస్మి భామిని. ౧౬

టీక॥భామిని=సీతాదేవీ! బహుపుష్పఫలే= పెక్కుపుష్పంబులును ఫలంబులునుగలదియు ; నానాద్విజగణాయుతే = నానావిధపక్షులసమూహముతోఁగూడినదియు; రమ్యే=సుందరంబును; విచిత్రశిఖరే= నానావిధంబులగుశిఖరములుగలదియునగు; అస్మిన్= ఈచిత్రకూట పర్వతమునందు ; రతవాన్=ప్రీతిగలవాఁడను ; అస్మిహి=అయితినిగదా!

సీతాదేవీ! పెక్కుపుష్పంబులును బెక్కుఫలంబులునుగల్గి నానావిధ పక్షులచేనతిరమణీయంబై , యతిసుందరంబులగుశిఖరంబులతో నొప్పుచున్నయీ పర్వతంబునందు నామనస్సు మిక్కిలి యునానందించి యున్నది.

అని, తాత్పర్యము.

అనేన వనవాసేన మయా ప్రాప్తం ఫలద్వయమ్
పితుశ్చా నృణతా ధర్మే భరతస్య ప్రియం తథా. ౧౭

టీక॥అనేన=ఈ; వనవాసేన= అడవియందుండుటచేత;ధర్మే= ధర్మమువిషయమయి;పితుః=తండ్రికి; అనృణతా= అప్పులేకుండుటయు; తథా= అట్లు; భరతస్య=భరతునకు;ప్రియం= సంతోషమును; ఫలద్వయం=ఫలంబుల జంట ; మయా=నాచేత; ప్రాప్తం=పొందఁబడినది

నేనిప్పుడువనవాసంబుసేయుట చేతఁ, దండ్రిఋణంబుఁదీర్చుకొనుటయు, భరతుండుసంతోషించుటయు, రెండు ఫలంబులు, నాకుఁగలిగినవి.

అని, తాత్పర్యము.

వైదేహి రమసే కచ్చి చ్చిత్రకూటే మయాసహ
పశ్యంతీ వివిధాన్ భావాన్ మనోవాక్కాయసంయతాః. ౧౮

టీక॥వైదేహి=సీతాదేవీ! త్వం(అధ్యాహృతము) = నీవు;మనోవాక్కాయసంయతాః (మనోవాక్కాయసంయతాన్)= మనస్సునువాక్కును దేహ




మును బంధింపఁబడినవిగాఁగల ; వివిధాః = నానావిధములయిన ; భావాః=మలయానిలాదిభావంబులను; పశ్యంతీ=చూచుచు;మయాసహ = నాతోఁగూడ; చిత్రకూటే=చిత్రకూటపర్వతమునందు;రమసేకచ్చిత్ =క్రీడింతువా యేమి?

సీతాదేవీ ! ఇచ్చటమనోవాక్కాయంబులను మూఁడిటి నివశీకరించునట్టి నానావిధంబులగు మలయానిలకోకిలాలాపకుసుమఫలంబులు మొదలగుభావంబులననుభవింపుచు, నీచిత్రకూటంబున, నాతోనుండుట, నీకుసంతోషముగానున్నదా యేమి?అని, తాత్పర్యము.

ఇద మేవా మృతం ప్రాహూ రాజ్ఞి రాజర్షయః పరే
వనవాసం భవార్థాయ ప్రేత్య మే ప్రపితామహాః. ౧౯

టీక॥ రాజ్ఞి =రాణివగుసీతాదేవీ! మే=నాయొక్క;ప్రపితామహాః= ముత్తాతలయిన;పరే=మునుపటివారలగు; రాజర్షయః=రాజర్షులు; ప్రేత్య=దేహమునువిడిచి;భవార్థాయ= సంసారప్రయోజనముకొఱకు; ఇదం (ఇమం)=ఈ;వనవాసమేవ= వనవాసమునే;అమృతం= మోక్షసాధనమునుగా; ప్రాహుః=చెప్పిరి.

రాణివగుసీతా!నాముత్తాతలు మొదలగుమునుపటిరాజర్షులు, దేహమునువిడిచినపిదప , సంసార నాశంబునకై, యీవనవాసంబునేముఖ్యసాధనంబుగాఁజెప్పిరి.అని, తాత్పర్యము.

శిలాశ్శైలస్య శోభంతే విశాలా శ్శతశోఽభితః
బహులా బహులై ర్వర్ణై నీలపీతసితారుణైః. ౨౦

టీక॥బహులైః = పెక్కువిధములగు;నీలపీతసితారుణైః= నీలంబునుబసపును తెలుపును నెఱుపునను;వర్ణైః=రంగులతో; సహితాః (అధ్యాహృతము)= కూడిన; బహులాః=పెక్కులగు;విశాలాః = వెడల్పులగు;శైలస్య = చిత్రకూటపర్వతముయొక్క;శిలాః = ఱాళ్లు;శతశః=నూఱులునూఱులుగా; అభితః=అంతటను; శోభంతే=ప్రకాశించుచున్నవి.

నలుపుఁబసపుఁదెలుపు నెఱుపు మొదలగు నానావిధవర్ణంబులతోఁగూడినవి




కాలంబులగుశిలలు, చిత్రకూటపర్వతం బుననంతటను, వేనవేలుగాఁబ్రకాశించు చున్నవి. అని, తాత్పర్యము.

నిశి భాంత్యచలేంద్రస్య హుతాశనశిఖా ఇవ
ఓషధ్యస్స్వప్రభాలక్ష్మ్యా భ్రాజమానా స్సహస్రశః. ౨౧

టీక॥ అచలేంద్రస్య=పర్వతశ్రేష్ఠమగు చిత్రకూటపర్వతముయొక్క; ఓషధ్యః=మహౌషధులు; నిశి=రాత్రియందు; సహస్రశః=వేనవేలుగా; స్వప్రభాలక్ష్మ్యా=తమకాంతిసంపదచేత; భ్రాజమానాః=ప్రకాశించుచు; హుతాశనశిఖాఇవ=అగ్నిజ్వాలలువలె; భాంతి=ప్రకాశించుచున్నవి.

పర్వతరాజంబగు నీచిత్రకూటపర్వతంబునందలిమహౌషధులు, వేనవేలుగా, రాత్రికాలంబులందు, నిజకాంతిం దేజరిల్లుచు, నగ్నిజ్వాలలుంబోలె, నెంతయుంబ్రకాశించుచున్నవి. అని, తాత్పర్యము.

కేచిత్ క్షయనిభా దేశాః కేచి దుద్యానసన్నిభాః
కేచి దేకశిలా భాంతి పర్వతస్యాస్య భామిని. ౨౨

టీక॥ భామిని=సీతాదేవీ! అస్య=ఈ; పర్వతస్య=చిత్రకూటపర్వతముయొక్క; దేశాః = ప్రదేశములు; కేచిత్=కొన్ని; క్షయనిభాః= గృహములతో సమానములుగాను; కేచిత్= కొన్ని; ఉద్యానసన్నిభాః= ఉద్యానవనంబులతోసమానములుగాను; కేచిత్= కొన్ని; ఏకశిలాః=ఒకటెబెత్తాళ్లుగాను; భాంతి=ప్రకాశించుచున్నవి.

సీతా! ఈచిత్రకూటపర్వతంబునఁ, గొన్నిప్రదేశంబులు, గృహంబులువలెఁ, గొన్నియుద్యానవనంబులపగిదిఁ, గొన్నివిశాలంబులుగునొక్కటేశిలగాను, ప్రకాశించుచున్నవి. అని, తాత్పర్యము.

భిత్త్వేవ వసుధాం భాతి చిత్రకూట స్సముత్థితః
చిత్రకూటస్య కూటోఽసౌ దృశ్యతే సర్వత శ్శుభః. ౨౩

టీక॥ చిత్రకూటః= చిత్రకూటపర్వతము; వసుధాం=భూమిని; భిత్త్వా=

భేదించి; సముత్థిత ఇవ = లేచినదివలె; భాతి = ప్రకాశించుచున్నది. అసౌ = ఈ; చిత్రకూటస్య = చిత్రకూటపర్వతము యొక్క; కూటః = శిఖరము; సర్వతః = అంతటను; శుభః = సుందరముగా; దృశ్యతే = చూడబడుచున్నది.

చిత్రకూట పర్వతంబు, భూమిని భేదించి పైకుద్గమించియున్నదోయనం దగియొప్పుచున్నది; ఈచిత్రకూట శిఖరంబంతయు రమణీయంబుగానున్నది.

అని, తాత్పర్యము.

కుష్ఠపున్నాగస్థగర భూర్జపత్రోత్తరచ్ఛదాన్
కామినాం స్వాస్తరాన్ పశ్య కుశేశయదళాయుతాన్. ౨౪

టీక॥ కుష్ఠపున్నాగస్థగరభూర్జపత్రోత్తరచ్ఛదాన్ = నల్లకలువలును పున్నాగ పుష్పములును పుత్రజీవియను చెట్లపూలును భూర్జ పత్రంబులును బట్టపువస్త్రంబులు గాఁగల; కుశేశయ దళాయుతాన్ = కమలదళంబులతోఁగూడిన; కామినాం = కాముకుల యొక్క; స్వాస్తరాన్ = శయనములను; పశ్య = చూడుము.

నల్లకలువలును బున్నాగపుష్పంబులును బుత్రజీవిపూలునుభూర్జపత్రంబులును, కమలదళంబులునుబఱచియున్న, కాముకులశయనంబులంజూడుము.

అని, తాత్పర్యము.

మృదితాశ్చాపవిద్ధాశ్చ దృశ్యంతే కమలస్రజః
కామిభిర్వనితే పశ్య ఫలాని వివిధానిచ. ౨౫

టీక॥ వనితే = సీతాదేవీ; కామిభిః = కాముకులచేత; మృదితాశ్చ = మర్దింపఁబడినవియు; అపవిద్ధాశ్చ = పాఱవేయఁబడినవియునగు; కమలస్రజః = కమలమాలికలును; వివిధాని = నానావిధములయిన; ఫలానిచ = పండ్లును; దృశ్యంతే = చూడఁబడుచున్నవి. పశ్య = చూడుము.

సీతా! కాముకులచేమర్దింపఁబడిపాఱవేయఁబడినకమలమాలికలును నానావిధపుష్పంబులును, కనుపడుచున్నవి, చూడుము. అని, తాత్పర్యము.

వస్వౌకసారాం నళినీ మత్యేతీవోత్తరాన్ కురూన్
పర్వతశ్చిత్రకూటోసౌ బహుమూలఫలోదకః. ౨౬

టీక॥ బహుమూలఫలోదకః = పెక్కులయినగడ్డలునుఫలంబులును జలంబులునుగల; అసౌ = ఈ; చిత్రకూటః = చిత్రకూటంబను; పర్వతః = పర్వతము; వస్వౌకసారాం = అలకాపట్టణమును; నళినీం = సౌగంధికసరస్సును; ఉత్తరాన్ = ఉత్తరపుదిక్కుననుండు; కురూన్ = కురుదేశంబును; అత్యేతీవ = అతిశయించునట్లున్నది.

పెక్కుమూలంబులును ఫలంబులును జలంబులునుగల యీచిత్రకూటపర్వతంబు, అలకాపట్టణంబును సౌగంధికసరస్సును ఉత్తర కురుదేశంబులనుం గూడ, నతిశయించునట్లున్నది.

అని, తాత్పర్యము.

ఇమాం తు కాలం వనితే విజహ్రివాన్ త్వయాచ సీతే సహలక్ష్మణేన చ
రతింప్రపత్స్యేకులధర్మవర్ధనీం సతాం పథిస్వైర్నియమైఃపరైస్థితః. ౨౫

టీక॥ వనితే = స్త్రీవగు; సీతే = సీతాదేవీ! స్వైః = నాదైన; పరైః = ఉత్కృష్టములగు; నియమైః = నియమములచేత, సతాం = పెద్దలయొక్క; పథి = మార్గమునందు; స్థితః = ఉన్నవాఁడనై; త్వయా = నీతోను; లక్ష్మణేనచసహ = లక్ష్మణునితోనుంగూడ; ఇమం = ఈ; కాలంతు = కాలమునుమాత్రము; విజహ్రివాన్ = విహరించినవాఁడనై; కులధర్మవర్ధనీం = కులమునుధర్మమునువృద్ధిఁబొందించునట్టి; రతిం = సంతోషమును; ప్రపత్స్యే = పొందఁగలను.

సీతాదేవీ! నేనుశ్రేష్ఠంబులగునియమంబులసాధుమార్గంబవలంబించి, మనకులధర్మంబేర్పడ, నిచ్చట, నీతోనులక్ష్మణునితోనుంగూడ విహరింపుచు, నీపదునాలుగు సంవత్సరంబులనుగడపి, యంత, సంతుష్టుండనయ్యెదను. అని, రాముండు, సీతాదేవికిఁజిత్రకూటపర్వతంబునందలి చిత్రంబులం జూపుచుఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, చతుర్ణవతితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండచతుర్ణవతితమసర్గటీక,
ముగిసినది.

శ్రీః

## పంచనవతితమసర్గప్రారంభః.

అథ శైలాద్వినిష్క్రమ్య మైథిలీం కోసలేశ్వరః
అదర్శయచ్ఛుభజలాం రమ్యాం మందాకినీం నదీమ్. ౧

టీక॥ అథ=అటుపిమ్మట; కోసలేశ్వరః = కోసలదేశాధిపతియగురాముండు; శైలాత్ = పర్వతమునుండి; వినిష్క్రమ్య=మఱలి; మైథిలీం= సీతాదేవిని; శుభజలాం= మంచినీళ్లుగలదియు; రమ్యాం=సుందరమునగు; మందాకినీం= మందాకినియను; నదీం=నదిని; అదర్శయత్ =చూచునట్లుచేసెను.

అట్లురాముండు, సీతాదేవికిఁ, బర్వతంబునందలి విచిత్రంబులంజూపి, యంత, స్వచ్ఛంబులగు జలంబులుగల్గి రమణీయంబై యున్న మందాకినీనదిం జూపెను. అని, తాత్పర్యము.

అబ్రవీచ్చ వరారోహాం చారుచంద్రనిభాననామ్
విదేహరాజస్య సుతాం రామో రాజీవలోచనః. ౨

టీక॥ రాజీవలోచనః=తామరపూలవంటికండ్లుగల; రామః=రాముఁడు; చారుచంద్రనిభాననాం= సుందరమయినచంద్రునితో సమానమయినముఖము గలదియు; వరారోహాం=సుందరములయినపిఱుఁదులుగలదియునగు; విదేహరాజస్య=జనకమహారాజుయొక్క; సుతాం= కూఁతురయినసీతాదేవిని గూర్చి; అబ్రవీచ్చ=చెప్పెను.

కమలంబులవంటి కన్నులుగల రాముండు, శరదృతువునందలిచంద్రుంబోలినముఖంబుగలదియు సుందరంబులగుపిఱుందులుగలదియునగు జనకమహారాజుపుత్రియయినసీతాదేవింజూచి, మనంబునసంతోషంబునిండార, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

విచిత్రపులినాం రమ్యాం హంససారససేవితామ్
కమలైరుపసంపన్నాం పశ్య మందాకినీం నదీమ్. ౩

టీక॥ విచిత్రపుళినాం= నానావిధములయిన యిసుకదిబ్బలుగలదియు; రమ్యాం=సుందరమును ; హంససారససేవితాం=హంసపక్షులచేతనుసారసపక్షులచేతను సేవింపఁబడినదియు ; కమలైః= తామరపూలతో ; ఉపసంపన్నాం = కూడినదియునగు; మందాకినీం= మందాకినియను ; నదీం= నదిని; పశ్య=చూడుము.

నానావిధములగు నిసుకదిబ్బలుగలదియు, హంససారసశోభితంబునుదామరసపుష్పంబులనొప్పుచున్నదియు రమణీయంబునగునీమందాకినీనదింజూడుము ; ఇది, నీపిఱుందులంబోలు నిసుకదిబ్బలును, నూపురధ్వనులననుకరించు హంసకూజితంబులును, కరచరణవదనంబులకుసరివచ్చు కమలంబులునుగల్గి యుండుటచే,నీయట్లు, ఎంతయునొప్పుచున్నది.

అని, తాత్పర్యము.

నానావిధై స్తీరరుహై ర్వృతాం పుష్పఫలద్రుమైః
రాజంతీం రాజరాజస్య నళినీ మివ సర్వతః. ౪

టీక॥ నానావిధైః=పలుతెఱంగులయినః తీరరుహైః=గట్టులమొలిచిన; పుష్పఫలద్రుమైః= పూలతోనుబండ్లతోను గూడినవృక్షములచేత; వృతాం=చుట్టఁబడినదియు; రాజంతీం=ప్రకాశించుచున్నదియు; సర్వతః=అంతటను; రాజరాజస్య=కుబేరునియొక్క ; నళినీమివ (స్థితాం)= సౌగంధికసరస్సువలెనున్నదియునగు; మందాకినీం(అధ్యాహృతము) = మందాకినీనదిని; పశ్య(అధ్యాహృతము)=చూడుము.

ఈమందాకినీ నది , తీరంబులందు నానావిధంబులగుపుష్పవృక్షంబులునుఫలవృక్షంబులునుంగల్గి, కుబేరునిసౌగంధికసరసికైవడి , నెంతయుంబ్రకాశించుచున్నది; చూడుము,

అని, తాత్పర్యము-

మృగయూథ నిపీతాని కలుషాం భాంసి సాంప్రతమ్
తీర్థాని రమణీయాని రతిం సంజనయంతి మే. ౫

టీక॥ మృగయూథనిపీతాని= జింకలగుంపుచేఁద్రాఁగఁబడినవియు, కావున

నే; సాంప్రతం=ఇప్పుడు; కలుషాని= కలఁగియున్నవియు;రమణీయాని=సుందరములునగు;తీర్థాని= రేవులు; మే = నాకొఱకు; మతిం=సంతోషమును;సంజనయంతి=కల్గించుచున్నవి.

జింకలగుంపులునీళ్లుత్రాఁగివచ్చుటచే, నిప్పుడుకలంగియున్నరమణీయంబులగు రేవులంజూడఁజూడ, నాకెంతయు సంతోషంబుగలుగుచున్నది.

అని, తాత్పర్యము.

జటాజినధరాః కాలే వల్కలోత్తరవాససః
ఋషయస్త్వవగాహంతే నదీం మందాకినీం ప్రియే. ౬

టీక॥ప్రియే=ప్రియురాలా? జటాజినధరాః = జటలనుకృష్ణాజినములనుధరించువారలును ; వల్కలోత్తరవాససః= నారచీరలెయుత్తరీయములు గాఁగలవారలునగు; ఋషయః=ఋషులు; కాలే=నియతకాలమునందు; మందాకినీం=మందాకినియను; నదీం=ఏటిని గూర్చి; అవగాహంతే = మునుఁగుచున్నారు.

ప్రియురాలా! జటలుఁగృష్ణాజినంబులును దాల్చినవారలును వల్కలంబులం గట్టుకొనువారలునగుఋషులు, నియతకాలంబున, ఈమందాకినీనదియందు, అవగాహనస్నానము సేయుచున్నారు,చూడుము.అని, తాత్పర్యము.

ఆదిత్య ముపతిష్ఠంతే నియమా దూర్ధ్వబాహవః
ఏతే పరే విశాలాక్షి మునయ స్సంశితవ్రతాః. ౭

టీక॥ విశాలాక్షి= వెడల్పుకన్నులుగలసీతా!పరే=ఇతరులయిన; సంశితవ్రతాః = తీక్ష్ణమగునియమముగల;ఏతే= ఈ;మునయః=మునులు;నియమాత్ =నియమమువలన;ఊర్ధ్వబాహవః = పైకెత్తఁబడినచేతులుగలవారలయి; ఆదిత్యం=సూర్యుని; ఉపతిష్ఠంతే=స్తుతించుచున్నారు.

విశాలనయనవగుసీతా!ఇదిగో, తీక్ష్ణంబగునియమముగలమఱికొందఱుమునులు, నియమంబునఁ, జేతులుపైకెత్తి, సూర్యునిగూర్చి యుపస్థానముసేయుచున్నారు.అని, తాత్పర్యము.

మారుతోద్ధూతశిఖరైః ప్రనృత్త ఇవ పర్వతః
పాదపైః పత్రపుష్పాణి సృజద్భి రభితో నదీమ్. ౮

టీక॥ మారుతోద్ధూతశిఖరైః = గాలిచేఁ గదలింపఁబడిన శిఖరములు గలవియు; నదీమభితః = ఏటిచుట్టును; పత్రపుష్పాణి = ఆకులునుపూలును; సృజద్భిః = విడుచుచున్నవియునగు; పాదపైః = వృక్షములచేత; పర్వతః = కొండ; ప్రనృత్త ఇవ(స్థితః) = నర్తనము సేయువాఁడువలెనున్నది.

నర్తనము సేయఁబోవువాఁడు, చేతుల పుష్పంబులంజల్లునట్లు, ఈపర్వతము, గాలికింగదలువృక్షంబులచే, నదిచుట్టును, బుష్పంబులనుబత్రంబులనుం జల్లుచున్నది, చూడుము. అని, తాత్పర్యము.

క్వచి న్మణి నికాశోదాం క్వచి త్పులినశాలినీమ్
క్వచిత్సిద్ధ జనాకీర్ణాం పశ్య మందాకినీం నదీమ్. ౯

టీక॥ క్వచిత్ = ఒకానొకచోట; మణినికాశోదాం = ముత్తెములతోసమానమయిన జలముగలదియు; క్వచిత్ = ఒకానొకచోట; పులినశాలినీం = ఇసుకదిబ్బలచేఁబ్రకాశించుచున్నదియు; క్వచిత్ = ఒకానొకచోట; సిద్ధజనాకీర్ణాం = సిద్ధజనులచే వ్యాపింపఁబడినదియునగు; మందాకినీం = మందాకినియను; నదీం = ఏటిని; పశ్య = చూడుము.

ఈమందాకినీనది, యొకానొకచో, ముత్తెములంబోలుజలములుగలదై, యొకట్రచోట, నిసుకదిన్నెలతో నొప్పుచు, నొకట్రచో, స్నానము సేయవచ్చినసిద్ధజనులచేనిండి, యెంతయు రమణీయంబుగాఁజూపట్టుచున్నది, చూడుము. అని, తాత్పర్యము.

నిర్ధూతాన్ వాయునా పశ్య వితతాన్ పుష్పసంచయాన్
పోప్లూయమానా నపరాన్ పశ్య త్వం జలమధ్యగాన్. ౧౦

టీక॥ వాయునా = గాలిచేత; నిర్ధూతాన్ = ఎగురఁగొట్టఁబడినవియు; వితతాన్ = వ్యాప్తములునగు; పుష్పసంచయాన్ = పూలరాసులను; ప

శ్య=చూడుము; ప్లోప్లాయమానాన్=మిక్కిలియుఁగదలుచున్న ; జలమధ్యగాన్=నీటినడుమునొందిన; అపరాన్=ఇతరములయినపూలరాసులను;పశ్య=చూడుము.

గాలికి రాలినపుష్పములు , కొన్ని, తీరములంబడియున్నవి చూడుము; కొన్ని జలంబులంబడి, కదలుచున్నవి,చూడుము; అట్లు, ఈమందాకినీనది, కొంతదూరము, పుష్పములచేఁ గప్పఁబడి, కొంతదూరము లేకుండుటచేఁ,బ్రియునిచే సగమపహరింపఁబడిన వస్త్రముగలనారీమణికైవడింగనుపట్టుచున్నది.

అని,తాత్పర్యము.

తాంశ్చాతి వల్గువచసో రథాంగాహ్వయనా ద్విజాః
అధిరోహంతి కల్యాణి వికూజంత శ్శుభా గిరః. ౧౧

టీక॥ కల్యాణి= మంగళస్వరూపిణివగుసీతా! అతివల్గువచసః = మిక్కిలియుమనోహరములగు ధ్వనులుగల; రథాంగాహ్వయనాః= చక్రంబులనుపేరుగల; ద్విజాశ్చ=పక్షులును,చక్రవాకపక్షులనుట; శుభాః= సుందరంబులగు;గిరః=పలుకులను; కూజంతః=కూయుచు; తాన్= ఆపుష్పరాసులను;అధిరోహంతి=ఎక్కుచున్నవి.

మంగళస్వరూపిణివగుసీతా! మనోహరంబులగుధ్వనులుగలచక్రవాకపక్షులు, మధురంబగు రతికాలికస్వనంబులు గూయుచు, రత్యర్థము,ఆపుష్పరాసులనారోహించుచున్నవి,చూడుము.

అని, తాత్పర్యము.

దర్శనం చిత్రకూటస్య మందాకిన్యాశ్చ శోభనే
అధికం పురవాసాచ్చ మన్యేచ తవ దర్శనాత్. ౧౨

టీక॥ శోభనే=మంగళస్వరూపిణివగుసీతా!చిత్రకూటస్య= చిత్రకూటపర్వతముయొక్కయు;మందాకిన్యాశ్చ=మందాకినీనదియొక్కయు;దర్శనం=చూచుటను;పురవాసాచ్చ=అయోధ్యాపట్టణంబుననుండుటకన్నను; తవ=నీయొక్క; దర్శనాచ్చ=చూచుటకన్నను;అధికం=అధికమునుగా;మన్యే=తలంచెదను.

మంగళరూపిణివగు సీతాదేవీ! ఏకాంతభోగస్థానంబగుటవలన,ఈచిత్రి

కూటంబుఁజూచుచుండుట, అయోధ్యా నగరవాసంబుకన్నను, నాకధికముగాఁ దోఁచుచున్నది; మన్మథోద్దీపనంబగుట వలన,నీమందాకినింజూచుట, నిన్నుఁజూచుటకన్నను,అధికముగానున్నది.

అని, తాత్పర్యము.

విధూతకలుషైస్సిద్ధైస్తపో దమ శమాన్వితైః
నిత్యవిక్షోభిత జలాం విగాహస్వ మయాసహ. ౧౩.

టీక॥విధూతకలుషైః= పోఁగొట్టఁబడినపాపములుగలవారలును;తపోదమశమాన్వితైః= తపస్సుతోను,ఇంద్రియనిగ్రహముతోను,శాంతితోనుం గూడినవారలునగు;సిద్ధైః=సిద్ధపురుషులచేత; నిత్యవిక్షోభితజలాం= ఎల్లప్పుడునుగలఁచఁబడిన జలముగల మందాకినీనదిని;మయాసహ=నాతోఁగూడ;విగాహస్వ= ప్రవేశించుము.

ఈమందాకిని నిష్కల్మషులును దపస్సునింద్రియనిగ్రహమునుశాంతియుఁగలసిద్ధులు, ఎల్లప్పుడుస్నానముసేయుటచేఁ,గలంగినజలంబులతోనొప్పుచున్నది; అట్టిపుణ్యనదియందు, నాతోఁగూడ,జలక్రీడగావింపుము.అని, తాత్పర్యము.

సఖీవచ్చ విగాహస్వ సీతే మందాకినీం నదీం
కమలాన్యవమజ్జంతీ పుష్కరాణి చ భామిని. ౧౪.

టీక॥భామిని=స్త్రీరత్నమా; సీతే = సీతా!త్వం(అధ్యాహృతము)=నీవు; మయాసహ=నాతోఁగూడ;సఖీవచ్చ=చెలికత్తెతోవలెనే; కమలాని=ఎఱ్ఱదామర పూలను;పుష్కరాణిచ= తెల్లదామర పూలను;అవమజ్జంతీ(అవమజ్జయంతీ)= ముంచుచు; మందాకినీం=మందాకినియను;నదీం=నదిని; విగాహస్వ=ప్రవేశింపుము.

సీతాదేవీ! స్తనజఘనంబులతోఁకుడుచే, నెఱ్ఱదామర పూలను దెల్లదామరపూలును,జలంబుల మునుంగునట్లు , గావించుచుఁ జెలికత్తెతోవలె, నాతోఁగూడ , మందాకినీ నదిలో జలక్రీడ గావింపుము. అని,తాత్పర్యము.

త్వం పౌరజనవద్వ్యాళానయోధ్యామివ పర్వతం

మన్యస్వ వనితే నిత్యం సరయూ వదిమాం నదీమ్. ౧౫

టీక॥ వనితే = సీతాదేవీ! త్వం=నీవు; వ్యాళాన్ = అడవిమృగంబులను; పౌరజనవత్= పట్టణమునందుండుజనులవలెను; పర్వతం= చిత్రకూటపర్వతమును; అయోధ్యామివ=అయోధ్యానగరంబునువలెను; ఇమాం=ఈ; నదీం= మందాకినీనదిని; సరయూమివ= సరయూనదివలె; మన్యస్వ = తలంపుము.

సీతాదేవీ! నీవింక,నడవిమృగంబులనే పట్టణవాసిజనులనుగాను , ఈచిత్రకూటపర్వతంబునే యయోధ్యానగరంబుగాను, ఈమందాకినీనదినే సరయూనదినిగాను, భావించుకొనుము.

అని, తాత్పర్యము.

లక్ష్మణశ్చాపి ధర్మాత్మా మన్నిదేశే వ్యవస్థితః
త్వంచానుకూలా వైదేహి ప్రీతిం జనయథోమమ. ౧౬

టీక॥ వైదేహి=సీతాదేవీ! ధర్మాత్మా=ధర్మబుద్ధిగల; లక్ష్మణశ్చాపి = లక్ష్మణుండును; మన్నిదేశే= నాయాజ్ఞయందు; వ్యవస్థితః = ఉన్నవాఁడు. త్వంచ=నీవును; అనుకూలా=అనుకూలురాలవు. మమ=నాకు; ప్రీతిం = సంతోషమును ; జనయథః = కల్గించుచున్నారు.

సీతాదేవీ! ధర్మాత్ముండగులక్ష్మణుండునునీవును, నాయాజ్ఞాప్రకారముగా వింపుచు, నాకనుకూలముగా, నాకుమిక్కిలియుసంతోషముసేయుచున్నారు. అని,తాత్పర్యము.

ఉపస్పృశం స్త్రిషవణం మధుమూల ఫలాశనః
నాయోధ్యాయై నరాజ్యాయ స్పృహయేద్య త్వయాసహ. ౧౭

టీక॥అహం(అధ్యాహృతము)=నేను; అద్య=ఇప్పుడు; త్రిషవణం= మూఁడుకాలములయందును ; ఉపస్పృశన్ = స్నానముసేయుచు ; మధుమూలఫలాశనః= తేనెయుగడ్డలునుఫలంబులును ఆహారముగాఁగలవాఁడనై ; త్వయాసహ=నీతోఁగూడ; స్థితః (అధ్యాహృతము)= ఉన్నవాఁడనై; అయోధ్యాయై(ద్వితీయార్థమందుఁజతుర్థి)=అయోధ్యాపట్టణమును; నస్పృహయే=

కోరను. రాజ్యాయ = రాజ్యము నకు; న(స్పృహయే)=కోరను-

ఇట్లు, మూడుకాలంబులను స్నానంబుసేయుచు, తేనెయుమూలంబులు నుఫలంబులునుఆహారంబుగాగొనుచు,నీతోఁగూడనుందునేని, అయోధ్యనుగాని రాజ్యంబునుగాని యిచ్ఛింపను.

అని, తాత్పర్యము,

ఇమాంహి రమ్యాం మృగయూథశాలినీం
నిపీతతోయాం గజసింహవానరైః
సుపుష్పితైః పుష్పధరై రలంకృతాం
నసోస్తి యస్స్యా దగతక్లమ స్సుఖీ. ౯౬

టీక॥రమ్యాం=సుందరమును; మృగయూథశాలినీం=జింకలసమూహముల చేఁబ్రకాశించుచున్నదియు; గజసింహవానరైః= ఏనుంగులచేతనుసింహముల చేతనువానరులచేతను; నిపీతతోయాం=త్రాఁగఁబడిన నీళ్లుగలదియు; సుపుష్పితైః = చక్కఁగాఁబూచినట్టి;పుష్పధరైః=పూలుధరించిన చెట్లచేత; అలంకృతాం=అలంకరింపఁబడినదియునగు; ఇమాం=ఈమందాకినీనదిని, ఈమందాకినీనదియందనుటః;ఉపస్పృశన్ (అధ్యాహృతము) = స్నానముచేయువాఁడు; యః=ఎవ్వఁడు;అగతక్లమః = పోవనియాయాసముగలవాఁడై;సుఖీ = సుఖముగలవాఁడు; నస్యాత్ = కాఁడో; సః=అట్టివాఁడు;నాస్తి=లేఁడు.

రమణీయంబును మృగయూథంబుల నొప్పుచున్నదియు, నాశ్రమమహిమచే విగతవైరంబులగు గజ సింహాది క్రూరమృగంబులచే నన్యోన్య సహితంబుఁగాఁద్రావంబడు జలంబులుగలదియుఁ, జక్కఁగాఁబుష్పించినవృక్షములచేనలంకృతమునగు, నీమందాకినీ నదియందు స్నానముగావించియు, గతాయాసుండై సుఖంబు నొందని వాఁడెవ్వఁడును లేఁడు. అని, రాముండు సీతాదేవికిం జెప్పెను. అని,తాత్పర్యము.

ఇతీవ రామో బహు సంగతం వచః
ప్రియాసహాయ స్సరితం ప్రతి బ్రువన్

చచార రమ్యం నయనాంజనప్రభం
స చిత్రకూటం రఘువంశ వర్ధనః. ౧౯

టీక॥ ప్రియాసహాయః= ప్రియురాలితోడుగాఁగల; రఘువంశవర్ధనః= రఘువంశంబును వృద్ధిఁబొందించునట్టి; సః=ఆ; రామః= రాముఁడు; ఇతీవ= ఇట్లు; సరితంప్రతి=మందాకిని నదినిగుఱించి; సంగతం=యుక్తమగు; బహు= అధికమయిన;వచః=మాటను;బ్రువన్= చెప్పుచు; రమ్యం = సుందరమయినదియు; నయనాంజనప్రభం = కంటికాటుకయొక్క కాంతివంటి కాంతిగలది యునగు; చిత్రకూటం= చిత్రకూటపర్వతమును , చిత్రకూటపర్వతమునందనుట; చచార=సంచరించెను.

రఘువంశంబును వృద్ధిఁబొందించునట్టి,రాముండు,ప్రియాసహితుండై,యిట్లు, మందాకినీనదిఁగుఱించి, మనోహరంబులగుమాటలంజెప్పుచూరమణీయంబును గాటుకవలెనల్లనిదియునగు చిత్రకూటపర్వతమునందువిహరించెను.
అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, పంచనవతితమస్సర్గః.
ఇది,స్పష్టార్థము.
ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు,అయోధ్యాకాండపంచనవతితమసర్గటీక ముగిసినది.



౫౬

షణ్ణవతితమసర్గప్రారంభః.

తాం తథా దర్శయిత్వాతు మైథిలీం గిరినిమ్నగామ్
నిషసాద గిరిప్రస్థే సీతాం మాంసేన ఛందయన్. ౧

టీక॥ రామః(అధ్యాహృతము) = రాముండు; తథా=అట్లు; తాం=ఆ; మైథిలీం=సీతను; గిరినిమ్నగాం= పర్వతనదిని; దర్శయిత్వాతు= చూచునట్లు చేసినంతనె; సీతాం=సీతను; మాంసేన=మాంసముచే; ఛందయన్= వశీకరింపుచు; గిరిప్రస్థే=కొండనెత్తమునందు; నిషసాద=కూర్చుండెను.

రాముండు, అట్లు, సీతాదేవికి, మందాకినీ నది సౌందర్యంబుఁజూపి, యంతఁ,గొండనెత్తమునందుఁ,గూర్చుండి, సీతాదేవికి, నానావిధమాంసంబులం దినిపించెను.

అని, తాత్పర్యము.

ఇదం మేధ్య మిదం స్వాదు నిష్టప్త మిద మగ్నినా
ఏవ మాస్తే స ధర్మాత్మా సీతయాసహ రాఘవః. ౨

టీక॥ ఇదం = ఈమాంసము; మేధ్యం=పరిశుద్ధము. ఇదం=ఈమాంసము; స్వాదు=రసవంతము; ఇదం= ఇది; అగ్నినా = అగ్నిహోత్రముచేత; నిష్టప్తం= పక్వముచేయఁబడినది. ఏవం=ఇట్లు; ధర్మాత్మా=ధర్మస్వభావుండగు; సః=ఆ; రాఘవః=రాముఁడు;సీతయాసహ=సీతతోఁగూడ; బ్రువన్(అధ్యాహృతము)= చెప్పుచు; ఆస్తే=ఉన్నాఁడు.

"ఈమాంసము,పరిశుద్ధము; ఇదిరుచిగలది; ఇదిచక్కఁగాఁబక్వమయినది" ఇట్లు, ధర్మాత్ముండగురాముండు, సీతాదేవికి,మధురంబులగుమాటలంజెప్పుచుండెను.

అని, తాత్పర్యము.

తథా తత్రా సత స్తస్య భరతస్యో పయాయినః
సైన్యరేణుశ్చ శబ్దశ్చ ప్రాదురాస్తాం నభస్పృశౌ. ౩

టీక॥ తత్ర=అచ్చట; తస్య=ఆరాముండు; తధా=అట్లు; ఆసతః=కూచుండి యుండఁగా; ఉపయాయినః=వచ్చుచున్న; భరతస్య= భరతుని యొక్క; సైన్యరేణుశ్చ= సైన్యములపరాగమును; శబ్దశ్చ=ధ్వనియును; నభస్పృశౌ = ఆకాశమునుదాఁకునవియయి; ప్రాదురాస్తాం=పుట్టినవి.

అట్లచ్చట, నారాముండు కూచుండియుండఁగా, భరతుని సైన్యముల తోడ కూడుచేఁగలిగిన పరాగంబునుశబ్దంబును, నింగిముట్టి చెలంగినవి.

అని, తాత్పర్యము.

ఏతస్మిన్నంతరే త్రస్తా శ్శబ్దేన మహతా తతః
అర్దితా యూథపా మత్తా స్సయూథా దుద్రువు ర్దిశః. ౪

టీక॥ఏతస్మిన్=ఈ; అంతరే=సమయమునందు; మత్తాః=మదించిన; యూథపాః=గుంపులంబాలించునట్టియేనుంగులు; తతః=ఆ; మహతా=గొప్పదగు; శబ్దేన=ధ్వనిచేత; త్రస్తాః=భయపడినవై; అర్దితాః = పీడింపఁబడినవై; సయూథాః=గుంపులతోఁగూడినవై; దిశః= దిక్కులనుగూర్చి; దుద్రువుః=పాఱినవి.

ఈసమయమునందే, ఆశబ్దంబునకు వెఱచి, భయపీడితంబులయి, మత్తగజంబులు, గజయూథంబులతోఁగూడ, దిక్కులకుంబాఱినవి.

అని, తాత్పర్యము.

స తం సైన్యసముద్ధూతం శబ్దం శుశ్రావ రాఘవః
తాంశ్చ విప్రద్రుతాన్ సర్వాన్ యూథపా నన్వవైక్షత. ౫

టీక॥ సః=ఆ; రాఘవః=రాముండు; సైన్యసముద్ధూతం=సైన్యములచేఁగలిగింపఁబడిన; తం=ఆ; శబ్దం=ధ్వనిని; శుశ్రావ=వినెను. విప్రద్రుతాన్=పరుగెత్తిన; తాన్=ఆ; యూథపాన్=గుంపులంబాలించునట్టి మదపుటేనుంగులను; సర్వాంశ్చ= అన్నిటినిగూడ; అన్వవైక్షత=చూచెను.

రాముండు, సైన్యధ్వనినివినెను; ఆధ్వనికిభయపడి పరుగెత్తుచున్నమదపుటేనుంగులనుంజూచెను.

అని, తాత్పర్యము.

తాంశ్చ విద్రవతో దృష్ట్వా తం చ శ్రుత్వా చ నిస్స్వనమ్
ఉవాచ రామ స్సౌమిత్రిం లక్ష్మణం దీప్తతేజసమ్. ౬

టీక॥ రామః= రాముఁడు; విద్రవతః=పరుగెత్తుచున్న; తాంశ్చ= ఆయేనుంగులను; దృష్ట్వా=చూచి; తం= ఆ; నిస్స్వనంచ=ధ్వనిని; శ్రుత్వా=విని; సౌమిత్రం= సుమిత్రకొడుకైన; దీప్తతేజసం= వెలుంగుచున్న కాంతిగల; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; ఉవాచ= చెప్పెను.

రాముండు, భయంబునంబరుగెత్తుచున్నయాయేనుంగులనుంజూచి,యమ్మహాధ్వనియు నాలకించి, కాంతిమంతుండగు సుమిత్రాపుత్రుండయిన లక్ష్మణుం జూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

హంత లక్ష్మణ పశ్యే హ సుమిత్రా సుప్రజా స్త్వయా
భీమ స్తనితగంభీర స్తుములః శ్రూయతే స్వనః. ౭

టీక॥హంత=ఆ!లక్ష్మణ=లక్ష్మణుఁడా! ఇహ=ఇచ్చట; పశ్య= చూడుము. త్వయా=నీచేత; సుమిత్రా=సుమిత్ర; సుప్రజాః= మంచిసంతానముగలది. భీమ స్తనితగంభీరః=భయంకరమయినమేఘగర్జనమువలె గంభీరమును; తుములః=దొమ్మియునగు; స్వనః= ధ్వని; శ్రూయతే=వినఁబడుచున్నది.

ఆ! ఇదియేమి! లక్ష్మణుఁడా! ఈతట్టుచూడు;సుమిత్రనీవలన మంచిపుత్రుఁడుగలదైనది; భయంకరమగు మేఘగర్జనము వంటి మహాధ్వని యొకటి వినవచ్చుచున్నది. అని తాత్పర్యము.

గజయూథానివా రణ్యే మహిషావా మహావనే
విత్రాసితా మృగా స్సింహై స్సహసా ప్రద్రుతా దిశః. ౮

టీక॥మహావనే= పెద్దవనమగు; అరణ్యే=అడవియందు; గజయూథానివా= ఏనుంగుల సమూహములుగాని; మహిషావా= ఎనుపోతులుగాని; మృగాః= మృగములుగాని; సింహైః(సహ)=సింహములతోఁగూడ; విత్రాసితాః = భ

యపఱుపఁబడినవై; సహసా= వేగంబున; దిశః= దిక్కులనుగూర్చి; ప్రద్రుతాః=పరుగెత్తుచున్నవి.

మహారణ్యంబునందు, ఏనుంగులుగాని యెనుపోతులుగాని మృగంబులుగాని సింహములుగాని, సమస్త మృగంబులును, భయంబునొంది, నలుదిక్కులకుం బాఱుచున్నవి. అని, తాత్పర్యము.

రాజా వా రాజమాత్రో వా మృగయా మటతే వనే
అన్య ద్వా శ్వాపదం కించి త్సౌమిత్రే జ్ఞాతు మర్హసి. ౯

టీక॥ రాజా వా=రాజుగాని; రాజమాత్రో వా=రాజంతటివాఁడుగాని; వనే=అడవియందు; మృగయాం= వేఁటనుగూర్చి; అటతే=తిరుగుచున్నాఁడో; అన్యత్=ఇతరమయిన; కించిత్= ఒకానొక; శ్వాపదం వా=క్రూరజంతువో; సౌమిత్రే= లక్ష్మణుఁడా! జ్ఞాతుం=ఎఱుంగుటకు; అర్హసి=తగుదువు.

రాజుగాని రాజతుల్యుండుగాని యెవ్వఁడేని వేఁటాడుచున్నాఁడా? లేక, ఏదైననొక గొప్ప క్రూరజంతువు వచ్చియున్నదా? లక్ష్మణుఁడా! దీనిం దెలిసికొనుము. అని, తాత్పర్యము-

సుదుశ్చరో గిరిశ్చాయం పక్షిణామపి లక్ష్మణ
సర్వ మేత ద్యథాతత్త్వ మచిరాత్ జ్ఞాతు మర్హసి. ౧౦

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! అయం=ఈ; గిరిశ్చ = చిత్రకూటపర్వతమును; పక్షిణామపి=పక్షులకునుగూడ; సుదుశ్చరః=సంచరింపనలవిగానిది ఏతత్=దీని; సర్వం = అంతను; యథాతత్త్వం=నిశ్చయమునతిక్రమింపక; అచిరాత్=శీఘ్రముగా; జ్ఞాతుం=ఎఱుంగుటకు; అర్హసి=తగుదువు.

లక్ష్మణుఁడా! పక్షులకుఁగూడ, చిత్రకూట పర్వతంబున సంచరింపనలవిగాదు; ఎందువలననీశబ్దము గలిగినదో, చక్కఁగాఁజూచి, శీఘ్రమున యథార్థముఁ దెలిసికొనుము. అని, రాముండు, లక్ష్మణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

స లక్ష్మణ స్సత్వరిత స్సాల మారుహ్య పుష్పితమ్
ప్రేక్షమాణో దిశ స్సర్వాః పూర్వాం దిశ ముదైక్షత. ౧౧

టీక॥ సః=ఆ; లక్ష్మణః= లక్ష్మణుఁడు; సత్వరితః=వేగముతోఁగూడినవాఁడై; పుష్పితం= పూచినట్టి; సాలం= వృక్షమును; ఆరుహ్య=ఎక్కి; సర్వాః=సమస్తములయిన; దిశః=దిక్కులను; ప్రేక్షమాణః= చూచుచు; పూర్వాందిశం= తూర్పుదిక్కును; ఉదైక్షత=చూచెను.

అంత, నాలక్ష్మణుండు, వేగంబున నొకపుష్పితవృక్షమునారోహించి, యన్నిదిక్కులంజూచుచుఁ, దూర్పుదిక్కునంజూచెను. అని, తాత్పర్యము.

ఉదఙ్ముఖః ప్రేక్షమాణో దదర్శ మహతీం చమూమ్
రథాశ్వగజసంబాధాం యత్తై ర్యుక్తాం పదాతిభిః. ౧౨

టీక॥ సః(అధ్యాహృతము)= ఆలక్ష్మణుఁడు; ఉదఙ్ముఖః = ఉత్తరపుదిక్కు మొగముగలవాఁడై ; ప్రేక్షమాణః = చూచుచు ; రథాశ్వగజసంబాధాం= రథముల చేతను గుఱ్ఱముల చేతను ఏనుంగుల చేతను నిండినదియు; యత్తైః= సన్నద్ధులగు; పదాతిభిః=కాలిబంటులతో; యుక్తాం=కూడినదియునగు; మహతీం=గొప్పదైన; చమూం=సేనను; దదర్శ=చూచెను.

అంత నాలక్ష్మణుండు, ఉత్తరపుతట్టుతిరిగి, చూడఁగా, రథాశ్వగజంబులతో నిండినదియు సన్నద్ధులగు పదాతులతోఁగూడినదియునగు గొప్పసేన యగపడెను. అని, తాత్పర్యము.

తా మశ్వగజసంపూర్ణాం రథధ్వజవిభూషితామ్
శశంస సేనాం రామాయ వచనంచేద మబ్రవీత్. ౧౩

టీక॥ సః(అధ్యాహృతము)= ఆలక్ష్మణుఁడు; అశ్వగజసంపూర్ణాం=గుఱ్ఱంబుల చేతను ఏనుంగుల చేతను నిండినదియు; రథధ్వజవిభూషితాం = రథములయందుఁగట్టఁబడిన ధ్వజముల చేనలంకరింపఁబడినదియునగు; తాం=ఆ;

సేనాం=సేనను; రామాయ=రామునికొఱకు; శశంస=తెలిపెను. ఇదం=ఈ; వచనంచ=మాటనుగూడ; అబ్రవీత్=చెప్పెను.

లక్ష్మణుండు, అట్లు, గుణంబులతో నుపేనుంగులతోనునిండినదియు నానావిధధ్వజాలంకృతంబునగుగొప్ప సేనయొకటివచ్చుచున్నదని రామునకుం దెల్పి, యంతనీమాటనుం జెప్పెను. అని తాత్పర్యము.

అగ్నిం సంశమయత్వార్య స్సీతాచ భజతాం గుహామ్
సజ్యం కురుష్వ చాపంచ శరాంశ్చ కవచం తథా. ౧౪

టీక॥ ఆర్యః=పూజ్యుండవగునీవు; అగ్నిం=అగ్నిహోత్రమును; సంశమయతు=ఆర్పుము. సీతాచ=సీతాదేవియు; గుహాం=గుహను; భజతాం=పొందునుగాక. చాపంచ=వింటిని; సజ్యం=నారితోఁగూడునట్లుగా; కురుష్వ=చేసికొనుము. తథా=అట్లు; శరాంశ్చ=బాణములను; కవచం=కవచమును; గృహాణ(అధ్యాహృతము)=గ్రహింపుము.

ఇంక, నగ్నిహోత్రంబునుజల్లార్చి, సీతనుగుహలోనికింబంపుము, ధనువుసజ్యంబుగావించుకొనుము; బాణంబులను గ్రహింపుము; కవచంబుదొడుగుము. అని లక్ష్మణుండు, రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తం రామః పురుషవ్యాఘ్రో లక్ష్మణం ప్రత్యువాచ హ

టీక॥ పురుషవ్యాఘ్రః=పురుషశ్రేష్ఠుండగు; రామః=రాముఁడు, తం=ఆ; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; ఉవాచ=చెప్పెను "హ" అనునది పాదపూరణార్థము-

అంతఁ, బురుషశ్రేష్ఠుండగురాముండు, లక్ష్మణుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము-

అంగావేక్షస్వ సౌమిత్రే కస్యే మాం మన్యసే చమూమ్. ౧౫

టీక॥ అంగ=అయ్యా! సౌమిత్రే=లక్ష్మణుఁడా! అవేక్షస్వ=చూడుము. ఇ




మాం=ఈ; చమూం=సేనను; కస్య= ఎవ్వనిదిగా; మన్యసే=తలంచెదవు?

అయ్యా! లక్ష్మణుఁడా! చక్కఁగాఁజూడుము; ఈసేన యెవ్వనిదిగానీకుఁదోఁచుచున్నది? అని, రాముండు, లక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు రామేణ లక్ష్మణో వాక్య మబ్రవీత్
దిధక్షన్నివ తాం సేనాం రుషితః పావకో యథా-౧౬

టీక॥లక్ష్మణః = లక్ష్మణుఁడు; రామేణ=రామునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తస్తు=చెప్పఁబడినవాఁడైనంతనే; పావకో యథా=అగ్నిహోత్రుండువలె; రుషితః=కోపించినవాఁడై; తాం=ఆ; సేనాం=సేనను; దిధక్షన్నివ(స్థితః) = దహింపనిచ్ఛించు వాఁడువలె నున్నవాఁడై; వాక్యం=మాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంత, లక్ష్మణుండు, రాముండుచెప్పినమాటనువిని, కోపంబున, నగ్నిహోత్రుండువలె మండిపడి, యాసేననుదహించుకైవడిఁ, జుఱచుఱంజూచుచు, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

సంపన్నం రాజ్య మిచ్ఛంస్తు వ్యక్తం ప్రాప్యాభిషేచనమ్
ఆవాం హంతుం సమభ్యేతి కైకేయ్యా భరత స్సుతః. ౧౭

టీక॥కైకేయ్యాః = కైకేయియొక్క; సుతః=కొడుకైన; భరతః = భరతుఁడు; అభిషేచనం= పట్టాభిషేకమును; ప్రాప్య=పొంది; సంపన్నం=సమృద్ధమయిన, నిష్కంటకమయిన; రాజ్యం=రాజ్యమును; ఇచ్ఛంస్తు = కోరువాఁడై; ఆవాం=మనలను; హంతుం=చంపుటకు; సమభ్యేతి=వచ్చుచున్నాఁడు- వ్యక్తం=స్పష్టము-

కైకేయికొడుకుభరతుండు, తల్లివరముచొప్పునఁ, బట్టాభిషిక్తుండై, యంతటితోఁదనివినొందక, నిష్కంటకమగురాజ్యముంగోరి, మనలంజంపనిచ్చటికివచ్చుచున్నాఁడు; ఇది, స్పష్టము-

అని, తాత్పర్యము-

ఏష వై సుమహాం శ్ఛ్రీమాన్ విటపీ సంప్రకాశతే




విరాజ త్యుద్గతస్కంధః కోవిదారధ్వజో రథే. ౧౮

టీక॥ఏషః=ఈ; సుమహాన్=మిక్కిలియుగొప్పదియు; శ్రీమాన్=కాంతిగలదియునగు;విటపీ=వృక్షము;సంప్రకాశతేవై = ప్రకాశించుచున్నదిగదా!రథే=రథమునందు; ఉద్గతస్కంధః = ఉన్నతమయినబోదెగల ; కోవిదారధ్వజః=కాంచనపుచెట్టుధ్వజము; విరాజతి=ప్రకాశించుచున్నది.

ఇదిగో! మిక్కిలియు గొప్పదియు శ్రీమంతంబునగువృక్షము ధ్వజంబునగుపడుచున్నవి; ఉన్నతమయినస్కంధము గలకాంచనపుచెట్టుధ్వజమురథంబున వెలుంగుచున్నది. అని, తాత్పర్యము.

అసౌ హి సుమహాస్కంధో విటపీచ మహాద్రుమః
విరాజతి మహాసైన్యే కోవిదారధ్వజో రథే.

టీక॥సుమహాస్కంధః = మిక్కిలియు గొప్పదగుబోదె గలదియు; విటపీచ=కొమ్మలుగలదియు;మహాద్రుమః=పెద్దవృక్షమయినదియునగు; అసౌ = ఈ; కోవిదారధ్వజః=కాంచనపుచెట్టుధ్వజము; మహాసైన్యే=గొప్పసైన్యమునందు;రథే= రథమునందు; విరాజతిహి=ప్రకాశించుచున్నదిగదా!

గొప్పస్కంధము గలదియును, గొమ్మలుగలదియు నగు కాంచనపుచెట్టుధ్వజము, మహాసేనయందు,రథంబున, వెలుంగుచున్నది.

అని, తాత్పర్యము.

ఈశ్లోకంబువ్యాఖ్యానంబులం బరిగణితంబుగాలేదుకావున, నిందులెక్కింపఁబడదయ్యె.

భజంత్యే తే యథాకామ మశ్వా నారుహ్య శీఘ్రగాన్

టీక॥ఏతే=ఈగుఱ్ఱపువారలు; యథాకామం=యథేచ్ఛగా;శీఘ్రగాన్=శీఘ్రముగానడచునట్టి; అశ్వాన్= గుఱ్ఱములను;ఆరుహ్య=ఎక్కి;భజంతి=పొందుచున్నారు.

ఈయాశ్వికులు, వేగగమనంబులగు గుఱ్ఱంబులనెక్కి, సంతోషంబుననిచ్చటికి వచ్చుచున్నారు. అని, తాత్పర్యము.

ఏతే భ్రాజంతి సంహృష్టా గజా నారుహ్య సాదినః. ౧౯

టీక॥ ఏతే=ఈ; సాదినః=ఏనుఁగు మీఁదఁగూర్చుండువారలు; గజాన్=ఏనుంగులను; ఆరుహ్య=ఎక్కి; సంహృష్టాః=సంతసించినవారలయి; భ్రాజంతి=ప్రకాశించుచున్నారు.

ఈగజసాదులు,ఏనుంగులమీఁదగూర్చుండి,మిక్కిలియుసంతుష్టులయి, వెలుంగుచున్నారు. అని, తాత్పర్యము.

గృహీతధనుషౌచా వాం గిరిం వీర శ్రయావహై
అథవే హైవ తిష్ఠావ స్సన్నద్ధా వుద్యతాయుధౌ. ౨౦

టీక॥వీర=పరాక్రమశాలివగు రాముఁడా ! ఆవాంచ= మనమును; గృహీతధనుషౌ = గ్రహింపఁబడినధనుస్సుగలవారలమయి; గిరిం= పర్వతమును; శ్రయావహై= పొందెదము. అథవా=అటుగాదేని; సన్నద్ధౌ= కవచంబుదొడగికొన్నవారలమయి ; ఉద్యతాయుధౌ= పట్టుకొనఁబడిన యాయుధముగలవారలమయి; ఇహైవ= ఇచ్చటనే; తిష్ఠావః=ఉండెదము.

పరాక్రమశాలివగు రాముఁడా! మనము, ధనుస్సుంగైకొని, పర్వతమునాశ్రయించెదము; అటుగాదేని, సన్నద్ధులమయి,యాయుధంబులుధరించి , యిచ్చటనెయుండెదము.

అని, తాత్పర్యము-

అపి నౌ వశ మాగచ్ఛే త్కోవిదారధ్వజో రణే

టీక॥కోవిదారధ్వజః= కాంచనపుచెట్టుధ్వజముగలభరతుండు;రణే=యుద్ధమునందు; నౌ=మనయొక్క;వశం= అధీనతను ; ఆగచ్ఛేదపి = పొందును గదా!

ఇంకఁగోవిదారధ్వజుండగుభరతుండు, యుద్ధంబున మనచేతులం జిక్కఁబోవుచున్నాఁడుగదా!

అని, తాత్పర్యము.

అపి ద్రక్ష్యామి భరతం యత్కృతే వ్యసనం మహత్. ౨౧

త్వయా రాఘవ సంప్రాప్తం సీతయాచ మయా తథా

టీక॥రాఘవ=రాముఁడా!యత్కృతే=ఎవ్వనినిమిత్తమయి; త్వయా= నీచేతను;సీతయాచ=సీతాదేవిచేతను;తథా=అట్లు; మయా = నాచేతను; మహత్=అధికమయిన; వ్యసనం=దుఃఖము; సంప్రాప్తం=పొందఁబడినదో ; తం(అధ్యాహృతము)=అట్టి:భరతం=భరతుని ; అపిద్రక్ష్యామి = చూతును గదా!

రాముఁడా ! ఎవ్వనినిమిత్తమయి, నీవునుసీతయునేనును , ఇట్టిమహాదుఃఖమునొందితిమో, అట్టిభరతునిప్పుడు , యుద్ధంబునంజూడఁగలనుగదా!

అని, తాత్పర్యము.

యన్నిమిత్తం భవాన్ రాజ్యాచ్చ్యుతో రాఘవ శాశ్వతాత్. ౨౨
సంప్రాప్తో యమరి ర్వీర భరతో వధ్యఏవ మే

టీక॥వీర=పరాక్రమశాలివగు;రాఘవ=రాముఁడా! యన్నిమిత్తం=ఎవ్వనినిమిత్తమై; భవాన్=నీవు;శాశ్వతాత్=స్థిరమయిన; రాజ్యాత్= రాజ్యమునుండి;చ్యుతః=జాఱితివో; అయం=ఈ;అరిః=శత్రుఁడయిన; భరతః = భరతుఁడు; సంప్రాప్తః=వచ్చినాఁడు. మే=నాకు; వధ్యఏవ=చంపఁదగినవాఁడే.

వీరుండవగురాముఁడా!ఎవ్వనినిమిత్తమయి, నీవు, శాశ్వతంబగురాజ్యంబునువిడువవలసివచ్చినదో, అట్టి, భరతుండువచ్చినాఁడు ; ఇతండు , నాకు వధ్యుఁడు; సందియము లేదు.

అని, తాత్పర్యము.

భరతస్య వధే దోషం నాహం పశ్యామి రాఘవ. ౨౩
పూర్వాపకారిణాం త్యాగే నహ్యధర్మో విధీయతే

టీక॥రాఘవ=రాముఁడా!అహం=నేను;భరతస్య = భరతునియొక్క;వధే=చంపుటయందు;దోషం=దోషమును;నపశ్యామి=చూడను. పూర్వాపకారిణాం= ముందపకారముచేసినవారలయొక్క; త్యాగే= విడుచుటయందు;అధర్మః=అధర్మము; నవిధీయతేహి = విధింపఁబడదుగదా!

రాముఁడా! భరతునివధించుటయం దేదోషంబును నాకగపడలేదు; ముందుగానపకారంబు గావించువారలవధించుటచేనధర్మము లేదుగదా! అని, తాత్పర్యము.

పూర్వాపకారీ భరత స్త్యక్తధర్మశ్చ రాఘవ. ౨౪
ఏతస్మి న్నిహతే కృత్స్నా మనుశాధి వసుంధరామ్

టీక॥ రాఘవ = రాముఁడా! భరతః=భరతుఁడు; పూర్వాపకారీ=ముందుగానపకారము గావించినవాఁడు. త్యక్తధర్మశ్చ= విడువఁబడినధర్మముగలవాఁడును. ఏతస్మిన్= ఈభరతుఁడు; నిహతే=చంపఁబడఁగా; కృత్స్నాం= సమస్తమయిన; వసుంధరాం = భూమిని; అనుశాధి=పాలింపుము.

రాముఁడా! భరతుఁడు, ముందుగా నపకారముగావించినవాఁడు, మఱియు ధర్మంబువిడిచినవాఁడు; అతండు నిహతుండైనపిమ్మట, నీవుసుఖంబుగా భూమినంతయుఁబాలింపుము. అని, తాత్పర్యము.

అద్య పుత్రం హతం సంఖ్యే కైకేయీ రాజ్యకాముకా. ౨౫
మయా పశ్యే త్సుదుఃఖార్తా హస్తిభగ్న మివ ద్రుమమ్

టీక॥ రాజ్యకాముకా=రాజ్యమును గోరునట్టి; కైకేయీ=కైకేయి; సుదుఃఖార్తా = మిక్కిలియుదుఃఖముచేఁబీడింపఁబడినదై; అద్య=ఇప్పుడు; మయా= నాచేత; సంఖ్యే=యుద్ధమునందు; హతం=చంపఁబడిన; పుత్రం=కొడుకును; హస్తిభగ్నం=ఏనుఁగుచేవిఱువఁబడిన; ద్రుమమివ=వృక్షమునువలె; పశ్యేత్ = చూచుఁగాక.

రాజ్యకామయగుకైకేయి, ఏనుంగుచేవిఱువఁబడినమహావృక్షముంబోలె, ఇప్పుడు, నాచేయుద్ధంబుననిహతుండై నేలంబడినకొడుకుంగనుంగొని, మిక్కిలియుదుఃఖింపంగలదు. అనితాత్పర్యము.

కైకేయీంచ వధిష్యామి సానుబంధాం సబాంధవామ్. ౨౬
కలుషేణాద్య మహతా మేదినీ పరిముచ్యతామ్

టీక॥ కైకేయీంచ = కైకేయినిం గూడ; సానుబంధాం = సంబంధముతోఁగూడినదానిఁగాను;సబాంధవాం= బంధువులతోఁగూడినదానిఁగాను; వధిష్యామి=చంపెదను. అద్య= ఇప్పుడు; మేదినీ=భూమి; మహతా = అధికమయిన; కలుషేణ=పాపముచేత ; పరిముచ్యతాం=విడువఁబడుఁగాక.

మంధరమొదలగునను బంధములతోను,సమస్తబంధువులతోనుఁగైకేయినిం గూడవధించెదను, భూమికైకేయీరూపమహాపాపంబువిడిచి, సుఖించును గాక. అని, తాత్పర్యము.

అద్యేమం సంయతం క్రోధ మసత్కారంచ మానద. ౨౭
మోక్ష్యామి శత్రుసైన్యేషు కక్షేష్వివ హుతాశనమ్

టీక॥ మానద= మానమునొసంగునట్టిరాముఁడా! అద్య= ఇప్పుడు; సంయతం=కట్టఁబడిన; క్రోధం=కోపమును; అసత్కారంచ=తిరస్కారమును; శత్రుసైన్యేషు = శత్రువులసేనలయందు;కక్షేషు= ఎండినగడ్డివామియందు; హుతాశనమివ=అగ్నిహోత్రమువలె; మోక్ష్యామి=విడిచెదను.

మానంబుఁగాపాడునట్టి రాముఁడా! ఇన్నిదినములుగానణఁచిపెట్టినక్రోధంబును,అవమానంబును, ఇప్పుడు,ఎండినగడ్డివామిపై నగ్నిహోత్రముంబోలె,శత్రుసైన్యంబులపైవిడిచెదను.

అని, తాత్పర్యము.

అద్యైతచ్చిత్రకూటస్య కాననం నిశితైశ్శరైః. ౨౮
ఛిందన్ శత్రుశరీరాణి కరిష్యే శోణితోక్షితమ్

టీక॥ అద్య=ఇప్పుడు; నిశితైః= తీక్ష్ణములయిన; శరైః= బాణములచేత; శత్రుశరీరాణి=శత్రువులశరీరమును ; ఛిందన్=ఛేదించుచు; ఏతత్=ఈ ; చిత్రకూటస్య= చిత్రకూటపర్వతముయొక్క; కాననం = అడవిని; శోణితోక్షితం = రక్తముచేఁదడుపఁబడినదానిఁగా; కరిష్యే=చేసెదను.

ఇప్పుడు , తీక్ష్ణబాణంబులచేశత్రుశరీరంబులఖండించియీచిత్రకూటపర్వ

తంబునందలియడవినంతయు, నెత్తురు వెల్లువలుగావించెదను.

అని, తాత్పర్యము.

శరై ర్నిర్భిన్నహృదయాన్ కుంజరాం స్తురగాం స్తథా. ౨౯
శ్వాపదాః పరికర్షంతు నరాంశ్చ నిహతాన్మయా

టీక॥శరైః=బాణములచేత; నిర్భిన్నహృదయాన్= భేదింపఁబడినగుండెలుగల; కుంజరాన్=ఏనుంగులను; తురగాన్=గుఱ్ఱంబులను; తథా=అట్లు; మయా=నాచేత; నిహతాన్=చంపఁబడిన; నరాంశ్చ = మనుష్యులను; శ్వాపదాః = క్రూరజంతువులు; పరికర్షంతు=ఈడ్చునుగాక.

నాబాణంబులచే భిన్నహృదయంబులయిపడిన యేనుంగులనుగుఱ్ఱంబులను, నిహతులయిన మనుష్యులను, ఈవనంబునందలి వ్యాఘ్రాదులు, ఈడ్చుకొనిపోవుఁగాక. అని, తాత్పర్యము.

శరాణాం ధనుషశ్చాహ మనృణోస్మి మహామృధే. ౩౦
ససైన్యం భరతం హత్వా భవిష్యామి నసంశయః

టీక॥అహం=నేను; శరాణాం=బాణములకును; ధనుషశ్చ=ధనుస్సునకును; అనృణః=అప్పులేనివాఁడను; అస్మి=అగుచున్నాను. మహామృధే = గొప్పయుద్ధమునందు; ససైన్యం=సైన్యములతోఁగూడిన; భరతం=భరతుని; హత్వా = చంపి; అనృణః(అధ్యాహృతము)=అప్పులేనివాఁడను; భవిష్యామి=అయ్యెదను. సంశయః=సందేహము; న=లేదు.

నేను, ఇదివఱకుఁ, బెక్కుయుద్ధంబులందు, బాణంబులకునుధనుస్సునకును, గావలసినంతయాహారంబొసంగి, యప్పుదీర్చుకొనియె యున్నాను; ఇప్పుడును, యుద్ధంబున, భరతునిససైన్యంబుగా సంహరించి, ధనుర్బాణంబులఋణంబు దీర్చుకొనియెదను; ఇందుసంశయములేదు. అని, లక్ష్మణుండు, రామునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

అయోధ్యాకాండే, షణ్ణవతి తమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండషణ్ణవతితమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

సప్తనవతితమసర్గ ప్రారంభః.

సుసంరబ్ధంతు సౌమిత్రిం లక్ష్మణం క్రోధమూర్ఛితమ్
రామస్తు పరిసాంత్వ్యాథ వచనం చేద మబ్రవీత్. ౧

టీక॥ అథ=అటుపిమ్మట; రామస్తు=రాముండుమాత్రము; సుసంరబ్ధం=మిక్కిలియు వేగిరపడుచున్నవాఁడును; క్రోధమూర్ఛితం=కోపముచేవ్యాపింపఁబడినవాఁడునగు; లక్ష్మణంతు=లక్ష్మణుని; పరిసాంత్వ్య = ఓడార్చి; ఇదం=ఈ; వచనంచ=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, రాముండుమాత్రము, ఇట్లుపరమకుపితుండై మహాసంరంభంబునను న్నలక్ష్మణునోదార్చి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

కి మత్ర ధనుషా కార్యం మసినా వా సచర్మణా
మహేష్వాసే మహాప్రాజ్ఞే భరతే స్వయ మాగతే. ౨

టీక॥ మహేష్వాసే=పెద్దధనుస్సుగలవాఁడును, మహాధనుర్ధరుండుననుట; మహాప్రాజ్ఞే= మహాపండితుండునగు; భరతే=భరతుండు; స్వయం=తానే; ఆగతే=వచ్చినవాఁడుగాఁగా; అత్ర=ఈవిషయమునందు; ధనుషా= ధనుస్సుచేత; కార్యం=పని; కిం = ఏమి? సచర్మణా= తోలుతోఁగూడిన, డాలువాలుతోఁగూడినయనుట; అసినావా=ఖడ్గముచేఁగాని; కిం, కార్యం (అధ్యాహృతము)




ఏమికార్యము? మహాధనుర్ధరుండును మహాపండితుండునగు భరతుండు, ఇతరప్రేరణము లేక, తానే, మనయొద్దకువచ్చినప్పుడు ధనస్సుతోఁగాని కత్తితోఁగాని, మేమికార్యము? అని, తాత్పర్యము.

పితు స్సత్యం ప్రతిశ్రుత్య హత్వా భరత మాగతమ్
కిం కరిష్యామి రాజ్యేన సాపవాదేన లక్ష్మణ. ౩

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! పితుః=తండ్రియొక్క; సత్యం=సత్యమును; ప్రతిశ్రుత్య=ప్రతిజ్ఞ చేసి; ఆగతం=వచ్చిన; భరతం=భరతుని; హత్వా=చంపి; సాపవాదేన=అపవాదముతోఁగూడిన; రాజ్యేన=రాజ్యముచేత; కిం=ఏమి; కరిష్యామి=చేయఁగలను?

లక్ష్మణుఁడా! పితృవాక్యముఁబాలించెదనని ప్రతిజ్ఞ చేసి, నాయొద్దకువచ్చిన భరతుంజంపుదునేని, యట్లుతండ్రిభరతునకు రాజ్యంబొసంగఁగా రాముండతనివధించి రాజ్యంబపహరించెనిని, జనులచే నిందితుండనగుదునే; అట్టిరాజ్యంబు నాకెందుకు? అని, తాత్పర్యము.

యద్ద్రవ్యం బాంధవానాంవా మిత్రాణాంవా క్షయే భవేత్
నాహం తత్ప్రతిగృహ్ణీయాం భక్షాన్విషకృతా నివ. ౪

టీక॥యత్=ఏ; ద్రవ్యం = ధనము; బాంధవానాంవా= బంధువులయొక్కగాని; మిత్రాణాంవా = స్నేహితులయొక్కగాని; క్షయే=నాశమునందు; భవేత్=అగునో; అహం=నేను; తత్=దాని; విషకృతాన్= విషముతోఁజేయఁబడిన; భక్షానివ=పిండివంటలనువలె; నప్రతిగృహ్ణీయాం=ప్రతిగ్రహింపను.

బంధువులకుఁగాని స్నేహితులకుఁగాని నాశముగలుగుటచే నేద్రవ్యంబువచ్చునో, అదివిషభక్ష్యంబువంటిది; దానినేనెంతమాత్రముప్రతిగ్రహింపను.

అని, తాత్పర్యము.

ధర్మ మర్థంచ కామంచ పృథివీంచాపి లక్ష్మణ
ఇచ్ఛామి భవతా మర్థే ఏత త్ప్రతిశృణోమి తే. ౫




టీక॥లక్ష్మణ = లక్ష్మణుఁడా! ధర్మం=ధర్మమును; అర్థంచ = ధనమును; కామంచ=కామమును; పృథివీంచాపి=భూమినిఁ భవతాం, అర్థే=మీనిమిత్తమై; ఇచ్ఛామి=కోరుచున్నాను. ఏతత్=దీనిని; తే=నీకొఱకు; ప్రతిశృణోమి=ప్రతిజ్ఞచేసెదను.

లక్ష్మణుఁడా ! ధర్మార్థకామంబులను, భూమిని, మీనిమిత్తమయి నేన గోరుచున్నానుగాని, వేఱుగ దు; నీవునమ్మవేని, ఇట్లని ప్రతిజ్ఞచేసెదను. అని, తాత్పర్యము.

భ్రాతౄణాం సంగ్రహార్థంచ సుఖార్థంచాపి లక్ష్మణ
రాజ్య మప్య హ మిచ్ఛామి సత్యేనా యుధ మాలభే. ౬

టీక॥లక్ష్మణ = లక్ష్మణుఁడా! అహం=నేను; రాజ్యమపి= రాజ్యమును గూడ; భ్రాతౄణాం = తమ్ములయొక్క; సంగ్రహార్థంచ= ధనసంగ్రహముకొఱకును; సుఖార్థంచాపి= సుఖముకొఱకును; ఇచ్ఛామి=కోరుచున్నాను. సత్యేన=సత్యముచేత; ఆయుధం=ఆయుధమును; ఆలభే=తాఁకెదను.

లక్ష్మణుఁడా ! రాజ్యమునుగూడ, తమ్ములుధనవంతులగుటకును వారలు సుఖంబునొందుటకునే కోరుచున్నానుగాని, నాకైకాదు; సత్యముగానాయాయుధమునుబట్టి శపథముసేయుచున్నాను. అని, తాత్పర్యము.

నేయం మమ మహీ సౌమ్య దుర్లభా సాగరాంబరా
నహీచ్ఛేయ మధర్మేణ శక్రత్వమపి లక్ష్మణ. ౭

టీక॥సౌమ్య=సౌమ్యుండవగు; లక్ష్మణ=లక్ష్మణుఁడా! సాగరాంబరా=సముద్రమేవస్త్రముగాఁగల; ఇయం = ఈ; మహీ=భూమి; మమ=నాకు; దుర్లభా=పొందఁగూడనిది; న=కాదు. శక్రత్వమపి=ఇంద్రత్వమునైనను; అధర్మేణ= అధర్మముచేత; నేచ్ఛేయం హి=కోరనుగదా!

సౌమ్యుండవగులక్ష్మణుఁడా ! సముద్ర పర్యంతంబగు నీభూమిని, సంపాదింప, నేను సమర్థుండుగాకపోతే దు; అయితే, అధర్మంబుననైనచో, నింద్రత్వంబునేని, యిచ్ఛింపను- అని, తాత్పర్యము.

యద్వినా భరతం త్వాంచ శత్రుఘ్నంచాపి మానద
భవేన్మమ సుఖం కించిత్ భస్మ తత్కురుతాం శిఖీ. ౮

టీక॥ మానద=మానమునొసంగునట్టి లక్ష్మణుఁడా! భరతం= భరతుని; త్వాంచ=నిన్నును; శత్రుఘ్నంచాపి =శత్రుఘ్ననినైనను; వినా=విడిచి; మమ= నాకు; యత్= ఏది; సుఖం = సుఖము; కించిత్ = ఒకానొకటి; భవేత్ = కలుగునో; తత్=దానిని; శిఖీ=అగ్నిహోత్రము; భస్మ=బూడిదగా; కురుతాం=చేయుఁగాక.

మానంబునుగాపాడునట్టిలక్ష్మణుఁడా! భరతునకును నీకును శత్రుఘ్ననకును లేక, నాకు, ఏసుఖంబుగలుగునో, దానినగ్నిహోత్రము భస్మము గావించుఁగాక; అదిమెట్టిదైనను, నేనంగీకరింపను. అని, తాత్పర్యము.

మన్యేహ మాగతోఽయోధ్యాం భరతో భ్రాతృవత్సలః
మమ ప్రాణాత్ప్రియతరః కులధర్మ మనుస్మరన్. ౯
శ్రుత్వా ప్రవ్రాజితం మాం హి జటావల్కలధారిణమ్
జానక్యా సహితం వీర త్వయాచ పురుషర్షభ. ౧౦
స్నేహేనాక్రాంతహృదయ శ్శోకేనా కులితేంద్రియః
ద్రష్టుమభ్యాగతో హ్యేష భరతో నా న్యథాగతః. ౧౧

టీక॥వీర=పరాక్రమశాలివియు; పురుషర్షభ=పురుషశ్రేష్ఠుండవునగులక్ష్మణుఁడా! భ్రాతృవత్సలః=తోఁబుట్టువులయందధికప్రీతిగలవాఁడును; మమ= నాకు; ప్రాణాత్= ప్రాణముకన్న; ప్రియతరః=మిక్కిలిప్రియుండునగు; భరతః= భరతుఁడు; కులధర్మం= కులముయొక్కధర్మమును; అనుస్మరన్=తలంచుచు; అయోధ్యాం= అయోధ్యాపట్టణమును; ఆగతః=పొందినవాఁడై; మాం= నన్ను; ("హ" అనునది పాదపూరణార్థము) జటావల్కలధారిణం=జటలను నారచీరలను ధరించినవాఁడనై; జానక్యా=సీతతోను; త్వయాచ = నీతోను; సహితం=కూడినవాఁడనై; ప్రవ్రాజితం= అడవికిఁబంపఁ బడినవానిగా;




శ్రుత్వా=విని; స్నేహేన= స్నేహము చేత; ఆక్రాంతహృదయః=ఆక్రమింపఁబడినమనసుగలవాఁడై; శోకేన= దుఃఖము చేత;ఆకులితేంద్రియః=కలఁతపఱుపఁబడినయింద్రియములుగలవాఁడై;ద్రష్టుం=చూచుటకు; అభ్యాగతో హి= వచ్చినవాఁడుగదా! ఏషః=ఈ; భరతః= భరతుఁడు; అన్యధా=వేఱువిధముగా; ఆగతః=వచ్చినవాఁడు; న = కాఁడు. ఇతి(అధ్యాహృతము) = అని;అహం= నేను;మన్యే=తలంచెదను.

తోఁబుట్టువులయందధిక ప్రేమగలవాఁడును నాకుఁ బ్రాణంబుకన్నం బ్రియుండునగు భరతుండు , కులధర్మంబుఁదలంచుకొని, " ఎల్లప్పుడును మామయింటనెయుండఁగూడదు,పితృశుశ్రూష సేయవలె " నని, యయోధ్యకు వచ్చియుండును; అంత, నేను, దండ్రియాజ్ఞచే,జటావల్కలంబులు ధరించి,నీతోను సీతతోనుంగూడ, నడవికి వచ్చుటనువిని, మనయందధిక స్నేహముగలవాఁడగుటచేతఁ,బరమదుఃఖితుండై, మనలంజూడ వచ్చినాఁడుగాని, వేఱుగాదు; అనినా కుందోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

అంబాం చ కైకయీం రుష్య పరుషం చాప్రియం వదన్
ప్రసాద్య పితరం శ్రీమాన్ రాజ్యం మే దాతు మాగతః. ౧౨

టీక॥ శ్రీమాన్=అధికమయినకాంతిగల; భరతః(అధ్యాహృతము)=భరతుఁడు; రుష్య(రుషిత్వా)=కోపించి ; అంబాం=తల్లియయిన;కైకేయీంచ= కైకేయినిగూర్చియు; పరుషం= నిష్ఠురముగాను; అప్రియంచ=దుఃఖము గలుగునట్లుగాను; వదన్=చెప్పుచు ; పితరం=తండ్రిని; ప్రసాద్య=సంతోషింపఁజేసి; మే=నాకొఱకు; రాజ్యం = రాజ్యమును; దాతుం=ఇచ్చుటకు;ఆగతః=వచ్చినాఁడు.

శ్రీమంతుండగు భరతుండు , పరమకుపితుండై ; తల్లియగు కైకేయితోనిష్ఠురంబులునప్రియంబులునగువాక్యంబులాడి, తండ్రినిం బ్రార్థించి ప్రసన్నుంగావించి, నాకు రాజ్యంబొసంగుటకై యిచ్చుటకివచ్చియున్నాఁడు.

అని, తాత్పర్యము.

ప్రాప్తకాలం య దేషో స్మాన్ భరతో ద్రష్టు మిచ్ఛతి




టీక॥ ఏషః=ఈ; భరతః= భరతుఁడు; అస్మాన్=మనలను; ద్రష్టుం=చూచుటకు; ఇచ్ఛతి(ఇతి)యత్= కోరుచున్నాఁడనునదియేదిగలదో;తత్(అధ్యాహృతము)=అది;ప్రాప్తకాలం=పొందఁబడినకాలముగలది,కాలోచితమనుట.

ఈభరతుండిప్పుడు మనలంజూడవచ్చుటయీసమయమునకుఁదగినదిగానేయున్నది. అని,తాత్పర్యము.

అస్మాసు మనసాప్యేష నా ప్రియం కించి దాచరేత్. ౧౩

టీక॥ ఏషః= ఈభరతుఁడు; మనసాపి=మనసుచేనైనను; అస్మాసు=మనయందు; అప్రియం= అపకారమును; కించిత్ =కొంచమయినను;నాచరేత్=చేయఁడు.

ఈభరతుండు,మనసననైనను,మనకుఁగొంచమేనియునపకారము సేయందలంపఁడు. అని, తాత్పర్యము.

విప్రియం కృతపూర్వం తే భరతేన కదాను కిమ్
ఈదృశం వా భయం తేద్య భరతం యోత్ర శంకసే. ౧౪

టీక॥భరతేన=భరతునిచేత; తే=నీకొఱకు;కదాను = ఎప్పుడైనను;విప్రియం=అపకారము; కృతపూర్వంకిం=మున్నుచేయఁబడినదా? తే=నీకొఱకు; ఈదృశం=ఇట్టి;భయంవా= భయముగాని, భయజనకమయిన మాటగాని; కృతపూర్వంకిం(అధ్యాహృతము)=మున్నుచేయఁబడినదా?మున్నుచెప్పఁబడినదా?యనుట.యః(త్వం) = ఏనీవు;అద్య=ఇప్పుడు;అత్ర=ఇచ్చట; భరతం=భరతునిగూర్చి;శంకసే= సందేహించుచున్నావో.

ఇంతకుమును పెప్పుడేని, భరతుండు నీకపకారముగావించియున్నాఁడా? లేక, ఇట్టిభయమునుగలిగించునట్టి మాటనైననుజెప్పియున్నాఁడా? ఏలయిప్పుడిచ్చట, భరతునియందుసందేహించుచున్నావు?అని, తాత్పర్యము.

న హి తే నిష్ఠురం వాచ్యో భరతో నా ప్రియం వచః
అహం హ్య ప్రియ ముక్త స్స్యాం భరతస్యా ప్రియే కృతే. ౧౫




టీక॥ తే = నీకు, నీచేతననుట; భరతః = భరతుఁడు; నిష్ఠురం = పరుషమయినమాటను; నవాచ్యః = చెప్పఁదగినవాఁడుకాఁడు. అప్రియం = అనిష్టమగు; వచః = మాటను; న(వాచ్యః) = చెప్పఁదగినవాఁడుకాఁడు. భరతస్య = భరతునకు; అప్రియే = దుఃఖకరవచనము; కృతే = చేయఁబడఁగా, చెప్పఁబడఁగాననుట; అహం = నేను, అప్రియం = దుఃఖకరమయినమాటను, ఉక్తః = చెప్పఁబడినవాఁడను; స్యాం హి = అగుదునుగదా!

నీవు భరతుఁజూచి, యెంతమాత్రము, పరుషవచనముగాని, యప్రియవాక్యముఁగాని చెప్పవలదు; అతనిఁజెప్పిన, నన్నుఁజెప్పినట్లెయగును.

అని, తాత్పర్యము.

కథం ను పుత్రాః పితరం హన్యుః కస్యాంచి దాపది
భ్రాతా వా భ్రాతరం హన్యా త్సౌమిత్రే ప్రాణ మాత్మనః. ౧౬

టీక॥ సౌమిత్రే = లక్ష్మణుఁడా! కస్యాంచిత్ = ఒకానొక; ఆపది = ఆపదయందు; పుత్రాః = కొడుకులు; ఆత్మనః = తనయొక్క; ప్రాణం = ప్రాణభూతుండగు; పితరం = తండ్రిని; కథన్ను = ఎట్లు; హన్యుః = చంపుదురు? భ్రాతా వా = తోఁబుట్టువుగాని; ఆత్మనః, ప్రాణం (అధ్యాహృతము) = తనప్రాణభూతుండగు; భ్రాతరం = తోఁబుట్టువును; కథం (అధ్యాహృతము) = ఎట్లు; హన్యాత్ = చంపును?

లక్ష్మణుఁడా! ఏదోయొకయాపదరాఁగానే, కొడుకులు, తమప్రాణభూతుండగుతండ్రినిగాని, అట్లు, తోఁబుట్టువునుగాని, యెట్లుచంపుకొందురు? ఇట్టియనుచితవచనంబులాడెదవేల? అని, తాత్పర్యము.

విశేషార్థము.—"లక్ష్మణుండు, మున్ను, తండ్రియగుదశరథునింగూడవధింపవలయునని చెప్పెను; ఇప్పుడుభరతునివధింపవలయుననుచున్నాఁడు; ఇతనిరౌద్రబుద్ధినిబోఁగొట్టవలెను" అని, రాముండిట్లు, నొక్కిచెప్పినాఁడు.

అని, తాత్పర్యము,

యది రాజ్యస్య హేతో స్త్వ మిమాం వాచం ప్రభాషసే
వక్ష్యామి భరతం దృష్ట్వా రాజ్య మస్మై ప్రదీయతామ్. ౧౭




టీక॥త్వం=నీవు; రాజ్యస్య=రాజ్యమను; హేతోః= (పంచమ్యర్థమందు షష్ఠి)కారణమువలన; ఇమాం=ఈ; వాచం=మాటను; ప్రభాషసేయది=చెప్పుదువేని; భరతం=భరతుని; దృష్ట్వా=చూచి; అస్మై=ఇతనికొఱకు; రాజ్యం=రాజ్యము; ప్రదీయతాం=ఇవ్వఁబడుఁగాక. ఇతి(అధ్యాహృతము)= అని; వక్ష్యామి=చెప్పెదను.

నీవు, రాజ్యంబుగావలెనను కోరికచే నిట్లు, భరతునిహింసింపవలెనని చెప్పుదువేని, భరతుండు రాఁగానే, యతనిం జూచి, "అప్పా! నీవు రాజ్యమునులక్ష్మణునకిచ్చివేయుము; అతఁడు, రాజ్యంబుగావలెననికోరుచున్నాఁడు" అనిచెప్పెదను. అని, తాత్పర్యము.

ఉచ్యమానోపి భరతో మయా లక్ష్మణ తత్త్వతః
రాజ్య మస్మై ప్రయచ్ఛేతి బాఢమిత్యేవ వక్ష్యతి. ౧౮

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! భరతః=భరతుండు; మయా=నాచేత; అస్మై=ఈలక్ష్మణునికొఱకు; రాజ్యం=రాజ్యమును; ప్రయచ్ఛ=ఇమ్ము. ఇతి=అని; ఉచ్యమానోపి=చెప్పఁబడినవాఁడైనను; తత్త్వతః= యథార్థముగా; బాఢమితి=మంచిదని; వక్ష్యత్యేవ=అవశ్యముచెప్పును.

లక్ష్మణుఁడా! "నీవు రాజ్యమునులక్ష్మణునకి"మ్మని, నేనుమాట మాత్రము చెప్పినంతనే, భరతుండు, తత్క్షణంబున, "అట్లేయిచ్చెద" నని, చెప్పును; వేఱొండుమాటనఁడు. అని, రాముండు, లక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తథోక్తో ధర్మశీలేన భ్రాత్రా తస్య హితే రతః
లక్ష్మణః ప్రవివేశేవ స్వాని గాత్రాణి లజ్జయా. ౧౯

టీక॥తస్య=ఆరామునియొక్క; హితే=మేలునందు; రతః=ఆసక్తుఁడయిన; లక్ష్మణః=లక్ష్మణుఁడు; తథా=అట్లు; ధర్మశీలేన= ధర్మ స్వభావుండగు; భ్రాత్రా=అన్నయగురామునిచేత; ఉక్తః= చెప్పఁబడినవాఁడై; లజ్జయా=

సిగ్గుచేత; స్వాని=తనదైన; గాత్రాణి= అవయవములను; ప్రవివేశేవ = ప్రవేశించునట్లుండెను.

రామ హితంబుకొఱకే యన్నిమాటలుం జెప్పినట్టిలక్ష్మణుండు, రాముండిట్లు చెప్పినమాటలనువిని, యంతలజ్జితుండై తలవంచుకొని, యుండెను.

అని, తాత్పర్యము.

త ద్వాక్యం లక్ష్మణ శ్శ్రుత్వా వ్రీళితః ప్రత్యువాచహ
త్వాం మన్యే ద్రష్టు మాయాతః పితా దశరథ స్స్వయమ్. ౨౦

టీక॥ లక్ష్మణః= లక్ష్మణుఁడు; తద్వాక్యం= ఆరామునిమాటను; శ్రుత్వా=విని; వ్రీళితః= సిగ్గునొందినవాఁడై; "పితా=తండ్రియగు; దశరథః=దశరథుఁడు; స్వయం=తానే; త్వా= నిన్ను; ద్రష్టుం=చూచుటకు; ఆయాతః=వచ్చినాఁడు. "ఇతి (అధ్యాహృతము)= అని; మన్యే=తలంచుచున్నాను. ఇతి(అధ్యాహృతము)=అని; ప్రత్యువాచ= చెప్పెను. ("హ" అనునది పాదపూరణార్థము)

లక్ష్మణుండు, రామునిమాటనువిని, లజ్జితుండై, ప్రస్తాపంబుదప్పింపఁదలంచి, "మనతండ్రిదశరథుఁడేనిన్నుఁజూచుటకై యిచ్చటికివచ్చుచున్నాఁడు" అని, తలంచెదనునని చెప్పెను. అని తాత్పర్యము.

వ్రీళితం లక్ష్మణం దృష్ట్వా రాఘవః ప్రత్యువాచ హ

టీక॥ రాఘవః= రాముఁడు; వ్రీళితం= సిగ్గునొందిన; లక్ష్మణం=లక్ష్మణుని; దృష్ట్వా=చూచి; ప్రత్యువాచ=చెప్పెను. ("హ" అనునదిపాద పూరణార్థము.)

రాముండు, లక్ష్మణుండులజ్జనొందినాఁడనియెఱింగి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఏష మన్యే మహాబాహు రిహాస్మా౯ ద్రష్టు మాగతః. ౨౧

టీక॥ మహాబాహుః=పెద్దచేతులుగల; ఏషః=ఈదశరథుఁడు; అస్మా౯= మనలను; ద్రష్టుం=చూచుటకు; ఇహ= ఇచ్చటికి; ఆగతః=వచ్చినాఁడు. ఇతి(అధ్యాహృతము)=అని; మన్యే=తలంచెదను.

మహాబాహుండగునీదశరథుండు, మనలంజూచుటకై యిచ్చటికివచ్చినాడని,తలంచెదను అని, తాత్పర్యము.

అథవా నౌ ధ్రువం మన్యే మన్యమాన స్సుఖోచితౌ
వనవాస మనుధ్యాయ గృహాయ ప్రతినేష్యతి. ౨౨

టీక॥ అథవా=అటుగాదేని; ఏషః (అధ్యాహృతము) = ఈదశరథుండు; నౌ=మనలను; సుఖోచితౌ=సుఖమునకుందగినవారలనుగా; మన్యమానః=తలంచుచు; వనవాసం=వనమునందుండుటను; అనుధ్యాయ= తలంచి; గృహాయ=ఇంటికొఱకు; ప్రతినేష్యతి=కొనిపోఁగలండు. ధ్రువం=నిశ్చయము. ఇతి(అధ్యాహృతము)=అని; మన్యే= తలంచెదను.

లేక,దశరథుండు, మనముసుఖంబనుభవింపఁదగిన వారమనియు, వనవాసంబుకష్టంబనియుఁ,దలంచి, మనలనింటికిఁదీసికొనిపోవుటకై, వచ్చియుండుననితలంచెదను.

అని, తాత్పర్యము,

ఇమాం వా ప్యేష వైదేహీ మత్యంతసుఖసేవినీమ్
పితా మే రాఘవ శ్శ్రీమాన్ వనా దాదాయ యాస్యతి. ౨౩

టీక॥ శ్రీమాన్ = సర్వాతిశాయియయిన; మే=నాయొక్క; పితా= తండ్రియునగు; ఏషః=ఈ; రాఘవః= దశరథుండు; అత్యంతసుఖసేవినీం= మిక్కిలియు సుఖమునొందునట్టి; ఇమాం=ఈ; వైదేహీంవాపి = సీతాదేవినైనను; వనాత్= అడవినుండి; ఆదాయ= తీసికొని; యాస్యతి= పోఁగలండు.

శ్రీమంతుండగు నాతండ్రిదశరథుండు, మిక్కిలియు సుఖితురాలగు నీసీతాదేవినైనను, అడవినుండి, యింటికిఁదోడ్కొనిపోఁగలండు.

అని, తాత్పర్యము.

ఏతౌ తౌ సంప్రకాశేతే గోత్ర వంతౌ మనోరమౌ
వాయువేగ సమౌ వీర జవనౌ తురగోత్తమౌ. ౨౪

టీక॥వీర=పరాక్రమశాలివగులక్ష్మణుఁడా! గోత్రవంతౌ=మంచివంశముగలవియు;మనోరమౌ=సుందరములయినవియు;వాయువేగసమౌ= వాయు వేగముతోసమానమయినవేగముగలవియు; జవనౌ=శీఘ్రముగాఁబోవునవియునగు; తౌ=అట్టి;ఏతౌ=ఈ;తురగోత్తమౌ= అశ్వశ్రేష్ఠములు;సంప్రకాశేతే = మిక్కిలియుఁబ్రకాశించుచున్నవి.

పరాక్రమశాలివగు లక్ష్మణుఁడా! మంచికులంబునం బుట్టినవియు సుందరంబులునువాయువునకుంబోలెవేగంబుగలవియునగు , రాజోపవాహ్యంబులయిన యీయుత్తమాశ్వంబులు రెండును,ఎంతయునొప్పుచున్నవి.చూడుము. అని, తాత్పర్యము.

స ఏషతు మహాకాయః కంపతే వాహినీ ముఖే
నాగ శ్శత్రుం జయోనామ వృద్ధ స్తాతస్య ధీమతః. ౨౫

టీక॥ మహాకాయః=పెద్దశరీరముగలదియు;వృద్ధః=పెరిఁగినదియునగు, ఉన్నతంబునగుననుట; ధీమతః=బుద్ధిమంతుండగు; తాతస్య=నాయనయొక్క; సః=అట్టి;ఏషః=ఈ;శత్రుంజయః= శత్రుంజయమనుపేరుగల;నాగస్తు = ఏనుంగును; వాహినీముఖే=సేనాముఖంబునందు;కంపతే=నడచుచున్నది.

మహాకాయంబునత్యున్నతంబునగు, నాయనగారి, శత్రుంజయంబనుపట్టపేనుంగును,ఇదిగో,సేనాముఖంబునవచ్చుచున్నది.అని,తాత్పర్యము.

నతు పశ్యామి తచ్ఛత్రం పాండరం లోకసత్కృతమ్
పితు ర్దివ్యం మహాబాహో సంశయో భవతీహ మే. ౨౬

టీక॥ మహాబాహో=పెద్దచేతులుగలలక్ష్మణుఁడా! లోకసత్కృతం= జనులచేఁబూజింపఁబడినదియు;దివ్యం= శ్రేష్ఠమును; పాండరం= తెల్లనిదియునగు;తత్ =ఆ;ఛత్రంతు=గొడుగునుమాత్రము;నపశ్యామి=చూడను. ఇహ=ఈవిషయమునందు;మే = నాకు; సంశయః=సందేహము;భవతి = కలుగుచున్నది.

మహాబాహుండవగు లక్ష్మణుఁడా!

సమస్తజనపూజితంబును దివ్యంబునగు నాయనగారి శ్వేతచ్ఛత్రము, మాత్రమగపడకున్నది; కావున, నాయనవిషయమునందు, నాకుసందేహముగలుగుచున్నది. అని, తాత్పర్యము.

వృక్షాగ్రాద వరోహత్వం కురు లక్ష్మణ మద్వచః

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! త్వం=నీవు; వృక్షాగ్రాత్=చెట్టుమీఁదనుండి; అవరోహ=దిగుము. మద్వచః = నా మాటను; కురు=చేయుము.

లక్ష్మణుఁడా! నీవు, చెట్టుమీఁదనుండిదిగుము; నేనుజెప్పినట్లువినుము. అని, తాత్పర్యము.

ఇతీవ రామో ధర్మాత్మా సౌమిత్రిం త మువాచహ. ౨౫

టీక॥ ధర్మాత్మా=ధర్మస్వభావుండగు; రామః = రాముఁడు; తం= ఆ; సౌమిత్రిం=లక్ష్మణునిగూర్చి; ఇతీవ=ఇట్లు; ఉవాచ=చెప్పెను. ("హ" అనునది పాదపూరణార్థము)

ధర్మస్వభావుండగు రాముండు, లక్ష్మణునితో నీప్రకారమునం జెప్పెను. అని, తాత్పర్యము.

అవతీర్యతు సాలాగ్రా త్తస్మాత్స సమితింజయః
లక్ష్మణః ప్రాంజలి ర్భూత్వా తస్థౌ రామస్య పార్శ్వతః. ౨౬

టీక॥ సమితింజయః = శత్రుసైన్యమునుజయించునట్టి; సః=ఆ; లక్ష్మణః= లక్ష్మణుండు; తస్మాత్= ఆ; సాలాగ్రాత్=చెట్టుమీఁదనుండి; అవతీర్యతు= దిగినంతనే; ప్రాంజలిః= మంచి చేమోడ్పుగలవాఁడు; భూత్వా=అయి; రామస్య=రాముని యొక్క; పార్శ్వతః= ప్రక్కను; తస్థౌ=ఉండెను.

శత్రుసైన్యంబుల జయించుటయందుసమర్థుఁడగునాలక్ష్మణుండు, అంతఁ, జెట్టుమీఁదనుండిదిగి, చేమోడ్పుగీలించి, రాముని పార్శ్వభాగంబునం గొలిచియుండెను. అని, తాత్పర్యము.

భరతే నాపి సందిష్టా సమ్మర్దో న భవేదితి
సమంతా త్తస్య శైలస్య సేనా వాస మకల్పయత్. ౨౯

టీక॥ సమ్మర్దః = పీడ; నభవేత్ = కాఁగూడదు. ఇతి = అని; భరతేనాపి = భరతునిచేతను; సేనా = సైన్యము; సందిష్టా = ఆజ్ఞాపింపఁబడినదై; తస్య = ఆ; శైలస్య = చిత్రకూటపర్వతముయొక్క; సమంతాత్ = చుట్టును; వాసం = ఉనికిని; అకల్పయత్ = చేసెను.

రామాశ్రమంబునకుబాధగలుగఁగూడదనిభరతుం డాజ్ఞాపించుటంజేసి, యాసేన, చిత్రకూటపర్వతముచుట్టును, మండలాకారంబున, విడిసెను.

అని, తాత్పర్యము.

అధ్యర్థ మిక్ష్వాకుచమూ ర్యోజనం పర్వతస్య సా
పార్శ్వే న్యవిశ దావృత్త్య గజవాజిరథాకులా. ౩౦

టీక॥ గజవాజిరథాకులా = ఏనుంగులచేతనుగుఱ్ఱములచేతనురథములచేతను నిండినదగు; సా = ఆ; ఇక్ష్వాకుచమూః = ఇక్ష్వాకుసేన; అధ్యర్థం = సగమధికముగాఁగల; యోజనం = ఆమడదూరము; పర్వతస్య = చిత్రకూటపర్వతముయొక్క; పార్శ్వే = ప్రకరను; ఆవృత్త్య = చుట్టి; న్యవిశత్ = విడిసినది.

గజవాజిరథసంపూర్ణమగునాయిక్ష్వాకుసైన్యము, ఒకటియునూఱామడదూరము, చిత్రకూటపర్వతపార్శ్వభాగమునందు, మండలాకారంబున, విడిసినది. అని, తాత్పర్యము.

సా చిత్రకూటే భరతస్య సేనా
ధర్మం పురస్కృత్య విధూయ దర్పమ్
ప్రసాదనార్థం రఘునందనస్య
విరాజతే నీతిమతా ప్రణీతా. ౩౧

టీక॥ ధర్మం = ధర్మమును; పురస్కృత్య = మున్నిడుకొని; గర్వం = గర్వమును; విధూయ = విడిచి; రఘునందనస్య = రాముని యొక్క; ప్రసాదనార్థం = సంతోషపఱచుటకొఱకు; ఆగతేన (అధ్యాహృతము) = వచ్చినవాఁడు

ను; నీతిమతా = అధికమయిననీతిగల వాఁడునగుభరతునిచేత; ప్రణీతా = తేఁబడిన; భరతస్య=భరతునియొక్క; సా=ఆ; సేనా=సేన; చిత్రకూటే= చిత్రకూటపర్వతమునందు, చిత్రకూట పర్వతసమీపమునందనుట; విరాజతే= ప్రకాశించుచున్నది.

ధర్మంబునవలంబించి, గర్వంబు వదలి, రామునిఁబ్రసన్నుంజేయుటకై వచ్చినట్టినీతిమంతుండగుభరతునిచేఁ జేబడిన, సైన్యమంతయుఁ, జిత్రకూటపర్వతమునకుసమీపంబునం బ్రకాశించుచుం డినది. అని, తాత్పర్యము,

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, సప్తనవతితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ సప్తనవతితమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీః

అష్టనవతితమసర్గప్రారంభః.

నివేశ్య సేనాంతు విభుః పద్భ్యాం పాదవతాం వరః
అభిగంతుం స కాకుత్స్థమియేష గురువర్తకమ్. ౧

టీక॥ పాదవతాం=కాళ్లుగలవారల లో; వరః=శ్రేష్ఠుండును; విభుః=ప్రభుండునగు; సః= ఆభరతుండు; సేనాం=సేనను; నివేశ్యతు=విడియఁజేసి నంతనే; గురువర్తకం = పితృసేవచేయునట్టి; కాకుత్స్థం=రామునిగూర్చి; పద్భ్యాం=కాళ్లచేత; అభిగంతుం=పోవుటకు; ఇయేష=ఇచ్ఛించెను.

అట్టిపరమధార్మికుండగు రాము నొద్దకునడచిపోవు భాగ్యంబుగలుగుట చేఁ, బాదంబులుగలవారలలోనుత్తముండగునా భరతుండు, సేననువిడియనా

జ్ఞాపించి, యంతట, బితాజ్ఞానువర్తియయి గురామునొద్దకుఁ, బాదంబులతో నడచి పోఁగోరెను.

అని, తాత్పర్యము.

నివిష్ట మాత్రే సైన్యేతు యథోద్దేశం వినీతవత్
భరతో భ్రాతరం వాక్యం శత్రుఘ్న మిద మబ్రవీత్. ౨

టీక॥ సైన్యే = సేన; యథోద్దేశం = అయ్యైప్రదేశములనతిక్రమింపక; నివిష్ట మాత్రేతు = విడిసినదైనంతనే; భరతం = భరతుఁడు; వినీతవత్ = వినయముగల వాఁడై; భ్రాతరం = తమ్ముఁడయిన; శత్రుఘ్నం = శత్రుఘ్నునిగూర్చి; ఇదం = ఈ; వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంత, నయ్యై స్థలంబుల సేనవిడిసినవెనుక, భరతుండు, వినీతవేషధరుండయి, తమ్ముని, శత్రుఘ్నుం బిలిచి, యీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము

క్షిప్రం వన మిదం సౌమ్య నరసంఘై స్సమంతతః
లుబ్ధై శ్చ సహితై రేభి స్త్వ మన్వేషితు మర్హసి. ౩

టీక॥ సౌమ్య = తిన్ననివాఁడవగుభరతుఁడా! త్వం = నీవు; లుబ్ధై శ్చ = బోయవాండ్రతోడను; సహితైః = కూడిన; ఏభిః = ఈ; నరసంఘైః = మనుష్యసంఘములతోఁగూడ; ఇదం = ఈ; వనం = అడవిని; సమంతతః = అంతటను; క్షిప్రం = శీఘ్రముగా; అర్హసి = తగుదువు.

సౌమ్యుండవగు భరతుఁడా! నీవిప్పుడు, ఈబోయవాండ్రను భటులతోనుం గూడి, శీఘ్రముగా నీవనంబంతయు వెదకుము. అని, తాత్పర్యము.

గుహో జ్ఞాతి సహస్రేణ శరచాపాసిధారిణా
సమన్వేషతు కాకుత్స్థా వస్మిన్ పరివృత స్స్వయమ్. ౪

టీక॥ గుహః = గుహుఁడు; స్వయం = తానును; శరచాపాసి ధారిణా =

బాణంబులను ధనుస్సులను ఖడ్గంబులను ధరించుచున్న; జ్ఞాతిసహస్రైః=బంధువులవేయింటిచేత; పరివృతః=చుట్టఁబడినవాఁడై; అస్మిన్=ఈపర్వతమునందు; కాకుత్స్థౌ=రామలక్ష్మణులను; సమన్వేషతు=వెదకుఁగాక.

గుహుండు ధనుర్బాణఖడ్గంబులం దాల్చినబంధువులవేవురంగూడి, యీచిత్రకూటపర్వతం బంతయు రామలక్ష్మణులను, వెదకును గాక.

అని, తాత్పర్యము.

అమాత్యైస్సహ పౌరైశ్చ గురుభిశ్చ ద్విజాతిభిః
వనం సర్వం చరిష్యామి పద్భ్యాం పరివృత స్స్వయమ్. ౫

టీక॥ స్వయం=నేనును; సహపౌరైః=పట్టణవాసిజనములతోఁగూడిన;అమాత్యైః = మంత్రులచేతను; గురుభిశ్చ=గురువులచేతను; ద్విజాతిభిశ్చ=బ్రాహ్మణులచేతను;పరివృతః = పరివేష్టింపఁబడినవాఁడనై; పద్భ్యాం=పాదములచేత;వనం=అడవిని;సర్వం=అంతను;చరిష్యామి=తిరిగెదను.

నేనును, మంత్రులనుపౌరులనుగురువులను బ్రాహ్మణులనుంగూడి, వనంబంతయుఁ, బాదంబులతో నేతిరిగెదను.

అని, తాత్పర్యము.

యావన్న రామం ద్రక్ష్యామి లక్ష్మణంవా మహాబలమ్
వైదేహీంవా మహాభాగాం నమే శాంతి ర్భవిష్యతి. ౬

టీక॥ యావత్=ఎంతవఱకు; రామం=రామునిఁగాని; మహాబలం= అధికమయినబలముగల;లక్ష్మణంవా= లక్ష్మణునిఁగాని;మహాభాగాం=పూజ్యమయినయదృష్టముగల ; వైదేహీంవా= సీతాదేవినిగాని; నద్రక్ష్యామి=చూడనో; తావత్(అధ్యాహృతము)= అంతవఱకు; మే=నాకు; శాంతిః=దుఃఖశాంతి; నభవిష్యతి=కలుగదు.

రామునిఁగానిమహాబలుండగులక్ష్మణునిఁగానిమహాభాగయగు సీతాదేవిం గానిచూచువఱకు , నాకుదుఃఖశాంతి గలుగదు. అని, తాత్పర్యము.

యావ న్న చంద్రసంకాశం ద్రక్ష్యామి శుభ మాననమ్
భ్రాతుః పద్మపలాశాక్షం నమే శాంతి ర్భవిష్యతి. ౭

టీక॥యావత్=ఎంతవఱకు; చంద్రసంకాశం= చంద్రునితోసమానమును; పద్మపలాశాక్షం= తామరపూరేకులవంటికండ్లుగలదియు; శుభం=సుందరమునగు;భ్రాతుః=అన్నయొక్క; ఆననం=ముఖమును;నద్రక్ష్యామి=చూడనో; తావత్(అధ్యాహృతము)= అంతవఱకు;మే=నాకు;శాంతిః=దుఃఖశాంతి; న భవిష్యతి=కలుగదు.

చంద్రబింబసమానంబును దామరపూరేకులుంబోలెవిశాలసుందరంబులగునేత్రంబులు గలదియు, సుందరంబునగురామునిముఖంబుఁజూచువఱకు, నాకుదుఃఖశాంతిగలుగదు.

అని, తాత్పర్యము.

యావ న్న చరణౌ భ్రాతుః పార్థివవ్యంజనాన్వితౌ
శిరసా ధారయిష్యామి న మే శాంతి ర్భవిష్యతి. ౮

టీక॥ యావత్=ఎంతవఱకు; పార్థివవ్యంజనాన్వితౌ=రాజచిహ్నములతోఁగూడినవగు; భ్రాతుః=అన్నయొక్క;చరణౌ=పాదములను; శిరసా=తలచేత; నధారయిష్యామి=ధరింపనో; తావత్(అధ్యాహృతము)= అంతవఱకు;మే=నాకు;శాంతిః=దుఃఖశాంతి;నభవిష్యతి=కలుగదు.

వజ్రధ్వజారవిందాంకుశకలశాదిరాజలక్షణలక్షితంబులగు రామునిపాదంబులను, శిరస్సుపైధరించు కొనువఱకు, నాకుదుఃఖశాంతిగలుగదు.

అని, తాత్పర్యము.

యావ న్న రాజ్యే రాజ్యార్హః పితృపైతామహే స్థితః
అభిషేక జలక్లిన్నో న మే శాంతి ర్భవిష్యతి. ౯

టీక॥యావత్= ఎంతవఱకు; రాజ్యార్హః = రాజ్యమునకుఁ దగినరా




ముఁడు;అభిషేకజలక్లిన్నః=అభిషేకజలముచేఁ దడుపఁబడినవాఁడై; పితృపైతామహే= తండ్రితాతల నుండివచ్చిన; రాజ్యే=రాజ్యమునందు; నస్థితః= ఉండఁడో;తావత్(అధ్యాహృతము)= అంతవఱకు; మే=నాకు;శాంతిః= దుఃఖశాంతిః;నభవిష్యతి=కలుగదు.

రాజ్యార్హుఁడగు రాముండు,పట్టాభిషేకజలముచేఁదడుపఁబడి, పితృపైతామహంబగు రాజ్యంబునవలంబించువఱకు, నాకుదుఃఖశాంతి గలుగదు, అని,తాత్పర్యము.

సిద్ధార్థాఃఖలు సౌమిత్రిర్య శ్చంద్రవిమలోపమమ్
ముఖం పశ్యతి రామస్య రాజీవాక్షం మహాద్యుతి. ౧౦

టీక॥యః=ఏలక్ష్మణుఁడు; చంద్రవిమలోపమం=స్వచ్ఛమగు చంద్రునితోసమానమును; రాజీవాక్షం=తామరపూలవంటికండ్లుగలదియు; మహాద్యుతి=అధికమయినకాంతిగలదియునగు; రామస్య=రామునియొక్క;ముఖం = ముఖమును;పశ్యతి=చూచుచున్నాఁడో; సః(అధ్యాహృతము)=అట్టి;సౌమిత్రిః=లక్ష్మణుఁడు; సిద్ధార్థాఃఖలు = కృతార్థుఁడుగదా!

నిర్మలంబగు చంద్రబింబముతో సమానంబునుకమలంబులంబోలు కండ్లుగలదియు మహాతేజంబునగు రాముని ముఖంబుఁజూచుచున్నలక్ష్మణుం డెంతయుఁ గృతార్థుఁడుగదా!

అని, తాత్పర్యము.

కృతకృత్యా మహాభాగా వైదేహీ జనకాత్మజా
భర్తారం సాగరాంతాయాః పృథివ్యా యానుగచ్ఛతి. ౧౧

టీక॥ యా=ఏసీత; సాగరాంతాయాః=సముద్రములేకొనలుగాగల;పృథివ్యాః=భూమియొక్క;భర్తారం=ప్రభువైనరాముని; అనుగచ్ఛతి= వెంబడించుచున్నదో;సా=అట్టి; మహాభాగా = పూజ్యమయినయదృష్టముగలదియు; జనకాత్మజా=జనకమహారాజు కూతురునగు; వైదేహీ=సీతాదేవి ; కృతకృత్యా=కృతార్థురాలు-

సముద్రపర్యంతం బగు భూమికి




నాథుండగురా మునివెంబడింబోవుటచే త,మహాభాగయుజనకమహారాజ పుత్రి యునగుసీతాదేవి, కృతార్థయయిన ది. అని,తాత్పర్యము.

సుభగ శ్చిత్రకూటో సౌ గిరిరాజోపమో గిరిః
యస్మిన్ వసతి కాకుత్స్థః కుబేర ఇవనందనే. ౧౨

టీక॥ యస్మిన్=దేనియందు; కాకుత్స్థః=రాముఁడు; కుబేరః=కుబేరుడు ; నందనఇవ=నందనవనమునందువలె; వసతి = వాసముసేయుచున్నాఁడో; సః(అధ్యాహృతము)=అట్టి ; గిరిరాజోపమః = పర్వతరాజంబగుహిమవత్పర్వతముతోఁబోలికగల ; అసౌ=ఈ; చిత్రకూటః = చిత్రకూటమను; గిరిః=పర్వతము; సుభగః = భాగ్యశాలి.

కుబేరుండు నందనవనంబు నందుంబోలె, రాముండీపర్వతంబునందువాసముసేయుచున్నాఁడు, కావున, హిమవత్పర్వతసమానంబగు, నీచిత్రకూటపర్వతంబును, మిక్కిలియుభాగ్యవంతంబు. అని, తాత్పర్యము.

కృతకార్య మిదం దుర్గం వనం వ్యాళనిషేవితమ్
య దధ్యాస్తే మహాతేజా రామ శ్శస్త్రభృతాం వరః. ౧౩

టీక॥ యత్=దేనిని; మహాతేజాః=అధికమయినకాంతిగలవాఁడును;శస్త్రభృతాం=ఆయుధధారులలో;వరః = ఉత్తముండునగు; రామః=రాముఁడు; అధ్యాస్తే = అధిష్ఠించియున్నాఁడో ; తత్(అధ్యాహృతము) = అట్టి; దుర్గం= ప్రవేశింపఁగూడనిదియు; వ్యాళనిషేవితం = దుష్టమృగములచేసేవింపఁబడినదియునగు; ఇదం=ఈ;వనం=అడవి; కృతకార్యం=కృతార్థము.

మహాతేజుండునుఆయుధధారులలోనుత్తముండునగురాముండు, వాసముసేయుచున్నాఁడు, కావునదుష్టమృగాకీర్ణంబును దుర్గమంబునగునీయరణ్యంబును,కృతార్థము. అని,భరతుండు , శత్రుఘ్ననితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా మహాతేజా భరతః పురుషర్షభః
పద్భ్యామేవ మహాబాహుః ప్రవివేశ మహద్వనమ్. ౧౪

టీక॥ మహాతేజాః = అధికమయిన కాంతి గలవాఁడును; పురుషర్షభః = పురుషశ్రేష్ఠుండునును; మహాబాహుః = పెద్దచేతులుగలవాఁడునగు; భరతః = భరతుఁడు; ఏవం = ఇట్లు; ఉక్త్వా = చెప్పి; పద్భ్యామేవ = పాదములచేతనే; మహత్ = అధికమయిన; వనం = అడవిని; ప్రవివేశ = ప్రవేశించెను.

మహాతేజుండునుమహాబాహుండును బురుషశ్రేష్ఠుండునగు భరతుండు, ఈప్రకారముగ, శత్రుఘ్నునితోఁ జెప్పి యంతఁ బాదంబులతోనె, యమ్మహారణ్యంబుఁబ్రవేశించెను.

అని, తాత్పర్యము.

స తాని ద్రుమజాలాని జాతాని గిరిసానుషు
పుష్పితాగ్రాణి మధ్యేన జగామ వదతాం వరః. ౧౫

టీక॥ వదతాం = మాటలాడువారలలో; వరః = శ్రేష్ఠుండగు; సః = ఆభరతుఁడు; గిరిసానుషు = కొండనెత్తములయందు; జాతాని = పుట్టిన; పుష్పితాగ్రాణి = పూచినకొనలుగల; తాని = ఆ; ద్రుమజాలాని, మధ్యేన = వృక్షసమూహములనడుమను; జగామ = పోయెను.

మాటలంజెప్పుటయందుసమర్థుండగుభరతుండు, పర్వతసానువులందుండునట్టి, పుష్పితాగ్రంబులగువృక్షంబులనడుమంబోయెను.

అని, తాత్పర్యము.

స గిరేశ్చిత్రకూటస్య సాల మాసాద్య పుష్పితమ్
రామాశ్రమగతస్యాగ్నే ర్దదర్శ ధ్వజ ముచ్ఛ్రితమ్. ౧౬

టీక॥ సః = ఆభరతుఁడు; చిత్రకూటస్య = చిత్రకూటమను; గిరేః = పర్వతముయొక్క; పుష్పితం = పూచినట్టి; సాలం = వృక్షమును; ఆసాద్య = పొంది;

రామాశ్రమగతస్య = రామునియాశ్రమంబునొందిన; అగ్నేః=అగ్నిహోత్రముయొక్క; ఉచ్ఛ్రితం=ఉన్నతమయిన; ధ్వజం=పొగను; దదర్శ=చూచెను.

ఆభరతుండుపోయి, చిత్రకూటపర్వతమునందలియొక పుష్పితవృక్షంబుఁజేరఁగానే, రామాశ్రమంబునందలియగ్నిహోత్రంబుపొగయగపడినది.

అని, తాత్పర్యము.

తం దృష్ట్వా భరత శ్శ్రీమాన్ ముమోహ సహ బాంధవః
( "ముమోదసహబాంధవః" ఇతిపాఠాంతరం. )
అత్ర రామ ఇతి జ్ఞాత్వా గతః పార మివాంభసః. ౧౭

టీక॥ శ్రీమాన్= అధికమయినకాంతిగల; భరతః=భరతుఁడు; తం= ఆపొగను; దృష్ట్వా=చూచి; అత్ర=ఇచ్చట; రామః=రాముఁడు; అస్తి(అధ్యాహృతము) = ఉన్నాఁడు; ఇతి=అని; జ్ఞాత్వా=ఎఱింగి; సహబాంధవః=బంధువులతోఁగూడినవాఁడై; ముమోహ = పారవశ్యమునొందెను. పాఠాంతర పక్షమునందు, ముమోద= సంతోషించెను. అంభసః = సముద్రముయొక్క; పారం=గట్టును; గతఇవ = పొందినవాఁడువలె ; అభూత్ (అధ్యాహృతము)=ఆయెను.

శ్రీమంతుండగు భరతుండు, ఆధూమమ్ముంజూచి, "రాముండిచ్చటనె యున్నాఁ"డనియెఱింగి, బంధువులుం దానునుసంతోషపరవశులయిరి; అప్పుడు, భరతుండు, సముద్రంబునం బడినవాఁడు, గట్టునకువచ్చినట్లుండెను.

అని, తాత్పర్యము.

స చిత్రకూటే తు గిరౌ నిశామ్య
రామాశ్రమం పుణ్యజనోపపన్నమ్
గుహేనసార్ధం త్వరితో జగామ
పున ర్నివేశ్యైవ చమూం మహాత్మా. ౧౮

టీక॥ మహాత్మా=పూజ్యమయినస్వభావముగల; సః= ఆభరతుఁడు; చిత్ర

కూటే=చిత్రకూటమను; గిరౌతు = పర్వతమునందును ; పుణ్యజనోపపన్నం=పరిశుద్ధులగుజనులతోఁగూడిన ; రామాశ్రమం=రామునియాశ్రమమును; నిశామ్య=చూచి;పునః=మఱల; చమూం= సేనను; నివేశ్యైవ= విడియనియమించియె; త్వరితః=వేగముగలవాఁడై;గుహేనసార్థం=గుహునితోఁగూడ; జగామ=పోయెను.

మహాత్ముండగుభరతుండు , చిత్రకూటపర్వతంబున,సత్పురుషోపపన్నంబగురామునియాశ్రమంబుఁజూచి , రాముని వెదకవచ్చిన సైనికులఁగూడ నిలువనియమించి, గుహసహితుండై, వేగంబునంబోయెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, అయోధ్యాకాండే, అష్టనవతితమస్సర్గః.

ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండాష్టనవతితమసర్గటీక, ముగిసినది.



శ్రీ

ఏకోనశతతమసర్గప్రారంభః.

నివిష్టాయాంతు సేనాయా ముత్సుకో భరత స్తదా
జగామ భ్రాతరం ద్రష్టుం శత్రుఘ్న మనుదర్శయన్. ౧

టీక॥ సేనాయాం=సైన్యము; నివిష్టాయాంతు=విడిసినంతనె; తదా= అప్పుడు;భరతః= భరతుఁడు;ఉత్సుకః= ఉత్సాహము గలవాఁడై; శత్రుఘ్నం= శత్రుఘ్నుని; అనుదర్శయన్=చూచుచుట్లుచేయుచు; భ్రాతరం=అన్నను; ద్రష్టుం=చూచుటకు; జగామ=పోయెను.

అట్లుసైన్యమును విడియనియమించినపిమ్మట, భరతుండు రామదర్శనోత్సుకుండయి , శత్రుఘ్నునకు రామా

శ్రమచిహ్నంబులం జూపుచు, రాముం జూచుటకై పోయెను.

అని, తాత్పర్యము.

ఋషిం వసిష్ఠం సందిశ్య మాతౄ్మే శీఘ్ర మానయ
ఇతి త్వరిత మగ్రే స జగామ గురువత్సలః. ౨

టీక॥ గురువత్సలః=గురుజనములయందుఅధికప్రేమగల;సః= ఆభరతుండు; "మే=నాయొక్క;మాతౄః=తల్లులను; శీఘ్రం=శీఘ్రముగా;ఆనయ=తోడ్కొనిరండు."ఇతి=అని;ఋషిం=ఋషియయిన; వసిష్ఠం=వసిష్ఠుని; సందిశ్య=ఆజ్ఞాపించి;అగ్రే=ముందఱ; త్వరితం=వేగముగా;జగామ= పోయెను.

గురుభక్తుండగునాభరతుండు, వసిష్ఠమహర్షిం జూచి, "నీవునాతల్లులం దీసికొనిరమ్ము" అని,చెప్పి, తానుముందుగా, వేగంబునం బోయెను.

అని, తాత్పర్యము.

సుమంత్ర స్త్వపి శత్రుఘ్న మదూరా దన్వపద్యత
రామదర్శనజ స్తర్షో భరతస్యేవ తస్యచ. ౩

టీక॥ సుమంత్ర స్త్వపి=సుమంత్రుండును;శత్రుఘ్నం=శత్రుఘ్నుని; అదూరాత్=సమీపముగా;అన్వపద్యత=వెంబడించెను.రామదర్శనజః = రాముని చూచుటయందుఁగలిగిన; తర్షః=అభిలాషము;భరతస్యేవ=భరతునకుంబోలె;తస్యచ=ఆసుమంత్రునకుంగూడ; ఆసీత్(అధ్యాహృతము)=ఉండెను.

సుమంత్రుండును శత్రుఘ్నుని వెనువెంబడింబోయెను, రామునింజూడవలెననుకోరిక, భరతశత్రుఘ్నులకుంబోలె నతనికింగల్గి యుండినది.

అని, తాత్పర్యము.

గచ్ఛన్నే వాథ భరత స్తాపసాలయసంస్థితామ్
భ్రాతుః పర్ణకుటీం శ్రీమా నుటజంచ దదర్శ హ. ౪

టీక॥అథ=అటుపిమ్మట;శ్రీమాన్=అధికమయినకాంతిగల ; భరతః = భర

ను్డు; గచ్ఛన్నేవ= పోవుచునే; తాపసాలయసంస్థితాం= ఋషులగృహంబులువలెనున్న; భ్రాతుః = అన్నయొక్క; పర్ణకుటీం=పర్ణశాలను; ఉటజంచ = సుఖముగాఁగూర్చుండుటకై యేర్పఱుపఁబడినపర్ణమంటపమును ; దదర్శ=చూచెను. "హ" అనునదిపాదపూరణార్థము.

అంత, శ్రీమంతుండగుభరతుండు, కొంతదూరముపోయి, తాపసగృహమువలెనున్నరాముని పర్ణశాలను, చూడవచ్చినవారలతో సుఖముగాఁ గూర్చుండుటకై యేర్పఱుపఁబడిన పర్ణమంటపమునుం, జూచెను.

అని, తాత్పర్యము.

శాలాయా స్త్వగ్రత స్తస్యా దదర్శ భరత స్తదా
కాష్ఠాని చావభగ్నాని పుష్పాణ్యుపచితానిచ. ౫

టీక॥ తదా=అప్పుడు; భరతః = భరతుఁడు;తస్యాః=ఆ; శాలాయాః=పర్ణశాలయొక్క; అగ్రతస్తు= ముందటను; అవభగ్నాని=విఱువఁబడిన ; కాష్ఠాని=కట్టెలను; ఉపచితాని=సంపాదింపఁబడిన; పుష్పాణిచ = పూలను; దదర్శ=చూచెను.

అప్పుడు, భరతుండు, ఆపర్ణశాలకుముందు , రాత్రిమంటవేయుటకై సంపాదింపఁబడియున్నకట్టెలను, బూజార్థమయియుంచఁబడిన పుష్పంబులనుం, జూచెను.అని, తాత్పర్యము.

స లక్ష్మణస్య రామస్య దదర్శాశ్రమ మీయుషః
కృతం వృక్షేష్వభిజ్ఞానం కుశచీరైః క్వచిత్క్వచిత్. ౬

టీక॥సః=ఆభరతుఁడు; ఆశ్రమం=ఆశ్రమమును; ఈయుషః=పొందినట్టి ; రామస్య=రామునియొక్కయు; లక్ష్మణస్య= లక్ష్మణునియొక్కయు; క్వచిత్క్వచిత్ = ఒకానొకచోట; వృక్షేషు=చెట్లయందు; కుశచీరైః = దర్భలచేతను నారచీరలచేతను; కృతం = చేయఁబడిన; అభిజ్ఞానం=గుఱుతును ; దదర్శ=చూచెను.

భరతుండు,మఱియు , రామలక్ష్మ

ణులు, ఆశ్రమంబున, మార్గంబు చక్కఁగాఁ దెలియుటకై, యచ్చటచ్చటవృక్షములయందు, దర్భలచేతను వల్కలంబులచేతను, ఉంచుకొనిన గురుతులం,జూచెను. అని, తాత్పర్యము.

స దదర్శ వనే తస్మిన్ మహత స్సంచయాన్ కృతాన్
మృగాణాం మహిషాణాంచ కరీషై శ్శీతకారణాత్. ౭

టీక॥ సః(అధ్యాహృతము)= ఆభరతుఁడు; తస్మిన్=ఆ; వనే= అడవియందు; శీతకారణాత్ = చలినిమిత్తమయి; మృగాణాం= జింకలయొక్కయు; మహిషాణాంచ=ఎనుములయొక్కయు; కరీషైః=ఏఱుపిడకలచేత; కృతాన్=చేయబడిన; మహతః= గొప్పవగు; సంచయాన్=రాసులను; దదర్శ=చూచెను.

ఆభరతుండు, అచ్చటవనంబున, శీతనివారణార్థమయి, చేర్చిపెట్టియున్న, మృగమహిషంబుల, యెండినపేడకడులగొప్పరాసులనుం, జూచెను. అని, తాత్పర్యము.

గచ్ఛన్నేవ మహాబాహు ర్ద్యుతిమాన్ భరత స్తదా
శత్రుఘ్నంచా బ్రవీ ద్ధృష్ట స్తా నమాత్యాంశ్చ సర్వశః. ౮

టీక॥ తదా = అప్పుడు; మహాబాహుః=పెద్దచేతులుగలవాఁడును; ద్యుతిమాన్ = అధికమయినకాంతిగలవాఁడునగు; భరతః= భరతుఁడు; గచ్ఛన్నేవ=పోవుచునే; హృష్టః = సంతోషించినవాఁడై; శత్రుఘ్నంచ = శత్రుఘ్నుని; తాన్=ఆ; అమాత్యాంశ్చ=మంత్రులను; సర్వశః=అందఱను గూర్చి; అబ్రవీత్ =చెప్పెను.

అప్పుడు, మహాబాహుండును గాంతిమంతుండునగుభరతుండు, పోవుచు, వానినంతయుంజూచిసంతుష్టుండై,శత్రుఘ్నుని,ఆమంత్రులనందఱనుఁగూర్చి,యిట్లని,చెప్పెను.అని, తాత్పర్యము.

మన్యే ప్రాప్తా స్మ తం దేశం భరద్వాజో యమబ్రవీత్




నాతి దూరేహి మన్యేహం నదీ మందాకినీమితః ౯

టీక॥ భరద్వాజః = భరద్వాజమహర్షి; యం = ఏప్రదేశమును; అబ్రవీత్ = చెప్పెనో; తం = ఆ; దేశం = ప్రదేశమును; ప్రాప్తాః = పొందినవారలము; స్మ(స్మః) = అగుచున్నాము; ఇతి (అధ్యాహృతము) = అని; మన్యే = తలంచెదను; ఇతః = ఇచ్చటనుండి; మందాకినీం = మందాకినియను; నదీం = నదిని; నాతిదూరే = సమీపమునందు; స్థితాం (అధ్యాహృతము) = ఉన్నదానిఁగా; మన్యే = తలంచెదను.

భరద్వాజమహర్షి చెప్పిన ప్రదేశమునకువచ్చినామనితలంచుచున్నాను; మందాకినీనదిగూడ, నిచ్చటికి, సమీపంబుననేయున్నదనితోఁచుచున్నది. అని, తాత్పర్యము.

ఉచ్చైర్బద్ధాని చీరాణి లక్ష్మణేన భవేదయమ్
అభిజ్ఞానకృతః పంథా అకాలే గంతు మిచ్ఛతా. ౧౦

టీక॥ చీరాణి = నారచీరలు; ఉచ్చైః = ఉన్నత ప్రదేశ ములయందు; బద్ధాని = కట్టఁబడినవి. అయం = ఇది; అకాలే = అనుచితకాలమునందు; గంతుం = పోవుటకు; ఇచ్ఛతా = కోరుచున్న; లక్ష్మణేన = లక్ష్మణునిచే; అభిజ్ఞానకృతః = చేయఁబడినగుఱుతులు గల; పంథాః = మార్గము; భవేత్ = అగును.

ఎందుకో, నారచీర పేలికలను, పైనివృక్షంబులం గట్టియున్నారు; ఇది లక్ష్మణుండు, సాయంకాలాది సమయములందుఫలజలాద్యాహరణార్థము యిపోయిరావలసినప్పుడు, దారిచక్కఁగాఁదెలియుటకై, గుఱుతులంబెట్టినమార్గముగానుండును; కావుననీమార్గంబుననెపోయెదము. అని, తాత్పర్యము.

ఇదంచోదాత్తదంతానాం కుంజరాణాం తరస్వినామ్
శైలపార్శ్వే పరిక్రాంత మన్యోన్య మభిగర్జతామ్. ౧౧

టీక॥ ఇదంచ = ఇదియు; ఉదాత్తదంతానాం = గొప్పదంతములు గలవి







యుః తరస్విన్వనాం= అధికమయినబలముగలవియు; అన్యోన్యం=పరస్పరమునుగూర్చి; అభిగర్జతాం=గర్జించునవియునగు; కుంజరాణాం= ఏనుంగులయొక్క; శైలపార్శ్వే = పర్వతముప్రక్కను; పరిక్రాంతం=సంచారస్థానము-

ఇచ్చట, బలవంతంబులగు నేనుంగులు,కోపంబునఁబరస్పరముమహాదంతంబులంబొడుచుకొనుచు గర్జించుచుసంరంభంబున, సంచరించినవని,గుఱుతులచేఁదెలియవచ్చుచున్నది.

అని, తాత్పర్యము.

యమేవాధాతు మిచ్ఛంతి తాపసా స్సతతం వనే
తస్యా సౌ దృశ్యతే ధూమ స్సంకులః కృష్ణవర్త్మనః. ౧౨

టీక॥ వనే= అడవియందు; తాపసాః=ఋషులు; యమేవ= ఏయగ్నిహోత్రమునే;సతతం= ఎల్లప్పుడు;ఆధాతుం=ఉంచుటకు;ఇచ్ఛంతి= కోరుచున్నారో;తస్య = ఆ; కృష్ణవర్త్మనః = అగ్నిహోత్రము యొక్క ; సంకులః=దట్టమయిన; అసౌ=ఈ;ధూమః=పొగ; దృశ్యతే= చూడఁబడుచున్నది.

అడవియందు,ఋషులు, హోమార్థమయి,ఎల్లప్పుడును దేనింగాపాడుచుందురో, అట్టియగ్నిహోత్రమునసుండి, దట్టమయిన పొగ వెడలివచ్చుచున్నది,చూడుము.అని, తాత్పర్యము.

అత్రాహం పురుషవ్యాఘ్రం గురుసంస్కారకారిణమ్
ఆర్యం ద్రక్ష్యామి సంహృష్టో మహర్షిమివ రాఘవమ్. ౧౩

టీక॥ అత్ర = ఈయాశ్రమంబునందు; అహం=నేను; గురుసంస్కారకారిణం= శ్రేష్ఠమయినయుపదేశాదిసంస్కారము చేయునట్టి ; మహర్షిమివ(స్థితం)=పూజ్యుఁడైనఋషివలెనున్న; పురుషవ్యాఘ్రం=పురుషశ్రేష్ఠుండగు ; ఆర్యం=పూజ్యుఁడైన; రాఘవం=రాముని; సంహృష్టః=సంతోషంబునొందినవాఁడనై ; ద్రక్ష్యామి=చూడఁగలను.

ఈయాశ్రమమునందే, యుత్తమోపదేశంబులు సేయుమహర్షివలెనున్న పురుషశ్రేష్ఠుండునుబూజ్యుండు నగురా




ముని, బరమసంతోషంబునంజూడఁగల నుఅని,భరతుండు, శత్రుఘ్నాదులతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

అథ గత్వా ముహూర్తంతు చిత్రకూటం స రాఘవః
మందాకినీ మనుప్రాప్త స్తం జనంచే ద మబ్రవీత్. ౧౪

టీక॥ అథ=అటుపిమ్మట; సః= ఆ; రాఘవః= భరతుఁడు; చిత్రకూటం= చిత్రకూట పర్వతమును గూర్చి; ముహూర్తంతు=కొంచెము సేపు మాత్రము; గత్వా= పోయి; మందాకినీం= మందాకినీనదిని; అనుప్రాప్తః= పొందినవాఁడై; తం=ఆ; జనంచ = శత్రుఘ్నాదిజనమునుగూర్చియు; ఇదం=ఈ మాటను; అబ్రవీత్ =చెప్పెను.

అంత, నాభరతుండు, మఱికొంత దూరముపోయి,మందాకినీనదింబొంది, యాశత్రుఘ్నాదులం జూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

జగత్యాం పురుషవ్యాఘ్ర ఆస్తే వీరాసనే రతః
జనేంద్రో నిర్జనం ప్రాప్య ధి ఙ్మే జన్మ సజీవితమ్. ౧౫

టీక॥ జనేంద్రః = జనులకుఁ బ్రభువైనవాఁడును; పురుషవ్యాఘ్రః= పురుషశ్రేష్ఠుండునగురాముండు; నిర్జనం= జనులులేనియడవిని; ప్రాప్య= పొంది; జగత్యాం=భూమియందు; వీరాసనే= వీరాసనమను నాసనమునందు , కుడిమోఁకాలిపై వామపాదమును ఎడమతొడక్రిందఁగుడిపాదమునుంచుకొనికూర్చుండు నాసనమునందు; రతః= ఆసక్తుఁడై;అస్తి=ఉన్నాఁడు, మే= నాయొక్క; సజీవితం = ప్రాణములతోఁ గూడిన;జన్మ=పుట్టుక; ధిక్ = దహింపఁబడుఁగాక.

జనాధిపుఁడును, బురుషశ్రేష్ఠుండునగు రాముఁడు, నిర్జనంబగు వనము నొంది, నేలపై , వీరాసనంబునఁగూర్చుండియున్నాఁడే! ఇంక నాప్రాణంబునుజన్మంబును, ఎందుకు?

అని, తాత్పర్యము.

మత్కృతే వ్యసనం ప్రాప్తో లోకనాథో మహాద్యుతిః
సర్వాన్ కామాన్ పరిత్యజ్య వనే వసతి రాఘవః. ౧౬

టీక॥ లోకనాథః=లోకమునకుఁబ్రభుండును; మహాద్యుతిః=అధికమయిన కాంతిగలవాఁడునగు; రాఘవః= రాముఁడు; మత్కృతే=నానిమిత్తమయి; వ్యసనం=దుఃఖమును; ప్రాప్తః= పొందినవాఁడై; సర్వాన్=సమస్తములయిన; కామాన్= కామములను; పరిత్యజ్య=విడిచి; వనే= అడవియందు; వసతి=ఉన్నాఁడు.

లోకనాథుండును గాంతిమంతుండు నగు రాముండు, నానిమిత్తమయి, మహాకష్టముంబొంది, సమస్తకామంబుల విడిచి, యరణ్యంబుననున్నాఁడే!

అని, తాత్పర్యము.

ఇతి లోకసమాక్రుష్టః పాదేష్వద్య ప్రసాదయన్
రామస్య నిపతిష్యామి సీతాయా లక్ష్మణస్యచ. ౧౭
("సీతాయాశ్చపునఃపునః" ఇతిపాఠాంతరం.)

టీక॥ఇతి = ఇట్లు; లోకసమాక్రుష్టః=జనులచేనిందింపఁబడిన ; అహం (అధ్యాహృతము) = నేను; అద్య=ఇప్పుడు; ప్రసాదయన్ = సంతోషపఱచువాఁడనై; రామస్య= రామునియొక్కయు; సీతాయాః = సీతయొక్కయు; లక్ష్మణస్యచ=లక్ష్మణునియొక్కయు; పాదేషు=పాదములయందు; పాఠాంతరపక్షమునందు; సీతాయాశ్చ = సీతాదేవియొక్కయు; పాదేషు=పాదములయందు; పునఃపునః= మాటిమాటికి; నిపతిష్యామి=పడెదను.

ఇట్లు నానావిధంబుగా లోకులచే నిందింపఁబడుచున్న నేను, రామునిఁబ్రసన్నుంజేయుటకై, రాముని పాదంబులకును, సీతాదేవిపాదంబులకును, లక్ష్మణుండు విఘ్నము సేయునేని, యతనిపాదములకును నమస్కారములు చేసెదను. (పాఠాంతరపక్షమునందు, ఇట్లు, నానావిధంబుగా లోకులచే నిందింపఁబడుచున్న నేను, రామునిఁబ్రసన్నుంజేయుటకై, రామునిపాదంబులకును సీతా

దేవిపాదంబులకును, మాటిమాటికిని నమస్కారంబులుగావించెదను. అని, భరతుండు, శత్రుఘ్నాదులతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవం సంవిలపం స్తస్మిన్ వనే దశరథాత్మజః
దదర్శ మహతీం పుణ్యాం పర్ణశాలాం మనోరమామ్. ౧౮
సాలతాలాశ్వకర్ణానాం పర్ణై ర్బహుభి రావృతామ్
విశాలాం మృదుభి స్తీర్ణాం కుశై ర్వేదిమివా ధ్వరే. ౧౯
శక్రాయుధనికాశై శ్చ కార్ముకై ర్భారసాధనైః
రుక్మపృష్ఠై ర్మహాసారై శ్శోభితాం శత్రుబాధకైః. ౨ం
అర్కరశ్మిప్రతీకాశై ర్ఘోరై స్తూణీగతై శ్శరైః
శోభితాం దీప్తవదనై స్సర్పై ర్భోగవతీమివ. ౨౧
మహారజతవాసోభ్యా మసిభ్యాంచ విరాజితామ్
రుక్మబిందువిచిత్రాభ్యాం చర్మభ్యాంచాపి శోభితామ్. ౨౨
గోధాంగుళిత్రై రాసక్తై శ్చిత్రైః కాంచనభూషితైః
అరిసంఘై రనాధృష్యాం మృగై స్సింహగుహామివ. ౨౩

టీక॥ దశరథాత్మజః=దశరథమహారాజుకొడుకైనభరతుఁడు; తస్మిన్=ఆ; వనే=అడవియందు; ఏవం= ఇట్లు; సంవిలపన్=విలపించుచు; సాలతాలాశ్వకర్ణానాం = మద్దిచెట్ల యొక్కయుఁదాటి చెట్లయొక్కయు నినుమద్దిచెట్లయొక్కయు; బహుభిః=పెక్కులయిన; పర్ణైః = పత్రములచేత; ఆవృతాం=కప్పఁబడినదియు ; విశాలాం= విశాలమును; మృదుభిః=మెత్తనివైన; కుశైః=దర్భలచేత; స్తీర్ణాం=పఱుపఁబడినదియు; అధ్వరే=యాగమునందు; వేదిమివ(స్థితాం)= అగ్నివేదివలెనున్నదియు; శక్రాయుధనికాశైః = ఇంద్రాయుధములతో సమానములును; భారసాధనైః=నూటుపలముల యెత్తు చేసాధింపఁ బడినవియును; రుక్మపృష్ఠైః=బంగారుతోఁ బూయఁబడిన వెనుకటి

భాగముగలవియు;మహాసారైః=అధిక మయినస్థిరాంశముగలవియు; శత్రుబాధకైః = శత్రువులబాధించునవియున గు;కార్ముకైః=ధనుస్సులచేత; శోభితాం=ప్రకాశించుచున్నదియు;అర్కరశ్మిప్రతీకాశైః=సూర్యునికిరణములతో సమానములును;ఘోరైః= భయంకరములును;దీప్తవదనైః= ప్రకాశించుచున్నముఖములు గలవియునగు; తూణీగతైః= అమ్ములపొదులంబొందిన ; శరైః=బాణములచేత;శోభితాం = ప్రకాశించుచున్నదియు; సర్పైః=సర్పములచేత ; శోభితాం (అధ్యాహృతము) = ప్రకాశించుచున్న; భోగవతీమివ ( స్థితాం ) = భోగవతివలెనున్నదియు ; మహారజత వాసోభ్యాం = బంగారువికారము లయినయొరలుగల ; అసిభ్యాంచ = ఖడ్గములచేతను; విరాజితాం=ప్రకాశించుచున్నదియు ; రుక్మబిందు విచిత్రాభ్యాం=బంగారుబిందువులచేవిచిత్రములయిన; చర్మభ్యాంచాపి=డాలు వాలులచేతను; శోభితాం=ప్రకాశించుచున్నదియు; చిత్రైః=నానావర్ణములును; కాంచనభూషితైః = బంగారముచేనలంకరింపఁ బడినవియు; ఆసక్తైః=

వ్రేలుకాడుచున్నవియు నగు; గోధాంగుళిత్రైః=అల్లెత్రాటిదెబ్బతగులకుండుటకై చేతికిఁ గట్టుకొను నట్టియుడుముతోలుతోఁ జేయఁ బడిన కవచములచేతను,అంగుళికవచములచేతను;శోభితాం (అధ్యాహృతము)= ప్రకాశించుచున్నదియు; అరిసంఘైః= శత్రుసమూహములచేత; అనాధృష్యాం= ఎదిరింపనలవిగానిదియు; మృగైః=జింకలచేత ; అనాధృష్యాం(అధ్యాహృతము) = ఎదిరింపనలవిగానిదగు; సింహగుహామివ (స్థితాం)= సింహముయొక్క గుహవలెనున్నదియు; మహతీం = గొప్పదియు;పుణ్యాం= పవిత్రమును; మనోరమాం=సుందరమునగు;పర్ణశాలాం= పర్ణశాలను; దదర్శ=చూచెను.

దశరథమహారాజపుత్రుండగు భరతుండు, అట్లువనంబున విలపించుచు , మద్దియునుమద్ది తాటిచెట్ల పత్రంబులచేఁగప్పఁబడినదియు,విశాలంబునుయాగవేదికయుంబోలె మృదుదర్భలచేనాస్తీర్ణంబును, ఇంద్రాయుధంబులకుసరివచ్చునవియు. నూఱు పలముల యెత్తుగలవియు బంగారముతోఁ బూయబడినపృష్ఠప్రదేశంబులుగలవియుమహాసారంబులు శత్రుబాధకంబులునగును




త్తమధనుస్సులచే శోభిల్లుచున్నదియు, ప్రదీప్తవదనంబులును సూర్య కిరణంబులుంబోలె వెలుంగుచున్నవియునగుతూణీరగతంబులయిన బాణంబులచే , సర్పంబులచే భోగవతి కై వడినెంతయుం గ్రాలుచున్నదియు , బంగారుతోఁ జేయఁబడినయొరలుగలదివ్యఖడ్గంబులతోఁ గూడినదియు, నలంకారార్థమైయచ్చటచ్చటబంగారముచేనలంకరింపఁబడియున్నడాలువాలులచే భూషింపఁ బడినదియు, సువర్ణశోభితంబులయిన యల్లెత్రాటిదెబ్బ దగులకుండుటకై చేతికిఁగట్టుకొనునట్టియుడుముతోలుతోఁ జేయఁబడిన కవచంబులతోను అంగుళి కవచంబులతోనుంగూడినదియు, మృగంబులకుసింహగుహాయుంబోలె శత్రుసంఘంబులకుం జొర రానిదియుఁ బవిత్రంబునుమనోహరంబునగు, పర్ణశాలంజూచెను.

అని, తాత్పర్యము.

ప్రాగుదక్ప్రవణాం వేదిం విశాలాం దీప్తపావకామ్
దదర్శ భరత స్తత్ర పుణ్యాం రామ నివేశనే. ౨౫

టీక॥ భరతః=భరతుఁడు; తత్ర=అచ్చట; రామనివేశనే=రామునిగృహమునందు; విశాలాం=విశాలమును; దీప్తపావకాం = మండుచున్నయగ్నిహోత్రముగలదియు ; పుణ్యాం=పవిత్రమును; ప్రాగుదక్ప్రవణాం=ఈశాన్యభాగమునందుఁబల్లముగానున్నదియునగు; వేదిం=వేదిని; దదర్శ=చూచెను.

భరతుఁడాపర్ణశాలయందు, విశాలంబునుమండుచున్నయగ్నిహోత్రముగలదియుఁబుణ్యంబును ఈశాన్యభాగంబునందుఁబల్లముగనదియునగు నగ్నివేదికంజూచెను. అని, తాత్పర్యము.

నిరీక్ష్య స ముహూర్తంతు దదర్శ భరతో గురుమ్
ఉటజే రామ మాసీనం జటామండలధారిణమ్. ౨౬

టీక॥ సః=ఆ; భరతః=భరతుఁడు; ముహూర్తంతు= కొంత సేపుమాత్ర




ము; నిరీక్ష్య=చూచి; ఉటజే= పర్ణ శాలయందు; ఆసీనం = కూర్చుండిన వాఁడును;జటామండలధారిణం= జటలసమూహమును ధరించినవాఁడునగు; గురుం=అన్నయయిన ; రామం=రాముని;దదర్శ=చూచెను.

అంత, నాభరతుండు,నాలుగుప్రక్కలంజూచి, పర్ణశాలయందుఁగూర్చుండియుండిన, జటామండలధరుండగు,తనయన్నను రాముంగనెను.

అని, తాత్పర్యము.

తంతు కృష్ణాజినధరం చీరవల్కలవాససమ్
దదర్శ రామ మాసీన మభితః పావకోపమమ్. ౨౬
సింహస్కంధం మహాబాహుం పుండరీకనిభేక్షణమ్
పృథివ్యా స్సాగరాంతాయా భర్తారం ధర్మచారిణమ్. ౨౭
ఉపవిష్టం మహాబాహుం బ్రహ్మాణమివ శాశ్వతమ్
స్థండిలే దర్భసంస్తీర్ణే సీతయా లక్ష్మణేనచ. ౨౮

టీక॥సః(అధ్యాహృతము)=ఆభరతుఁడు; సింహస్కంధః = సింహముయొక్కమూఁపులవంటి మూఁపులుగలవాఁడును; మహాబాహుం= పెద్దచేతులుగలవాఁడును; పుండరీక నిభేక్షణం= తెల్లతామరపూలతో సమానములగు కన్నులు గలవాఁడును; సాగరాంతాయాః= సముద్రములెకొనలుగాఁగల; పృథివ్యాః=భూమికి; భర్తారం=ప్రభువును; ధర్మచారిణం= ధర్మమునాచరించువాఁడును;దర్భసంస్తీర్ణే= దర్భలచేఁబఱుపఁబడిన ; స్థండిలే= నేలయందు; సీతాయాః=సీతతోను;లక్ష్మణేనచ = లక్ష్మణునితోను; ఉపవిష్టం= కూర్చున్నవాఁడును ; మహాబాహుం=పెద్దచేతులుగలవాఁడును (సమస్తభూమండలనాయకుండగుటకు ముఖ్యచిహ్నం బగుటచే నాజానబాహుత్వము; ఆదరాతిశయమునమఱల జెప్పబడినది,) శాశ్వతం= స్థిరుండగు; బ్రహ్మాణమివ(స్థితం)=బ్రహ్మదేవుండువలెనున్నవాఁడును; కృష్ణాజినధరం= కృష్ణాజినమును ధరించినవాఁడును ; చీరవల్కలవాససం=నారచీరలువస్త్రము

లుగాఁగలవాఁడును;ఆసీనం=వీరాసనమునఁగూర్చున్నవాఁడును;అభితః= చుట్టును; పావకోపమం= అగ్నిహోత్రముతోఁబోలికగలవాఁడునగు;తం=ఆ; రామంతు= రాముని;దదర్శ= చూచెను.

సింహంబులకుంబోలె నున్నతంబులగు భుజశిఖరంబులుగలవాఁడును,మహాబాహుండును బుండరీకములుంబోలెవిశాలసుందరంబులగు కన్నులుగలవాఁడును, అట్లు మహాచక్రవర్తి చిహ్నంబులతోఁగూడినవాఁడయ్యుసమస్తభూమండలంబునకును నాయకుండు గాఁదగినవాఁడయ్యు, ధర్మంబునాచరించుటకై, జటామండలధరుండై, నారచీరం గట్టుకొని,కృష్ణాజినంబు నుత్తరీయంబుగాఁ దాల్చి, దర్భాస్తీర్ణంబగు నేలపై,లక్ష్మణుండు గొలువ, శాశ్వతుండగు, బ్రహ్మదేవుండుంబోలె, సీతతోఁగూడ, వీరాసనంబునంగూర్చుండి, మహాతపంబాచరించుచున్నవాఁడును, అగ్నిహోత్రుండుంబోలెనెట్టివారికిని; నలవిగానివాఁడునగు, రాముని,భరతుండుసందర్శించెను. అని,తాత్పర్యము,

తం దృష్ట్వా భరత శ్శ్రీమాన్ దుఃఖశోక పరిప్లుతః
అభ్యధావత ధర్మాత్మా

టీక॥ ధర్మాత్మా= ధర్మస్వభావుండగు; శ్రీమాన్=అధికమయినకాంతిగలః భరతః=భరతుఁడు;తం=ఆరాముని; దృష్ట్వా=చూచి; దుఃఖశోకపరిప్లుతః= దుఃఖముచేతనుబరితాపముచేతనువ్యాపింపఁబడినవాఁడై ; అభ్యధావత=పరుగెత్తెను.

ధర్మాత్ముండును శ్రీమంతుండునగుభరతుండు, అట్టిరాముంజూచి, పరమదుఃఖితుండై; యతనియొద్దకుఁబరుగెత్తిపోయెను. అని, తాత్పర్యము.

భరతః కైకయీసుతః ౨౯
దృష్ట్వైవ విలలాపార్తో బాష్పసందిగ్ధయా గిరా
అశక్నువన్ ధారయితుం ధైర్యాద్వచన మబ్రవీత్. ౩౦




టీక॥ కైకేయీసుతః= కైకేయికొడుకైన; భరతః=భరతుఁడు; దృష్ట్వైవ=చూచినంతనె; ఆర్తః= దుఃఖితుండై; ధారయితుం = అణఁచుటకు; అశక్నువన్ = అశక్తుఁడై; బాష్పసందిగ్ధయా= దుఃఖముచేసందేహింపఁబడిన; గిరా=మాటచేత; ధైర్యాత్ = ధైర్యమువలన; వచనం=మాటను; అబ్రవీత్= చెప్పెను.

కైకేయికొడుకైనభరతుండు, రాముండుండువిధంబునుజూచినంతనె. పరమదుఃఖితుండై, దుఃఖంబునణఁచుకొనఁజాలక, యెట్టకేలకుఁగొంతధైర్యంబునవలంబించి, దుఃఖంబునమాటలుదొట్రుపడ, నీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

య స్సంసది ప్రకృతిభి ర్భవే ద్యుక్త ఉపాసితుమ్
వన్యై ర్మృగై రుపాసీన స్సో య మాస్తే మమా గ్రజః. ౩౧

టీక॥ యః=ఎవ్వఁడు; సంసది=సభయందు; ప్రకృతిభిః=సభికులచేత; ఉపాసితుం=సేవించుటకు; యుక్తః = తగినవాఁడో; సః=అట్టి; అయం=ఈ; మమ=నాయొక్క; అగ్రజః=అన్న; వన్యైః=అడవియందుఁబుట్టిన; మృగైః= మృగములచేత; ఉపాసీనః=సేవింపఁబడినవాఁడై; ఆస్తే=ఉన్నాఁడు!

సభయందు, యోగ్యుండగుసభికులచేసేవింపఁదగినట్టి, నాయన్న యీరాముం, డిప్పుడు, అడవియందలిమృగంబులచేసేవింపఁబడుచున్నాఁడు!

అని, తాత్పర్యము.

వాసోభి ర్బహుసాహస్రై ర్యో మహాత్మా పురోచితః
మృగాజినే సోయ మిహ ప్రవస్తే ధర్మ మాచరన్. ౩౨

టీక॥ మహాత్మా=పూజ్యమయినస్వభావముగల; యః=ఎవ్వఁడు; పురా= మునుపు; బహుసాహస్రైః=పెక్కువేలుగల; వాసోభిః=(షష్ఠ్యర్థమందు తృతీయ) వస్త్రములకు; ఉచితః= తగినవాఁడో; సః=అట్టి; అయం=ఈ రాముఁడు; ఇహ = ఇప్పుడు ; ధర్మం=ధర్మమును; ఆచరన్=చేయు

చు; మృగాజినే=కృష్ణాజినములను; ప్రవస్తే=ధరించుచున్నాఁడు!

ఏమహాత్ముఁడు, మున్ను, మిక్కిలి యుజ్జ్వెలగలయుత్తమవస్త్రంబులకుం దగియుండెనో, అట్టిరాముండిప్పుడు, ధర్మము నాచరించుటకై, కృష్ణాజినంబులందాల్చి యున్నాఁడు!

అని, తాత్పర్యము.

అధారయ ద్యో వివిధా శ్చిత్రా స్సుమనస స్తదా
సోఽయం జటాభార మిమం వహతే రాఘవః కథమ్. ౩౩

టీక॥యః=ఎవ్వఁడు; తదా=అప్పుడు; వివిధాః= నానావిధములగు; చిత్రాః=ఆశ్చర్యము గలిగించునట్టి; సుమనసః=పుష్పములను; అధారయత్=ధరించెనో; సః=అట్టి; అయం=ఈ; రాఘవః= రాముఁడు; కథం= ఎట్లు; ఇమం=ఈ;జటాభారం= జటలభారమును; వహతే= ధరించుచున్నాఁడు?

ఎవ్వండు మున్ను , నానావిధంబులగు, నుత్తమపుష్పంబుల, శిరస్సునందుముడుచుకొనుచుండెనో, అట్టి రాముం,డిప్పుడు, జటాభారంబుధరించుచున్నాఁడేల?అని, తాత్పర్యము.

యస్య యజ్ఞై ర్యథాదిష్టై ర్యుక్తో ధర్మస్య సంచయః
శరీరక్లేశసంభూతం స ధర్మం పరిమార్గతే. ౩౪

టీక॥యస్య = ఎవ్వనికి; యథాదిష్టైః = యథావిహితములగు; యజ్ఞైః=యాగములచేత; ధర్మస్య=ధర్మముయొక్క; సంచయః=సంగ్రహము; యుక్తః=తగినదో; సః = అట్టిరాముఁడు;శరీరక్లేశసంభూతం = దేహాయాసమువలనఁబుట్టిన;ధర్మం=ధర్మమును;పరిమార్గతే=వెదకుచున్నాఁడు!

నానావిధయాగంబులుయథావిధింగావించుటచే , ధర్మసంగ్రహంబుచేయఁదగినట్టిరాముం, డిప్పుడు,వానప్రస్థులుంబోలె, శరీరక్లేశంబుచేధర్మంబు నాచరించుచున్నాఁడు!

అని, తాత్పర్యము.

చందనేన మహార్హేణ యస్యాంగ ముపసేవితమ్

మలేన తస్యాంగ మిదం కథ మార్యస్య సేవ్యతే. ౩౫

టీక॥ యస్య=ఎవ్వనియొక్క; అంగం=దేహము; మహార్హేణ=శ్రేష్ఠమగు; చందనేన=గంధముచేత; ఉపసేవితం=సేవింపఁబడినదో; తస్య=అట్టి; ఆర్యస్య= పూజ్యుఁడగు రామునియొక్క; ఇదం=ఈ; అంగం=దేహము; మలేన=ముఱికిచేత; కథం=ఎట్లు; సేవ్యతే=సేవింపఁబడుచున్నది?

ఎవ్వని దేహము, నిరంతరమును, ఉత్తమంబగు చందనముచే నొప్పుచుండినదో, అట్టిపూజ్యుండగు రాముని శరీరమిప్పుడు, ముఱికితోఁగూడియున్న దేల?

అని, తాత్పర్యము.

మన్నిమిత్త మిదం దుఃఖం ప్రాప్తో రామ స్సుఖోచితః
ధి గ్జీవితం నృశంసస్య మమ లోకవిగర్హితమ్. ౩౬

టీక॥ సుఖోచితః = సుఖమునకుఁదగినట్టి; రామః= రాముఁడు; మన్నిమిత్తం= నానిమిత్తమయి; ఇదం=ఈ; దుఃఖం=దుఃఖమును; ప్రాప్తః=పొందినాఁడు. నృశంసస్య=క్రూరుండగు; మమ=నాయొక్క; లోకవిగర్హితం=లోకముచేనిందింపఁబడిన; జీవితం = ప్రాణమునుగూర్చి; ధిక్=దహింపఁబడుటయగుఁగాక.

సుఖార్హుండగు రాముండు, నానిమిత్తమయి, యిట్టిమహాదుఃఖముబొందినాఁడు; కావున, నిట్లుసమస్తజనులచే తనునిందింపఁబడుచున్ననాప్రాణంబుండియేమిప్రయోజనము?

అని, భరతుండు, విలపించెను.

అని, తాత్పర్యము.

ఇత్యేవం విలపన్ దీనః ప్రస్విన్నముఖపంకజః
పాదా వ ప్రాప్య రామస్య పపాత భరతో రుదన్. ౩౭

టీక॥ భరతః=భరతుఁడు; దీనః= దుఃఖితుండై; ప్రస్విన్నముఖపంకజః = చెమటనొందినకమలమువంటిముఖముగలవాఁడై; ఇతి=అని; ఏవం= ఇట్లు; విల

పన్ = విలపించుచు; రామస్య = రాముని యొక్క; పాదౌ = పాదములను; అప్రాప్య = పొందక; రుదన్ = ఏడ్చుచు; పపాత = పడెను.

భరతుండు, దుఃఖితుండై, ముఖకమలంబునం జెమటగాఱ, నిట్లు రోదనంబు సేయుచు, కన్నీళ్లుగాఱుటం జేసి, రాముని పాదంబులం గానక, నేలంబడెను. అని, తాత్పర్యము.

దుఃఖాభితప్తో భరతో రాజపుత్రో మహాబలః
ఉక్త్వా ర్యేతి సకృ ద్దీనం పున ర్నోవాచ కించన. ౩౮

టీక॥ మహాబలః = అధికమయిన బలముగలవాఁడును; రాజపుత్రః = రాచకొమరుండునగు; భరతః = భరతుఁడు; దీనం = దుఃఖముగల్గునట్లుగా; "ఆర్య = పూజ్యుఁడా!" ఇతి = అని; సకృత్ = ఒకమాఱు; ఉక్త్వా = చెప్పి; పునః = మఱల; కించన = కొంచమయినను; నోవాచ = చెప్పలేదు,

మహాబలుండును రాచకొమరుండు నగుభరతుండు, పరమదుఃఖితుండగుట వలన, "ఆర్యుఁడా" అని యొకమాఱు చెప్పి, యంత, నేమియుఁ బలుకఁజాలక, యూరకుండెను. అని, తాత్పర్యము.

బాష్పాభిహితకంఠశ్చ ప్రేక్ష్య రామం యశస్వినమ్
ఆర్యే త్యేవాథ సంక్రుశ్య వ్యాహర్తుం నాశక త్తదా. ౩౯

టీక॥ తదా = అప్పుడు; భరతః (అధ్యాహృతము) = భరతుఁడు; బాష్పాభిహితకంఠశ్చ = దుఃఖముచేఁ గొట్టఁబడిన కంఠముగలవాఁడునై; యశస్వినం = అధికమయినకీర్తిగల; రామం = రాముని గూర్చి; "ఆర్య = పూజ్యుఁడా;" ఇత్యేవ = అని మాత్రమె; సంక్రుశ్య = అఱచి; అథ = అటుపిమ్మట; వ్యాహర్తుం = చెప్పుటకు; నాశకత్ = శక్తుండు కాలేదు.

అప్పుడు, భరతుండు, కీర్తిశాలియగు రాముంజూచి, "పూజ్యుఁడా" అని యొకమాఱు పిలిచి, యంత, దుఃఖాతిశయంబునం జేసి, యటుపై మాటాడంజాలఁడయ్యె. అని, తాత్పర్యము.

శత్రుఘ్నశ్చాపి రామస్య వవందే చరణౌ రుదన్
తా వుభౌ స సమాలింగ్య రామశ్చాశ్రూ ణ్యవర్తయత్. ౪౦

టీక॥ శత్రుఘ్నశ్చాపి=శత్రుఘ్నుండును; రుదన్=రోదనంబుసేయుచు; రామస్య=రామునియొక్క; చరణౌ=పాదములను; వవందే= నమస్కరించెను సః=ఆ; రామశ్చ=రాముండును; తౌ= ఆభరత శత్రుఘ్నులను; ఉభౌ= ఇద్దఱను; సమాలింగ్య=కవుఁగిలించి; అశ్రూణి=కన్నీళ్లను ; అవర్తయత్ ; విడిచెను.

శత్రుఘ్నుండును, రోదనంబుసేయుచు, రామునిపాదంబులకు నమస్కరించెను; రాముండు, భరతశత్రుఘ్నులనిద్దఱను గవుఁగిలించికొని, కన్నీళ్లువిడిచెను. అని, తాత్పర్యము.

తత స్సుమంత్రేణ గుహేన చైవ
సమీయతూ రాజసుతా వరణ్యే
దివాకరశ్చైవ నిశాకరశ్చ
యథాంబరే శుక్రబృహస్పతిభ్యామ్. ౪౧

టీక॥ తతః=అటుపిమ్మట; అరణ్యే= వనమునందు; రాజసుతౌ= రాచకొమరులగు రామలక్ష్మణులు; సుమంత్రేణ= సుమంత్రునితోను; గుహేనచైవ = గుహునితోను; అంబరే=ఆకాశమునందు; దివాకరశ్చైవ=సూర్యుఁడును; నిశాకరశ్చ = చంద్రుఁడును; శుక్రబృహస్పతిభ్యాం యథా= శుక్రునితోను బృహస్పతితోనుంబోలె; సమీయతుః=చేరిరి.

అంత, నరణ్యంబున, రామలక్ష్మణులు, చంద్రసూర్యులు బృహస్పతితోను శుక్రునితోనుం జేరునట్లు, సుమంత్రునితోను గుహునితోనుం జేరిరి.

అని, తాత్పర్యము.

తాన్ పార్థివాన్ వారణ యూథపాభాన్
సమాగతాం స్తత్ర మహత్యరణ్యే
వనౌకస స్తేపి సమీక్ష్య సర్వే

వ్యశ్రూణ్యముంచన్ ప్రవిహాయ హర్షమ్. ౨౨

టీక॥ తే=ఆ; వనౌకసోపి= అరణ్యంబుననుండునట్టివారలును; సర్వేపి=అందఱును; తత్ర=ఆ; మహతి= గొప్పదగు; అరణ్యే=వనంబునందు ; వారణయూధపాభాన్ = గజశ్రేష్ఠములయొక్క కాంతివంటి కాంతిగల ; తాన్ = ఆ; పార్థివాన్= రాజులను; సమాగతాన్=చేరినవారలనుగా; సమీక్ష్య= చూచి; హర్షం=సంతోషమును; ప్రవిహాయ=విడిచి; అశ్రూణి=కన్నీళ్లను; అముంచన్ = విడిచిరి.

అచ్చటనరణ్యంబుననుండుఋషులందఱు, అమ్మహారణ్యంబునందుఁ, గలసిన, రాజపుత్రులస్థితింజూచి , సంతోషంబు విడిచి, పరమదుఃఖితులయి , కన్నీళ్లు కార్చిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, అయోధ్యాకాండే, ఏకోనశతతమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండైకోనశతతమసర్గటీక, ముగిసినది.



శ్రీ

శతతమసర్గ ప్రారంభః.

జటీలం చీరవసనం ప్రాంజలిం పతితం భువి
దదర్శ రామో దుర్దర్శ్యం యుగాంతే భాస్కరం యథా. ౧

టీక॥ రామః=రాముఁడు;జటిలం=జటలుగలవాఁడును ; చీరవసనం=నారచీరలు వస్త్రములుగాఁగలవాఁడును;ప్రాంజలిం= మంచిచేమోడ్పుగలవాఁడును;భువి=నేలయందు;పతితం= పడినవాఁడును;దుర్దర్శం=చూడనలవిగానివాఁడును; యుగాంతే= ప్రళయకాలమునందు; భాస్కరంయథా(స్థితం)=సూర్యుండువలెనున్నవాఁడునగు; భరతం(అధ్యాహృతము)= భరతుని; దదర్శ=చూచెను.

నారచీరలుగట్టుకొని జటలుధరించి ప్రళయకాలంబునందలిసూర్యుఁడుంబోలె, దుర్దర్శుండై, చేమోడ్పు గీలించి, నేలంబడిన భరతుని, రాముండు, చూచెను. అని, తాత్పర్యము.

కథంచి దభివిజ్ఞాయ వివర్ణవదనం కృశమ్
భ్రాతరం భరతం రామః పరిజగ్రాహ బాహునా. ౨

టీక॥ రామః=రాముఁడు,వివర్ణవదనం=తెల్లఁబాఱిన ముఖముగలవాఁడును; కృశం=కృశించినవాఁడునగు; భ్రాతరం=తమ్ముఁడైన;భరతం=భరతుని; కథంచిత్=ప్రయాసముచేత; అభివిజ్ఞాయ = గుఱుతుపట్టి; బాహునా= చేతిచేత;పరిజగ్రాహ=పరిగ్రహించెను.

అంత, రాముండు,వివర్ణముఖుండును బరమకృశుండునగుభరతునిఁ , గొంతవడికిగుఱుతుపట్టి, బాహువులం గ్రుచ్చిలేవనెత్తెను. అని, తాత్పర్యము.

అఘ్రాయ రామ స్తం మూర్ధ్ని పరిష్వజ్యచ రాఘవః
అంకే భరత మారోప్య పర్యపృచ్ఛ త్సమాహితః. ౩

టీక॥ రాఘవః = రఘువంశమునం దుఁబుట్టినవాఁడైన; రామః=రాముఁడు; తం= ఆ; భరతం=భరతుని; మూర్ధ్ని = తలయందు; ఆఘ్రాయ=మూర్కొని; పరిష్వజ్యచ = కవుఁగిలించియు; అంకే=తొడయందు; ఆరోప్య= ఉంచుకొని; సమాహితః= ఎచ్చరికగలవాఁడై; పర్యపృచ్ఛత్=అడిగెను.

రఘువంశమునందుఁ బుట్టినట్టి రాముండు, భరతుని, శిరంబునమూర్కొని, కవుఁగిలించికొని, తొడపైఁగూర్చుండఁజేసి, సమాహితుండై, యిట్లని, యడిగెను. అని, తాత్పర్యము.

క్వను తే భూ త్పితా తాత య దరణ్యం త్వ మాగతః
నహి త్వం జీవత స్తస్య వన మాగంతు మర్హసి. ౪

టీక॥ తాత=నాయనా! యత్=ఎందువలన; త్వం=నీవు; అరణ్యం=అడవిని; ఆగతః=పొందినావో; తత్ (అధ్యాహృతము)=అందువలన; తే=నీయొక్క; పితా=తండ్రి; క్వను=ఎచ్చట; అభూత్=ఉండెను; తస్య=అతండు; జీవతః=బ్రతికియుండఁగా; త్వం=నీవు; వనం=అడవిని గూర్చి; ఆగంతుం = వచ్చుటకు; నార్హసిహి=తగవుగదా!

నాయనా! నీవడవికివచ్చినావే! నీతండ్రిదశరథమహారాజెచ్చటికిఁబోయినాఁడు? అతండు, బ్రతికియుండఁగా, నీవు, అడవికిరాఁగూడదుగదా!

అని, తాత్పర్యము.

చిరస్య బత పశ్యామి దూరా ద్భరత మాగతమ్
దుష్ప్రతీక మరణ్యే స్మిన్ కిం తాత వన మాగతః. ౫

టీక॥ అస్మిన్=ఈ; అరణ్యే=అడవియందు; దూరాత్=దూరముననుండి; ఆగతం=వచ్చినవాఁడును; దుష్ప్రతీకం=ఎఱుంగరానియవయవములుగలవాఁడునగు; భరతం=భరతుని; చిరస్య=బహుకాలమునకు; పశ్యామి = చూచుచున్నాను. బత= సంతోషము! తాత=నాయనా! కిం=ఎందుకు; వనం=

అడవినిగూర్చి ఆగతః=వచ్చితివి?

బహుకాలమునకుంగా, బహుదూరంబునం గేకయనగరంబునుండి వచ్చిన భరతుంజూడగంటిని; సంతోషము; నేను మువాలావు చింతించుచుండుటచేసుకొను పట్టుటకష్టముగా నున్నది, నాయనా! అడవికేలవచ్చితివి. అని, తాత్పర్యము.

కచ్చిద్ధారయతే తాత రాజా యత్త్వమిహాగతః

టీక॥ తాత=నాయనా; యత్=ఎందువలన; త్వం=నీవు; ఇహ=ఇచ్చటికి; ఆగతః=వచ్చినావో; తత్ (అధ్యాహృతము)=అందువలన; రాజా=దశరథ మహారాజు; ప్రాణాన్=ప్రాణంబులను; ధారయతే కచ్చిత్=ధరించుచున్నాడా యేమి?

నాయనా నీవిచ్చటికివచ్చితివే; దశరథమహారాజు బ్రతికియుండునే, సిన్నె వదలడే; ఇప్పుడు జీవించియున్నాడా యేమి? అని, తాత్పర్యము.

కచ్చిన్నదీనస్సహసా రాజా లోకాంతరం గతః. ౬

టీక॥ రాజా=దశరథమహారాజు; దీనః=దుఃఖితుండై; సహసా=తటాలున; లోకాంతరం=పరలోకమును; నాగతః కచ్చిత్=పొందినవాడు కాడా యేమి?

దశరథమహారాజు, దుఃఖంబున మృతుండు గాకయున్నాడా యేమి? అని, తాత్పర్యము.

కచ్చిత్సౌమ్య న తే రాజ్యం భ్రష్టం బాలస్య శాశ్వతమ్

టీక॥ సౌమ్య=తిన్ననివాడవగు భరతుండా! బాలస్య=పిన్నవాడవగు; తే=నీయొక్క; శాశ్వతం=స్థిరమయిన; రాజ్యం=రాజ్యము; న భ్రష్టం కచ్చిత్=చెడలేదా యేమి?

సౌమ్యుండవగు భరతుండా! నీవు బాలుండవు గానున్నావు కావున, అశక్తిచే శాశ్వతంబగు నీరాజ్యము నష్టమయినదా యేమి? అని, తాత్పర్యము.

కచ్చిచ్ఛుశ్రూషసే తాత పితరం సత్యవిక్రమమ్. ౭

టీక॥ తాత=నాయనా! సత్యవిక్రమం=సత్యమైనపరాక్రమముగల; పితరం=తండ్రిని; శుశ్రూషసేకచ్చిత్= సేవించుచున్నావాయేమి?

నాయనా! సత్యపరాక్రముఁడగు తండ్రియయినదశరథమహారాజునకుశుశ్రూష సేయుచున్నావా యేమి? అని, తాత్పర్యము.

కచ్చిద్దశరథో రాజా కుశలీ సత్యసంగరః
రాజసూయాశ్వమేధానా మాహర్తా ధర్మనిశ్చయః. ౮

టీక॥సత్యసంగరః = సత్యమయిన ప్రతిజ్ఞఁగలవాఁడును; రాజసూయాశ్వమేధానాం= రాజసూయముయొక్కయు అశ్వమేధములయొక్కయు; ఆహర్తా= చేయువాఁడును; ధర్మనిశ్చయః = ధర్మమునందు నిశ్చయముగలవాఁడునగు; రాజా = రాజయిన; దశరథః =దశరథమహారాజు; కుశలీకచ్చిత్= క్షేమముగలవాఁడా యేమి?

సత్యప్రతిజ్ఞుండును పెక్కు రాజసూయాశ్వమేధ మహాయాగంబులుగావించినవాఁడునుఁ బరమధార్మికుండునగు దశరథమహారాజు క్షేమముగనున్నవాఁడా యేమి? అని, తాత్పర్యము.

స కచ్చిద్బ్రాహ్మణో విద్వాన్ ధర్మనిత్యో మహాద్యుతిః
ఇక్ష్వాకూణా ముపాధ్యాయో యథావ త్తాత పూజ్యతే. ౯

టీక॥ తాత=నాయనా! బ్రాహ్మణః=బ్రహ్మవేత్తయు ; విద్వాన్=పండితుండును; ధర్మనిత్యః= ధర్మమునందుస్థిరుండును; మహాద్యుతిః= అధికమయినకాంతిగలవాఁడును ; ఇక్ష్వాకూణాం= ఇక్ష్వాకువంశమునందుబుట్టినవారలయొక్క ; ఉపాధ్యాయః=ఉపాధ్యాయుండునగు; సః=ఆవసిష్ఠమహర్షి; యథావత్ =మునుపటివలె ; పూజ్యతేకచ్చిత్ = పూజింపఁబడుచున్నాఁడా యేమి?

నాయనా! బ్రహ్మవేత్తయుఁ, బం

స ౧౦౦

డితుండును బరమధార్మికుండును అధిక మయినబ్రహ్మవర్చస్సుగలవాఁడును, ఇక్ష్వాకువంశంబునంబుట్టిన వారలకుఁ గులగురుండునగువసిష్ఠమహామునిని, ముసుపటివలెఁ, బూజించుచున్నావా? యేమి? అని, తాత్పర్యము.

సా తాత కచ్చి త్కౌసల్యా సుమిత్రా చ ప్రజావతీ
సుఖినీ కచ్చి దార్యా చ దేవీ నందతి కైకయీ. ౧౦

టీక॥ తాత=నాయనా! సా=ఆ; కౌసల్యా=కౌసల్య; సుఖినీకచ్చిత్= సుఖముగలదా? యేమి? ప్రజావతీ=మంచి సంతానముగల; సుమిత్రా చ=సుమిత్రయు; సుఖినీకచ్చిత్ (అధ్యాహృతము)= సుఖముగలదా? యేమి? ఆర్యా=పూజ్యురాలును; దేవీ=రాణియగు; కైకేయీ చ=కైకేయియు; నందతికచ్చిత్= సంతోషించుచున్నదా? యేమి?

నాయనా! దుఃఖిత యగు కౌసల్య సుఖముగా నున్నదా? యేమి? సత్పుత్రిగు సుమిత్ర సుఖముగానున్నదా? పూజ్యురాలును రాణియునగు కైకేయి సంతోషంబుననున్నదా? యేమి? అని, తాత్పర్యము.

కచ్చి ద్వినయసంపన్నః కులపుత్రో బహుశ్రుతః
అనసూయు రనుద్రష్టా సత్కృత స్తే పురోహితః. ౧౧

టీక॥ వినయసంపన్నః= వినయముతోఁగూడినవాఁడును; కులపుత్రః= సత్కులమునందుఁ బుట్టినవాఁడును; బహుశ్రుతః= అధికమయినవిద్యగలవాఁడును; అనసూయుః= అసూయలేనివాఁడును; అనుద్రష్టా=చూపువాఁడునగు; తే=నీయొక్క; పురోహితః=పురోహితుండయినసుయజ్ఞుఁడు; సత్కృతఃకచ్చిత్ =పూజింపఁబడుచున్నాఁడా? యేమి?

వినయవంతుండును, సత్కుల ప్రసూతుండును, విద్యావంతుండును, అసూయ లేనివాఁడును, వసిష్ఠోపదిష్టంబులగునర్థంబులంజక్కఁగాఁదెలుపఁగలవాఁడును, నీపురోహితుండునగు, వసిష్ఠపుత్రునిసుయజ్ఞుంబూజించుచున్నావా? యేమి? అని, తాత్పర్యము.

స ౧౦౦

కచ్చి దగ్నిషు తే యుక్తో విధిజ్ఞో మతిమా నృజుః
హుతంచ హోష్యమాణంచ కాలే వేదయతే సదా. ౧౨

టీక॥ అగ్నిషు=అగ్నిహోత్రములయందు; యుక్తః=నియుక్తుండగు; విధిజ్ఞః= శాస్త్రవిధిం దెలిసినవాఁడును; మతిమాన్= అధికమయినబుద్ధిగలవాఁడును; ఋజుః=కపటము లేనివాఁడును నగు పురోహితుండు; సదా=ఎల్లప్పుడు; కాలే=యుక్తకాలమునందు; హుతంచ= వేల్వఁబడినదానిని; హోష్యమాణంచ=వేల్వఁబడఁబోవుదానిని; తే=నీకు; వేదయతే కచ్చిత్= తెలుపుచున్నాఁడా యేమి?

శాస్త్రజ్ఞుఁడును బుద్ధిమంతుండును గపటంబు లేనివాఁడును, అగ్నిహోత్రములయందు నియుక్తుండయిన నీపురోహితుండు సుయజ్ఞుండు, అయ్యైకాలంబుల హోమములు గావించినసంగతిని, హోమము చేయవలసిన దానిని, నీకుఁ దెలుపుచున్నాఁడా యేమి?

అని, తాత్పర్యము.

కచ్చి ద్దేవాన్ పితౄన్ మాతౄ గురూన్ పితృసమానపి
వృద్ధాంశ్చ తాత వైద్యాంశ్చ బ్రాహ్మణాంశ్చాభిమన్యసే. ౧౩

టీక॥ తాత = నాయనా! త్వం(అధ్యాహృతము)=నీవు; దేవాన్=దేవతలను; పితౄన్ = తండ్రులను; మాతౄః=తల్లులను; గురూన్=ఆచార్యులను; పితృసమానపి= తండ్రితోసమానులగువారలను; వృద్ధాంశ్చ=ముసలివారలను; వైద్యాంశ్చ=పండితులను; బ్రాహ్మణాంశ్చ=బ్రాహ్మణులను; అభిమన్యసే కచ్చిత్=పూజించుచున్నావా యేమి?

నాయనా! నీవు, దేవతలను దండ్రులను దల్లులను గురువులను దండ్రితోసమానులగుజ్ఞాతులను ముసలివారలను బండితులను బ్రాహ్మణులను, బూజించుచున్నావా యేమి? అని, తాత్పర్యము.

ఇష్వస్త్రవరసంపన్న మర్థశాస్త్రవిశారదమ్
సుధన్వాన ముపాధ్యాయం కచ్చి త్త్వం తాత మన్యసే. ౧౪

స ౧౦౦




టీక॥ తాత=నాయనా! త్వం=నీవు; ఇష్వస్త్రవరసంపన్నం=బాణంబులలోను, అస్త్రములలోను శ్రేష్ఠములగు వానితోఁగూడినవానిని, అర్థశాస్త్రవిశారదం=రాజనీతిశాస్త్రమునందు పండితుండునగు; సుధన్వానం=సుధన్వుఁడను; ఉపాధ్యాయం=ధనుర్వేదాచార్యుని; మన్యసేకచ్చిత్=బహుమానించుచున్నావాయేమి?

నాయనా! ఉత్తమబాణంబులును దివ్యాస్త్రంబులునుఁగలవాఁడును నీతిశాస్త్రమునందుఁబండితుండనగు సుధన్వుఁడను నీ వేదాచార్యుని బహుమానించుచున్నావాయేమి?

అని, తాత్పర్యము.

కచ్చిదాత్మసమాః శూరాః శ్రుతవంతో జితేంద్రియాః
కులీనాశ్చేంగితజ్ఞాశ్చ కృతాస్తే తాత మంత్రిణః. ౧౫

టీక॥ ఆత్మసమాః=నీతోసమానులును; శూరాః=యుద్ధమునందుభయములేనివారలును; శ్రుతవంతః=అధికమయినవిద్యగలవారలును; జితేంద్రియాః=జయింపఁబడినయింద్రియములుగలవారలును; కులీనాశ్చ=మంచికులమునందుఁబుట్టినవారలును; ఇంగితజ్ఞాశ్చ=హృదయాభిప్రాయమునెఱుంగునట్టివారలునగువారలు; తే(త్వయా)=నీచేత; మంత్రిణః=మంత్రులుగా; కృతాఃకచ్చిత్=చేయఁబడిరాయేమి?

నీకుసమానులును శూరులును విద్యావంతులును జితేంద్రియులును సత్కులప్రసూతులును ముఖంబు జూచినంతనె హృదయాభిప్రాయంబు నెఱుంగునట్టివారలనగువారలను మంత్రులుగాఁజేసికొంటివాయేమి?

అని, తాత్పర్యము.

మంత్రో విజయమూలం హి రాజ్ఞాం భవతి రాఘవ
సుసంవృతో మంత్రధరైరమాత్యైః శాస్త్రకోవిదైః. ౧౬

టీక॥ రాఘవ=రాముఁడా! శాస్త్రకోవిదైః=శాస్త్రంబులందుఁబండితులును; మంత్రధరైః=ఆలోచనసుధరించువారలునగు; అమాత్యైః=మంత్రులచేత; సుసంవృతః=చక్కఁగామూయఁబడిన; మంత్రః=ఆలోచనము; రా




స ౧౦౦




జ్ఞాం=రాజులకు; విజయమూలం= జయమునకుఁగారణంబును; భవతిహి= అగుచున్నదిగదా!

రాముఁడా! నీతిశాస్త్రంబునఁబండితులునుఆలోచనమునుదాఁచువారలునగుమంత్రులతోబహురహస్యముగాఁజేయఁబడు నాలోచనము, రాజులకుజయంబుగల్గించును. అని, తాత్పర్యము.

కచ్చి న్నిద్రావశం నైషీః కచ్చి త్కాలే ప్రబుధ్యసే
కచ్చి చ్చా పరరాత్రేషు చింతయస్య ర్థనైపుణమ్. ౧౭

టీక॥ నిద్రావశం = నిద్రకులోఁకువయగుటను; నైషీఃకచ్చిత్= పొందవా యేమి? కాలే=యుక్తకాలమునందు; ప్రబుధ్యసేకచ్చిత్=మేలుకొనుచున్నావాయేమి? అర్ధరాత్రేషు=అర్ధరాత్రములయందు; అర్థనైపుణంచ=కార్యసామర్థ్యమునుంగూర్చి; చింతయసికచ్చిత్=ఆలోచించు చున్నావాయెమి?

నిద్రకులోఁబడవుగదా! యుక్తకాలంబున మేలుకొనుచున్నావుగదా! మఱియునర్ధరాత్రంబులందు, నేకాంతంబునఁ, గార్యంబులంగుఱించియాలోచించుచున్నావాయేమి! అని, తాత్పర్యము.

విశేషార్థము.— "రాముండు, భరతునిఁబృచ్ఛించువ్యాజంబున; రాజుచేయవలసిననీతులంజెప్పుచున్నాఁడు, ఈ శ్లోకంబుచే రాజు, నిద్రాపరవశుండయియుండఁగూడదనియు, నర్ధరాత్రంబునందు, రహస్యముగాఁ; గార్యములగుఱించియాలోచింపవలయుననియుసూచింపఁబడినది.

కచ్చి న్మంత్రయసే నైకః కచ్చి న్న బహుభి స్సహ
కచ్చి త్తే మంత్రితో మంత్ర రాష్ట్రం న పరిధావతి. ౧౮

టీక॥ త్వం(అధ్యాహృతము)=నీవు; ఏకః=ఒకరుఁడవై; నమంత్రయసే=ఆలోచింపవుగదా? బహుభిస్సహ=పెక్కుమందితోఁగూడ; న(మంత్రయసే)కచ్చిత్=ఆలోచింపవుగదా? తే=నీయొక్క; మంత్రితః=ఆలోచింపఁబడిన; మంత్రః=ఆలోచనము; రాష్ట్రం=రాజ్యమునుగూర్చి; నపరిధావతి=పరుగెత్తదుగదా!

నీవు, ఒకరుఁడవై యాలోచింపవు




గదా? పెక్కుమందితో నాలోచింపవు గదా? మఱియు, నీవాలోచించినమంత్రము, రాజ్యంబునం దెవ్వరికిని దెలియదు గదా? అని, తాత్పర్యము.

విశేషార్థము.—ఈశ్లోకార్థముచే, రాజు, తానొక్కఁడుగా నాలోచనము సేయఁ గూడదనియుఁ బెక్కుమందితో నాలోచించినచో బయలుపడును గావున నదియుఁ గూడదనియు, మంత్రము, రాజ్యంబునం దెవ్వరికిని దెలియనట్లు రహస్యముగా నుండవలయుననియు, సూచింపఁబడుచున్నది.

కచ్చిదర్థం వినిశ్చిత్య లఘుమూలం మహోదయమ్
క్షిప్రమారభసే కర్తుం న దీర్ఘయసి రాఘవ. ౧౯

టీక॥ రాఘవ=రాముఁడా! త్వం(అధ్యాహృతము)=నీవు; లఘుమూలం=స్వల్పమయినసాధనముగలదియు; మహోదయం=అధికమయినఫలముగలదియునగు; అర్థం=కార్యమును; వినిశ్చిత్య=నిశ్చయించి; క్షిప్రం=శీఘ్రముగా; కర్తుం=చేయుటకు; ఆరంభసే కచ్చిత్=ఆరంభించుచున్నావా? యేమి? న దీర్ఘయసి(కచ్చిత్)= ఆలస్యము సేయవుగదా?

రాముఁడా! స్వల్పప్రయత్నంబుచేతసిద్ధించునదియు మహాఫలంబు గలదియునగు కార్యంబు సేయ నిశ్చయించి, శీఘ్రముగా దాని నారంభింతువు గదా? ఆలస్యము సేయవుగదా?

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందుచే, రాజు చేయవలసినట్లాలోచింపఁబడినకార్యము, శీఘ్రముగా నారంభింపవలెననియు నాలస్యము చేసిన చో ఫలింపదనియుఁ, దెలుపఁబడినది.

కచ్చిత్తు సుకృతాన్యేవ కృతరూపాణి వా పునః
విదుస్తే సర్వకార్యాణి న కర్తవ్యాని పార్థివాః. ౨౦

టీక॥ తే=ఆ; పార్థివాః= రాజులు; సామంతరాజులనుట, సుకృతాని=చక్కఁగాఁజేయఁబడినవిగాని; పునః=ఇంక; కృతరూపాణి=కృతప్రాయములయినవిగాని; =అట్టి; సర్వకార్యాణి= సమస్తకార్యములనే; విదుఃకచ్చి

త్ = ఎఱుంగుదురుగదా ? కర్తవ్యాని = చేయబడ వలసినవానిని; న (విదుః కచ్చిత్) = ఎఱుఁగరుగదా ?

సామంతులగు రాజులకు, నీచకట్టఁగాఁ జేయఁబడిన కార్యములుగాని, కృతప్రాయములై, ఫలోన్ముఖములగు కార్యములుగాని మాత్రమే, తెలియునగదా?

నీవు చేయవలసిన కార్యములు, ఎంతమాత్రము తెలియవుగదా ? అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందుచే, రాజు, కార్యములు చేయఁబడినమాప్తినాందువఱకు, సామంతులకుఁ దెలియనట్లు రహస్యముగా దాఁచవలయునని సూచింపఁబడినది.

కచ్చిన్న తర్కై ర్యుక్త్యావా యేచాప్య పరికీర్తితాః
త్వయావా తవ వామాత్యై ర్బుధ్యతే తాత మంత్రితమ్. ౨౧

టీక॥ తాత = నాయనా! త్వయా వా = నీచేతఁగాని; తవ = నీయొక్క; అమాత్యైర్వా = మంత్రులచేతగాని; మంత్రితం = ఆలోచింపఁబడినది. పరైః (అధ్యాహృతము) = ఇతరులచేత ; తర్కైః = ఊహలచేతఁగాని; యుక్త్యా వా = యుక్తిచేతగాని; అపరికీర్తితాః = చెప్పఁబడనివి; యే (సంతి) = ఏవిగలవో; తైః (అధ్యాహృతము) చాపి = వానిచేతఁగాని; నబుధ్యతేకచ్చిత్ = తెలియఁబడదుగదా?

నాయనా! నీవుగాని నీమంత్రులుగాని యాలోచించినట్టిమంత్రమును, ఇతరులు , ఊహలచేగాని యుక్తిచేఁగాని, యితరములగునింగితాదులచేఁగాని , యెంతమాత్రము దెలిసికొనఁ జాలరుగదా? అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందుచే , ఆలోచింపఁబడినమంత్రము, ఇతరులకేవిధముననైన నెంతమాత్రము దెలియకుండునట్లు, అతిజాగ్రత్తతోదాఁచియుండవలెనని సూచింపఁబడినది.

కచ్చి త్సహస్రా న్మూర్ఖాణా మేక మిచ్ఛసి పండితమ్
పండితో హ్యర్థకృచ్ఛ్రేషు కుర్యా న్నిశ్శ్రేయసం మహత్ . ౨౨

టీక॥ త్వం (అధ్యాహృతము) = నీవు; మూర్ఖాణాం = మూర్ఖులయొక్క; సహస్రాత్ = వేయింటికన్న; ఏకం = ఒక్కఁడైన; పండితం = పండితుని; ఇచ్ఛసి

స ౧౦౦

కచ్చిత్ = కోరుదువా యేమి? పండితః = పండితుఁడు; కృచ్ఛ్రేషు = కార్యసంకటములయందు; మహత్ = అధికమయిన; నిశ్శ్రేయసం = మంగళమును; కుర్యాత్ = చేయును.

నీవు, వేయిమంది మూర్ఖులను విడిచియయినఁ, బండితునొకనిని సంపాదింతువుగదా? సంకటము గల్గినప్పుడు, పండితుఁడు, మిక్కిలియు మేలుగావించును. అని, తాత్పర్యము.

విశేషార్థము.—ఇందుచే, వేయిమంది మూర్ఖులను విడిచిపెట్టియయిన, నొక్క పండితుని సంపాదింపవలెనని సూచింపఁబడినది. అని, తాత్పర్యము.

సహస్రాణ్యపి మూర్ఖాణాం యద్యుపాస్తే మహీపతిః
అథవా ప్యయుతాన్యేవ నాస్తి తేషు సహాయతా. ౨౩

టీక॥ మహీపతిః = రాజు; మూర్ఖాణాం = మూర్ఖులయొక్క; సహస్రాణ్యపి = వేనవేలను గాని; అథవా = లేక; అయుతాన్యేవాపి = పదివేలపదివేలను గాని; ఉపాస్తే యది = ఆశ్రయించునేని; తేషు = వారలయందు; సహాయతా = తోడుపాటు; నాస్తి = లేదు.

రాజు, మూర్ఖులను వేనవేలు గానైనను, లేక పదివేలుపదివేలుగానైనను, సంగ్రహించినను, వారలవలన నెంత మాత్రమునుపయోగము లేదు.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన, మూర్ఖులెందఱున్నను, వారలచే నుపయోగము లేదు కాఁబట్టి, రాజు మూర్ఖుల సంగ్రహింపరాదని, సూచింపఁబడుచున్నది.

ఏకో ప్యమాత్యో మేధావీ శూరో దక్షో విచక్షణః
రాజానం రాజమాత్రం వా ప్రాపయే న్మహతీం శ్రియమ్. ౨౪

టీక॥ మేధావీ = బుద్ధిమంతుండును; శూరః = శూరుండును; దక్షః = సమర్థుండును; విచక్షణః = పండితుండును నగు; అమాత్యః = మంత్రి; ఏకోపి = ఒక్కఁడైనను; రాజానం = రాజును గాని; రాజమాత్రం వా = రాజంతటివానిఁగాని; మ

స ౧౦౦

హతీం=గొప్పదగు; శ్రియం = సంపదను; ప్రాపయేత్=పొందించును.

బుద్ధిమంతుండును శూరుండును, విచారమునందు సమర్థుండును బండితుండునగు మంత్రి యొక్కండున్నను జాలు; అతండు, రాజునకుంగాని రాజంతటివానికింగాని, గొప్ప యైశ్వర్యంబు గలిగించును. అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందుచే, మంత్రి, బుద్ధిమంతుండును శూరుండును సమర్థుండును బండితుండునై యుండవలెనని తెల్పంబడినది.

కచ్చి న్ముఖ్యా మహత్స్వేవ మధ్యమేషుచ మధ్యమాః
జఘన్యాస్తు జఘన్యేషు భృత్యాః కర్మసు యోజితాః. ౨౫

టీక॥ ముఖ్యాఏవ = ముఖ్యులె; భృత్యాః= భృత్యులు; మహత్సు=గొప్పదగు; కర్మసు=కార్యములయందును; మధ్యమాః=నడిమితరగతివారలు; మధ్యమేషుచ=మధ్యమకార్యములందును; జఘన్యాః=అధములు; జఘన్యేషు తు=అధమకార్యములందును; నియోజితాః కచ్చిత్=నియోగింపఁబడినారా? యేమి?

ఉత్తమభృత్యులనుత్తమకార్యంబులందును మధ్యమ భృత్యుల మధ్యమకార్యంబులందును అధమభృత్యులనధమకార్యంబులందును ఇట్లు క్రమముగాని యోగించుచున్నావా? యేమి?

అని, తాత్పర్యము.

విశేషార్థము.—ఇందుచే, ఉత్తమభృత్యుండు మధ్యమాధమకార్యంబుల నియోగింపఁబడెనేని అతండు అవమానంబునఁ గార్యహాని గావించుఁ గావున, నట్లు చేయఁగూడదనియు, మధ్యమభృత్యుఁ డుత్తమకార్యంబుల నియోగింపఁబడునేనియతండు, అశక్తిచే కార్యంబుఁ జెఱుచుఁ గావున, నదిగూడదనియు, నతఁడె యధమ కార్యంబున నియోగింపఁబడినచో, నవమానదోషంబు గలుగు నుగావున, అదిసరికాదనియు, అధమభృత్యును త్తమ మధ్యమ కార్యంబుల నియోగించిన, దశక్తిచేనతండు కార్యంబులం జెఱచును కావున, నదియుయుక్తము గాదనియు, అందువలన, అయ్యైభృత్యుల శక్తికిఁదగిన కార్యంబుల నతని నియోగింపవలయుననియు, సూచింపఁబడినది.

అమాత్యా నుపధాతీతాన్ పితృపైతా మహాన్ శుచీన్

శ్రేష్ఠాన్ శ్రేష్ఠేషు కచ్చి త్త్వం నియోజయసి కర్మసు. ౨౬

టీక॥ త్వం=నీవు; ఉపధాతీతాన్= పరీక్షనతిక్రమించినవారలును; పితృపైతామహాన్= తండ్రితాతలనుండివచ్చినవారలును; శుచీన్= పరిశుద్ధులును; శ్రేష్ఠాన్ = ఉత్తములునగు; అమాత్యాన్=మంత్రులను; శ్రేష్ఠేషు=ఉత్తమములగు; కర్మసు=కార్యములయందు; నియోజయసికచ్చిత్=నియోగించుచున్నావా యేమి?

నీవు,చక్కఁగాఁబరీక్షింపంబడినవారలును దండ్రితాతలనుండి క్రమముగాఁ వచ్చినవారలును బరిశుద్ధులును నుత్తములునగుమంత్రులనుగొప్ప గొప్పకార్యంబులందు,నియోగింతువా యేమి?

అని, తాత్పర్యము.

విశేషార్థము....ఇందుచే,రాజులు,పురుషముఖంబున,మంచివస్త్రాభరణాదులుపంపి, ఇతర రాజులలంచముగాఁబంపినట్టును,అంతఃపురస్త్రీలు,మోహించిపంపినట్టును,జెప్పించి,యట్లుమంత్రులను బరీక్షింపవలెననియుఁ, దండ్రితాతలనాఁటనుండి పరంపరగావచ్చిన వారలనేమంత్రులుగానేర్పఱుచుకొనవలయుననియు, ఆమంత్రులలో, నుత్తములగువారల నుత్తమకార్యంబులందును,అధములగువారల నధమకార్యంబులందునె, నియోగింపవలయుననియు, సూచింపఁబడినది.

కచ్చి న్నోగ్రేణ దండేన భృశ ముద్వేజితప్రజమ్
రాజ్యం తవాను జానంతి మంత్రిణః కైకయీసుత. ౨౭

టీక॥ కైకయీసుత= కైకేయికొడుకైనభరతుఁడా! తవ=నీయొక్క; ఉగ్రేణ=తీక్ష్ణమగు; దండేన= శిక్షచేత; భృశం=మిక్కిలియు; ఉద్వేజితప్రజం= దుఃఖమునొందినట్లుచేయఁబడినప్రజలుగల; రాజ్యం = రాజ్యమును; మంత్రిణః=మంత్రులు;నానుజానంతికచ్చిత్= సమ్మతింపరుగదా?

భరతుఁడా! నీవు, జనులకుఁ దీక్ష్ణమగుశిక్షలుచేయుచు రాజ్యంబునుబీడించుచుండఁగా, నీమంత్రులునిన్నునివారింతురుగదా?అని, తాత్పర్యము.

విశేషార్థము.—ఇందుచే, రాజు తీక్ష్ణముగా శిక్షలు విధింపఁగూడదనియు, అట్లుదుర్మార్గము చేయునేని, మంత్రులతని నివారించు వారలుగా నుండవలయుననియుఁ, దెలుపఁబడినది.

కచ్చి త్త్వాం నావ జానంతి యాజకాః పతితం యథా
ఉగ్రప్రతి గ్రహీతారం కామయాన మివస్త్రియః. ౨౮

టీ॥ ఉగ్రప్రతిగ్రహీతారం=తీక్ష్ణమగుదండముచేధనముఁ బ్రతిగ్రహించునట్టి; త్వాం=నిన్ను; ప్రజాః(అధ్యాహృతము)= ప్రజలు; ఉగ్రప్రతిగ్రహీతారం(అధ్యాహృతము)= భయంకరమయినదుర్దానముచేతఁబ్రతిగ్రహించునట్టి; పతితం= పతితుని; యాజకాః యథా=యాగముచేయించువారలువలె; ఉగ్రప్రతిగ్రహీతారం (అధ్యాహృతము)=భయంకరముగాఁబ్రతిగ్రహించునట్టి; కామయానం=కాముకుని; స్త్రియ ఇవ=స్త్రీలవలె, నావజానంతికచ్చిత్= అవమానింపరుగదా?

దుర్దానములచే ద్రవ్యముసంపాదించియాగముసేయ నిచ్ఛించునట్టిపతితుని, యాజకులు నిందించునట్లు, బలాత్కారముగాగ్రహించునట్టి, కాముకుని స్త్రీలు దూషించునట్లు, తీక్ష్ణములగుపన్నులు విధించిదానిచే ధనము సంపాదించునట్టి, నిన్నుఁ బ్రజలునిందింపకున్నారు గదా? అని, తాత్పర్యము,

విశేషార్థము.—ఈశ్లోకముచే, రాజుతీక్ష్ణములగుపన్ను చేధనముసంపాదింపఁగూడదనియు, దుర్దానములచే ధనము సంపాదించి యాగముసేయరాదనియు, బలాత్కారంబున స్త్రీలం బైకొనరాదనియు, సూచింపఁబడుచున్నది.

ఉపాయకుశలం వైద్యం భృత్యసందూషణే రతమ్
శూర మైశ్వర్యకామంచ యో నహంతి సహన్యతే. ౨౯

టీక॥ ఉపాయకుశలం = సామాద్యుపాయములయందు సమర్థుఁడును; వైద్యం = రాజనీతిశాస్త్రంబునందుఁబండితుండును; భృత్యసందూషణే= భృత్యులదూషించుటయందు; రతం = ఆసక్తుండును; శూరం= యుద్ధమునం

దుఃఖమును లేనివాఁడును ; ఐశ్వర్యకామంచ=ప్రభుత్వమును గోరువాఁడునగు వాని; యః=ఏరాజు; నహంతి= వధింపఁడో; సః=అతఁడు; వధ్యతే= వధింపఁబడుచున్నాఁడు.

సామాద్యుపాయంబులందుఁ బండితుఁడును రాజనీతి చక్కఁగాఁ దెలిసినవాఁడును యోగ్యులగు నంతరంగ భృత్యులపై లేనిదోషంబులు చెప్పువారల దోలఁగించుచుండువాఁడును శూరుండును, ప్రభుత్వంబుగోరువాఁడునగు పురుషుని, రాజు వధింపకయుండెనేని, ఆపురుషుఁ డారాజును వధించును ; ప్రభుత్వమునకై యాపదలేదు ? మను శాస్త్రము.

విశేషార్థము — ఇందుచే, అమాత్యులను మంచివారలైన, అంతరంగభృత్యులను దోషదంబుగలిగించు, రాజ్యకాముఁడైయుండు పురుషుఁ డవశ్యము వధింపవలెననియు, నట్లు వధింపకున్నఁ గీడు వాటిల్లుననియు, సూచింపఁబడినది.

కచ్చిద్ధృష్టశ్చ శూరశ్చ మతిమాన్ ధృతిమాన్ శుచిః
కులీనశ్చానురక్తశ్చ దక్షస్సేనాపతిః కృతః. ౩౦

టీక॥ హృష్టశ్చ=సంతసించినవాఁడును; లేక, ధృష్టశ్చ(అనివిభాగము)=వ్యవహారములయందు సమర్థుఁడును; శూరశ్చ=యుద్ధమునందుభయము లేనివాఁడును; మతిమాన్=బుద్ధిమంతుండును; ధృతిమాన్ = అధికమయిన ధైర్యముగలవాఁడును; శుచిః=పరిశుద్ధుండును; కులీనశ్చ=మంచికులంబునం బుట్టినవాఁడును; దక్షః=కార్యంబులందు సమర్థుఁడునగు పురుషుఁడు; సేనాపతిః=సేనానాయకుఁడుగా; కృతః కచ్చిత్ =చేయఁబడినాఁడా యేమి?

నీవలనఁ జక్కని సత్కారంబులం బొంది సంతుష్టుండైనవాఁడును వ్యవహారంబులందుఁ బ్రగల్భుండును శూరుండును అయ్యయ్యసమయంబులకుఁదగినట్లు నానావిధవ్యూహంబులు గూర్పంజాలినవాఁడును, ఆపత్కాలమునందు మిక్కిలియు ధైర్యముగలవాఁడును స్వామివిషయమయి యెంతమాత్రము కపటము లేనివాఁడును సత్కులప్రసూతుండు, నీయందధికానురాగంబుగలవాఁడును గార్యంబుల సమర్థుండునగువాని, సేనాపతింగా వించుకొంటివా యేమి?




విశేషార్థము.— ఇందువలన, స్వామివిషయమయి పరమసంతోషంబును బద్ధానురాగంబును శ్రద్ధయును గలవాఁడును శూరుండును సేనావ్యూహసన్నివేశాదులు చక్కఁగాఁ దెలిసినవాఁడును, ధైర్యవంతుండును సమర్థుండును నగువానినే, సేనాపతిగాఁ జేయవలెనని సూచింపఁబడినది.

బలవంతశ్చ కచ్చిత్తే ముఖ్యా యుద్ధవిశారదాః
దృష్టాపదానా విక్రాంతా స్త్వయా సత్కృత్య మానితాః ౩౧

టీక॥ బలవంతః= అధికమయినబలముగలవారలును; యుద్ధవిశారదాః= యుద్ధములందుఁ బండితులును; దృష్టాపదానాః = చూడఁబడినమును పటికార్యములు గలవారును; విక్రాంతాః = శూరులునగు; తే=ఆ; ముఖ్యాః= ముఖ్యులగువీరులు; త్వయా=నీచేత; సత్కృత్య=సత్కరించి; మానితాఃకచ్చిత్= పూజింపఁబడినారా యేమి?

మహాబల శాలులును యుద్ధంబులందు సమర్థులును, పెక్కుమార్లు రణరంగంబున విజయంబుగొని పేరువహించినవారలును శూరులునగు, ప్రధానవీరులను, చక్కఁగా సన్మానించుచున్నావా యేమి? అని, తాత్పర్యము.

విశేషార్థము.—రాజు, బలవంతులును శూరులును యుద్ధంబులసమర్థులును పెక్కుమార్లు జయంబు దెచ్చినవారలునగు వీరులకుఁ దప్పక; యప్పుడప్పుడు, నానావిధబహుమానంబులు సేయుచు వారల గౌరవింపవలసినదని సూచింపఁబడినది.

కచ్చిద్బలస్య భక్తంచ వేతనంచ యథోచితమ్
సంప్రాప్తకాలం దాతవ్యం దదాసి నవిలంబసే. ౩౨

టీక॥ బలస్య = సైన్యమునకు; సంప్రాప్తకాలం= పొందఁబడిన కాలముగల; దాతవ్యం=ఇవ్వఁబడవలసిన; భక్తంచ=అన్నమును; వేతనంచ= సంబళమును; యథోచితం= యథాయోగ్యముగా; దదాసికచ్చిత్= ఇచ్చుచున్నావుగదా? నవిలంబసేకచ్చిత్= ఆలస్యము సేయవుగదా?




సైనికులకు, అన్యోన్యకాలంబులనియ్యవలసినబత్తెమును సంబళమును యథాయోగ్యముగా జాగుసేయక యిచ్చుచున్నావుగదా? అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఈశ్లోకమువలన, సైనికులకు, ఎప్పుడెప్పుడు, ఇవ్వవలసినబత్తెమును సంబళమును దప్పకయివ్వవలయుననియు, నట్లివ్వకున్నచోఁ, గీడుగల్గుననియు, సూచింపఁబడినది.

కాలాతిక్రమణాచ్చైవ భక్తవేతనయో ర్భృతాః
భర్తుః కుప్యంతి దుష్యంతి సోనర్థః స్సుమహాన్ స్మృతః. ౩౩

టీక॥ భృతాః=సంబళముచేజీవించునట్టి; భటులు ; భక్తవేతనయోః = బత్తెముయొక్కయు సంబళముయొక్కయు; కాలాతిక్రమణాచ్చైవ = కాలముయొక్కయతిక్రమించుటవలననె; భర్తుః(ద్వితీయార్థమందుషష్ఠి)=ప్రభునుగూర్చి; కుప్యంతి= కోపింతురు. దుష్యంతి=దుష్టులగుదురు. సః=అది; సుమహాన్=మిక్కిలియునధికమయిన; అనర్థః=అపాయముగా; స్మృతః= చెప్పఁబడినది.

భటులు, సంబళముచేతనే జీవించువారలుకావున, బత్తెముసంబళమునివ్వవలసినకాలమతిక్రమించినచోఁ, బ్రభువుపైఁగోపంబునొంది, కీడుగావింపంజూతురు; అదిమిక్కిలియు గొప్పయనర్థము. అని, తాత్పర్యము.

విశేషార్థము.—ఇందుచే, సైనికులకు, సంబళముఁ గాలముతప్పకయిచ్చుచుండినంగాని, వారలు, క్రమముగాఁ జెప్పినట్లువినుచు, ననుకూలముగానుండరని, సూచింపఁబడుచున్నది.

కచ్చి త్సర్వే నురక్తా స్త్వాం కులపుత్రాః ప్రధానతః
కచ్చిత్ ప్రాణాం స్తవార్థేషు సంత్యజంతి సమాహితాః. ౩౪

టీక॥ ప్రధానతః=ప్రధానులగు; కులపుత్రాః=క్షత్రియులు; సర్వే=అందఱును; త్వాం=నిన్నుఁగూర్చి; అనురక్తాః కచ్చిత్=అనురాగముగలిగి యున్నా

రాఘవః మిః? ససహాయాః=సమర్థా సముతోఁగూడినవారలై; తవ= నీయొక్క; అర్థేషు=కార్యములనిమిత్తమయి; ప్రాణాన్=ప్రాణములను; సంత్యజంతి కచ్చిత్=విడుచుచున్నారా యేమి!

ప్రధానభూతులగు క్షత్రియులందఱు, నీయందు బద్ధానురాగులై యున్నారా? యోధులు, మనఃపూర్వకముగా, నీకుఁగా దమప్రాణంబులు విడుచునంతటి భక్తిగలిగియున్నారా!

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందుచే, రాజు, క్షత్రియజాతి ప్రసూతులగు సైనికులను, నానావిధంబులసంతోషపఱిచి, వారలు తనకార్యమునకుఁగా, ప్రాణంబులనైనను విడుచుట కెంతమాత్రము సందేహింపనట్లు, చేసికొనవలయునని, తెలియఁజేయఁబడుచున్నది.

కచ్చి జ్జానపదో విద్వాన్ దక్షిణః ప్రతిభానవాన్
యథోక్తవాదీ దూతస్తే కృతో భరత పండితః. ౩౫

టీ॥ భరత=భరతుఁడా! జానపదః=స్వదేశంబునఁబుట్టినవాఁడును; విద్వాన్= పండితుండును, బరాభిప్రాయంబు దెలిసికొను వాఁడును; దక్షిణః=సమర్థుండును; ప్రతిభానవాన్=క్రొత్త క్రొత్త యుక్తులు తోఁచునట్టి బుద్ధిగలవాఁడును; యథోక్తవాదీ=చెప్పఁబడినదాని నతిక్రమింపక చెప్పునట్టివాఁడును; పండితః= యుక్తాయుక్తజ్ఞానముగలవాఁడునగు పురుషుఁడు; తే (త్వయా)=నీచేత; దూతః= దూతగా; కృతః కచ్చిత్=చేయఁబడినాఁడా యేమి?

భరతుఁడా! నీదేశంబున నే పుట్టినవాఁడును, బరాభిప్రాయంబు దెలసికొనంజాలినవాఁడును సమర్థుండును నవనవోన్మేషయుక్తంబగు నధిక బుద్ధిగలవాఁడును, తనకుఁ జెప్పిపంపిన మాటలను విడువక చెప్పువాఁడును యుక్తాయుక్తంబులు దెలిసిన వాఁడు నగు పురుషుని, దూతగాఁ జేసికొంటివిగదా? అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఈశ్లోకముచే, రాజు, తనదేశంబున నే జన్మించినవాఁడును బరాభిప్రాయజ్ఞుండును సమర్థుండును ప్రతిభావంతుండును సమయోచితంబులగు మాటలెన్ని చెప్పినను, దనకుఁ జెప్పిపంపిన మాటలనువిడువక నుడువంజాలినవాఁడును యుక్తాయుక్తపరిజ్ఞానముగలవాఁడునగు పురుషుని దూతగా నేర్పఱుచుకొనవలయునని, సూచింపఁబడుచున్నది.




స ౧౦౦

కచ్చి దష్టాదశాన్యేషు స్వపక్షే దశపంచచ
త్రిభి స్త్రిభి రవిజ్ఞాతై ర్వేత్సి తీర్థాని చారకైః. ౩౬

టీక॥ అన్యేషు=శత్రువులయందు; అష్టాదశ= పదునెనిమిదితీర్థములను; స్వపక్షే=నీపక్షమునందు; దశ= పదియు; పంచచ=ఐదునగు;పదునైదగు; తీర్థాని=తీర్థములను;అవిజ్ఞాతైః= తెలియఁబడనట్టి;త్రిభిస్త్రిభిః=ముగ్గురుముగ్గురైన;చారకైః=చారులచేత; వేత్సికచ్చిత్=ఎఱుఁగుచున్నావా యేమి?

నీవు.నీశత్రువులలోఁ జేరిన, మంత్రులు, పురోహితులు,యువరాజు, సేనాపతి,దౌవారికులు,అంతర్వంశికులు,కారాగారాధికృతులు,ధనాధ్యక్షులు,కార్యనియోజకులు, ప్రాడ్వివాకులు, సేనానాయకులు, నగరాధ్యక్షులు, కర్మాంతికులు, సభాధికృతులు, ధర్మాధికారులు,దండపాలురు,దుర్గపాలురు,రాష్ట్రాంతపాలకులు, అనునీ పదునెనిమిదితీర్థములకును, ఒక్కొక్కనికిని,ముగ్గురుముగ్గురుచారులనుంచి,వారలు సేయు రహస్యప్రయత్నముల నన్నింటిని దెలిసికొనుచున్నావా యేమి? అట్లు,నీరాజ్యంబునను,ఎల్లప్పుడునునీసన్నిధానంబున నేయుండునట్టి మంత్రిపురోహితయువరాజులు దక్కఁ దక్కిన పదునైదుతీర్థములను, ప్రత్యేకప్రత్యేకముగా, ముగ్గురుముగ్గురుచారులచేఁ జక్కఁగా విచారించు కొనుచున్నావుగదా?అని, తాత్పర్యము.

కచ్చి ద్వ్యపాస్తా నహితా న్ప్రతియాతాంశ్చ సర్వదా
దుర్బలా ననవజ్ఞాయ వర్తసే రిపుసూదన. ౩౭

టీక॥రిపుసూదన=శత్రువులను జంపునట్టిభరతుఁడా! వ్యపాస్తాన్= తఱుమఁబడిన వారలును; ప్రతియాతాంశ్చ= మఱలవచ్చినవారలునగు; అహితాన్=శత్రువులను;దుర్బలాన్=బలములేనివారలనుగా;అనవజ్ఞాయ= అవమానింపక; సర్వదా=ఎల్లప్పుడు;వర్తసేకచ్చిత్= ఉన్నావా యేమి?

శత్రువులంజంపునట్టి భరతుఁడా! నీచేఁ దఱుమఁగొట్టఁబడిన శత్రువులు కొంతకాలమునకు మఱలవచ్చినప్పుడు, దుర్బలులని, వారలనలక్ష్యము సేయక,

వారలవిషయమయి, మెచ్చరికతోనుందువా యేమి? అని, తాత్పర్యము.

విశేషార్థము. — ఇందువలన, పాఱిపోయినశత్రువులు, ఏదోయొక బలములేక, మఱల రారుకావున, వారు మఱలవచ్చిరేని, వారలయందతిజాగ్రత్తతోఁ బ్రవర్తింపవలయుననిసూచింపఁబడినది.

కచ్చిన్న లోకాయతికాన్ బ్రాహ్మణాం స్తాత సేవసే
అనర్థకుశలా హ్యేతే బాలాః పండితమానినః. ౩౮

టీక॥ తాత=నాయనా! లోకాయతికాన్=నాస్తికులగు; బ్రాహ్మణాన్=బ్రాహ్మణులను; న సేవసే కచ్చిత్ = సేవింపవుగదా? బాలాః=అజ్ఞానులును; పండితమానినః = తమ్ముఁబండితులుగాఁదలంచుకొనువారలునగు; ఏతే = ఈనాస్తికులు; అనర్థకుశలాహి=అనర్థములయందుసమర్థులుగదా!

నాయనా! నాస్తికులగుబ్రాహ్మణులనుసేవింపవుగదా? వీరలు, అజ్ఞానులు తమకేమియుఁదెలియకపోయినను బండితులమనిగర్వించియుండువారలు; దుర్బోధనలుచేసి, ధర్మలోపము, అధర్మాచరణము మొదలగు పెక్కు నర్థములుగల్గింతురు. అని, తాత్పర్యము.

ధర్మశాస్త్రేషు ముఖ్యేషు విద్యమానేషు దుర్బుధాః
బుద్ధిమాన్వీక్షికీం ప్రాప్య నిరర్థం ప్రవదంతి తే. ౩౯

టీక॥ దుర్బుధాః = దుర్బుద్ధులగు; తే=ఆనాస్తికులు; ముఖ్యేషు= ప్రధానములయిన; ధర్మశాస్త్రేషు = ధర్మశాస్త్రములు; విద్యమానేషు = ఉండఁగా; ఆన్వీక్షికీం = తర్కశాస్త్రవిషయమయిన; బుద్ధిం=బుద్ధిని; ప్రాప్య= పొంది; నిరర్థం=నిష్ప్రయోజనముగా; వదంతి=చెప్పుదురు.

దుర్బుద్ధులగు నాస్తికులు, ప్రధానములును సజ్జనాదరణీయములునగు ధర్మశాస్త్రములుండఁగా, వానినివిడిచి, కేవలశుష్కతర్కంబునవలంబించి, నిష్ప్రయోజనములగు మాటలుచెప్పుదురు. అని, తాత్పర్యము.

వీరై రధ్యుషితాం పూర్వ మస్మాకం తాత పూర్వకైః
సత్యనామాం దృఢద్వారాం హస్త్యశ్వరథసంకులామ్. ౪౦
బ్రాహ్మణైః క్షత్రియై ర్వైశ్యై స్స్వకర్మనిరతై స్సదా
జితేంద్రియై ర్మహోత్సాహైర్వృతా మార్యైస్సహస్రశః. ౪౧
ప్రాసాదై ర్వివిధాకారై ర్వృతాం వైద్యజనాకులామ్
కచ్చి త్సముదితాం స్ఫీతా మయోధ్యాం పరిరక్షసి. ౪౨

టీక॥ తాత = నాయనా! వీరైః=పరాక్రమశాలులగు; అస్మాకం=మనయొక్క; పూర్వకైః=మునుపటివారలచేత; అధ్యుషితాం= అధిష్ఠింపఁబడినదియు; సత్యనామాం = యథార్థమైనపేరుగలదియు, అయోధ్యా(ఎదిరింపఁగూడనిది) అనుఅర్థయుక్తమయినపేరుగలదియుననుట; దృఢద్వారాం=దృఢములగుద్వారములుగలదియు; హస్త్యశ్వరథసంకులాం= ఏనుంగులచేతనుగుఱ్ఱములచేతను రథములచేతనునిండినదియు; సదా=ఎల్లప్పుడును; స్వకర్మనిరతైః=తమకర్మలయందాసక్తులును; జితేంద్రియైః= జయింపఁబడినయింద్రియములుగలవారలును; మహోత్సాహైః= అధికమయినయుత్సాహముగలవారలును; ఆర్యైః=పూజ్యులునగు; బ్రాహ్మణైః= బ్రాహ్మణులచేతను; క్షత్రియైః = క్షత్రియులచేతను; వైశ్యైః = వైశ్యులచేతను; సహస్రశః= వేనవేలచేత; వృతాం= చుట్టఁబడినదియు; వివిధాకారైః= నానావిధములయిన యాకారములుగల; ప్రాసాదైః=రాజగృహములచేత; వృతాం=చుట్టఁబడినదియు; వైద్యజనాకులాం= పండితజనులచేనిండినదియు; సముదితాం=సంతుష్టమును; స్ఫీతాం=సమృద్ధమునగు; అయోధ్యాం = అయోధ్యాపట్టణమును; పరిరక్షసికచ్చిత్ =రక్షించుచున్నావా యేమి?

నాయనా! మహాపరాక్రమశాలులగుమనపూర్వికులచేఁబరిపాలింపఁబడినదియు, యథార్థమయినయయోధ్యయనుపేరుగలదియు, దృఢంబులగుబహిరంతద్వారంబులుగలదియు, గజహయములచే సంపూర్ణంబును, స్వకర్మనిరతులును జితేంద్రియులునుత్సాహవంతులును బూజ్యులునగుబ్రాహ్మణక్షత్రియ వైశ్యులు పెక్కండ్రచేనిండి

యుండునదియు, నానావిధాకారంబులగు రాజగృహంబులచే నలంకృతంబును, బండితజనులచేనిండినదియుసంతుష్టులగుజనులుగలదియుసమస్తసంపత్సమృద్ధంబునగునయోధ్యాపురింబరిపాలించుచున్నావుగదా? అని, తాత్పర్యము.

కచ్చిచ్చైత్యశతైర్జుష్ట స్సునివిష్టజనాకులః
దేవస్థానైః ప్రపాభిశ్చ తటాకైశ్చోపశోభితః. ౪౩

ప్రహృష్టనరనారీక స్సమాజోత్సవశోభితః
సుకృష్టసీమా పశుమాన్ హింసాభిః పరివర్జితః. ౪౪

అదేవమాతృకో రమ్య శ్శ్వాపదైః పరివర్జితః
పరిత్యక్తో భయై స్సర్వైః ఖనిభి శ్చోపశోభితః. ౪౫

వివర్జితో నరైః పాపై ర్మమ పూర్వై స్సురక్షితః
కచ్చిజ్జనపద స్స్ఫీత స్సుఖం వసతి రాఘవ ౪౬

టీక॥ రాఘవ=భరతుఁడా! చైత్యశతైః=అశ్వమేధాదిమహాయాగములు చేసినస్థలములయొక్క నూఱులతోఁ; జుష్టః=కూడినదియు-సునివిష్టజనాకులః=చక్కఁగాఁబ్రతిష్ఠితులగుజనులచే నిండినదియు; దేవస్థానైః=దేవాలయములచేతను; ప్రపాభిశ్చ= చలిపందిళ్లచేతను; తటాకైశ్చ=సరస్సులచేతను; ఉపశోభితః=ప్రకాశించునదియు; ప్రహృష్టనరనారీకః=సంతసించినపురుషులును స్త్రీలునుగలదియు; సమాజోత్సవశోభితః=సంతలయుత్సవములచేఁబ్రకాశించునదియు; సుకృష్టసీమా= చక్కఁగాదున్నఁబడినభూమిగలదియు; పశుమాన్=అధికముగాఁబశువులుగలదియు; హింసాభిః=హింసలచే; పరివర్జితః=విడువఁబడినదియు; అదేవమాతృకః=కేవలవర్షమేయాధారముగాఁగలదిగానిదియు నదులపాఱుదలగలదియుననుట; రమ్యః=రమణీయంబును; శ్వాపదైః=క్రూరమృగములచేత; పరివర్జితః=విడువఁబడినదియు; సర్వైః=సమస్తములయిన; భయైః=భయములచేతను; పరిత్యక్తః=విడువఁబడినదియు; ఖనిభిశ్చ= గనులచేతను; ఉపశోభితః=ప్రకాశించుచున్నదియు; పాపైః=పాపిష్ఠులగు; నరైః=

మనుష్యులచేత; వివర్జితః=విడువఁబడినదియు; మమ= నాయొక్క; పూర్వైః=మునుపటివారలచేత; సురక్షితః=చక్కఁగారక్షింపఁ బడినదియునగు; జనపదః=దేశము;స్ఫీతఃకచ్చిత్ = సమృద్ధముగానున్నదా ? సుఖం=సుఖముగా; వసతికచ్చిత్= ఉన్నదాయేమి?

భరతుఁడా!అశ్వమేధాదిమహాయాగంబులు చేయుటంజేసి వానిచిహ్నంబులతోఁగూడిన పెక్కుస్థలంబులు గలదియుసుప్రతిష్ఠితులగు జనులచే నిండినదియు దేవాలయ ప్రపాతటాకాదులచేనలంకృతంబును,సంతుష్టులగుస్త్రీపురుషులుగలదియుసమాజోత్సవాలంకృతంబునుజక్కఁగా దున్నఁబడిన భూమిగలదియు గోవృషభాది పశుసంపన్నంబును హింసావర్జితంబును నదులపాఱుదలచేసంపూర్ణసస్యంబును, రమణీయంబును క్రూరమృగంబులు లేనిదియుఁ జోరాది భయరహితంబును, అమూల్యరత్నసువర్ణాది ఖనిశోభితఁబునుబాపజనరహితఁబునుమనపూర్వీకులచేసురక్షితంబున గుదేశంబంతయు, సమృద్ధంబయి,సుఖంబుగనున్నదాయేమి?

అని, తాత్పర్యము.

కచ్చిత్తే దయితా స్సర్వే కృషిగోరక్షజీవినః
వార్తాయాం సంశ్రిత స్తాత లోకోహి సుఖమేధతే. ४८

టీక॥తాత=నాయనా! కృషిగోరక్షజీవినః= సేద్యము చేతనుగోరక్షణముచేతనుజీవించునట్టివైశ్యులు;సర్వే=అందఱును; తే=నీకు;దయితాఃకచ్చిత్ =ప్రియులాయేమి? వార్తాయాం = వర్తకముండఁగా;సంశ్రితః = ఆశ్రితమగు;లోకః=జనము; సుఖం=సుఖమును; ఏధతేహి=పొందునుగదా!

నాయనా! కృషిగోరక్షణాదులచే జీవించునట్టివైశ్యులందఱు,నీకు,అభిమతముగా నడుచుకొన్నారాయేమి?వారలు అనుకూలురై వర్తకము సేయుచుందురేని,జనులకుసౌఖ్యముగలుగును.

అని, తాత్పర్యము.

తేషాం గుప్తిపరీహారైః కచ్చిత్తే భరణం కృతమ్

రక్ష్యాహి రాజ్ఞా ధర్మేణ సర్వే విషయవాసినః. ౪౮

టీక॥ తే(త్వయా) = నీచేత; తేషాం = వారలకు; గుప్తిపరీహారైః = ఇష్టప్రాపణానిష్ట నివారణములచేత; భరణం = పోషణము; కృతంకచ్చిత్ = చేయఁబడినదా యేమి? రాజ్ఞా = రాజుచేత; ధర్మేణ = ధర్మముచేత; విషయవాసినః = దేశముననుండునట్టివారలు; సర్వే = అందఱును; రక్ష్యాహి = రక్షింపఁదగినవారలుగదా!

నీవా వైశ్యులకు, అభీష్టంబులనొసంగుచు, అనిష్టంబుల నివారించుచు, సౌఖ్యంబు సేయుచున్నావా యేమి? రాజు, ధర్మంబునఁ, దన దేశమునను౦డుజనుల నందఱను దప్పక రక్షింపవలయును; అందు, విశేషించి వర్తకుల రక్షింపవలయును. అని, తాత్పర్యము.

కచ్చి త్స్త్రియ స్సాంత్వయసి కచ్చిత్తా స్తే సురక్షితాః
కచ్చిన్న శ్రద్దధాస్యాసాం కచ్చిద్గుహ్యం నభాషసే. ౪౯

టీక॥ స్త్రియః = స్త్రీలను; సాంత్వయసికచ్చిత్ = అనునయించుచున్నావా యేమి? తాః = ఆ స్త్రీలు; తే(త్వయా) నీచేత; సురక్షితాఃకచ్చిత్ = చక్కఁగా రక్షింపఁబడినారా యేమి? ఆసాం = ఈ స్త్రీలయొక్క; వచనం (అధ్యాహృతము) = మాటను; నశ్రద్దధాసికచ్చిత్ = నమ్మవుగదా? గుహ్యం = రహస్యమును; నభాషసేకచ్చిత్ = చెప్పవుగదా?

అంతఃపురస్త్రీలనుమంచిమాటలచే సంతోషింపఁజేయుచున్నావుగదా? వారలకుఁబర పురుషసంభాషణాదులుసంభవింపకుండునట్లు రక్షణముసేయుచున్నావుగదా? వారలమాటలను నమ్మవుగదా? వారలకురహస్యమును, జెప్పవుగదా? అని, తాత్పర్యము.

విశేషార్థము — ఇందువలన, రాజు, ఎల్లప్పుడునుదనస్త్రీలకుసంతోషముగలిగించుచుండవలయుననియు, వారలకుఁబరపురుష సంభాషణాదులు సంభవింపకుండునట్లురక్షణముసేయుచుండవలెననియు, వారలమాటలను నమ్మరాదనియు, వారలకురహస్యమును జెప్పఁగూడదనియు,సూచింపఁబడినది.

కచ్చి న్నాగవనం గుప్తం కచ్చిత్తే సంతి ధేనుకాః
కచ్చి న్నగణికాశ్వానాం కుంజరాణాంచ తృప్యసి. ౫౦

టీక॥ నాగవనం=ఏనుఁగులుపుట్టు వనము;గుప్తంకచ్చిత్ = రక్షింపఁబడినదా యేమి? తే=నీకు; ధేనుకాః= ఆఁడేనుంగులు; సంతికచ్చిత్= ఉన్నవా యేమి?గణికాశ్వానాం (తృతీయార్థమందుషష్ఠి)= ఆఁడేనుంగులచేతనుగుఱ్ఱములచేతను;కుంజరాణాంచ (తృతీయార్థమందుషష్ఠి)= ఏనుంగులచేతను;నతృప్యసికచ్చిత్=తృప్తిఁబొందవుగదా?

ఏనుంగులయుత్పత్తిస్థానమగునరణ్యమునుఁజక్కఁగా రక్షించుకొనుచున్నావుగదా? అడవియేనుంగులనువశీకరించునట్టియాఁడేనుంగులు నీయొద్దనున్నవిగదా? మఱియు, నాఁడేనుంగులను ఏనుంగులను గుఱ్ఱంబులను, సంగ్రహించుటయందుఁ దృప్తినొందవుగదా?

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఈశ్లోకముచే, రాజు, ఎల్లప్పుడును,ఏనుంగులను, ఆఁడేనుఁగులనుగుఱ్ఱంబులను, సంగ్రహించుచునేయుండవలయు ననియు, ఎంతయున్నను,దృప్తినొందఁగూడదనియు, సూచింపఁబడినది.

కచ్చి ద్దర్శయసే నిత్యం మానుషాణాం విభూషితమ్
ఉత్థాయోత్థాయ పూర్వాహ్ణే రాజపుత్ర మహాపథే. ౫౧

టీక॥రాజపుత్ర= రాచకొమరుఁడగుభరతుఁడా!పూర్వాహ్ణే= ప్రాతఃకాలమునందు;ఉత్థాయోత్థాయ=లేచిలేచి;నిత్యం=ప్రతిదినమునందును;మహాపథే=మహాసభయందు;విభూషితం=అలంకరింపఁబడిన;ఆత్మానం (అధ్యాహృతము)=నిన్ను;మానుషాణాం= మనుష్యులకు;దర్శయసేకచ్చిత్=చూపుచున్నావా యేమి?

రాచకొమరుండవగుభరతుఁడా!నీవు,ప్రతిదినంబునందుఁబ్రాతఃకాలంబునలేచి,యలంకృతుండవయి, సభయందు, జనులకు, దర్శనంబొసంగుదువుగదా? అని,తాత్పర్యము.

విశేషార్థము.— ఈశ్లోకమువలనరాజు, ప్రతిదినంబునను,బ్రాతఃకా

లంబున లేచి, జనులు తనయారోగ్యంబు విషయమయి సంశయంబు నొందకుండు నట్లు, వారలకు దర్శనం బిచ్చుచుండవలయునని సూచింపఁబడినది.

కచ్చిన్న సర్వే కర్మాంతాః ప్రత్యక్షాస్తే ఽవిశంకయా
సర్వేవా పునరుత్సృష్టా మధ్యమేవాత్ర కారణమ్- ౫౨

టీక॥ కర్మాంతాః=పనివాండ్రు; సర్వే=అందఱును; అవిశంకయా = భయములేమిచేత; తే=నీకు; ప్రత్యక్షాః నకచ్చిత్ = దృష్టివిషయులు కారుగదా? పునః=లేక; సర్వే=అందఱును; ఉత్సృష్టావా=విడువఁబడినవారలు గాఁగాని; నకచ్చిత్ (అధ్యాహృతము)= కారుగదా? అత్ర = ఈవిషయమునందు; మధ్యమేవ=మధ్యమస్థితియె; కారణం = ప్రయోజనము.

పనివాండ్రు నిన్నుఁజూచుటకు భయపడుచుందురుగదా? వారలకు, కార్యహానిగలుగును గావున, ఎంతమాత్రమును దర్శనమివ్వకయెయుండఁగూడదు; ఎల్లప్పుడును దర్శనమునిచ్చుచుండిన, నిర్భయులగుదురు గావున, నిదియుఁగూడదు; కావునఁ, బనిపడినప్పుడు, అరుదుగాదర్శనమివ్వవలెను. అట్లు సేయుచుందువా యేమి? అని, తాత్పర్యము.

విశేషార్థము.—ఇందువలన, రాజు, పనివాండ్రకుఁ, బలుమాఱు దర్శనమివ్వఁగూడదనియు దర్శమేయివ్వకయుండఁగూడదనియు, నరుదుగా నప్పుడప్పుడు దర్శనమివ్వవలెననియు సూచింపఁబడినది

కచ్చిత్సర్వాణి దుర్గాణి ధనధాన్యాయుధోదకైః
యంత్రైశ్చ పరిపూర్ణాని తథా శిల్పిధనుర్ధరైః- ౫౩

టీక॥ దుర్గాణి=కోటలు; సర్వాణి= అన్నియు; ధనధాన్యాయుధోదకైః= ధనముచేతను ధాన్యములచేతను ఆయుధములచేతను జలముచేతను; యంత్రైశ్చ= యంత్రములచేతను; తథా=అట్లు; శిల్పిధనుర్ధరైః=శిల్పులచేతను విలుకాండ్రచేతను; పరిపూర్ణానికచ్చిత్ = నిండినవా యేమి?

కోటలన్నియు, ధనధాన్యజలంబులతోను నానావిధాయుధంబులతోను

యంత్రంబులతోను సంపూర్ణంబులయి శిల్పులచేతను ధనుర్ధరులచేతను నిండియున్నవిగదా?

అని, తాత్పర్యము.

విశేషార్థము.—ఇందువలన, రాజు, కోటలయందు, ధనముధాన్యము జలము నానావిధాయుధములు, వీనినిసమృద్ధముగా సంగ్రహించి యుండవలెననియు, వివిధయంత్రములనేర్పఱుపవలెననియు, శిల్పులను ధనుర్ధరులను వేనవేలుగాఁజేర్పఱవలెననియు, సూచింపఁబడినది.

అయ స్తే విపులః కచ్చి త్కచ్చి దల్పతరో వ్యయః
అపాత్రేషు న తే కచ్చి త్కోశో గచ్ఛతి రాఘవ. ౫౪

టీక॥ రాఘవ=భరతుఁడా! తే=నీయొక్క; ఆయః=వచ్చుబడి; విపులఃకచ్చిత్= అధికముగానున్నదా యేమి? వ్యయః=సెలవు; అల్పతరఃకచ్చిత్=మిక్కిలియుఁగొంచెముగా నున్నదా యేమి? తే=నీయొక్క; కోశః=సంచితధనము; అపాత్రేషు= దుష్టపాత్రములయందు; నగచ్ఛతికచ్చిత్=పోదుగదా?

రాముఁడా! నీవచ్చుబడియధికముగానున్నదిగదా? సెలవుమిక్కిలియుఁగొంచెముగాఁ జేయుచున్నావుగదా? నటవిటగాయకాదిదుష్టపాత్రములకు, ఎచ్చుగాధనమునివ్వకుందువుగదా?

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఈశ్లోకముచే, రాజు, వచ్చుబడియధికముగా నేర్పఱచుకొని, సెలవుమిక్కిలియుఁ గొంచెముగాఁ జేయవలెననియు, నటవిటగాయకాదులకు ధనమెచ్చుగానివ్వఁగూడదనియు, సూచింపఁబడినది.

దేవతార్థేచ పిత్రర్థే బ్రాహ్మణాభ్యాగతేషుచ
యోధేషు మిత్రవర్గేషు కచ్చి ద్గచ్ఛతి తే వ్యయః. ౫౫

టీక॥ తే=నీయొక్క; వ్యయః= సెలవు; దేవతార్థేచ=దేవతలనిమిత్తమును; పిత్రర్థే = పితరులనిమిత్తమును; బ్రాహ్మణాభ్యాగతేషుచ=బ్రాహ్మణులనిమిత్తమును అతిథులనిమిత్తమును; యోధేషు = సైనికులనిమిత్తమును; మిత్రవర్గేషు=మిత్రసమూహములనిమిత్తమును; గచ్ఛతికచ్చిత్ = పోవుచున్నదా

స ౧౦౦

వేమి?

నీసెలవంతయు, దేవతలు, పితృదేవతలు, బ్రాహ్మణులు, అతిథులు, యోధులు, మిత్రులు, వీరికొఱకు, వినియుక్తమగుచున్నదిగదా? అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఈశ్లోకముచే, రాజు, దేవతాపితృబ్రాహ్మణాభ్యాగతసైనికమిత్రవర్గములకుఁదక్క, మఱియేవిషయమందును, సెలవువ్యర్థముగాఁజేయఁగూడదనిసూచింపఁబడినది.

కచ్చి దార్యో విశుద్ధాత్మా క్షారిత శ్చోరకర్మణా
అపృష్ట శ్శాస్త్రకుశలై ర్న లోభా ద్వధ్యతే శుచిః. ౫౬

టీక॥విశుద్ధాత్మా=పరిశుద్ధమయినమనస్సుగలవాఁడును; శుచిః=కరణత్రయమునందుఁ బరిశుద్ధుఁడును; చోరకర్మణా = దొంగతనముచేత; క్షారితః=మోపఁబడినవాఁడును; శాస్త్రకుశలైః= శాస్త్రములందుసమర్థులగువారలచేత; అపృష్టః=అడుగఁబడనివాఁడునగు; ఆర్యః=పూజ్యుఁడు; లోభాత్= ఆశవలన; నవధ్యతేకచ్చిత్=చంపఁబడఁడాయేమి?

పరిశుద్ధ హృదయుండును గరణత్రయంబునను బరిశుద్ధుండునగు పూజ్యుండయినపురుషునిమీఁద , దొంగతనము మోపి, దీసికొనివచ్చినప్పుడు, అతనిఁబండితులచేనడిగించిశోధింపక, లంచమునందలియాశచే, వధింపవుగదా!

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఈశ్లోకమువలన, రాజు, సత్పురుషులమీఁదనేరము మోపఁబడినప్పుడు, చక్కఁగా, నతిజాగ్రత్తతోవిచారించి యాథార్థ్యముదెలిసికొనవలెననియు, అట్లువిచారింపక, దండించునేని, మహాదోషంబునొందుననియు, సూచింపఁబడినది.

గృహీతశ్చైవ పృష్టశ్చ కాలే దృష్ట స్సకారణః
కచ్చి న్న ముచ్యతే చోరో ధనలోభా న్నరర్షభ. ౫౭

టీక॥నరర్షభ= పురుషశ్రేష్ఠుండవగుభరతుఁడా! గృహీతశ్చైవ=పట్టుకొనఁబడినవాఁడును; పృష్టశ్చ= అడుగఁబడినవాఁడును; కాలే=యుక్తకాలమునం

దుష్టః=చూడఁబడినవాఁడును;సకారణః= కారణముతోఁగూడినవాఁడునగు;చోరః=దొంగ;ధనలోభాత్= ధనమునందలియాశవలన; నముచ్యతే కచ్చిత్=విడువఁబడఁడుగదా?

పురుష శ్రేష్ఠుఁడవగు భరతుఁడా! దొంగిలించుకొని పాఱిపోవు నప్పుడు దొంగిలించినద్రవ్యముతోఁబట్టుకొనఁబడి, పండితులచే శోధింపఁబడి, దొంగయనినిశ్చయింపఁబడినవాని, లంచముదీసుకొని,విడువవుగదా!

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఈశ్లోకముచే, దండ్యులను,దండింపకవిడుచు నేని,రాజునకుమహాదోషంబుగల్గుననిసూచింపఁబడినది.

వ్యసనే కచ్చి దాఢ్యస్య దుర్గతస్యచ రాఘవ
అర్థం విరాగాః పశ్యంతి తవా మాత్యా బహుశ్రుతాః. ౫౭

టీక॥రాఘవ=భరతుఁడా!బహుశ్రుతాః= అధికమయినవిద్యగలవారలగు; తవ=నీయొక్క;అమాత్యాః= మంత్రులు;ఆఢ్యస్య= ధనికునియొక్కయు; దుర్గతస్యచ=దరిద్రునియొక్కయు; వ్యసనే=సంకటమునందు;అర్థం= వ్యవహారమును;విరాగాః=ఆశ లేనివారలై; పశ్యంతికచ్చిత్ = చూచుచున్నారా యేమి?

భరతుఁడా! బుద్ధిమంతులగు నీమంత్రులు, ధనికునకు దరిద్రునకునువ్యవహారమువచ్చినప్పుడు, వారలవ్యవహారమునుధనాశవిడిచి,నిష్పక్షపాతముగాఁజూతురుగదా?అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఈశ్లోకముచే, రాజమంత్రులుదరిద్రునకును భాగ్యవంతునకును,వ్యవహారమువచ్చినప్పుడుభాగ్యవంతునియందుఁబక్షపాతముంచకసమముగాఁ,జూడవలెననియు , అట్లుచేయరేని, మహాదోషంబు నొందుదురనియు,సూచింపఁబడినది.

యాని మిథ్యాభిశస్తానాం పతంత్య స్రాణి రాఘవ
తాని పుత్రపశూన్ ఘ్నంతి ప్రీత్యర్థ మనుశాసతః. ౫౮

స ౧౦౦




టీక॥ రాఘవ=భరతుఁడా! మిథ్యాభిశస్తానాం=లేనితప్పు మోపఁబడినవారలకు; యాని = ఏ; అస్రాణి = ణి= కన్నీరు;పతంతి=పడునో; తాని= అవి; ప్రీత్యర్థం=సంతోషముకొఱకు; అనుశాసతః= పాలింపుచున్న రాజు యొక్క; పుత్రపశూన్=కొడుకులనుబశువులను; ఘ్నంతి=చంపుచున్నవి.

భరతుఁడా! తప్పునేరము మోపఁబడినవారిని, జక్కఁగావిచారింపక, రాజుదండించు నేని, వారలకండ్లనుండికాఱు కన్నీళ్లు, అట్లు, అలక్ష్యముగాఁదనమనస్సంతోషప్రకారముదండించునట్టి రాజు యొక్క, కొడుకులను బశువులను,అట్లు సమస్త సంపదలనునశింపఁజేయును.

అని, తాత్పర్యము.

విశేషార్థము. — ఈశ్లోకముచే, రాజు, అదండ్యులదండించినచో, అతనివంశంబునుసమస్తసంపదలును,నశించుననిసూచింపఁబడినది.

కచ్చి ద్వృద్ధాంశ్చ బాలాంశ్చ వైద్యముఖ్యాంశ్చ రాఘవ
దానేన మనసా వాచా త్రిభి రేతై ర్బుభూషసే. ౬౦

టీక॥ రాఘవ = భరతుఁడా! వృద్ధాంశ్చ = ముసలివారలను; బాలాంశ్చ = పిన్నవాండ్రను; వైద్యముఖ్యాంశ్చ=పండితశ్రేష్ఠులను; దానేన=ఈవిచేతను; మనసా=మనస్సుచేతను; వాచా=మాటలచేతను; ఏతైః= ఈ; త్రిభిః = మూఁడిటిచేత ; బుభూషసేకచ్చిత్=పొందఁగోరుదువా యేమి? వశీకరింపఁగోరుదువా యేమియనుట.

భరతుఁడా! వృద్ధులను బాలురను బండితులను, ధనరత్నాదులనొసంగుట స్నేహంబుఁజూపుట మంచిమాటలు చెప్పుట , ఈమూఁడుపాయంబులచేతను, వశీకరించుకొందువా యేమి?

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఈశ్లోకమువలన, రాజువృద్ధులనుబాలురను బండితులను, దానాద్యుపాయంబులచే , వశీకరింపవలెనని, సూచింపఁబడినది.

కచ్చి ద్గురూంశ్చ వృద్ధాంశ్చ తాపసాన్ దేవతాతిథీన్
చైత్యాంశ్చ సర్వాన్ సిద్ధార్థాన్ బ్రాహ్మణాంశ్చ నమస్యసి.౬౧







టీక॥ గురూంశ్చ = ఆచార్యులను; వృద్ధాంశ్చ = ముసలివారలను ; తాపసాన్=ఋషులను, దేవతాతిథీన్= దేవతలను అతిథులను; చైత్యాంశ్చ = చతుష్పథంబులందలివృక్షములను; సిద్ధార్థాన్=కృతార్థులగు; బ్రాహ్మణాంశ్చ=బ్రాహ్మణులను; సర్వాన్= అందఱను; నమస్యసికచ్చిత్ = నమస్కరింతువా యేమి?

గురువులనువృద్ధులను దపస్వులను దేవతలను అతిథులను జతుష్పథవృక్షంబులను గృతార్థులగు బ్రాహ్మణులను, నమస్కరింపుచుందువా యేమి?

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన, రాజు,గురువులను, వృద్ధులనుదపస్వులను దేవతలనుఅతిథులను జతుష్పథవృక్షంబులను బ్రాహ్మణోత్తములనుం,జూచినప్పుడు, వారలకు, నమస్కారము సేయవలెనని, సూచింపఁబడినది.

కచ్చి దర్థేన వా ధర్మ మర్థం ధర్మేణ వా పునః
ఉభౌవా ప్రీతిలోభేన కామేనచ న బాధసే. ౬౨

టీక॥ అర్థేన = ధనముచేత; ధర్మం=ధర్మమును;నబాధసేకచ్చిత్= బాధింపవుగదా? పునః = మఱియు; ధర్మేణ=ధర్మముచేత; అర్థంవా= ధనమునుగాని ; నబాధసేకచ్చిత్ (అధ్యాహృతము)=బాధింపవుగదా? ప్రీతిలోభేన=సుఖమునందలియాశచేతను; కామేనచ=కామముచేతను;ఉభౌవా= రెంటెనిగాని; నబాధసేకచ్చిత్(అధ్యాహృతము)=బాధింపవుగదా?

ధర్మమునువిడిచి, యర్థమునుమాత్రమెయార్జింపవుగదా? అట్లు, అర్థమునుమాత్రమార్జింపుచు, ధర్మార్జనంబు విడువవుగదా? సుఖేచ్ఛచేఁగానికామేచ్ఛచేఁగాని, ధర్మార్థంబులరెంటిని విడువవుగదా?

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఈశ్లోకముచే, రాజు, ధర్మంబునుఅర్థంబును, ఒకటినైననువిడువక, క్రమముగా, నయ్యైకాలంబులసంపాదింపుచుండవలెనని,సూచింపఁబడినది-

కచ్చి దర్థం చ ధర్మంచ కామంచ జయతాం వర




విభజ్య కాలే కాలజ్ఞ సర్వా న్వరద సేవసే. ౬౩

టీక॥జయతాం = జయించువారల లో; వర=శ్రేష్ఠుండవు; కాలజ్ఞ= కాలముల నెఱింగినవాఁడవు; వరద=వరంబుల నొసంగువాఁడవునగుభరతుఁడా! అర్థం=అర్థము ను; ధర్మంచ=ధర్మమును; కామంచ = కామమును; సర్వాన్=అన్నింటిని; విభజ్య=విభజించి; కాలే=యుక్తకాలమునందు; సేవసేకచ్చిత్=సేవించుచున్నావా యేమి?

జయశీలురలో నుత్తముఁడవు కాలజ్ఞుండవువరప్రదుండవునగుభరతుఁడా! ధర్మార్థకామంబులమూఁడింటినివిభజించిత త్తదుచితకాలంబును,అనఁగాఁ బూర్వాహ్ణంబునధర్మంబును, అపరాహ్ణంబునఁనర్థంబునుసాయంకాలంబునఁ గామంబును,సేవింపుచున్నావా యేమి?అని, తాత్పర్యము,

విశేషార్థము,— ఈశ్లోకముచే, రాజు,పూర్వాహ్ణంబున ధర్మంబును, అపరాహ్ణంబున నర్థంబును సాయంకాలంబునఁ గామంబును, ఇట్లు విభజించియ మ్యైకాలంబుల సేవింపవలయును గాని, యథేచ్ఛమె యింద్రవర్తింపఁగూడదనిసూచింపఁబడినది.

కచ్చి త్తే బ్రాహ్మణా శ్శర్మ సర్వశాస్త్రార్థకోవిదాః
ఆశంసంతే మహాప్రాజ్ఞ పౌరజానపదైస్సహ. ౬౪

టీక॥మహాప్రాజ్ఞ=మహాపండితుఁడవగుభరతుఁడా! సర్వశాస్త్రార్థకోవిదాః = సమస్తశాస్త్రార్థములయందుఁబండితులగు; బ్రాహ్మణాః = బ్రాహ్మణులు; పౌరజానపదైస్సహ= పట్టణవాసిజనులతోను గ్రామవాసిజనులతోనుంగూడ; తే=నీయొక్క; శర్మ= సౌఖ్యమును; ఆశంసంతేకచ్చిత్=ప్రార్థించుచున్నారుగదా!

మహాపండితుండవగుభరతుఁడా! సమస్తశాస్త్రవేత్తలగుబ్రాహ్మణులును, పట్టణంబులను గ్రామంబులను నివసించుజనులును, నీసుఖంబుగోరుచుందురుగదా? అని, తాత్పర్యము-

విశేషార్థము, — ఈశ్లోకమువలన, రాజు , బ్రాహ్మణోత్తములును ప్రజలును ఎల్లప్పుడునుదనసుఖంబుఁగోరుచుండునట్లు,వారలగారవింపవలెనని

సూచింపఁబడినది.

నాస్తిక్య మనృతం క్రోధం ప్రమాదం దీర్ఘసూత్రతామ్
అదర్శనం జ్ఞానవతా మాలస్యం పంచవృత్తితామ్
ఏకచింతన మర్థానా మనర్థజ్ఞైశ్చ మంత్రణమ్
నిశ్చితానా మనారంభం మంత్రస్యా పరిరక్షణమ్. ౬౬
మంగళస్యా ప్రయోగంచ ప్రత్యుత్థానంచ సర్వతః
కచ్చి త్త్వం వర్జయస్యే తాన్ రాజదోషాం శ్చతుర్దశ. ౬౭

టీక॥ నాస్తిక్యం=నాస్తికతను; అనృతం=అబద్ధమాడుటను; క్రోధం=కోపమును; ప్రమాదం=ఏమఱుపాటును; దీర్ఘసూత్రతాం= ఆలస్యముగాఁబని సేయుటను; జ్ఞానవతాం=జ్ఞానవంతులయొక్క; అదర్శనం= దర్శనంబు సేయకుండుటను; ఆలస్యం= మత్తద్రవ్యసేవచేఁగలిగిన మత్తతను; పంచవృత్తితాం= పంచేంద్రియ పరవశతను; అర్థానాం=కార్యములయొక్క; ఏకచింతనం= ఒక్కఁడే యాలోచించుటను; అనర్థజ్ఞైః = కార్యంబుఁదెలియనివారలతోఁగూడ; మంత్రణంచ=ఆలోచించుటను; నిశ్చితానాం=నిశ్చయింపఁబడినకార్యంబులయొక్క; అనారంభం=ఆరంభము సేయకుండుటను; మంత్రస్య= ఆలోచనయొక్క; అపరిరక్షణం= రక్షింపకుండుటకును; మంగళస్య=మంగళముయొక్క; సర్వతః=అంతటను; ప్రత్యుత్థానంచ=ఎదుర్కొనుటను; ఏతాన్=ఈ; చతుర్దశ= పదునాలుగైన; రాజదోషాన్=రాజదోషములన; త్వం=నీవు; వర్జయసి కచ్చిత్= విడుచుచున్నావా యేమి?

నాస్తికత, అబద్ధమాడుట, మహాకోపముగలిగియుండుట, ఏమఱియుండుట, యాలస్యముగాఁ బని సేయుట, జ్ఞానవంతులలక్ష్యము సేయకుండుట, మత్తత, యింద్రియ పరవశత, మంత్రులెందుకని తానొక్కఁడే కార్యంబుల నాలోచించుట, యేమియుఁ దెలియని వారలతో నాలోచించుట, యాలోచనంబునఁ జేయనిశ్చయింపఁబడినవానినారంభింపకుండుట, యాలోచితాంశము నుబయలుపఱచుట, ప్రాతఃకాలంబున నద్దంబుఁ జూచుట మొదలగు మంగళప్ర

స ౧౦౦




యోగంబులఁ జేయకుండుట, యేకకాలంబునసమస్తశత్రువులతోనుయుద్ధంబు సేయుటయనుపదునాల్గురాజదోషంబులువిడుతువా? యేమి? అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన, రాజు, నాస్తికుఁడుగానుండఁగూడదనియు, అబద్ధమాడఁగూడదనియు, మహాకోపంబు గలిగియుండఁ గూడదనియు, ఏమఱియుండఁగూడదనియు, సోమరిగా నుండగూడదనియు, జ్ఞానవంతులదర్శనముసేయుచుండవలెననియు, మత్తుఁడైయుండఁగూడదనియు, నింద్రియపరవశుఁడు కాఁగూడదనియుఁ, దానొకఁడెయాలోచింపఁగూడదనియుఁ, దెలియనివారితో నాలోచింపఁ గూడదనియు, నాలోచనమునందునిశ్చితములగు నంశములందప్పక యారంభింపవలెననియు, ఆలోచితాంశమునుబయలుపఱుపఁగూడదనియు, నిద్రలేచినప్పుడుదర్పణంబుఁజూచుట మొదలగుమంగళాచరణంబులుసేయుచుండవలెననియు, నేకకాలంబునబహుశత్రువులతోయుద్ధంబు సేయఁగూడదనియు , సూచింపఁబడినది.

దశపంచచతుర్వర్గాన్ సప్తవర్గంచ తత్త్వతః
అష్టవర్గం త్రివర్గంచ విద్యాస్తిస్రశ్చ రాఘవ. ౬౮
ఇంద్రియాణాం జయం బుద్ధ్వా షాడ్గుణ్యం దైవమానుషమ్
కృత్యం వింశతివర్గంచ తథా ప్రకృతిమండలమ్. ౬౯
యాత్రాదండవిధానంచ ద్వియోనీ సంధివిగ్రహౌ
కచ్చి దేతాన్ మహాప్రాజ్ఞ యథావ దనుమన్యసే. ౭౦

టీక॥ మహాప్రాజ్ఞ = మహాపండితుండవగు; రాఘవ=భరతుఁడా! దశపంచచతుర్వర్గాన్=పది,అయిదు, నాలుగు, వర్గములను; సప్తవర్గంచ=ఏడింటిసమూహమును; అష్టవర్గ వర్గం=ఎనిమిదింటియొక్క-సమూహమును;త్రివర్గంచ=మూడింటియొక్క-సమూహమును; తిస్రః=మూఁడైన ; విద్యాశ్చ=విద్యలను; ఇంద్రియాణాం=ఇంద్రియములయొక్క-; జయం=జయమును; షాడ్గుణ్యం= ఆఱుగుణంబులును; దైవమానుషం= దైవంబునుమానుషంబును; కృత్యం= భేదకార్యంబును; వింశతివర్గంచ= ఇరువదింటియొక్క-




సమూహమును; తథా=అట్లు; ప్రకృతిమండలం=ప్రకృతులనుమండలమును; యాత్రాదండవిధానంచ=యాత్రనుసైన్యవిధానంబును;సంధివిగ్రహౌ=సంధివిగ్రహములను;ద్వియోనీ=రెండుకారణములను;తత్త్వతః=యాథార్థ్యముచేత; బుద్ధ్వా=ఎఱింగి;ఏతాన్=వీనిని;యథావత్=యథాశాస్త్రముగా; అనుమన్యసేకచ్చిత్= అనుమతించుచున్నావా యేమి?అనుష్ఠించుచున్నావా యేమియనుట.

మహాపండితుండవగుభరతుఁడా! నీవు, దశవర్గమును పంచవర్గమునుజతుర్వర్గంబును సప్తవర్గంబునుఅష్టవర్గంబును త్రివర్గంబునుమూఁడువిద్యలను,ఇంద్రియవశీకరణంబును, షడ్గుణంబులను,దైవంబును మానుషంబును,భేదకార్యంబును, వింశతి వర్గంబును, ప్రకృతిమండలంబులను, జక్కఁగాఁదెలిసికొని,విడువవలసినవానివిడిచి, యంగీకరింపవలసినవానినంగీకరింతువా యేమి?

అని, తాత్పర్యము.

విశేషార్థము.— దశపంచచతుర్వర్గాన్=దశవర్గములను, పంచవర్గములను, చతుర్వర్గములను; దశవర్గము,"మృగయాక్షోదివాస్వాపః పరివాదస్స్త్రియోమదః, తౌర్యత్రికంవృథాట్యాచ కామజోదశకోగుణః" (వేఁట,జూదము,పగలునిద్రించుట,నిందించుట, స్త్రీలు , మదము, నృత్తము,గీతము,వాద్యము,వ్యర్థముగాఁదిరుగుట, ఈపదియుఁగామజగుణములు) అని,మనువుచేఁజెప్పఁబడినది. లేక,"లుబ్ధఃక్రూరోలసోసత్యఃప్రమాదీభీరురస్థిరః,మూఢోనయోవమంతాచ సుఖచ్ఛేద్యోరిపుర్మతః" (లుబ్ధుండునుగ్రూరుండును అలసుండునుఅబద్ధములాడువాఁడును, ఏమఱియున్నవాడును,భయపడు స్వభావముగలవాఁడును స్థైర్యములేనివాఁడును, మూఢుండును,నీతిమీఱినవాఁడును అవమానించువాఁడును, ఇట్టిశత్రువు,సుఖముగా, జయింపఁదగినవాఁడని చెప్పఁబడినది) అని,లోభంబును శౌర్యంబును ఆలస్యంబును,అసత్యంబులాడుటయు నేమఱియుండుటయు భయశీలతయును,స్థైర్యములేమియు, మూఢతయు నయరహితతయు గొప్పవారలనవమానించుటయు, ఈపదియు , దశవర్గముగాఁగామందకునిచేఁ జెప్పబడినది.పంచవర్గమనఁగా ఔదకపార్వతవార్క్షైరిణధాన్వనంబులనుపంచదుర్గములు,లేక పంచవర్గమనఁగా, పంచవిధవైరములు, "సాపత్నంవస్తు

స ౧౦౦

జం స్త్రీజం వాగ్జాతమపరాధజం, వైరప్రభేదనిపుణై ర్వైరంపంచవిధంస్మృతం" (చవతితల్లి చేఁజేయఁబడినదియు, ద్రవ్యమువలనఁగలిగినదియు, స్త్రీవలనఁబుట్టినదియు, మాటవలనఁ గలిగినదియు, నపరాధమువలనసంభవించినదియు, నని, వైరభేదజ్ఞాతలగుపండితులు, వైరమును, అయిదువిధములుగాఁజెప్పినారు) అని, కామందకునిచేఁ జెప్పఁబడినవి. చతుర్వర్గమనఁగా, సామదానభేదదండములు, లేక, చతుర్విధమిత్రులు, "ఔరసంతంతుసంబంధంతథావంశక్రమాగతం, రక్షితంవ్యసనేభ్యశ్చమిత్రంజ్ఞేయం చతుర్విధం" అని, కామందకీయమందుఁ జెప్పఁబడినది; లేక, "న్యాయేనార్జనమర్థస్యరక్షణం వర్ధనంతథా, సత్పాత్రే ప్రతిపత్తిశ్చరాజవృత్తం చతుర్విధం" (ధనమునున్యాయంబున నార్జించుట, దానిరక్షించుట, వృద్ధిఁబొందించుట సత్పాత్రమునందు వినియోగించుట, ఇట్లు, రాజవృత్తము, నాలుగువిధములు,) అని, చెప్పఁబడిన, రాజవృత్తములు. సప్తవర్గంచ = ఏడింటిసమూహమును, "స్వామ్యమాత్యాశ్చ రాష్ట్రంచ దుర్గంకోశోబలంసుహృత్ । పరస్పరోపకారీదంరాజ్యంసప్తాంగముచ్యతే" (రాజును, మంత్రులును, రాష్ట్రమును, దుర్గమును, బొక్కసమును, సేనయును, మిత్రులును, ఇట్లు, పరస్పరోపకారియగుటచే, రాజ్యము, ఏడంగములుగలదగుచున్నది) అని, చెప్పఁబడినట్లు, సప్తాంగములు; లేక, స్వపక్షభేదములు, అట్లు, "నిజోథమైత్రశ్చసమాశ్రితశ్చ సుబంధుజః కార్యసముద్భవశ్చ, భృత్యోగృహీతోవివిధోపచారైః పక్షంబుధాస్సప్తవిధంవదంతి" (తనవాఁడును, మిత్రుఁనకుసంబంధించినవాఁడును, ఆశ్రితుండును, బంధుసంబంధముగలవాఁడును, కార్యసంబంధముచేవచ్చినవాఁడును, నానావిధోపచారంబులవశీకరింపఁబడినవాఁడును భృత్యుండును, ఇట్లు, పండితులు, స్వపక్షమును, ఏడువిధములుగాఁజెప్పుచున్నారు) అని, చెప్పఁబడినది. లేక, సప్తవిధశ్యేనాదిప్రధానవ్యూహములు. అష్టవర్గం = ఎనిమిదింటియొక్కసమూహమును, "కృషివాణిజ్యాదుర్గంచ సేతుఃకుంజరబంధనం, ఖన్యాకరఃకరాదానం శూన్యానాంచనివేశనం, అష్టవర్గమిమంసాధుస్స్వస్థవృత్తోనలోపయేత్ (కృషి, వాణిజ్యము, సేతువు, ఏనుంగులనుగట్టుట, గనులను సంగ్రహించుట, పన్నుదీయు

ట, శూన్యగృహములలోఁగా పురము లుంచుట;యిదియష్టవర్గమనఁబడును, దీనిరాజువిడువఁగూడదు)అని, చెప్పఁబడినకృష్యాదులెనిమిది;లేక, "పైశున్యం సాహసంద్రోహ మీర్ష్యాసూయార్థదూషణం, వాగ్దండయోశ్చ పారుష్యం క్రోధజోపి గుణోష్టకః". (పైశున్యము,సాహసము, ద్రోహము, ఈర్ష్య, గుణంబులయందు దోషారోపము, అర్థదూషణము,వాక్పారుష్యము, దండపారుష్యము, ఈయెనిమిదియుఁ,క్రోధజగుణములు) అని, చెప్పఁబడినపైశున్యాదులెనిమిది. త్రివర్గం= మూఁడింటియొక్కసమూహమును, ధర్మార్థకామంబులనుట; లేక, ఉత్సాహప్రభుమంత్రశక్తులు మూఁడు; లేక,శత్రువుల,క్షయస్థానవృద్ధులు,అట్లు "క్షయస్థ్సానంచవృద్ధిశ్చ త్రివర్గో నీతివేదినాం"( క్షయము,స్థానము, వృద్ధి,ఇవి, న్యాయవేత్తల మతమునందు , త్రివర్గము) అని,చెప్పఁబడినది.లేక, "వస్తుష్వశక్యేషు సముద్యమశ్చ శక్యేషు మోహాదసముద్యమశ్చ, శక్యేష్వకాలేషుసముద్యమశ్చ త్రిధైవకార్యవ్యసనం వదంతి" (అశక్యములయినకార్యములయందుఁ బ్రయత్నించుటయు, అజ్ఞానమువలన శక్యములగు కార్యములందుఁ బ్రయత్నింపకుండుటయు, శక్యకార్యములం దకాలంబునఁ బ్రయత్నించుటయు,నిట్లు,కార్యవ్యసనము, మూఁడువిధములు. ) అని, చెప్పఁబడిన కార్యవ్యసనములు మూఁడు. తిస్రః = మూఁడైన; విద్యాః = విద్యలను ; త్రయీవార్తాదండనీతులననుట. ఇంద్రియాణాం= ఇంద్రియములయొక్క; జయం=జయోపాయమును ; షాడ్గుణ్యం=సంధివిగ్రహయానాసన ద్వైధీభావ సమాశ్రయములను షడ్గుణంబులను; దైవమానుషం=దేవజన్య వ్యసనంబును,మనుష్యజన్యవ్యసనంబును;అందు, దైవవ్యసనంబు "హుతాశనోజలంవ్యాధిదుర్భిక్షంమరణంతథా" (అగ్ని, జలము,వ్యాధి, దుర్భిక్షము, మరణము) అని,దైవవ్యసనమయిదువిధములు ; అట్లు, మానుషవ్యసనము, "ఆయుక్తకేభ్యశ్చోరేభ్యఃపరేభ్యోరాజవల్లభాత్, పృథివీపతిలోభాచ్చవ్యసనంపంచధాభవేత్" (అధికారులవలనఁగలుగు వ్యసనమును, దొంగలవలనఁ గలుగు వ్యసనంబునుశత్రువులవలనంగలుగువ్యసనంబును,రాజుఅత్యాశ నొందుటవలనఁగలుగువ్యసనంబును , అని,మానుషవ్యస

నమయిదువిధములు) అని, చెప్పఁబడిన ది.కృత్యం=భేదకార్యంబును, "అలబ్ధవేతనోలుబ్ధోమానీచాప్యవమానితః, క్రుద్ధశ్చకోపితోకస్మాత్తథాభీతశ్చ భీషితః, యథాభి లషితైః కామై ర్భింద్యాదేతాంశ్చతుర్విధాన్." (సంబళమునొంద నిలుబ్ధుండును, అవమానింపఁబడినమానియు,కోపంబునొందింపఁబడినగోపనుండును, భయమునొందింపఁబడిన భీరువును,శత్రుపక్షంబునకుఁ జేరినయీనల్వురిని,అభిమతంబులనొసంగి, భేదింపవలెను)అని, చెప్పఁబడిన భేదకార్యంబును; వింశతివర్గంచ=ఇరువదింటియొక్క సమూహమును, "బాలోవృద్ధోదీర్ఘరోగీతథాజ్ఞాతిబహిష్కృతః, భీరుకోభీరుజనకోలుబ్ధోలుబ్ధజనస్తథా;విరక్తప్రకృతిశ్చైవవిషయేష్వతిసక్తిమాన్, అనేకచిత్తమంత్రశ్చ దేవబ్రాహ్మణ నిందకః,దైవోపహతకశ్చైవ దైవ చింతకఏవచ, దుర్భిక్షవ్యసనోపేతో బలవ్యసనసంకులః, అదేశస్థోబహురిపుర్యుక్తోకాలేనయశ్చసః, సత్యధర్మవ్యపేతశ్చ వింశతిః పురుషాఅమీ, ఏతైస్సంధింనకుర్వీతనిగృహ్ణీయాత్తుకేవలం" (బాలుండును,వృద్ధుండును,దీర్ఘరోగియు, బంధువులచేవిడువఁబడినవాఁడును, భయశీలుండును, భీరువులయినిజనులుగలవాఁడును,లుబ్ధుండును, లుబ్ధులగుజనులుగలవాఁడును, వైరాగ్యప్రకృతిగలవాఁడును,విషయలోలుండును,భిన్నభావములుగలయాలోచనగలవాఁడును, దేవబ్రాహ్మణనిందకుండును,దైవబలముచేఁ గొట్టఁబడినవాఁడును, దైవమునెచింతించువాఁడును, దుర్భిక్షదుఃఖపీడితుండును, సైన్యదుఃఖపీడితుండును,భిన్నదేశంబుననున్నవాఁడును, పెక్కుశత్రువులుగలవాఁడును,అకాలంబుతోఁగూడినవాఁడును, సత్యమును ధర్మమునులేనివాఁడును, ఈయిరువదిమందితో సంధిసేయఁగూడదు; యుద్ధమేచేయవలసినది.) అని,చెప్పఁబడినయిరువదిమందిదుర్బల శత్రువులననుట;లేక; "రాజ్యస్త్రీస్థానదేశానాం జ్ఞాతీనాంచధనస్యచ, అపహారోమదోమానః పీడావైషయికీతథా, జ్ఞానార్థశక్తిధర్మాణాంవిఘాతోదైవమేవచ, మిత్రార్థయోశ్చావమానస్తథాబంధువినాశనం, భూతానుగ్రహవిచ్ఛేదస్తథామండలదూషణం, ఏకార్థాభినివేశిత్వ మితి విగ్రహ యోనయః" (రాజ్యమునపహరించుట,స్త్రీనపహరించుట, స్థానమునపహరించుట, దేశమునపహరించుట, జ్ఞాతులనపహరించుట, ధనమునపహరించుట, మదము, మానము, విషయపీడ,జ్ఞానములే

కుండుట,ధనములేకుండుట, శక్తిలేకుండుట, ధర్మములేకుండుట, దేవవిరోధియగుట, మిత్రునవమానించుట, మిత్రధనమునపహరించుట , బంధువులనశింపఁజేయుట,భూతదయలేకుండుట, తానుమంత్రులుతనస్నేహితులు మొదలగువారిల భేదించుట, తానుగోరినదానినే కోరుట, ఈయిరువదియు యుద్ధమునకుఁ గారణములు) అని,చెప్పఁబడినయుద్ధకారణములు.ప్రకృతిమండలం= ప్రకృతులనుమండలమును; అందుఁ బ్రకృతులు, "అమాత్యరాష్ట్రదుర్గాణికోశో దండస్తుపంచమః, ఏతాఃప్రకృతయస్తజ్జ్ఞై ర్విజిగీషోరుదాహృతాః"(మంత్రులు,రాష్ట్రము, దుర్గములు , బొక్కసము,సేన,ఈయైయిదును, జయంబుఁగోరురాజునకుఁబ్రకృతులని, ప్రకృతిజ్ఞులచేఁజెప్పఁబడినది)అని,కామందకునిచేఁజెప్పఁబడినవి. మండలము, అనఁగా,విజిగీషువునకు, ముందు వెనుక మొదలగుభాగంబులనుండుపండ్రెండు రాజులు.విజిగీషువొకఁడు.అతనికగ్రభాగంబుననుండువాఁడుశత్రువు, ఆశత్రువునకు ముందటనుండువాఁడుమిత్రుఁడు, ఆతనిముందటనుండువాఁడుశత్రుమిత్రుండు, ఆతనికిముందట నుండువాఁడు మిత్రమిత్రుఁడుఅతనికిఁబిరోవర్తియగువాఁడు శత్రుమిత్రమిత్రుఁడు,ఇట్లు, విజిగీషువునకుఁబురోవర్తులగురాజులయిదుగురువిజిగీషువునకుఁబృష్ఠభాగంబుననుండువాఁడుశత్రువు, అతండుపార్ష్ణిగ్రాహుండనంబడును. అతనికివెనుకటివాఁడు ఆక్రందుఁడు ఈతఁడువిజిగీషువునకుమిత్రుడు.ఇతనికివెనుకనుండువాఁడు, పార్ష్ణిగ్రాహునకుమిత్రుఁడు, ఇతనిపేరు పార్ష్ణిగ్రాహాసారుఁడు, ఆసారుఁ డనఁగా,మిత్రుఁడనియర్థము ; ఈపార్ష్ణిగ్రాహాసారునకువెనుకటివాఁడు,క్రందునకుమిత్రుండు;ఇతండు,ఆక్రందాసారుఁడనంబడును ఇట్లువిజిగీషువునకు,వెనుకనుండురాజులు నలుగురు. పార్శ్వభాగంబుననుండువాఁడు మధ్యముఁడు, అతండొకఁడు. వీరలకు వెలుపలనుండి వీరలకలహస్నేహసంబంధములేకుండువాఁడుఉదాసీనుఁడుఅతండువీరలయందఱికన్నఅధికుఁడు.ఇట్లువీరలందఱు, పండ్రెండువిధములుఇదియేమండలమనబడుచున్నది.అట్లు,కామందకీయమునందు"సంపన్నస్తుప్రకృతిభిర్మహోత్సాహః కృతశ్రమః, జేతుమీషణశీలశ్చవిజిగీషురితిస్మృతః, అరిర్మిత్ర మరేర్మిత్రంమిత్రమిత్రమతఃపరం, తథారిమిత్ర




మిత్రంచవిజిగీషోఃపురస్సరాః, పార్ష్ణిగ్రాహ స్తతఃపశ్చాదాక్రంద స్తదనంతరం,ఆసారావనయోశ్చైవవిజిగీషోస్తు పృష్ఠతః, అరేశ్చవిజిగీషోశ్చ మధ్యమోభూమ్యనంతరః, అనుగ్రహేసంహతయోర్వ్యస్తయో ర్నిగ్రహే ప్రభుః, మండలాద్బహిరేతేషా ముదాసీనోబలాధికః, అనుగ్రహేసంహతానాంవ్యస్తానాంచ వధేప్రభుః" (ప్రకృతిసంపన్నుండును మహోత్సాహుండును,కృతశ్రముండును , జయంబుఁ గోరువాఁడునగు రాజువిజిగీషువనఁబడును; శత్రువు,మిత్రుఁడు,శత్రుమిత్రుఁడు, మిత్రమిత్రుఁడు,శత్రుమిత్రమిత్రుఁడు,వీరలు విజిగీషువునకుముందుండువారలు. పార్ష్ణిగ్రాహుఁడు,అతనికివెనుక నాక్రందుఁడు, పార్ష్ణిగ్రాహాసారుఁడు, ఆక్రందాసారుఁడు,వీరలువిజిగీషు వునకు వెనుకనుండువారలు, విజిగీషువునకును శత్రువునకునుపార్శ్వభాగంబున నుండువాఁడుమధ్యముఁడు. అతండు, ఈయిరువిజిగీషువులు, స్నేహముతోఁ గలసియుండురేని, యనుగ్రహించుటకును, వీరలు, ఒండొరులపైఁ బగగొనియుండురేనినిగ్రహించుటకునుసమర్థుఁడు. వీరలయందఱిమండలంబునకుబహిర్గతుండయి, వీరలకన్న యధికబలుండై, వీరలు కలసియుండిరేని, యనుగ్రహంబును, బరస్పర వైరంబు వహించియుండురేని నిగ్రహంబును,జేయసమర్థుండయి, యుండువాఁడుఉదాసీనుండు.) ఇచ్చట,విజిగీషువు,ఏదిక్కునుగూర్చియుద్ధమునకుఁబోవునో, అదియగ్రిభాగంబనియెఱుంగునది. యాత్రాదండవిధానంచ, యాత్రా = శత్రువునుగూర్చిదండెత్తిపోవుటను;దండవిధానంచ=సైన్యవిధానమును, నానావిధవ్యూహములననుట; అందు, యానము, అయిదువిధములు, "విగృహ్యాసంధాయ తథాసంభూయాథప్రసంగతః । ఉపేక్ష్యచేతినిపుణై ర్యానం పంచవిధంస్మృతమ్" ( బలాతిశయమునఁబార్ష్ణిగ్రాహాదులనిగ్రహించిశత్రువుపైకిఁబోవుట విగృహ్యయానము,పార్ష్ణిగ్రాహాదులతోసంధిచేసికొనిపోవుటసంధాయయానము , ఇరుగుపొరుగు రాజులతోఁజేరిపోవుటసంభూయయానము, మఱియొకయుద్దేశముఁబుట్టించి మఱియొకనిపైకిఁబోవుటప్రసంగతోయానము, శత్రువుపైకిఁ బయనమయి యతండుబలవంతుండగుటచే నతనియుపేక్షించి మిత్రోద్దేశంబునంబోవుట యుపేక్ష్యయా




నము; ఇట్లు పండితులు, యానము నైదువిధములుగాఁ జెప్పిరి.) ద్వయోనీ సంధివిగ్రహౌ = సంధివిగ్రహయానాసన ద్వైధీభావసమాశ్రయములను షడ్గుణములకును, కారణములయిన, సంధివిగ్రహములను రెంటిని; యానాసనంబులువిగ్రహము నందును ద్వైధీభావ సమాశ్రయములు సంధియందును అంతర్భూతములు. ఏతౌ = వీనిని; యథావత్ = యథాశాస్త్రముగా; అనుమన్యసే కచ్చిత్ = అనుమతించుచున్నావా యేమి? ఇందు, విడువవలసినవానిఁ విడిచి, యంగీకరింపవలసినవానినంగీకరింపుచుందువా యేమి? యనుట.

మంత్రిభి స్త్వం యథోద్దిష్టై శ్చతుర్భి స్త్రిభిరేవవా
కచ్చి త్సమస్తై ర్వ్యస్తైశ్చ మంత్రం మంత్రయసే మిథః. ౨౧

టీక॥ త్వం = నీవు; యథోద్దిష్టైః = యథాశాస్త్రోక్తలక్షణములుగల; మంత్రిభిః = మంత్రులతో; చతుర్భిః = నలువురితోఁగాని; త్రిభిరేవవా = మువ్వురితోఁగాని; సమస్తైః = కలసినవారలతోను; వ్యస్తైశ్చ = ఒక్కొకరుగానున్నవారలతోను; మంత్రం = ఆలోచనమును; మిథః = పరస్పరము; మంత్రయసే కచ్చిత్ = ఆలోచించుచున్నావా యేమి? చేయుచున్నావా యేమియనుట.

నీవు, శాస్త్రోక్త లక్షణలక్షితులగు మంత్రుల, నలువురఁ గాని మువ్వురఁగానియుంచుకొని, రహస్యముగా నాలోచించి, యంత, వారలలో, నొక్కొకరితో నాలోచించి, వారివారియభిప్రాయంబు, దెలిసికొందువా యేమి? అని, తాత్పర్యము.

విశేషార్థము.—ఇందువలన, రాజు, మున్నురుగాని నలుగురుగాని మంత్రులను జేర్చుకొని యాలోచింప వలయుననియు, నటుపిమ్మట, ఒక్కొకరితోను వేఱువేఱ నాలోచించి, వారివారినిజాభిప్రాయంబు నెఱుంగవలయుననియు, సూచింపఁబడినది.

కచ్చి త్తే సఫలా వేదాః కచ్చి త్తే సఫలాః క్రియాః
కచ్చి త్తే సఫలా దారాః కచ్చి త్తే సఫలం శ్రుతమ్. ౨౨

టీక॥ తే=నీయొక్క; వేదాః= వేదములు; సఫలాఃకచ్చిత్ = సఫలములాయేమి? తే=నీయొక్క; క్రియాః = ధనములు; సఫలాఃకచ్చిత్ = సఫలములాయేమి? తే=నీయొక్క; దారాః=భార్యలు; సఫలాఃకచ్చిత్=సఫలలాయేమి! తే=నీయొక్క; శ్రుతం=శాస్త్రశ్రవణము; సఫలంకచ్చిత్=సఫలమాయేమి?

నీవధ్యయినించిన వేదములు, అగ్నిహోత్రాద్యనుష్ఠానములచే సఫలములుగానున్నవాయేమి? నీవుసంపాదించినధనములు, దానభోగములచేసఫలములాయేమి?నీభార్యలు, రతిచేతనుసంతానముచేతను. సఫలలాయేమి? నీవువిన్నశాస్త్రములు , సత్స్వభావముసదాచారముఁగలుగుటచే, సఫలములుగానున్నవాయేమి?అని, తాత్పర్యము.

విశేషార్థము.—ఇందువలన, వేదములధ్యయనించుటకు ఫలముయాగాద్యనుష్ఠానమనియు, ధనముసంపాదించుటకుఫలముదానభోగంబులనియు, వివాహమాడుటకుఫలమురతిసంతానములనియు, శాస్త్రశ్రవణంబునకుఫలము సౌశీల్యసదాచారసంపత్తియనియు, ఈఫలము లేకున్నచో, నవినిష్ఫలములేయనియు సూచింపఁబడినది. అట్లుమహాభారతంబునందు, "అగ్నిహోత్రఫలా వేదాదత్తభుక్తఫలంధనం, రతిపుత్రఫలాదారాశ్శీలవృత్తఫలంశ్రుతం" (వేదములు అగ్నిహోత్రమేఫలముగాఁగలవి; ధనముదానభోగములేఫలములుగాఁగలవి; భార్య,రతిపుత్రులేఫలములుగాఁగలది; శాస్త్రశ్రవణముసౌశీల్యసదాచారంబులేఫలములుగాఁగలది) యని, చెప్పఁబడినది.

కచ్చి దేషైవ తే బుద్ధి ర్యథోక్తా మమ రాఘవ
ఆయుష్యాచ యశస్యాచ ధర్మకామార్థసంహితా, ౭౩

టీక॥ రాఘవ=భరతుఁడా! ఆయుష్యాచ=ఆయుఃప్రదంబును; యశస్యాచ=అధికకీర్తినిచ్చునదియు; ధర్మకామార్థసంహితా = ధర్మముతోను గామముతోనుఅర్థముతోను గూడినదియనగు;మమ(మయా)=నాచేత; యథోక్తా=చెప్పఁబడిన;ఏషా=ఈ; బుద్ధిరేవ=బుద్ధియే; తే=నీకు;(అస్తి)కచ్చిత్=

ఉన్నవా యేమి?

భరతుఁడా! దీర్ఘాయుః ప్రదంబును యశస్కరంబును ధర్మకామార్థప్రదంబునగు, నిప్పుడు చెప్పఁబడినబుద్ధి, నాకుండునట్లు. నీకును, ఉన్నదా యేమి? అని, తాత్పర్యము.

విశేషార్థము.—ఇందువలన, ఇది వఱకుఁ జెప్పినధర్మముల నాచరించుట వలన, దీర్ఘాయువును అధికయశంబును, ధర్మార్థకామంబులును గలుగున ని, సూచింపఁబడినది.

యాం వృత్తిం వర్తతే తాతో యాం చ నః ప్రపితామహాః
తాం వృత్తిం వర్తసే కచ్చి ద్యాచ సత్పథగా శుభా. ౭౪

టీక॥ తాతః=తండ్రి; యాం=ఏ; వృత్తిం=ఆచారమును; వర్తతే=ఆచరింపుచున్నాఁడో; యాం=ఏయాచారమును; నః= మనయొక్క; ప్రపితామహాశ్చ=ముత్తాత మొదలగు వారలును; అవర్తంత (అధ్యాహృతము)=ఆచరించిరో; యాచ=ఏదియు; సత్పథగా= సన్మార్గమునొందునదియు; శుభా=మంగళకరమునో; తాం=అట్టి; వృత్తిం=వృత్తిని; వర్తసే కచ్చిత్=ఆచరించుచున్నావా యేమి?

మనతండ్రి దశరథుండే వృత్తినవలంబించియున్నాఁడో, మఱియు మనతాతముత్తాతలే వృత్తినవలంబించి యుండిరో, ఏదిసన్మార్గయుక్తంబును అనిందితంబులైయుండునో, అట్టివృత్తిని నీవవలంబించియున్నావా యేమి?

అని, తాత్పర్యము.

విశేషార్థము, — ఇందువలనఁ దండ్రితాతలవలంబించియుండిన వృత్తిని విడువఁగూడదనియు, వారలనుష్ఠింపకున్నను, యుక్తములయినదాని ననుష్ఠింపవలెననియు, సూచింపఁబడినది.

కచ్చి త్స్వాదుకృతం భోజ్య మేకో నాశ్నాసి రాఘవ
కచ్చి దాశంసమానేభ్యో మిత్రేభ్య స్సంప్రయచ్ఛసి. ౭౫

టీక॥ రాఘవ=భరతుఁడా! స్వాదుకృతం=మధురముగాఁ జేయఁబడిన; భో




జ్యం=అన్నమును; ఏకః= ఒకరుఁడవే; నాశ్నాసికచ్చిత్=భుజింపవుగదా? ఆశంసమానేభ్యః= ప్రార్థించుచున్న; మిత్రేభ్యః=స్నేహితులకొఱకు; సంప్రయచ్ఛసికచ్చిత్=ఇత్తువా? ఏమి?

భరతుఁడా! మధురాన్నమునునీవొకరుఁడవే భుజింపవుగదా? స్నేహితులకు, అభీష్టంబుల నొసంగుచుందువుగదా? అని, తాత్పర్యము.

విశేషార్థము.—ఇందువలన, మధురాన్నమును ఒకరుఁడే భుజింపఁగూడదనియు, స్నేహితులకు యథాశక్తి, అభీష్టంబుల నొసంగ వలయుననియు, సూచింపఁబడినది.

రాజాతు ధర్మేణ హి పాలయిత్వా
మహామతి దండధరః ప్రజానామ్
అవాప్య కృత్స్నాం వసుధాం యథావ
దిత శ్చ్యుత స్స్వర్గ ముపైతి విద్వాన్. ౭౬

టీక॥ విద్వాన్=పండితుండును; మహామతిః= అధికములయినబుద్ధిగలవాఁడును; ప్రజానాం=ప్రజలయొక్క; దండధరః= శిక్షనుధరించునట్టివాఁడునగు; రాజాతు=రాజుమాత్రము; ధర్మేణ= ధర్మముచేత; మహీం (అధ్యాహృతము)=భూమిని; యథావత్ = యథాశాస్త్రముగా; పాలయిత్వా= పాలించి; కృత్స్నాం=సమస్తమయిన; వసుధాం=భూమిని; అవాప్య=పొంది; ఇతః=ఇచ్చటనుండి; చ్యుతః=జాఱినవాఁడై; స్వర్గం = స్వర్గమును; ఉపైతి హి=పొందునుగదా!

రాజుపండితుండై, మహాబుద్ధిశాలియై ప్రజలశిక్షించు భారంబువహించి, యథాన్యాయముగాభూమిం బాలించునేని, యతండు, ఈలోకంబునసమస్తభూనాథుండై, సకలసుఖంబులననుభవించి, యంతంబున, స్వర్గంబునొందును. అని, రాముండు భరతునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

విశేషార్థము.—ఇందువలన, రాజు యథాన్యాయంబుగనుయథాశాస్త్రంబుగనుబ్రజలంబాలించునేని, నైహికాముష్మికోభయసౌఖ్యంబులనుంబొందుననియు, "రాజ్యాంతేనరకంధ్రువం" అనులోకోక్తి, దుష్టరాజుల విషయమనియుసూచింపఁబడినది.




ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, శతతమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ శతతమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీః

## ఏకోత్తరశతతమసర్గప్రారంభః.

తం తు రామ స్సమాజ్ఞాయ భ్రాతరం గురువత్సలమ్
("తంతు రామస్సమాశ్వాస్య" ఇతి పాఠాంతరము.)
లక్ష్మణేనసహ భ్రాత్రా ప్రష్టుం సముపచక్రమే. ౧

టీక॥ రామః=రాముఁడు; తం= ఆ; భ్రాతరం = తమ్ముఁడయినభరతుని; గురువత్సలం=అన్నయందతిప్రేమ గలవానిఁగా; సమాజ్ఞాయతు=ఎఱింగినంతనె; పాఠాంతరపక్షమునందు. గురువత్సలం=అన్నయందతిప్రేమగల; తం= ఆ; భ్రాతరం=తమ్ముండగుభరతుని; సమాశ్వాస్య= ఊఱడించినంతనె; భ్రాత్రా=తమ్ముఁడగు; లక్ష్మణేనసహ= లక్ష్మణునితోఁగూడ; ప్రష్టుం= అడుగుటకు; సముపచక్రమే=ఆరంభించెను. రాముండు, జటాధారణ రాజ్యత్యాగాదులచే, భరతుండు, తనయందధికభక్తిగలవాఁడెయనియెఱింగి, తమ్ముండగు, లక్ష్మణునితో గూడి, అతని నిట్లని యడిగెను.

పాఠాంతరపక్షమునందు. రాముండు, అన్నయగుతనయం దధికభక్తి గలతమ్ముండయినభరతుని, మృదువాక్యంబులనాశ్వాసించి, లక్ష్మణుండును దానును, అతనింజూచి, యిట్లనియడిగిరి.

అని, తాత్పర్యము.

స ౧౦౧

కి మేత దిచ్ఛేయ మహం శ్రోతుం ప్రవ్యాహృతం త్వయా
యస్మా త్త్వ మాగతో దేశ మిమం చీరజటాజినః. ౨

టీక॥యస్మాత్=ఎందువలన;త్వం=నీవు; చీరజటాజినః=నారచీరలునుజటలును:గృష్ణాజినమునుగలవాఁడవై; ఇమం=ఈ; దేశం=ప్రదేశమును; ఆగతః=పొందినావో; ఏతత్=ఈకారణము;కిం=ఏమి;అహం=నేను;త్వయా=నీచేత; వ్యాహృతం=చెప్పఁబడిన దాని; శ్రోతుం=వినుటకు;ఇచ్ఛామి=కోరుచున్నాను.

నీవు,జటలు దాల్చి, నారచీరలుగట్టుకొని, కృష్ణాజినముధరించి యీయరణ్యంబున కేలవచ్చినావు;యిందుకుఁగారణ మేమి?నీవు చెప్పఁగా వినవలెననియున్నాను?చెప్పుము. అని, తాత్పర్యము.

కిం నిమిత్త మిమం దేశం కృష్ణాజినజటాధరః
హిత్వా రాజ్యం ప్రవిష్ట స్త్వం తత్సర్వం వక్తు మర్హసి. ౩

టీక॥త్వం=నీవు; కిన్నిమిత్తం=ఎందుకు; రాజ్యం=రాజ్యమును;హిత్వా=విడిచి; కృష్ణాజినజటాధరః=కృష్ణాజినంబునుజటలునుధరించినవాఁడవై; ఇమం=ఈ;దేశం = ప్రదేశమును;ప్రవిష్టః=ప్రవేశించినావు?తత్=దానిని; సర్వం=అంతను;వక్తుం= చెప్పుటకు;అర్హసి=తగుదువు?

నీవు, రాజ్యంబువిడిచి,కృష్ణాజినంబునుజటలనుధరించి,యీయరణ్యంబున కేలవచ్చినావు? అదంతయునువిస్తరముగాఁజెప్పుము. అని, రాముండు,భరతుని,అడిగెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్తః కైకయీపుత్రః కాకుత్థ్సేన మహాత్మనా
ప్రగృహ్య బలవ ద్భూయః ప్రాంజలి ర్వాక్య మబ్రవీత్. ౪

టీక॥కైకయీపుత్రః=కైకేయికొడుకైనభరతుండు;మహాత్మనా= పూజ్యమయినమనస్సుగల; కాకుత్థ్సేన =రాముని చేత;భూయః=మఱల; బలవ

త్=బలాత్కారముగా; పరిగృహ్య=పట్టుకొని, కవుగలించుకొనియనుట; ఇతి=ఇట్లు;ఉక్తః= చెప్పఁబడినవాఁడై; వాక్యం=మాటను;అబ్రవీత్=చెప్పెను

అంత,మహాత్ముండగు రాముండు, మఱల,భరతుని,బలాత్కారంబునంగ్రుచ్చికవుఁగిలించియిట్లుప్రశ్నింపగా నే,భరతుండుచేమోడ్పుగీలించి,యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఆర్యం తాతః పరిత్యజ్య కృత్వా కర్మ సుదుష్కరమ్
గత స్స్వర్గం మహాబాహుః పుత్రశోకాభిపీడితః. ౫

టీక॥మహాబాహుః= పెద్దచేతులుగల;తాతః= తండ్రియగుదశరథుండు; ఆర్యం= పూజ్యుండవగునిన్ను; పరిత్యజ్య=విడిచి; సుదుష్కరం=చేయనలవిగాని;కర్మ=కార్యమును;కృత్వా= చేసి;పుత్రశోకాభిపీడితః= పుత్రదుఃఖముచేపీడింపఁబడినవాఁడై;స్వర్గం= స్వర్గమును;గతః=పొందినాఁడు.

మహాబాహుండగుమనతండ్రి దశరథమహారాజు,నిన్నడవికిఁబంపి, యిట్లు దుష్కరంబగు, కార్యంబు గావించి, పుత్రదుఃఖంబు సహింపంజాలక, స్వర్గంబునొందెను. అని, తాత్పర్యము.

స్త్రియా నియుక్తః కైకేయ్యా మమ మాత్రా పరంతప
చకార సుమహ త్పాప మిద మాత్మయశోహరమ్. ౬

టీక॥ పరంతప=శత్రువులందపింపఁజేయునట్టి రాముఁడా;సః(అధ్యాహృతము)=ఆదశరథుఁడు;స్త్రియా=స్త్రీయగు;మమ=నాయొక్క; మాత్రా=తల్లియైన;కైకేయ్యా=కైకేయిచేత; నియుక్తః=ప్రేరింపఁబడినవాఁడై; ఆత్మయశోహరం=తనకీర్తినిహరించునట్టి;ఇదం=ఈ;సుమహత్= మిక్కిలియధికమగు; పాపం=పాపమును;చకార=చేసెను-

శత్రువులందపింపఁజేయునట్టి రాముఁడా! స్త్రీయగు నాతల్లికైకేయి ప్రేరించిన మాత్రానె,దశరథుండు,తనకీర్తియంతయునశించునట్లు,ఈమహాపాపంబుగావించినాఁడు.అని,తాత్పర్యము.

స ౧౧౧

సా రాజ్యఫల మప్రాప్య విధవా శోకకర్శితా
పతిష్యతి మహాఘోరే నిరయే జననీ మమ. ౭

టీక॥సా=అట్టి; మమ = నాయొక్క; జననీ=తల్లియగు , కైకేయి; రాజ్యఫలం=రాజ్యముయొక్క ఫలమును;అప్రాప్య=పొందక; విధవా=ముండమోపియయి; శోకకర్శితా=దుఃఖముచేఁగృశింపఁజేయఁబడినదై; మహాఘోరే=మహాభయంకరమగు; నిరయే=నరకమునందు;పతిష్యతి=పడఁగలదు.

అట్టిమహాపాపిష్ఠురాలగు నాతల్లి కైకేయి, తానుగోరినరాజ్యంబునొందకయే,విధవయయి, పరమదుఃఖితయయి,పరమభయంకరంబగు , నరకంబునొందంగలదు. అని,తాత్పర్యము.

తస్య మే దాసభూతస్య ప్రసాదం కర్తుమర్హసి

టీక॥తస్య= అట్టి ; దాసభూతస్య=దాసుండనగు;మే=నాకు; ప్రసాదం=అనుగ్రహమును;కర్తుం=చేయుటకు;అర్హసి=తగుదువు.

అట్టిమహాపాపిష్ఠుండనగు దాసుండనయిన నాయందనుగ్రహంబుంచుము. అని,తాత్పర్యము.

అభిషించస్వ చాద్యైవ రాజ్యేన మఘవానివ. ౮

టీక॥ అద్యైవ=ఇప్పుడు;మఘవానివ=ఇంద్రుఁడువలె; రాజ్యేన=రాజ్యముచేత; ఆత్మానం(అధ్యాహృతము)= నిన్ను;అభిషించస్వ=అభిషేకించుకొనుము.

ఇప్పుడె,నీవు,దేవేంద్రుండుంబోలె, రాజ్యంబునఁబట్టాభిషిక్తుండవగుము, అని, తాత్పర్యము.

ఇమాః ప్రకృతయ స్సర్వా విధవా మాతర శ్చ యాః
త్వత్సకాశ మనుప్రాప్తాః ప్రసాదం కర్తుమర్హసి. ౯

టీక॥ఇమాః=ఈ ; ప్రకృతయః= ప్రజలు; సర్వాః = అందరును ; వి

వాః=విధవలగు; మాతరః= తల్లులు; యాః(సంతి)=ఎవ్వరుగలరో; తాః (అ ధ్యాహృతము)= వారలును;త్వత్సకాశం=నీసమీపమును ; అనుప్రాప్తాః= పొందినారు. ప్రసాదం= అనుగ్రహమును; కర్తుం=చేయుటకు; అర్హసి=తగుదువు.

ఈప్రజలును,విధవలగుతల్లులందఱును, నీయొద్దకువచ్చియున్నారు; కావున,అనుగ్రహింపుము.

అని, తాత్పర్యము.

తదానుపూర్వ్యా యుక్తంచ యుక్తంచాత్మని మానద
రాజ్యం ప్రాప్నుహి ధర్మేణ సకామాన్ సుహృదః కురు. ౧౦

టీ॥మానద=మానమునిచ్చునట్టిరాముఁడా! తత్= అందువలన ; ఆనుపూర్వ్యా=క్రమముతో;యుక్తంచ= కూడినదియు; ఆత్మని=నీయందు;యుక్తంచ=కూడినదియునగు; రాజ్యం= రాజ్యమును; ధర్మేణ= ధర్మముచేత;ప్రాప్నుహి=పొందుము . సుహృదః=స్నేహితులను; సకామాన్=కోరఁబడినవానితోఁగూడిన వారలనుగా; కురు=చేయుము.

మనవంశమువారి గౌరవంబుఁ గాపాడునట్టిరాముఁడా!కావున, జ్యేష్ఠక్రమంబునను యోగ్యతవలనను, నీకుఁదగియున్నరాజ్యంబు సుధర్మంబున నంగీకరించి,స్నేహితులనందఱసంతుష్టులంగావింపుము. అని,తాత్పర్యము.

భవత్వవిధవా భూమి స్సమగ్రా పతినా త్వయా
శశినా విమలేనేవ శారదీ రజనీయథా. ౧౧

టీక॥ భూమిః=భూమి;సమగ్రా= అంతయు;శారదీ = శరత్కాలమునందుఁబుట్టిన; రజనీయథా=రాత్రివలె;పతినా(పత్యా) = పెనిమిటివగు; త్వయా=నీచేత;విమలేన=నిర్మలుండగు; శశినేవ=చంద్రునిచేతవలె; అవిధవా=విధవగానిది;భవతు=అగుఁగాక.

నిర్మలుండగుచంద్రునిచేతశారదారాత్రియుంబోలెఁ, బెనిమిటివగునీచేత, భూమి,వైధవ్యమువిడుచుఁగాక.

అని, తాత్పర్యము.

ఏభిశ్చ సచివై స్సార్ధణం శిరసా యాచితో మయా
భ్రాతు శ్శిష్యస్య దాసస్య ప్రసాదం కర్తు మర్హసి. ౧౨

టీక॥త్వం(అధ్యాహృతము)=నీవు; మయా=నా చేత; ఏభిః=ఈ; సచివైశ్చ సార్ధణం=మంత్రులతోనుంగూడ;శిరసా=తల చేత;యాచితః=ప్రార్థింపఁబడినవాఁడవై;భ్రాతుః=తమ్ముండును;శిష్యస్య= శిష్యుండును;దాసస్య= దాసుండునగు ; మమ ( అధ్యాహృతము)=నాకు;ప్రసాదం= అనుగ్రహమును;కర్తుం=చేయుటకు; అర్హసి=తగుదువు.

నేనును, ఈమంత్రులును, అందఱమును, శిరసాయాచించుచున్నాము ; తమ్ముండును, శిష్యుండును, దాసుండును, అగునాపైననుగ్రహంబుంచుము.

అని, తాత్పర్యము.

త దిదం శాశ్వతం పిత్ర్యం సర్వం ప్రకృతిమండలమ్
పూజితం పురుషవ్యాఘ్ర నా తిక్రమితు మర్హసి. ౧౩

టీక॥పురుషవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! తత్=అట్టి; శాశ్వతం=పరంపరాగతమును;పిత్ర్యం=తండ్రివలనవచ్చినదియు;పూజితం= పూజింపఁబడినదియునగు; ఇదం=ఈ; ప్రకృతిమండలం=మంత్రులు మున్నగువారి సమూహమును; అతిక్రమితుం = అతికమించుటకు;నార్హసి=తగవు.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! పరంపరాగతులును తండ్రితాతల నాటినుండిపూజితులు నగు నీమంత్రులు మున్నగువారలనందఱును, ఐకకంఠ్యముగా జెప్పుమాటనతిక్రమింపకుము. అని, భరతుండు రామునకుం జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా మహాబాహు స్సబాష్పః కైకయీసుతః
రామస్య శిరసా పాదౌ జగ్రాహ విధివ త్పునః. ౧౪

టీక॥ మహాబాహుః=పెద్దచేతులు గల; కైకేయీసుతః=కైకేయికొడుకైనభరతుఁడు; ఏవం=ఇట్లు;ఉక్త్వా=చెప్పి; సబాష్పః = కన్నీరుతోఁగూడినవాఁడై; పునః=మఱల; విధివత్= యథాశాస్త్రముగా; రామస్య=రాముని యొక్క; పాదౌ=పాదములను ; శిరసా=తలచేత ; జగ్రాహ = పట్టుకొనెను.

మహాబాహుండగు కైకేయికొడుకుభరతుండు , ఈప్రకారముజెప్పి, కన్నీరొలుక, మఱల, రామునిపాదంబులు శిరంబుసోక, సాష్టాంగముగనమస్కరించెను.

అని, తాత్పర్యము.

తం మత్త మివమాతంగం నిశ్శ్వసంతం పునఃపునః
భ్రాతరం భరతం రామః పరిష్వజ్యే దమబ్రవీత్. ౧౫

టీక॥ రామః=రాముఁడు; పునఃపునః=మాటిమాటికి; నిశ్శ్వసంతం = నిట్టూర్పులుపుచ్చుచున్నవాఁడును ; మత్తం = మదించిన; మాతంగమివ (స్థితం) — ఏనుంగువలెనున్నవాఁడునగు; భ్రాతరం=తమ్ముఁడైన; తం=ఆ;భరతం=భరతుని; పరిష్వజ్య= కవుఁగిలించుకొని ; ఇదం = ఈమాటను ; అబ్రవీత్=చెప్పెను.

అంత, రాముండు, అట్లునిట్టూర్పులునిగుడించుచు , మత్తమాతంగసదృశుండగుతమ్ముని భరతునింగవుఁగిలించుకొని, యీమాటంజెప్పెను.

అని. తాత్పర్యము.

కులీన స్సత్త్వ సంపన్న స్తేజస్వీ చరితవ్రతః
రాజ్యహేతోః కథం పాప మాచరే త్త్వద్విధోజనః. ౧౬

టీక ॥ కులీనః=మంచివంశమునంఁదుఁబుట్టినవాఁడును ; సత్త్వసంపన్నః=బలవంతుఁడును; తేజస్వీ = పరాక్రమవంతుఁడును ; చరితవ్రతః = ఆచరింపఁబడిన వ్రతములు గలవాఁడును; త్వద్విధః=నీవంటివాఁడునగు; జనః = జనుఁడు; రాజ్యహేతోః = రాజ్యముకొఱకు; పాపం= జ్యేష్ఠవిషయప్రాతికూల్యరూపమగుపాపకార్యమును ; కథం=ఎట్లు;ఆచరేత్=చేయును.

సత్కులప్రసూతుండును బలవంతుడును శూరుండును బెక్కు మహావ్రతంబుల నాచరించినవాఁడునగు నీవంటిసత్పురుషుఁడు తుచ్ఛం బగు రాజ్యముకొఱకై యిట్టిపాపకార్య మెట్లు చేయును.

అని, తాత్పర్యము.

నదోషం త్వయి పశ్యామి సూక్ష్మమప్యరిసూదన
నచాపి జననీం బాల్యా త్త్వం విగర్హితు మర్హసి. ౧౭

టీక॥ అరిసూదన = శత్రువులనడంగఁద్రొక్కునట్టిభరతుఁడా; త్వయి=నీయందు; సూక్ష్మమపి=లేశమైనను; దోషం=అపకారమును; నపశ్యామి=చూడను; (తలంపననుట) త్వం=నీవు; బాల్యాత్=పడుచుతనమువల్ల; జననీం=కన్నతల్లిని; విగర్హితుమపి=నిందించుటకును; నార్హసి=తగవు.

పగవాండ్రంజంపునట్టి, భరతుఁడా నీయందు నేనెంతమాత్రము కపట మున్నట్టుఁ దలంపుకొనను నీవుపిన్నతనమువల్లఁబూజ్యురాలగుతల్లిని దూషించుచున్నావు. అదినీకుయుక్తము కాదు.

అని, తాత్పర్యము.

కామకారో మహాప్రాజ్ఞ గురూణాం సర్వదాఽనఘ
ఉపపన్నేషు దారేషు పుత్రేషుచ విధీయతే. ౧౮

టీక॥ అనఘ = పాపరహితుఁడవును; మహాప్రాజ్ఞ =మహాపండితుఁడవునగుభరతుఁడా; గురూణాం= గురువులకు; కామకారః=స్వేచ్ఛాచరణము; సర్వదా=ఎల్లప్పుడును; ఉపపన్నేషు = సమర్థులగు; దారేషు= భార్యలవిషయమైయ్యు; పుత్రేషుచ= కొడుకులవిషయమయ్యును; విధీయతే = విధింపఁబడుచున్నది.

పాపరహితుండవును మహాప్రాజ్ఞుండవునగుభరతుఁడా! ఎల్లప్పుడునుగురుజనంబులుశక్తులై యున్న తమ దారాపుత్రులయందు నిచ్చవచ్చినట్లు, నియమించుట సహజము.

అని, తాత్పర్యము.

స ౧౦౧

వయ మస్య యథా లోకే సంఖ్యాతా స్సౌమ్య సాధుభిః
భార్యాః పుత్రాశ్చ శిష్యాశ్చ త్వమనుజ్ఞాతు మర్హసి. ౧౯

టీక॥ సౌమ్య = సత్పురుషుఁడవగు భరతుఁడా! లోకే = లోకమునందు; సాధుభిః = సజ్జనులచేత; భార్యాః = భార్యలు ; పుత్రాః చ = కొడుకులును; శిష్యాఃచ = ఛాత్రులును ; యథా = ఎట్లు; సంఖ్యాతాః = లెక్కింపఁబడిరో; అస్య = ఈదశరథమహారాజునకు; వయం = మనము; (తథేతి) (అధ్యాహృతము) = అట్లెయని; అనుజ్ఞాతుం = తెలిసికొనుటకు; త్వం = నీవు ; అర్హసి = తగుదువు.

సౌమ్యుండవగుభరతుఁడా! లోకమునందుసాధువులచేత భార్యాపుత్రులు, శిష్యులును ,ఎట్లెన్నఁబడుదురోమనమును, నీదశరథునకట్టివారమని, నీవు నెఱుంగవలయును. అని, తాత్పర్యము.

వనే వా చీరవసనం సౌమ్య కృష్ణాజినాంబరమ్
రాజ్యే వాపి మహారాజో మాం వాసయితు మీశ్వరః. ౨౦

టీక॥సౌమ్య=శాంతచిత్తుండవగుభరతుఁడా! మహారాజః=చక్రవర్తియగుదశరథుఁడు; చీరవసనం=చీర, నారబట్ట; వసనం=ఉత్తరీయముఁగాఁగలిగి; కృష్ణాజినాంబరం= లేడితోలుగట్టుబట్టగాఁగల; మాం=నన్ను; వనే వా= అడవియందుగాని; రాజ్యే వా = ప్రభుత్వమునందుఁగాని; వాసయితుం= వసింపఁజేయుటకు;ఈశ్వరః = నియామకుఁడు.

సౌమ్యుఁడవగునోయిభరతుఁడా; నిగ్రహానుగ్రహసమర్థుఁడవగు, దశరథుఁడు, కృష్ణాజినముగట్టుబట్టగానునారచీరయుత్తరీయముగానుగల నన్నడవియందుగానిసుఖార్హంబగురాజ్యమందుగానివసించుచుండు, నట్లొనర్పుటకుసమర్థుఁడు. అని, తాత్పర్యము.

యావత్పితరి ధర్మజ్ఞే గౌరవం లోక సత్కృతమ్
తావ ద్ధర్మభృతాం శ్రేష్ఠ జనన్యామపి గౌరవమ్. ౨౧

టీక॥ ధర్మభృతాంశ్రేష్ఠ=ధర్మాత్ములలో మేటివగుభరతుఁడా! ధర్మజ్ఞె = ధర్మస్వరూపంబెఱింగిన; పితరి=తండ్రియందు ; లోకసత్కృతం=లోకులచేఁగొనియాడంబడుచుండు; గౌరవం=గురుత్వము; యావత్= ఎంతటిదో; జనన్యామపి = తల్లి యందును; తావత్ = అంతటి; గౌరవం=గురుత్వము; కర్తవ్యం (అధ్యాహృతము) = చేయఁదగినది.

ధర్మవేత్తలలో మేటివగుభరతుఁడా! ధర్మజ్ఞుండగు తండ్రియందులోకస్తుత్యంబగు, గౌరవంబెంతటిదో, దల్లియందునంతటి, గౌరవంబుంచవలెను.

అని, తాత్పర్యము.

ఏతాభ్యాం ధర్మశీలాభ్యాం వనంగచ్ఛేతి రాఘవ
మాతాపితృభ్యా ముక్తోహం కథ మన్యత్సమాచరేత్. ౨౨

టీక॥ రాఘవ=రఘువంశంబునంబుట్టిన రాముఁడా ; ధర్మశీలాభ్యాం=ధర్మశీలురైన ; ఏతాభ్యాం=ఈ; మాతాపితృభ్యాం=తలిదండ్రులచేత; త్వం (అధ్యాహృతము)=నీవు;వనం=అడవినిగూర్చి; గచ్ఛ=పొమ్ము;ఇతి= అని; ఉక్తః=చెప్పఁబడిన; అహం=నేను;కథం=ఎట్లు; అన్యత్ =వేరువిధమగు కార్యమును ; సమాచరేత్ (సమాచరామి)=ఆచరింతును.

ఓభరతుఁడా ధర్మాత్ములగుమనతలిదండ్రులచే నీవరణ్యంబునకుఁ బొమ్మని యాజ్ఞాపింపఁబడిన నేనిప్పుడు వేరువిధంబుగ నెట్లు సేయవచ్చును.

అని, తాత్పర్యము.

త్వయా రాజ్య మయోధ్యాయాం ప్రాప్తవ్యం లోకసత్కృతమ్
వస్తవ్యం దండకారణ్యే మయా వల్కలవాససా. ౨౩

టీక॥ భరత (అధ్యాహృతము)= భరతుఁడా; త్వయా=నీచేత; అయోధ్యాయాం = అయోధ్యాపట్టణమునందు;లోకసత్కృతం= సర్వజనాదరణీయంబగు; రాజ్యం= ప్రభుత్వము;ప్రాప్తవ్యం=పొందఁదగినది; వల్కలవాససా = నారబట్టపుట్టముగాగల ; మయా=నాచేత; దండకారణ్యే= దండ

కయనునరణ్యమునందు ; వస్తవ్యం= ఉండఁదగినది.

భరతుఁడా , నీవయోధ్యంజేరి శ్లాఘ్యంబగు రాజ్యంబుఁ, బరిపాలింపుచుం డవలెను, నేను , నారచీర ధరించికొని, దండకారణ్యమునందు వాసము జేయుచుండవలెను.

అని, తాత్పర్యము.

ఏవం కృత్వా మహారాజో విభాగం లోకసన్నిధౌ
వ్యాదిశ్యచ మహాతేజా దివం దశరథోగతః. ౨౪

టీక॥మహాతేజాః=అధికమైన పరాక్రమముగల; మహారాజః= మహాప్రభువగు; దశరథః= దశరథుఁడు; లోకసన్నిధౌ= జనులసమక్షమునందు ; ఏవం=ఈప్రకారము; విభాగం= పంపకమును; కృత్వా=చేసి; వ్యాదిశ్యచ= ఆజ్ఞాపించియు;దివం=స్వర్గమును; గతః=పొందినాఁడు.

మహాపరాక్రమశాలియు,మహారాజుండునగు, తండ్రి,దశరథుఁడు,ప్రజలసమక్షమునందిట్లు , విభాగమేర్పరచి యాజ్ఞనొసంగిస్వర్గలోకంబు నొందెను. అని, తాత్పర్యము.

సచ ప్రమాణం ధర్మాత్మా రాజా లోకగురుస్తవ
పిత్రా దత్తం యథాభాగ ముపభోక్తుం త్వ మర్హసి. ౨౫

టీక॥ధర్మాత్మా = ధర్మస్వభావుండును; లోకగురుః = లోకాచార్యుండును ; రాజా = ప్రజా రంజకుండునగు;సచ=ఆదశరథుఁడు; తవ= నీకుఁ; ప్రమాణం=ప్రమాణము ; పిత్రా=తండ్రిచేత;యథాభాగం= భాగమేర్పడునట్లు; దత్తం= ఇయ్యఁబడిన రాజ్యమును; త్వం=నీవు ; ఉపభోక్తుం=అనుభవించుటకు;అర్హసి= తగుదువు.

లోకగురుండును, ధర్మాత్ముండును రాజునగు నాదశరథుండు , నీకుం బ్రమాణంబుగావున, నీవు యథాభాగంబుగఁ,దండ్రిచే నియ్యఁబడిన రాజ్యమననుభవించుటకుందగుదువు.

అని, తాత్పర్యము.

చతుర్దశ సమాః స్సౌమ్య దండకారణ్య మాశ్రితః
ఉపభోక్ష్యే త్వహం దత్తం భాగం పిత్రా మహాత్మనా. ౨౬

టీక॥సౌమ్య= సౌమ్యుండవగు భరతుండా! అహంతు=నేనైతే; చతుర్దశ=పదునాలుగైన;సమాః=సంవత్సరములు; దండకారణ్యం=దండకయనునరణ్యంబును; ఆశ్రితః= పొందినవాఁడనగుచు;మహాత్మనా=పూజ్యమైన స్వభావముగల;పిత్రా=తండ్రియగుదశరథమహారాజుచేత; దత్తం= ఇయ్యఁబడిన; భాగం=భాగమును;ఉపభోక్ష్యే=అనుభవించెదను.

సౌమ్యుండవగు భరతుండా! నేను దండకారణ్యంబునఁ బదునాలుగుసంవత్సరంబులుండి,మహాత్ముండైన,మనతండ్రియగుదశరథమహారాజుచేత నియ్యఁబడిన, భాగము ననుభవింపంగల వాఁడను. అని, తాత్పర్యము,

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, ఏకోత్తరశతతమస్సర్గః.

ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యకాండైకోత్తరశతతమసర్గటీక,

ముగిసినది.



శ్రీ

ద్వ్యుత్తరశతతమసర్గప్రారంభః.

రామస్య వచనం శ్రుత్వా భరతః ప్రత్యువాచ హ
కిం మే ధర్మా ద్విహీనస్య రాజధర్మః కరిష్యతి. ౧

టీక॥భరతః = భరతుఁడు; రామస్య=రామునియొక్క; వచనం=మాటను; శ్రుత్వా=విని; ప్రత్యువాచ = బదులుచెప్పెను ; (హ అనునది పాదపూరణార్థము); ధర్మాత్=త్వత్సేవారూపమైన ధర్మమునుండి; విహీనస్య=విడువఁబడిన; మే= నాకు; రాజధర్మః= రాజ్యపరిపాలనరూపధర్మము; కిం=ఏమి; కరిష్యతి = చేయఁగలదు.

భరతుఁడు రామునివచనమునువిని త్వత్సేవారూపమైనపరమధర్మమునుండివిడువఁబడిన నాకు రాజ్య పరిపాలనరూపధర్మ మేమి సేయఁగలదని చెప్పెను. అని, తాత్పర్యము.

శాశ్వతోయం సదా ధర్మః స్థితోస్మాసు నరర్షభ
జ్యేష్ఠపుత్రే స్థితే రాజన్ న కనీయాన్నృపో భవేత్. ౨

టీక॥ నరర్షభ= పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా; అస్మాసు=మనపూర్వీకులయందు;శాశ్వతః= కులక్రమాగతమైన;అయం=ఈ;ధర్మః=ధర్మము;సదా=ఎల్లప్పుడు;స్థితః=ఉంటున్నది. రాజన్ = రాజవగురాముఁడా; జ్యేష్ఠపుత్రే=పెద్దకొడుకు; స్థితే=ఉండగా; కనీయాన్=చిన్నకొడుకు; నృపః= రాజు; నభవేత్=అగుటలేదు.

పురుషశ్రేష్ఠుండవగురాముఁడా!మనపూర్వీకులయందుశాశ్వతమైన, ఈధర్మమెల్లప్పుడుకలదు,రాజవగు రాముఁడా,పెద్దకొడుకుండగాజిన్నకొడుకురాజుగానుండుటలేదు. అని,తాత్పర్యము.

ససమృద్ధాం మయా సార్థ మయోధ్యాం గచ్ఛ రాఘవ
అభిషేచయ చాత్మానం కులస్యాస్య భవాయ నః. ౩

టీక॥ రాఘవ=రఘుకులంబునం బుట్టి
నరాముండా! మయా సార్ధం= నా
తోంగూడ; సర్వసమృద్ధాం= సమృద్ధియు
క్తమగు; అయోధ్యాం= అయోధ్యాప
ట్టణమును; గచ్ఛ=పొందుము; నః= మన
యొక్క; అస్య=ఈ; కులస్య=వంశముయొ
క్క; భవాయ = మంగళముకొఱకు ;
ఆత్మానం=నిన్ను; అభిషేచయ చ= అభి
షేకించుకొనుము.

రఘుకులతిలకుండవగు రాముండా! నాతోంగూడ, సర్వసంపత్సమృద్ధంబగు నయోధ్యాపట్టణమును బొంది , మన వంశమునకు మంగళము గలుగుటకొఱకు నిన్నభిషేకించికొనుము.

అని, తాత్పర్యము,

రాజానం మానుషం ప్రాహు ర్దేవత్వే సమ్మతో మమ
యస్య ధర్మార్థ సహితం వృత్తమాహు రమానుషమ్. ౪

టీక॥ రాజానం=రాజును ; మాను
షం=మనుష్యునిగా; ప్రాహుః= చెప్పు
దురు; మమ=నాకు; దేవత్వే= దేవభా
వమందు; సమ్మతః=ఇష్టము; యస్య=
ఏ రాజుయొక్క; ధర్మార్థసహితం =
ధర్మముతోను అర్థముతోనుం గూడి
న; వృత్తం=చరిత్రము; అమానుషం=
దేవత్వసంపాదకమో.

దేవత్వప్రాపకంబగు తపశ్చరణంబువదిలి రాజ్యాభిషేకమున నాకేమి పురుషార్థంబని శంకింపవలదు ; తపశ్చరణముచేత క్లేశద్వారముగ దేవత్వము, రాజ్యపరిపాలనముచేభోగద్వారముగ దేవత్వముసిద్ధించుచున్నది.

అని, తాత్పర్యము.

కేకయస్థేచ మయితు త్వయిచారణ్య మాశ్రితే
దివ మార్యో గతో రాజా యాయజూక స్సతాం మతః. ౫

టీక॥మయితు= నేను; కేకయస్థే
చ= కేకయపట్టణమునందుండగా; త్వ
యిచ=నీవును; అరణ్యం=అడవిని; ఆశ్రి
తే=పొందగా; యాయజూకః=యాగశీ
లుండును; సతాం= సత్పురుషులకు ;
మతః=ఇష్టుండును; ఆర్యః=పూజ్యుండు

నగు; రాజా=తండ్రియగుదశరథమహారాజు; దివం= స్వర్గమును; గతః= పొందినాడు॥

తండ్రి జీవించి యుండగానాకెట్లు రాజ్యాభిషేకాధికారమని తలంతువేమో; నేను, కేకయరాజు పట్టణంబుననుండగా, నీవరణ్యంబునకుఁ బోయినపిదప, యాయజ్ఞాకుండును సత్పురుషులలో మేటి యనుబూజ్యుండు నగుతండ్రిదశరథమహారాజుస్వర్గంబునొందెను. అని, తాత్పర్యము.

నిష్క్రాన్తమాత్రే భవతి సహసీతే సలక్ష్మణే
దుఃఖశోకాభిభూతస్తు రాజా త్రిదివ మభ్యగాత్. ౬

టీక॥ భవతి=నీవు; సహసీతే = సీతతోఁగూడినవాఁడవై; సలక్ష్మణే=లక్ష్మణునితో గూడినవాఁడవై; నిష్క్రాన్తమాత్రే= బయలువెడలినమాత్రాననె; రాజాతు=దశరథమహారాజును; దుఃఖశోకాభిభూతః = అధికదుఃఖములచేఁ గొట్టఁబడినవాఁడగుచు; త్రిదివం = స్వర్గమును; అభ్యగాత్=పొందెను.

నీవుసీతాలక్ష్మణులంగూడి, బయలుదేఱఁగా నేదశరథమహారాజుదుఃఖశోకములచేఁగొట్టువడినవాఁడై స్వర్గస్థుండాయెను. అని, తాత్పర్యము.

ఉత్తిష్ఠ పురుషవ్యాఘ్ర క్రియతా ముదకం పితుః
అహంచాయంచ శత్రుఘ్నః పూర్వమేవ కృతోదకౌ. ౭

టీక॥ పురుషవ్యాఘ్ర= పురుషశ్రేష్ఠుఁడవగురాముఁడా! ఉత్తిష్ఠ=లెమ్ము; పితుః=తండ్రికి; ఉదకం=జలతర్పణము; క్రియతాం=చేయఁబడుగాక. అహంచ=నేనును; అయం=ఈ; శత్రుఘ్నశ్చ= శత్రుఘ్నుఁడును; పూర్వమేవ = మునుపే; కృతోదకౌ= చేయఁబడినఉదకముగలవారము.

పురుషశ్రేష్ఠుండవగురాముఁడా! నీవింకశీఘ్రంబుగాలేచి తండ్రికి జలతర్పణాదిక్రియలంగావింపుము; నేనును, నీశత్రుఘ్నుండునుమునుపె, అంతయుఁగావించినాము. అని, తాత్పర్యము.

ప్రియేణ ఖలు దత్తంహి పితృలోకేషు రాఘవ
అక్షయ్యం భవతీత్యాహు ర్భవాంశ్చైవ పితుః ప్రియః. ౮

టీక॥ రాఘవ=రాముఁడా! ప్రియేణ=ప్రియపుత్రునిచేత; దత్తంహి=ఇవ్వఁబడినదే; పితృలోకేషు= పితృలోకములయందు; అక్షయ్యం= నాశములేనిది; భవతి= అగుచున్నది. ఇతి=అని; ఆహుఃఖలు=చెప్పుచున్నారుగదా! భవాంశ్చైవ=నీవే; పితుః=తండ్రికి; ప్రియః=ఇష్టుండవు.

రాముఁడా! తండ్రికి ప్రియుండగు పుత్రుండు చేసినజలతర్పణాదులే పితృలోకంబున మహాఫలప్రదంబగునని పెద్దలు చెప్పుదురుగదా అట్లునీవు దశరథమహారాజునకు ప్రియపుత్రుండవుకాబట్టి శీఘ్రముగా నాయనకు నపర క్రియలం జేయుము. అని, తాత్పర్యము.

త్వామేవ శోచం స్తవ దర్శనేప్సు
స్త్వయ్యేవసక్తా మనివర్త్య బుద్ధిమ్
త్వయావిహీన స్తవ శోక మగ్న
స్త్వాం సంస్మర న్నస్తమితః పితా తే. ౯

టీక॥ తే=నీయొక్క; పితా= తండ్రియగు దశరథమహారాజు; త్వయా= నీచేత; విహీనః=విడువఁబడినవాఁడై; త్వామేవ=నిన్నుగూర్చియే; శోచన్=దుఃఖించుచు; తవ=నీయొక్క;దర్శనేప్సుః=దర్శనముగోరుచు;త్వయ్యేవ= నీయందే; సక్తాం=తగిలిన; బుద్ధిం=బుద్ధిని; అనివర్త్య=మఱలించుకొనక;తవ=నీయొక్క; శోకమగ్నః=దుఃఖమునందు మునిగినవాఁడై; త్వాం=నిన్ను; సంస్మరన్= తలంచుకొనుచు; అస్తం= నాశమును; ఇతః=పొందినాఁడు.

నీ తండ్రిదశరథమహారాజు నిన్నువిడిచి నీవిరహంబు సహింపం జాలక, నిన్నుంజూడంగోరుచు నిన్నుగుఱించియె దుఃఖించుచు, నీయందు నాటుకొన్నమనస్సునువివర్తింపనశక్తుండై పరమదుఃఖితుండై,నిన్నేధ్యానించుచు మృతిబొం

దెను, అని, భరతుండు రామునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, ద్వ్యుత్తరశతతమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ ద్వ్యుత్తరశతతమసర్గటీక,
ముగిసినది.



శ్రీ

త్ర్యుత్తర శ త త మ స ర్గ ప్రా రం భః.

తాం శ్రుత్వా కరుణాం వాచం పితు ర్మరణసంహితామ్
రాఘవో భరతే నోక్తాం బభూవ గతచేతనః. ౧

టీక॥ రాఘవః = రాముఁడు; భరతేన = భరతునిచేత; ఉక్తాం = చెప్పఁబడిన; పితుః = తండ్రియొక్క; మరణసంహితాం = చావుతోఁగూడిన; కరుణాం = దుఃఖకరమగు; వాచం = మాటను; శ్రుత్వా = విని; గతచేతనః = పోయినస్మృతిగలవాఁడు; బభూవ = ఆయెను.

రాముఁడు; భరతుఁడు చెప్పిన పితృమరణ వృత్తాంతమునువిని పరమ దుఃఖితుండై దుఃఖంబునసహింపంజాలక మూర్ఛిల్లెను. అని, తాత్పర్యము.

తంతు వజ్రమివోత్సృష్ట మాహవే దానవారిణా
వాగ్వజ్రం భరతేనోక్త మమనోజ్ఞం పరంతపః. ౨
ప్రగృహ్య బాహూ రామోవై పుష్పితాగ్రో యథా ద్రుమః
వనేపరశునా కృత్త స్తథా భువి పపాతహ. ౩

టీక॥ పరంతపః = శత్రువులం దపింపఁ జేయునట్టి; రామః = రాముఁడు;

స ౧౦౩

 

("వై" అనునదిపాదపూరణార్థము) ఆహవే = యుద్ధమునందు; దానవారిణా = దేవేంద్రునిచేత; ఉత్సృష్టం = విడువఁబడిన; వజ్రమివ (స్థితం) వజ్రాయుధమువలెనున్న; భరతేన = భరతునిచేత; ఉక్తం = చెప్పబడిన; అమనోజ్ఞం = దుఃఖకరమైన; తం = ఆ; వాగ్వజ్రం = మాటయనెడు వజ్రాయుధమును; శ్రుత్వా (అధ్యాహృతము) = విన్నంతనె; బాహూ = చేతులను; ప్రగృహ్య = పట్టుకొని; వనే = అడవియందు; పరశునా = గొడ్డలిచేత; కృత్తః = నరకఁబడిన; పుష్పితాగ్రః = పూచినకొనలుగల; ద్రుమః = వృక్షము; యథా = (పతతి) ఎట్లుపడునో; తథా = అట్లు; భువి = నేలయందు; పపాత = పడెను ("హ" అనునదిపాదపూరణార్థము.)

శత్రువులందపింపఁజేయునట్టి రాముండు, యుద్ధంబున దేవేంద్రునిచేఁ బ్రయోగింపఁబడిన వజ్రాయుధముంబోలె దుస్సహంబగు భరతుండు చెప్పిన దుఃఖవార్తను విని, పరమదుఃఖితుండై, చేతులు జోడించుకొని, అరణ్యంబున గొడ్డలిచే నఱకంబడిన పుష్పించినవృక్షము నేలం బడునట్లు, పరవశుండై, భూమిపయిం బడెను.

అని, తాత్పర్యము.

తథా నిపతితం రామం జగత్యాం జగతీపతిమ్
కూలఘాతపరిశ్రాంతం ప్రసుప్తమివ కుంజరమ్. ౮
భ్రాతరస్తే మహేష్వాసం సర్వతశ్శోకకర్శితమ్
రుదంతస్సహ వైదేహ్యా సిషిచుస్సలిలేన వై. ౯

టీక॥ తే = ఆ; భ్రాతరః = తమ్ములు; తథా = అట్లు; జగత్యాం = భూమియందు; నిపతితం = పడినవాఁడును; జగతీపతిం = భూమికిప్రభువును; కూలఘాతపరిశ్రాంతం; కూల = ఇసుకదిబ్బయొక్క; ఘాత = ప్రహరించుటచేత; పరిశ్రాంతం = అలిసినదియు; ప్రసుప్తం = ఎదిరించినదియు నగు; కుంజరమివ (స్థితం) ఏనుంగువలెనున్నవాఁడును; మహేష్వాసం = పెద్దవిల్లుగలవాఁడును; సర్వతః = అంతటను; శోకకర్శితం = దుఃఖముచేఁ గృశింపఁ జేయఁబడిన వాఁడు నగు; రామం = రాముని; వైదేహ్యాసహ = సీతతోకూడ; రుదంతః = ఏడ్చుచు;

 

సలిలేన=జలముచేత; ("వై" అనునది పాదపూరణార్థము. సిషిచుః= తడిపిరి.

అంతనట్లు,ఋసుక దిబ్బనంతయు. స్వేచ్ఛమెయివిచ్చల్లి అలసి నిద్రించుమత్తమాతంగంబుచాడ్పున- మూర్ఛాపరవశుండై, నేలంబడియున్నవాఁడును మహాధనుర్ధరుండునుఁ బరమ దుఃఖితుండగు రాముఁజూచి, భరతలక్ష్మణశత్రుఘ్నులును సీతాదేవియు మహాదుఃఖంబునొంది, రోదనంబు సేయుచు మూర్ఛఁదేరుటకై చల్లనిసలిలబిందువులచే రాముఁదడిపిరి.

అని, తాత్పర్యము.

సతుసంజ్ఞాం పునర్లబ్ధ్వా నేత్రాభ్యా మాసముత్సృజన్
ఉపాక్రామత కాకుత్థ్సః కృపణం బహుభాషితుమ్. ౬

టీక॥ సః=ఆ; కాకుత్థ్సస్తు= రాముండును; పునః=మరల; సంజ్ఞాం=తెలివిని;లబ్ధ్వా=పొంది;నేత్రాభ్యాం=కన్నులచేత; బాష్పం (అధ్యాహృతము)=కన్నీటిని; ఆసముత్సృజన్=అధికముగావిడుచును; కృపణం = దుఃఖముఁగలుగునట్లుఁగాను; బహు= అధికముఁగాను; భాషితుం = మాట్లాడుటకు; ఉపాక్రామత(ఉపాక్రమత)= ఆరంభించెను.

అంత, రాముండు , కొంతవడికి మూర్ఛదేఱి, కన్నులనిండఁగన్నీళ్లుగాఱ, బరమదుఃఖితుండై , యిట్లని చెప్పందొడంగెను. అని, తాత్పర్యము.

స రామ స్స్వర్గతం శ్రుత్వా పితరం పృథివీపతిమ్
ఉవాచ భరతం వాక్యం ధర్మాత్మా ధర్మసంహితమ్. ౭

టీక॥ ధర్మాత్మా= ధర్మస్వభావుండగు; సః=ఆ; రామః = రాముఁడు; పృథివీపతిం=భూమికిప్రభువైన; పితరం=తండ్రిని ; స్వర్గతం=స్వర్గమునొందినవానిఁగా; శ్రుత్వా=విని ; భరతం=భరతునిఁగూర్చి;ధర్మసంహితం=ధర్మముతోఁగూడిన; వాక్యం = మాటను; ఉవాచ=చెప్పెను.

ధర్మాత్ముండగురాముండు, తండ్రిమృతిఁబొందుటనువిని, భరతుంజూ

చి, ధర్మిష్ఠంబగునీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

కిం కరిష్యా మ్యయోధ్యాయాం తాతే దిష్టాం గతిం గతే
క స్తాం రాజవ రా ద్ధీనా మయోధ్యాం పాలయిష్యతి. ౮

టీక॥అహం(అధ్యాహృతము)= నేను; కిం=ఏమి; కరిష్యామి=చేయఁగలను? అయోధ్యాయాం=అయోధ్యాపట్టణమందు; తాతే=తండ్రి; దిష్టాం=దైవకల్పితమైన; గతిం=గతిని; గతే=పొందగా; రాజవరాత్= (తృతీయార్థమందుఁబంచమి) రాజశ్రేష్ఠుండగు దశరథమహారాజుచేత;హీనాం=విడువఁబడిన; తాం=ఆ; అయోధ్యాం = అయోధ్యాపురిని; కః=ఎవఁడు; పాలయిష్యతి=రక్షింపఁగలఁడు.

అయ్యో! నేనేమిసేయుదును? దశరథమహారాజు, అయోధ్యాపట్టణంబు నమ్ముతిఁబొందినాఁడే! యింకనట్టిమహారాజు, పోయినవెనుక, నయోధ్యంబాలింపఁజాలినవాఁడెవ్వఁడున్నాఁడు.

అని, తాత్పర్యము.

కిన్ను తస్య మయా కార్యం దుర్జాతేన మహాత్మనః
యోమృతో మమ శోకేన మయాచాపి నసంస్కృతః. ౯

టీక॥యః= ఏదశరథమహారాజు;మమ=నాయొక్క;శోకేన= దుఃఖముచేత;మృతః=చచ్చినాఁడో; మయా=నాచేత;నసంస్కృతశ్చాపి= సంస్కరింపనుబడలేదో; తస్య=అట్టి;మహాత్మనః=పూజ్యస్వభావుండగుదశరథునకు; దుర్జాతేన=దుష్టజాతుండనగు;మయా=నాచేత;కిన్నుకార్యం=ఏమికార్యము.

దశరథుండుదుష్టుండగు నాదుఃఖముచేతనేమృతిబొందెను, నేనతనికి,సంస్కారంబైనను కాలంబునఁగావింపనయితిని. అట్టిమహాత్మునకు దుష్టపుత్రుండగునేనుండుటవలననేమిప్రయోజనము

అని, తాత్పర్యము.

అహో భరత సిద్ధార్థో యేన రాజా త్వయానఘ
శత్రుఘ్నేనచ సర్వేషు ప్రేతకృత్యేషు సత్కృతః. ౧౦

టీక॥ అహో= ఆశ్చర్యము! అనఘ=పాపరహితుండవగు;భరత=భరతుఁడా! యేన=ఏకారణముచేత; త్వయా=నీచేతను; శత్రుఘ్నేనచ=శత్రుఘ్నునిచేతను; రాజా = దశరథమహారాజు;సర్వేషు=సమస్తములైన; ప్రేతకృత్యేషు= ప్రేతకార్యములందును; సత్కృతః=పూజింపఁబడినాఁడో; తేన (అధ్యాహృతము)= ఆకారణముచేతను; త్వం (అధ్యాహృతము)=నీవు; సిద్ధార్థః=కృతార్థుండవు.

కాలంబునదండ్రికిఁ బ్రేతకార్యంబులుగావింపకుండుటవలనంగలుగు మహాపాపంబులేనిభరతుఁడా! నీవునుశత్రుఘ్నుండునుయుక్తకాలంబున దశరథునకుశ్రద్ధమెయిసమస్తప్రేతకార్యంబులంగావించినారుకావునమీరిద్దరు గృతార్థులరైతిరి, అని తాత్పర్యము.

నిష్ప్రధానా మనేకాగ్రాం నరేంద్రేణ వినాకృతామ్
నివృత్త వనవాసోపి నాయోధ్యాం గంతు ముత్సహే. ౧౧

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను;నివృత్తవనవాసోపి = నెఱవేఱినవనవాసముగలవాఁడనైనను;నిష్ప్రధానాం=ప్రధానుండులేనిదియు; అనేకాగ్రాం= వ్యాకులమయినదియు; నరేంద్రేణ=దశరథమహారాజుచేత; వినాకృతాం=విడువఁబడినదియునగు;అయోధ్యాం= అయోధ్యాపట్టణమును; గంతుం=పొందుటకు;నోత్సహే= ఇచ్ఛింపను.

దశరథుండుమృతిబొందుటచేఁప్రధానాధరహితమైవ్యాకులమై, అలంకారంబుచెడియున్న యయోధ్యాపట్టణంబునకు,వనవాసమతిక్రమించినప్పటికిని, నేనుబోవను. అని, తాత్పర్యము.

సమాప్తవనవాసం మా మయోధ్యాయాం పరంతప
కోనుశాసిష్యతి పునస్తాతే లోకాంతరం గతే. ౧౨

టీక॥ పరంతప = శత్రువులందపింపఁజేయునట్టిభరతుఁడా; తాతే= తండ్రి; లోకాంతరం=పరలోకమును; గతే=పొందఁగా; సమాప్తవనవాసం= ముగిసినవనవాసముగల; మాం = నన్ను; అయోధ్యాయాం = అయోధ్య

 

యందు ; ప్రజాః=మఱలకు ; కః=ఎవ్వఁడు ; అనుశాసిష్యతి=శిక్షింపఁగలఁడు ?

శత్రువులం దపింపఁ జేయునట్టిభరతుఁడా నాయనమృతిఁబొందినాఁడే, యింకనేనరణ్యంబునఁబదునాల్గుసంవత్సరములునుకడపి, అయోధ్యకుపోయినపిదప, అచ్చటనన్నుఁ పనులయందు, నియోగింపుచుశిక్షించువాఁడెవఁడు ?

అని, తాత్పర్యము-

పురా ప్రేక్ష్య సువృత్తం మాం పితా యాన్యాహ సాంత్వయన్
వాక్యాని తాని శ్రోష్యామి కుతః శ్రోత్రసుఖాన్యహమ్. ౧౩

టీక॥ పురా=మునుపు ; పితా=నాయన ; మాం=నన్ను ; సువృత్తం=సదాచారముగలవానిగా ; ప్రేక్ష్య=చూచి ; సాంత్వయన్ = అనూనయింపుచు ; యాని=ఏమాటలను ; ఆహ= చెప్పెనో ; అహం=నేను ; తాని=అట్టి ; శ్రోత్రసుఖాని = చెవులకుసుఖముగల్గించునట్టి ; వాక్యాని=మాటలను ; కుతః= ఎవరివలన ; శ్రోష్యామి=వినఁగలను ?

మునుపు నాయన, నాయందలిసదాచారమునకు సంతోషించి మెచ్చి నన్ను సంతోషింపఁజేయుటకై చెవుల కింపుగా మధురములగుమాటలను చెప్పుచుండునె, ఇంక నాకట్టిమాటల నెవ్వరు చెప్పఁగలరు? అని, రాముండుభరతునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా స భరతం భార్యా మభ్యేత్య రాఘవః
ఉవాచ శోక సంతప్తః పూర్ణచంద్ర నిభాననామ్. ౧౪

టీక॥ సః=ఆ ; రాఘవః=రాముఁడు ; భరతం=భరతునిగూర్చి ; ఏవం= ఇట్లు ; ఉక్త్వా=చెప్పి ; శోకసంతప్తః= దుఃఖముచేఁ దపింపఁజేయఁబడినవాఁడై ; పూర్ణచంద్రనిభాననాం=నిండుచంద్రునితో సమానమయినముఖముగల ; భార్యాం=భార్యను ; అభ్యేత్య=ఉద్దేశించి ; ఉవాచ=చెప్పెను-

రాముండుఅట్లుభరతునితోఁ జెప్పి నిండుచంద్రబింబముతోసమానమైనముఖముతోనొప్పుచున్నసీతాదేవిం జూచి యీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

 

సీతే మృత స్తే శ్వశురః పిత్రా హీనోసి లక్ష్మణ
భరతో దుఃఖమాచష్టే స్వర్గతం పృథివీపతిమ్. ౧౫

టీక॥ సీతె=సీతాదేవీ; తే= నీయొక్క; శ్వశురః=మామ; మృతః= చనిపోయెను; లక్ష్మణ= లక్ష్మణుఁడా; పిత్రా=తండ్రిచేత; హీనః=విడువఁబడినవాఁడవు; అసి=అగుచున్నావు; భరతః=భరతుఁడు; పృథివీపతిం= దశరధమహారాజును; స్వర్గతం=స్వర్గమునుపొందినవానిగా ; దుఃఖం=దుఃఖవార్తను; ఆచష్టే=చెప్పుచున్నాఁడు.

సీతా,నీమామమృతిబొందెను!లక్ష్మణుఁడా, నీవు, తండ్రిలేనివాఁడవైతివి! భరతుండుమా!తండ్రిచనిపోయినాఁడని యీదుఃఖవార్తను చెప్పినాడు. అని, రాముండు చెప్పెను. అని, తాత్పర్యము.

తతో బహుగుణం తేషాం బాష్పో నేత్రేష్వ జాయత
తథా బ్రువతి కాకుత్స్థే కుమారాణాం యశస్వినామ్. ౧౬

టీక॥ తథా=అట్లు; కాకుత్స్థే=రాముఁడు; బ్రువతి= చెప్పుచుండఁగా; తతః=పిమ్మట; యశస్వినాం = కీర్తిగలవంతులగు; కుమారాణాం= పిన్నవాండ్రగు; తేషాం=ఆభరతలక్ష్మణశత్రుఘ్నులయొక్క; నేత్రేషు=కన్నులయందు; బహుగుణం= అధికముగా; బాష్పః=కన్నీరు; అజాయత=కలిగెను.

రాముండట్లుచెప్పఁగానే, యశోవంతులగు రామలక్ష్మణభరతశత్రుఘ్నులయొక్క కన్నులయందు; అధికముగా కన్నీళ్లుకలిగినవి. అని,తాత్పర్యము.

తత స్తే భ్రాతర స్సర్వే భృశ మాశ్వాస్య రాఘవమ్
అబ్రువన్ జగతీభర్తుః క్రియతా ముదకం పితుః. ౧౭

టీక॥తతః= అటుపిమ్మట; భ్రాతరః=తోఁబుట్టువులైన; తే = భరతలక్ష్మణశత్రుఘ్నులు;సర్వే= అందఱును; రాఘవం=రామునిభృశం= మిక్కిలియు; ఆశ్వాస్య= ఊరడించి; జగతీభర్తుః= లోకమునకుఁబ్రభుండైన; పితుః=తండ్రియైనదశరథునకు;ఉదకం= ఉదకదానమును; క్రియతాం= చేయఁ

బడుఁగాక; ఇతి(అధ్యాహృతము) = అని; అబ్రువన్ = చెప్పిరి.

అంత, సహోదరులగు, నాభరత లక్ష్మణ శత్రుఘ్నులు, రాముని మిగులసూరడించి, లోకనాథుండగు, తండ్రిదశరథునకుఁజరమక్రియ జేయఁబడుఁగాకయని, చెప్పిరి. అని, తాత్పర్యము.

సా సీతా శ్వశురం శ్రుత్వా స్వర్గలోకగతం నృపమ్
నేత్రాభ్యా మశ్రుపూర్ణాభ్యా మశక న్నేక్షితుం పతిమ్. ౧౭

టీక॥ సా=ఆ; సీతా=సీతాదేవి; శ్వశురం=మామయైన; నృపం=దశరథమహారాజును; స్వర్గలోకగతం = స్వర్లోకమునుబొందినవానిగా; శ్రుత్వా=విని; అశ్రుపూర్ణాభ్యాం= కన్నీళ్లచేఁనిండిన; నేత్రాభ్యాం= కన్నులచేత; పతిం=పెనిమిటియగురాముని; ఈక్షితుం=చూచుటకు; నాశకత్= సమర్థురాలుగాకపోయెను.

ఆసీతాదేవి, మామయగుదశరథమహారాజునుస్వర్గమునుబొందినవానిగావిని, కన్నీళ్లచేనిండిననేత్రములచేత, భర్తయగు రామునింజూచుటకు, సమర్థురాలుగాకపోయెను.

అని, తాత్పర్యము.

సాంత్వయిత్వాతు తాం రామో రుదంతీం జనకాత్మజామ్
ఉవాచ లక్ష్మణం తత్ర దుఃఖితో దుఃఖితం వచః. ౧౮

టీక॥ రామః = రాముఁడు; రుదంతీం=ఏడ్చుచున్న; జనకాత్మజాం= జనకమహారాజుకొమార్తెయైన; తాం = ఆసీతాదేవిని; సాంత్వయిత్వా =అనునయించి; తత్ర=అచ్చట; దుఃఖితః = దుఃఖము నొందిన వాఁడగుచు; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; దుఃఖితం=దుఃఖముతోఁగూడిన; వచః=మాటను; ఉవాచ=చెప్పెను.

అప్పుడురాముండు, యేడ్చుచున్న జనకమహారాజు కూతురగు నాసీతను సమాధానపరచిదుఃఖితుఁడగుచులక్ష్మణునింగూర్చి దుఃఖముతోఁగూడినమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

ఆనయేంగుదిపిణ్యాకం చీర మాహర చోత్తరమ్
జలక్రియార్థం తాతస్య గమిష్యామి మహాత్మనః. ౨౦

టీక॥ఇంగుదిపిణ్యాకం= గారచెట్టుదైనగానుగపిండిని; ఆనయ=తీసికొనిరమ్ము ; ఉత్తరంచ=ఉత్తరీయమును;ఆహర = తెమ్ము;మహాత్మనః=మహానుభావుండగు; తాతస్య= తండ్రియగు దశరథునియొక్క;జలక్రియార్థం= ఉదకదానముజేయుటకొఱకు; గమిష్యామి= పోవుచున్నాను.

లక్ష్మణుఁడా తపస్విభోజ్యంబగు నింగుదీపిణ్యాకమును దెమ్ము, స్నానార్థముత్తరీయ మొసంగుము, మహాపూజ్యుండగు నాయనకుదకదాన మిచ్చుటకుఁ బోవుచున్నాను.

అని, తాత్పర్యము.

సీతా పురస్తా ద్వ్రజతు త్వ మేనా మభితో వ్రజ
అహం పశ్చా ద్గమిష్యామి గతి ర్హ్యేషా సుదారుణా. ౨౧

టీక॥ సీతా = సీత; పురస్తాత్= ముందు; వ్రజతు=పోవుఁగాక;త్వం= నీవు; ఏనాం=ఈసీతను; అభితః=వెంబడించి; వ్రజ=పొమ్ము. అహం= నేను; పశ్చాత్=వెనుక; గమిష్యామి = వచ్చెదను; ఏషా=ఈ; గతిః = గమనము; సుదారుణాహి= మిక్కిలియుభయంకరమయినదిగదా!

సీతముందు నడచుగాక , అటువెనుక, నీవుపొమ్ము , నేనుమీవెంటవచ్చుచున్నాను, ఇప్పుడు, మనముమరణనిమిత్తకస్నానాదులుసేయఁ బోవుచున్నాము కాబట్టి, స్త్రీలును, బాలురును , ముందు,పోవలయును. అని,రాముఁడు లక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము,

తతో నిత్యానుగ స్తేషాం విదితాత్మా మహామతిః
మృదు ర్దాన్తశ్చ శాన్తశ్చ రామేచ దృఢభక్తిమాన్. ౨౨
సుమన్త్రస్తై నృపసుతై స్సార్ధ మాశ్వాస్య రాఘవమ్
అవాతారయ దాలంబ్య నదీం మందాకినీం శివామ్. ౨౩

టీక॥ తతః=అటుపిమ్మట; తేషాం=వారలయొక్క; నిత్యానుగః=ఎల్లప్పుడును వెంబడించియుండువాఁడును; విదితాత్మా=తెలియఁబడినపరమాత్మగలవాఁడును; మహామతిః=అధికమయిన బుద్ధిగలవాఁడును; మృదుః = మెత్తనివాఁడును; దాంతశ్చ=ఇంద్రియనిగ్రహముగలవాఁడును; శాంతశ్చ=కోపములేనివాఁడును; రామే = రామునియందు; దృఢభక్తిమాన్= స్థిరమైనభక్తిగలవాఁడునగు; సుమంత్రః = సుమంత్రుడు; తైః=ఆ; నృపసుతైస్సార్ధం = రాచకొమరులతోఁగూడ; రాఘవం = రాముని; ఆశ్వాస్య=ఊరడించి; ఆలంబ్య=పట్టుకొని; శివాం=మంగళకరమైన; మందాకినీం= మందాకినియను; నదీం=నదినిగూర్చి; అవాతారయత్=దించెను,

అంత, వారలయొక్క కులక్రమాగతుఁడును, అనుచరుండును బరమాత్మజ్ఞానముగలవాఁడును మహాబుద్ధిశాలియును మృదుస్వభావుండును జితేంద్రియుండును శాంతుఁడును రామునియందుదృఢమయిన భక్తిగలవాఁడునగు సుమంత్రుండు, భరతలక్ష్మణశత్రుఘ్నులను రామునినోదార్చి వారలనుదిన్నఁగా మందాకినీనదికిఁదీసుకొనిపోయెను.

అని, తాత్పర్యము.

తే సుతీర్థాం తతః కృచ్ఛ్రాదుపాగమ్య యశస్వినః
నదీం మందాకినీం రమ్యాం సదాపుష్పితకాననామ్. ౨౭
శీఘ్రస్రోతస మాసాద్య తీర్థం శివ మకర్దమమ్
సిషిచు స్తూదకం రాజ్ఞే తత్రైతత్తే భవత్వితి. ౨౮

టీక॥ యశస్వినః = అధికమయినకీర్తిగల; తే=వారలు; తతః = అటుపిమ్మట; కృచ్ఛ్రాత్ = కష్టమువలన; సుతీర్థాం = మంచిరేవులుగలదియు; రమ్యాం=రమణీయంబును; సదా=ఎల్లప్పుడును; పుష్పితకాననాం= పూఁచిన యడవులుగలదియు; శీఘ్రస్రోతసం=వడిగలప్రవాహములు గలదియునగు; మందాకినీం=మందాకినియను; నదీం=నదిని; ఉపాగమ్య=పొంది; అకర్దమం=బురదలేనిదియు; శివం=మంగళకరంబునగు; తీర్థం=రేవును; ఆసాద్య = చేరి. తాత=నాయనా; ఏతత్=ఇది; తే=నీకొఱకు; భవతు=అగుఁగాక; ఇ

తి=అని; రాజ్ఞె=దశరథమహారాజుకొ అకు; ఉదకం=జలమును; సిషిచుః = విడిచిరి.

మహాయశశ్శాలులగు, నాసీతారామలక్ష్మణులు, సుందరమైన, రేవులుగలదియు రమణీయంబులను దీరంబులంబుష్పితారణ్యంబులుగలదియు. శీఘ్రప్రవాహముగలదియునగు మందాకినీనదిం జేరి, స్నానంబుగావించి, అందుబురద లేనియొకసుందరమయిన రేవునందు, "నాయనాయీజలమునీకుc దృప్తి గలిగించుగాక" అనిసభక్తికంబుగా నుడువుచు తండ్రియగు దశరథమహారాజునకు నుదకంబువిడిచిరి.

అని, తాత్పర్యము.

ప్రగృహ్యాచ మహీపాలో జలపూరిత మంజలిమ్
దిశం యామ్యా మభిముఖో రుద న్వచన మబ్రవీత్. ౨౮

టీక॥మహీపాలః= భూమినిపాలించునట్టిరాముcడు ; జలపూరితం=నీళ్లచేనింపcబడిన; అంజలిం=దోసిలిని;ప్రగృహ్యాచ=పట్టుకొనియు;యామ్యాం=యమసంబంధియగు; దిశం=దక్షిణపుదిక్కునుగూర్చి ; అభిముఖః=ఎదురైనముఖముగలవాcడై; రుదన్=ఏడ్చుచు; వచనం= మాటను ; అబ్రవీత్= చెప్పెను.

అంతరాముండు దోసిలినిండ జలంబుపట్టుకొనిదక్షిణ దిక్కునకట్టుగాc దిరిగి రోదనము సేయుచు యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

ఏతత్తే రాజశార్దూల విమలం తోయ మక్షయమ్
పితృలోకగతస్యాద్య మద్దత్త ముపతిష్ఠతు. ౨౯

టీక॥రాజశార్దూల = రాజశ్రేష్ఠుండగుదశరథుcడా ; పితృలోక గతస్య=పితృలోకమునుబొందిన; తే= నీకు; అద్య=ఇప్పుడు;మద్దత్తం= నాచేనివ్వcబడిన; ఏతత్ =ఈ;విమలం= స్వచ్ఛమగు; తోయం=జలము;అక్షయం=నాశములేనిదిగా; ఉపతిష్ఠతు=పొందుగాక.

రాజశ్రేష్ఠుండవగు దశరథుcడా!పితృలోకగతుండవగునీకునేనిప్పు డొసం

గాడునిర్మలోదకముఅక్షయమై పొలుచుగాక. అని రాముండుచెప్పెను.

అని, తాత్పర్యము.

తతో మందాకినీ తీరా త్ప్రత్యుత్తీర్య సరాఘవః
పితు శ్చకార తేజస్వీ నివాపం భ్రాతృభి స్సహ. ౨౮

టీక॥ తతః = అటుపిమ్మట; తేజస్వీ=అధికమయినకాంతిగల; సః=ఆ; రాఘవః=రాముండు; భ్రాతృభిస్సహ=తమ్ములతోఁగూడ; మందాకినీతీరాత్=మందాకినీనదిగట్టుననుండి; ప్రత్యుత్తీర్య=ఆవలికిపోయి; పితుః=తండ్రికి; నివాపం=సపిండీకరణమును; చకార=చేసెను.

అంతఁ, తేజస్వియగురాముండు, తమ్ములతో, మందాకినీనదీతీరంబువిడిచి, ఆవలికిపోయి, అచ్చట, తండ్రికిసపిండీకరణముగావించెను.

అని, తాత్పర్యము.

ఐంగుదం బదరీమిశ్రం పిణ్యాకం దర్భసం స్తరే
న్యస్య రామస్య దుఃఖార్తో రుద న్వచన మబ్రవీత్. ౨౯

టీక॥ సః=ఆ; రామః = రాముఁడు; బదరీమిశ్రం= రేగుపండ్లతోచేరిన; ఇంగుదం=గారచెట్టుసంబంధమయిన; పిణ్యాకం=గానుగపిండిని; దర్భసంస్తరే=దర్భలఆస్తరణమునందు; న్యస్య=ఉంచి; దుఃఖార్తః= దుఃఖముచేపీడింపఁబడినవాఁడై; రుదన్=ఏడ్చుచు; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

రాముండుగారగానుగపిండిని, రేగుపండ్లతోకలిపి, ముద్దలుచేసి,దర్భలుపరిచినస్థలంబుపైనునిచి, పరమదుఃఖితుండై, రోదనంబుసేయుచు, నీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇదం భుఙ్క్ష్వ మహారాజ ప్రీతోయ దశనా వయమ్
యదన్నః పురుషో భవతి తదన్నా స్తస్యదేవతాః- ౩౦




టీక॥ మహారాజ=దశరథమహారాజా! వయం=మేము; యదశనాః= ఏదిఆహారముగాఁగలవారమో ; తత్=(అధ్యాహృతము)అట్టి; ఇదం=దీనిని ; ప్రీతః=సంతుష్టుండవై; భుజ్క్ష్వ= భుజింపుము ; యదన్నఃపురుషోభవతి = పురుషః=పురుషుఁడు ; యదన్నః=ఏదిఅన్నముగాఁగలవాఁడు; భవతి=అగుచున్నాఁడో; తస్య=అతనియొక్క; దేవతాః=దేవతలు;తదన్నాః=అదేఅన్నముగాఁగలవారలు.

దశరథమహారాజా! మాకిచ్చట నీఇంగుదీపిణ్యాకమే, ఆహారముకాఁబట్టి, దీనినేనీకిప్పుడు, సమర్పించినాను, సంతోషంబుతోనారగింపుము! పురుషుఁడు,తాను దేని , నాహారముఁగాఁగొనునోదానినే , తన దేవతలకును,సమర్పించవలసినది,అని, రాముఁడుచెప్పెను.

అని,తాత్పర్యము,

తతస్తేనైవ మార్గేణ ప్రత్యుత్తీర్య నదీతటాత్
ఆరురోహ నరవ్యాఘ్రో రమ్యసానుం మహీధరమ్. ౩౧

టీక॥తతః=అటుపిమ్మట ; నరవ్యాఘ్రః=పురుషశ్రేష్ఠుండగు రాముండు ; తేన=ఆ;మార్గేణైవ = మార్గముచేతనే; నదీతటాత్= ఏటిగట్టుననుండి; ప్రత్యుత్తీర్య=దాటిపోయి; రమ్యసానుం=సుందరములయిన నెత్తములుగల; మహీధరమ్=పర్వతమును; ఆరురోహ=ఎక్కెను.

అంతఁబురుషశ్రేష్ఠుండగు రాముండుఆదారిననే ఏటిగట్టుననుండి పోయి రమణీయములయినసాను ప్రదేశములుగలపర్వతప్రదేశంబునొందెను.

అని,తాత్పర్యము.

తతః పర్ణకుటీద్వార మాసాద్య జగతీపతిః
పరిజగ్రాహ బాహుభ్యా ముభౌ భరతలక్ష్మణౌ. ౩౨

టీక॥తతః=అటుపిమ్మట ; జగతీపతిః=భూమికిఁబ్రభువైనరాముఁడు; పర్ణకుటీద్వారం= పర్ణశాలయొక్క వాకిలిని; ఆసాద్య=పొంది ; బాహుభ్యాం=చేతులచేత;భరతలక్ష్మణౌ = భరతలక్ష్మణులను;ఉభౌ=ఇద్దరును;పరి







జగ్రాహ=పరిగ్రహించెను.

అంత రాముండు పర్ణశాలాద్వారంబు జేరగానే భరతలక్ష్మణుల నిద్దఱను బాహువులచేతకవుఁగలించుకొనెను. అని, తాత్పర్యము.

తేషాంతు రుదతాం శబ్దాత్ ప్రతిశ్రుతో౽భవద్గిరౌ
భ్రాతౄణాం సహవైదేహ్యా సింహానామివ నర్దతామ్. ౩౩

టీక॥ వైదేహ్యాసహ=సీతతోఁగూడ; రుదతాం=ఏడ్చుచున్న; తేషాం=ఆ; భ్రాతౄణాం=తోఁబుట్టువులయొక్క; నర్దతాం=గర్జించుచున్న; సింహానామివ= సింహములయొక్కవలె; శబ్దాత్=ధ్వనివలననే; గిరౌ= పర్వతమునందు; ప్రతిశ్రుతః= ప్రతిధ్వని; అభవత్=కలిగినది.

ఆ రామలక్ష్మణభరతశత్రుఘ్నులు, సీతయుఁజేయురోదనధ్వనివలన, సింహగర్జనధ్వనులవలనంబోలె, ఆచిత్రకూట పర్వతమునందు, గొప్పప్రతిధ్వనికలిగినది. అని, తాత్పర్యము.

మహాబలానాం రుదతాం కుర్వతా ముదకం పితుః
విజ్ఞాయ తుములం శబ్దం త్రస్తా భరతసైనికాః. ౩౪

టీక॥ భరతసైనికాః=భరతునిసైనికులు; పితుః=తండ్రికి; ఉదకం= జలతర్పణమును; కుర్వతాం = చేయుచున్నవారలును; రుదతాం=ఏడ్చుచున్నవారలునగు; మహాబలానాం=అధికమయినబలముగల రామాదులయొక్క; తుములం= దొమ్మియయిన; శబ్దం=ధ్వనిని; విజ్ఞాయ=ఎఱింగి; త్రస్తాః = భయపడిరి.

భరతునిసైనికులు,బలవంతులగు రామాదులు, తండ్రికి, అపరక్రియలంజేయుచురోదనంబుసేయఁగా, నాతుములధ్వనిని విని, భయమును జెందిరి- అని, తాత్పర్యము.

అబ్రువంశ్చాపి రామేణ భరతస్సంగతో ధ్రువమ్
తేషా మేవ మహాన్శబ్దః శోచతాం పితరం మృతమ్. ౩౫




టీక॥ తే(అధ్యాహృతము)= ఆభరతసైనికులు; భరతః = భరతుఁడు; రామేణ=రామునితో; సంగతః= చేరినాఁడు; ధ్రువం=నిశ్చయము;మృతం=చచ్చిన, పితరం=తండ్రినిగురించి; శోచతాం=దుఃఖించుచున్న; తేషామేవ=వారలయొక్క-యె ; మహాన్= గొప్పదగు; శబ్దః=ధ్వని; శ్రూయతె(అధ్యాహృతము)= వినఁబడుచున్నది. ఇతి(అధ్యాహృతము)= అని; అబ్రువంశ్చాపి=చెప్పుకొన్నారును.

"భరతుండు, రామునితోఁ జేరినట్లున్నది, ఇదినిశ్చయము. వారలందఱు, పితృమరణమును గుఱించిదుఃఖించుచున్నారు. ఆధ్వని, గొప్పగా వినవచ్చుచున్నది"అనియీభరతసైనికులు, చెప్పుకొనిరి. అని, తాత్పర్యము.

అథ వాసా న్ పరిత్యజ్య తం సర్వే భిముఖా స్స్వనమ్
అప్యేకమనసో జగ్ము ర్యథాస్థానం ప్రధావితాః. ౩౬

టీక॥ అథ = అటుపిమ్మట; తే(అధ్యాహృతము)=ఆభరతసైనికులు ; సర్వేపి=అందఱును;తం=ఆ ; స్వనం = ధ్వనినిగూర్చి; అభిముఖాః = ఎదురుముఖముగలవారై; వాసాన్= నివాసస్థానములను; పరిత్యజ్య=విడిచి; ఏకమనసః=ఒకవిధమైనమనసుగలవారై ;యథాస్థానం=స్థానమునతిక్రమించక;ప్రధావితాః = పఱుగెత్తువారలై; జగ్ముః=పోయిరి.

అంత, నాభరతసైనికులందఱునొకటియై, ఆధ్వనిపుట్టినదిక్కు-నుబట్టి , అతివేగంబునంబఱుగెత్తిపోయిరి.

అని, తాత్పర్యము.

హయై ర న్యే గజై ర న్యే రథై ర న్యే స్వలంకృతైః
సుకుమారా స్తథైవాన్యే పద్భి రేవ నరా యయుః. ౩౭

టీక॥అన్యే=ఇతరులయిన;నరాః= మనుష్యులు; హయైః= గుఱ్ఱములచేతను; అన్యే=మఱికొందఱు; గజైః= ఏనుంగులచేతను; అన్యే=మఱికొందఱు; స్వలంకృతైః= చక్క-ఁగానలంకరింపంబడిన; రథైః = రథములచేతను; యు

యయుః=పోయిరి; తథైవ=అట్లే; సుకుమారాః=మిక్కిలియయౌవనముగల; అన్యే=మఱికొందఱు; పద్భిరేవ=పాదములచేతనే; యయుః (అధ్యాహృతము)=పోయిరి.

కొందఱు గుఱ్ఱంబులనెక్కియు గొందఱు మాతంగంబుల నారోహించియు మఱికొందఱుచక్కగానలంకరింపఁబడినరథంబులనెక్కియుఁ బోయిరి ; ఉత్సాహవంతులగు మఱికొందఱు కాలి నడకంజనిరి. అని, తాత్పర్యము.

అచిరప్రోషితం రామం చిరవిప్రోషితం యథా
ద్రష్టుకామో జన స్సర్వో జగామ సహసా శ్రమమ్. ౩౮

టీక॥జనః=జనము; సర్వః = అంతయు; అచిరప్రోషితం = బహుకాలముగా దేశాంతరగతుఁడు గానట్టి ; రామం=రామునిఁ; చిరవిప్రోషితంయథా=బహుకాలముగా దేశాంతరగతుఁడయినవానివలె; ద్రష్టుకామః= చూడఁగోరినదై; సహసా=శీఘ్రంబున; ఆశ్రమం=రామునిఆశ్రమమునుగూర్చి ; జగామ=పోయెను. ఆజనులందఱు రాముం డువనంబునొందికొంతకాలంబె యయినప్పటికినిబహుకాలవియోగమును నొందినవారలువలెరామునిం జూచుటయందుఅత్యాతురతగలవారలై అతివేగంబున రామునియాశ్రమంబునకుం బోయిరి.

అని, తాత్పర్యము.

భ్రాతౄణాం త్వరితా స్తత్ర ద్రష్టుకామా స్సమాగమమ్
యయు ర్బహువిధై ర్యుక్తైః ఖుర నేమిస్వనాకులైః. ౩౯

టీక॥తత్ర=అచ్చట ; తే (అధ్యాహృతము)=వారలు; భ్రాతౄణాం=తోఁబుట్టువులయొక్క; సమాగమం=చేరికను; ద్రష్టుకామాః= చూడఁగోరినవారలై; త్వరితాః=వేగముగలవారలయి; ఖురనేమిస్వనాకులైః= గిట్టలయొక్కయుఁ జక్రముల యంచులయొక్కయుధ్వనులచేనిండిన; యుక్తైః= సజ్జములగు; బహువిధైః= పలువిధములయినవాహనములచేత; యయుః = పోయిరి.

అప్పుడు, వారలు, రామలక్ష్మణభ

రతశత్రుఘ్నులసమాగమంబుఁ జూడఁ గోరి, నానావిధవాహనంబుల నారోహించి,ఖురనేమిస్వనంబులు సెలంగ,న తివేగంబునంబోయిరి.

అని, తాత్పర్యము.

సా భూమి ర్బహుభి ర్యానైః ఖురనేమిసమాహతా
ముమోచ తుములం శబ్దం ద్యౌరివా భ్రసమాగమే. ౪౦

టీక॥ సా=ఆ; భూమిః= నేల; బహుభిః = పెక్కులయిన; యానైః= వాహనముల చేత ; ఖురనేమిసమాహితా=గుఱ్ఱములగిట్టలచేతను, చక్రముఁ యంచులచేతనుగొట్టఁబడినదై ; అభ్ర సమాగమే= మేఘముల చేరికయందు ; ద్యౌరివ=ఆకాశమువలె;తుములం= సంకులమయిన;శబ్దం=ధ్వనిని; ముమోచ= విడిచినది.

అప్పుడు, వేగంబుననడచు, నానావిధరథాదియానంబులఖురమేమి , ఘాతంబునంజేసి , వర్షాకాలంబున, మేఘంబులచేనాకాశంబు నందంబోలె , భూమియందు, మహాధ్వనిగలిగినది.

అని, తాత్పర్యము,

తేన విత్రాసితా నాగాః కరేణుపరివారితాః
ఆవాసయంతో గంధేన జగ్మురన్యద్వనంతతః. ౪౧

టీక॥ తతః=అంత; కరేణుపరివారితాః = ఆడేనుంగులఁబరివేష్టింపఁబడిన; నాగాః=ఏనుంగులు ; తేన=ఆధ్వనిచేత; విత్రాసితాః=భయపఱుపఁబడినవై ; గంధేన=వాసనచేత;ఆవాసయంతః = వాసనగొట్టునట్లుచేయుచు; అన్యత్=ఇతరమయిన; వనం= అడవినిగూర్చి; జగ్ముః=పొందినవి.

అంత, నాధ్వనికిభయపడి, మత్తగజంబులన్నియు , నాఁడేనుంగులంగూడి, యావనంబువిడిచి, మఱియొకవనంబునకుంబోయినవి ; అప్పుడు , గజంబులుపోయినప్పటికిని, అదివఱకుఁగలిగినమదజలసంబంధంబునంజేసి , యావనంబునందంతయు,సుగంధంబుగుబాళించుచుండినది. అని, తాత్పర్యము.

స ౧౦౩

వరాహా వృకసంఘాశ్చ మహిషా స్సర్పవానరాః
వ్యాఘ్రా గోకర్ణగవయా విత్రేసుః పృషతైస్సహ. ౪౨

టీక॥ వరాహవృకసంఘాశ్చ= పందులయొక్కయు తోడేళ్లయొక్కయు సమూహములును; మహిషాః=ఎనుపోతులును; సర్పవానరాః=సర్పములును కోతులును; వ్యాఘ్రగోకర్ణగవయాః= పెద్దపులులును గోవులచెవులవంటిచెవులుగల యొకవిధమైన జింకలును గురుపోతులును; పృషతైస్సహ = దుప్పులతోఁగూడ; విత్రేసుః=భయపడినవి.

పందులు, తోడేళ్లు, దున్నపోతులు, సర్పములు, కోతులు, గురుపోతులు, పులులు, జింకలు మొదలగు మృగంబులన్నియు భయంబునం జారినవి.

అని, తాత్పర్యము.

రథాంగసాహ్వా నత్యూహాః హంసాః కారండవాః ప్లవాః
తథా పుంస్కోకిలాః క్రౌంచా విసంజ్ఞా భేజిరే దిశః. ౪౩

టీక॥ రథాంగసాహ్వాః= చక్రవాకపక్షులును; నత్యూహాః= నీరుకోడులును; హంసాః=హంసపక్షులును; కారండవాః=కన్నెలెళ్లును; ప్లవాః=కొంగలును; తథా=అట్లు; పుంస్కోకిలాః= మగకోయిలలును; క్రౌంచాః= క్రౌంచపక్షులును; విసంజ్ఞాః=స్మృతితప్పినవై; దిశః=దిక్కులను; భేజిరే=పొందినవి.

చక్రవాకంబులు, నీరుకోడులు, హంసలు, కారండవములు, కొంగలు కోవిలంబులు, క్రౌంచములు మొదలగు సమస్త పక్షులును భయవిహ్వలంబులై దిక్కులకుం బాఱినవి. అని, తాత్పర్యము.

తేన శబ్దేన విత్రస్తై రాకాశం పక్షిభి ర్వృతమ్
మనుష్యై రావృతా భూమి రుభయం ప్రబభౌ తదా. ౪౪

టీక॥ తేన=ఆ; శబ్దేన=ధ్వనిచేత; విత్రస్తైః=భయపడిన; పక్షిభిః= పక్షులచేత; ఆకాశం=ఆకాశమును; వృతం=చుట్టఁబడినది. మనుష్యైః= మనుష్యులచేత; భూమిః=భూమి; ఆవృతా= కప్పఁబడినది. తదా=అప్పుడు; ఉభ




యం=రెండును; ప్రబభౌ= ప్రకాశిం చెను.

అట్లు, అధ్వసికిభయపడి, పక్షులన్ని యునాకాశంబునవహ్యాలంబులయి, సంచరించెపి, భరతసైనికులు, భూమినంత యు, వ్యాపించియుండిరి, అట్లు, ఆకాశభూములు రెండును, ఎంతయు ప్రకాశించినవి. అని, తాత్పర్యము.

తత స్తం పురుషవ్యాఘ్రం యశస్వినమరిందమమ్

ఆసీనం స్థండిలే రామం దదర్శ సహసా జనః. ౪౫

టీక॥ తతః=అటుపిమ్మట; జనః=జనము; సహసా=శీఘ్రముగా; పురుషవ్యాఘ్రం=పురుషశ్రేష్ఠుండును; యశస్వినం=అధికమయిన కీర్తిగలవాఁడును; అరిందమం=శత్రువులనడంగఁద్రొక్కువాఁడును; స్థండిలే=నేలయందు; ఆసీనం=కూర్చుండి యున్నవాఁడునగు; తం=ఆ; రామం=రాముని; దదర్శ=చూచినది.

అంత, నాజనులు, అట్లువేగంబునం బోయి, పర్ణశాలామధ్యంబున, నేలం గూర్చుండియున్నవాఁడును శత్రువుల నడంగఁద్రొక్కంజాలినవాఁడును, మహాయశశ్శాలియుఁ బురుషశ్రేష్ఠుఁడునగు, రాముని, సందర్శించిరి.

అని, తాత్పర్యము.

విగర్హమాణః కైకేయీం సహితో మంథరామపి

అభిగమ్య జనో రామం బాష్పపూర్ణముఖోభవత్. ౪౬

టీక॥ జనః=జనము; సహితః= కూడినదై; రామం=రాముని; అభిగమ్య=పొంది; కైకేయీం=కైకేయిని; మంథరామపి= మంథరను; విగర్హమాణః=నిందించుచు; బాష్పపూర్ణముఖః=కన్నీళ్లచే నిండినముఖము గలదిగా; అభవత్=ఉండినది.

వారలందఱునొక్కటిగాఁజేరి, రామునొద్దకుఁబోయి, కైకేయీ మంథరలనుదూఱుచుగన్నీళ్లొలికించుచు, రాముని యెదుటనిలుచుండిరి. అని, తాత్పర్యము.

తాన్నరాన్ బాష్పపూర్ణాక్షాన్ సమీక్ష్యాథసుదుఃఖితాన్




పర్యష్వజత ధర్మజ్ఞః పితృవన్మాతృవచ్చసః. ౪౭

టీక॥అథ=అటుపిమ్మట ; ధర్మజ్ఞః=ధర్మము నెఱింగిన; సః= ఆరాముండు; బాష్పపూర్ణాక్షాన్=కన్నీళ్లచే నిండినకండ్లుగలవారలును; సుదుఃఖితాన్=మిక్కిలియు దుఃఖంబునొందినవారలునగు; తాన్=ఆ; నరాన్=మనుష్యులను; సమీక్ష్య=చూచి ; పితృవత్=తండ్రులవలెను; మాతృవచ్చ= తల్లులవలెను; పర్యష్వజత= కవుఁగిలించుకొనెను.

అంత, ధర్మాత్ముండగు రాముండు, పరమదుఃఖితులయి కన్నీళ్లొలికించుచున్న యాజనులంజూచి, పురుషులను దండ్రులంబోలె, స్త్రీలను దల్లులవలె, సగౌరవంబుగాఁగవుఁగిలించుకొనెను.

అని, తాత్పర్యము.

స తత్ర కాంశ్చిత్ పరిషస్వజే నరా
న్నరాశ్చ కేచిత్తు తమభ్యవాదయన్
చకార సర్వాన్ సవయస్యబాంధవాన్
యథార్హమాసాద్య తదా నృపాత్మజః. ౪౮

టీక॥తత్ర=అచ్చట; సః = ఆరాముఁడు; నరాన్=మనుష్యులను ; కాంశ్చిత్ =కొందఱను; పరిషస్వజే= కవుఁగిలించుకొనెను. కేచిత్=కొందఱు; నరాశ్చతు=జనులును; తం=ఆరాముని; అభ్యవాదయన్ = నమస్కరించిరి. తదా=అప్పుడు; సః=ఆ; నృపాత్మజః=రాచకొమరుండగు రాముండు; వయస్యబాంధవాన్= స్నేహితులనుబంధువులను; సర్వాన్=అందఱను; ఆసాద్య=పొంది; యథార్హం=యథాయోగ్యముగా; సన్మానం=గౌరవమును; చకార=చేసెను.

అప్పుడు, రాముండు, కొందఱినిగవుఁగిలించుకొనెను; కొందఱు రామునకునమస్కారము గావించిరి. రాముండు, స్నేహితులనుబంధువులను అందఱను, వారివారియోగ్యతకుఁ దగినట్లు, గౌరవించెను. అని, తాత్పర్యము.

స తత్ర తేషాం రుదతాం మహాత్మనాం
భువంచ ఖంచానునినాదయన్ స్వనః
గుహాగిరీణాంచ దిశశ్చ సంతతం
మృదంగఘోషప్రతిమః ప్రశుశ్రువే. ౪౮

టీక॥ తత్ర=అచ్చట; రుదతాం = ఏడ్చుచున్న; మహాత్మనాం= పూజ్యమయినస్వభావముగల; తేషాం=వారలయొక్క; సః=ఆ; స్వనః=ధ్వని; భువంచ=భూమిని; ఖంచ=ఆకాశమును; గిరీణాం= పర్వతములయొక్క; గుహాశ్చ=గుహలను; దిశశ్చ=దిక్కులను; అనునినాదయన్=ధ్వనింపఁజేయుచు; మృదంగఘోషప్రతిమః = మద్దెలధ్వనితోఁబోలికగలదై; సంతతం=విడువక; ప్రశుశ్రువే=వినఁబడినది.

అచ్చట, మహాత్ములగు, నారామాదులరోదనధ్వని, భూమియందును, ఆకాశంబునందును , బర్వతగుహలయందునుదిక్కులందును, బ్రతి, ధ్వనులునెలంగధ్వనియుంబోలె, గంభీరంబై, వినవచ్చుచుండినది. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే,త్ర్యుత్తరశతతమస్సర్గః.
ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండత్ర్యుత్తరశతతమసర్గటీక,
ముగిసినది.



(శ్రీ)

చతురుత్తరశతతమసర్గప్రారంభః.

వసిష్ఠః పురతః కృత్వా దారాన్ దశరథస్యచ
అభిచక్రామ తం దేశం రామదర్శన తర్షితః. ౧

టీక॥వసిష్ఠః= వసిష్ఠుఁడు; దశరథస్య= దశరథునియొక్క; ("చ" అనునది పాదపూరణార్థము); దారాన్= భార్యలను;పురతః=ముందట;కృత్వా= చేసికొని, ఉంచుకొనియనుట ; రామదర్శనతర్షితః= రామదర్శనమునందిచ్ఛగలవాఁడై; తం=ఆ; దేశం= ప్రదేశమునుగూర్చి ; అభిచక్రామ = నడచెను.

అంత,వసిష్ఠమహాముని , దశరథునిభార్యలనుదోడ్కొని,రామదర్శనకౌతుకంబున , రామాదులుండుప్రదేశంబునకువచ్చుచుండెను.

అని, తాత్పర్యము.

రాజపత్న్యశ్చ గచ్ఛంత్యోమందం మందాకినీం ప్రతి
దదృశు స్తత్ర తత్తీర్థం రామలక్ష్మణ సేవితమ్. ౨

టీక॥రాజపత్న్యశ్చ= రాజభార్యలును;మందం=తిన్నఁగా ; మందాకినీం ప్రతి=మందాకినీనదినిగూర్చి; గచ్ఛంత్యః=పోవుచున్నవారలయి; తత్ర=అచ్చట;రామలక్ష్మణసేవితం = రామలక్ష్మణులచే సేవింపఁబడిన; తత్= ఆ; తీర్థం=రేవును; దదృశుః= చూచిరి.

కౌసల్యమున్నగు రాజభార్యలు,మందగమనంబున, మందాకినీ నదికింబోవుచు,రామలక్ష్మణులచే సేవింపఁబడిన,ఆ మందాకినీనదియందలి రేవుచు, జూచిరి.

అని, తాత్పర్యము.

కౌసల్యా బాష్పపూర్ణేన ముఖేన పరిశుష్యతా
సుమిత్రా మబ్రవీద్దీనా యాశ్చాన్యా రాజయోషితః. ౩

టీక॥కౌసల్యా=కౌసల్య;బాష్పపూర్ణేన=కన్నీటిచేనిండిన;పరిశుష్యతా= ఎండుచున్న; ముఖేన=నోటితో;దీనా= దుఃఖితయయి;సుమిత్రాం=సుమిత్రను

స ౧౦౪

గూర్చియు;అన్యాః=ఇతరులయిన; రాజయోషితః=రాజభార్యలు;యాః (సంతి)= ఎవ్వరుగలరో;తాః (అధ్యాహృతము)చ= వారలనుగూర్చియు; అబ్రవీత్=చెప్పినది.

అంతఁ, గౌసల్య,కండ్లునిండఁగన్నీళ్లుగాఱ, నోరెండఁబరమదుఃఖితయయి, సుమిత్రను, ఇతరులగురాజభార్యలనుంజూచి,యిట్లని,చెప్పెను,

అని, తాత్పర్యము.

ఇదం తేషా మనాథానాం క్లిష్టమక్లిష్టకర్మణామ్

వనే ప్రాక్కేవలం తీర్థం యే తే నిర్విషయీ కృతాః. ౪

టీక॥ఇదం=ఈ;యే=ఏ; తే=ఆరామాదులు;ప్రాక్=మునుపు;నిర్విషయీకృతాః=దేశముననుండి వెడలగొట్టఁబడిరో; తేషాం=అట్టి; అనాథానాం=నాథుండులేనివారును;అక్లిష్టకర్మణాం=దుఃఖంబుగలిగింపని కార్యముగలవారునగుసీతారామలక్ష్మణులయొక్క;వనే=అడవియందు;తీర్థం=రేవు; కేవలం=నిశ్చయము.

దేశమునుండి వెడలగొట్టఁబడిన యనాథులును యితరులకుదుఃఖకరంబులు కానికార్యములు జేయువారునగుసీతారామలక్ష్మణులు అడవియందు స్నానముసేయుస్థలంబిదినిశ్చయము.

అని, తాత్పర్యము.

ఇత స్సుమిత్రే పుత్ర స్తే సదా జల మతంద్రితః

స్వయం హరతి సౌమిత్రి ర్మమ పుత్రస్య కారణాత్. ౫

టీక॥సుమిత్రే=సుమిత్రా; తే = నీయొక్క;పుత్రః = కొడుకైన; సౌమిత్రిః=లక్ష్మణుఁడు; అతంద్రితః=ఆలస్యములేనివాఁడై;సదా = ఎల్లప్పుడు;మమ=నాయొక్క; పుత్రస్యకారణాత్= కొడుకునిమిత్తమై;ఇతః=ఇచ్చటనుండి; జలం=జలమును;స్వయం=తాను; హరతి=కొనిపోవును.

సుమిత్రానీకొడుకైన లక్ష్మణుండు నాకొడుకు రామునినిమిత్తమైయేమరుపాటులేకయెల్లప్పుడును యీస్థలంబుననుండిజలమునుకొనిపోవును.

అని, తాత్పర్యము.

జఘన్యమపి తే పుత్రః కృతవా న్నతు గర్హితః
భ్రాతు ర్యదర్థ సహితం సర్వం తద్విహితం గుణైః. ౬

టీక॥ తే=నీయొక్క; పుత్రః=కొడుకు; జఘన్యమపి= నీచకార్యమునైనను; కృతవాన్ = చేసినాఁడు; తేన(అధ్యాహృతము)=అందుచేత; గర్హితస్తు= నిందితుండుమాత్రము; న=కాఁడు; భ్రాతుః=అన్నకు; అర్థసహితం=ప్రయోజనముతోఁగూడిన; కర్మ=(అధ్యాహృతము)కార్యము; యత్(అస్తి)= ఏదికలదో; తత్ =అది; సర్వం=అంతయు; గుణైః=గుణములచే; విహితం = శ్రేష్ఠమయినది.

నీకొడుకుయిట్టినీచకార్యముచేయుటవలన, నిందితుండెంతమాత్రము కాచాలఁడు, జ్యేష్ఠభ్రాతకు, యేశుశ్రూష చేసినను, అదియంతయు సర్వోత్తమమె. అని, తాత్పర్యము.

అద్యాయ మపి తే పుత్రః క్లేశానా మతథోచితః
నీచానర్థ సమాచారం సజ్జం కర్మప్రముంచతు. ౭

టీక॥ అద్య=ఇప్పుడు; క్లేశానాం= కష్టములకు; అతథోచితః= అట్లుతగినవాఁడుకానట్టి; తే=నీయొక్క; పుత్రః = కొడుకైన; అయమపి= ఈలక్ష్మణుండును; నీచానర్థసమాచారం=నీచంబును దుఃఖకరంబునగునాచారంబుగల; సజ్జం=ఉద్యుక్తమైన; కర్మ= కార్యమును; ప్రముంచతు=విడుచుఁగాక.

ఇంక, రాముండు, భరతప్రార్థనచేలబ్ధరాజ్యుండైనవిమ్మట , ఇట్టికష్టంబుల, కనహుఁడగు, నీకొడుకులక్ష్మణుండును, ఇప్పుడుగావించునీచకార్యంబులనువిడిచి, రాజసౌఖ్యంబు నొందుఁగాక. అని, కౌసల్యా, సుమిత్రతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

దక్షిణాగ్రేషు దర్భేషు సా దదర్శ మహీతలే
పితు రింగుది పిణ్యాకం న్యస్త మాయతలోచనా. ౮

టీక॥ ఆయతలోచనా= వెడల్పులైనకన్నులుగల; సా = ఆకౌసల్యాదేవి;

మహీతలే = భూమియందు; దక్షిణాగ్రేషు = దక్షిణదిక్కు-తట్టుగా కొనలుగల; దర్భేషు=దర్భలయందు; పితుః = తండ్రికి; న్యస్తం=ఉంచఁబడిన; ఇంగుదిపిణ్యాకం=గారగానుంగుపిండిని; దదర్శ=చూచెను.

అంత,సుందరంబులగు వెడందకన్నులుగలకౌసల్యాదేవి, అచ్చట, భూమిపైదక్షిణాగ్రంబులగు, దర్భలయందు, పితృప్రీత్యర్థమై, రామునిచేత , సభక్తికంబుగా, నుంచంబడిన గారగానుంగుపిండి, పిండంబులంజూచెను.

అని, తాత్పర్యము.

తం భూమౌ పితు రార్తేన న్యస్తం రామేణ వీక్ష్య సా
ఉవాచ దేవీ కౌసల్యా సర్వా దశరథస్త్రియః. ౯

టీక॥ దేవీ=రాణియగు; సా=ఆ; కౌసల్యా=కౌసల్య; ఆర్తేన= దుఃఖితుండగు; రామేణ= రామునిచేత;భూమౌ=నేలయందు; పితుః= తండ్రికి; న్యస్తం=ఉంచఁబడిన;తం=ఆయింగుదిపిణ్యాకమును; వీక్ష్య=చూచి; దశరథస్త్రియః=దశరథునిభార్యలను;సర్వాః=అందఱనుంగూర్చి ; ఉవాచ = చెప్పెను.

ఆకౌసల్యాదేవి, రాముండుదుఃఖితుండయిపితృప్రీతినిమిత్తమై , భూమియందుంచినపిండంబులంగని , దశరథభార్యలనందఱంజూచి, ఇట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము-

ఇద మిక్ష్వాకు నాథస్య రాఘవస్య మహాత్మనః
రాఘవేణ పితు ర్దత్తం పశ్యతై తద్యథావిధి. ౧౦

టీక॥ రాఘవేణ= రామునిచేత; ఇక్ష్వాకునాథస్య= ఇక్ష్వాకువంశంబునం బుట్టినవారలకుఁబ్రభుండును; మహాత్మనః=పూజ్యస్వభావుండునగు; పితుః= తండ్రియైన; రాఘవస్య= దశరథునకు; ఇదం=ఇది;యథావిధి=యథాశాస్త్రముగా;దత్తం=ఇయ్యఁబడినది.ఏతత్ = దీనిని;పశ్యత=చూడుఁడు.

ఇక్ష్వాకునాథుండునుమహాత్ముండును దండ్రియునగు దశరథమహారాజున

వరాముండుయథాశాస్త్రముగాసభక్తికముగానొసంగినపిండంబు లివిగోవీనిం జూడుడు. అని, తాత్పర్యము.

తస్య దేవసమానస్య పార్థివస్య మహాత్మనః
నైతదౌపయికం మన్యే భుక్తభోగస్య భోజనమ్. ౧౧

టీక॥ దేవసమానస్య= దేవతతోసమానుండును; మహాత్మనః = మహాప్రభావుండును; భుక్తభోగస్య=అనుభవింపఁబడినసమస్తభోగంబులుగలవాఁడును; పార్థివస్య = మహారాజుండునగు; తస్య=అట్టిదశరథునకు; ఏతత్ = దీనిని; ఔపయికం=యుక్తమైన; భోజనం=భోజనమునుగా; నమన్యే= తలంపను.

దేవేంద్ర తుల్యుండును మహానుభావుండును నానావిధసమస్త మనోహరభోగంబుల ననుభవించినవాఁడును మహారాజుండునగునట్టి దశరథునకు యీగారగానుంగుపిండితెగిన యాహారంబెంతమాత్రముఁ కాదు. అని, తాత్పర్యము.

చతురంతాం మహీం భుక్త్వా మహేంద్ర సదృశోవిభుః
కథ మింగుదిపిణ్యాకం స భుఙ్క్తే వసుధాధిపః. ౧౨

టీక॥ మహేంద్రసదృశః=దేవేంద్రునితోసమానుఁడైన; విభుః=ప్రభుండగు; వసుధాధిపః=భూమికిఁబ్రభువైన; సః= ఆదశరథమహారాజు; చతురంతాం=నాలుగుకొనలుగల; మహీం=భూమిని; భుక్త్వా=భుజించి; ఇంగుదిపిణ్యాకం= గారగానుగపిండిని; కథం=ఎట్లు; భుఙ్క్తే= తినును.

చతుస్సముద్రమధ్యంబుననుండుసమస్తభూమండలంబునుబాలింపుచు దేవేంద్రునికిసరియై ఎంతయు నొప్పుచుండినట్టిదశరథమహారాజుగారగానుఁగపిండినెట్లుభుజించును? అని, తాత్పర్యము.

అతో దుఃఖతరం లోకే నకించి త్ప్రతిభాతి మా
యత్ర రామః పితు ర్దద్యా దింగుదీ క్షోద మృద్ధిమాన్. ౧౩




టీక॥యత్ర=ఎప్పుడు;బుద్ధిమాన్=అధికమయినసంపదగల;రామః = రాముఁడు;పితుః = తండ్రికి;ఇంగుదిక్షోదం=గారపిండిని;పితుః = తండ్రికి;దద్యాత్=ఇచ్చునో; లోకే=లోకమునందు;అతః=ఇంతకన్నను; దుఃఖతరం=అధికమయిన దుఃఖముగలిగించునది; కించిత్=ఏదియు;మాం=నన్నుఁగూర్చి;నప్రతిభాతి=తోఁచదు.

మహైశ్వర్యసమేతుండగు రాముండు,తండ్రికి, శ్రాద్ధంబున, గారపిండినొసంగవలసివచ్చినదే! ఇంతకన్న,లోకంబున,దుఃఖంబుమఱియేమియున్నది?

అని, తాత్పర్యము.

రామే ణెంగుదిపిణ్యాకం పితు ర్దత్తం సమీక్ష్య మే
కథం దుఃఖేన హృదయం నస్ఫోటతి సహస్రధా. ౧౪

టీక॥పితుః=తండ్రికి; రామేణ=రాముని చేత;దత్తం=ఇయ్యఁబడిన;ఇంగుదిపిణ్యాకం= గారగానుఁగపిండిని; సమీక్ష్య=చూచి;మే = నాయొక్క;హృదయం=మనసు;దుఃఖేన=దుఃఖముచేత; సహస్రధా = వేయిపఱియలుగా;కథం=ఎట్లు;నస్ఫోటతి=పగులకున్నది?

రాముండుతండ్రికి శ్రాద్ధంబున గారగానుఁగపిండి నిచ్చుటనుజూచియు నామనస్సు దుఃఖంబుచే వేయిపఱియలుగాఁ బగులకున్నదేల?

అని, తాత్పర్యము.

శ్రుతిస్తు ఖల్వియం సత్యా లౌకికీ ప్రతిభాతి మా
యదన్నః పురుషో భవతి తదన్నా స్తస్యదేవతాః. ౧౫

టీక॥ పురుషః=పురుషుఁడు; యదన్నః= ఏదియాహారముగాఁగలవాఁడు; భవతి=అగుచున్నాఁడో ; తస్య=అతనియొక్క; దేవతాః= దేవతలు; తదన్నాః=అదేఅన్నముగాఁగలవారు; ఇదం=ఈ; సత్యా = సత్యాత్మకమైన; లౌకికీ=లోకప్రసిద్ధమైన ; శ్రుతిస్తు= శ్రుతిమాత్రము; మా=నన్నుఁగూర్చి ; ప్రతిభాతిఖలు = స్ఫురించుచున్నది , కదా?

పురుషుండు దేని నాహారముగా గొనుచున్నాఁడో యతని దేవతలకును అదే







యాహారముఅనుసత్యార్థ ప్రతిపాదకమును లోకప్రసిద్ధంబునగునీశ్రుతిమాత్రిమునాబుద్ధికి స్ఫురించుచున్నది. అని కౌసల్యదశరథునిభార్యలతోఁ జెప్పినది. అని, తాత్పర్యము.

ఏవ మార్తాం సపత్న్యస్తా జగ్ముః రాశ్వాస్య తాం తదా
దదృశు శ్చాశ్రమే రామం స్వర్గ చ్యుతమివామరమ్. ౧౬

టీక॥తదా=అప్పుడు; తాః=ఆ; సపత్న్యః=చవతులు; ఏవం= ఇట్లు; ఆర్తాం=దుఃఖితయగు; తాం= ఆకౌసల్యను; ఆశ్వాస్య = ఊరడించి; జగ్ముః=వెళ్లిరి; ఆశ్రమే= ఆశ్రమమునందు; స్వర్గచ్యుతం = స్వర్గముననుండిజారిన; అమరమివ= (స్థితం)దేవతవలెనున్న; రామం=రాముని; దదృశుశ్చ=చూచిరియు!

ఆదశరథునిభార్యలందఱు ; అట్లు దుఃఖితయైరోదనంబుసేయుచున్న కౌసల్యనుమంచిమాటలం దేల్చి, యాబిడం దీసుకొనిపోయియాశ్రమంబున , స్వర్గముననుండివచ్చిన దేవతవలె నున్న రామునింజూచిరి. అని, తాత్పర్యము.

సర్వభోగైః పరిత్యక్తం రామం సంప్రేక్ష్య మాతరః
ఆర్తా ముముచు రశ్రూణి సస్వరం శోకకర్శితాః. ౧౭

టీక॥మాతరః=తల్లులు ; సర్వభోగైః = సమస్తభోగములచేతను; పరిత్యక్తం=విడువఁబడిన; రామం= రాముని; సంప్రేక్ష్య=చూచి;ఆర్తాః = పీడితలై; శోకకర్శితాః = దుఃఖముచేకృశింపఁజేయఁబడినవారలై ; సస్వరం= ధ్వనితోఁగూడినట్లుగా; అశ్రూణి=కన్నీళ్లను; ముముచుః=విడిచిరి.

కౌసల్య మొదలగుతల్లులు రాముండుసమస్తభోగంబులను విడిచిఅరణ్యంబుననుండుటనుజూచి పరమదుఃఖితలై మహాధ్వని కలుగునట్లురోదనంబు సేయుచుకన్నీళ్లువిడిచిరి.

అని, తాత్పర్యము.




తాసాం రామ స్సముత్థాయ జగ్రాహ చరణాన్ శుభాన్
మాతౄణాం మనుజవ్యాఘ్రి స్సర్వాసాం సత్యసంగరః. ౧౮

టీక॥మనుజవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠుండును; సత్యసంగరః = సత్యప్రతిజ్ఞుండునగు;రామః=రాముఁడు; సముత్థాయ=లేచి; తాసాం=ఆ;మాతౄణాం=తల్లులయొక్క; సర్వాసాం = అందరియొక్కయు; శుభాన్= మంగళకరములయిన; చరణాన్=పాచములను; జగ్రాహ=పట్టుకొనెను.

అంతపురుషశ్రేష్ఠుండును సత్యప్రతిజ్ఞుండునగురాముండు లేచి సవినయంబుగాతల్లులకందఱకును సాష్టాంగ నమస్కారములు గావించెను.

అని, తాత్పర్యము.

తాః పాణిభి స్సుఖస్పర్శై ర్మృద్వంగుళితలై శ్శుభైః
ప్రమమార్జూ రజః పృష్ఠా ద్రామస్యా యతలోచనాః. ౧౯

టీక॥ ఆయతలోచనాః=వెడల్పులైనకన్నులుగల; తాః=ఆకౌసల్యాదులు; శుభైః=మంగళకరములైనవియు; మృద్వంగుళితలైః=మెత్తనివ్రేళ్లుగలదియు; సుఖస్పర్శైః= సుఖకరమైనతాఁకుటగలవియునగు;పాణిభిః=చేతులచేత;రామస్య=రామునియొక్క; పృష్ఠాత్=వీపుననుండి;రజః = దుమ్మును;ప్రమమార్జుః=తుడిచిరి.

వెడెందకన్నులుగల,కౌసల్యాదులును, తమకుసాష్టాంగముగనమస్కరించినరామునివీపుపైనుండు దుమ్మునుమృదువులైనవ్రేళ్లుగలసుఖస్పర్శంబులగుసుందరహస్తంబులచేఁదుడిచిరి.

అని, తాత్పర్యము.

సౌమిత్రి రపి తా స్సర్వా మాతౄ స్సంప్రేత్య దుఃఖితః
అభ్యవాదయ తా సక్తం శనై రామా దనంతరమ్. ౨౦

టీక॥ సౌమిత్రిరపి=లక్ష్మణుఁడును;తాః=ఆ;మాతౄః = తల్లులను; స

ర్వాః=అందఱును; సంప్రేక్ష్య=చూచి; దుఃఖితాః = దుఃఖమునొందినవారలై; శనైః=మెల్లఁగా; రామం = రామునికన్న; అనంతరం=పిమ్మట; ఆసక్తం=భక్తిగలుగునట్లుగా; అభ్యవాదయత=నమస్కరించెను.

లక్ష్మణుండును తల్లులనందరం జూచి, దుఃఖితుండై, రాముండునమస్కరించియయినపిమ్మట, దానును సభక్తికముగా, నమస్కారముగావించెను.

అని, తాత్పర్యము.

యథా రామే తథా తస్మిన్ సర్వా వవృతిరే స్త్రియః
వృత్తిం దశరథా జ్జాతే లక్ష్మణే శుభలక్షణే. ౭౧

టీక॥ స్త్రియః = దశరథునిభార్యలు; సర్వాః=అందఱును; రామే=రామునియందు; యథా=ఎట్లో; తథా= అట్లు; దశరథాత్ = దశరథునివలన; జాతే=పుట్టిన ; శుభలక్షణే=మంచిలక్షణములుగల; తస్మిన్=ఆ; లక్ష్మణే= లక్ష్మణునియందు; వృత్తిం=నడవడిని ; వవృతిరే=చేసిరి.

ఆదశరథభార్యలందఱు , రాముని నాదరించినవిధంబుననే, దశరథపుత్రుండును , మంగళకరంబులగులక్షణంబులతోఁగూడినవాఁడునగు, లక్ష్మణునింగూడనాదరించిరి. అని, తాత్పర్యము.

సీతాపి చరణాం స్తాసా ముపసంగృహ్య దుఃఖితా
శ్వశ్రూణా మశ్రుపూర్ణాక్షీ సా బభూవా గ్రతస్థ్సితా. ౭౨

టీక॥ సా=ఆ; సీతాపి=సీతయును; దుఃఖితా=దుఃఖమునొందినదై ; అశ్రుపూర్ణాక్షీ = కన్నీళ్లచేనిండినకన్నులుగలదియై; తాసాం=ఆ ; శ్వశ్రూణాం=అత్తలయొక్క; చరణాన్ = పాదములను; ఉపసంగృహ్య= పట్టుకొని; అగ్రతః=ముందట; స్థితా= ఉన్నదిగా; బభూవ=అయినది.

అంతసీతాదేవియు దుఃఖంబునఁగన్నీళ్లొలికించుచు , అత్తలకు నమస్కరించివారలముందట నిలువఁబడియుండినది. అని, తాత్పర్యము.

తాం పరిష్వజ్య దుఃఖార్తాం మాతా దుహితరం యథా
వనవాసకృశాం దీనాం కౌసల్యా వాక్య మబ్రవీత్. ౨౩

టీక॥కౌసల్యా=కౌసల్యాదేవి; దుఃఖార్తాం=దుఃఖముచేఁ బీడింపఁబడినదియు;వనవాసకృశాం=అడవియందుండుటచేఁగృశించినదియు;దీనాం=దైన్యమునొందినదియునగు;తాం=ఆసీతను; మాతా=తల్లి;దుహితరంయథా=కొమార్తెనువలె;పరిష్వజ్య=కవుగిలించుకొని;వాక్యం=మాటను;అబ్రవీత్=చెప్పెను.

కౌసల్యాదేవి వనవాసంబునం జేసి కృశగాత్రయైదీనయైపరమదుఃఖితయయియున్న సీతనుతల్లి కొమార్తెను కవుగిలించుకొన్నట్లుకవుగిలించుకొని యిట్లని చెప్పెను. అని,తాత్పర్యము.

విదేహరాజస్య సుతా స్నుషా దశరథస్యచ
రామపత్నీ కథం దుఃఖం సంప్రాప్తా నిర్జనే వనే. ౨౪

టీక॥విదేహరాజస్య=జనకమహారాజుయొక్క; సుతా=కొమార్తెయు; దశరథస్య=దశరథమహారాజుయొక్క; స్నుషాచ=కోడలును; రామపత్నీ=రామునిభార్యయగుసీతాదేవి; నిర్జనే=జనులులేని; వనే=అడవియందు; దుఃఖం=దుఃఖమును; కథం=ఎట్లు; సంప్రాప్తా=పొందినది?

జనకమహారాజుకూఁతురును, దశరథమహారాజుకోడలును, రామునిభార్యయునగు, నీసీతాదేవి, నిర్జనంబగు నరణ్యంబున, నిట్లు, దుఃఖింపఁవలసివచ్చినదేల? అని,తాత్పర్యము.

పద్మ మాతపసంతప్తం పరిక్లిష్ట మివోత్పలమ్
కాంచనం రజసా ధ్వస్తం క్లిష్టం చంద్రమివాంబుదైః. ౨౫
ముఖం తే ప్రేక్ష్య మాం శోకో దహత్యగ్నిరివాశ్రయమ్
భృశం మనసి వైదేహి వ్యసనారణిసంభవః. ౨౬

టీక॥వైదేహి=సీతాదేవీ! ఆతపసంతప్తం=ఎండచేఁదపింపఁజేయఁబడి

పురోహితస్యాగ్నిసమస్య వై తదా
బృహస్పతే రింద్ర ఇవా మరాధిపః
ప్రగృహ్యా పాదౌ సుసమృద్ధతేజస
స్సహైవ తేనో పవివేశ రాఘవః. ౮౨

టీక॥ తదా=అప్పుడు; రాఘవః=రాముఁడు; అగ్నిసమస్య = నిప్పుతోసమానుఁడును ("వై" అనునది పాదపూరణార్థము); సుసమృద్ధతేజసః = మిక్కిలియుసమృద్ధమయిన ప్రభావముగలవాఁడునగు; పురోహితస్య= పురోహితునియొక్క; అమరాధిపః= దేవతలకుఁబ్రభుండగు; ఇంద్రః=ఇంద్రుఁడు; బృహస్పతేరివ = బృహస్పతియొక్కవలె; పాదౌ=పాదములను; ప్రగృహ్య=పట్టుకొని; తేనసహైవ= అతనితోఁగూడనే; ఉపవివేశ=కూర్చుండెను.

అప్పుడు, రాముండు, దేవేంద్రుండు, బృహస్పతికినమస్కరించునట్లు, అగ్నిహోత్రంబునకు సరివచ్చువాఁడును, మహాప్రభావుండునగువసిష్ఠమహామునికినమస్కారంబుగావించి,యాయనతోఁగూడనే, కూర్చుండెను.

అని, తాత్పర్యము-

తతో జఘన్యం సహితై స్సమంత్రిభిః
పురప్రధానైశ్చ సహైవ సైనికైః
జనేన ధర్మజ్ఞతమేన ధర్మవా
నుపోపవిష్టో భరత స్తదాగ్రజమ్. ౮౩

టీక॥ తదా=అప్పుడు; తతః=అంత; జఘన్యం=పిమ్మట; ధర్మవాన్=అధికమైనధర్మముగల ; సః=ఆభరతుఁడు; సహితైః=కూడిన; మంత్రిభిః=మంత్రులతోను; పురప్రధానైశ్చ=పట్టణంబునఁ బ్రధానులగు వారలతోను; సైనికైః=సైనికులతోను; ధర్మజ్ఞతమేన=మిక్కిలియు ధర్మజ్ఞుఁడైన; జనేన=జనముతోను; సహైవ = కూడనే; అగ్రజం= (షష్ఠ్యర్థమందుద్వితీయ) అన్నయగు రామునకు; ఉపోపవిష్టః = సమీపమునందుఁగూర్చుండెను.

అంత, నారామవసిష్ఠులుకూర్చుండినపిమ్మట, ధార్మికుండగుభరతుండు, మంత్రిలనుబురప్రధానులనునైనికులనుబరమధార్మికులగు జనులనుంగూడి, రామునకు, సమీపంబునంగూర్చుండెను. అని, తాత్పర్యము.

ఉపోపవిష్టస్తు తదా స వీర్యవాం
స్తపస్వివేషేణ సమీక్ష్య రాఘవమ్
శ్రియా జ్వలంతం భరతః కృతాంజలి
ర్యథామహేంద్రః ప్రయతః ప్రజాపతిమ్. ౩౦

టీక॥తదా=అప్పుడు; వీర్యవాన్=అధికమయినపరాక్రమముగల; సః=ఆ; భరతః=భరతుఁడు; ఉపోపవిష్టస్తు=సమీపమునందుఁగూర్చుండినవాఁడైనంతనె; తపస్విवేషేణ= మునివేషముచేతను; శ్రియా=కాంతిచేతను;జ్వలంతం=వెలుంగుచున్న; రాఘవం=రామునిని; సమీక్ష్య=చూచి;ప్రయతః = పరిశుద్ధుండై; ప్రజాపతిం=బ్రహ్మదేవుని;సమీక్ష్య (అధ్యాహృతము)= చూచి; మహేంద్రో యథా= దేవేంద్రుండువలె; కృతాంజలిః=చేయఁబడిన చేమోడ్పుగలవాఁడు;అభవత్ (అధ్యాహృతము)= ఆయెను.

మహాపరాక్రమశాలియగుభరతుండు, అట్లు, రాముని సమీపంబునంగూర్చుండి,తపస్విवేషంబుననుమహాకాంతిం దేజరిల్లుచున్న రామునిదివ్యరూపంబుఁ జూడగని,యతనియెదుట బ్రహ్మదేవునియెదుట దేవేంద్రుండుంబోలెఁ, జేమోడ్పు గీలించియుండెను.

అని, తాత్పర్యము.

కి మేష వాక్యం భరతోద్య రాఘవం
ప్రణమ్య సత్కృత్యచ సాధు వక్ష్యతి
ఇతీవ తస్యార్యజనస్య తత్వతో
బభూవ కౌతూహల ముత్తమం తదా. ౩౧

టీక॥"ఏషః=ఈ; భరతః=భరతుఁడు; అద్య=ఇప్పుడు; రాఘవం = రామునిని; ప్రణమ్య=నమస్కరించి;సత్కృత్యచ=పూజించి; సాధు= లెస్సఁగా;

కిం=ఏమాటను; వక్ష్యతి = చెప్పఁగల డు?" ఇతీవ=అని; తదా= అప్పుడు; త స్య= ఆ; ఆర్యజనస్య=పూజ్యజనము నకు; తత్త్వతః = యాథార్థ్యముచే త; ఉత్తమం=శ్రేష్ఠమయిన; కౌతూ హలం=కౌతుకము; బభూవ=కలిగినది

"ఇంకనీభరతుండు, రామునకునమ స్కారంబుగావించి, సత్కారపూర్వ కంబుగా; నేమిచెప్పును?" అని, యుప్పు డచ్చటనున్న జనులకందఱకుఁగౌతుకం బుగలిగియుండినది అని, తాత్పర్యము.

స రాఘవ స్సత్యధృతి శ్చ లక్ష్మణో
మహానుభావో భరతశ్చ ధార్మికః
వృతా స్సుహృద్భి శ్చ విరేజు రధ్వరే
యథా సదస్యై స్సహితా స్త్రయో గ్నయః. ౩౨

టీక॥ సత్యధృతిః= సత్యమయినధై ర్యముగల; సః=ఆ; రాఘవశ్చ= రా ముఁడును; మహానుభావః=అధికమయి నప్రభావముగల; లక్ష్మణః=లక్ష్మణు డు; ధార్మికః=ధర్మమునాచరించు నట్టి; భరతశ్చ=భరతుఁడును; సుహృ ద్భిః=స్నేహితులచేత; వృతాశ్చ=చు ట్టఁబడినవారలునై; అధ్వరే = యాగ మునందు; సదస్యైః= సభికులతో; సహి తాః=కూడిన; త్రయః = మూడైన; అ గ్నయఇవ= అగ్నిహోత్రములువలె; విరేజిరే=ప్రకాశించిరి.

సత్యమయినధైర్యముగల రాముండు ను, మహానుభావుండగులక్ష్మణుండును, ధార్మికుండగుభరతుండును, వీరుము వ్వురును స్నేహితులఁగూడినవారలయి యాగంబునసదస్యులతోఁగూడినత్రేతా గ్నులుంబోలె, నెంతయుంబ్రకాశించిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, చతురుత్తరశతతమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండచతురుత్తరశతతమసర్గటీక, ముగిసినది.

శ్రీ

## పంచోత్తరశతతమసర్గప్రారంభః.

తతః పురుషసింహానాం వృతానాం తైస్సుహృద్గణైః
శోచతామేవ రజనీ దుఃఖేన వ్యతివర్తత. ౧

టీక॥ తతః=అటుపిమ్మట; తైః=ఆ; సుహృద్గణైః=స్నేహితసమూహములచేత; వృతానాం=చుట్టఁబడిన; పురుషసింహానాం=పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణభరతులు; శోచతామేవ= దుఃఖించుచుండఁగానే; దుఃఖేన= దుఃఖముచేత; రజనీ= రాత్రి; వ్యతివర్తత=కడచినది

అట్లు, పురుషశ్రేష్ఠులగు నా రామలక్ష్మణభరతులు, స్నేహితులతోడంగూడి, దుఃఖించుచుండఁగానే, యారాత్రి, గడచినది. అని, తాత్పర్యము.

రజన్యాం సుప్రభాతాయాం భ్రాతరస్తే సుహృద్వృతాః
మందాకిన్యాం హుతం జప్యం కృత్వా రామ ముపాగమన్. ౨

టీక॥ రజన్యాం=రాత్రి; సుప్రభాతాయాం = చక్కఁగాఁ దెల్లవాఱఁగానే; తే=ఆ; భ్రాతరః=తోఁబుట్టువులు; సుహృద్వృతాః=స్నేహితులచేఁజుట్టఁబడినవారలయి; మందాకిన్యాం=మందాకినియందు; హుతం=హోమమును; జప్యం=జపమును; కృత్వా= చేసి; రామం=రాముని; ఉపాగమన్=పొందిరి.

అంత, రాత్రిగడచి, సూర్యోదయంబయినపిమ్మట, ఆతోఁబుట్టువులు, వారలస్నేహితులును, మందాకినీనదియందు, వారలు ప్రాతఃకాల జపహోమంబులం గావించుకొని, రామునిసమీపంబుఁజేరిరి. అని, తాత్పర్యము.

తూష్ణీం తే సముపాసీనా న కశ్చి త్కించి దబ్రవీత్
భరతస్తు సుహృన్మధ్యే రామం వచన మబ్రవీత్. ౩

టీక॥ తే=వారలు; తూష్ణీం= ఊరక; సముపాసీనాః= కూచుండినియుండిరి, కశ్చిత్ = ఒకానొకండును; కించిత్=ఒకానొకమాటను; నాబ్రవీత్= చెప్పఁడయ్యె; భరతస్తు= భరతుండు మాత్రము; సుహృన్మధ్యే=స్నేహితులనడుమ; రామం=రామునిగూర్చి; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అప్పుడు వారలందఱు, ఊరక కూచుండియుండిరి, ఒకఁడను ఒకమాటనైనను చెప్పఁడయ్యె, అంతభరతుండుమాత్రము సుహృన్మధ్యంబునం రామునుం జూచియీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము-

సాంత్వితా మామికా మాతా దత్తం రాజ్య మిదం మమ
త ద్దదామి తవైవా హం భుఙ్క్ష్వ రాజ్య మకంటకమ్. ౪

టీక॥ మామికా=నాదైన; మాతా=తల్లి; సాంత్వితా= అనునయింపఁబడినదై; మమ=నాకు; ఇదం= ఈ; రాజ్యం=రాజ్యము; దత్తం=ఇయ్యఁబడినది; తత్=ఆరాజ్యమును; అహం=నేను; తవైవ=నీకే; దదామి=ఇచ్చుచున్నాను; అకంటకం=శత్రువులులేని; రాజ్యం=రాజ్యమును; భుఙ్క్ష్వ=భుజింపుము.

నీవునాతల్లినిగౌరవించినావు, నాకు, యీరాజ్యంబునొసంగితివి, ఇంకనేను ఆరాజ్యమును మఱలనీకేయిచ్చెదను అంగీకరించి, ఏవిధమైన శత్రుబాధయు లేకుండుటవలన, నతిసుఖకరంబగు నీరాజ్యంబునంతయు, యథేచ్ఛమయి ననుభవింపుము. అని, తాత్పర్యము.

మహ తే వాం బువేగేన భిన్న స్సేతు జలాగమే
దురావారం త్వదన్యేన రాజ్యఖండ మిదం మహత్. ౫

టీక॥ జలాగమే=వర్షాకాలమునందు; మహతా=గొప్పదగు; అంబువేగేన=జలవేగముచేత; భిన్నః = తెగిన; సేతురివ=నీటికట్టవలె; ఇదం = ఈ; మ

హత్=గోష్పదగు; రాజ్యఖండం= రాజ్యభాగము; త్వదన్యేన= నీకన్ననితరుని చేత; దురావారం = ఆవరింపనలవికాదు.

వర్షాకాలంబున మహాజలవేగముచేఁ దెగిననీటికట్టంగట్టుటకు నెవరికియు నలవికాదుగదా, అట్లుయీగోష్పరాజ్యమును వహించుట మిక్కిలియుకష్టము, అందుకునీవుతక్క మఱియెవ్వండును సమర్థుండుకాఁడు.

అని, తాత్పర్యము.

గతిం ఖరఇవా శ్వస్య తార్క్ష్యస్యే వపతత్రిణః
అనుగంతుం న శక్తి ర్మే గతిం తవ మహీపతే. ౬

టీక॥మహీపతే=భూమికిఁబ్రభుండవగు రాముఁడా! అశ్వస్య=గుఱ్ఱముయొక్క; గతిం=గమనమును; అనుగంతుం= అనుసరించుటకు; ఖరఇవ(ఖరస్యేవ)= గాడిదెకుంబోలె; తార్క్ష్యస్య = గరుత్మంతునియొక్క; గతిం (అధ్యాహృతము)=గమనమును; అనుగంతుం(అధ్యాహృతము)=అనుసరించుటకు; పతత్రిణఇవ=సాధారణపక్షికింబోలె; తవ= నీయొక్క; గతిం = గమనమును; అనుగంతుం(అధ్యాహృతము)= అనుసరించుటకు; మే=నాకు; శక్తిః = సామర్థ్యము; న=లేదు.

భూనాయకుండగు రాముఁడా! గుఱ్ఱమువలె, గాడిదె, నడువంజాలదు, సాధారణపక్షిగరుత్మంతుఁడుంబోలె, నాకాశంబుననెగురంజాలదు, అట్లు, నీగమనమున ననుసరించుటకు నాకుశక్తిలేదు.

అని, తాత్పర్యము.

సుజీవం నిత్యశ స్తస్య యః పరై రుపజీవ్యతే
రామ తేనతు దుర్జీవం యః పరా నుపజీవతి. ౭

టీక॥రామ=రాముఁడా! యః=ఎవ్వఁడు; నిత్యశః=ఎల్లప్పుడును; పరైః= ఇతరులచేత; ఉపజీవ్యతే=జీవనార్థమైయాశ్రయింపఁబడుచున్నాఁడో; తస్య=అతనిది; సుజీవం=మంచిబ్రతుకు; యః=ఎవ్వఁడు; పరాన్=ఇతరులను; ఉపజీవతి=ఆశ్రయించిజీవించుచున్నాఁడో; తేనతు = అతనిచేతమాత్రము; దుర్జీవం=చెడ్డబ్రతుకు; క్రియతే=(అధ్యాహృతము) చేయఁబడుచున్నది.

రాముఁడా! ఎవ్వనిచేత పెక్కు జనులు జీవించుచున్నారో, అతని బ్రతుకు మంచిది, ఇతరుల నాశ్రయించి జీవించువాని బ్రతుకు మాత్రము మిక్కిలియు నీచమయినది. అని, తాత్పర్యము.

యథాతు రోపితో వృక్షః పురుషేణ వివర్ధితః
హ్రస్వకేణ దురారోహో రూఢస్కంధో మహాద్రుమః. ౮
స యథా పుష్పితో భూత్వా ఫలాని నవిదర్శయేత్
సతాం నానుభవే త్ప్రీతిం యస్య హేతోః ప్రరోపితః. ౯
ఏషోపమా మహాబాహో తమర్థం వేత్తు మర్హసి
యదిత్వ మస్మా న్వృషభో భర్తా భృత్యా న్నశాధి హి. ౧౦

టీక॥ మహాబాహో= పెద్ద చేతులు గల రాముఁడా! యథాతు=ఎట్లు; పురుషేణ=పురుషుని చేత; రోపితః = నాటఁబడినదియు; వివర్ధితః= వృద్ధిఁబొందింపఁబడినదియు నగు; యః(అధ్యాహృతము)=ఏ; వృక్షః=చెట్టు ; హ్రస్వకేణ=పొట్టివాని చేత; దురారోహః= ఎక్కుటకలవిగానిదై; రూఢస్కంధః= పెరిఁగినబోదెకలదై; మహాద్రుమః= పెద్దవృక్షము; జాతః=అయినదో; సః= ఆవృక్షము; యథా = ఎట్లు; పుష్పితః= పూచినది; భూత్వా=అయి; ఫలాని= పండ్లను; నవిదర్శయేత్= చూపదో; యస్య హేతోః=దేనినిమిత్తమై; ప్రరోపితః=నాఁటఁబడినదో; తాం = ఆ; ప్రీతిం=సంతోషమును; నానుభవేత్= అనుభవింపఁడో; ఏషా=ఇది; ఉపమా=ఉదాహరణము; ఋషభః=శ్రేష్ఠుండవునగు; భర్తా=ప్రభుండవునగు; త్వం=నీవు; భృత్యాన్ = పోషింపఁదగిన; అస్మాన్=మమ్ములను; నశాధియది= పాలింపవేని ("హి" అనునది పాదపూరణార్థము.); తం=ఆ; అర్థం=అభిప్రాయమును; వేత్తుం = ఎఱుంగుటకు; అర్హసి=తగుదువు.

మహాబాహుండవగు రాముఁడా! ఒకానొక పురుషుండు వి త్తనము నాటినీళ్లుపోసి పెంచి కష్టపడఁగా నావృక్షము, కొంతకాలమునకు పొట్టివాండ్రికారోహింపనశక్యమగునట్లు మహాస్కంధాదులతోఁగూడి పెద్దవృక్షమె కాలంబునఁ బుష్పించిఫలంబులొసంగకుండునేని దా




నినాటినవానికభీష్టసిద్ధి గాక దానికిఁజేసి నకష్టంబంతయువ్యర్థంబగునుగదా! ఇది యుపమానము, అట్లు, అధికుండవయ్యు మాకుభర్తవయ్యు, నీవుపట్టాభిషేకంబం గీకరించి భృత్యులమగుమమ్ముం బాలింపవేని, ఆవృక్షమును బెంచినవానికష్టము వ్యర్థమైనట్లు, నీవలన రాజ్యపాలనాదులగునని కోరినిన్ను జిన్ననాటనుండి యెంతోకష్టంబునంబెంచిననీతండ్రిదశరథునిపాటంతయు వ్యర్థమగునని యెఱుంగుము. అని, తాత్పర్యము.

శ్రేణయ స్త్వాం మహారాజ పశ్యంత్వ గ్ర్యాశ్చ సర్వశః
ప్రతపంతమివా దిత్యం రాజ్యే స్థిత మరిందమమ్. ౧౧

టీక॥ మహారాజ=మహారాజుండవగురాముఁడా! అగ్ర్యాః=ప్రధానులగు; శ్రేణయః= పౌరశ్రేణులు; సర్వశశ్చ= అందఱును; రాజ్యే= రాజ్యమునందు; స్థితం=ఉన్నవాఁడవును; ప్రతపంతం= తపింపఁజేయుచున్న; ఆదిత్యమివ (స్థితం)=సూర్యునివలెనున్నవాఁడవునగు; అరిందమం=శత్రువులనడఁగఁదొక్కినట్టి; త్వాం=నిన్ను; పశ్యంతు= చూతురుగాక.

మహారాజుండవగురాముఁడా! శత్రువులనడంగఁద్రొక్కఁజాలిననీవు రాజ్యంబునఁబట్టాభిషిక్తుండవయి, సూర్యుండుంబోలె వెలుంగుచుండఁగాఁబౌరులు, దనివిదీఱ, నిన్నుఁజూచిసంతసింపంగలరు. అని, తాత్పర్యము.

తవా నుయానే కాకుత్స్థ మత్తా నదంతు కుంజరాః
అంతఃపురగతా నార్యో నందంతు సుసమాహితాః. ౧౨

టీక॥ కాకుత్స్థ=రాముఁడా! తవ= నీయొక్క; అనుయానే=వెంబడించుటయందు; మత్తాః=మదించిన; కుంజరాః=ఏనుంగులు; నదంతు=అఱచునవియగుగాక. అంతఃపురగతాః=అంతఃపురంబునొందిన; నార్యః=స్త్రీలు; సుసమాహితాః=మనస్సమాధానముగలవారలయి; నందంతు= సంతోషింతురుగాక.

రాముఁడా, మదపుటేనుంగులు, నీవెంబడివచ్చుచు; సంతోషంబున, గర్జించుచుండునుగాక. మఱియునం




తఃపురస్త్రీలందఱును, దుఃఖంబును విడిచి,సంతోషింతురుగాక. అని, తాత్పర్యము.

తస్య సాధ్విత్య మన్యంత నాగరా వివిధాజనాః
భరతస్య వచ శ్శ్రుత్వా రామం ప్రత్యనుయాచతః. ౧౩

టీక॥ వివిధాః=నానావిధములయిన; నాగరాః=పట్టణమునందునట్టి;జనాః=జనులు; రామం= రాముని; ప్రత్యనుయాచతః=ప్రార్థించుచున్న; తస్య=ఆ; భరతస్య=భరతునియొక్క; వచః=మాటను; శ్రుత్వా= విని; సాధ్వితి=మంచిదని ; అమన్యంత = తలంచిరి.

నానావిధులగుపౌరజనులందఱు,అట్లురామునింబ్రార్థించుచున్నభరతుని మాటనువిని, సాధువాదంబులం బ్రశంసించిరి.అని, తాత్పర్యము.

తమేవం దుఃఖితం ప్రేక్ష్య విలపంతం యశస్వినమ్
రామః కృతాత్మా భరతం సమాశ్వాసయ దాత్మవాన్. ౧౪

టీక॥కృతాత్మా=శిక్షితమయినబుద్ధి గలవాఁడును;ఆత్మవాన్= అధికమయినధైర్యముగలవాఁడునగు;రామః= రాముఁడు;ఏవం=ఇట్లు;దుఃఖితం=దుఃఖంబునొందినవాఁడును; విలపంతం=రోదనము సేయుచున్నవాఁడును; యశస్వినం=అధికమయినకీర్తిగలవాఁడునగు; తం=ఆ;భరతం=భరతుని; సమాశ్వాసయత్=ఊఱడించెను.

బుద్ధిమంతుండును ధైర్యవంతుండునగురాముండు, అట్లుతనప్రార్థననంగీకరింపకుండుటవలన దుఃఖితుండై రోదనంబు సేయుచున్నకీర్తిమంతుండగుభరతుంజూచి, యిట్లని,యాశ్వాసించెను. అని, తాత్పర్యము.

నాత్మనః కామకారోఽస్తి పురుషోఽయ మనీశ్వరః
ఇతశ్చేతరత శ్చైనం కృతాంతః పరికర్షతి. ౧౫

టీక॥ ఆత్మనః = మనకు; కామకారోపి = ఇచ్ఛికవ్యాపారము; నాస్తి = లేదు. అయం = ఈ; పురుషః = పురుషుఁడు; అనీశ్వరః = అస్వతంత్రుండు. కృతాంతః = దైవము; ఇతశ్చ = ఈతట్టునను; ఇతరతశ్చ = మఱియొకతట్టునను; ఏనం = ఈపురుషుని; పరికర్షతి = ఈడ్చుచున్నది.

పురుషుండు, స్వతంత్రుండు కాఁడు కావున, యిచ్ఛచొప్పుననడచుటకు లేదు; పురుషుని, దైవము, ఇటు, అటు, ఆకర్షించుచున్నది. అని, తాత్పర్యము.

సర్వే క్షయాంతా నిచయాః పతనాంతా స్సముచ్ఛ్రియాః
సంయోగా విప్రయోగాంతా మరణాంతంచ జీవితమ్. ౧౬

టీక॥ సర్వే = సమస్తములయిన; నిచయాః = ధనసంచయములు; క్షయాంతాః = నాశముతుదయందుఁగలవి. సముచ్ఛ్రియాః = ఔన్నత్యములు; పతనాంతాః = పడుటయంతమునందుఁగలవి. సంయోగాః = సంబంధములు; విప్రయోగాంతాః = విరహముఅంతమునందుఁగలవి. జీవితంచ = బ్రతుకును; మరణాంతం = మరణముఅంతమునందుఁగలది.

ధనసంచయములు, ఎంతగూర్చినను, ఎట్లయినను తుదకునాశముఁ బొందక మానదు; ఉన్నతస్థానమును బొందినవారలు, పతనమును బొందవలసినదే కానివేఱుఁగాదు; భార్యాపుత్రమిత్రాదులసంబంధము, ఎంతకాలమునకుఁగాని విరహమునొందింపక మానదు; అట్లు, జననమునొందినవాఁడు, అవశ్యము మరణమునొందును. అని, తాత్పర్యము.

యథా ఫలానాం పక్వానాం నాన్యత్ర పతనా ద్భయమ్
ఏవం నరస్య జాతస్య నాన్యత్ర మరణా ద్భయమ్. ౧౭

టీక॥ యథా = ఎట్లు; పక్వానాం = పండిన; ఫలానాం = పండ్లకు; పతనాత్ = పడుటకన్న; అన్యత్ర = మఱియొకదానివలన; భయం = భయము; న = లేదు; ఏవం = ఇట్లు; జాతస్య = పుట్టిన; నరస్య = మనుష్యునకు; మరణాత్ = చావుకన్న; అన్యత్ర = మఱియొకదానివలన; భయం = భయము; న = లేదు.

చక్కఁగఁబండినఫలమునకు, చెట్టుననుండి తునిసిపడుటకన్న వేఱుభయము

లేనట్లు,జననము నొందినవానికి మరణంబు నొందుట కన్న వేఱుభయము లేదు. అని, తాత్పర్యము.

యథా గారం దృఢస్థూణం జీర్ణం భూత్వా వసీదతి
తథైవ సీదంతి నరా జరామృత్యువశం గతాః. ౧౮

టీక॥యథా=ఎట్లు; దృఢస్థూణం=దృఢములయిన స్తంభములుగల; అగారం=ఇల్లు; జీర్ణం = జీర్ణించినది; భూత్వా=అయి; అవసీదతి=నశించునో; తథైవ=అట్లే;నరాః= మనుష్యులు;జరామృత్యువశంగతాః = ముసలితనముయొక్కయు మృత్యువుయొక్కయునధీనతనుబొందిన వారలయి ; సీదంతి=నశించుచున్నారు.

దృఢస్తంభంబులుగలగృహంబు ,జీర్ణమయినశించునట్లు,మనుష్యులును,జరామృత్యు వశంగతులయి , నాశము నొందుదురు. అని, తాత్పర్యము.

అత్యేతి రజనీ యాతు సా నప్రతినివర్తతే
యాత్యేవ యమునా పూర్ణా సముద్ర ముదకాకులమ్. ౧౯

టీక॥యా=ఏ; రజనీతు = రాత్రిమాత్రము;అత్యేతి= అతిక్రమించిపోవుచున్నదో; సా=ఆరాత్రి ; నప్రతినివర్తతే=మఱలరాదు. పూర్ణా= నిండిన;యమునా=యమునానది ; ఉదకాకులం=నీళ్లతోనిండిన;సముద్రం=సముద్రమును; యాత్యేవ = పొందుచునేయున్నది.

గడచినరాత్రిమఱల నెంతమాత్రము రాదు; ఏటిప్రవాహముసముద్రమునుబొందు, మఱలరాదుగదా!

అని, తాత్పర్యము.

అహోరాత్రాణి గచ్ఛంతి సర్వేషాం ప్రాణినా మిహ
ఆయూంషి క్షపయంత్యాశు గ్రీష్మే జల మివాంశవః. ౨౦

టీక॥ఇహ = ఈలోకమునందు;గచ్ఛంతి=పోవుచున్న ; అహోరాత్రా

ణి=పవలును రాత్రులును; ప్రాణినాం= జంతువుల యొక్క; ఆయూంషి = ఆయుస్సులను; గ్రీష్మే=గ్రీష్మర్తువునందు; అంశవః=సూర్యునికిరణములు; జలమివ=జలమునువలె; శుపయంతి=నశింపఁ జేయుచున్నవి.

వేసంగికాలంబున, సూర్యునికిరణంబులు, జలమును, బీల్చునట్లు, గడచిపోవునట్టియహోరాత్రములు, ప్రాణుల యాయుస్సును, నశింపఁజేయుచున్నవి.

అని, తాత్పర్యము.

ఆత్మాన మనుశోచ త్వం కిమన్య మనుశోచసి
ఆయుస్తే హీయతే యస్య స్థితస్యచ గతస్యచ. ౨౧

టీక॥స్థితస్యచ= నిలుచున్నవాఁడవును; గతస్యచ = పోయినవాఁడవునగు; యస్య=ఏ; తే=నీయొక్క; ఆయుః=ఆయుస్సు; హీయతే=తగ్గుచున్నదో; సః (అధ్యాహృతము)=అట్టి; త్వం=నీవు; ఆత్మానం= నిన్నుఁగూర్చి; అనుశోచ= దుఃఖించుకొనుము. కిం=ఎందువలన; అన్యం=ఇతరునిగూర్చి; అనుశోచసి= దుఃఖించుచున్నావు?

నీవు లేచినను వంగినను నీయాయుస్సు క్షీణించుచున్నదే! నిన్నుఁజూచియే నీవు దుఃఖించుకొనుము; నీగతి యెట్లుండ, నితరులఁజూచి దుఃఖించెద వేల.

అని, తాత్పర్యము.

సహైవ మృత్యు ర్వ్రజతి సహమృత్యు ర్నిషీదతి
గత్వా సుదీర్ఘ మధ్వానం సహమృత్యు ర్నివర్తతే. ౨౨

టీక॥మృత్యుః = మృత్యువు; సహైవ=కూడనె; వ్రజతి=పోవుచున్నది. సహమృత్యుః=మృత్యువుతోఁగూడినవాఁడై; నిషీదతి= కూర్చుండుచున్నది. సహమృత్యుః=మృత్యువుతోఁగూడినవాఁడై; సుదీర్ఘం=మిక్కిలియయుదూరమయిన; అధ్వానం = మార్గమును; గత్వా= పొంది; నివర్తతే=మఱలుచున్నాఁడు.

మనుష్యుఁడు, పోవునప్పుడు, మృత్యువునుగూడ నేపోవుచున్నది; కూర్చుండునప్పుడుకూడ నెకూర్చుండును; అట్టి, మనుష్యుఁడు బహుదూరముపోయివచ్చినను, మృత్యువుకూడ నే పోయివచ్చును; కావున, మృత్యువునుదప్పించుకొననలవి

గాదు. అని, తాత్పర్యము.

గాత్రేషు వలయః ప్రాప్తా శ్శ్వేతాశ్చైవ శిరోరుహాః
జరయా పురుషో జీర్ణః కింహి కృత్వా ప్రభావయేత్. ౨౩

టీక॥ గాత్రేషు=అవయవములయందు; వలయః=మడతలు; ప్రాప్తాః = కలిగినవి. శిరోరుహాశ్చైవ = తలవెండ్రుకలును; శ్వేతాః=తెల్లనివి; ఆసన్ (అధ్యాహృతము)=అయినవి. పురుషః=పురుషుఁడు; జరయా= ముసలితనముచేత; జీర్ణః=జీర్ణించినవాఁడై; కింహి=దేనిని; కృత్వా = చేసి; ప్రభావయేత్ =సమర్థుఁనిం జేసికొనును?

దేహమంతయును మడతలు పడినవి; వెండ్రుకలన్నియుఁ దెల్లనైనవి; ఇట్లు ముసలితనముఁ నొంది పరవశుఁడైనపిమ్మట, పురుషుఁడేమి యుపాయము చేయఁగలండు? కావున, యౌవనముననె యాత్మవిచారము చేయవలసినది.

అని, తాత్పర్యము.

నందంత్యుదిత ఆదిత్యే నందంత్యస్తమితే రవౌ
ఆత్మనోనావబుధ్యంతే మనుష్యా జీవితక్షయమ్. ౨౪

టీక॥ మనుష్యాః=మనుష్యులు; ఆదిత్యే=సూర్యుఁడు; ఉదితే=ఉదయించినవాఁడు కాఁగా; నందంతి= సంతోషించుచున్నారు. రవౌ=సూర్యుఁడు; అస్తమితే=అస్తమయమునొందఁగా; నందంతి=సంతోషించుచున్నారు; ఆత్మనః=తనయొక్క; జీవితక్షయం = ఆయుస్సుయొక్క నాశమును; నావబుధ్యంతే=ఎఱుంగరు.

మనుష్యులు, సూర్యుండుదయింపఁగానే, యర్థార్జన సమయము వచ్చినదిగదాయని సంతోషమునొందెదరు; సూర్యుండస్తమించినప్పుడు కామోపభోగకాలము వచ్చినదిగదా యని సంతోషించెదరు; ఎవ్వరును, అట్లు సూర్యోదయాస్తమయముల చేఁదమ యాయుస్సు నశించుచున్నదని యెఱుంగరు.

అని, తాత్పర్యము.

హృష్యంత్యృతుముఖం దృష్ట్వా నవం నవ మిహాగతమ్
ఋతూనాం పరివ_ర్తేన ప్రాణినాం ప్రాణసంక్షయః. ౨౫

టీక॥ఇహ=ఇచ్చట; మనుష్యాః = మనుష్యులు; నవంనవం=క్రొ_త్తక్రొ_త్తగా; ఆగతం=వచ్చిన;ఋతుముఖం = ఋతువుయొక్క యారంభమును; దృష్ట్వా=చూచి;హృష్యంతి = సంతోషించుచున్నారు. ఋతూనాం = ఋతువులయొక్క; పరివర్తేన= తిరుగుడుచేత; ప్రాణినాం = జంతువులకు ; ప్రాణసంక్షయః=ప్రాణనాశము; భవతి(అధ్యాహృతము)=అగుచున్నది.

ఋతువులు, అతిక్రమింపనతిక్రమింపఁ , ప్రాణులకు , ఆయుస్సునశించుచున్నది; ఇది దెలియక, ఒకఋతువుపోయిక్రొ_త్తక్రొ_త్త ఋతువువచ్చినప్పడంతయుఁదుఃఖించుటనుమాని, సంతోషంబునొందుచున్నారు.

అని, తాత్పర్యము.

యథా కాష్ఠంచ కాష్ఠంచ సమేయాతాం మహార్ణవే
సమేత్యచ వ్యపేయాతాం కాల మాసాద్య కంచన. ౨౬
ఏవం భార్యాశ్చ పుత్రాశ్చ జ్ఞాతయశ్చ ధనానిచ
సమేత్య వ్యవధావంతి ధ్రువో హ్యేషాం వినాభవః ౨౭

టీక॥ యథా = ఎట్లు; మహార్ణవే=మహాసముద్రమునందు; కాష్ఠంచ=కొయ్యయు; కాష్ఠంచ=కొయ్యయు ; సమేయాతాం=కూడుకొనునో; సమేత్య=కూడియు; కంచన=ఒకానొక ; కాలం=కాలమును; ఆసాద్య=పొంది; వ్యపేయాతాం=విడివడునో; ఏవం=ఇట్లు; భార్యాశ్చ = భార్యలును; పుత్రాశ్చ=కొడుకులును; జ్ఞాతయశ్చ = బంధువులును; ధనానిచ=ధనములును; సమేత్య=ఒకటిగాఁజేరి ; వ్యవధావంతి=విడివడుచున్నవి. ఏషాం=వీరలకు; వినాభవః=విడివడుట; ధ్రువోహి=స్థిరముగదా!

మహాసముద్రంబున, రెండుకొయ్యలు, వకటినొకటిచేరియు, కొంతకాలమునకు, విడివడునట్లు, భార్యలునుపుత్రులునుబంధువులును, ధనాదులును, అందఱును, కొంతకాలము, ఒకరితోనొకరుసంబంధించి;యటుపిమ్మట, విడి

వడుదురు; వీరలకు, సంబంధములేకుండుటనిత్యముగాని, సంబంధమెంతమాత్రమునిత్యముగాదు. అని, తాత్పర్యము.

నాత్ర కశ్చిద్యథా భావం ప్రాణీ సమభివర్తతే
తేన తస్మిన్న సామర్థ్యం ప్రేతస్యాస్త్యనుశోచతః. ౨౮

టీక॥ అత్ర = ఈలోకమునందు; ప్రాణీ=జంతువు; కశ్చిత్=ఒకానొకటియును; యథాభావం = యథేచ్ఛగా ; సమభివర్తతే= నడవఁజాలదు. తేన=అందుచేత; ప్రేతస్య(హేతౌ)=మృతిఁబొందినవానినిమిత్తమయి; అనుశోచతః=దుఃఖించువానికి; తస్మిన్ = దానివిషయమయి; సామర్థ్యం = శక్తి; నాస్తి=లేదు.

ఈలోకంబున, నేప్రాణియుఁ, దనయిచ్చచొప్పుననడచుకొనుటకు శక్తుఁడుకాఁడు, కావున, మృతిబొందినవానింగుఱించి యెంతదుఃఖించినను, వానిమఱలబ్రతికింపనలవిగాదు.

అని, తాత్పర్యము.

యథాహి సార్థం గచ్ఛంతం బ్రూయాత్కశ్చిత్పథి స్థితః
అహమప్యాగమిష్యామి పృష్ఠతో భవతా మితి. ౨౯
ఏవం పూర్వైర్గతో మార్గః పితృపైతామహో ధ్రువః

టీక॥ యథాహి= ఎట్లు; గచ్ఛంతం=పోవుచున్న; సార్థం= బాటసారులసమూహమునుగూర్చి ; పథి = మార్గమునందు; స్థితః=ఉన్నట్టి; కశ్చిత్ = ఒకానొకపురుషుండు; "భవతాం=మీయొక్క; పృష్ఠతః=వెనుకను; అహమపి=నేనును; ఆగమిష్యామి = వచ్చెదను. ఇతి=అని; బ్రూయాత్=చెప్పునో; ఏవం=ఇట్లు; పూర్వైః = మునుపటివారలచేత; గతః= పొందఁబడిన; పితృపైతామహః=తండ్రితాతలవలనవచ్చిన; మార్గః = మార్గము; ధ్రువః=నిశ్చితము.

దారింబోవుచున్న బాటసారులగుంపుంజూచి, పయినమయిదారిలోనున్నవాఁడు, "నేనునుమీవెంబడివచ్చెదను" అనిచెప్పి , వారలవెంబండించిపోవునట్లు , ఇంతకుమున్నుపూర్వికులచేనవ

లంబింపఁబడి తండ్రితాతలనాఁటనుండి వచ్చిన మార్గమునే యనుసరింపవలెను; దానినెంతమాత్రమువిడువరాదు.

అని, తాత్పర్యము.

త మాపన్నః కథం శోచే ద్యస్య నాస్తి వ్యతిక్రమః. ౩౦

టీక॥యస్య=ఏనికి;వ్యతిక్రమః= తిరుగు;నాస్తి=లేదో;తం = అట్టిపెద్దల మార్గమును;ఆపన్నః= పొందినవాఁడు;కథం=ఎట్లు;శోచేత్=దుఃఖించును.

అట్టితిరుగులేని పూర్వికులమార్గమునను సరించియేల దుఃఖింపవలెను?

అని, తాత్పర్యము.

వయసః పతమానస్య స్రోతసో వా నివర్తినః
ఆత్మా సుఖే నియోక్తవ్య స్సుఖభాజః ప్రజా స్స్మృతాః. ౩౧

టీక॥అనివర్తినః=మఱలనట్టి;స్రోతసోవా=ప్రవాహమువలె;వయసః=ఆయుస్సు;పతమానస్య = అతిక్రమించుచుండఁగా;ఆత్మా=మనస్సు; సుఖే=సుఖమునందు, సుఖహేతువగుధర్మమునందనుట;నియోక్తవ్యః= నియోగింపఁబడవలయును. సుఖభాజః=సుఖమునుబొందువారలు, సుఖహేతువగుధర్మమును బొందువారలనుట ; ప్రజాః=జనులు; స్మృతాః=చెప్పఁబడినారు.

ప్రవాహమువలె,వయస్సుతిరుగులేకగడచిపోవుచుండునుగావునఁ,బరలోకసుఖహేతువగుధర్మంబు నాచరించుచుండవలయును; అట్లుధర్మాచరణమునే సెయువారలేమనుష్యులనంబడుదురు,తక్కినవారలుమృగములు. అని, తాత్పర్యము.

ధర్మాత్మా సశుభైః కృత్స్నైః క్రతుభి శ్చాప్తదక్షిణైః
స్వర్గం దశరథః ప్రాప్తః పితా నః పృథివీపతిః. ౩౨

టీక॥ధర్మాత్మా= ధర్మస్వభావుండును; పృథివీపతిః= భూమికిఁబ్రభువునగు; నః=మనయొక్క; పితా= తండ్రియయిన; సః=ఆ;దశరథః= దశరథుఁడు;సశుభైః= మంగళకరములగు; ఆప్తదక్షిణైః = సరియయినదక్షిణలుగల; కృత్స్నైః= సమస్తములయిన;క్రతుభిశ్చ=యాగములచేతను;స్వ

ర్గం=స్వర్గమును; ప్రాప్తః= పొం
దినాఁడు.

ధర్మాత్ముండగుమనతండ్రి దశర
థమహారాజు, సమస్తక్రతువులును, సంపూర్ణదక్షిణలతోఁగావించి, యా పరమపుణ్యంబుచే, స్వర్గంబునొంది నాఁడు. అని, తాత్పర్యము.

భృత్యానాం భరణాత్సమ్య క్ప్రజానాం పరిపాలనాత్
అర్థాదానాచ్చ ధర్మేణ పితా న స్త్రిదివం గతః. ౩౩

టీక॥నః=మనయొక్క;పితా= తండ్రి; భృత్యానాం=భృత్యులయొక్క; భరణాత్=పోషించుటవలనను; సమ్యక్=చక్కఁగా; ప్రజానాం = జనులయొక్క; పరిపాలనాత్= పాలించుటవలనను; అర్థాదానాచ్చ= ధనమునొసంగుటవలనను; ధర్మేణ=ధర్మముచేతను; త్రిదివం=స్వర్గమును; గతః=పొందినాఁడు.

మనతండ్రి దశరథమహారాజు, చక్కఁగా భృత్యులఁ బోషించుటవలనను ప్రజలం బాలించుటవలనను, ధనంబునొసంగుటవలనను, ధర్మంబునఁబన్ను దీసికొనుటవలనను, స్వర్గంబునొందెను.అని, తాత్పర్యము.

కర్మభిస్తు శుభై రిష్టైః క్రతుభిశ్చాప్తదక్షిణైః
స్వర్గం దశరథః ప్రాప్తః పితానః పృథివీపతిః. ౩౪

టీక॥నః=మనయొక్క; పితా=తండ్రియగు; పృథివీపతిః=భూమికిఁబ్రభువైన;దశరథః=దశరథమహారాజు; శుభైః=మంగళకరములగు; కర్మభిస్తు=కర్మములచేతను; ఇష్టైః=యజింపఁబడిన;ఆప్తదక్షిణైః=సరియయినదక్షిణలుగలవియునగు; క్రతుభిశ్చ= యాగములచేతను;స్వర్గం= స్వర్గమును ప్రాప్తః=పొందినాఁడు.

మనతండ్రి దశరథమహారాజు, నానావిధసత్కర్మములు గావించియు సంపూర్ణదక్షిణలతోయాగంబులుచేసియు,స్వర్గంబునొందెను.

అని, తాత్పర్యము.

ఇష్ట్వా బహువిధై ర్యజ్ఞై ర్భోగాంశ్చా వాప్య పుష్కలాన్
ఉత్తమం చాయురాసాద్య స్వర్గతః పృథివీపతిః. ౩౫

టీక॥ పృథివీపతిః= భూమికిఁబ్రభువైనదశరథుఁడు; బహువిధైః= పెక్కువిధములయిన; యజ్ఞైః= యాగముల చేత; ఇష్ట్వా= దేవతలఁబూజించి; పుష్కలాన్= అధికములయిన; భోగాంశ్చ=భోగంబులను; అవాప్య=పొంది; ఉత్తమం = మిక్కిలియనధికమయిన; ఆయుశ్చ=ఆయుస్సును; ఆసాద్య= పొంది; స్వర్గతః=స్వర్గమునుబొందెను.

దశరథమహారాజు పెక్కుయాగంబులు గావించి, పుష్కలముగాదివ్యభోగంబులననుభవించి, పెద్దకాలముజీవించి, స్వర్గమునొందెను.

అని, తాత్పర్యము.

ఆయురుత్తమ మాసాద్య భోగానపిచ రాఘవః
స న శోచ్యః పితా తాత స్వర్గత స్సత్కృత స్సతామ్. ౩౬

టీక॥ తాత=నాయనా! ఉత్తమం= మిక్కిలియనధికమయిన, ఆయుః= ఆయుస్సును ; భోగానపిచ = భోగములను ; ఆసాద్య = పొంది ; స్వర్గతః = స్వర్గము నొందిన ; సతాం= పెద్దలకు, పెద్దలచేతననుట; సత్కృతః= పూజింపఁబడినట్టి; సః=ఆ; పితా=తండ్రియగు; రాఘవః= దశరథుండు; శోచ్యః =దుఃఖింపఁదగినవాఁడు; న=కాఁడు.

నాయనా! పెద్దకాలముజీవించి, నానావిధదివ్యభోగంబులం బుష్కలంబుగాననుభవించి, సత్పురుషులచేగౌరవింపఁబడి, స్వర్గంబునొందిన, మనతండ్రినిగూర్చి యెంతమాత్రము దుఃఖింపరాదు. అని, తాత్పర్యము.

స జీర్ణం మానుషం దేహం పరిత్యజ్య పితా హి నః
దైవీ మృద్ధి మనుప్రాప్తో బ్రహ్మలోకవిహారిణీమ్. ౩౭

టీక॥ సః=ఆ; నః=మనయొక్క; పితా=తండ్రియగుదశరథమహారాజు; జీర్ణం=శిథిలమయిన; మానుషం = మనుష్యసంబంధియగు ; దేహం =

దేహమును; పరిత్యజ్య=విడిచి; బ్రహ్మలోకవిహారిణీం=బ్రహ్మలోకమునందువిహరించునట్టి; దైవీం=దేవసంబంధియగు; బుద్ధిం=సంపదను; దివ్యదేహమునను:ట; అనుప్రాప్తోహి = పొందినాఁడుగదా!

మనతండ్రిదశరథమహారాజు,జీర్ణమయినమనుష్యదేహమునువిడిచి, దేవదేహమునుబొంది, బ్రహ్మలోకంబునవిహరించుచున్నాఁడుగదా! అతనికిదుఃఖింపనేలః అని, తాత్పర్యము.

తంతు నైవంవిధః కశ్చి త్ప్రాజ్ఞ శ్శోచితు మర్హతి
త్వద్విధో యద్విధ శ్చాపి శ్రుతవాక్ బుద్ధిమ త్తరః. ౯౨

టీక॥శ్రుతవాక్= విద్యావంతుఁడవును;బుద్ధిమత్తరః = మిక్కిలియుబుద్ధిమంతుండవునగు; త్వం (అధ్యాహృతము)చ=నీవును;యద్విధః = ఎట్టివాఁడవు;అసి=అగుచున్నావో; తద్విధః=అట్టి;ఏవంవిధః=ఇట్టి;ప్రాజ్ఞః=పండితుఁడగు;కశ్చిత్=ఒకానొకఁడును;తంతు=అతనిగూర్చిమాత్రము; శోచితుం=దుఃఖించుటకు; నార్హతి=తగఁడు.

నీవు, సమస్తశాస్త్రంబులందెలిసినవాఁడవు;మిక్కిలియుబుద్ధిమంతుండవు;నీయట్టిపండితుండెవ్వఁడును, దశరథమహారాజుంగురించి, యెంతమాత్రము, దుఃఖింపఁడు.అని, తాత్పర్యము.

ఏతే బహువిధా శ్శోకా విలాప రుదితే తథా
వర్జనీయాహి ధర్మేణ సర్వావస్థాసు ధీమతా. ౯౩

టీక॥విలాపరుదితే=ఏడ్పునుకన్నీళ్లువిడుచుటయు;తథా = అట్లు;బహువిధాః=పెక్కువిధములయిన; శోకాః=దుఃఖములు;ధీమతా = బుద్ధిమంతుండగు;ధీరేణ=ధైర్యశాలిచేత;సర్వావస్థాసు= సమస్తావస్థలయందును; వర్జనీయాహి=విడువఁదగినవిగదా!

ఏడ్పుట, కన్నీళ్లువిడుచుట, అట్లుబహువిధదుఃఖంబులను , సమస్తావస్థలయందును, ధీరుండునుబుద్ధిమంతుండునగువాఁడు,విడువవలయును.

అని, తాత్పర్యము.

స స్వస్థో భవ మాశోచే ర్యాత్వా చావస తాం పురీమ్
తథా పిత్రా నియుక్తోసి వశినా వదతాం వర. ౪౦

టీక॥వదతాం= చెప్పువారలలోప ల;వర=శ్రేష్ఠుఁడవగుభరతుఁడా!సః= అట్టి; త్వం(అధ్యాహృతము)= నీవు; స్వస్థః=నెమ్మదిగలవాఁడవు; భవ= అగుము;మాశోచేః= దుఃఖింపకుము. యాత్వాచ=పోయియుః తాం=ఆ; పురీం=అయోధ్యాపట్టణమును; ఆవస= అధిష్ఠింపుము. తథా=అట్లు;వశినా= ఇంద్రియనిగ్రహముగల;పిత్రా= తండ్రి చేత; నియుక్తః=ఆజ్ఞాపింపఁబడినవాఁడవు;అసి=అగుచున్నావు.

మాటలుచెప్పువారలలో శ్రేష్ఠుండ వగుభరతుఁడా ! నీవు నెమ్మదినొంది యుండుము; దుఃఖింపవలదు; పోయి యయోధ్యాపట్టణంబుఁబాలింపుము ; అట్లుజితేంద్రియుండగుమనతండ్రి , నీ కాజ్ఞయొసంగియున్నాఁడు.

అని, తాత్పర్యము.

యత్రాహ మపి తేనైవ నియుక్తః పుణ్యకర్మణా
తత్రైవాహం కరిష్యామి పితురార్యస్య శాసనమ్. ౪౧

టీక॥యత్ర=ఏవిషయమందు;అహ మపి=నేనును; పుణ్యకర్మణా=పవిత్రములయినకార్యములుగల; తేనైవ= ఆ తండ్రిచేతనె;నియుక్తః=ఆజ్ఞాపింపఁబడినానో;తత్రైవ=ఆవిషయమునందె;అహం=నేను; ఆర్యస్య=పూజ్యుండగు; పితుః= తండ్రియొక్క;శాసనం= ఆజ్ఞను; కరిష్యామి=చేసెదను.

పుణ్యకర్ముఁడగు మనతండ్రి దశరథమహారాజు , ఏకార్యమునందు , నన్నాజ్ఞాపించియున్నాఁడో, నేనును, పూజ్యుండగుతండ్రియాజ్ఞను శిరసావహించి, యాకార్యంబుగావించెదను.

అని, తాత్పర్యము.

న మయా శాసనం తస్య త్యక్తుం న్యాయ్య మరిందమ
తత్త్వయాపి సదా మాన్యం సవై బంధు స్సనః పితా. ౪౨

టీక॥అరిందమ = శత్రువులనడఁగఁదొ్రక్కు-నట్టిభరతుఁడా!మయా = నా

చేత; తస్య=ఆదశరథమహారాజుయొక్క; శాసనం=ఆజ్ఞను ; త్యక్తుం=విడుచుటకు; న్యాయ్యం=యుక్తము; న=కాదు. తత్=అది;త్వయాపి= నీచేతఁగూడ; సదా=ఎల్లప్పుడును;మాన్యం=పూజింపఁదగినది. సః=అతఁడు; నః=మనకు-బంధుర్వై = బంధువుగదా!నః=మనకు;పితా=తండ్రిగదా!

శత్రువులనడంగఁద్రొక్కఁ జాలిన భరతుఁడా ! దశరథమహారాజుశాసనంబునతిక్రమించుట, నాకుయుక్తము కాదు;అట్లు , నీవును,ఆయనయాజ్ఞనెల్లప్పుడునుబూజింపఁవలయును; ఆయనమనకు అందఱిబంధువులకన్న నెచ్చుబంధువు,తండ్రి.అని, తాత్పర్యము.

తద్వచః పితు ర్వాహం సమ్మతం ధర్మచారిణః
కర్మణా పాలయిష్యామి వనవాసేన రాఘవ. ౭౩

టీక॥రాఘవ=భరతుఁడా ! తత్= అందువలన; అహం=నేను ; ధర్మచారిణః=ధర్మమునాచరించునట్టి ; పితుః=తండ్రియొక్క; సమ్మతం= పూజింపఁబడిన; వచఏవ=మాటనే; వనవాసేన=అడవినుండుటయను; కర్మణా=కార్యముచేత; పాలయిష్యామి= పాలించెదను.

భరతుఁడా! అందువలన,నేను, బదునాలుగు సంవత్సరంబులు వనంబుననుండి,యట్టిపరమధార్మికుండగు తండ్రియాజ్ఞను,సార్థకంబు గావించెదను. అని,తాత్పర్యము.

ధార్మికేణా నృశంసేన నరేణ గురువర్తినా
భవితవ్యం నరవ్యాఘ్ర పరలోకం జిగీషతా. ౭౪

టీక॥నరవ్యాఘ్ర= పురుషశ్రేష్ఠుండవగుభరతుఁడా!పరలోకం= పరలోకమును;జిగీషతా= జయింపనిచ్ఛించునట్టి;నరేణ=మనుష్యునిచేత; ధార్మికేణ= ధర్మమునాచరించునట్టివాఁడుగాను; అనృశంసేన=క్రూరుఁడుగానివాఁడుగాను; గురువర్తినా=గురుశుశ్రూషసేయువాఁడుగాను;భవితవ్యం=అగుటకావలయును.

పురుషశ్రేష్ఠుండవగుభరతుఁడా! ప

రలోకంబునసుఖంబు నొందఁగోరువాఁడు, ధార్మికుండుగాను, దయగలవాఁడుగాను, గుర్వాజ్ఞాప్రకారమునడచుకొనువాఁడుగాను, ఉండవలయును.

అని, తాత్పర్యము.

ఆత్మాన మనుతిష్ఠ త్వం స్వభావేన నరర్షభ
నిశామ్యతు శుభం వృత్తం పితు ర్దశరథస్య నః. ౪౫

టీక॥ నరర్షభ= పురుషశ్రేష్ఠుండవగుభరతుఁడా! త్వం=నీవు; నః=మనయొక్క; పితుః=తండ్రియగు ; దశరథస్య=దశరథునియొక్క; శుభం=మంగళకరమయిన; వృత్తం = నడువడిని; నిశామ్యతు=చూచియు; ఆత్మానం=నిన్ను; స్వభావేన=రాజభావముచేత; అనుతిష్ఠ=అనుష్ఠింపుము.

పురుషశ్రేష్ఠుండవగుభరతుఁడా!నీవు మనతండ్రియగు దశరథుని సదాచారమంతయు మనంబుననుంచుకొని, రాజ్యంబుఁబాలింపుము. అని , రాముండు, భరతునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యేవ ముక్త్వా వచనం మహాత్మా
పితు ర్నిదేశప్రతిపాలనార్థం
యవీయసం భ్రాతర మర్థవచ్చ
ప్రభు ర్ముహూర్తా ద్విరరామ రామః. ౪౬

టీక॥ మహాత్మా = అధికమయినప్రభావముగలవాఁడును; ప్రభుః= సమర్థుఁడునగు, రామః=రాముఁడు ; ఇతి=అని; ఏవం=ఇట్లు; యవీయసం(యవీయాంసం)=కనిష్ఠుండగు; భ్రాతరం=తోఁబుట్టువైనభరతునిగూర్చి; పితుః=తండ్రియొక్క; నిదేశప్రతిపాలనార్థం=ఆజ్ఞనుబాలించుటయెప్రయోజనముగాగలదియు; అర్థవచ్చ= అధికమయినయర్థముకలదియునగు ; వచనం=మాటను;ఉక్త్వా=చెప్పి;ముహూర్తాత్ = స్వల్పకాలముననె; విరరామ=ఊరకుండెను.

ఈప్రకారంబున, మహాత్ముండును మహాసమర్థుండునగురాముండు, తన తమ్ముండగుభరతుంజూచి, తండ్రియా

జ్ఞనవశ్యము పాలింపవలెననునర్థము వచ్చునట్లు, ఉత్తమంబగుమాటంజెప్పి, యంతనూరకుండెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, పంచోత్తరశతతమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండపంచోత్తరశతతమసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

షడుత్తరశతతమసర్గప్రారంభః.

ఏవ ముక్త్వాతు విరతే రామే వచన మర్థవత్
తతో మందాకినీ తీరే రామం ప్రకృతివత్సలమ్. ౧
ఉవాచ భరత శ్చిత్రం ధార్మికో ధార్మికం వచః

టీక॥ రామే=రాముఁడు; ఏవం= ఇట్లు; అర్థవత్ = అధికమయినయర్థముగల; వచనం=మాటను; ఉక్త్వా=చెప్పి; విరతేతు=ఊరకున్నంతనె; తతః= అంత; ధార్మికః=ధర్మమునాచరించునట్టి; భరతః=భరతుఁడు; మందాకినీతీరే= మందాకినీనదీతీరమునందు; ప్రకృతివత్సలం = స్వభావముచేత మిక్కిలి యుఁబ్రేమగలవాఁడగు; రామం = రాముని గూర్చి; చిత్రం=ఆశ్చర్యకరంబును; ధార్మికం=ధర్మిష్ఠంబునగు; వచః= మాటను; ఉవాచ=చెప్పెను.

అట్లు, రాముండు మహార్థంబగు మాటంజెప్పి, ముగించినపిమ్మట, ధార్మికుండగు, భరతుండు, మందాకినీతీరంబున, స్వభావంబున నెభక్తవత్సలుం

స ౧౦౬

డగు రాముంజూచి, మిక్కిలియు త్త్రియు క్తంబగుటచే నాశ్చర్యకరంబునుధర్మి ష్ఠంబునగునీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

కోహిస్యా దీదృశో లోకే యాదృశ స్త్వ మరిందమ. ౨
నత్వాం ప్రవ్యధయే ద్దుఃఖం ప్రీతిర్వా న ప్రహర్షయేత్

టీక॥అరిందమ= శత్రువులనణఁగఁ దొక్కినట్టిరాముఁడా! త్వం=నీవు ; యాదృశః=ఎట్టివాఁడవో; ఈదృశః= ఇట్టివాఁడు; లోకే = ప్రపంచమునం దుఃకోహి=ఎవ్వఁడు;స్యాత్ =అగును? త్వాం=నిన్ను;దుఃఖం=దుఃఖము;నప్రవ్య ధయేత్ =దుఃఖింపఁజేయదు.ప్రీతిర్వా= సంతోషముగాని; నప్రహర్షయేత్ = సంతోషింపఁజేయదు.

శత్రువులనడంగద్రొక్కించాలినట్టి రాముఁడా!నీయట్టి వాఁడు లోకంబున నెవ్వఁడును లేఁడు; నీవు, దుఃఖంబు వచ్చినను దుఃఖింపవు; సంతోషంబు వచ్చినప్పుడును,సంతోషింపవు.

అని, తాత్పర్యము.

సమ్మతశ్చాసి వృద్ధానాం తాంశ్చ పృచ్ఛసి సంశయాన్. ౩

టీక॥వృద్ధానాంచ=పెద్దలకును; సమ్మతః= పూజితుండవును;అసి= అగుచున్నావు. తాంశ్చ=ఆవృద్ధులను; సంశయాన్=సందేహములను; పృచ్ఛసి= అడుగుచున్నావు.

సర్వజ్ఞుండవుగావున వృద్ధులుగూడ నిన్నుఁబూజించెదరు;అయినను, నీవు, వారలనుగౌరవించుటకై , వారలనడిగిసందేహంబులుదీర్చుకొను చున్నావు.

అని, తాత్పర్యము.

యథా మృత స్తథా జీవన్ యథాఽ సతి తథా సతి
యస్యైష బుద్ధిలాభస్స్యా త్పరితప్యేత కేన సః. ౪

టీక॥ మృతః=చచ్చినవాఁడు; యథా=ఎట్లో; తథా = అట్లు; జీవన్= బ్రతికియున్నవాఁడును. అసతి= లేనిపదార్థమునందు; యథా=ఎట్లో; త

థా=అట్లు; సతి= ఉన్నవస్తువునందును. ఏషః=ఈ; బుద్ధిలాభః= బుద్ధిలాభము; యస్య=ఎవ్వనికి; స్యాత్=అగునో;సః=అతఁడు; కేన=ఎందుచేత; పరితప్యేత = పరితపించును?

చచ్చినవానియందు , ఎట్లు ద్వేషం బుంచరో, అట్లుబ్రతికియున్నవానియందును , ద్వేషంబుంచకుండుట; లేనివస్తువునందు రాగంబుంచకుండునట్లు, ఉన్నవస్తువునందను రాగంబుంచకుండుట; ఇట్టిబుద్ధియెవనికిఁగలుగునో, అతండు, దేనికిని,ఎంతమాత్రము,పరితపింపఁడు. అని,తాత్పర్యము.

పరావరజ్ఞో యశ్చస్యా త్తథా త్వం మనుజాధిప
స ఏవం వ్యసనం ప్రాప్య న విషీదితు మర్హతి. ౫

టీక॥ మనుజాధిప = మనుష్యులకుఁ బ్రభుండవగు రాముఁడా! యశ్చ = ఎవ్వండు; పరావరజ్ఞః= ఆత్మానాత్మలందెలిసినవాఁడు; స్యాత్=అగునో ; సః=అతండు; ఏవం=ఇట్లు; వ్యసనం=కష్టమును; ప్రాప్య=పొంది;విషీదితుం=దుఃఖించుటకు; నార్హతి= తగఁడు. తథా=అట్లు; త్వం=నీవు.

నరాధిపుఁడవగు రాముఁడా! ఆత్మానాత్మలందెలిసినవాఁడు, ఎట్టికష్టంబులనొందియు , దుఃఖింపరాదు; అట్లునీవు, ఆత్మానాత్మజ్ఞుండవు గావున దుఃఖంబునొందవు అని, తాత్పర్యము.

అమరోపమ స త్త్వ స్త్వం మహాత్మా సత్యసంగరః
సర్వజ్ఞ స్సర్వ దర్శీచ బుద్ధిమాం శ్చాసి రాఘవ. ౬

టీక॥అమరోపమ= దేవతతోఁబోలికగలః రాఘవ=రాముఁడా!త్వం=నీవు; సత్త్వః=సత్వగుణంబుగలవాఁడవు;మహాత్మా=అధికమయిన ధైర్యముగలవాఁడవు; సత్యసంగరః= సత్యప్రతిజ్ఞుండవు;సర్వజ్ఞః=సమస్తమును దెలిసినవాఁడవు; సర్వదర్శీచ=సమస్తమునుజూచువాఁడవును;బుద్ధిమాంశ్చ = అధికమయినబుద్ధిగలవాఁడవును; అసి=అగుచున్నావు.

దేవతుల్యుండవగు రాముఁడా!నీవు, సత్వగుణసంపన్నుండవు; మహాధైర్యుం

డవు; సత్యప్రతిజ్ఞుండవు; సర్వజ్ఞుండవు; సర్వదర్శివి ; మిక్కిలియు బుద్ధిమంతుండవు. అని, తాత్పర్యము.

న త్వా మేవం గుణై ర్యుక్తం ప్రభవా భవకోవిదమ్
అవిషహ్యతమం దుఃఖ మాసాదయితు మర్హతి. ౭

టీక॥ఏవం=ఇట్లు; గుణైః=గుణములతోఁ; యుక్తం= కూడినవాఁడవును; ప్రభవాభవకోవిదం = ఉత్పత్తివినాశంబులయందు దబండితుండవునగు; త్వాం = నిన్ను; అవిషహ్యతమం= ఎంతమాత్రమునోర్వరాని; దుఃఖం=దుఃఖము; ఆసాదయితుం=పొందుటకు; నార్హతి = తగదు.

ఇట్టిసద్గుణంబులతో నొప్పువాఁడవును ఉత్పత్తివినాశంబులు దెలిసినవాఁడవునగు, నీవు ఇట్టిదుస్సహంబగుకష్టమునొందుట, సరిగాదు. అని, తాత్పర్యము.

ప్రోషితే మయి యత్పాపం మాత్రా మత్కారణాత్కృతమ్
క్షుద్రయా తదనిష్టం మే ప్రసీదతు భవాన్మమ. ౮

టీక॥మయి=నేను; ప్రోషితే = దేశాంతరమునొందియుండఁగా ; క్షుద్రయా=దుష్టయగు; మాత్రా=తల్లి చేత; మత్కారణాత్ = నానిమిత్తమయి; యత్=ఏ; పాపం=పాపము; కృతం= చేయఁబడినదో; తత్=అది; మే = నాకు; అనిష్టం=ఇష్టముగాదు. భవాన్=నీవు; మమ=నాకు; ప్రసీదతు=ప్రసన్నుండవుగమ్ము.

నేను దేశాంతరంబుననుండఁగా, దుష్టశీలగు నాతల్లి, నానిమిత్తమయి గావించినపాపకార్యము , నాకిష్టముగాదు; కావున, నీవు నాపైఁగోపంబు సేయకుము; అనుగ్రహింపవలయును.

అని, తాత్పర్యము.

ధర్మబంధేన బద్ధోస్మి తేనే మాం నేహ మాతరమ్
హన్మి తీవ్రేణ దండేన దండార్హాం పాపకారిణీమ్. ౯

స ౧౦౬




టీక॥ ధర్మబంధేన= ధర్మపాశముచేత; బద్ధః=కట్టఁబడినవాఁడను; అస్మి=అగుచున్నాను. తేన= అందుచేత;దండార్హాం= శిక్షకుఁదగినదియు; పాపకారిణీం= పాపముచేసినదియునగు; ఇమాం=ఈ; మాతరం=తల్లిని ; ఇహ=ఇప్పుడు; తీవ్రేణ=తీక్ష్ణమయిన; దండేన=శిక్షచేత; నహన్మి = వధింపకున్నాను.

నేనుధర్మంబునకు భయపడియున్నాను; అందుచేతనే, పాపిష్ఠురాలునుదండింపఁదగినదియునగు నాతల్లిని, నిప్పుడు, తీక్ష్ణదండంబున, వధింపకున్నాను. అని, తాత్పర్యము.

కథం దశరథా జ్జాత శ్శుద్ధాభిజన కర్మణః

జానన్ ధర్మ మధర్మిష్ఠం కుర్యాం కర్మ జుగుప్సితమ్. ౧౦

టీక॥ శుద్ధాభిజనకర్మణః=పరిశుద్ధమయినకులమునుకార్యముగల ; దశరథాత్=దశరథునివలన;జాతః= పుట్టిన; అహం(అధ్యాహృతము) = నేను; ధర్మం=ధర్మమును; జానన్=ఎఱింగుచు; కథం=ఎట్లు; అధర్మిష్ఠం = అధర్మముగలదియు;జుగుప్సితం=నిందింపఁబడినదియునగు; కర్మ=కార్యమును; కుర్యాం=చేయుదును.

సత్కులంబునంబుట్టినవాఁడును సత్కర్మంబులగావించుచున్నవాఁడునగుదశరథమహారాజునకుఁబుట్టి, ధర్మంబుదెలిసియు , నధర్మిష్ఠంబునులోకనిందితంబునగు కార్యంబును , నేనెట్లు గావింతును?

అని, తాత్పర్యము.

గురుః క్రియావాన్ వృద్ధశ్చ రాజా ప్రేతః పితేతిచ

తాతం న పరి గర్హేయం దైవతంచేతి సంసది. ౧౧

టీక॥అహం=నేను;గురుః = గురువు;క్రియావాన్= యాగములుగలవాఁడు;వృద్ధశ్చ=ముసలివాఁడును;రాజా=రాజు; ప్రేతః=మృతిఁబొందినవాఁడు; పితా=తండ్రి;ఇతిచ=అనియు;దైవతంచేతి=దేవతయనియు; తాతం=నాయనను;సంసది = సభయందు; నపరిగర్హేయం=నిదింపను.




గురువు, యాగాదిక్రియలం గావించినవాఁడు; "వృద్ధుండు, రాజు, మృతిఁ బొందినవాఁడు, తండ్రి; దైవమువంటివాఁడు; అని, నాయనను సభయందునిందింపకున్నాను. అని, తాత్పర్యము.

కోహి ధర్మార్థయో ర్హీనం మీదృశం కర్మకిల్బిషమ్
స్త్రియాః ప్రియం చికీర్షు స్సన్ కుర్యా ద్ధర్మజ్ఞ ధర్మవిత్. ౧౨

టీక॥ధర్మజ్ఞ = ధర్మము నెఱింగినట్టి రాముఁడా! ధర్మవిత్ = ధర్మము దెలిసినవాఁడు; కః=ఎవ్వఁడు; స్త్రియాః=స్త్రీకి; ప్రియం= సంతోషమును; చికీర్షుస్సన్=చేయఁగోరువాఁడై, ధర్మార్థయోః=(తృతీయార్థమందు షష్ఠి) ధర్మము చేతను అర్థము చేతను; హీనం=విడువఁబడినదియు; కిల్బిషం=పాపమునగు; ఈదృశం=ఇట్టి; కర్మ=కార్యమును; కుర్యాత్=చేయును?

ధర్మజ్ఞుండవగు రాముఁడా! ధర్మంబు దెలిసినవాఁడెవ్వఁడు, స్త్రీకి సంతోషంబు గల్గుటకై, ఇట్టి ధర్మార్థవర్జితంబగు పాపిష్ఠకార్యముఁ జేయును?

అని, తాత్పర్యము.

అంత కాలేహి భూతాని ముహ్యంతీతి పురా శ్రుతిః
రాజ్ఞై వం కుర్వతా లోకే ప్రత్యక్షం సా శ్రుతిః కృతా. ౧౩

టీక॥భూతాని=ప్రాణులు; అంతకాలే=వినాశకాలమునందు; ముహ్యంతి=మోహమునొందుచున్నవి. ఇతి = అని; పురాశ్రుతిః=పురాతనమయిన గాథ; అస్తి(అధ్యాహృతము)హి=ఉన్నది గదా! ఏవం=ఇట్లు; కుర్వతా= చేయుచున్న; రాజ్ఞా; దశరథ మహారాజుచేత; సా=ఆ; శ్రుతిః=గాథ; లోకే= లోకమునందు; ప్రత్యక్షం= ప్రత్యక్షముగా; కృతా=చేయఁబడినది.

ప్రాణులకు, వినాశకాలంబున, విపరీతబుద్ధిగలుగునని, పురాతనగాథ చెప్పుచున్నది; దశరథమహారాజు, ఇట్టియకార్యంబు గావించి, యాగాథార్థంబు లోకంబున, నందఱకును బ్రత్యక్షము గావించెను. అని, తాత్పర్యము.

సా ధ్వర్థ మభి సంధాయ క్రోధా న్మోహాచ్చ సాహసాత్
తాతస్య య దతిక్రాంతం ప్రత్యాహ రతు తద్భవాన్. ౧౪

టీక॥ క్రోధాత్=కోపమువలనను; మోహాచ్చ=కైకేయీవిషయమోహముచలనను; సాహసాత్=సాహసమువలనను; తాతస్య=నాయనయొక్క; అతిక్రాంతం=ధర్మాతిక్రమణము; యత్ (అస్తి)=ఏదిగలదో; తత్ = దానిని; భవాన్=నీవు; అర్థం=కార్యమును; సాధు=చక్కఁగా; అభిసంధాయ=ఆలోచించి; ప్రత్యాహరతు=మఱలింపుము.

కైకేయివిషంబుఁద్రావెదనని కోపంబుఁజూపుటవలనను, కైకేయీవిషయక మోహమువలనను, సాహసమువలనను, మనతండ్రి గావించిన ధర్మాతిక్రమణమును, నీవు, చక్కఁగా నర్థమునాలోచించి, చక్కఁజేయుము.

అని, తాత్పర్యము.

పితు ర్య స్సమతిక్రాంతం పుత్రో య స్సాధు మన్యతే
త దపత్యం మతం లోకే విపరీత మతో న్యథా. ౧౫

టీక॥ యః=ఏ; పుత్రః = కొడుకు; పితుః=తండ్రియొక్క; సమతిక్రాంతం=ధర్మాతిక్రమణమును; సాధు=చక్కఁగా; కర్తుం(అధ్యాహృతము) = చేయుటకు; మన్యతే=తలంచునో; తత్=అతఁడు; అపత్యం=కొడుకుగా; లోకే=లోకమునందు; మతం=తలంపఁబడెను. అతః=ఇంతకన్నను; అన్యథా(చేత్)=వేఱువిధమగునేని; విపరీతం = విపరీతము.

ఏపుత్రుండు, తండ్రిగావించినయ కార్యంబునుసరిచేయఁగోరునో, అతండె, తండ్రికిసరియయినకొడుకు; అటుగానివాఁడు, కొడుకేకాఁడు.

అని, తాత్పర్యము.

త దపత్యం భవా నస్తు మా భవాన్ దుష్కృతం పితుః
అభిపత్తా కృతం కర్మ లోకే ధీరవిగర్హితమ్. ౧౬

టీక॥ భవాన్=నీవు; తత్=అట్టి; అపత్యం= పుత్రుఁడవు; అస్తు= కమ్ము




భవాన్=నీవు; పితుః=తండ్రియొక్క; కృతం=చేయఁబడిన; లోకే=లోకమునందు; ధీరవిగర్హితం= పండితులచే నిందింపఁబడినదియు;దుష్కృతం =పాపమునను; కర్మ=కార్యమును; మాభిపత్తా=పొందఁదగవు.

నీవు, అట్టిసత్పుత్రుండవగుము;మనతండ్రి గావించినలోకనిందితమయిన పాపకార్యమును, నీవెంతమాత్రముపేక్షింపరాదు. అని, తాత్పర్యము.

కైకేయీం మాంచ తాతంచ సుహృదో బాంధవాం శ్చనః
పౌరజానపదాన్ సర్వాం స్త్రాతు సర్వ మిదం భవాన్. ౧౮

టీక॥భవాన్=నీవు; కైకేయీం= కైకేయిని; మాంచ=నన్నును;తాతం చ=నాయనను;సుహృదః= స్నేహితులను;నః = మనయొక్క; బాంధవాం శ్చ=బంధువులను; పౌరజానపదాన్= పట్టణవాసులను గ్రామవాసులను; సర్వాన్=అందఱను ; ఇదం= ఈరాజ్యమును;సర్వం=అంతయు; త్రాతు= రక్షింపుము.

నీవు,కైకేయినినన్నును నాయనను మనస్నేహితులను బంధువులను పౌరులను,గ్రామవాసి జనులను , ఈరాజ్యంబంతయు, రక్షింపవలయును.

అని, తాత్పర్యము-

క్వ చారణ్యం క్వచ క్షాత్రం క్వ జటాః క్వ చ పాలనమ్
ఈదృశం వ్యాహతం కర్మ న భవాన్ కర్తు మర్హతి. ౧౯

టీక॥అరణ్యంచ=వనమును; క్వ=ఎచ్చట?క్షాత్రం = క్షత్రియధర్మము; క్వ=ఎచ్చట?జటాః= జటలు;క్వ=ఎచ్చట?పాలనంచ= రాజ్యపరిపాలనమును; క్వ=ఎచ్చట? ఈదృశం = ఇట్టి;వ్యాహతం=కొట్టఁబడిన;కర్మ=కార్యమును;భవాన్=నీవు;కర్తుం = చేయుటకు;నార్హసి=తగవు.

వనవాసమెచ్చట?క్షత్రియధర్మమెచ్చట? జటాధారణాది మునివృత్తియెచ్చట? రాజ్యపరిపాలనమెచ్చట?ఇట్టివిరుద్ధకార్యము,నీవెంతమాత్రమునుజేయవలదు.అని, తాత్పర్యము.




ఏషహి ప్రథమో ధర్మః క్షత్రియస్యాభి షేచనమ్
యేన శక్యం మహాప్రాజ్ఞ ప్రజానాం పరిపాలనమ్. ౧౯

టీక॥మహాప్రాజ్ఞ = మహాపండితుండవగు రామునా! యేన= దేనిచేత;ప్రజానాం = ప్రజలయొక్క; పరిపాలనం=పాలించుట;శక్యం= అలవియగునో;ఏషః=ఈ;అభిషేచనం = పట్టాభిషేకమను;ధర్మః = ధర్మము;క్షత్రియస్య=క్షత్రియునకు;ప్రథమః = మొదటిది.

మహా పండితుండవగు రాముఁడా! ప్రజా పరిపాలనంబునకు మూలమయిన,పట్టాభిషేకమె క్షత్రియునకుఁబ్రథమ ధర్మము.అని, తాత్పర్యము.

కశ్చ ప్రత్యక్ష ముత్సృజ్య సంశయస్థ మలక్షణమ్
ఆయతిస్థం చరే ద్ధర్మం క్షత్రబంధు రనిశ్చితమ్. ౨౦

టీక॥క్షత్రబంధుః = క్షత్రియుఁడు; కః=ఎవ్వఁడు;ప్రత్యక్షం = ప్రత్యక్షమయిన;ధర్మం = ధర్మమును;ఉత్సృజ్య=విడిచి;సంశయస్థం= సందేహమందున్నదియు;అలక్షణం = లక్షణములేనిదియు;ఆయతిస్థం= కాలాంతరమున ఫలంబునొసంగునదియు; అనిశ్చితం=నిశ్చయింపఁబడనిదియునగు;ధర్మం=ధర్మమును;చరేత్ =చేయును?

క్షత్రియుం డెవ్వఁడు, త్యాగభోగప్రదంబగుటచేఁబ్రత్యక్షఫలంబగుప్రజాపాలనరూపధర్మంబునువిడిచి, సందేహగతంబును,లక్షణంబులేకుండుటచేనిరూపింపనలవిగానిదియుఁగాలాంతరఫలప్రదంబును ప్రమాణరహితంబునగు తాపసధర్మంబునాచరించును?
అని, తాత్పర్యము.

అథ క్లేశ జ మే వత్వం ధర్మం చరితు మిచ్ఛసి
ధర్మేణ చతురో వర్ణా౯ పాలయ౯ క్లేశ మాప్నుహి.౨౧

టీక॥అథ=ఇంక;త్వం=నీవు;క్లేశజం= శ్రమమువలనఁ గలిగిన; ధర్మమేవ= ధర్మమునే; చరితుం= ఆచరించుటకు;ఇచ్ఛసి (యది)=కోరుదువేని; ధ

ర్మేణ= ధర్మముచేత ; చతురః= నాలుగయిన; వర్ణాన్= వర్ణములను; పాలయన్= పాలించుచు ; క్లేశం=కష్టమును ; ఆప్నుహి = పొందుము.

ఇంక, మిక్కిలియు శ్రమముగలిగించు ధర్మము నేయాచరింపవలయునని నీకుఁ గోరికయుండు నేని, ధర్మంబున, బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రుల నాలుగు వర్ణంబులను, తత్తద్ధర్మంబుల నతిక్రమింపకుండునట్లు, పాలింపుము; ఇది మిక్కిలియు శ్రమకరమయినధర్మము.

అని, తాత్పర్యము.

చతుర్ణా మాశ్రమాణాంహి గార్హస్థ్యం శ్రేష్ఠ మాశ్రమమ్
ప్రాహు ర్ధర్మజ్ఞ ధర్మజ్ఞా స్తం కథం త్యక్తు మర్హసి. ౨౨

టీక॥ధర్మజ్ఞ=ధర్మంబులఁ దెలిసినట్టి రామఁడా! ధర్మజ్ఞాః = ధర్మము దెలిసినవారలు; చతుర్ణాం= నాలుగయిన; ఆశ్రమాణాం = ఆశ్రమములలోపల; గార్హస్థ్యం= గార్హస్థ్యమను ; ఆశ్రమం= ఆశ్రమమును; శ్రేష్ఠం=ఉత్తమమునుగా; ప్రాహుః= చెప్పుచున్నారు తం= ఆగృహస్థాశ్రమమును; కథం=ఎట్లు ; త్యక్తుం= విడుచుటకు; అర్హసి=తగుదువు.

ధర్మజ్ఞుండవగు రామఁడా! ధర్మవేత్తలు, నాలుగాశ్రమంబులలోను గృహస్థాశ్రమమె శ్రేష్ఠమని, చెప్పుదురుగదా! అట్టి గృహస్థాశ్రమంబు నెట్లు, విడిచిపెట్టుదువు? అని, తాత్పర్యము.

శ్రుతేన బాల స్థ్సానేన జన్మనా భవతో హ్యహమ్
స కథం పాలయిష్యామి భూమిం భవతి తిష్ఠతి. ౨౩

టీక॥అహం=నేను; శ్రుతేన= విద్యచేతను; స్థానేన=స్థానముచేతను; జన్మనా=పుట్టుకచేతను; భవతః=నీకన్నను ; బాలః=చిన్నవాఁడను. సః(అహం)=అట్టి నేను; భవతి=నీవు; తిష్ఠతి=ఉండఁగా; కథం=ఎట్లు; భూమిం=భూమిని ; పాలయిష్యామి=పాలించెదను.

నేను, విద్యచేతను స్థానంబునను జన్మంబునను అన్నిటను నీకన్నంజిన్నవాఁడను; అట్టి నేను, జ్యేష్ఠుండవు నీవుండగా

భూమి నెట్లు పాలింపఁగలను? అని, తాత్పర్యము.

హీనబుద్ధిగుణో బాలో హీన స్థానేన చాప్యహమ్
భవతాచ వినాభూతో నవర్తయితు ముత్సహే. ౨౪

టీక॥అహం= నేను ; హీనబుద్ధిగుణః=హీనమయినబుద్ధియు గుణములును గలవాఁడను. బాలః=పిన్నవాఁడను. స్థానేనచాపి=స్థానము చేతను;హీనః=తక్కువయయినవాఁడను. భవతాచ= నీచేతను; వినాభూతః=విడువఁబడినవాఁడనై; వర్తయితుం = జీవించుటకు; నోత్సహే=ఉత్సహింపను.

నేను, బాలుండనుమాత్రమెకాను; హీనబుద్ధిని; హీనస్థితినున్నవాఁడను;నీవు నన్ను విడిచినచో, జీవింపఁజాలను; ఇంక నెట్లు రాజ్యంబుఁబాలింతును? అని, తాత్పర్యము.

ఇదం నిఖిల మవ్యగ్రం రాజ్యం పిత్ర్య మకంటకమ్
అనుశాధి స్వధర్మేణ ధర్మజ్ఞ సహబాంధవైః. ౨౫

టీక॥ధర్మజ్ఞ=ధర్మము దెలిసినట్టి రాముఁడా! ఇదం=ఈ ; పిత్ర్యం=తండ్రివలనవచ్చిన; అకంటకం=శత్రుబాధలేనట్టి; నిఖిలం=సమస్తమయిన; రాజ్యం=రాజ్యమును; అవ్యగ్రం= ఏమఱుపాటులేనట్లు; బాంధవైస్సహ= బంధువులతోఁగూడ ; స్వధర్మేణ= నీధర్మముచేత; అనుశాధి= పాలింపుము.

ధర్మజ్ఞుండవగు రాముఁడా! నీవు, నిజధర్మంబునవలంబించి , బంధువులంగూడి, యకంటకంబగునీపిత్ర్యరాజ్యంబునంతయుఁజక్కఁగాఁ బాలింపుము. అని, తాత్పర్యము.

ఇహైవ త్వాభి షించంతు సర్వాః ప్రకృతయస్సహ
ఋత్విజ స్సవసిష్ఠాశ్చ మంత్ర వ న్మంత్రకోవిదాః. ౨౬

టీక॥సర్వాః= సమస్తములయిన;ప్రకృతయః=ప్రజలును; సవసిష్ఠాః= వ

సిష్ఠమహామునితోఁగూడిన; మంత్రకో విదాః=మంత్రింబులందుఁబండితులగు; ఋత్విజశ్చ=ఋత్విజులును;సహ=కూడి; త్వాం=నిన్ను; ఇహైవ=ఇచ్చటనె; మంత్రవత్= మంత్రములుగలుగునట్లుగా;అభిషించంతు = అభిషేకింతురు గాక.

జనులందఱును,వసిష్ఠుండు మొదలగు మంత్రకోవిదులగుఋత్విజులును, ఇచ్చటనె,నీకు,సమంత్రకంబుగాఁబట్టాభిషేకంబు గావింతురుగాక.

అని, తాత్పర్యము.

అభిషిక్త స్త్వ మస్మాభి రయోధ్యాం పాలనే వ్రజ
విజిత్య తరసా లోకాన్ మరు ద్భిరివ వాసవః. ౨౭

టీక॥త్వం=నీవు;అస్మాభిః= మాచేత;అభిషిక్తః= అభిషేకింపఁబడినవాఁడవై;పాలనే=పాలించుటనిమిత్తమయి; అయోధ్యాం=అయోధ్యనుగూర్చి; తరసా=బలముచేత;లోకాన్= లోకంబులను;విజిత్య = జయించి;స్థితః(అధ్యాహృతము) = ఉన్నవాఁడును ; మరుద్భిః=దేవతలచేత; అభిషిక్తః(అధ్యాహృతము)= అభిషేకింపఁబడినవాఁడగు;వాసవఇవ = ఇంద్రుఁడువలె;వ్రజ=పొమ్ము.

లోకంబుల నంతయుజయించినపిదప దేవతలచేఁబట్టాభిషిక్తుండయినయింద్రుండువలె, నీవు, మాచేనభిషిక్తుండవై, ప్రజలంబాలించుపొంటె, నయోధ్యాపురికిఁబొమ్ము.

అని, తాత్పర్యము.

ఋణాని త్రీణ్యపాకుర్వన్ దుహృదః స్సాధు నిర్దహన్
సుహృద స్తర్పయన్ కామై స్త్వ మే వాత్రానుశాధి మామ్. ౨౮

టీక॥ త్వమేవ=నీవే; అత్ర=ఈయయోధ్యయందు; త్రీణి=మూఁడైన;ఋణాని=ఋణములను; అపాకుర్వన్ = తీర్చుచు; దుహృదః=శత్రువులను ; సాధు=చక్కఁగా; నిర్దహన్ = దహించుచు; సుహృదః = స్నేహితులను; కామైః= కోరఁబడుపదార్థములచేత; తర్పయన్= తృప్తిఁబొందించుచు; మాం=నన్ను; అనుశాధి=పాలింపుము.

దేవర్షిపితృఋణంబులమూఁడింటి నిదీరు కొని, శత్రువులనుసంహరింపు చు, స్నేహితులకుసమస్తాభీష్టంబులనొసంగిసంతోషంబుగల్గించుచు, అట్లురాజ్యంబును, నన్నును, నీవేపాలింపవలయును. అం, తాత్పర్యము.

అద్యార్య ముదితాస్సంతు సుహృద స్తేభి షేచనే
అద్యభీతాః పలాయంతాం దుహృదస్తే దిశో దశ. ౨౯

టీక॥ఆర్య = పూజ్యుండవగురాముఁడా! అద్య=ఇప్పుడు;అభిషేచనే= పట్టాభిషేకముకాఁగా; తే=నీయొక్క; సుహృదః=స్నేహితులు; ముదితాః = సంతసించినవారలు; సంతు=అగుదురు గాక. అద్య= ఇప్పుడు; తే=నీయొక్క; దుహృదః= శత్రువులు;భీతాః = భయమునొందినవారలై ; దశ= పదియైన;దిశః=దిక్కులనుగూర్చి; పలాయంతాం=పరుగెత్తుదురుగాక.

పూజ్యుఁడవగు రాముఁడా! ఇప్పుడె,నీపట్టాభిషేకమయినపిమ్మట,నీస్నేహితులందఱుసంతోషింతురుగాక ; ఇప్పుడె, నీశత్రువులందఱు, భయంబున, దశదిశలకుంబాఱిపోవుదురుగాక.

అని, తాత్పర్యము.

ఆక్రోశం మమ మాతుశ్చ ప్రమృజ్య పురుషర్షభ
అద్య తత్రభవంతం చ పితరం రక్ష కిల్బిషాత్. ౩౦

టీక॥ పురుషర్షభ=పురుషశ్రేష్ఠుఁడవగురాముఁడా! అద్య=ఇప్పుడు; మమ=నాయొక్క; మాతుః= తల్లియొక్క;ఆక్రోశం=శాపమును; ప్రమృజ్య=తుడిచియు;తత్రభవంతం=పూజ్యుఁడయిన; పితరం=తండ్రిని; కిల్బిషాత్= పాపముననుండి;రక్ష=రక్షింపుము.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! నాతల్లి గావించినదుష్కార్యమునుసరిచేసి, పూజ్యుండగుమనతండ్రికిఁ, బాపంబుగలుగకుండునట్లు, నీవుగావింపవలయును.

అని, తాత్పర్యము.

శిరసా త్వా భియాచే హం కురు ష్వ కరుణాం మయి

బాంధవేషుచ సర్వేషు భూతేష్వివ మహేశ్వరః. ౩౧

టీక॥అహం=నేను; త్వాం=నిన్ను; శిరసా=తలచేత; అభియాచే= ప్రార్థించుచున్నాను. మయి= నాయందు; బాంధవేషుచ= బంధువులయందును; సర్వే=అందఱియందును ; భూతేషు=ప్రాణులయందు ; మహేశ్వరఇవ=ఈశ్వరుఁడువలె; కరుణాం= దయను; కురు=చేయుము.

నిన్నుసాష్టాంగముగ నమస్కరించి ప్రార్థించుచున్నాను; మహేశ్వరుండు ప్రాణులయందుంబోలె,నీవునాయందును బంధువులయందఱియందును, అనుగ్రహంబు సేయవలయును.

అని, తాత్పర్యము.

అథై తత్పృష్ఠతః కృత్వా వన మేవ భవానితః
గమిష్యతి గమిష్యామి భవతాసార్థ మప్యహమ్. ౩౨

టీక॥అథ=ఇంక; భవాన్=నీవు; ఇతః=ఇచ్చటనుండి; ఏతత్ = దీనిని; పృష్ఠతః = వెనుకను; కృత్వా=చేసి; వనమేవ = అడవినిగూర్చియే ; గమిష్యతి (యది) = పోఁగలవేని; అహమపి= నేనును; భవతాసార్థం= నీతోఁగూడ; గమిష్యామి=పోయెదను, వచ్చెదననుట.

ఇంక,నీవు నెంతప్రార్థించినను వినక,వనమునకేపోదువేని, నేనునునీవెంబడివనంబునకువచ్చెదను.అని, భరతుండు రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తథాహి రామో భరతేన తామ్యతా
ప్రసాద్యమాన శ్శిరసా మహీపతిః
న చైవ చక్రే గమనాయ సత్త్వవాన్
మతిం పితు స్తద్వచనే ప్రతిష్ఠితః. ౩౩

టీక॥సత్త్వవాన్=అధికమయినధైర్యముగలవాఁడును ; మహీపతిః=భూమికిఁబ్రభువునగు రామః=రాముఁడు; తథా=అట్లు; తామ్యతా= తహతహపడుచున్న; భరతేన=భరతునిచేత ; శిరసా=తలచేత; ప్రసాద్యమానః = వేఁడుకొనఁబడుచును; పితుః= తండ్రియొక్క; తద్వచనే= ఆమాటయందు;

స ౧౦౬

ప్రతిష్ఠితః= ప్రతిష్ఠింపఁబడినవాఁడై ; గమనాయ=పోవుటకొఱకు; మతిం=బుద్ధిని; నైవచక్రే=చేయనేలేదు.

మహాధైర్యశాలియగు రాముండు, భరతుండతి వినయంబున నెంత ప్రార్థించినను, దండ్రియాజ్ఞం బాలించుటయందుస్థిరుండై, యయోధ్యకుఁబోవనిచ్ఛింపఁడయ్యె. అని, తాత్పర్యము.

తదద్భుతం స్థైర్య మవేక్ష్య రాఘవే
సమం జనో హర్ష మవాప దుఃఖితః
నయా త్యయోధ్యా మితి దుఃఖితోఽభవత్
స్థిరప్రతిజ్ఞత్వ మవేక్ష్యహర్షితః. ౩౪

టీక॥జనః=జనము; రాఘవే= రామునియందు; తత్=ఆ; అద్భుతం= ఆశ్చర్యకరమగు; స్థైర్యం= స్థిరత్వమును; అవేక్ష్య=చూచి; సమం = ఏకకాలమునందు; హర్షం=సంతోషమును; అవాప=పొందెను. దుఃఖితః=దుఃఖమునొందినది ; అభవత్ ( అధ్యాహృతము)=ఆయెను. అయోధ్యాం=అయోధ్యాపట్టణమును; నయాతి=పొందఁడు. ఇతి=అని; దుఃఖితః=దుఃఖమునొందినది; అభవత్=అయ్యెను. స్థిరప్రతిజ్ఞత్వం= స్థిరమయిన ప్రతిజ్ఞఁగలిగియుండుటను; అవేక్ష్య=చూచి; హర్షితః=సంతసించినది.

జనులందఱు, అత్యద్భుతంబగు రాముని స్థైర్యంబులఁజూచి, యేకకాలంబున, సంతోషంబును దుఃఖంబునుం బొందిరి; అయోధ్యకు రాఁడని దుఃఖమునొందిరి; స్థిరప్రతిజ్ఞుండని సంతోషంబునొందిరి. అని, తాత్పర్యము.

త మృత్విజో నైగమయూథవల్లభా
స్తదా విసంజ్ఞా శ్రుకళాశ్చ మాతరః
తథా బ్రువాణం భరతం ప్రతుష్టువుః
ప్రణమ్య రామంచ యయాచిరే సహ. ౩౫

టీక॥తదా=అప్పుడు; ఋత్విజః=ఋత్విజులు; నైగమయూథ వల్లభాః =

పౌరసమూహమునకుఁ బ్రియులయిన వారలును, పౌరముఖ్యులనుట; విసంజ్ఞాశ్రుకళాశ్చ=సంజ్ఞలేనివారలును కన్నీళ్లచేఁదడఁబడువారలునగు; మాతరశ్చ= తల్లులును; తథా=అట్లు; బ్రువాణం=చెప్పుచున్న ; తం=ఆ; భరతం=భరతుని; ప్రహృష్టవుః=పొగడిరి . సహ=కూడ; రామం=రామునిః ప్రణమ్యచ=నమస్కరించియు; యయాచిరే=ప్రార్థించిరి.

అప్పుడట్లుయుక్తియుక్తంబుగారామునకుఁజెప్పుచున్నభరతుంజూచి ఋత్విజులును పౌరముఖ్యులును , కన్నీళ్ల చేఁదడఁబడుమాటలుగల తల్లులును, మిక్కిలియుఁ బ్రస్తుతించిరి; అంత,వారలందఱు రామునకు నమస్కారంబు గావించి,సవినయంబుగాఁ బ్రార్థించిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

అయోధ్యాకాండే, షడుత్తరశతతమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండషడుత్తరశతతమసర్గటీక,

ముగిసినది.

---



శ్రీ

సప్తోత్తరశతతమసర్గ ప్రారంభః-

పున రేవం బ్రువాణం తం భరతం లక్ష్మణాగ్రజః
ప్రత్యువాచ తత శ్శ్రీమాన్ జ్ఞాతిమధ్యే భిసత్కృతః. ౧

టీక॥ తతః=అంత; శ్రీమాన్= అధికమయినకాంతిగలవాఁడును ; అభిసత్కృతః=పూజింపఁబడినవాఁడునగు ; లక్ష్మణాగ్రజః= లక్ష్మణునియన్నయగు రాముండు; జ్ఞాతిమధ్యే= బంధువులనడుమ; పునః=మఱల ; ఏవం = ఇట్లు; బ్రువాణం=చెప్పుచున్న;భరతం= భరతునిగూర్చి; ప్రత్యువాచ= బదులుచెప్పెను.

అంత, శ్రీమంతుండగు లక్ష్మణుని యన్నరాముండు , భరతునిచేఁబూజితుండై, బంధుమధ్యంబున, మఱలనీప్రకారంబునం జెప్పుచున్నభరతుంజూచి, యిట్లనిబదులుచెప్పెను.

అని, తాత్పర్యము.

ఉపపన్న మిదం వాక్యం య త్త్వ మేవ మభాషథాః
జాతః పుత్రో దశరథా త్కైకేయ్యాం రాజసత్తమాత్. ౨

టీక॥ రాజసత్తమాత్= రాజశ్రేష్ఠుండగు;దశరథాత్=దశరథునివలన ; కైకేయ్యాం = కైకేయియందు; జాతః=జన్మించిన; పుత్రః=పుత్రుండగు ; త్వం=నీవు; ఏవం=ఇట్లు; యత్ = ఏమాటను;అభాషథాః=చెప్పితివో ; ఇదం=ఈ;వాక్యం=మాట;ఉపపన్నం=యుక్తము.

నీవుచెప్పినమాట , రాజశ్రేష్ఠుండగు దశరథమహారాజునకుఁ గైకేయియందు జన్మించినట్టి సత్పుత్రుండవగు నీకుయోగ్యముగనేయున్నది.

అని, తాత్పర్యము.

పురా భ్రాతః పితా న స్స మాతరం తే సముద్వహన్
మాతామహే సమాశ్రౌషీ ద్రాజ్యశుల్క మనుత్తమమ్. ౩




టీక॥ పురా=మున్ను; నః= మనయొక్క; సః=ఆ; పితా=తండ్రి; తే=నీయొక్క; మాతరం=తల్లిని; సముద్వహన్ = పెండ్లాడుచు; మాతామహే = తల్లితండ్రియందు; అనుత్తమం=తనకన్నశ్రేష్ఠములేనట్టి; రాజ్యశుల్కం=రాజ్యమనునుంకువను; సమాశ్రౌషీత్=ప్రతిజ్ఞచేసెను.

మున్ను, మనతండ్రిదశరథమహారాజు, నీతల్లినిగైకేయినివివాహమాడునప్పుడు, నీతాతయగుకేకయమహారాజునకుఁ, గైకేయికిఁబుట్టినవానికే రాజ్యంబునొసంగెదనని, వాగ్దానంబుగావించెను. అని, తాత్పర్యము.

దైవాసురే చ సంగ్రామే జనన్యై తవ పార్థివః
సంప్రహృష్టో దదౌ రాజా వర మారాధితః ప్రభుః. ౪

టీక॥ పార్థివః = రాజయిన; ప్రభుః=సమర్థుఁడగు; రాజా= దశరథమహారాజు; దైవాసురే=దేవాసురులకుజరిగిన; సంగ్రామేచ= యుద్ధమునందును; ఆరాధితః=ఆరాధింపఁబడినవాఁడై; సంప్రహృష్టః= సంతోషించినవాఁడై; తవ=నీయొక్క; జనన్యై=తల్లికొఱకు; వరం=వరమును; దదౌ=ఇచ్చెను.

ప్రభుండగుదశరథమహారాజు, మఱియు, దేవాసురయుద్ధంబునందు, నీతల్లిగావించినసేవకుసంతోషించి, యాబిడకురెండువరంబులొసంగెను.

అని, తాత్పర్యము.

తత స్సా సంప్రతిశ్రావ్య తవ మాతా యశస్వినీ
అయాచత నరశ్రేష్ఠం ద్వౌ వరౌ వరవర్ణినీ. ౫
తవ రాజ్యం నరవ్యాఘ్ర మమ ప్రవ్రాజనం తథా

టీక॥ నరవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుండవగుభరతుఁడా! తతః = అటుపిమ్మట; యశస్వినీ = అధికమయినకీర్తిగలదియు; వరవర్ణినీ=ఉష్ణకాలమునసుఖశీతలమును శీతకాలమున సుఖోష్ణమునగు దేహముగలిగిభర్తయందధికానురాగముగలయుత్తమస్త్రీయునగు; సా=ఆ; తవ=నీయొక్క; మాతా=తల్లి; నరశ్రేష్ఠం=పురుషశ్రేష్ఠుండగుదశరథుని; సంప్రతిశ్రావ్య = శపథముసేయించి;




ద్వౌ=రెండయిన;వరౌ=వరములను;త వ=నీకు;రాజ్యం = దొరతనమును;త థా=అట్లు;మమ=నాకు; ప్రవ్రాజనం= అడవికిఁబోవుటను;అయాచత=అడిగెను.

పురుషశ్రేష్ఠుండవగు భరతుఁడా! అంతయశస్స్వినియు నుత్తమవనితయు నగు,నీతల్లి కైకేయి, పురుషశ్రేష్ఠుండగు దశరథ మహారాజుచే శపథముచేయించి,యీ రెండువరంబులకును, ఒకదానికి, నీకురాజ్యంబును, రెండవదానికినాకువనవాసమును,అడిగెను.

అని, తాత్పర్యము.

తౌ చ రాజా తదా తస్యై నియుక్తః ప్రదదౌ వరౌ. ౬

టీక॥తదా=అప్పుడు; రాజాచ=దశరథమహారాజును;నియుక్తః=అడుగఁబడినవాఁడై;తస్యై=ఆకైకేయికొఱకు;తౌ=ఆ;వరౌ = వరములను;ప్రదదౌ=ఇచ్చెను.

అప్పుడు,దశరథమహారాజు, ఆబిడయిష్టప్రకారము , ఆరెండువరంబులనొసంగెను.అని, తాత్పర్యము.

తేన పిత్రా హ మప్యత్ర నియుక్తః పురుషర్షభ
చతుర్దశ వనే వాసం వర్షాణి వరదానికమ్. ౭

టీక॥ పురుషర్షభ=పురుషశ్రేష్ఠుఁడవగుభరతుఁడా! తేన=ఆ; పిత్రా=తండ్రిచేత ; అహమపి = నేనును ; చతుర్దశ = పదునాలుగయిన; వర్షాణి=సంవత్సరములు; అత్ర=ఈ; వనే=అడవియందు ; వరదానికం=వరదాననిమిత్తమయిన; వాసం=ఉండుటనుగుఱించి;నియుక్తః= ఆజ్ఞాపింపఁబడినాను.

పురుషశ్రేష్ఠుండవగుభరతుఁడా!అట్లుతండ్రియగుదశరథమహారాజు, నీకరాజ్యంబునొసంగి, నన్ను , వరదానముచొప్పునఁ, బదునాలుగుసంవత్సరంబులడవినుండుమనియాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

సో హం వన మిదం ప్రాప్తో నిర్జనం లక్ష్మణాన్వితః
సీతయా చా ప్రతిద్వంద్వ స్సత్యవాదే స్థితః పితుః. ౮

టీక॥సః=అట్టి;అహం=నేను;లక్ష్మణాన్వితః=లక్ష్మణునితోఁగూడినవాఁడనై; సీతయాచ(సహితః)=సీతతోనుంగూడినవాఁడనై;పితుః=తండ్రియొక్క; సత్యావాదే = సత్య వచనమునందు ; స్థితః = ఉన్నవాఁడనై; అప్రతిద్వంద్వః=ఎదురులేనివాఁడనై;ఇదం= ఈ; నిర్జనం=జనులులేని; వనం = అడవిని; ప్రాప్తః=పొందినాను.

అట్లు నేనును, తండ్రిమాటనుశిరసావహించి, యాయన సత్యవచనంబుఁగా పాడుటకై, యెవ్వరుచెప్పినను నిలువక, లక్ష్మణునిసీతనుంగూడి, నిర్జనంబగు నీవనంబునకువచ్చినాను.

అని, తాత్పర్యము.

భవానపి తథేత్యేవ పితరం సత్యవాదినమ్
కర్తుమర్హతి రాజేంద్ర క్షిప్రమేవాభిషేచనాత్. ౯

టీక॥రాజేంద్ర= రాజశ్రేష్ఠుఁడవగు భరతుఁడా!భవానపి= నీవును;తథేత్యేవ=అట్లెయని యె;క్షిప్రమేవ=శీఘ్రముననే;అభిషేచనాత్=అభిషేకమువలన; పితరం=తండ్రిని ; సత్యావాదినం=సత్యవాదినిగా; కర్తుం= చేయుటకు; అర్హతి=తగుదువు.

రాజశ్రేష్ఠుండగుభరతుఁడా ! నీవును, తండ్రియాజ్ఞచొప్పున , శీఘ్రింబునంబట్టాభిషేకముగావించుకొని, దండ్రిమాటనుసత్యముగావింపవలెను.

అని, తాత్పర్యము.

ఋణాన్మోచయ రాజానం మత్కృతే భరత ప్రభుమ్
పితరంచాపి ధర్మజ్ఞం మాతరంచాభినందయ. ౧౦

టీక॥భరత=భరతుఁడా!ప్రభుం=శక్తుండగు; రాజానం= దశరథమహారాజును;మత్కృతే= నానిమిత్తమయి; ఋణాత్= ఋణముననుండి; మోచయ=విడిపింపుము. ధర్మజ్ఞం=ధర్మమునెఱింగినట్టి; పితరంచాపి= తండ్రిని;మాతరంచ=తల్లిని; అభినందయ= సంతోషింపఁజేయుము.

భరతుఁడా!నీవు, నామాటవిని,మహారాజుండగుదశరథుని , కైకేయీ ఋణవిముక్తుంగావించి, ధర్మజ్ఞుండగునాయనకును నీతల్లికిని, సంతోషం

బుగలుగఁజేయుము. అని, తాత్పర్యము.

శ్రూయతేహి పురా తాత శ్రుతి గీ=తా యశస్స్వినా
గయేన యజమానేన గయేష్వేవ పితౄన్ప్రతి. ౧౧

టీక॥ తాత=నాయనా! పురా=మున్ను; గయేష్వేవ= గయాఖ్యప్రదేశములందు; పితౄన్ప్రతి= పితరులనుద్దేశించి; యజమానేన = యాగముసేయుచున్న; యశస్స్వినా = అధికమయినకీర్తిగల; గయేన = గయునిచేత; గీతా=పాడఁబడిన; శ్రుతిః= గాథ; శ్రూయతేహి = వినఁబడుచున్నదిగదా!

నాయనా! మున్ను, గయాఖ్యక్షేత్రంబునఁబితృయజనంబు గావింపుచు మహాత్ముండగు గయుండు నుడివినగాథనువినుచున్నాముగదా!

అని, తాత్పర్యము.

పున్నామ్నో నరకా ద్యస్మా త్పితరం త్రాయతే సుతః
తస్మా త్పుత్ర ఇతి ప్రోక్తః పితౄన్ య త్పాతి వా సుతః. ౧౨

టీక॥ యస్మాత్=ఎందువలన; సుతః=కొడుకు; పితరం = తండ్రిని; పున్నామ్నః= పుత్‌అనుపేరుగల; నరకాత్= నరకముననుండి; త్రాయతే= రక్షించుచున్నాఁడో; తస్మాత్ = అందువలనఁగాని; యత్ =ఎందువలన; సుతః=కొడుకు; పితౄన్=తండ్రులను; పాతి = రక్షించుచున్నాఁడో; తస్మాత్(అధ్యాహృతము) వా=అందువలనఁగాని; పుత్ర ఇతి=పుత్రుఁడని; ప్రోక్తః=చెప్పఁబడినాఁడు.

తండ్రిని, "పుత్" అనుపేరుగలనరకమునంబడనీకరక్షించుటవలనను, తండ్రిపేరనిష్టాపూర్తాదులుగావించి, పరలోకంబునఁ, దండ్రికిసుఖంబుగలిగించిరక్షించుటవలనను, కొడుకునకుఁబుత్రుఁడనుపేరుగలిగినది.

అని, తాత్పర్యము.

ఏష్టవ్యా బహవః పుత్రా గుణవంతో బహుశ్రుతాః
తేషాం వై సమవేతానా మపి కశ్చి ద్గయాం వ్రజేత్. ౧౩

టీక॥ గుణవంతః=అధికమయినగుణములుగలవారలును; బహుశ్రుతాః=అధికమయినవిద్యగలవారలునగు ; పుత్రాః=కొడుకులు; ఏష్టవ్యాః=కోరఁబడవలసినవారలు , సమవేతానాం=చేరిన ; తేషాం = వారలలోపల; ("వై") అనునది పాదపూరణార్థము);కశ్చిదపి=ఒకానొకఁడైనను ; గయాం= గయనుగూర్చి ; వ్రజేత్=పొందును.

గుణవంతులునువిద్యావంతులునగు పెక్కుపుత్రులంబొందవలెనని కోరవలెను; పెక్కుపుత్రులున్నయెడ, వారలలోనొకఁడైన నాగయాక్షేత్రంబునకుఁబోవును. అని,గయుండు,గాథంజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవం రాజర్షయ స్సర్వే ప్రతీతా రాజనందన
తస్మా త్త్రాహి నరశ్రేష్ఠ పితరం నరకా త్ప్రభో. ౧౪

టీక॥ రాజనందన= రాజపుత్రుండవును; ప్రభో=సమర్థుఁడవును; నరశ్రేష్ఠ= పురుషశ్రేష్ఠుండవునగుభరతుఁడా! ఏవం=ఇట్లు ; రాజర్షయః=రాజర్షులు, సర్వే=అందఱును ; ప్రతీతాః=నిశ్చయించినారు.తస్మాత్= అందువలన;పితరం=తండ్రిని;నరకాత్ =నరకముననుండి; త్రాహి=రక్షింపుము.

రాజపుత్రుండవు,సమర్థుఁడవుపురుషశ్రేష్ఠుండవునగుభరతుఁడా! ఇట్లు, రాజర్షులందఱును,అనుష్ఠించుచున్నారు;అందువలన, మనతండ్రియగుదశరథ మహారాజునకు నరకము గలుగకుండునట్లు,గావింపుము.

అని, తాత్పర్యము.

అయోధ్యాం గచ్ఛ భరత ప్రకృతీ రనురంజయ
శత్రుఘ్నసహితో వీర సహ సర్వై ర్ద్విజాతిభిః. ౧౫

టీక॥ వీర=పరాక్రమశాలివగు;భరత=భరతుఁడా! అయోధ్యాం= అయోధ్యనుగూర్చి;గచ్ఛ=పొమ్ము. శత్రుఘ్నసహితః = శత్రుఘ్నునితోఁగూడినవాఁడవై;ద్విజాతిభిః=బ్రాహ్మణులతో;సర్వైః=అందఱితోను; ప్రకృతీః=జను

లను ; అనురంజయ = రంజిల్లఁ జేయుము.

పరాక్రమశాలివగుభరతుఁడా! నీవయోధ్యకుంబోయి, శత్రుఘ్నునివసిష్ఠుండు మున్నగుబ్రాహ్మణోత్తములంగూడి, జనులంచాలింపుము.

అని, తాత్పర్యము.

ప్రవేక్ష్యే దండకారణ్య మహ మప్యవిలంబయన్
ఆభ్యాం తు సహితో రాజన్ వై దేహ్యా లక్ష్మణేనచ. ౧౬

టీక॥ రాజన్ = రాజవగుభరతుఁడా! అహమపి = నేనును; అవిలంబయన్ = జాగుసేయనివాఁడనై ; ఆభ్యాం=ఈ; వై దేహ్యా=సీతతోను; లక్ష్మణేనచ = లక్ష్మణునితోను; సహితస్తు= కూడినవాఁడనై యే; దండకారణ్యం=దండకారణ్యమును; ప్రవేక్ష్యే=ప్రవేశించెదను.

రాజవగుభరతుఁడా! ఇంక నేనును, ఆలస్యము సేయక, ఈసీతాలక్ష్మణులనిర్వురంగూడి, దండ కారణ్యంబునకుఁ బోయెదను. అని, తాత్పర్యము.

త్వం రాజా భరత భవ స్వయం నరాణామ్
వన్యానా మహమపి రాజరా ణ్మృగాణామ్
గచ్ఛ త్వం పురవర మద్య సంప్రహృష్ట
స్సంహృష్ట స్త్వహమపి దండకాన్ ప్రవేక్ష్యే. ౧౪

టీక॥భరత=భరతుఁడా! త్వం=నీవు; స్వయం=నీవుగానే; నరాణాం=మనుష్యులకు; రాజా=ప్రభుండవు; భవ=అగుము. అహమపి=నేనును ; వన్యానాం=అడవియందుఁబుట్టిన ; మృగాణాం=మృగంబులకు; రాజరాట్=రాజరాజుండను ; భవామి (అధ్యాహృతము)=అయ్యెదను.త్వం=నీవు; అద్య=ఇప్పుడె; సంప్రహృష్టః= మిక్కిలియుసంతసించినవాఁడవై; పురవరం=పట్టణశ్రేష్ఠమగు నయోధ్యను; గచ్ఛ=పొందుము. అహపితు = నేనునుమాత్రము ; సంహృష్టః= మిక్కిలియుసంతోషించినవాఁడనై ; దండకాన్=దండకారణ్యమును; ప్రవేక్ష్యే= ప్రవేశించెదను.

భరతుఁడా! నీవు, మనుష్యులకంద ఱకు, రాజగుము; నేను, వనంబుననుం డు మృగంబుల కంతయు రాజుగానుం డెదను; నీవు శీఘ్రంబున నయోధ్యకుం బొమ్ము; నేనును, ఇప్పుడె దండకారణ్యం బునకుఁ బోయెదను. అని, తాత్పర్యము.

ఛాయాం తే దినకరభాః ప్రబాధమానామ్
వర్షత్రం భరత కరోతి మూర్ధ్ని శీతామ్
ఏతేషా మహమపి కాననద్రుమాణామ్
ఛాయాం తా మతిశయినీం సుఖీ శ్రయిష్యే. ౧౮

టీక॥ భరత=భరతుఁడా! వర్షత్రం=ఛత్రము; తే=నీయొక్క; మూర్ధ్ని=తలయందు; దినకరభాః=సూర్యునికిరణంబులను; ప్రబాధమానాం=బాధించునట్టి; శీతాం=చల్లని; ఛాయాం=నీడను; కరోతు=చేయుఁగాక. అహమపి=నేనును; ఏతేషాం=ఈ; కాననద్రుమాణాం=వనవృక్షంబులయొక్క; అతిశయినీం=అతిశయించునట్టి; తాం=ఆ; ఛాయాం=నీడను; సుఖీ=సుఖముగలవాఁడనై; శ్రయిష్యే=ఆశ్రయించెదను.

భరతుఁడా! శ్వేతచ్ఛత్రము, నీశిరసున, సూర్యకిరణంబులం బాఱఁదోలునట్టిచల్లనినీడంగావించుఁగాక; నేనును, సర్వోత్తమమయిన, ఈయడవి వృక్షంబులనీడనాశ్రయించి, సుఖంబుననుండెదను. అని, తాత్పర్యము.

శత్రుఘ్నః కుశలమతి స్తు తే సహాయ
స్సౌమిత్రి ర్మమ విదితః ప్రధానమిత్రమ్
చత్వార స్తనయవరా వయం నరేంద్రం
సత్యస్థం భరత చరామ మావిషాదమ్. ౧౯

టీక॥ తేతు=నీకును; కుశలమతిః=సమర్థమయినబుద్ధిగల; శత్రుఘ్నః=శత్రుఘ్నుఁడు; సహాయః=తోడు. సౌమిత్రిః=లక్ష్మణుఁడు; మమ=నాయొక్క; ప్రధానమిత్రం=ముఖ్యస్నేహితుఁడుగా; విదితః=తెలియఁబడినాఁడు. వయం=మనము; తనయవరాః=పుత్రశ్రేష్ఠులము; చత్వారః=నల్వురమును;

స ౧౦౭

నరేంద్రం=దశరథమహారాజును; సత్యస్థం=సత్యంబుననున్నవానిఁగా; చరామ=చేసెదము. విషాదం=దుఃఖమును; మా(గచ్ఛ)=పొందకుము.

నీకుసహాయుఁడు, మిక్కిలియుఁబుద్ధిశాలిశత్రుఘ్నుఁడున్నాఁడు; నాకును, ముఖ్యస్నేహితుండులక్ష్మణుండున్నాఁడు; మనమునలువురమును, అనొన్యసాహాయ్యంబున, మనతండ్రియగు దశరథమహారాజుమాటనుసత్యంబుగాఁ జేసెదము ; దుఃఖంబునొందకుము. అని, రాముండుభరతునకుంజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

అయోధ్యాకాండే, సప్తోత్తరశతతమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్ర

వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండసప్తోత్తరశతతమసర్గటీక,

ముగిసినది.

---



శ్రీ.

అష్టోత్తరశతతమసర్గప్రారంభః

ఆశ్వాసయంతం భరతం జాబాలి ర్బ్రాహ్మణోత్తమః
ఉవాచ రామం ధర్మజ్ఞం ధర్మాపేత మిదం వచః. ౧

టీక॥ బ్రాహ్మణోత్తమః = బ్రాహ్మణశ్రేష్ఠుండగు; జాబాలిః = జాబాలి; భరతం = భరతుని; ఆశ్వాసయంతం = ఊఱడించుచున్న; ధర్మజ్ఞం = ధర్మము దెలిసిన, రామం = రామునిం గూర్చి; ధర్మాపేతం = ధర్మమువలనవిడివడిన; ఇదం = ఈ ; వచః = మాటను; ఉవాచ = చెప్పెను.

బ్రాహ్మణశ్రేష్ఠుండగుజాబాలి, యిట్లుభరతు నాశ్వాసించుచున్న సకలధర్మజ్ఞుండగురాముంజూచి, చార్వాకమతము నాశ్రయించి, యధర్మిష్ఠంబగునీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

సాధు రాఘవ మాభూత్తే బుద్ధిరేవం నిరర్థికా
ప్రాకృతస్య నరస్యేవ హ్యార్యబుద్ధే మనస్వినః. ౨

టీక॥ రాఘవ = రాముఁడా! సాధు = మంచిది; ఆర్యబుద్ధేః = పూజ్యమగు బుద్ధిగలవాఁడవగు ; మనస్వినః = ధైర్యశాలివియగు ; తే = నీకు ; ప్రాకృతస్య = మూఢుఁడగు ; నరస్యేవ = పురుషునకువలె ; ("హి" అనునది పాదపూరణార్థము) ఏవం = ఇట్లు ; నిరర్థికా = నిష్ప్రయోజనము ; బుద్ధిః = బుద్ధి ; మాభూత్ = కలుగకుండుఁగాక.

రాముఁడా! మూఢునకుంబోలె, మహాబుద్ధిశాలివి మహాధైర్యశాలివగు నీకు, ఇట్టి నిష్ప్రయోజన మయినబుద్ధి గలుగకుండుఁగాక. అని, తాత్పర్యము.

కః కస్య పురుషో బంధుః కిమాప్యం కస్య కేనచిత్
యదేకో జాయతే జంతు రేకఏవ వినశ్యతి. ౩




టీక॥ యత్ = ఎందువలన ; జంతుః = ప్రాణి; ఏకః =ఒక్కఁడుగా; జాయతే=పుట్టుచున్నాఁడో ; ఏకఏవ=ఒక్కఁడుగానే; వినశ్యతి=నశించుచున్నాఁడో;తత్ (అధ్యాహృతము)= అందువలన ; కస్య=ఎవ్వనికి; కః=ఏ; పురుషః = పురుషుఁడు; బంధుః=బంధువు;కస్య=ఎవ్వనికి; కేనచిత్ =ఒకానొకసంబంధముచేత; ఆప్యం=పొందఁదగినది;కిం=ఏమి?

ఎవ్వనికెవ్వఁడుబంధువు ? దేనిచేతనెవ్వనికేమికార్యమున్నది ; పుట్టినప్పుడును , ఎవ్వరునుగూడఁబుట్టలేదు ; చచ్చునప్పుడును , ఎవ్వరునుగూడఁజావరు. అని, తాత్పర్యము.

తస్మాన్మాతా పితా చేతి రామ సజ్జేత యో నరః
ఉన్మత్త ఇవ స జ్ఞేయో నాస్తి కశ్చిద్ధి కస్యచిత్.౪

టీక॥ రామ=రాముఁడా!తస్మాత్= అందువలన;యః=ఏ ; నరః=మనుష్యుఁడు;మాతా = తల్లి;పితా చ= తండ్రియు;ఇతి=అని;సజ్జేత = పొందునో ; సః=అతఁడు;ఉన్మత్తఇవ=పిచ్చివాఁడువలె;జ్ఞేయః=ఎఱుంగఁదగినవాఁడు . కస్యచిత్ =ఒకానొకనికిని;కశ్చిత్ =ఒకానొకఁడును;నాస్తిహి=లేఁడు.

రాముఁడా!అట్లుండుటవలన , నెవ్వఁడు,తల్లియని, తండ్రియని,మిక్కిలియు(శ్రద్ధతో (శ్రమపడుచున్నాఁడో, అతఁడుపిచ్చివాఁడు; ఒకరికొకరికేనంతమాత్రముసంబంధములేదు.

అని, తాత్పర్యము.

యథా గ్రామాంతరం గచ్ఛన్ నరః కశ్చిత్ క్వచిద్వసేత్
ఉత్సృజ్య చ తమావాసం ప్రతిష్ఠేతాపరేఽహని. ౫
ఏవమేవ మనుష్యాణాం పితా మాతా గృహం వసు
ఆవాసమాత్రం కాకుత్స్థ సజ్జంతే నాత్ర సజ్జనాః. ౬

టీక॥ కాకుత్స్థ=రాముఁడా! యథా=ఎట్లు;కశ్చిత్ =ఒకానొక; నరః= మనుష్యుఁడు; గ్రామాంతరం = మఱియొకగ్రామంబునుగూర్చి ; గచ్ఛన్ = పోవుచు ; క్వచిత్ =ఒకానొకచోట;వసేత్ =ఉండునో; అపరే=మఱుచటి; అహని=దినమునందు; తం=ఆ ; ఆవాసం=వాసస్థానమును; ఉత్సృజ్య చ =




విడిచియు; ప్రతిష్ఠేత= బయలుదేలునో; ఏవమేవ=ఈప్రకారముననే ; పితా=తండ్రియు ; మాతా = తల్లియు;గృహం=ఇల్లును; వసు= ధనమును; మనుష్యాణాం=మనుష్యులకు; ఆవాసమాత్రం = వాసస్థానముమాత్రమె. సజ్జనాః=సత్పురుషులు ; అత్ర= ఇందు; నసజ్జంతే=పొందరు.

రాముఁడా! ఎట్లు,ఒకానొకఁడు , గ్రామాంతరంబునకుఁబోవునప్పుడు, విశ్రమార్థఁబొకచోఁనిలిచి , యచ్చటనాదినమంతయునుండి, మఱునాఁడు దానివిడిచిపోవునో , విడిచిపోయినపిమ్మటనాస్థలముతో నతనికెంతమాత్రమునసంబంధంబులేవో, అట్లు,తల్లి,తండ్రి, గృహము,ధనము, అంతయు,మనుష్యులకువాసస్థానములు; వానిలోఁజేరియుండువఱకునుసంబంధముగలదు ; విడిచినపిమ్మట, తలంచుకొనుటయైన నావశ్యకము; అట్లుండఁ , దత్పిత్రాదులుగావించుటవ్యర్థమని చెప్పనేల? అని,తాత్పర్యము.

పిత్ర్యం రాజ్యం పరిత్యజ్య స నార్హసి నరోత్తమ

ఆస్థాతుం కాపథం దుఃఖం విషమం బహుకంటకమ్. ౭

టీ॥నరోత్తమ=పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా!సః=అట్టి; త్వం (అధ్యాహృతము)=నీవు;పిత్ర్యం= తండ్రివలనవచ్చిన; రాజ్యం=రాజ్యమును; పరిత్యజ్య=విడిచి;దుఃఖం=దుఃఖకరమును; విషమం=అనుచితంబును ; బహుకంటకం = పెక్కుపద్రవములుగలదియునగు;కాపథం=కుత్సితమార్గమును; ఆస్థాతుం=అవలంబించుటకు ; నార్హసి=తగవు.

పురుషశ్రేష్ఠుండవగురాముఁడా? అట్టిమహాబుద్ధిశాలివగునీవు , పిత్ర్యంబగురాజ్యమునువిడిచి, దుఃఖకరంబును అనుచితంబును మిక్కిలియు నుపద్రవంబులుగలదియునగు నీకుత్సిత మార్గంబునవలంబించుట యెంతమాత్రముసరిగాదు. అని,తాత్పర్యము.

సమృద్ధాయా మయోధ్యాయా మాత్మాన మభిషేచయ

ఏకవేణీ ధరాహి త్వాం నగరీ సంప్రతీక్షతే. ౮

టీక॥సమృద్ధాయాం=సమృద్ధము ౖన; అయోధ్యాయాం= అయోధ్యయం దు; ఆత్మానం=నిన్ను;అభిషేచయ= అభిషేకించుకొనుము. నగరీ= పట్టణము; ఏకవేణీధరా= ఒకజేడజడనుధరించినదై; త్వాం= నిన్ను; సంప్రతీక్షతే హి=ఎదురుచూచుచున్నదిగదా!

సర్వసమృద్ధమయినయయోధ్యాపట్టణంబునకుఁబోయి పట్టాభిషేకము జేసికొనుము ; అయోధ్య, ఏకవేణీధరయయి, పతివ్రతవలెనిన్నెదురుచూచుచున్నది.

అని, తాత్పర్యము.

రాజ భోగా ననుభవ న్ మహార్హా న్ పార్థివాత్మజ
విహర త్వ మయోధ్యాయాం యథా శక్ర స్త్రివిష్టపే. ౯

టీక॥పార్థివాత్మజ= రాచకొమరుఁడవగు రాముఁడా! త్వం=నీవు; మహార్హాన్=శ్రేష్ఠములయిన ; రాజభోగాన్=రాజభోగములను; అనుభవన్= అనుభవించుచు ; అయోధ్యాయాం=అయోధ్యయందు; త్రివిష్టపే= స్వర్గముసందు; శక్రో యథా= ఇంద్రుఁడువలె; విహర=విహరింపుము.

రాచకొమరుఁడవగు రాముఁడా! నీవు,సర్వోత్తమములగు రాజభోగంబులననుభవించుచు , స్వర్గమున దేవేంద్రుఁడుంబోలె , నయోధ్యాపట్టణంబునవిహరింపుము. అని, తాత్పర్యము.

న తే కశ్చి ద్దశరథ స్త్వం చ తస్య న కశ్చన
అన్యో రాజా త్వ మన్య స్స తస్మా త్కురు యదుచ్యతే. ౧౦

టీక॥తే=నీకు;దశరథః= దశరథుఁడు; కశ్చిత్=ఒకానొకఁడును ; న= కాఁడు. త్వంచ=నీవును; తస్య=అతనికి; కశ్చన=ఒకానొకఁడవును ; న= కావు.త్వం=నీవు;అన్యః= ఇతరుఁడైన. రాజా= రాజవు.సః=అతఁడు; అన్యః= ఇతరుఁడు.తస్మాత్=అందువలన; యత్ =ఏది;ఉచ్యతే=చెప్పఁబడుచున్నదో; తత్(అధ్యాహృతము)=దానిని; కురు= చేయుము.

నీకుదశరథునితో నేవిధమయినసంబంధమునులేదు ; నీతో దశరథునకును ఏవిధమయినసంబంధమునులేదు ; నీవు, ఒకరాజవు; అతఁడొక రాజు; మీయి

గ్గఅకునేమియుసంబంధము లేదు; కావుననేను జెప్పునది సేయుము.

అని, తాత్పర్యము.

బీజమాత్రం పితా జంతో శ్శుక్లం రుధిర మేవచ
సంయుక్త మృతుమన్మాత్రా పురుషస్యేహ జన్మ తత్. ౧౧

టీక॥ పితా=తండ్రి; జంతోః = ప్రాణికి; బీజమాత్రం= స్వల్పకారణము. ఋతుమన్మాత్రా=ఋతువుగలతల్లితో; సంయుక్తం = కూడినదై; శుక్లం = రేతస్సును ; రుధిరం చైవ=శోణితమును. తత్=అది; ఇహ= ఈలోకమునందు; పురుషస్య= పురుషునకు; జన్మ=కారణము.

జంతువునకుఁదండ్రియంత గొప్పకారణము కాఁడు , స్వల్పకారణమె ; ఋతుకాలమునందుమాతృయోనియందు మిళితమయినశుక్లశోణితములేప్రధానకారణము ; దానివలననె, యీలోకంబునఁ బురుషుండుజన్మించుచున్నాఁడు. అని, తాత్పర్యము.

గత స్స నృపతి స్తత్ర గంతవ్యం యత్ర తేనవై
ప్రవృత్తిరేషా మర్త్యానాం త్వంతు మిథ్యా విహన్యసే. ౧౨

టీక॥ సః=ఆ; నృపతిః= దశరథమహారాజు; తేన= అతనిచేత ; ("వై" అనునదిపాదపూరణార్థము) యత్ర= ఎచ్చటికి; గంతవ్యం= పోవుటకావలయునో; తత్ర=అచ్చటికి; గతః= పోయినాఁడు. ఏషా=ఇది; మర్త్యానాం =మనుష్యులకు; ప్రవృత్తిః=స్వభావము, త్వంతు=నీవుమాత్రము; మిథ్యా= అబద్ధమగుసంబంధముచేత; విహన్యసే= పీడింపఁబడుచున్నావు.

దశరథమహారాజు, ఎచ్చటికిఁబోవలయునో, అచ్చటికేపోయినాఁడు ; మరేమియువిశేషములేదు; ఇది, మనుష్యులకందఱకునుస్వభావము; నీవు మాత్రము, లేనిసంబంధమునొకటిఁబెట్టుకొని బాధపడుచున్నావు.

అని, తాత్పర్యము.

అర్థధర్మ పరా యే యే తాంస్తాన్ శోచామి నేతరాన్
తేహి దుఃఖ మిహ ప్రాప్య వినాశం ప్రేత్య భేజిరే. ౧౩

టీక॥ యేయే=ఎవ్వరెవ్వరు;అర్థధర్మపరాః= కేవలధనపరులును, కేవలధర్మపరులుగా;భవంతి(అధ్యాహృతము)=అగుచున్నారో;తాంస్తాన్=వారివారినిగూర్చి;శోచామి= దుఃఖించుచున్నాను.ఇతరాన్ = ఇతరులనుగూర్చి;న(శోచామి)=దుఃఖింపను. తే=వారలు;ఇహ=ఇచ్చటను;దుఃఖం= దుఃఖమును;ప్రాప్య=పొంది;ప్రేత్య= చచ్చియు;వినాశం=నాశమును;భేజిరేహి= పొందుదురుగదా.

కేవలధనసంపాదనమునందుమాత్రమెయాసక్తులుగాని గేవలధర్మాచరణంబునందుమాత్రమెయాసక్తులుగాని యయి,ఐహికభోగంబులువిడుచునట్టి వారలంజూచిమాత్రమునాకు మిక్కిలియుదుఃఖముగలుగుచున్నది;వారలు,ఇచ్చటనుజెడి, యచ్చటనుజెడెదరు.

అని, తాత్పర్యము.

అష్టకా పితృ దైవత్య మిత్యయం ప్రసృతో జనః
అన్నస్యోపద్రవం పశ్య మృతోహి కి మ శిష్యతి. ౧౪

టీక॥ అష్టకా=అష్టకాశ్రాద్ధము.పితృదైవత్యం= ప్రత్యాబ్దికశ్రాద్ధము. ఇతి=అని; అయం= ఈ; జనః = జనము; ప్రసృతః = ప్రవర్తించుచున్నది. అన్నస్య = అన్నముయొక్క; ఉపద్రవం=నాశమును; పశ్య= చూడుము. మృతః=చచ్చినవాఁడు ; కింహి=దేనినిఁ; అశిష్యతి=తినఁగలఁడు?

అష్టకాశ్రాద్ధమనియుఁ బ్రత్యాబ్దికమనియుఁ, పితరులనుగురించి, జనులు శ్రాద్ధములుసేయుచున్నారు; సుఖముగాఁ దాముభుజింపవలసిన తిమయన్నమునకుఁదెచ్చిపెట్టుకొన్న నాశమును చూడుము ; చచ్చినవాఁడేమితినఁగలఁడు? కావున,నంతసెలవును, వ్యర్థమేకదా! అని,తాత్పర్యము.

యది భుక్త మిహాన్యేన దేహ మన్యస్య గచ్ఛతి

స ౧౦౮

దద్యాత్ప్రవసత శ్శ్రాద్ధం నతత్పథ్యశనం భవేత్. ౧౫

టీక॥ ఇహ=ఇచ్చట; అన్యేన=ఇతరుని చేత; భుక్తం=భుజింపఁబడిన యన్నము; అన్యస్య=ఇతరుని యొక్క; దేహం=దేహమును; గచ్ఛతియది=పొందునేని; ప్రవసతః=దూర దేశంబున నున్నవానికి; శ్రాద్ధం=శ్రాద్ధమును; దద్యాత్=ఇవ్వవలయును. తత్=అది; పథి=మార్గమునందు; అశనం=ఆహారము; న భవేత్=కాదా!

ఒక్కఁడు మఱియొక్కఁడు భుజించిన యన్నము, దేశాంతరమున నుండు మఱియొకని దేహమును బొంది, యతనికుపయోగపడునేని, దూర దేశంబుననున్నవానికిని, అతని పుత్రాదులు శ్రాద్ధంబుఁ బెట్టుదురు గాక; అట్లు చేసినచో, నా శ్రాద్ధమునందు నిమంత్రితుల చే భుక్తమయిన యన్నము, ఆ దూర దేశంబుననున్నవానికి దారిబత్తెము కావచ్చును!

అని, తాత్పర్యము.

దానసంవననా హ్యేతే గ్రంథా మేధావిభిః కృతాః
యజస్వ దేహి దీక్షస్వ తప స్తప్యస్వ సంత్యజ. ౧౬

టీక॥ "యజస్వ=దేవతలనారాధింపుము. దేహి=ఇమ్ము. దీక్షస్వ=యాగ దీక్ష వహింపుము. తపః=తపస్సును; తప్యస్వ=చేయుము. సంత్యజ=చనక్కఁగాఁ విడువుము." ఏతే=ఈ; మేధావిభిః=అధికమయిన బుద్ధిగలవారలచేత; కృతాః=చేయఁబడిన; గ్రంథాః=గ్రంథములు; దానసంవననాహి=దానవశీకరణోపాయములుగదా!

"దేవతలనారాధింపుము; దానంబులు సేయుము; యాగాదులందు దీక్ష వహింపుము; తపస్సు గావింపుము; అన్నిటి నవిడువుము." ఇట్లు, బుద్ధిమంతులగువారలు, ఉపాయంబున, ద్రవ్యంబు నాకర్షించుటకై, ఈగ్రంథంబులను వచియించిరి. అని, తాత్పర్యము.

స నాస్తి పరమిత్యేవ కురు బుద్ధిం మహామతే
ప్రత్యక్షం యత్తదాతిష్ఠ పరోక్షం పృష్ఠతః కురు. ౧౬

టీక॥ మహామతే = అధికమయిన బుద్ధిగలరాముఁడా! సః=అట్టి; త్వం (అధ్యాహృతము)=నీవు; పరం = పరలోకము; నాస్తి= లేదు. ఇత్యేవ=అనియే; బుద్ధిం=బుద్ధిని ; కురు = చేయుము. యత్=ఏది; ప్రత్యక్షం= ప్రత్యక్షమయినఫలముగలదో; తత్=దానిని; అతిష్ఠ= అవలంబింపుము. పరోక్షం= పరోక్షఫలమయినదాని ; పృష్ఠతః=వెనుకను; కురు=చేయుము.

మహాబుద్ధిశాలివగు రాముఁడా! అట్లుకావున , నీవుపరలోకమేలేదనినిశ్చయించుకొనుము ; ప్రత్యక్షఫలదములయినరాజ్యభోగాదులనవలంబింపుము; పరోక్షఫలకములగుపితృవచనపరిపాలనాదిధర్మములనువిడువుము.

అని, తాత్పర్యము.

స తాం బుద్ధిం పురస్కృత్య సర్వలోకనిదర్శినీమ్
రాజ్యం త్వం ప్రతిగృహ్ణీష్వ భరతేన ప్రసాదితః.౧౮

టీక॥ సః=అట్టి; త్వం=నీవు; సర్వలోకనిదర్శినీం= సమస్తలోకంబులందునుదాహరణముగల ; తాం = అట్టి; బుద్ధిం=బుద్ధిని; పురస్కృత్య=మున్నిడుకొని; భరతేన=భరతునిచేత ; ప్రసాదితః=వేఁడుకొనఁబడినవాఁడవై ; రాజ్యం=రాజ్యమును; ప్రతిగృహ్ణీష్వ=ప్రతిగ్రహింపుము.

నీవు, అట్లుసర్వసమ్మతమయిన, ప్రత్యక్షమునకన్ననధికమేదియును లేదనునిశ్చయంబునవలంబించి , భరతునిప్రార్థననువిని , రాజ్యంబునంగీకరింపుము. అని, జాబాలి, రామునకుం జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే ,
అయోధ్యాకాండే, అష్టోత్తరశతతమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండాష్టోత్తరశతతమసర్గటీక,
ముగిసినది.

శ్రీ

నవోత్తరశతతమసర్గప్రారంభః.

జాబాలేస్తు వచశ్శ్రుత్వా రామ స్సత్యాత్మనాం వరః
ఉవాచ పరయా భక్త్యా స్వబుద్ధ్యాచా విపన్నయా. ౧

టీక॥ సత్యాత్మనాం=సత్యమయిన బుద్ధిగలవారలలో; వరః=శ్రేష్ఠుడగు; రామః=రాముడు; జాబాలేః=జాబాలియొక్క ; వచః=మాటను; శ్రుత్వాతు=వినినంతనే; పరయా=అధికమయిన; భక్త్యా=భక్తిచేతను; అవిపన్నయా=చలనమునొందనట్టి; స్వబుద్ధ్యాచ= తన బుద్ధిచేతను; ఉవాచ=చెప్పెను.

సత్వబుద్ధులలో నుత్తముండగు రాముండు, జాబాలిచెప్పినమాటనువిని తనకుంగలవైదికశ్రద్ధనువిడువక, బుద్ధిం జలనంబునొందక, ఇట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

భవాన్మే ప్రియకామార్థం వచనం య దిహోక్తవాన్
అకార్యం కార్యసంకాశ మపథ్యం పథ్యసమ్మితమ్. ౨

టీక॥ భవాన్=నీవు; మే= నాకు; ప్రియకామార్థం = ప్రియమునందలికోరికకొఱకు; ఇహ = ఇప్పుడు; యత్=ఏ ; వచనం=మాటను; ఉక్తవాన్ = చెప్పితివో; తత్ (అధ్యాహృతము) = ఆమాట; కార్యసంకాశం= కార్యముతోసమానమయిన; అకార్యం= అకార్యము. పథ్యసమ్మితం = హితముతో సమానమయిన; అపథ్యం=అహితము.

నీవు, నాకుఁ, బ్రియంబులగుపట్టాభిషేకాదులందుఁ గోరిక గలుగుటకై, చెప్పినమాట, యుక్తమువలెనగుపడుచున్నదిగాని మిక్కిలియయుక్తము; హితమువలెనేయున్నది గాని మిక్కిలి యుహితముగాడు జెచ్చునది. అని, తాత్పర్యము.

నిమర్యాదస్తు పురుషః పాపాచారసమన్వితః
మానం న లభతే సత్సు భిన్నచారిత్రదర్శనః. ౩

టీక॥ నిర్మర్యాదః= మర్యాదలేనివాఁడును ; పాపాచారసమన్వితః = పాపముగలిగించునట్టియాచారముతోఁ గూడినవాఁడును ; భిన్నచారిత్రదర్శనః= విరుద్ధమయినయాచారముగలమతముగలవాఁడునగు; పురుషస్తు= పురుషుఁడుమాత్రము; సత్సు=సత్పురుషులయందు; మానం=పూజను; నలభతే=పొందఁడు.

మర్యాదారహితుండును బాపిష్ఠమయినయాచారముగలవాఁడును, వేదవిరుద్ధమయిన యాచారమునువిధించునట్టి మతంబునవలంబించినవాఁడునగు పురుషునిసత్పురుషులెంతమాత్రముగౌరవింపరు. అని, తాత్పర్యము.

కులీన మకులీనంవా వీరం పురుషమానినమ్
చారిత్రమేవ వ్యాఖ్యాతి శుచింవా యదివాఽశుచిమ్. ౪

టీక॥ కులీనం=మంచికులమునందుఁ బుట్టినవానిఁగాని; అకులీనంవా= దుష్టకులంబునంబుట్టినవానిఁగాని ; వీరం= పరాక్రమవంతునిఁగాని ; పురుషమానినం= పురుషుండనునహంకారముమాత్రముగలవానిఁగాని; శుచింవా = పరిశుద్ధునిఁగాని; అశుచింయదివా = అపరిశుద్ధునిఁగాని; చారిత్రమేవ= చరిత్రమె ; వ్యాఖ్యాతి = వివరించిచెప్పుచున్నది.

మంచికులంబునంబుట్టుటయునుగాని, దుష్టకులంబునంజన్మించుటనుగాని, పరాక్రమశాలియగుటనుగాని; భయశీలుండగుటనుగాని, పరిశుద్ధుండగుటనుగాని, అపరిశుద్ధుండగుటనుగాని, యాచారమే తెలుపును. అని, తాత్పర్యము.

అనార్య స్త్వార్య సంకాశ శ్శౌచాద్ధీన స్తథాశుచిః
లక్షణ్యవదలక్షణ్యో దుశ్శీల శ్శీలవానివ. ౫
అధర్మం ధర్మవేషేణ యదీమం లోకసంకరమ్
అభిపత్స్యే శుభం హిత్వా క్రియావిధివివర్జితమ్. ౬
కశ్చేతయానః పురుషః కార్యాకార్యవిచక్షణః
బహుమంస్యతి మాం లోకే దుర్వృత్తం లోకదూషణమ్. ౭

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను; అనార్యస్తు=దుష్టుండనయ్యు ; ఆర్యసంకాశః= పూజ్యునితోసమానుఁడనై; తథా=అట్లు; శౌచాత్ = పారిశుద్ధ్యమువలన; హీనః= విడువఁబడినవాఁడనై; శుచి(రివస్థితః)= పరిశుద్ధుండువలెనున్నవాఁడనై; అలక్షణ్యః= శిష్టలక్షణములేనివాఁడనై ;లక్షణ్యవత్ =లక్షణముగలవాఁడువలెనున్నవాఁడనై ; దుశ్శీలః=దుష్టస్వభావముగలవాఁడనై; శీలవానివ(స్థితః)= సత్స్వభావముగలవాఁడువలెనున్నవాఁడనై; శుభం = మంగళకరమయినధర్మమును ; హిత్వా=విడిచి; క్రియావిధివివర్జితం = వైదికకర్మముచేతను వైదికవిధులచేతనువిడువఁబడిన; లోకసంకరం= లోకసంకరముసేయునట్టి; ఇమం=ఈ; అధర్మం=అధర్మమును ; అభిపత్స్యే యది=పొందుదు నేని;దుర్వృత్తం=దుష్టాచారముగలవాఁడును ; లోకదూషణం=లోకులఁజెఱచువాఁడునగు;మాం = నన్ను; లోకే = లోకమునందు; చేతయానః=జ్ఞానవంతుఁడును;కార్యాకార్యవిచక్షణః= కార్యాకార్యములందుఁ బండితుండునగు; పురుషః = పురుషుఁడు; కః=ఎవ్వఁడు;బహుమంస్యతి=గౌరవించును?

నేను, దుష్టుండనైయోగ్యుండనుం బోలె,నపరిశుద్ధుండనైశుద్ధుండనుంబోలె,దుష్టలక్షణంబులుగలవాఁడనైమంచిలక్షణంబులుగలవాఁడనుంబోలె , దుస్స్వభావంబు గలవాఁడనై సత్స్వభావంబుగలవాఁడనుంబోలె, మంగళకరంబగుధర్మంబువిడిచి, వైదికక్రియావిధులనువర్జించి,లోకసంకర కారణంబగు నీవుచెప్పినయధర్మంబు నవలంబింతు నేని , అట్టిదురాచారుండనులోకదూషకుండనగునన్ను,లోకంబునందుఁ,గార్యాకార్యంబులుదెలిసినవాఁడునుజ్ఞానవంతుండునగుపురుషుండెవ్వఁడు , సన్మానించును. అనితాత్పర్యము.

కస్య దాస్యామ్యహంవృత్తం కేనవా స్వర్గమాప్నుయామ్
అనయా వర్తమానోఽహం వృత్త్యా హీనప్రతిజ్ఞయా. ౮

టీక॥అహం = నేను; హీనప్రతిజ్ఞయా = విడువఁబడినప్రతిజ్ఞగల; అనయా=ఈ;వృత్త్యా=ఆచారముచేత; వర్తమానోఽహి=ఉండుదు నేని; వృత్తం=

ఆచారమును; కస్య=ఎవ్వనికి; దాస్యామి=ఉపదేశింతును? కేనవా= ఎందుచేత; స్వర్గం=స్వర్గమును; అప్స్యామి=పొందుదును.

నేను నాప్రతిజ్ఞను విడిచి. నీవు చెప్పినట్లు; ఈయధర్మిష్ఠాచారంబు నవలంబింతునేని, యటుపిమ్మట, నామాట నెవ్వరు విందురు? నాకును, ఏయుపాయంబున, స్వర్గంబుగల్గును?

అని, తాత్పర్యము.

కామవృత్త స్త్వయం లోకః కృత్స్నస్స ముపవర్తతే
యద్వృత్తా స్సంతి రాజాన స్తద్వృత్తా స్సంతిహి ప్రజాః. ౯

టీక॥ లోకః= జనము ; కృత్స్నః= అంతయు; స్వయం=తానె; కామవృత్తః=ఇచ్ఛాధీనమగు నాచారముగలది; సముపవర్తతే=అగును. రాజానః= రాజులు; యద్వృత్తాః= ఏయాచారముగలవారలు; సంతి=అగుదురో; ప్రజాః=జనులును; తద్వృత్తాః=ఆయాచారముగలవారలు; సంతిహి= అగుదురుగదా!

నేనట్లధర్మంబున నవలంబింతునేని, జనులందఱుయథేచ్ఛంబుగా నాచరించుచు, నధర్మమార్గంబు నవలంబించి, చెడిపోవుదురు ; రాజు, ఏయాచారము నవలంబించునో; ఆయాచారమునే గదా జనులుగూడ నవలంబింతురు!

అని, తాత్పర్యము.

సత్య మేవా నృశంసంచ రాజవృత్తం సనాతనమ్
తస్మా త్సత్యా త్మకం రాజ్యం సత్యే లోకః ప్రతిష్ఠితః. ౧౦

టీక॥ అనృశంసంచ= క్రూరముగానిదియు; సనాతనం=నిత్యమునగు; రాజవృత్తం= రాజధర్మము. సత్యమేవ=సత్యస్వరూపమే; తస్మాత్= అందువలన; రాజ్యం=రాజ్యము; సత్యాత్మకం=సత్యస్వరూపము. సత్యే= సత్యమునందు; లోకః=లోకము ; ప్రతిష్ఠితః=ప్రతిష్ఠింపఁబడినది.

దయయె ప్రధానముగాఁగల శాశ్వతంబగు రాజధర్మము, సత్యరూపము గావున, రాజ్యమంతయు సత్యస్వరూపమయినది; ఆసత్యమునందే లోకమంతయుఁబ్రతిష్ఠితమయినది; నేనట్టి సత్యము నెట్లువదలుదును? అని; తాత్పర్యము.

ఋషయశ్చైవ దేవాశ్చ సత్యమేవహి మేనిరే
సత్యవాదీహి లోకేస్మిన్ పరమం గచ్ఛతి క్షయమ్. ౧౧.

టీక॥ ఋషయశ్చైవ=ఋషులును; దేవాశ్చ=దేవతలును; సత్యమేవ= సత్యమునే; మేనిరే=తలంచిరి. సత్యవాదీ=సత్యమునె చెప్పువాఁడు; అస్మిన్= ఈ; లోకే=లోకమునందు; పరమం= ఉత్కృష్టమయిన; క్షయం=స్థానమును; గచ్ఛతిహి=పొందునుగదా!

ఋషులును దేవతలును, సత్యమునే పరమోత్కృష్టముగాఁ జెప్పిరి; ఈలోకంబున, సత్యవాదియగువాఁడు, పరమపదంబునొందును. అని, తాత్పర్యము.

ఉద్విజంతే యథా సర్పా న్నరా దనృతవాదినః
ధర్మ స్సత్యం పరో లోకే మూలం స్వర్గస్య చోచ్యతే. ౧౨

టీక॥ జనాః(అధ్యాహృతము)= జనులు; అనృతవాదినః= అబద్ధమును జెప్పునట్టి; నరాత్ =మనుష్యునివలన; సర్పాద్యథా=సర్పమువలనవలె;ఉద్విజంతే=భయపడుదురు. లోకే = లోకమునందు ; సత్యం = సత్యము;పరః= శ్రేష్ఠమయిన; ధర్మః = ధర్మము. స్వర్గస్య = స్వర్గము ; మూలం చ= కారణమునుగా; ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

జనులు, అబద్ధమునుజెప్పువానింజూచి, సర్పమునుజూచినట్లుభయపడుదురు;సత్యమెపరమధర్మము;అదియే స్వర్గమునకును గారణమని చెప్పెదరు. అని, తాత్పర్యము.

సత్య మేవేశ్వరో లోకె సత్యం పద్మాశ్రితా సదా
సత్యమూలాని సర్వాణి సత్యాన్నాస్తి పరం పదమ్. ౧౩

టీక॥ లోకే=లోకమునందు ; ఈశ్వరః=ఈశ్వరుఁడు; సత్యమేవ = సత్యమే. పద్మా=లక్ష్మి; సదా= ఎల్లప్పుడును; సత్యం=సత్యమును ; ఆశ్రితా=పొందినది. సర్వాణి=సమస్తములును; సత్యమూలాని = సత్యమేమూ

లముగాఁగలవి. సత్యాత్= సత్యము కన్నను;పరం=అధికమయిన ; పదం= స్థానము; నాస్తి=లేదు.

ఈశ్వరుఁడునుసత్యస్వరూపుఁడే;ల క్ష్మియునుసత్యమునేయెల్లప్పుడు నాశ్ర యించియుండును; సమస్తమునకు స త్యమేయాధారము; సత్యమునకన్నను, అధికమేదియులేదు. అని, తాత్పర్యము.

దత్తమిష్టం హుతం చైవ తప్తాని చ తపాంసిచ
వేదా స్సత్యప్రతిష్ఠానా స్తస్మా త్సత్య పరో భవేత్.౧౪

టీక॥ దత్తం= దానమును; ఇష్టం చ=యాగమును; హుతంచైవ=హో మమును; తప్తానిచ=చేయఁబడిన; త పాంసిచ = తపస్సులును ; సత్య ప్రతిష్ఠా నాని (అధ్యాహృతము) = సత్యమే యాధారముగాఁ గలవి; వే దాః=వేదములు ; సత్యప్రతిష్ఠానాః= సత్యమే యాధారముగాఁగలవి. త స్మాత్=అందువలన; సత్యపరః= సత్య మునందాసక్తుఁడు;భవేత్ =కావలెను.

దానములునుయాగములును హో మములునుదపస్సులును , వీనికన్నిఁటికి నిసత్యమేయాధారము; వేదములకును సత్యమేయాధారము; కావునసత్యము నువదలఁగూడదు.అని, తాత్పర్యము.

ఏకః పాలయతే లోక మేకః పాలయతే కులమ్
మజ్జత్యే కోహి నిరయే ఏక స్స్వర్గే మహీయతే. ౧౫

టీక॥ఏకః=ఒక్కఁడు ; లోకం= లోకమును; పాలయతే= పాలించు ను.ఏకః=ఒక్కఁడు;కులం= వంశము ను;పాలయతే=పాలించును.ఏకః= ఒ క్కఁడు; నిరయే=నరకమునందు; మ జ్జతిహి=మునుఁగుచున్నాఁడుగదా. ఏ కః=ఒక్కఁడు; స్వర్గే= స్వర్గము నందు;మహీయతే = పూజ్యుఁడగుచు న్నాఁడు.

లోకంబున, నొకండు లోకంబుఁ బాలించును;ఒకఁడుకులమునుబాలించు ను;ఒకఁడునరకంబునంబడును ; ఒకఁ డుస్వర్గంబునఁదేజరిల్లుచుండును; అ ట్లు,సత్యవంతుండును, అసత్యవంతుం డును,దత్తఫలంబులంబొందుదురు.

అని, తాత్పర్యము.

సోహం పితు ర్నియోగంతు కిమర్థం నానుపాలయే
సత్యప్రతిశ్రవ స్సత్యం సత్యేన సమయీకృతః. ౧౬

టీక॥ సత్యప్రతిశ్రవః= సత్యమయిన ప్రతిజ్ఞ గలవాఁడును ; సత్యేన=సత్యముచేత; సమయీకృతః= శపథముసేయింపఁబడినవాఁడునగు; సః=అట్టి;అహం= నేను; సత్యం=సత్యమయిన; పితుః=తండ్రియొక్క; నియోగంతు = ఆజ్ఞనుమాత్రము; కిమర్థం= ఎందుకొఱకు; నానుపాలయే= పాలింపను.

సత్యప్రతిజ్ఞుండను, సత్యముగవనవాసంబుగావించెదననిశపథముగావించినవాఁడనగు, నేను , సత్యస్వరూపమయినతండ్రియాజ్ఞను, ఎట్లు, గావింపకుందును? అని, తాత్పర్యము.

నైవ లోభా న్నమోహాద్వా నహ్యజ్ఞానా త్తమోన్వితః
సేతుం సత్యస్య భేత్స్యామి గురో స్సత్యప్రతిశ్రవః. ౧౭

టీక॥సత్యప్రతిశ్రవః=సత్యప్రతిజ్ఞుండనగు ; అహం(అధ్యాహృతము)=నేను; గురోః=తండ్రియొక్క;సత్యస్య=సత్యముయొక్క; సేతుం=మర్యాదను; లోభాత్ =ఆశవలన;నైవభేత్స్యామి= భేదింపనే భేదింపను- అజ్ఞానాత్ = అజ్ఞానమువలన; న(భేత్స్యామి)హి = భేదింపను,తమోన్వితః= తమోగుణముతోఁగూడినవాఁడనై;నభేత్స్యామి (అధ్యాహృతము)= భేదింపను.

సత్యప్రతిజ్ఞుండగు నేను, రాజ్యలోభంబునంగాని,చిత్తభ్రమంబునంగాని. యజ్ఞానంబునంగాని తమోగుణంబునొందిగాని, యేదియెట్లయినను,నాతండ్రి దశరథమహారాజు సత్యంబును , భేదింపను. అని, తాత్పర్యము.

అసత్యసంధస్య సత శ్చలస్యా స్థిరచేతసః
నైవ దేవా నపితరః ప్రతీచ్ఛంతీతి నశ్శ్రుతమ్. ౧౮

టీక॥ అసత్యసంధస్య=సత్యప్రతిజ్ఞుఁడుగానివాఁడుగా;సతః=ఉన్నవాఁడును;

చలస్య= చంచలుండును; అస్థిరచేతసః=స్థిరముగానిమనస్సుగలవాఁడునగు వానియొక్క; హవ్యకవ్యాదికం(అధ్యాహృతము)=హవ్యకవ్యములు మొదలగు దానిని; దేవాః= దేవతలు; నైవప్రతీచ్ఛంతి= అంగీకరింపనేయంగీకరింపరు. పితరః=పితృదేవతలు; న(ప్రతీచ్ఛంతి)=అంగీకరింపరు. ఇతి=అని; నః= మాకు; శ్రుతం=వినఁబడినది.

అసత్యంబుఁ జెప్పువాఁడును జపలుండును అస్థిరహృదయుండునగు వాఁడు హవ్యకవ్యంబు లొసంగినను దేవతలుగానిపితరులుగానియంగీకరింపరని, మే మువినియున్నాము. అని, తాత్పర్యము.

ప్రత్యగాత్మ మిమం ధర్మం సత్యం పశ్యామ్యహం స్వయమ్
భార స్సత్పురుషాచీర్ణ స్తదర్థ మభిమన్యతే. ౧౯

టీక॥అహం=నేను; స్వయం=నేనె; ఇమం=ఈ; సత్యం = సత్యరూపమయిన; ధర్మం = ధర్మమును; ప్రత్యగాత్మం=ఆత్మన్ననభిన్నమునుగా; పశ్యామి=చూచుచున్నాను. తదర్థం=అందుకొఱకు; సత్పురుషాచీర్ణః= సత్పురుషులచేనాచరింపఁబడిన; భారః = బరువు; అభిమన్యతే = అభిమతముగానున్నది.

సత్యరూపంబగునీధర్మము, ఆత్మస్వరూపమనినాయభిప్రాయము; కావుననె, సత్పురుషులాచరించినట్లు, ఈజటావల్కలాదిభారమును, అంగీకరించియున్నాను. అని, తాత్పర్యము.

క్షాత్రం ధర్మ మహం త్యక్ష్యే హ్యధర్మం ధర్మసంహితమ్
క్షుద్రై ర్నృశంసై ర్లుబ్ధైశ్చ సేవితం పాపకర్మభిః. ౨౦

టీక॥క్షుద్రైః=అల్పులును; నృశంసైః=క్రూరులును; లుబ్ధైశ్చ= లుబ్ధులును; పాపకర్మభిః= పాపముగల్గించుకార్యములుగలవారలునగు వారలచేత; సేవితం=సేవింపఁబడినదియు; ధర్మసంహితం = ధర్మముతోఁగూడినదియు; అధర్మం = అధర్మమయమునగు; క్షాత్రం=క్షత్రియసంబంధియగు; ధర్మం=ధర్మమును; అహం=నేను; త్యక్ష్యేహి=విడుతునుగదా!

శూద్రులును గ్రూరులును లుబ్ధులును పాపులునగువారలచే సేవింపఁబడునట్టి క్షత్రియధర్మమును నేను విడిచెదను ; అందుధర్మము మిక్కిలియుస్వల్పము; అధర్మమధికము. అని, తాత్పర్యము.

కాయేన కురుతే పాపం మనసా సంప్రధార్య చ
అనృతం జిహ్వయా చాహ త్రివిధం కర్మపాతకమ్. ౨౧

టీక॥ మనసా = మనసుచేత; సంప్రధార్యచ = నిశ్చయించుకొనియు; కాయేన = దేహముచేత; పాపం = పాపమును; కురుతే = చేయుచున్నాఁడు. జిహ్వయాచ = నాలుకచేతను; అనృతం = అబద్ధమును; ఆహ = చెప్పును. పాతకం = పాపరూపమయిన; కర్మ = కార్యము; త్రివిధం = మూఁడువిధములుగలది.

మనుష్యుండు, మొదలుమనసునని శ్చయించుకొనును; ఆపిమ్మట దేహముచేఁ జేయును; నాలుకనబద్ధమాడును; ఇట్లు, మానసిక కాయికవాచికములని పాపము మూఁడువిధములు.

అని, తాత్పర్యము.

భూమిః కీర్తి ర్యశో లక్ష్మీః పురుషం ప్రార్థయంతి హి
స్వర్గస్థం చానుపశ్యంతి సత్యమేవ భజేత తత్. ౨౨

టీక॥ భూమిః = భూమియు; కీర్తిః = సత్కార్యముచేఁగలిగినకీర్తియు; యశః = పౌరుషముచేఁగలిగినకీర్తియు; లక్ష్మీః = లక్ష్మియు; పురుషం = సత్యవంతుఁడగుపురుషుని ; ప్రార్థయంతిహి = ప్రార్థించుచున్నవిగదా! స్వర్గస్థంచ = స్వర్గమునయున్నవానిని; అనుపశ్యంతి = అనుసరించిచూచుచుండును. తత్ = అందువలన; సత్యమేవ = సత్యమునే; భజేత = పొందవలయును.

భూమియుఁగీర్తియులక్ష్మియు, సత్యవంతుఁడగు పురుషునే పొందవలయునని గోరుచుండును; అతండుస్వర్గస్థుండైనను, అతనియందేదృష్టియుంచియుండును; కావున, సత్యము నేయవలంబింపవలయును. అని, తాత్పర్యము.

శ్రేష్ఠం హ్యనార్యమేవ స్యాద్య ద్భవా నవధార్య మామ్

ఆహ యుక్తికరైర్వాక్యై రిదం భద్రం కురుష్వహ. ౨౩

టీక॥ భవాన్=నీవు;శ్రేష్ఠం=ఉత్తమము; ఇతి(అధ్యాహృతము)=అని;అవధార్య=నిశ్చయించి; మాం=నన్నుఁగూర్చి;“ఇదం=ఇది; భద్రం=మంగళకరము;కురుష్వ=చేయుము;(“హ”అనునది పాదపూరణార్థము”) ఇతి(అధ్యాహృతము) = అని;యత్=ఏమాటను; యుక్తికరైః=యుక్తులచేయునట్టి; వాక్యైః=మాటలచేత;ఆహ = చెప్పితివో;తత్(అధ్యాహృతము) = అది;అనార్యమేవ = పూజ్యము కానిదే ; స్యాత్=అగును.

నీవు,ఉత్తమంబనియెంచి, “ఇదిమంగళకరము,దీనింజేయుము” అని,యుక్తియుక్తంబుగా నాకుఁజెప్పినావే; ఈ మాటయెంతమాత్రము యుక్తమయినదిగాదు.అని, తాత్పర్యము.

కథం హ్యహం ప్రతిజ్ఞాయ వనవాస మిమం గురౌ
భరతస్య కరిష్యామి వచో హిత్వా గురో ర్వచః. ౨౪

టీక॥అహం=నేను;గురౌ= తండ్రియందు;ఇమం=ఈ;వనవాసం= అడవినుండుటనుగూర్చి;ప్రతిజ్ఞాయ= ప్రతిజ్ఞ చేసి;గురోః = తండ్రియొక్క;వచః=మాటను;హిత్వా=విడిచి;కథంహి=ఎట్లు;భరతస్య = భరతునియొక్క; వచః=మాటను; కరిష్యామి = చేయుదును?

నేను, దండ్రియొద్ద,వనవాసంబుచేసెదనని ప్రతిజ్ఞ చేసి,యిప్పుడుదండ్రిమాటనువిడిచి , భరతునిమాటనెట్లుచేయుదును? అని, తాత్పర్యము.

స్థిరా మయా ప్రతిజ్ఞాతా ప్రతిజ్ఞా గురుసన్నిధౌ
ప్రహృష్యమాణా సా దేవీ కైకేయీచా భవత్తదా. ౨౫

టీక॥మయా=నాచేత ; గురుసన్నిధౌ=తండ్రిసమీపమునందు; స్థిరా=దృఢమయిన; ప్రతిజ్ఞా=ప్రతిన; ప్రతిజ్ఞాతా=చేయఁబడినది. తదా=అప్పుడు; దేవీ=రాణియగు; సా=ఆ; కైకేయీ చ=కైకేయియు; ప్రహృష్యమాణా=

మిక్కిలియుసంతోషించుచున్నది; అభవత్=అయినది.

నేను, నాతండ్రిసన్నిధానంబున, స్థిరమయిన ప్రతిజ్ఞ చేసినాను; అప్పుడందుకుఁ, గైకేయీదేవియు, మిక్కిలియుసంతోషంబునొందినది; అట్టిదానిని ప్పుడువిడుచుటసరిగాదు.

అని, తాత్పర్యము.

వనవాసం వసన్నేవం శుచి ర్నియతభోజనః
మూలైః పుష్పైః ఫలైః పుణ్యైః పితౄన్ దేవాంశ్చ తర్పయన్. ౨౬
సంతుష్టపంచవర్గోఽహం లోకయాత్రాం ప్రవర్తయే
అకుహశ్శ్రద్దధానస్సన్ కార్యాకార్యవిచక్షణః. ౨౭

టీ॥ కార్యాకార్యవిచక్షణః=కార్యాకార్యంబులందుఁబండితుండనగు; అహం=నేను; శ్రద్దధానస్సన్=శ్రద్ధగలవాఁడనగుచు; అకుహః=కృత్రిమబుద్ధిలేనివాఁడనై; ఏవం=ఇట్లు; శుచిః = పరిశుద్ధుండనై; నియతభోజనః= స్వల్పమయినయాహారముగలవాఁడనై; వనవాసం=వనవాసమును; వసన్=చేయుచు; పుణ్యైః = పవిత్రములగు; మూలైః=గడ్డలచేతను; పుష్పైః=పూలచేతను; ఫలైః=పండ్లచేతను; పితౄన్=పితరులను; దేవాంశ్చ=దేవతలను; తర్పయన్=తృప్తినొందించుచు; సంతుష్టపంచవర్గః=సంతోషమునొందిన పంచేంద్రియముల సమూహము గలవాఁడనై; లోకయాత్రాం=జీవనమును; ప్రవర్తయే=చేసెదను.

నాకుఁగార్యాకార్యంబులు దెలియును; నేను, శ్రద్ధతోఁ, గృత్రిమబుద్ధిఁ బరిత్యజించి, పరిశుద్ధుండనై స్వల్పాహారుండనై, వనవాసంబు గావించుచుఁ, బవిత్రములగు మూలంబులచేతను బుష్పంబులచేతను ఫలంబులచేతను బితృదేవతలకును దేవతలకును దృప్తి గావించుచు, సంతుష్టసర్వేంద్రియుండనై కాలంబు గడపెదను. అని, తాత్పర్యము.

కర్మభూమి మిమాం ప్రాప్య కర్తవ్యం కర్మ యచ్ఛుభమ్
అగ్నిర్వాయుశ్చ సోమశ్చ కర్మణాం ఫలభాగినః. ౨౮

టీక॥జనైః(అధ్యాహృతము)=జనులచేత;ఇమాం=ఈ; కర్మభూమిం=కర్మభూమిని; ప్రాప్య=పొంది; యత్=ఏది; శుభం=మంగళకరమో; తత్(అధ్యాహృతము)=అట్టి; కర్మ=కర్మము; కర్తవ్యం=చేయఁబడవలయును. అగ్నిః = అగ్నిహోత్రుఁడును;వాయుశ్చ=వాయువును;సోమశ్చ=చంద్రుండును; కర్మణాం=కర్మములయొక్క; ఫలభాగినః= ఫలమునొందినవారలు.

జనులుకర్మభూమినుండు వఱకుఁ, గర్మమునవశ్యముసేయవలయును; అట్లు, అగ్నియును,వాయువును , జండ్రుండును,గర్మభూమియందుండు నప్పుడుకర్మములుగావించి,అగ్నిత్వవాయుత్వచంద్రత్వములంబొందిరి.

అని, తాత్పర్యము.

శతం క్రతూనా మాహృత్య దేవరా ట్త్రిదివం గతః
తపాంస్యుగ్రాణి చాస్థాయ దివం యాతా మహర్షయః.౨౯

టీక॥దేవరాట్=దేవేంద్రుఁడు;క్రతూనాం=యాగములయొక్క;శతం=నూటిని;ఆహృత్య=చేసి;త్రిదివం =స్వర్గమును;గతః=పొందినాఁడు. మహర్షయశ్చ=మహర్షులును;ఉగ్రాణి=భయంకరములగు; తపాంసి=తపస్సులను;ఆస్థాయ=అవలంబించి; దివం=స్వర్గమును;యాతాః=పొందిరి.

దేవేంద్రుండు, నూఱుయాగంబులుసేయుటవలన స్వర్గాధిపత్యంబునొందెను;మహర్షులును, భయంకరంబగు తపస్సుగావించి,స్వర్గంబునొందిరి.అని, రాముండుజాబాలికింజెప్పెను.

అని, తాత్పర్యము.

అమృష్యమాణః పున రుగ్రతేజా
నిశమ్య తం నాస్తికవాక్యహేతుమ్
అథాబ్రవీత్తం నృపతేస్తనూజో
విగర్హమాణో వచనాని తస్య. ౩౦

టీక॥అథ=అటుపిమ్మట ; ఉగ్రతేజాః=భయంకరమయినకాంతిగల ; నృ

పతేః = రాజుయొక్క; తనూజః = కొడుకైనరాముఁడు; తం = ఆ; నాస్తికవాక్యహేతుం = నాస్తికవాక్యమునందలియుక్తిని; నిశమ్య = విని; అమృష్యమాణః = ఓర్వనివాఁడై; తస్య = ఆజాబాలియొక్క; వచనాని = మాటలను; విగర్హమాణః = నిందించుచు; పునః = మఱల; తం = ఆజాబాలినిగూర్చి; అబ్రవీత్ = చెప్పెను.

అంత, భయంకరతేజుండగు దశరథమహారాజపుత్త్రుండు రాముండు, ఆజాబాలి చెప్పిననాస్తికవాక్యంబు నందలియుక్తిం దలంచి సహింపంజాలక, యతనిమాటలనునిందింపుచు, మఱలనతనింజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

సత్యంచ ధర్మంచ పరాక్రమంచ
భూతానుకంపాం ప్రియవాదితాంచ
ద్విజాతిదేవాతిథిపూజనంచ
పంథాన మాహు స్త్రిదివస్య సంతః. ౩౧

టీక॥ సంతః = సత్పురుషులు; సత్యంచ = సత్యమును; ధర్మంచ = ధర్మమును; పరాక్రమంచ = పరాక్రమమును; భూతానుకంపాం = భూతంబులయందుదయయును; ప్రియవాదితాం = ప్రియవచనములచెప్పుటను; ద్విజాతిదేవాతిథిపూజనంచ = బ్రాహ్మణులయొక్కయు దేవతలయొక్కయు నతిథులయొక్కయుఁబూజించుటను; త్రిదివస్య = స్వర్గముయొక్క; పంథానం = మార్గమునుగా; ఆహుః = చెప్పిరి.

సత్యము, ధర్మము, పరాక్రమము, భూతదయ, ప్రియభాషణము, దేవతార్చనము, బ్రాహ్మణపూజ, అతిథిసత్కారము, ఇవన్నియు స్వర్గమునకుమార్గమని సత్పురుషులు చెప్పుదురు. అని, తాత్పర్యము.

తే నైవ మాజ్ఞాయ యథావదర్థ
మేకోదయం సంప్రతిపద్య విప్రాః
ధర్మం చరంత స్సకలం యథావ
త్కాంక్షంతి లోకాగమ మప్రమత్తాః. ౩౨

టీక॥ తేన=అందుచేత ; విప్రాః=బ్రాహ్మణులు;ఏవం = ఇట్లు; యథావత్=యథార్థముగా; అర్థం=సంగతిని;ఆజ్ఞాయ = తెలిసికొని;ఏకోదయం=ఐకమత్యమును;ప్రతిపద్య=పొంది;అప్రమత్తాః=ఏమఱుపాటునొందనివారలై;సకలం=సమస్తమయిన;ధర్మం=ధర్మమును;యథావత్= యథాశాస్త్రముగా;చరంతః=ఆచరింపుచు;లోకాగమం=లోకప్రాప్తిని;కాంక్షంతి=కోరుచున్నారు.

కావునను, బ్రాహ్మణోత్తములందఱు, యథార్థముగనీయర్థముఁదెలిసి,యందఱునైకమత్యంబున, నేమఱక, స్వస్వవర్ణాశ్రమ విహితంబులగు ధర్మములనన్నింటిని యథాశాస్త్రంబుగనాచరింపుచు, స్వర్గాదిదివ్యలోకంబులంబొందఁగోరుచున్నారు.

అని, తాత్పర్యము.

నిందామ్యహం కర్మ పితుః కృతం త
ద్యస్త్వా మగృహ్ణా ద్విషమస్థబుద్ధిమ్
బుద్ధ్యా నయైవంవిధయా చరంతం
సునాస్తికం ధర్మపథా దపేతమ్. ౩౩

టీక॥ యః=ఎవ్వఁడు ; విషమస్థబుద్ధిం=తప్పుమార్గంబుననున్న బుద్ధిగలవాఁడవును;ఏవంవిధయా=ఇట్టి ; అనయా=ఈ;బుద్ధ్యా=దుర్బుద్ధిచేత;చరంతం=తిరుగుచున్నవాఁడవును; సునాస్తికం=మిక్కిలియునాస్తికుండవును ; ధర్మపథాత్= ధర్మమార్గముననుండి;అపేతం = విడివడినవాఁడవునగు; త్వాం=నిన్ను;అగృహ్ణాత్= గ్రహించెనో;తస్య(అధ్యాహృతము)= అట్టి;పితుః=తండ్రియొక్క;కృతం=చేయఁబడిన;తత్=ఆ;కర్మ=కార్యమును;అహం=నేను;నిందామి=నిందించుచున్నాను.

ఇట్లు, వేదవిరుద్ధంబగు బుద్ధిగలవాఁడవువై దిక వేషంబుధరించి యంతరంగంబునమహానాస్తికుండవై నాస్తిక మతంబు బోధించు వాఁడవు ధర్మమార్గంబువదలినవాఁడవునగు నిన్నుదగ్గిఱకుఁదీసినట్టినాతండ్రిగూడనిందనీయుఁడగుచున్నాఁడు. అని, తాత్పర్యము.

యథాహి చోర స్స తథాహి బుద్ధ
స్తథా గతం నా స్తిక మత్ర విద్ధి
తస్మా ద్ధియ శ్శంక్యతమః ప్రజానాం
న నా స్తికే నాభిముఖో బుధ స్స్యాత్. ౩౪

టీక॥ చోరః=దొంగ; యథాహి=ఎట్లో; సః=ఆ; బుద్ధః=బుద్ధుఁడు; తథాహి=అట్లుగదా! అత్ర=ఇచ్చట; నాస్తిం=నాస్తికుని; తథాగతం = బుద్ధునిఁగా; విద్ధి=ఎఱుంగుము; తస్మాత్ = అందువలన; యః=ఎవ్వఁడు; ప్రజానాం=జనులకు; శంక్యతమః=మిక్కిలి యుసందేహింపఁదగినవాఁడో; తేన (అధ్యాహృతము)=అట్టి; నాస్తికేన=నాస్తికునితో; బుధః=పండితుఁడు; అభిముఖః=ఎదురుమొగముగలవాఁడు; న స్యాద్ధి=కారాదుగదా!

బుద్ధుఁడుదొంగవంటివాఁడుగదా! నాస్తికునకును బుద్ధునకును ఎంతమాత్రము భేదములేదు; కావున, నాస్తికుని, జనులుకని పెట్టి యుండవలెను; పండితుండగువాఁడు, నాస్తికుని యెదుట నిలువరాదు-అని, తాత్పర్యము-

త్వత్తో జనాః పూర్వతరే వరాశ్చ
శుభాని కర్మాణి బహూని చక్రుః
జిత్వా సదేమంచ పరంచ లోకం
తస్మా ద్ద్విజా స్స్వస్తి హుతం కృతంచ. ౩౫

టీక॥ త్వత్తః=నీకన్నను; పూర్వతరే=మునుపటివారలును; వరాశ్చ=శ్రేష్ఠులునగు; జనాః=జనులు; శుభాని=మంగళకరములగు; కర్మాణి=కర్మములను; బహూని=పెక్కులను; చక్రుః=చేసిరి; తే(అధ్యాహృతము)=వారలు; సదా=ఎల్లప్పుడును; ఇమం=ఈలోకమును; పరం = ఇతరమయిన; లోకంచ=లోకమును; జిత్వా= జయించి; వర్తంతే(అధ్యాహృతము)= ఉన్నారు. తస్మాత్=అందువలన; ద్విజాః=ద్విజులు; స్వస్తి= మంగళకరమగు; హుతం=హోమమును; కృతంచ=కర్మమును; కుర్వంతి(అధ్యాహృతము)=

చేయుచున్నారు.

నీకు మునుపటివారలును నీకన్నను త్తములనగువారలనేకులు, శుభకర్మంబుల నేకంబులంగావించి, ఇహపరలోకంబుల రెంటెనిజయించి, సర్వోత్కర్షంబున, నాకాశంబునందుచంద్రనక్షత్రాదిరూపంబున వెలుంగుచున్నారు ; అందువలన, ద్విజులు , యాగాదిశుభకర్మంబులంగావింతురు.

అని, తాత్పర్యము-

ధర్మే రతా స్సత్పురుషై స్సమేతా
స్తేజస్వినో దానగుణప్రధానాః
అహింసకా వీతమలాశ్చ లోకే
భవంతి పూజ్యా మునయః ప్రధానాః. ౩౬

టీక॥ ధర్మే=ధర్మమునందు ; రతాః=ఆసక్తులును; సత్పురుషైః= సత్పురుషులతో; సమేతాః= కూడినవారలును; తేజస్వినః = అధికమయినకాంతిగలవారలును; దానగుణప్రధానాః = ఈవియనుగుణమేప్రధానముగాఁగలవారలును;అహింసకాః=హింససేయనివారలును ; వీతమలాశ్చ=విడువఁబడినమలముగలవారలునగు ; ప్రధానాః=శ్రేష్ఠులయిన;మునయః= మునులు;లోకే = లోకమునందు ; పూజ్యాః = పూజింపఁదగినవారలు;భవంతి=అగుచున్నారు.

మిక్కిలియు ధార్మికులునుసత్పురుషులతో మాత్రము సహవాసముసేయువారలును తేజశ్శాలులును, పరమదాతలును,అహింసకులును,నిర్మలులునగు మునిశ్రేష్ఠులు , లోకమునకంతయుఁ,బూజనీయులు. అని, రాముండు, జాబాలితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి బ్రువంతం వచనం సరోషం
రామం మహాత్మాన మదీనసత్త్వమ్
ఉవాచ తథ్యం పునరాస్తికంచ
సత్యం వచ స్సానునయంచ విప్రః. ౩౭

టీక॥విప్రః=బ్రాహ్మణుఁడగుజాబాలి;ఇతి=అని;వచనం=మాటను; బ్రువంతం=చెప్పుచున్నవాఁడును; సరోషం=కోపముతోఁ గూడినవాఁడును; మహాత్మానం= అధికమయినధైర్యముగలవాఁడును;అదీనసత్త్వం= తక్కువకానిబలముగలవాఁడునగు;రామం = రాముని గూర్చి;పునః=మఱల;తథ్యం= యథార్థమును;ఆస్తికంచ=ఆస్తికమతబోధకమును;సత్యం= సత్పురుషులకుహితంబును;సానునయంచ = ఊఱడించుటతోఁ గూడినదియునగు;వచః=మాటను; ఉవాచ=చెప్పెను.

అంతజాబాలి, యిట్లు సరోషంబుగాఁజెప్పుచున్నమహాత్ముండునుమహాబలుండునగురాముంజూచి, సవినయంబుగననునయింపుచు,సమస్తశాస్త్రసమ్మతంబునుఆస్తికమతబోధకంబును,సత్పురుషసమ్మతంబును,యథార్థంబునగునీమాటంజెప్పెను.అని, తాత్పర్యము.

న నాస్తికానాం వచనం బ్రవీ మ్యహం
న నాస్తి కోహం నచ నాస్తి కించన
సమీక్ష్య కాలం పునరాస్తికోభవం
భవేయ కాలే పునరేవ నాస్తికః. ౩౮

టీక॥అహం = నేను; నాస్తికానాం=నాస్తికులయొక్క; వచనం = మాటను; నబ్రవీమి = చెప్పలేదు. అహం=నేను; నాస్తికః=నాస్తికుఁడను; న=కాను.కించనచ=ఏదియు;ననాస్తి=లేకపోలేదు;పునః=మఱల;కాలం=కాలమును; సమీక్ష్య=చూచి; అభవం = అగుదును. పునరేవ=మఱియునే; కాలే=కాలమునందు; నాస్తికః= నాస్తికుఁడను; భవేయ=అగుదును.

నేనునాస్తికమతంబుఁజెప్పలేదు; నేనునాస్తికుండనుగాను ; పరలోకము మొదలగునదిలేదని నాయభిప్రాయము గాదు ; నాస్తికులెవ్వరైనను. నాస్తికయుక్తులుచెప్పునప్పుడు, వానినన్నింటిని నేను ఖండించుచుందును; మఱియు, మహాధర్మ సంకటకాలమువచ్చినప్పుడుమాత్రం బెట్లయినను, కార్యంబుకావలయునని , నాస్తికమతోపన్యాసముగావింతునుగాని వేఱుగాదు.

అని, తాత్పర్యము.

సచాపి కాలోఽయ ముపాగత శ్శనై
ర్యథా మయా నాస్తికవా గుదీరితా
నివర్తనార్థం తవ రామ కారణాత్
ప్రసాదనార్థంచ మయైత దీరితమ్. ౩౯

టీక॥ రామ=రాముఁడా! యథా=ఎట్లు; మయా=నాచేత ; నాస్తికవాక్=నాస్తికవాక్యము; ఉదీరితా= చెప్పఁబడినదో; సః=అట్టి; అయం=ఈ; కాలశ్చాపి=కాలమును;శనైః= మెల్లఁగా; ఉపాగతః = వచ్చినది. కారణాత్=కారణమువలన; తవ= నీయొక్క=ప్రసాదనార్థంచ= ప్రసన్నుంజేయుటకొఱకును; నివర్తనార్థం=మఱలించుటకొఱకును; మయా = నాచేత; ఏతత్=ఇది;ఈరితం= చెప్పఁబడినది.

రాముఁడా! ఇప్పుడు, అట్టిమహాధర్మసంకటకాలమువచ్చినదికావున, నేను నాస్తికవాక్యంబులాడితిని ; నిన్నుఁబ్రసన్నుంగావించియయోధ్యకుమఱలింపవలెనని చెప్పితినిగాని, వేఱుగాదు. అని, జాబాలి, రామునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, నవోత్తరశతతమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండనవోత్తరశతతమసర్గటీక,
ముగిసినది.



శ్రీ

దశోత్తరశతతమసర్గప్రారంభః

క్రుద్ధమాజ్ఞాయ రామంతు వసిష్ఠః ప్రత్యువాచహా

టీక॥ వసిష్ఠః=వసిష్ఠుఁడు; రామం=రాముని; క్రుద్ధం=కోపించినవానిఁగా; ఆజ్ఞాయతు=ఎఱింగినంతనె; ప్రత్యువాచ=బదులుచెప్పెను ("హ" అనునది పాదపూరణార్థము).

అంత, వసిష్ఠుండు, రాముండు జాబాలినాస్తికవచనంబులకుఁ గోపంబు నొందినాఁడని తెలిసికొని, రామునిం జూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

జాబాలిరపి జానీతే లోకస్యాస్య గతాగతమ్. ౧

టీక॥ జాబాలిరపి= జాబాలియు; అస్య=ఈ; లోకస్య=జనముయొక్క; గతాగతం= పరలోకగమనాగమనమును; జానీతే=ఎఱుంగును.

జాబాలియు, జనులు పరలోకంబు నొందుదురనియుఁ, బుణ్యాంతంబున మఱల నీలోకంబునకు వత్తురనియు, నెఱుంగును; నాస్తికుండు గాఁడు.

అని, తాత్పర్యము.

నివర్తయితు కామస్త్వా మేత ద్వాక్య ముక్తవాన్

టీక॥ అయం (అధ్యాహృతము) = ఈ జాబాలి; త్వాం= నిన్ను; నివర్తయితుకామస్తు= మఱలింపఁగోరినవాఁడయ్యె; ఏతత్ =ఈ; వాక్యం=మాటను; ఉక్తవాన్=చెప్పినాఁడు.

అతండు, నిన్ను, ఎట్లయినను, అయోధ్యకు వచ్చునట్లు చేయవలయునని మే, యీ మాటం జెప్పినాఁడు.

అని, తాత్పర్యము.

ఇమాం లోకసముత్పత్తిం లోకనాథ నిబోధ మే. ౨

టీక॥లోకనాథ= లోకములకుప్రభుండవగు రాముఁడా! మే= (పంచమ్యర్థమందుషష్ఠి) నావలన; ఇమాం= ఈ; లోకసముత్పత్తిం= లోకముయొక్క-యుత్పత్తిని; నిబోధ=తెలిసికొనుము.

లోకనాథుండవగు రాముఁడా! నేను,లోకోత్పత్తి ప్రకారమునంతయుఁ జెప్పెదను;వినుము.అని, తాత్పర్యము.

సర్వం సలిలమే వాసీ త్పృథివీ యత్ర నిర్మితా
తత స్సమభవ ద్బ్రహ్మా స్వయంభూ ర్దైవతైస్సహ. ౩

టీక॥యత్ర=ఎందు;పృథివీ= భూమి;నిర్మితా=నిర్మింపఁబడినదో; తత్ర(అధ్యాహృతము)=అందు;సలిలమేవ=జలమే;ఆసీత్=ఉండెను.తతః=అందువలన;స్వయంభూః=తానేపుట్టినట్టి; బ్రహ్మా=బ్రహ్మదేవుఁడు;దైవతైస్సహ= దేవతలతోఁగూడ; సమభవత్ = పుట్టెను.

భూమిసృజించినపిదప, భూమిపై నంతయు,జలము,నిండియుండెను; అందు,బ్రహ్మదేవుండును దేవతలునుజన్మించిరి.అని, తాత్పర్యము.

స వరాహ స్తతో భూత్వా ప్రోజ్జహార వసుంధరామ్

టీక॥ తతః=అంత ; సః=ఆవిష్ణుదేవుఁడు; వరాహః= పంది;భూత్వా= అయి ;వసుంధరాం=భూమిని ; ప్రోజ్జహార=లేవనెత్తెను.

అంత, విష్ణుదేవుండు, వరాహరూపంబుననవతరించి, భూమినుద్ధరించెను. అని, తాత్పర్యము.

అసృజచ్చ జగత్సర్వం సహపుత్రైః కృతాత్మభిః. ౪

టీక॥సః(అధ్యాహృతము)= అతండు; కృతాత్మభిః = శిక్షింపఁబడినబుద్ధిగల; పుత్రైస్సహ= కొడుకులతోఁగూడ; జగత్=ప్రపంచమును; సర్వంచ=అంతను; అసృజత్=సృజించెను.

అంత,నాబ్రహ్మదేవుండు,పండితులగుతనపుత్రులనుమరీచ్యాదులంగూడి , ప్రపంచంబంతయుసృజించెను. అని, తాత్పర్యము.

స ౧౧౦

ఆకాశప్రభవో బ్రహ్మా శాశ్వతో నిత్య అవ్యయః
తస్మా న్మరీచి స్సంజజ్ఞే మరీచేః కశ్యప స్సుతః. ౫

టీక॥ బ్రహ్మా=బ్రహ్మదేవుఁడు; ఆకాశప్రభవః= పరబ్రహ్మమేజన్మస్థానముగాఁగలవాఁడు. శాశ్వతః=సనాతనుఁడు. నిత్యః=స్థిరుఁడు. అవ్యయః=నాశములేనివాఁడు. తస్మాత్ = అతనివలన; మరీచిః=మరీచి; సంజజ్ఞే= పుట్టెను. మరీచేః=మరీచియొక్క; సుతః=కొడుకు; కశ్యపః=కశ్యపుఁడు.

పరబ్రహ్మంబువలన, శాశ్వతుండును నిత్యుండును నాశరహితుండు నగు బ్రహ్మదేవుండుపుట్టెను; ఆబ్రహ్మదేవుని వలనమరీచిజన్మించెను ; మరీచికిఁగశ్యపుఁడుపుట్టెను.

అని, తాత్పర్యము.

వివస్వా న్కశ్యపా జ్జజ్ఞే మను ర్వైవస్వత స్సుతః
సతు ప్రజా పతిః పూర్వ మిక్ష్వాకు స్తు మనో స్సుతః. ౬

టీక॥కశ్యపాత్=కశ్యపునివలన; వివస్వాన్=సూర్యుఁడు; జజ్ఞే=పుట్టెను. మనుః=మనువు; వైవస్వతః=సూర్యుని సంబంధియగు; సుతః=కొడుకు;సతు=ఆమనువుమాత్రము;పూర్వం= మొదట;ప్రజాపతిః=ప్రజాపతి;మనోః= మనువుయొక్క;సుతః=కొడుకు; ఇక్ష్వాకుః=ఇక్ష్వాకువు.

కశ్యపునకు సూర్యుండుజన్మించెను; సూర్యునకు, వైవస్వతమనువుసంభవించెను;ఈవైవస్వతమనువెమొదటిప్రజాపతి;ఇతనికి,ఇక్ష్వాకువుపుట్టెను.

అని, తాత్పర్యము-

యస్యేయం ప్రథమం దత్తా సమృద్ధా మనునా మహీ
త మిక్ష్వాకు మయోధ్యాయాం రాజానం విద్ధి పూర్వకమ్. ౭

టీక॥యస్య=ఎవ్వనికి ; ప్రథమం= మొదట;మనునా= వైవస్వతమనువుచేత;సమృద్ధా=నిండినట్టి;- ఇయం=ఈ; మహీ=భూమి; దత్తా= ఇయ్యఁబడినదో;తం=అట్టి; ఇక్ష్వాకుం= ఇక్ష్వాకువును; అయోధ్యాయాం= అయోధ్య

యందు;పూర్వకం=మునుపటి; రాజా నం=రాజునుగా; విద్ధి= ఎఱుంగుము. వైవస్వతమనువు, ఇక్ష్వాకువునకు సర్వసమృద్ధంబగునీభూమి నొసంగెను; ఆయిక్ష్వాకువె, యయోధ్య యందు, మొదటిరాజని యెఱుంగుము.

అని, తాత్పర్యము.

ఇక్ష్వాకోస్తు సుత శ్శ్రీమాన్ కుక్షి రేవేతి విశ్రుతః
కుక్షేరథాత్మజో వీరో వికుక్షి రుదపద్యత. ౮

టీక॥ఇక్ష్వాకోస్తు=ఇక్ష్వాకువుయొక్క-యు;శ్రీమాన్= కాంతిమంతుండగు;సుతః=కొడుకు; కుక్షి రేవేతి=కుక్షి యనియె;విశ్రుతః=ప్రసిద్ధుఁడు. అథ= అంత;కుక్షేః=కుక్షికి; వీరః=పరాక్రమ శాలియగు; వికుక్షిః=వికుక్షియను; ఆత్మజః=కొడుకు;ఉదపద్యత=పుట్టెను-

ఇక్ష్వాకువునకుశ్రీమంతుండగుకుక్షి యుద్భవించెను;కుక్షికి, పరాక్రమశాలి యగువికుక్షిజన్మించెను-

అని, తాత్పర్యము.

వికుక్షేస్తు మహాతేజా బాణః పుత్రః ప్రతాపవాన్
బాణస్యతు మహాబాహు రనరణ్యో మహాయశాః. ౯

టీక॥వికుక్షేస్తు=వికుక్షికిని;మహాతేజాః=అధికమయినకాంతిగలవాఁడును; ప్రతాపవాన్=అధికమయిన పరాక్రమముగలవాఁడునగు;బాణః= బాణుండను; పుత్రః=కొడుకు ; జాతః (అధ్యాహృతము)=పుట్టెను.బాణస్యతు= బాణునకును; మహాయశాః=అధికమయినకీర్తి గలవాఁడును ; మహాబాహుః=పెద్దచేతులుగలవాఁడునగు;అనరణ్యః=అనరణ్యుఁడు; జాతః(అధ్యాహృతము)=పుట్టినాఁడు.

వికుక్షికి,మహాతేజుండును మహాపరాక్రమశాలియునగుబాణుండు పుట్టెను; బాణునకుమహాబాహుండును మహాకీర్తిశాలియునగు ననరణ్యుండు జన్మించెను. అని,తాత్పర్యము.

నానావృష్టి ర్బభూవాస్మిన్ న దుర్భిక్షం సతాంవరే

అనరణ్యే మహారాజే తస్కరో నాపి కశ్చన. ౧౦

టీక॥సతాం = సత్పురుషులలోఁ;వరే=శ్రేష్ఠుండగు; అస్మిన్=ఈ; అనరణ్యే= అనరణ్యుఁడు;మహారాజే = మహారాజు గానుండఁగా; అనావృష్టిః = వర్షము లేకుండుట ; నబభూవ= కలుగలేదు; దుర్భిక్షం=కఱవు;న= లేదు. తస్కరః=దొంగ;కశ్చనాపి= ఒకానొకఁడును;న=లేదు.

సత్పురుషశ్రేష్ఠుండగు నీయనరణ్యమహారాజు రాజ్యంబుఁ బాలించు నప్పుడు,వర్షములు చక్కఁగాఁ గురియుచుండినవి; దుర్భిక్షంబులేదు; ఒకదొంగయునుండలేదు.

అని, తాత్పర్యము.

అనరణ్యా న్మహాబాహుః పృథూ రాజా బభూవహ
తస్మా త్పృథో ర్మహారాజ స్త్రిశంకు రుదపద్యత- ౧౧

టీక॥అనరణ్యాత్ = అనరణ్యునివలన; మహాబాహుః=పెద్దచేతులు గలవాఁడగు; పృథుః=పృథువను ; రాజా=రాజు; బభూవ=కలిగెను("హ" అనునది పాదపూరణార్థము). తస్మాత్ =ఆ;పృథోః=పృథువువలన; మహారాజః=మహారాజుండగు; త్రిశంకుః= త్రిశంకువు;ఉదపద్యత=పుట్టెను.

అనరణ్యునకు, మహాబాహుండగు పృథువుద్భవించెను; ఆపృథువునకుఁ త్రిశంకుమహారాజు,జన్మించెను-

అని, తాత్పర్యము.

స సత్యవచనా ద్వీర స్సశరీరో దివంగతః

టీక॥వీరః= పరాక్రమశాలియగు;సః = ఆత్రిశంకుమహారాజు;సత్యవచనాత్ = సత్యమయినమాటగలవిశ్వామిత్రుని వలన; సశరీరః= దేహముతోఁ గూడినవాఁడై; దివం=స్వర్గమును ; గతః = పొందినాఁడు.

పరాక్రమవంతుఁడగునాత్రిశంకుమహారాజు , సత్యప్రతిజ్ఞుండగువిశ్వామిత్రుప్రభావంబున శరీరంబుతో స్వర్గము నొందెను. అని, తాత్పర్యము.

త్రిశంకో రభవ త్సూను ర్ధుంధుమారో మహాయశాః. ౧౨

దుందుమారో మహాతేజా యువనాశ్వో వ్యజాయత

టీక॥త్రిశంకోః=త్రిశంకువునకు; మహాయశాః=అధికమయినకీర్తిగల;దుందుమారః=దుందుమారుండను ; సూనుః=కొడుకు;అభవత్=కలిగెను. మహాతేజాః = అధికమయినకాంతిగల; యువనాశ్వః= యువనాశ్వుఁడు;దుందుమారః= దుందుమారుఁడు; వ్యజాయత=అయ్యెను.

త్రిశంకుమహారాజునకు, మహాతేజుండగుయువనాశ్వుండుపుట్టెను ; అతండె, దుండువనునసురుంజంపుటవలన దుందుమారుండనఁబడెను.

అని, తాత్పర్యము.

యువనాశ్వసుత శ్శ్రీమాన్ మాంధాతా సమపద్యత. ౩౧
మాంధాతుస్తు మహాతేజా స్సుసంధి రుదపద్యత

టీక॥యువనాశ్వసుతః= యువనాశ్వునికొడుకు; శ్రీమాన్=అధికమయినకాంతిగల;మాంధాతా=మాంధాత; సమపద్యత = అయ్యెను. మాంధాతుస్తు=మాంధాతకును; మహాతేజాః=అధికమయినకాంతిగల; సుసంధిః=సుసంధి;ఉదపద్యత=పుట్టెను.

యువనాశ్వునకు శ్రీమంతుండగు మాంధాతపుట్టెను;మాంధాతకుమహాతేజుండగుసుసంధిజన్మించెను.

అని, తాత్పర్యము.

సుసంధేరపి పుత్రౌ ద్వౌ ధ్రువసంధిః ప్రసేనజిత్. ౧౮
యశస్వీ ధ్రువసంధేస్తు భరతో రిపుసూదనః

టీక॥సుసంధేరపి= సుసంధికిని;ధ్రువసంధిః=ధ్రువసంధియనువాఁడును;ప్రసేనజిత్ = ప్రసేనజిత్తనువాఁడును ; ద్వౌ=ఇద్దఱు; పుత్రౌ=కొడుకులు;జాతౌ(అధ్యాహృతము)=పుట్టినారు;ధ్రువసంధేస్తు = ధ్రువసంధికిని ; యశస్వీ = అధికమయినకీర్తిగలవాఁడును; రిపుసూదనః = శత్రువులంజంపువాఁడునగు; భరతః=భరతుండు; జాతః(అధ్యాహృతము)=పుట్టినాఁడు.

సుసంధికి ధ్రువసంధియనియుం బ్రసేన జిత్తనియునిద్దఱుకొడుకులు జన్మించిరి; అందుధ్రువసంధికి, శత్రు సంహర్త యగుభరతుండుగలిగెను,

అని, తాత్పర్యము.

భరతాత్తు మహాబాహో రసితో నామ జాయత. ౧౫
యస్యైతే ప్రతిరాజాన ఉదపద్యంత శత్రవః
హైహయా స్తాలజంఘాశ్చ శూరాశ్చ శశిబిందవః. ౧౬

టీక॥ యస్య = ఎవ్వనికి; హైహయాః=హైహయులును; తాలజంఘాశ్చ=తాలజంఘులును; శూరాః=యుద్ధమునందుభయములేనట్టి; శశిబిందవశ్చ=శశిబిందువులును; ఏతే=ఈ; ప్రతిరాజానః = బదులు రాజులు; శాత్రవః=శత్రువులుగా; ఉదపద్యంత=అయిరో; సః(అధ్యాహృతము) = అట్టి; అసితోనామ = అసితుండనువాఁడు; భరతాత్తు=భరతునివలనను; జాయత (అజాయత)=పుట్టెను.

భరతునకు, అసితుండనువాఁడు పుట్టెను; ఆయసితునకు, హైహయులును తాలజంఘులును శూరులగు శశిబిందువులును, శత్రువులయిరి.

అని, తాత్పర్యము.

తాంస్తు సర్వాన్ ప్రతివ్యూహ్య యుద్ధే రాజా ప్రవాసితః

టీక॥ రాజా= అసితుఁడు; తాన్= ఆశత్రువులను; సర్వాంస్తు = అందఱను; యుద్ధే=యుద్ధమునందు; ప్రతివ్యూహ్య=ఎదిరించి; ప్రవాసితః= తఱుమఁగొట్టఁబడినాఁడు.

ఆయసితుండు, ఆహైహయాదిశత్రువులనెదుర్కొని, యుద్ధంబుచేసి, పరాజితుండై యరణ్యంబునకుఁ బాఱిపోయెను. అని, తాత్పర్యము.

సచ శైలవరే రమ్యే బభూవాభిరతో మునిః. ౧౭

టీక॥ సచ = ఆయసితుండును; రమ్యే=సుందరమయిన; శైలవరే= హి

మవత్పర్వతమునందు; మునిః = ఋషి యయి; అభిరతః = విరక్తుఁడు; బభూవ=అయ్యెను.

ఆయసితుఁడు, రమణీయంబగుహిమవత్పర్వతంబునకుఁబోయి,యచ్చట , విరక్తుండై మునివృత్తినవలంబించియుండెను. అని, తాత్పర్యము.

ద్వే చాస్య భార్యే గర్భిణ్యౌ బభూవతు రితి శ్రుతిః

టీక॥ అస్య=ఈయసితునియొక్క; భార్యే=భార్యలు; ద్వేచ=ఇద్దఱును ; గర్భిణ్యౌ=గర్భముగలవారలు; బభూవతుః=అయిరి. ఇతి= అని; శ్రుతిః= వినికి.

ఈయసితునిభార్యలిద్దఱును, గర్భమునొందిరనివినికి. అని, తాత్పర్యము.

ఏకా గర్భవినాశాయ సపత్న్యై సగరందదౌ. ౧౮

టీక॥ఏకా=ఒక్కతె ; గర్భవినాశాయ=గర్భమునశించుటకొఱకు; సపత్న్యై=చవతికొఱకు ; సగరం=విషముతోఁగూడినభక్ష్యమును; దదౌ= ఇచ్చెను.

అందొకభార్య,చవతిగర్భమునశించుటకై,యాబిడకువిషము గలసినభక్ష్యముఁదినఁబెట్టెను.అని, తాత్పర్యము.

భార్గవ శ్చ్యవనో నామ హిమవంత ముపాశ్రితః

టీక॥భార్గవః= భృగువంశమునందుఁబుట్టిన; చ్యవనోనామ=చ్యవనుఁడనుమహర్షి; హిమవంతం= హిమవత్పర్వతమును; ఉపాశ్రితః = పొందినాఁడు.

భృగువంశజాతుండగుచ్యవనమహర్షి యాహిమవత్పర్వతంబున నుండెను. అని, తాత్పర్యము.

త మృషిం సముపాగమ్య కాళిందీ త్వభ్యవాదయత్. ౧౯

టీక॥కాళిందీతు= కాళిందిమాత్రము;తం=ఆ ; ఋషిం = చ్యవనమహ

స ౧౧౦

షిణని; సముపాగమ్య=పొంది; అభ్యవాదయత్=నమస్కరించెను.

విషభక్ష్యంబు దినియున్న యసితునిభార్యకాళిందియనునది, యాచ్యవనమహార్షియొద్దకుఁబోయి, యాయనకు,నమస్కారముఁగావించెను.

అని, తాత్పర్యము.

స తామభ్య వదద్విప్రో వరేప్సుం పుత్రజన్మని

టీక॥సః=ఆచ్యవనమహార్షి; పుత్రజన్మని=కొడుకుపుట్టుట నిమిత్తమయి; వరేప్సుం= వరంబుగోరుచున్న; తాం=ఆకాళిందినిగూర్చి; అవదత్ = చెప్పెను.

ఆచ్యవనుండు, కొడుకుపుట్టవలెనని వరంబుగోరుచున్న యాకాళిందింజూచి,యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

పుత్ర స్తే భవితా దేవి మహాత్మా లోకవిశ్రుతః. ౨౦
ధార్మికశ్చ సుశీలశ్చ వంశకర్తా౽రిసూదనః

టీక॥దేవి=రాణివగుకాళిందీ! తే=నీకు; మహాత్మా=అధికమయిన ప్రభావముగలవాఁడును; లోకవిశ్రుతః= లోకప్రసిద్ధుండును; ధార్మికః=ధర్మము నాచరించువాఁడును; సుశీలశ్చ=మంచి యాచారము గలవాఁడును ; వంశకర్తా= వంశముసేయువాఁడును; అరిసూదనః=శత్రువులఁజంపువాఁడునగు; పుత్రః=కొడుకు; భవితా=కలుగును.

కాళిందీ! మహాత్ముండును లోకప్రసిద్ధుండును బరమ ధార్మికుండును సదాచార సంపన్నుండును వంశకర్తయుశత్రుసంహర్తయునగు పుత్రుండు,నీకుఁగలుగును.అని,చ్యవనుండు,కాళిందీదేవికిఁజెప్పెను.

అని, తాత్పర్యము.

కృత్వా ప్రదక్షిణం హృష్టా మునిం త మనుమాన్యచ. ౨౧
పద్మపత్ర సమానాక్షం పద్మగర్భ సమప్రభమ్
తత స్సా గృహ మాగమ్య దేవీ పుత్రం వ్యజాయత. ౨౨




టీక॥సా=ఆ; దేవీ=కాళిందీదేవి; హృష్టా= సంతసించినదై; ప్రదక్షిణం=ప్రదక్షిణమును; కృత్వా=చేసి; తం=ఆ; మునిం=చ్యవనమహామునిని; అనుమాన్యచ= ఒప్పించియు; తతః=అంత; గృహం = గృహమును; ఆగమ్య=పొంది; పద్మపత్రసమాక్షం= తామరపూరేకులతో సమానములయిన కండ్లుగలవాఁడును; పద్మగర్భసమప్రభం = బ్రహ్మదేవుని కాంతివంటి కాంతిగలవాఁడునగు ; పుత్రం=కొడుకును; వ్యజాయత = కనెను.

అంత, నాకాళింది. పరమసంతుష్టయయియాచ్యవన మహామునికిఁబ్రదక్షిణ నమస్కారములు చేసి యాయనయొద్దసెలవుదీసికొని, యింటికివచ్చి, తామరపూరేకులవంటికండ్లు గలవాఁడును బ్రహ్మదేవునకుసరివచ్చు వాఁడునగుకొడుకుంగనెను.

అని, తాత్పర్యము.

సపత్న్యాతు గర స్తస్యై దత్తో గర్భ జిఘాంసయా
గరేణ సహ తేనైవ జాతస్స సగరో భవత్.౨౩

టీక॥సపత్న్యాతు=చవతిచేతనుమాత్రము; గర్భజిఘాంసయా=గర్భమును జంపనిచ్ఛచేత; తస్యై=ఆకాళిందికొఱకు; గరః=విషము; దత్తః= ఇయ్యఁబడినది. తేన=ఆ; గరేణైవ=విషముతోనె; జాతః=పుట్టిన; సః= ఆపుత్రుఁడు; సగరః = సగరుఁడనుపేరుగలవాఁడు(విషముతోఁగూడినవాఁడు); అభవత్ = అయ్యెను.

ఆకాళిందికి, గర్భమునుజంపునిమిత్తమయి, చవతివిషంబిడియుండినదిగదా! ఇమ్మహాత్ముండగుపుత్రుండు, ఆవిషంబుతోఁగూడఁబుట్టుటంజేసి, సగరుఁడనఁబడెను. అని, తాత్పర్యము.

స రాజా సగరో నామ య స్సముద్ర మఖానయత్
ఇష్ట్వా పర్వణి వేగేన త్రాసయంత మిమాః ప్రజాః.౨౪

టీక॥ యః=ఎవ్వఁడు; ఇష్ట్వా=యాగముచేసి; పర్వణి= పర్వదినమునందు; వేగేన=వేగముచేత; ఇమాః=ఈ; ప్రజాః=జనులను; త్రాసయంతం=భయ




పటుచున్న; సముద్రం=సముద్రమును; అఖానయత్=త్రవ్వించెనో; సగరోనామ=సగరుండను పేరుగల; రాజా=రాజు; సః=అతండు-

ఆసగరుండు, అశ్వమేధయాగంబులు చేసి, నష్టమయినయశ్వమును వెదకునిమిత్తమయి, పర్వకాలంబుననతివేగంబు నగర్జించుచుఁ జూపరులకు భయంబు గలిగించునట్టి, యీసముద్రంబుఁ ద్రవ్వించెను-అని, తాత్పర్యము.

అసమంజస్తు పుత్రో భూ త్సగరస్యేతి న శ్శ్రుతమ్
జీవన్నేవ సపిత్రాతు నిర స్తః పాపకర్మకృత్. ౨౫

టీక॥ సగరస్య= సగరునకు; అసమంజః=అసమంజుండను; పుత్రస్తు=పుత్రుఁడును; అభూత్=ఉండెను. ఇతి=అని; నః=మాకు; శ్రుతం=వినికి; పాపకర్మకృత్=పాపకర్మముల జేయునట్టి; సః=అతండు; జీవన్నేవ = బ్రతికియుండియె; పిత్రాతు=తండ్రిచేత నే; నిర స్తః=విడువఁబడినాఁడు.

సగరునకు, అసమంజుండనుపుత్రుండుండినట్లువిన్నాము; అతండుపాపకర్మంబులంజేయుటవలన, నతని, సగరుండరణ్యంబునకుఁదఱిమెను.

అని, తాత్పర్యము.

అంశుమానితి పుత్రో భూ దస మంజస్య వీర్యవాన్
దిలీ పోంశుమతః పుత్రో దిలీపస్య భగీరథః. ౨౬

టీక॥ అసమంజస్య = అసమంజునకు; అంశుమానితి=అంశుమంతుండని; వీర్యవాన్= అధికమయినపరాక్రమముగల; పుత్రః=కొడుకు; అభూత్= కలిగెను. అంశుమతః = అంశుమంతునియొక్క; పుత్రః=కొడుకు ; దిలీపః= దిలీపుఁడు. దిలీపస్య=దిలీపునియొక్క; పుత్రః(అధ్యాహృతము)= కొడుకు; భగీరథః=భగీరథుఁడు.

అసమంజునకుఁ, బరాక్రమవంతుండగునంశుమంతుండుజన్మించెను ; అంశుమంతునిపుత్రుండుదిలీపుఁడు; దిలీపునకు భగీరథుఁడుపుట్టెను-

అని, తాత్పర్యము,

భగీరథాత్కకుత్థ స్తు కాకుత్థా స్యేన విశ్రుతాః
కకుత్థ స్యచ పుత్త్రోభూ ద్రఘుర్యేనచ రాఘవాః, ౨౭

టీక॥యేన = ఎవ్వనిచేత; కాకుత్థాః=కాకుత్థులుగా; విశ్రుతాః=ప్రసిద్ధులరో; సః(అధ్యాహృతము)=అట్టి; కకుత్థ స్తు=కకుత్థుండుమాత్రము; భగీరథాత్= భగీరథునివలన; జాతః(అధ్యాహృతము)=పుట్టెను- యేన=ఎవ్వనిచేత; రాఘవాః=రాఘవులో; సః(అధ్యాహృతము)=అట్టి; రఘుః=రఘువు; కకుత్థస్యచ = కకుత్థునియొక్క; పుత్త్రః=కొడుకు; అభూత్ =అయ్యెను-

భగీరథునకుఁ గకుత్థుండుద్భవించెను; అతనిచేత నేమీరలుకాకుత్థులైతిరి; ఆకకుత్థునకురఘువుపుట్టెను; ఆరఘువుచేతనే, మీకు రాఘవులనుపేరువచ్చినది-అని, తాత్పర్యము.

రఘోస్తు పుత్త్ర స్తేజస్వీ ప్రవృద్ధః పురుషాదకః
కల్మాష పాద స్సౌదాస ఇత్యేవం ప్రథితో భువి. ౨౮

టీక॥రఘోః=రఘువుయొక్క; తేజస్వీ=అధికమయినకాంతిగల; పుత్త్రః=కొడుకు; ప్రవృద్ధః=మిక్కిలియువృద్ధుఁడు; పురుషాదకః=పురుషాదకుఁడు; కల్మాషపాదః=కల్మాషపాదుఁడు- సౌదాసః=సౌదాసుఁడు-ఇతి=అని; ఏవం=ఇట్లు; భువి=భూమియందు; ప్రథితః=ప్రసిద్ధుడైనాఁడు.

రఘువునకుఁ, దేజస్వియగు నొకపుత్త్రుండు గలిగెను; అతండు,ప్రవృద్ధుండనియుఁ, బురుషాదకుండనియుఁ, గల్మాషపాదుండనియుసౌదాసుండనియులోకంబున వినుతికెక్కెను-

అని, తాత్పర్యము-

కల్మాష పాద పుత్త్రోఽభూ చ్ఛంఖణ స్త్వితి విశ్రుతః
యస్తు తద్వీర్య మాసాద్య సహ సైన్యో వ్యనీనశత్. ౨౯

టీక॥ యస్తు=ఎవ్వఁడుమాత్రము; తద్వీర్యం=ఆకల్మాషపాదునియొక్క పరాక్రమమును; ఆసాద్య=పొంది; సహసైన్యః=సైన్యముతోఁగూడినవాఁడై;

వ్యనీనశత్ = నశించెనో; సః(అధ్యాహృతము)=అట్టి; శంఖణస్త్వితి= శంఖణుఁడెయని; విశ్రుతః=ప్రసిద్ధుఁడయినవాఁడు; కల్మాషపాదపుత్రః= కల్మాషపాదునికొడుకు; అభూత్=అయ్యెను-

కల్మాషునకుశంఖణుండనుపుత్రుఁడు నుపుట్టెను;ఆశంఖణుండు,కల్మాష పాదునిచేత నేససైన్యంబుగాఁజంపఁ బడెను. అని, తాత్పర్యము-

శంఖణస్యచ పుత్రోభూచ్ఛూర శ్శ్రీమాన్ సుదర్శనః
సుదర్శనస్యాగ్నివర్ణః అగ్నివర్ణస్య శీఘ్రగః. ౩౦

టీక॥ శంఖణస్య=శంఖణునకు;శూరః=యుద్ధమునందుభయములేనివాఁడును; శ్రీమాన్=అధికమయినకాంతిగలవాఁడునగు ; సుదర్శనః=సుదర్శనుఁడను;పుత్రః=కొడుకు; అభూత్= అయ్యెను- సుదర్శనస్య= సుదర్శనునకు; అగ్నివర్ణః=అగ్నివర్ణుఁడు;జాతః(అధ్యాహృతము)=పుట్టినాఁడు- అగ్నివర్ణస్య= అగ్నివర్ణునకు; శీఘ్రగః= శీఘ్రగుఁడు - జాతః (అధ్యాహృతము)=పుట్టినాఁడు-

శంఖణునకు శూరుండును శ్రీమంతుండునగుసుదర్శనుండుపుట్టెను; సుదర్శనునకు , అగ్నివర్ణుండుద్భవించెను; అగ్నివర్ణునకుశీఘ్రగుండు జన్మించెను- అని, తాత్పర్యము-

శీఘ్రగస్య మరుః పుత్రో మరోః పుత్రః ప్రశుశ్రుకః
ప్రశుశ్రుకస్య పుత్రోభూదంబరీషో మహాద్యుతిః. ౩౧

టీక॥శీఘ్రగస్య=శీఘ్రగునియొక్క; పుత్రః=కొడుకు;మరుః=మరువు;మరోః= మరువుయొక్క; పుత్రః=కొడుకు;ప్రశుశ్రుకః=ప్రశుశ్రుకుఁడు- ప్రశుశ్రుకస్య = ప్రశుశ్రుకునియొక్క ; పుత్రః=కొడుకు;మహాద్యుతిః= అధికమయినకాంతిగల; అంబరీషః= అంబరీషుఁడు;అభూత్ =అయ్యెను-

శీఘ్రగునకుమరువుపుట్టెను;మరువునకుఁబ్రశుశ్రుకుండుపుట్టెను; ప్రశుశ్రుకునకుశ్రీమంతుండగు నంబరీషుండుపుట్టెను-అని, తాత్పర్యము-

అంబరీషస్య పుత్రోఽభూ న్నహుష స్సత్యవిక్రమః
నహుషస్యచ నాభాగః పుత్రః పరమధార్మికః. ౩౨

టీక॥ అంబరీషస్య= అంబరీషునకు; సత్యవిక్రమః= సత్యమయినపరాక్రమముగల; నహుషః=నహుషుఁడు; పుత్రః= కొడుకు; అభూత్=అయ్యెను. నహుషస్యచ = నహుషునకును; పరమధార్మికః=మిక్కిలియుధర్మమునాచరించునట్టి; నాభాగః=నాభాగుఁడు; పుత్రః=కొడుకు; అభూత్ (అధ్యాహృతము)= అయ్యెను.

అంబరీషునకుసత్యపరాక్రముండగు నహుషుండుపుట్టెను; నహుషునకుఁ బరమధార్మికుండగు నాభాగుండుజన్మించెను. అని తాత్పర్యము.

అజ శ్చ సువ్రతశ్చైవ నాభాగస్య సుతా వుభౌ
అజస్యైవచ ధర్మాత్మా రాజా దశరథ స్సుతః. ౩౩

టీక॥ నాభాగస్య= నాభాగునకు; అజశ్చ= అజుండును; సువ్రతశ్చైవ= సువ్రతుండును ; ఇతి ( అధ్యాహృతము)= అని; ఉభౌ= ఇద్దరు; సుతౌ= కొడుకులు. అజస్యైవ=అజునకే; ధర్మాత్మా= ధర్మబుద్ధియు; రాజా= రాజునగు; దశరథః=దశరథుఁడు; సుతః=కొడుకు.

నాభాగునకు, అజుండనియు సువ్రతుండనియు నిద్దఱుకొడుకులు జన్మించిరి; అజునకు ధర్మాత్ముండగు దశరథమహారాజుకలిగెను. అని, తాత్పర్యము.

తస్య జ్యేష్ఠో ఽస్తి దాయాదో రామ ఇత్యభివిశ్రుతః

టీక॥ తస్య= ఆదశరథునకు; దాయాదః=దాయమునుభుజించునట్టి; రామఇతి=రాముఁడని; అభివిశ్రుతః=ప్రసిద్ధినొందినట్టి; జ్యేష్ఠః=జ్యేష్ఠపుత్రుఁడు; అస్తి=ఉన్నాఁడు.

ఆ దశరథమహారాజునకు, దాయభాగాహుఁడగుజ్యేష్ఠపుత్రుండు రాముండనువాఁడున్నాఁడు.

అని, తాత్పర్యము.

తద్గృహాణ స్వకం రాజ్య మవేక్షస్వ జనం నృప. ౩౪

టీక॥ నృప= రాజవగు రామ్ుఁడా! తత్=అందువలన; స్వకం=నీదైన; రాజ్యం=దొరతనమును; గృహాణ=తీసికొనుము. జనం= జనమును; అవేక్షస్వ= చూచుకొనుము.

రామ్ుఁడా! నీవట్లు జ్యేష్ఠ పుత్రుండవు కావున నీవె రాజు కాఁదగినవాఁడవు; కాఁబట్టి, నీరాజ్యంబు దీసికొని జనులం బాలించుకొనుము.

అని, తాత్పర్యము.

ఇక్ష్వాకూణాంహి సర్వేషాం రాజా భవతి పూర్వజః
పూర్వజే నావరః పుత్త్రో జ్యేష్ఠో రాజ్యేఽ భిషిచ్యతే. ౩౫

టీక॥ ఇక్ష్వాకాణాం=ఇక్ష్వాకువంశమునందుబుట్టినవారలలో; సర్వేషాం= అందఱిలోను; పూర్వజః= జ్యేష్ఠుఁడు; రాజా=రాజు; భవతిహి = అగుచున్నాఁడుగదా! పూర్వజే(సతి)= జ్యేష్ఠుఁడుండగా! అవరః= కనిష్ఠుఁడగు; పుత్రః=కొడుకు; న(అభిషిచ్యతే)= అభిషేకింపఁబడఁడు.

ఇక్ష్వాకు కులంబున, జ్యేష్ఠపుత్రుండు రాజగుటయే మర్యాద; జ్యేష్ఠుండుండగాఁ, గనిష్ఠుండు పట్టాభిషేకంబునొందనహూఁడుగాఁడు; జ్యేష్ఠునకే పట్టాభిషేకము గావింపవలయును.

అని, తాత్పర్యము.

స రాఘవాణాం కులధర్మ మాత్మన
స్సనాతనం నాద్య విహంతు మర్హసి
ప్రభూతరత్నా మనుశాధి మేదినీం
ప్రభూతరాష్ట్రాం పితృవ న్మహాయశః. ౩౬

టీక॥ మహాయశః=అధికమయిన కీర్తిగలరామ్ుఁడా! సః=అట్టి; త్వం (అధ్యాహృతము)=నీవు; ఆత్మనః = నీవారలయిన; రాఘవాణాం=రఘువంశమునందుఁబుట్టినవారలయొక్క; సనాతనం= శాశ్వతమయిన; కులధర్మం= కుల

ము యొక్క-ధర్మము ను; అద్య= ఇప్పుడు; విహంతుం=చెఱుచుటకు; నార్హసి=తగవు. ప్రభూతరత్నాం = అధికములయినరత్నములుగలదియు; ప్రభూతరాష్ట్రాం=అధికములయిన గ్రామాదులుగలదియునగు; మేదినీం=భూమిని; పితృవత్ =తండ్రివలె; అనుశాధి=పాలింపుము.

మహాకీర్తిశాలివగురాముఁడా! అట్టిపరమధార్మికుండవగునీవు, జ్యేష్ఠపుత్రుండు రాజగుటయనురాఘవుల కులధర్మమునుజెఱుపరాదు ; నీతండ్రియుంబోలె, సమస్తరత్నసంపూర్ణంబునుఅనంతగ్రామాది సంయుతంబునగుభూమింబాలింపుము. అని, వసిష్ఠుండు రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, అయోధ్యాకాండే, దశోత్తరశతతమస్సర్గః.

ఇది, స్పష్టము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండదశోత్తరశతతమసర్గటీక, ముగిసినది.



శ్రీ

ఏకాదశోత్తరశతతమసర్గప్రారంభః.

వసిష్ఠస్తు తదా రామ ముక్త్వా రాజపురోహితః
అబ్రవీ ద్ధర్మసంయుక్తం పున రేవాపరం వచః. ౧

టీక॥ రాజపురోహితః = రాజపురోహితుండగు; వసిష్ఠస్తు=వసిష్ఠుండు మాత్రము; తదా= అప్పుడు ; రామం=రామునిగూర్చి; ఉక్త్వా= చెప్పి; పునరేవ = మఱలనే; ధర్మసంయుక్తం=ధర్మముతోఁగూడిన; అపరం = ఇతరమయిన; వచః= మాటను; అబ్రవీత్ =చెప్పెను.

రాజపురోహితుండగు వసిష్ఠుండు, అట్లు రామునకుఁజెప్పి , మఱల నతనిం జూచి, ధర్మయుక్తంబగునీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

పురుషస్యహి జాతస్య భవంతి గురవ స్త్రయః
ఆచార్యశ్చైవ కాకుత్స్థ పితా మాతాచ రాఘవ. ౨

టీక॥ కాకుత్స్థ=కకుత్స్థవంశమునఁబుట్టినట్టి; రాఘవ = రాముఁడా! జాతస్య=పుట్టినట్టి; పురుషస్య=పురుషునకు; ఆచార్యశ్చైవ = ఆచార్యుఁడును; పితా = తండ్రియును; మాతాచ=తల్లియును; త్రయః=మువ్వురు; గురవః=గురువులుగా; భవంతిహి=అగుచున్నారుగదా!

కకుత్స్థవంశంబునంబుట్టినట్టి రాముఁడా! పురుషునకు, ఆచార్యుండునుదండ్రియునుదల్లియును వీరలుమువ్వురునుగురువులగుచున్నారు. అని, తాత్పర్యము.

పితా హ్యేనం జనయతి పురుషం పురుషర్షభ
ప్రజ్ఞాం దదాతి చాచార్య స్తస్మా త్సగురు రుచ్యతే. ౩

టీక॥ పురుషర్షభ=పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! పితా=తండ్రి; ఏనం=ఈ; పురు

షం=పురుషుని; జనయతిహి=పుట్టించుచున్నాఁడుగదా; ఆచార్యశ్చ= ఆచార్యుఁడును; ప్రజ్ఞాం=తెలివిని; దదాతి= ఇచ్చుచున్నాఁడు. తస్మాత్ = అందువలన; సః=అతండు; గురుః=గురువుగా; ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

పురుష శ్రేష్ఠుండవగు రాముఁడా! తండ్రియుఁదల్లియుఁనీపురుషుంబుట్టించువారలు; కావునవారలితనికి గురువులు; ఆచార్యుం డితనికిజ్ఞానము నొసంగును గావునగురుండనఁబడును.

అని, తాత్పర్యము.

సోఽహం తే పితు రాచార్య స్తవ చైవ పరంతప
మమ త్వం వచనం కుర్వన్నాతివర్తేః సతాం గతిమ్. ౪

టీక॥ పరంతప=శత్రువులందపింపఁజేయునట్టిరాముఁడా! సః=అట్టి ; అహం=నేను; తే=నీయొక్క; పితుః=తండ్రికిని; తవచైవ=నీకును; ఆచార్యః=ఆచార్యుఁడను. త్వం=నీవు; మమ=నాయొక్క; వచనం=మాటను; కుర్వన్= చేయుచు; సతాం = సత్పురుషులయొక్క; గతిం= మార్గమును ; నాతివర్తేః(నాతివర్తేథాః) = అతిక్రమించినవాఁడవుకావు.

శత్రువులఁ దపింపఁజేయునట్టి రాముఁడా! నేను, నీతండ్రికిని నీకును ఆచార్యుండను; కావున, నీవు నామాటప్రకారముచేయుచున్న, సన్మార్గమునువదలినవాఁడవుకావు. అని, తాత్పర్యము.

ఇమా హి తే పరిషద శ్శ్రేణయశ్చ ద్విజా స్తథా
ఏషు తాత చరన్ ధర్మం నాతివర్తేః సతాం గతిమ్. ౫

టీక॥ తాత=నాయనా! ఇమాః = ఈ; పరిషదః= బ్రాహ్మణసమూహములును; శ్రేణయశ్చ=పౌరజనులును; తథా=అట్లు; ద్విజాః= క్షత్రియవైశ్యులును; తేహి=నీవారలుగదా! ఏషు= వీరలయందు; ధర్మం= ధర్మమును; చరన్=ఆచరించుచు; సతాం= సత్పురుషులయొక్క; గతిం=మార్గమును; నాతివర్తేః (నాతివర్తేథాః)= అతిక్రమింపవు.

నాయనా! ఈబ్రాహ్మణులును పౌరజనులునుక్షత్రియులునువైశ్యులును ,




నీవారలు; నిన్నుసేవించుచున్నవారలు; వీరలంబాలించుట యనెడు ధర్మంబ నుష్ఠింతువేని, సత్పురుష మార్గము నువదలినవాఁడవుకావు.

అని, తాత్పర్యము.

వృద్ధాయా ధర్మశీలాయా మాతు ర్నార్హ స్య వ ర్తితుమ్
అస్యాస్తు వచనం కుర్వ న్నాతివ ర్తే స్సతాం గతిమ్. ౬

టీక॥వృద్ధాయాః = ముసలిదియును; ధర్మశీలాయాః=ధర్మస్వభావురాలునగు; మాతుః=తల్లికి ; అవర్తితుం=శుశ్రూషసేయకుండుటకు; నార్హసి=తగవు. అస్యాః=ఈబిడయొక్క;వచనంతు=మాటనుమాత్రము;కుర్వన్=చేయుచు; సతాం=సత్పురుషులయొక్క; గతిం=మార్గమును; నాతివర్తేః (నాతివర్తేథాః)= అతిక్రమించినవాఁడవుకావు.

వృద్ధురాలునుంబరమధార్మికురాలునగుతల్లికి శుశ్రూష సేయకుండుట యెంతమాత్రమునుయుక్తము కాదు; కావున ఈబిడమాటచొప్పున నడచుకొందువేని, సన్మార్గమును వదలిన వాఁడవుకావు. అని, తాత్పర్యము.

భరతస్య వచః కుర్వన్ యాచమానస్య రాఘవ
ఆత్మానం నాతివర్తే స్త్వం సత్యధర్మ పరాక్రమ. ౭

టీక॥సత్యధర్మపరాక్రమ= సత్యమునందునుధర్మమునందును బరాక్రమముగల; రాఘవ= రఘువంశంబునఁ బుట్టినరాముఁడా! త్వం=నీవు; యాచమానస్య=ప్రార్థించుచున్న; భరతస్య=భరతునియొక్క;వచః = మాటను; కుర్వన్=చేయుచు; ఆత్మానం= స్వభావమును; నాతివర్తేః=(నాతివర్తేథాః)= అతిక్రమింపవు.

రాముఁడా! నీవు,యాచకుల యభీష్టము నెఱవేర్చుటయందు బద్ధదీక్షులగు రాఘవులవంశమునం బుట్టిన వాఁడవు; సత్యధర్మంబులందప్పనివాఁడవు; అట్టినీవు, యాచించుచున్నభరతునిమాటనంగీకరింతువేని, నీధర్మస్వభావంబునువదలిన వాఁడవుకావు.అనివసిష్ఠమహాముని, రామునకుంజెప్పెను.

అని, తాత్పర్యము.




ఏవం మధురముక్తస్సన్ గురుణా రాఘవ స్స్వయమ్
ప్రత్యువాచ సమాసీనం వసిష్ఠం పురుషర్షభః. ౮

టీక॥ పురుషర్షభః=పురుషశ్రేష్ఠుం డగు; రాఘవః=రాముఁడు; స్వయం=తాను; గురుణా=ఆచార్యునిచేత ; ఏవం=ఇట్లు ; మధురం=మనోహరముగా; ఉక్తస్సన్=చెప్పఁబడినవాఁడై; సమాసీనం= కూర్చుండిన; వసిష్ఠం=వసిష్ఠునిఁగూర్చి; ప్రత్యువాచ=బదులు చెప్పెను.

పురుషశ్రేష్ఠుండగు రాముండు, ఇట్లు, ఆచార్యుండగువసిష్ఠుండుచెప్పినమధురవచనమునువిని, యతనింజూచి , యిట్లనిబదులుచెప్పెను.

అని, తాత్పర్యము.

యన్మాతాపితరౌ వృత్తం తనయే కురుత స్సదా
న సుప్రతికరం తత్తు మాత్రా పిత్రా చ యత్కృతమ్. ౯
యథాశక్తి ప్రదానేన స్నాపనోచ్ఛాదనేనచ
నిత్యంచ ప్రియవాదేన తథా సంవర్ధనేనచ. ౧౦

టీక॥ మాతాపితరౌ= తలిదండ్రులు; తనయే= కొడుకునిమిత్తమయి ; సదా=ఎల్లప్పుడును; యత్= ఏ; వృత్తం=వ్రతములను; కురుతః = చేయుదురో; తత్తు=అదిమాత్రము; సుప్రతికరం=సుఖముగాబదులుచేయఁదగినది ; న=కాదు. మాత్రా = తల్లిచేతను; పిత్రాచ=తండ్రిచేతను ; యథాశక్తి ప్రదానేన = శక్తినతిక్రమింపకఇచ్చుటచేతను; స్నాపనోచ్ఛాదనేనచ = స్నానము చేయించుటచేతను నలుగుపెట్టుటచేతను ; నిత్యం = ఎల్లప్పుడును; ప్రియవాదేన= సంతోషంబు గలిగించుమాటలుచెప్పుటచేతను; తథా=అట్లు; సంవర్ధనేన= పెంచుటచేతను; యత్=ఏది; కృతం= చేయఁబడినదో; తత్(అధ్యాహృతము)= అది; నసుప్రతికరం=సులభముగాబదులుచేయఁదగినదిగాదు.

తలిదండ్రులు, మొదలఁగొడుకుపుట్టుటకై గావించిన వ్రతోపవాసాదులకును, మఱియుఁగొడుకుపుట్టినవెనుక, అతనికి, స్తన్యము, అన్నమువస్త్రములు మొదలగువానియథాశక్తినొసంగుచు,

నలుఁగు పెట్టి స్నానంబు సేయించుచు, నెల్లప్పుడుఁ బ్రియవచనంబులాడుచు నతని బెంచుట మొదలుగా వారలతనికిఁ గావించిన యుపకారంబులకును, బదులు సేయనలవికాదు; కావున, ధర్మసాధనంబగు నీ దేహంబునకుఁ గారణము కాబట్టి, తలిదండ్రులె, యాచార్యునకన్నన ధికులు. అని తాత్పర్యము.

సహి రాజా జనయితా పితా దశరథో మమ
ఆజ్ఞాతం య న్మయా తస్య నత న్మిథ్యాభవిష్యతి. ౧౧

టీక॥ పితా = తండ్రియగు; సః = ఆ; రాజా = రాజయిన; దశరథః = దశరథుఁడు; మమ = నాయొక్క; జనయితాహి = పుట్టించినవాఁడుగదా! తస్య = అతనికి; మయా = నాచేత; యత్ = ఏది; ఆజ్ఞాతం = ప్రతిజ్ఞ చేయఁబడినదో; తత్ = అది; మిథ్యా = దబ్బఱ; నభవిష్యతి = కాదు.

నాతండ్రి దశరథమహారాజు, నన్నుఁ బుట్టించినవాఁడు కావున, నేనతనికిఁ, గావించిన ప్రతిజ్ఞ యెంతమాత్రమున బద్ధము కాఁగూడదు; అట్లు, నేనుదల్లి విషయమయి ప్రతిజ్ఞ చేయలేదు, కావునఁ, దల్లి మాటనతిక్రమించుటయును నదియును సంభవింపదు. అని, రాముండు, చెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు రామేణ భరతః ప్రత్యనంతరమ్
ఉవాచ పరమోదార స్సూతం పరమదుర్మనాః. ౧౨

టీక॥ పరమోదారః = మిక్కిలియునౌదార్యముగల; భరతః = భరతుఁడు; రామేణ = రాముని చేత; ఏవం = ఇట్లు; ఉక్తస్తు = చెప్పఁబడినవాఁడైనంతనే, పరమదుర్మనాః = మిక్కిలియు దుఃఖము నొందినవాఁడై; ప్రత్యనంతరం = సమీపమున నున్నట్టి; సూతం = సుమంత్రుని గూర్చి; ఉవాచ = చెప్పెను.

పరమోదారుండగు భరతుండు రాముండు చెప్పిన మాటను విని పరమదుఃఖితుండై, తనసమీపంబున నున్న సుమంత్రుం జూచి, ఇట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇహ మే స్థండిలే శీఘ్రం కుశానా స్తర సారథే
ఆర్యం ప్రత్యుపవేక్ష్యామి యావన్మే న ప్రసీదతి. ౧౩

టీక॥ సారథే = సారథివగుసుమంత్రుఁడా! మే=నాకొఱకు; శీఘ్రం = శీఘ్రముగా; స్థండిలే=నేలయందు; కుశాన్=దర్భలను; ఆ స్తర=పఱచుము. యావత్=ఎంతవఱకు; మే= నాకొఱకు; నప్రసీదతి= ప్రసన్నుఁడుగాఁడో; తావత్(అధ్యాహృతము)= అంతవఱకు; ఆర్యం=పూజ్యుండగురామునిఁ; ప్రత్యుపవేక్ష్యామి=పరుండియడ్డగించెదను.

సుమంత్రుఁడా! శీఘ్రముగానాకిచ్చట, నేలపైదర్భలంబఱచిపెట్టుము ; రాముండునాకుఁబ్రసన్నుండగునంతవఱకు , నతనికడ్డముగాఁబరుండియుండెదను. అని, తాత్పర్యము.

అనాహారో నిరాలోకో ధనహీనో యథా ద్విజః
శేష్యే పురస్తాచ్ఛాలాయా యావన్న ప్రతియాస్యతి. ౧౪

టీక॥ యావత్=ఎంతవఱకు; నప్రతియాస్యతి=రాఁడో; తావత్(అధ్యాహృతము) = అంతవఱకు; అహం(అధ్యాహృతము)=నేను; ధనహీనః=ధనముచేవిడువఁబడిన ; ద్విజో యథా = బ్రాహ్మణుఁడువలె; అనాహారః= ఆహారములేనివాఁడనై; నిరాలోకః= వెల్తురులేనివాఁడనై, ముఖముగప్పుకొన్నవాఁడనైయనుట; శాలాయాః= పర్ణశాలయొక్క; పురస్తాత్ =ముందట; శేష్యే(శయిష్యే)=పరుండెదను.

అప్పుదీసికొన్నవాఁడు మఱలనివ్వకపోవుటవలన,అప్పిచ్చినబ్రాహ్మణుండు , అతనివాకిలికడ్డముగాఁ బరుండువిధంబున, నేను, రాముండయోధ్యకువచ్చునంతవఱకు, ఆహారంబువర్జించి, ముఖంబుపై గుడ్డపెట్టుకొనిరోదనంబు సేయుచుఁ, బర్ణశాలవాకిటంబరుండెదను. అని, తాత్పర్యము.

సతు రామ మవేక్షంతం సుమంత్రం ప్రేక్ష్య దుర్మనాః
కుశోత్తర ముపస్థాప్య భూమావేవా స్తరత్స్వయమ్. ౧౫

టీక॥ దుర్మనాః=దుఃఖితుండగు; సతు= ఆభరతుండును; రామం=రాముని; అవేక్షంతం(అవేక్షమాణం)చూచుచున్న; సుమంత్రం = సుమంత్రుని; ప్రేక్ష్య=చూచి; స్వయమేవ=తానే; కుశోత్తరం= దర్భాస్తరణమును; ఉపస్థాప్య=తెచ్చి; ఆస్తరత్=పఱచుకొనెను.

అంత దుఃఖితుండగు నాభరతుండు, తాను చెప్పినట్లు దర్భలం బఱపక, సుమంత్రుండు రామాజ్ఞం గోరుటను జూచి, తానే దర్భలు తెచ్చి పఱచుకొని శయనించెను. అని, తాత్పర్యము.

తమువాచ మహాతేజా రామో రాజర్షిసత్తమః

టీక॥ మహాతేజాః = అధికమయిన కాంతిగలవాఁడును; రాజర్షిసత్తమః=రాజర్షులలో నుత్తముండునగు; రామః=రాముండు; తం= ఆభరతుని గూర్చి; ఉవాచ=చెప్పెను.

అంత, మహాతేజుండును రాజర్షిముఖ్యుండునగు రాముండు, భరతుం జూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

కిం మాం భరత కుర్వాణం తాత ప్రత్యుపవేక్ష్యసి ౧౬

టీక॥ తాత=నాయనా! భరత= భరతుఁడా! కిం=ఏయపకారమును; కుర్వాణం=చేయుచున్న; మాం=నన్ను; ప్రత్యుపవేక్ష్యసి= పరుండి యడ్డగించెదవు?

నాయనా! నేను నీ కేయపకారము సేయఁబట్టి, నీవు నావాకిలి కడ్డముగా, బరుండెదవు?

అని, తాత్పర్యము.

బ్రాహ్మణోహ్యేకపార్శ్వేన నరాన్ రోద్ధుమిహార్హతి
నతు మూర్ధాభిషిక్తానాం విధిః ప్రత్యుపవేశనే. ౧౭

టీక॥ బ్రాహ్మణోహి=బ్రాహ్మణుండుమాత్రమె; ఏకపార్శ్వేన= ఒకప్రక్కచేత, ఒకప్రక్క శయనించుటచేతననుటః ఇహ=ఇచ్చట; నరాన్= మ




నుష్యులను; రోద్ధుం=అడ్డగించుటకు; అర్హతి=తగును. మూర్ధాభిషిక్తానాం=క్షత్రియులకు; ప్రత్యుపవేశనే=అడ్డముగాఁ బరుండుట యందు; విధిః=విధి; న=లేదు.

బ్రాహ్మణుండుమాత్రమె, తనయెుద్దనప్పుదీసికొని యెగవేయఁ గోరువానివాకిటనడ్డముగాఁబరుండుటకుఁ దగునుగాని, క్షత్రియులకట్లు వాకిలికడ్డముగాఁబరుండి పీడించుట యెంతమాత్రముయుక్తముకాదు.

అని, తాత్పర్యము.

ఉత్తిష్ఠ నరశార్దూల హిత్వైతద్దారుణం వ్రతమ్
పురవర్యా మితః క్షిప్ర మయోధ్యాం యాహి రాఘవ. ౧౮

టీక॥నరశార్దూల = పురుషశ్రేష్ఠుఁడవగు; రాఘవ=భరతుఁడా! ఉత్తిష్ఠ=లెమ్ము. ఏతత్=ఈ; దారుణం=భయంకరమగు; వ్రతం=వ్రతమును; హిత్వా=విడిచి; ఇతః=ఇచ్చటనుండి; క్షిప్రం=శీఘ్రముగా; పురవర్యాం=పట్టణోత్తమమయిన; అయోధ్యాం=అయోధ్యాపట్టణమును; యాహి=పొందుము.

పురుషశ్రేష్ఠుండవగుభరతుఁడా! లెమ్ము; ఈభయంకరవ్రతంబువిడిచి, శీఘ్రంబుననిచ్చటనుండి, పట్టణోత్తమంబగునయోధ్యాపట్టణంబునకుఁ, బొమ్ము. అని, రాముండుభరతునకుఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఆసీన స్త్వేవ భరతః పౌరజానపదం జనమ్
ఉవాచ సర్వతః ప్రేక్ష్య కి మార్యం నానుశాసథ. ౧౯

టీక॥భరతః=భరతుఁడు; ఆసీన స్త్వేవ=పరుండినవాఁడైయే; పౌరజానపదం=పట్టణవాసియును గ్రామవాసియునగు; జనం=జనంబును; సర్వతః=అంతయు; ప్రేక్ష్య=చూచి; ఆర్యం=పూజ్యుండగు రాముని; నానుశాసథకిం=ప్రార్థింపరాయేమి? ఇతి(అధ్యాహృతము)=అని; ఉవాచ = చెప్పెను.

భరతుఁడు, పరుండియే, పౌరులను




జానపదులనుజనులనందఱంజూచి, "మీరలయిననురామునకేమియుఁ జెప్పరా యేమి?" అనియడిగెను.

అని, తాత్పర్యము.

తే త మూచు ర్మహాత్మానం పౌరజానపదాజనాః

టీక॥ తే=ఆ; పౌరజానపదాః=పట్టణవాసులును గ్రామవాసులునగు; జనాః=జనులు; మహాత్మానం=పూజ్యమయినస్వభావముగల; తం=ఆభరతుని గూర్చి; ఊచుః=చెప్పిరి.

అంత, నాజనులందఱు, మహాత్ముండగు భరతుంజూచి, యిట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

కాకుత్థ్స మభిజానీమ స్సమ్య గ్వదతి రాఘవః.౨౦

టీక॥ కాకుత్థ్సం=రాముని; అభిజానీమః=చక్కఁగా నెఱుంగుదుము; రాఘవః=రాముఁడు; సమ్యక్ = చక్కఁగా; వదతి=చెప్పుచున్నాఁడు.

రాముని మేము చక్కఁగా నెఱుంగుదుము; రాముండు చెప్పునది బాగుగానున్నది. అని, తాత్పర్యము.

ఏషోపి హి మహాభాగః పితుర్వచసి తిష్ఠతి
అతఏవ నశక్తాస్మో వ్యావర్తయితు మంజసా.౨౧

టీక॥ మహాభాగః= పూజ్యమయినయదృష్టముగల ; ఏషోపి=ఈరాముండును; పితుః=తండ్రియొక్క ; వచసి=మాటయందు; తిష్ఠతిహి = ఉన్నాఁడుగదా! అతఏవ=ఇందువలననే ; అంజసా=శీఘ్రముగా; వ్యావర్తయితుం=మఱలించుటకు; శక్తాః= సమర్థులము; న=కాము.

మహాభాగుండగునీ రాముండును, పితృవచనపరిపాలనంబను ధర్మంబునవలంబించియున్నాఁడు ; కావుననే; యితనిమఱలింపుటకుమాచేతఁ గాదు. అని, జనులుభరతునితోఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

తేషా మాజ్ఞాయ వచనం రామో వచన మబ్రవీత్

టీక॥ రామః=రాముఁడు; తేషాం= ఆజనులయొక్క; వచనం=మాటను, ఆ

జ్ఞాయ=తెలిసికొని; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

రాముండును, పౌరజానపదజనులు చెప్పినమాటను తెలిసికొని, భరతునిం జూచి, యిట్లని, చెప్పెను.

అని; తాత్పర్యము

ఏవం నిబోధ వచనం సుహృదాంధర్మచక్షుషామ్. ౨౨

టీక॥ఏవం= ఇట్లు ; ధర్మచక్షుషాం=ధర్మమునందుదృష్టిగల; సుహృదాం=స్నేహితులయొక్క; వచనం= మాటను; నిబోధ=తెలిసికొనుము.

ధర్మవేత్తలగునీస్నేహితులును, ఇట్లుచెప్పుచున్నారు; వినము.

అని, తాత్పర్యము.

ఏతచ్చైవోభయం శ్రుత్వా సమ్యక్సంపశ్య రాఘవ
ఉత్తిష్ఠ త్వం మహాబాహో మాంచస్పృశతథోదకమ్. ౨౩

టీక॥మహాబాహో=పెద్దచేతులుగల; రాఘవ=భరతుఁడా, త్వం= నీవు, ఏతత్=ఈ; ఉభయంచైవ = రెంటిని; శ్రుత్వా=విని; సమ్యక్=చక్కఁగా; సంపశ్య=చూడుము; ఉత్తిష్ఠ = లెమ్ము; మాంచ=నన్నును; తథా= అట్లు; ఉదకం=జలమును; స్పృశ=తాఁకుము.

మహాబాహుండవగు భరతుఁడా! నేనుజెప్పినమాటను ఈపౌరజానపదులమాటను, రెంటిని, చక్కఁగా నాలోచించుకొనుము; శీఘ్రంబునలేచి, నన్నును జలంబునుస్పృశింపుము. అనిరాముండుభరతునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

అథోత్థాయ జలం స్పృష్ట్వాభరతోవాక్యమబ్రవీత్

టీక॥అథ=అటుపిమ్మట; భరతః = భరతుఁడు; ఉత్థాయ=లేచి; జలం= నీటిని, స్పృష్ట్వా=తాఁకి; వాక్యం = మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, భరతుండు, లేచి, జలంబును రామునిస్పృశించి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

శృణ్వంతు మే పరిషదో మంత్రిణ శ్శ్రేణయ స్తథా. ౨౭

టీక॥ పరిషదః=బ్రాహ్మణ సమూహములును ; మంత్రిణః = మంత్రులును; తథా=అట్లు; శ్రేణయః=పౌరులును; మే=నాయొక్క ; వచనం (అధ్యాహృతము)=మాటను;శృణ్వంతు=విందురుగాక.

బ్రాహ్మణులునుమంత్రులును పౌరులునుఅందఱును , నేనుజెప్పుమాటను సావధానముగావిందురుగాక.

అని, తాత్పర్యము.

నయాచే పితరం రాజ్యం నానుశాసామి మాతరమ్
ఆర్యం పరమధర్మజ్ఞం నానుజానామి రాఘవమ్. ౨౫

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను; పితరం=తండ్రిని; రాజ్యం= రాజ్యమును ; నయాచే=అడుగలేదు. మాతరం=తల్లి యగు కైకేయిని; నానుశాసామి (నానుశాస్మి)= ప్రేరింపలేదు. ఆర్యం=పూజ్యుండును ; పరమధర్మజ్ఞం=మిక్కిలియుధర్మము నెఱింగినవాఁడునగు; రాఘవం=రాముని; నానుజానామి=అనుమతింపలేదు.

నేను, నాకురాజ్యంబుకావలెననినా తండ్రినియాచింపలేదు ; నీవునాకురాజ్యంబువచ్చునట్లుగావింపుమని నాతల్లి, కైకేయినింబ్రేరింపలేదు; పరమధర్మజ్ఞుండగురాముండడవినుండుటకు నేనెంతమాత్రముసమ్మతింపలేదు.

అని, తాత్పర్యము.

యది త్వవశ్యం వస్తవ్యం కర్తవ్యంచ పితు ర్వచః
అహమేవనివత్స్యామి చతుర్దశసమా వనే. ౨౬

టీక॥ అవశ్యం=అవశ్యముగా; వస్తవ్యంయదితు=ఉండవలసినదెయగునేని; పితుః=తండ్రియొక్క ; వచః = మాటయు; కర్తవ్యం(యది)=చేయఁబడవలయునేని; అహమేవ=నేనే; వనే=అడవియందు; చతుర్దశ= పదునాలుగు; సమాః=సంవత్సరములను; నివత్స్యామి=ఉండెదను.

ఇంకనవశ్యముపితృవచనముచొప్పునవనంబుననుండవలసినదెయగునేని, నేనే, రామునకుబదులు, వనంబునఁబదునాలుగుసంవత్సరంబులుండెదను; రా

ముండు, నాకుబదులుగా, రాజ్యంబుఁ బాలించుఁగాక. అని, భరతుండుచెప్పెను. అని, తాత్పర్యము.

ధర్మాత్మా తస్య తథ్యేన భ్రాతు ర్వాక్యేన విస్మితః
ఉవాచ రామ స్సంప్రేక్ష్య పౌరజానపదం జనమ్. ౨౭

టీక॥ ధర్మాత్మా= ధర్మస్వభావుండగు; రామః= రాముఁడు ; తస్య= ఆ; భ్రాతుః= తమ్ముండగుభరతుని యొక్క; తథ్యేన=యథార్థమగు; వాక్యేన=మాటచేత; విస్మితః= ఆశ్చర్యము నొందినవాఁడై; పౌరజానపదం=పట్టణవాసియును గ్రామవాసియునగు ; జనం=జనమును; సంప్రేక్ష్య=చూచి ; ఉవాచ=చెప్పెను.

ధర్మాత్ముండగు రాముండు, తమ్ముండగుభరతునియథార్థవచనంబునకచ్చెరువొంది, పౌరజానపదజనులం జూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

విక్రీత మాహితం క్రీతం యత్పిత్రా జీవతా మమ
న తల్లోపయితుం శక్యం మయావా భరతేన వా. ౨౮

టీక॥ మమ=నాయొక్క; జీవతా= బ్రతికియున్న ; పిత్రా = తండ్రిచేత; యత్=ఏది; విక్రీతం=అమ్మబడినదో; ఆహితం= కుదువయుంచబడినదో; క్రీతం=కొనఁబడినదో; తత్=అది; లోపయితుం= లోపింపఁజేయుటకు; మయా వా= నాచేతఁగాని ; భరతేనవా= భరతునిచేతఁగాని ; నశక్యం = అలవిగాదు.

నాతండ్రిబ్రతికియుండునప్పుడు, దేనివిక్రయించునో, దేని గుదువయుంచునో, దేనినిగొనునో, దానిని, మార్చుటకు, నాకుగాని, భరతునకుగాని, యెంతమాత్రమలవిగాదు; మనతండ్రి సత్యపాలనార్థమయి నాకు వనవాసంబు నొసంగి, అందుకుబదులుగా రాజ్యంబు గ్రహించిభరతునికిచ్చియున్నాఁడు; దీనిమార్చుటకెవ్వరికినలవిగాదు.

అని, తాత్పర్యము.

ఉపధి ర్న మయాకార్యో వనవాసే జుగుప్సితః

యుక్త ముక్తంచ కైకేయ్యా పిత్రా మే సుకృతం కృతమ్. ౨౯

టీక॥ మయా=నాచేత; వనవాసే= వనవాసమునిమిత్తమయి; జుగుప్సితః= నిందితమయిన; ఉపధిః=ప్రతినిధి;నకార్యః=చేయఁదగినదికాదు. కైకేయ్యా చ=కైకేయిచేతను; యుక్తం=ఉచితమె ; ఉక్తం=చెప్పఁబడినది. మే=నాయొక్క; పిత్రా= తండ్రిచేత; సుకృతం= మంచికార్యమే; కృతం= చేయఁబడినది.

నేను, వనవాసమునకుబదులు, ప్రతినిధిగా రాజ్యపాలనము నంగీకరింపఁగూడదు; ఇదిమిక్కిలియునిందితము;అట్లంగీకరింతునేని, నాతండ్రిమాటయసత్యమగును; నాతల్లికైకేయియుయుక్తముగా నే చెప్పినది; నాతండ్రి మంచి కార్యమునే చేసెను,

అని, తాత్పర్యము.

జానామి భరతం క్షాంతం గురుసత్కారకారిణమ్

సర్వమేవాత్ర కల్యాణం సత్యసంధే మహాత్మని. ౩౦

టీక॥ భరతం=భరతుని;క్షాంతం= క్షమగలవానిగాను ; గురుసత్కారకారిణం= గురుపూజ సేయువానిగాను; జానామి= ఎఱుంగుదును ; సత్యసంధే= సత్యప్రతిజ్ఞుండును; మహాత్మని=పూజ్యస్వభావుండునగు;అత్ర=ఈ భరతునివిషయమయి ; సర్వమేవ = అంతయును; కల్యాణం= మంగళము గా; భవిష్యతి(అధ్యాహృతము)=కాఁగలదు.

భరతుఁడు, క్షమగలవాఁడనియుగురుభక్తిగలవాఁడనియు నెఱుంగుదును ; సత్యసంధుండునుమహాత్ముండునగునా భరతునకుసమస్తమునుమంగళకరంబు గాఁగలదు. అని, తాత్పర్యము.

అనేన ధర్మశీలేన వనాత్ప్రత్యాగతః పునః

భ్రాత్రాసహ భవిష్యామి పృథివ్యాం పతి రుత్తమః. ౩౧

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను; పునః=మఱల; వనాత్= అడవి నుండి; ప్రత్యాగతః=మఱలివచ్చినవాఁడనై; ధర్మశీలేన= ధర్మస్వభావుం

డగు; భ్రాతా=తమ్ముఁడయిన; అనేనసహ=ఈభరతునితోఁగూడ ; ఉత్తమః=శ్రేష్ఠుండగు; పృథివ్యాః= భూమికి; పతిః=ప్రభుండను; భవిష్యామి=అయ్యెదను.

నేను, బదునాలుగుసంవత్సరంబులు గడచినపిమ్మటనడవినుండివచ్చి, ధర్మస్వభావుండగు తమ్మునిభరతుం గూడి, భూమింబాలించెదను.

అని, తాత్పర్యము.

వృతో హి రాజా కైకేయ్యా మయా తద్వచనం కృతమ్
అనృతా న్మోచయా నేన పితరం తం మహీపతిమ్. ౩౨

టీక॥ కైకేయ్యా = కైకేయిచేత; రాజా= దశరథమహారాజు ; వృతో హి=యాచింపఁబడినాఁడుగదా! మయా=నాచేత; తద్వచనం=ఆదశరథమహారాజుమాట; కృతం= చేయఁబడినది. అనేన=ఈరాజ్యపరిపాలనముచేత; మహీపతిః= భూనాయకుండగు; తం=ఆ; పితరం=తండ్రిని; అనృతాత్=అసత్యముననుండి; మోచయ= విడిపింపుము.

కైకేయి, దశరథమహారాజునుయాచించినది; ఆయనచెప్పినట్లునేను వనవాసముగావించుచున్నాను; నీవును, ఆయనయాజ్ఞచొప్పునరాజ్యపరిపాలనంబుగావించి , యాయనకసత్యదోషంబుగలుగకుండునట్లుసేయుము. అని, రాముండుభరతునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే. ఏకాదశోత్తరశతతమస్సర్గః
ఇదిస్పష్టార్థము;
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండైకాదశోత్తరశతతమసర్గటీక, ముగిసినది.



శ్రీ

ద్వాదశోత్తరశతతమసర్గప్రారంభః.

తమప్రతిమతేజోభ్యాం భ్రాతృభ్యాం రోమహర్షణమ్
విస్మితాస్సంగమం ప్రేక్ష్య సమవేతా మహర్షయః. ౧

టీ॥ సమవేతాః=కూడినట్టి, మహర్షయః=మహర్షులు; అప్రతిమతేజోభ్యాం=సరిలేనికాంతిగల; భ్రాతృభ్యాం=తోఁబుట్టువులచేత; కృతం (అధ్యాహృతము)=చేయఁబడిన; రోమహర్షణం=వెండ్రుకలగగుర్పాటు నొందించునట్టి; తం=ఆ; సంగమం=సమాగమమును; ప్రేక్ష్య=చూచి; విస్మితాః= ఆశ్చర్యపడినారు.

అచ్చటికివచ్చియున్నమహర్షులు, కాంతిమంతులగు నా రామభరతుల యద్భుతసమాగమంబుఁజూచి ; మిక్కిలి యునాశ్చర్యంబునొందిరి.

అని, తాత్పర్యము.

అంతర్హితా స్త్వృషిగణా స్సిద్ధాశ్చ పరమర్షయః
తౌ భ్రాతరౌ మహాత్మానౌ కాకుత్స్థౌ ప్రశశంసిరే. ౨

టీక॥ అంతర్హితాః = మఱుగుపాటునొందిన; ఋషిగణాస్తు=ఋషులసమూహములును; సిద్ధాశ్చ=సిద్ధులును; పరమర్షయః = దేవర్షులును; భ్రాతరౌ=అన్నదమ్ములయిన; మహాత్మానౌ= పూజ్యస్వభావముగల; తౌ=ఆ; కాకుత్స్థౌ=రామభరతులను; ప్రశశంసిరే=పొగడిరి.

అప్పుడంతర్ధానమునొందియున్న ఋషులును, సిద్ధులును దేవర్షులును, నన్నదమ్ముల నా రామ భరతులం బ్రశంసించిరి. అని, తాత్పర్యము,

స ధన్యో యస్య పుత్రౌ ద్వౌ ధర్మజ్ఞౌ ధర్మవిక్రమౌ

టీక॥ యస్య= ఎవ్వనియొక్క; పుత్రౌ=కొడుకులు; ద్వౌ=ఇద్దఱు ; ధర్మ

జ్ఞౌ=ధర్మము నెఱింగిన వారలు గాను; ధర్మవిక్రమౌ=ధర్మమునందుఁబరాక్రమముగలవారలు గాను; భవతః (అధ్యాహృతము)= అగుచున్నారో; సః= అతండు; ధన్యః=పుణ్యవంతుండు.

ఎవ్వనికి, ధర్మవేత్తలును ధర్మానుష్ఠానమునందుదృఢవ్రతములు గలవారలును గుణాఢ్యులు కొడుకులున్నారో, అట్టి దశరథ మహారాజుమిక్కిలియుఁబుణ్యవంతుండు. అని, తాత్పర్యము.

శ్రుత్వా వయం హి సంభాషా ముభయో స్స్పృహయామహే. ౩

టీక॥వయం=మనము; ఉభయోః= ఇద్దఱియొక్క; సంభాషాం=మాటను; శ్రుత్వా= విని ; స్పృహయామహే హి=ఆశించుచున్నాముగదా!

మనము, ఇద్దఱిసంభాషణమునువినుటచేత, నీయిద్దఱియందునుమక్కువపుట్టుచున్నది, అని,ఋషులు మున్నగువారలును రామభరతులంబ్రశంసించిరి. అని, తాత్పర్యము.

తత స్త్వృషిగణాః క్షిప్రం దశగ్రీవవధైషిణః
భరతం రాజశార్దూల మిత్యూచు స్సంగతా వచః. ౪

టీక॥తతః=అటుపిమ్మట; దశగ్రీవ వధైషిణః= రావణవధముగోరునట్టి; ఋషిగణాస్తు= ఋషులసమూహము లును;సంగతాః=చేరినవారలయి; క్షిప్రం = శీఘ్రముగా; రాజశార్దూలం=రాజశ్రేష్ఠుండగు; భరతం= భరతునిగూర్చి; ఇతి=ఇట్లు; వచః=మాటను; ఊచుః=చెప్పిరి.

అంత,నాఋషులు , రావణవధంబుగోరి, యందఱు నేకకంఠంబున, రాజశ్రేష్ఠుండగుభరతుంజూచి , యిట్లని చెప్పిరి.అని, తాత్పర్యము.

కులే జాత మహాప్రాజ్ఞ మహావృత్త మహాయశః
గ్రాహ్యం రామస్య కార్యం తే పితరం యద్య వేక్షసే. ౫

టీక॥మహాప్రాజ్ఞ=మహాపండితుండవును; మహావృత్త = పూజ్యమయినయాచారముగలవాఁడవును; మహాయశః= అధికమయినకీర్తిగలవాఁడవును ;

కులే=సత్కులమునందు; జాత = పుట్టినవాఁడవునగు భరతుఁడా!పితరం=తండ్రిని; అవేక్షస్వ=యది = కోరుదువేని; తే=నీకు; రామస్య= రామునియొక్క; వాక్యం=మాట; గ్రాహ్యం = గ్రహింపఁదగినది.

భరతుఁడా ! నీవుమహాపండితుండవు;సదాచారసంపన్నుండవు;మహాయశుఁడవు;సత్కులంబునంబుట్టిన వాఁడవు; నీతండ్రిపరలోకసుఖంబునొందవలయునని కోరుదువేని, నీవురాముండుచెప్పినట్లుగావింపుము.అని, తాత్పర్యము.

సదా నృణ మిమం రామం వయ మిచ్ఛామహే పితుః
అనృణత్వాచ్చ కైకేయ్యాః స్వర్గం దశరథో గతః. ౬

టీక॥వయం=మేము; ఇమం=ఈ; రామం=రాముని; సదా=ఎల్లప్పుడు; పితుః=తండ్రికి; అనృణం= ఋణములేనివానిఁగా; ఇచ్ఛామహే=కోరుచున్నాము. దశరథః=దశరథుఁడు;కైకేయ్యాః=కైకేయికి; అనృణత్వాచ్చ=ఋణములేకుండుటవలననే,స్వర్గం=స్వర్గమును; గతః=పొందినాఁడు.

రాముఁడు,ఎల్లప్పుడును , దండ్రిఋణంబు నొందకుండ వలెననిమాకోర్కి; అట్లుదశరథుండు,కైకేయి ఋణంబుదీర్చుకొనుటవలన , స్వర్గంబునొందినాఁడు; మీరలు, ఆదశరథుండుకైకేయికొసంగినవరమునుఅబద్ధముగావింతురేని, దశరథుండు స్వర్గము నొందఁజాలఁడు. అని,ఋషులుమున్నగువారలు, భరతునితోఁజెప్పిరి.

అని, తాత్పర్యము.

ఏతావ దుక్త్వా వచనం గంధర్వా స్సమహర్షయః
రాజర్షయశ్చైవ తదా సర్వే స్వాంస్వాం గతిం గతాః. ౭

టీక॥తదా=అప్పుడు; సమహర్షయః=మహర్షులతోఁగూడిన ; గంధర్వాః=గంధర్వులును ; రాజర్షయశ్చైవ=రాజర్షులును; సర్వే= అందఱును;ఏతావత్=ఇంత ; వచనం=మాటను;ఉక్త్వా=చెప్పి; స్వాంస్వాం=తమతమ; గతిం=స్థానమును;గతాః=పొందినారు.

అప్పుడు, మహర్షులును గంధర్వులును రాజర్షులును, భరతునకింతమట్టుకుఁజెప్పి, యందఱును, దమతమనెలవులకుంబోయిరి.

అని, తాత్పర్యము,

హ్లాదిత స్తేన వాక్యేన శుభేన శుభదర్శనః
రామ స్సంహృష్టవదన స్తా నృషీ నభ్య పూజయత్. ౮

టీ॥శుభదర్శనః= మంగళకరంబగుచూచుటగల ; రామః= రాముఁడు; తేన=ఆ; శుభేన= మంగళకరంబగు;వాక్యేన= మాటచేత; హ్లాదితః = సంతోషింపఁజేయఁబడినవాఁడై ; సంహృష్టవదనః= సంతసించినముఖముగలవాఁడై; తాన్=ఆ;ఋషీన్= ఋషులను;అభ్యపూజయత్= పూజించెను.

చూపరులకుమంగళంబు నొసంగునట్టి రాముండు, ప్రియకరంబగు నాఋషుల మాటనువిని, పమ సంతోషంబు నొంది, యాఋషులనందఱంబూజించెను, అని, తాత్పర్యము.

త్రస్తగాత్రస్తు భరత స్స వాచా సజ్జమానయా
కృతాంజలి రిదం వాక్యం రాఘవం పున రబ్రవీత్. ౯

టీ॥సః=ఆ;భరతస్తు=భరతుఁడును; త్రస్త గాత్రః = భయపడిన యవయవములుగలవాఁడై; కృతాంజలిః = చేయఁబడినచేమోడ్పుగలవాఁడై; రాఘవం = రామునిగూర్చి; సజ్జమానయా=తొట్రుపడుచున్న; వాచా=నోరిచేత; పునః=మఱల;ఇదం=ఈ; వాక్యం=మాటను;అబ్రవీత్=చెప్పెను.

అంత,భరతుండు, తనమనోరథము లేశమయినను సిద్ధింపకుండుటంజూచి, భయవిహ్వలుండై,చేమోడ్పుగీలించి , రామునింజూచి, మాటలుతొట్రువడ, నిట్లని,చెప్పెను. అని, తాత్పర్యము.

రాజధర్మ మనుప్రేక్ష్య కులధర్మానుసంతతిమ్
కర్తుమర్హసి కాకుత్స్థ మమ మాతుశ్చ యాచనామ్. ౧౦

స ౧౧౨

టీక॥ కాకుత్థ్స = రాముఁడా! రాజధర్మం = రాజధర్మమును; కులధర్మానుసంతతిం = కులధర్మము యొక్క అనువృత్తిః; అనుప్రేక్ష్య = చూచి; మమ = నాయొక్క; మాతుః = తల్లి యొక్క; యాచనాంచ = ప్రార్థనను; కర్తుం = చేయుటకు; అర్హసి = తగుదువు,

రాముఁడా! రాజధర్మముచొప్పున రాజ్యపరిపాలనము సేయవలసియుండుటను, కులధర్మముచొప్పున జ్యేష్ఠునకే పట్టాభిషేకము కావలసి యుండుటను, ఆలోచించి, నాతల్లి ప్రార్థనను గావింపుము. అని, తాత్పర్యము.

రక్షితుం సుమహద్రాజ్య మహమేకస్తు నోత్సహే
పౌరజానపదాంశ్చాపి రక్తాన్ రంజయితుం తథా. ౧౧

టీక॥ అహం = నేను; ఏకస్తు = ఒకఁడనై; సుమహత్ = మిక్కిలియు నధికమయిన; రాజ్యం = రాజ్యమును; రక్షితుం = రక్షించుటకును; తథా = అట్లు; రక్తాన్ = అనురాగముగల; పౌరజానపదాంశ్చాపి = పట్టణవాసి జనులను గ్రామవాసిజనులను; రంజయితుం = సంతసింపఁజేయుటకును; నోత్సహే = ఉత్సహింపను.

ఈ మహారాజ్యంబు రక్షించుటకుఁగాని, మనయందనురాగముగల యాపౌరజానపదుల రంజిల్లఁజేయుటకుఁగాని నాయొక్కనిచేతనలవిగాదు.

అని. తాత్పర్యము.

జ్ఞాతయశ్చహి యోధాశ్చ మిత్రాణి సుహృదశ్చ నః
త్వామేవ ప్రతికాంక్షంతే పర్జన్యమివ కర్షకాః. ౧౨

టీక॥ నః = మనయొక్క; జ్ఞాతయశ్చ = బంధువులును; యోధాశ్చ = సేనానాయకులును; మిత్రాణి = స్నేహితులును; సుహృదశ్చ = మంచిమనస్సుగల వారలును; త్వామేవ = నిన్నే; కర్షకాః = దున్నుకొనువారలు; పర్జన్యమివ = మేఘమువలె; ప్రతికాంక్షంతే = కోరుచున్నారు

మనబంధువులును, సేనానాయకులును స్నేహితులును మనయందుఁ బ్రేమగలవారలును, సేద్యముచేజీవించువారలు మేఘమునుగోరునట్లు, నిన్నే గోరుచున్నారు. అని, తాత్పర్యము

ఇదం రాజ్యం మహాప్రాజ్ఞ స్థాపయ ప్రతిపద్యహి
శక్తిమానసి కాకుత్స్థ లోకస్య పరిపాలనే. ౧౩

టీక॥ మహాప్రాజ్ఞ=మహాపండితుండవగు; కాకుత్స్థ=రాముఁడా! ఇదం=ఈ; రాజ్యం=రాజ్యమును; ప్రతిపద్య=పొంది; స్థాపయ=స్థాపించుము. లోకస్య=లోకముయొక్క; పరిపాలనే=పాలించుటయందు; శక్తిమాన్=సామర్థ్యముగలవాఁడవు; అసిహి= అగుచున్నావుగదా!

మహాపండితుండవగు రాముఁడా! నీవీ రాజ్యంబునంగీకరించి పాలింపుము; ఈకోసలదేశంబునుమాత్రమె కాదు; ఈలోకంబునంతయుఁ బాలింప సమర్థుండవు. అని, భరతుండు, రామునితోఁజెప్పెను- అని, తాత్పర్యము-

ఇత్యుక్త్వా ఽ న్యపత ద్భ్రాతుః పాదయో ర్భరత స్తదా
భృశం సంప్రార్థయామాస రామమేవ ప్రియంవదః. ౧౪

టీక॥ భరతః=భరతుఁడు; తదా=అప్పుడు; ఇతి=ఇట్లు; ఉక్త్వా= చెప్పి; భ్రాతుః=అన్నయొక్క; పాదయోః=పాదములయందు; న్యపతత్= పడెను. ప్రియంవదః=ప్రియవచనములు చెప్పునట్టిభరతుండు; రామమేవ= రామునే; భృశం=మిక్కిలియు; సంప్రార్థయామాస=ప్రార్థించెను.

అంత, భరతుండు, తనమాటలన్నియు వ్యర్థములగుటంజేసి, రామునిపాదంబులంబడి, ప్రియవచనంబుల నతనిం బలువిధంబులఁ బ్రార్థించెను.

అని, తాత్పర్యము.

తమంకే భరతం కృత్వా రామో వచన మబ్రవీత్
శ్యామం నలినపత్రాక్షం మత్తహంసస్వరం స్వయమ్. ౧౫

టీక॥ రామః=రాముఁడు; స్వయం= తాను; శ్యామం=నల్లనివాఁడును; నలినపత్రాక్షం=తామరపూరేకులవంటికన్నులుగలవాఁడును; మత్తహంసస్వరం=మ




దించినహంసయొక్క ధ్వనివంటి కంఠధ్వనిగలవాఁడునగు; తం=ఆ; భరతం=భరతుని; అంకే= తొడయందు; కృత్వా=చేసి; ఉంచుకొనియనుట; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

రాముఁడు, శ్యామలదేహుండును

గమలపత్రంబులుంబోలె విశాలసుందరంబులగుకన్నులుగలవాఁడును మదించినహంసకుంబోలెమనోహరంబులగు పలుకులుగలవాఁడునగు భరతునంకంబునంజేర్చి, యిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

ఆగతా త్వా మిమం బుద్ధి స్స్వజా వైనయికీచ యా
భృశ ముత్సహసే తాత రక్షితుం పృథివీ మపి. ౧౫

టీక॥ తాత=నాయనా! యా=ఏది; స్వజా= సహజమును; వైనయికీచ=గురుశిక్షవలనగలిగినదియునో; ఇయం=ఈ; బుద్ధిః= బుద్ధి; త్వాం = నిన్ను; ఆగతా=పొందినది, పృథివీమపి=భూమినింగూడ; రక్షితుం= రక్షించుటకు; భృశం=మిక్కిలియు; ఉత్సహసే= ఉత్సహింతువు.

నాయనా! నీకుసహజంబగుబుద్ధియధికముగాఁగలదు, గురుశిక్షవలన, గలుగుబుద్ధియుఁగలిగియున్నది; కావున; నీకీభూమండలమునంతయురక్షింప మిక్కిలియుశక్తియున్నది.

అని, తాత్పర్యము.

అమాత్యైశ్చ సుహృద్భిశ్చ బుద్ధిమద్భిశ్చ మంత్రిభిః
సర్వకార్యాణి సమ్మంత్ర్య సుమహాంత్యపి కారయ. ౧౬

టీక॥ అమాత్యైశ్చ= ప్రధానమంత్రులతోను ; సుహృద్భిశ్చ=స్నేహితులతోను; బుద్ధిమద్భిః=అధికమయినబుద్ధిగల; మంత్రిభిశ్చ= ఉపమంత్రులతోను ; సమ్మంత్ర్య = చక్కగానాలోచించి; సుమహాంత్యపి=మిక్కిలియునధికములయినను; సర్వకార్యాణి= సమస్తకార్యములను; కారయ= చేయింపుము.

నీవు, ప్రధానమంత్రులతోను స్నేహితులతోనుబుద్ధిమంతులగు నుపమంత్రులతోనుంజక్కఁగానాలోచించి , గొప్పకార్యంబు లన్నియుం గావింపుము. అని, తాత్పర్యము.




లక్ష్మీశ్చంద్రా దపేయాద్వా హిమవాన్వా హిమం త్యజేత్
అతీయాత్సాగరో వేలాం న ప్రతిజ్ఞా మహం పితుః.౧౮

చంద్రాత్=చంద్రునివలనను; లక్ష్మీః=కాంతి; అపేయాద్వా=విడిచిపోవునను బోవును; హిమవాన్=హిమవత్పర్వతము; హిమం=మంచును; త్యజేద్వా=విడిచిననువిడుచును; సాగరః=సముద్రుఁడు; వేలాం=చెలియలి కట్టను; అతీయాత్=అతిక్రమించినను అతిక్రమించును; అహం=నేను; పితుః=తండ్రి సంబంధియైన; ప్రతిజ్ఞాం=ప్రతిజ్ఞను; న(అతీయాం) అతిక్రమింపను.

కాంతి చంద్రునివిడిచినను విడుచును; మంచు హిమవత్పర్వతమునువిడిచినను విడుచును; సముద్రము చెలియలి కట్టనతిక్రమించిన నతిక్రమించును; నేను మాతండ్రిచేఁ గావించిన ప్రతిజ్ఞనతిక్రమింపను. అని, తాత్పర్యము,

కామాద్వా తాత లోభాద్వా మాత్రా తుభ్య మిదం కృతమ్
న తన్మనసి కర్తవ్యం వర్తితవ్యంచ మాతృవత్.౧౯

టీక॥తాత=నాయనా; మాత్రా=తల్లిచేత; కామాద్వా=కామమువలన గాని; లోభాద్వా=ఆశవలనఁగాని; తుభ్యం=నీకొఱకు; ఇదం=ఇది; కృతం=చేయఁబడినది, తత్=అది; మనసి=మనసునందు; నకర్తవ్యం=చేయఁబడరాదు. మాతృవత్=తల్లియందువలె; వర్తితవ్యంచ=ఉండుటకావలసినదియు.

నాయనా! కామమువలననో లోభమువలననో నీతల్లి నీకొఱకు; ఈకార్యంబుచేసినది, దానినీవుమనసునుంచవలదు; నీవుతల్లియందువలెనా బిడయాందు వర్తింపవలయును. అని రాముఁడుభరతునితోఁ జెప్పెను.అని, తాత్పర్యము.

ఏవం బ్రువాణం భరతః కౌసల్యాసుత మబ్రవీత్
తేజసాఽదిత్యసంకాశం ప్రతిపచ్చంద్రదర్శనమ్. ౨౦

టీక॥భరతః=భరతుఁడు; ఏవం=ఇట్లు; బ్రువాణం=చెప్పుచున్నవాఁడును; తేజసా=కాంతిచేత; ఆదిత్యసంకాశం=సూర్యునితో సమానుఁడును;

ప్రతిపచ్చంద్రదర్శనం=పాడ్యమియం దలిచంద్రుని యొక్క రూపమువంటిరూపము గలవాఁడునగు; కౌసల్యా సుతం=కౌసల్యాదేవికొడుకైన రామునిగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

భరతుండిట్లు చెప్పుచున్న, కాంతిచే సూర్యసమానుండును పాడ్యమినాటి చంద్రుండుంబోలె, వర్ధిష్ణువును బూజనీయుండునగు రాముఁ జూచి; యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

అధిరోహార్య పాదాభ్యాం పాదుకే హేమభూషితే
ఏతే హి సర్వలోకస్య యోగక్షేమం విధాస్యతః. ౨౧

టీక॥ఆర్య=పూజ్యుండవగు రాముఁడా! పాదాభ్యాం = పాదములచేత; హేమభూషితే=బంగారముచేనలంకరింపఁబడిన; పాదుకే=పావకోళ్లను; అధిరోహ=ఎక్కుము. ఏతే=ఈపావకోళ్లు; సర్వలోకస్య= సమస్తలోకమునకును; యోగక్షేమం= యోగమును క్షేమమును; విధాస్యతో హి= చేయఁగలవుగదా!

పూజ్యుండవగు రాముఁడా! కాంచనాలంకృతంబులగు నీపాదుకల పై నీ పాదంబులనుంచుము; ఈపాదుకలె, సమస్తప్రపంచమునకును యోగక్షేమంబులుగావింపఁగలవు.

అని, తాత్పర్యము.

సోధిరుహ్య నరవ్యాఘ్రః పాదుకే హ్యవరుహ్యచ
ప్రాయచ్ఛత్సుమహాతేజా భరతాయ మహాత్మనే. ౨౨

టీక॥నరవ్యాఘ్రః= పురుషశ్రేష్ఠుండును; సుమహాతేజాః= మిక్కిలియు నధికమయిన ప్రభావము గలవాఁడునగు; సః=ఆ రాముఁడు; పాదుకే=పావకోళ్లను; అధిరుహ్య=ఎక్కి; అవరుహ్యచ=దిగియు; మహాత్మనే=పూజ్యమయినస్వభావముగల, భరతాయ= భరతునికొఱకు; ప్రాయచ్ఛత్= ఇచ్చెనుగదా!

పురుషశ్రేష్ఠుండును మహాప్రభావుండునగు నా రాముండు, ఆపాదుకలం దొడుగుకొని, మఱలవిడిచి, మహాత్ముండగు భరతునకొసంగెను.

అని, తాత్పర్యము.

సపాదుకే సంప్రణమ్య రామం వచన మబ్రవీత్

టీక॥సః= ఆభరతుఁడు ; పాదుకే=పావకోళ్లను; సంప్రణమ్య=నమస్కరించి; రామం= రామునిగూర్చి ; వచనం=మాటను; అబ్రవీత్= చెప్పెను.

అంత,భరతుఁడు, ఆపాదుకలకునమస్కరించిరామునింజూచి, ఇట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

చతుర్దశహి వర్షాణి జటాచీరధరో హ్యహమ్. ౨౩
ఫలమూలాశనో వీర భవేయం రఘునందన
తవా గమన మాకాంక్షన్ వసన్వై నగరాద్బహిః. ౨౪
తవ పాదుకయో ర్న్యస్త రాజ్యతంత్రః పరంతప

టీక॥పరంతప=శత్రువులఁ దపింపఁజేయునట్టివాఁడవును;వీర= పరాక్రమవంతుఁడవునగు;రఘునందన= రాముఁడా! అహం=నేను; తవ= నీయొక్క ; పాదుకయోః=పావకోళ్లయందు; న్యస్తరాజ్యతంత్రః=ఉంచఁబడిన రాజ్యతంత్రములుగలవాఁడనై ; నగరాత్= పట్టణమునకన్న; బహిర్వై=వెలుపలనే=వసన్=వాసము సేయుచు;జటాచీరధరః=జటలనునారచీరలను ధరించినవాఁడనై ("హి" అనునది పాదపూరణార్థము); ఫలమూలాశనః= పండ్లునుగడ్డలును ఆహారము గాఁ గలవాఁడనై; చతుర్దశ=పదునాలుగు("హి" అనునది పాదపూరణార్థము); వర్షాణి=సంవత్సరములను ; తవ= నీయొక్క ;ఆగమనం=రాకను;ఆకాంక్షన్= కోరుచు;భవేయం=ఉండెదను.

శత్రువులఁదపింపఁజేయునట్టి మహాపరాక్రమశాలివగు రాముఁడా! నేను,బదునాలుగుసంవత్సరములును , జటలు దాల్చినారచీరలంగట్టుకొని,ఫలమూలములనాహారంబుగాఁగొనుచు, నీపాదుకలకు రాజ్యతంత్రంబులొప్పగించి,పట్టణంబునకు వెలుపలవాసంబు సేయుచు,నీరాకకెదురుసూచుచుండెదను.

అని, తాత్పర్యము.

చతుర్దశేతు సంపూర్ణే వర్షేఽహని రఘూత్తమ. ౨౫

న ద్రక్ష్యామి యది త్వాం తు ప్రవేక్ష్యామి హుతాశనమ్

టీక॥ రఘూత్తమ=రాముఁడా! చతుర్దశే = పదునాలుగవదగు; వర్షే=సంవత్సరము; సంపూర్ణే=నిండినదగుచుండఁగా; అహని=దినమునందు; త్వాం=నిన్ను; నద్రక్ష్యామియదితు=చూడకమాత్రముందునేని; హుతాశనం = అగ్నిహోత్రమును; ప్రవేక్ష్యామి=దొచ్చెదను.

రాముఁడా! పదునాలుగుసంవత్సరంబులునునిండినవెనుక, మఱునాటి దినమున నిన్నుఁజూడకుందునేని, తప్పకయగ్నిహోత్రముంబ్రవేశించెదను. అని, భరతుఁడు రామునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తథేతిచ ప్రతిజ్ఞాయ తం పరిష్వజ్య సాదరమ్. ౨౬
శత్రుఘ్నంచ పరిష్వజ్య భరతం చేదమబ్రవీత్

టీక॥ సః(అధ్యాహృతము)= ఆరాముఁడు; తథేతి=ఆలాగుననేయని; ప్రతిజ్ఞాయచ=ఒప్పుకొని; తం=ఆభరతుని; సాదరం= ఆదరముతోఁగూడినట్లుగా; పరిష్వజ్య=కవుఁగిలించుకొని; శత్రుఘ్నంచ=శత్రుఘ్నుని; పరిష్వజ్య = కవుగిలించుకొని; భరతం=భరతునిగూర్చి; ఇదం=ఈమాటను; అబ్రవీచ్చ = చెప్పెను.

అంత రాముండు, భరతుండు చెప్పినమాటకొప్పుకొని, యతనింగవుఁగిలించుకొని, శత్రుఘ్నునింగవుఁగిలించికొని, భరతుంజూచి, యీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

మాతరం రక్ష కైకేయీం మా రోషం కురు తాం ప్రతి. ౨౭
మయా చ సీతయా చైవ శప్తోసి రఘుసత్తమ

టీక॥ రఘుసత్తమ = భరతుఁడా! మాతరం=తల్లియగు; కైకేయీం= కైకేయిని; రక్ష=రక్షింపుము. తాంప్రతి=ఆబిడనుగూర్చి; కోపం=కోపమును; మాకురు=చేయకుము. మయాచ=నాచేతను; సీతయాచైవ= సీతచేతను; శప్తః = ఒట్టుపెట్టఁబడినవాఁడవు; అసి=అగుచున్నావు.




భరతుఁడా! నీతల్లి యగు కైకేయి నిరక్షింపుము; ఆబిడపైఁగోపంబు సేయకుము; అట్లు, నాపేరిటను సీతపేరి టను;ఆనపెట్టుచున్నాను అని;రాముం డు,భరతునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా శ్రుపరీతాక్షో భ్రాతరం విససర్జహ. ౭౮

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; ఇతి=ఇట్లు;ఉక్త్వా=చెప్పి; అశ్రుపరీతాక్షః=కన్నీళ్లచే వ్యాపింపఁ బడినకండ్లుగలవాఁడై; భ్రాతరం= త మ్ముని;విససర్జ= విడిచెను "హ" అ నునదిపాదపూరణార్థము.

రాముఁడు, ఈప్రకారముభరతుని తోఁజెప్పి, యంతఁ, గన్నులనీళ్లుగాఱ భరతుఁబొమ్మనెను.

అని, తాత్పర్యము.

స పాదుకే తే భరతః ప్రతాపవాన్
స్వలంకృతే సంపరిపూజ్య ధర్మవిత్
ప్రదక్షిణంచైవ చకార రాఘవం
చకార తే చోత్తమనాగమూర్ధని. ౭౯

టీక॥ప్రతాపవాన్= అధికమయిన పరాక్రమము గలవాఁడును; ధర్మవి త్=ధర్మము నెఱింగినవాఁడునగు ; సః=ఆ;భరతః=భరతుఁడు; స్వలంకృ తే=చక్కఁగానలంకరింపఁబడిన; తే= ఆ;పాదుకే= పాదుకలను ; సంపరి పూజ్య=చక్కఁగాబూజించి; రాఘ వం = రామునిగూర్చి; ప్రదక్షిణంచై వ=ప్రదక్షిణమును; చకార=చేసెను; తేచ= ఆపాదుకలను; ఉత్తమనాగ మూర్ధని=శ్రేష్ఠమయినయేనుంగు శి రస్సునందు; చకార=చేసెను; ఉంచె ననుట.

మహాపరాక్రమశాలియు ధర్మవే త్తయునగు నాభరతుండు, కాంచనా లంకృతంబులగు నా పాదుకలంజక్కఁ గాఁబూజించి, రామునకుఁ బ్రదక్షిణం బుగావించి, యాపాదుకలనమృత్యుం జయంబనునుత్తమగజంబు శిరస్సుననుం చెను. అని, తాత్పర్యము.




అథా నుపూర్వ్యా త్ప్రతినంద్య తం జనం
గురూంశ్చ మంత్రిప్రకృతీ స్తథా నుజౌ
వ్యసర్జయ ద్రాఘువవంశవర్ధన
స్థిరః స్వధర్మే హిమవా నివాచలః. ౩౦

టీక॥ అథ = అటుపిమ్మట; హిమవాన్ = హిమవంతమను; అచలఇవ = పర్వతమువలె; స్వధర్మే = తనధర్మమునందు; స్థిరః = చలనములేనట్టి; రాఘువవంశవర్ధనః = రఘువంశమునువృద్ధిబొందించునట్టి రాముండు; ఆనుపూర్వ్యాత్ = క్రమమువలన; తం = ఆ; జనం = జనమును; గురూంశ్చ = గురువులను; మంత్రిప్రకృతీః = మంత్రులనుప్రజలను; తథా = అట్లు; అనుజౌ = తమ్ములను; ప్రతినంద్య = కొనియాడి; వ్యసర్జయత్ = విడిచెను.

అంత, హిమవత్పర్వతమువలె స్వధర్మంబున మిక్కిలియు ధైర్యము గల రాముండు, గురువులను మంత్రులనుజనులను, తమ్ములగు భరతశత్రుఘ్నులను, వారివారికిందగువిధంబుల బూజించియందఱనుంబొమ్మనెను.

అని, తాత్పర్యము.

తం మాతరో బాష్పగృహీతకంఠ్యో
దుఃఖేన నామం త్రయితుం హి శేకుః
స త్వేవ మాతౄ రభివాద్య సర్వా
రుదన్ కుటీం స్వాం ప్రవివేశ రామః. ౩౧

టీక॥ బాష్పగృహీతకంఠ్యః = కన్నీళ్లచేగ్రహింపఁబడినకంఠముగలులు; మాతరః = తల్లులు; దుఃఖేన = దుఃఖముచేత; తం = ఆరాముని; ఆమంత్రయితుం = వీడ్కొనుటకు; న శేకుహి = చాలరైరి; సః = ఆ; రామస్త్వేవ = రాముఁడే; మాతరః = తల్లులను; సర్వాః = అందఱను; అభివాద్య = నమస్కరించి; రుదన్ = రోదనంబుసేయుచు; స్వాం = తనదైన; కుటీం = పర్ణశాలను; ప్రవివేశ = ప్రవేశించెను.

తల్లులు, కన్నీళ్లొలుకుచుండుటచేత,

దుఃఖంబున రాముని వీడ్కొనం జాలరైరి, ఆరాముండే, తల్లులకందఱకు నమస్కరించి, రోదనంబు సేయుచు తనపర్ణశాలం బ్రవేశించెను,

అని, తాత్పర్యము,

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, ద్వాదశోత్తరశతతమస్సర్గః.
ఇది, స్పష్టము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండద్వాదశోత్తరశతతమసర్గటీక,
ముగిసినది.

---

౧౧౩

త్ర యో ద శో త్త ర శ త త మ స ర్గ ప్రా రం భః.

తత శ్శిరసి కృత్వాతు పాదుకే భరత స్తదా
ఆరురోహ రథం హృష్ట శ్శత్రుఘ్నేన సమన్వితః. ౧

టీక॥ తతః=అంత; తదా= అప్పుడు; భరతః=భరతుఁడు ; పాదుకే= పావకోళ్లను; శిరసి=తలయందు; కృత్వాతు=ఉంచికొన్నంతనే; హృష్టః= సంతోషించినవాఁడై ; శత్రుఘ్నేన= శత్రుఘ్నునితో; సమన్వితః = కూడినవాఁడై; రథం = రథమును; ఆరురోహ=ఎక్కెను.

అంతనప్పుడు, భరతుండు, రామపాదుకలనుశిరసుననుంచుకొని , పరమసంతోషంబున , శత్రుఘ్నుంగూడిరథంబునారోహించెను.

అని, తాత్పర్యము.

స ౧౧౩

వసిష్ఠో వామదేవశ్చ జాబాలిశ్చ దృఢవ్రతః
అగ్రతః ప్రయయు స్సర్వే మంత్రిణో మంత్రపూజితాః. ౨

టీక॥ వసిష్ఠః=వసిష్ఠుండును; వామదేవశ్చ = వామదేవుండును; దృఢవ్రతః=దృఢమయినవ్రతము గల; జాబాలిశ్చ=జాబాలియును; మంత్రపూజితాః= ఆలోచనచేఁబూజింపఁబడిన; మంత్రిణః=మంత్రులును; సర్వే=అందఱును; అగ్రతః = ముందట; ప్రయయుః=పోయిరి.

వసిష్ఠుండునువామదేవుండును దృఢవ్రతుండగుజాబాలియు నాలోచనంబునసమర్థులగు మంత్రులు నందఱును, ముందటంబోయిరి.

అని, తాత్పర్యము.

మందాకినీం నదీం రమ్యాం ప్రాఙ్ముఖాస్తే యయు స్తదా
ప్రదక్షిణంచ కుర్వాణా శ్చిత్రకూటం మహాగిరిమ్. ౩

టీక॥తదా=అప్పుడు; తే= వారలు; మహాగిరిం=మహాపర్వతమయిన, చిత్రకూటం=చిత్రకూటమునుగూర్చి; ప్రదక్షిణం=ప్రదక్షిణమును; కుర్వాణాశ్చ=చేయుచును; ప్రాఙ్ముఖాః=తూర్పు మొగము గలవారలయి; రమ్యాం=మనోహరమయిన; మందాకినీం=మందాకినియను;నదీం=నదిని; యయుః=పొందిరి.

అప్పుడువారలు, చిత్రకూటపర్వతంబునకుఁబ్రదక్షిణముగాఁ, దూర్పుదిక్కుఁబట్టి,రమణీయంబగు మందాకినీనదింబొందిరి. అని, తాత్పర్యము.

పశ్యన్ ధాతుసహస్రాణి రమ్యాణి వివిధానిచ
ప్రయయౌ తస్య పార్శ్వేన ససైన్యో భరత స్తదా. ౪

టీక॥తదా=అప్పుడు, భరతః=భరతుఁడు; ససైన్యః=సైన్యముతోఁగూడినవాఁడై; రమ్యాణి=మనోహరములును; వివిధానిచ= నానావిధములగు; ధాతుసహస్రాణి= ధాతువుల వేలను; పశ్యన్=చూచుచు; తస్య= ఆచి

త్రకూటపర్వతముయొక్క ; పార్శ్వే=ప్రక్కచేత; ప్రయయౌ=పోయెను.

అప్పుడు, భరతుండు, సైన్యముం గూడి, రమణీయంబులగు నానావిధ ధాతువులంజూచుచు, నాచిత్రకూటపర్వతపార్శ్వ మార్గంబునం బోయెను. అని, తాత్పర్యము.

అదూరా చ్చిత్రకూటస్య దదర్శ భరత స్తదా
ఆశ్రమం యత్ర స ముని ర్భరద్వాజకృతాలయః. ౫

టీక॥ తదా=అప్పుడు; భరతః=భరతుండు; చిత్రకూటస్య=చిత్రకూటపర్వతమునకు; అదూరాత్ = సమీపంబున; యత్ర= ఎచ్చట; సః=ఆ; భరద్వాజః=భరద్వాజుండను ; మునిః= ముని; కృతాలయః=చేయంబడిన యింటిగలవాండో; తం(అధ్యాహృతము)=ఆ; ఆశ్రమం = ఆశ్రమమును ; దదర్శ=చూచెను.

అంతట, భరతుండు, చిత్రకూటపర్వతంబునకు సమీపంబున, భరద్వాజమహాముని యుండునట్టి యాశ్రమపదంబుం జూచెను. అని, తాత్పర్యము.

స త మాశ్రమ మాగమ్య భరద్వాజస్య బుద్ధిమాన్
అవతీర్య రథా త్పాదౌ వవందే భరత స్తదా. ౬

టీక॥ తదా=అప్పుడు; బుద్ధిమాన్=అధికమయినబుద్ధిగల; సః=ఆ; భరతః=భరతుండు; తం=ఆ; ఆశ్రమం = ఆశ్రమమును; ఆగమ్య=పొంది; రథాత్=రథంబుననుండి; అవతీర్య=దిగి ; భరద్వాజస్య=భరద్వాజమహామునియొక్క; పాదౌ=పాదములను; వవందే=నమస్కరించెను.

అంత బుద్ధిమంతుండగు, నాభరతుండు, అయ్యాశ్రమంబునకుం బోయి, రథంబు డిగ్గి, భరద్వాజమహాముని పాదములకు సాష్టాంగంబుగా వందనము చేసెను. అని, తాత్పర్యము.

తతో హృష్టో భరద్వాజో భరతం వాక్య మబ్రవీత్

టీక॥ తతః=అంత ; భరద్వాజః=భరద్వాజుఁడు; హృష్టః=సంతసించినవాఁడై; భరతం=భరతునిగూర్చి; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, భరద్వాజమహర్షి, భరతాగమనంబునకు సంతోషంబునొంది, భరతుంజూచి, యిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

అపికృత్యం కృతం తాత రామేణచ సమాగతమ్. ౭

టీక॥ తాత=నాయనా! కృత్యం=కార్యము; అపికృతం = చేయఁబడినదా యేమి? రామేణచ= రామునితోను; (అపి) సమాగతం = సమాగమమయినదా యేమి?

నాయనా! నీవుపోయిన కార్యంబయినదా యేమి? రామునింజూచితివా యేమి? అనిభరద్వాజమహాముని, భరతునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త స్సతు తతో భరద్వాజేన ధీమతా
ప్రత్యువాచ భరద్వాజం భరతో భ్రాతృవత్సలః. ౮

టీక॥ భ్రాతృవత్సలః=అన్నయందధికప్రేమగల; సః=ఆ; భరతస్తు= భరతుఁడును; ధీమతా=బుద్ధిమంతుండగు; భరద్వాజేన=భరద్వాజుని చేత; ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై ; భరద్వాజం=భరద్వాజునిగూర్చి; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

భ్రాతృవత్సలుండగుభరతుండు, బుద్ధిమంతుండగుభరద్వాజ మహామునియడిగినదివిని, యతనింజూచి, యిట్లనిబదులుచెప్పెను.

అని, తాత్పర్యము

స యాచ్యమానో గురుణా మయాచ దృఢవిక్రమః
రాఘవః పరమప్రీతో వసిష్ఠం వాక్య మబ్రవీత్. ౯

టీక॥ దృఢవిక్రమః= దృఢమయినపరాక్రమముగల; సః=ఆ; రాఘవః=రాముఁడు; గురుణా= ఆచార్యుఁడగువసిష్ఠునిచేతను ; మయాచ = నాచేతను;

యాచ్యమానః=యాచింపఁబడుచున్న వాఁడై; పరమప్రీతః= మిక్కిలియుసంతోషించినవాఁడై; వసిష్ఠం= వసిష్ఠుని గూర్చి; వాక్యం=మాటను; అబ్రవీత్= చెప్పెను.

దృఢపరాక్రముఁడగు రాముండు, నేనునువసిష్ఠుండును రాజ్యంబు బాలింపరమ్మనియాచింపఁగా,సంతోషించి,వసిష్ఠుంజూచి,యిట్లని,చెప్పెను.
అని.తాత్పర్యము.

పితుః ప్రతిజ్ఞాం తా మేవ పాలయిష్యామి త త్త్వతః
చతుర్దశ హి వర్షాణి యా ప్రతిజ్ఞా పితు ర్మమ. ౧౦

టీక॥ చదుర్దశ = పదునాలుగు; వర్షాణి=సంవత్సరములను;వనేవ స్త వ్యమితి(అధ్యాహృతము)= అడవియందుండవలయుననీ; మమ= నాయొక్క; పితుః=తండ్రియొక్క;ప్రతిజ్ఞా=ప్రతిన; యా(అస్తి)= ఏదిగలదో; తాం=ఆ; పితుః=తండ్రియొక్క; ప్రతిజ్ఞామేవ= ప్రతిననే;త త్త్వతః= యాథార్థ్యము చేత; పాలయిష్యామి=పాలించెదను.

రాముండుపదునాలుగు సంవత్సరంబులుండవలయును,అనినాతండ్రికై కేయికిఁగాఁగావించినప్రతిజ్ఞనేయథార్థంబుగాఁబాలించెదను , అనివసిష్ఠునితోఁజెప్పెను.అని,తాత్పర్యము

ఏవ ముక్తో మహాప్రాజ్ఞో వసిష్ఠః ప్రత్యువాచహ
వాక్యజ్ఞో వాక్యకుశలం రాఘవం వచనం మహత్. ౧౧

టీక॥వాక్యజ్ఞః= మాటలనెఱింగినవాఁడును; మహాప్రాజ్ఞః=మహాపండితుండునగు; వసిష్ఠః=వసిష్ఠుఁడు ; ఏవం=ఇట్లు; ఉక్తః= చెప్పఁబడినవాఁడై;వాక్యకుశలం=మాటలయందుసమర్థుండగు;రాఘవం= రామునిగూర్చి; మహత్ =ఉత్తమమయిన ; వచనం= మాటను; ప్రత్యువాచ = బదులుచెప్పెను("హ") అనునదిపాదపూరణార్థము).

మాటలుచెప్పనేర్చినవాఁడును మహాపండితుండునగు వసిష్ఠుండు , రాముండుచెప్పినదివిని, యిట్టిమాటలుచెప్పుటయందుసమర్థుండగు రామునింజూచి,యధికార్థంబగు, నీమాటంజెప్పెను. అని,తాత్పర్యము.

స ౧౧౩

ఏతే ప్రయచ్ఛ సంహృష్టః పాదుకే హేమభూషితే
అయోధ్యాయాం మహాప్రాజ్ఞ యోగక్షేమకరే తవ. ౧౨

టీక॥ మహాప్రాజ్ఞ = మహాపండితుండవగు రామా! త్వం (అధ్యాహృతము) = నీవు; సంహృష్టః = సంతోషించినవాఁడవై; అయోధ్యాయాం = అయోధ్యాపట్టణమునందు; యోగక్షేమకరే = యోగక్షేమంబులఁ జేయునట్టి; హేమభూషితే = బంగారుచే నలంకరింపఁబడిన; తవ = నీయొక్క; ఏతే = ఈ; పాదుకే = పాదుకలను; ప్రయచ్ఛ = ఇమ్ము.

మహాపండితుండవగు రాముఁడా! నీవు, సంతోషంబున, బంగారముతో నలంకరింపఁబడిన పాదుకలనిమ్ము; ఇవే, అయోధ్యయందు యోగక్షేమంబులు సేయఁగలవు. అని, వసిష్ఠుండు రామునకుఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవముక్తో వసిష్ఠేన రాఘవః ప్రాఙ్ముఖః స్థితః
పాదుకే అధిరుహ్యైతే మమ రాజ్యాయ వై దదౌ. ౧౩

టీక॥ రాఘవః = రాముఁడు; ఏవం = ఇట్లు; వసిష్ఠేన = వసిష్ఠమహాముని చేత; ఉక్తః = చెప్పఁబడినవాఁడై; ప్రాఙ్ముఖః = తూర్పుమొగముగలవాఁడుగా; స్థితః = ఉన్నవాఁడై; ఏతే = ఈ; పాదుకే = పావకోళ్లను; అధిరుహ్య = ఎక్కి; మమ = నాకు; రాజ్యాయవై = రాజ్యమునిమిత్తమయ్యే; దదౌ = ఇచ్చెను.

రాముండు, వసిష్ఠుండు చెప్పినమాటవిని, తూర్పుమొగంబుగా నిలిచి, యీపాదుకలపైఁ బాదంబులుంచి, నాకు రాజ్యాలంబనార్థము, వానినొసంగెను. అని, తాత్పర్యము.

నివృత్తోఽహ మనుజ్ఞాతో రామేణ సుమహాత్మనా
అయోధ్యామేవ గచ్ఛామి గృహీత్వా పాదుకే శుభే. ౧౪

టీక॥ అహం = నేను; శుభే = మంగళకరములయిన; పాదుకే = పావకోళ్లను; గృహీత్వా = తీసికొని; సుమహాత్మనా = మిక్కిలియునధికమయినప్రభా

వముగల; రామేణ=రామునిచేత; అనుజ్ఞాతః=అనుమతింపఁబడినవాఁడనై; నివృత్తః=మఱలినవాఁడనై; అయోధ్యామేవ=అయోధ్యాపట్టణమునుగూర్చియే; గచ్ఛామి= పోవుచున్నాను.

అంతనేనుమంగళకరంబులగు పాదుకలందీసికొని, మహాప్రభావుండగు రామునిననుజ్ఞఁబడసి,మఱల,నయోధ్యాపట్టణంబునకేపోవుచున్నాను. అని,భరతుండుభరద్వాజునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏత చ్ఛ్రుత్వా శుభం వాక్యం భరతస్య మహాత్మనః
భరద్వాజ శ్శుభతరం ముని ర్వాక్య ముదాచ తమ్.౧౫

టీక॥ భరద్వాజః = భరద్వాజుండను;మునిః=ముని; మహాత్మనః= పూజ్యమయినస్వభావముగల, భరతస్య=భరతునియొక్క; ఏతత్= ఈ;శుభం= మంగళకరమయిన; వాక్యం = మాటను; శ్రుత్వా=విని;తం= ఆభరతునిగూర్చి; శుభకరం= మంగళకరమయిన; వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

భరద్వాజమహాముని,మహాత్ముండగు భరతుండు చెప్పిన మంగళకరంబగు నామాటనువిని , యాభరతుఁజూచి మిక్కిలియు మంగళకరంబగునీమాటం జెప్పెను, అని; తాత్పర్యము.

నైత చ్చిత్రం నరవ్యాఘ్ర శీలవృత్తవతాం వర
య దార్యం త్వయి తిష్ఠేత్తు నిమ్నే సృష్ట మివోదకమ్.౧౬

టీక॥ నరవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుండవును; శీలవృత్తవతాం= సత్స్వభావమునుసదాచారమును గలవారలలో;వర=శ్రేష్ఠుండవునగుభరతుఁడా!త్వయి=నీయందుమాత్రము; ఆర్యం=పూజ్యమయినశ్రేయస్సు; నిమ్నే= పల్లపునేలయందు;సృష్టం=ధరింపఁబడిన; ఉదకమివ=జలమువలె; తిష్ఠేత్(ఇతి) యత్ =ఉండుననునదియేదిగలదో;ఏతత్= ఇది;చిత్రం=ఆశ్చర్యకరము;న=కాదు.

పురుషశ్రేష్ఠుండవుసదాచారసత్స్వభావసంపన్నులలోనుత్తముండవునగు భర

స ౧౧౩

తుఁడా! పల్లపునేలయందు నీళ్లునిలుచునట్లు, నీయందు జ్యేష్ఠానువర్తనమను ధర్మము స్థిరముయియుండుట యెంత మాత్రము ఆశ్చర్యకరముగాదు.

అని, తాత్పర్యము.

అమృత స్స మహాబాహుః పితా దశరథ స్తవ
యస్య త్వ మీదృశః పుత్రో ధర్మజ్ఞో ధర్మవత్సలః. ౧౭

టీ॥ యస్య=ఎవ్వనికి; ధర్మజ్ఞః=ధర్మంబు తెలిసినవాఁడవును; ధర్మవత్సలః=ధర్మమునందతిప్రేమగలవాఁడవునగు; ఈదృశః=ఇట్టి; త్వం=నీవు; పుత్రః= కొడుకో; సః=అట్టి; మహాబాహుః=పెద్దచేతులుగల; తవ=నీయొక్క; పితా= తండ్రియగు; దశరథః=దశరథుఁడు; అమృతః=చావనివాఁడు,

మహాబాహుండవగునీతండ్రిదశరథమహారాజునకు ధర్మజ్ఞుఁడవును పరమధార్మికుండవునగు, నీయట్టిసత్పుత్రుండున్నావు కావున, నతండింకను బ్రతికియున్నాఁడు, అని, భరద్వాజుండు భరతునితోఁ జెప్పెను, అని, తాత్పర్యము.

త మృషింతు మహాత్మాన ముక్తవాక్యం కృతాంజలిః
ఆమంత్రయితు మారేభే చరణా వుపగృహ్యచ. ౧౮

టీక॥ సః(అధ్యాహృతము)= ఆభరతుండు; కృతాంజలిః= చేయఁబడినచేమోడ్పులుగలవాఁడై; ఉక్తవాక్యం= చెప్పఁబడినమాటలుగలఁ ; మహాత్మానం=అధికమయినప్రభావముగల; తం= ఆ; ఋషింతు=భరద్వాజమహర్షిని; చరణౌ=పాదములను; ఉపగృహ్యచ= పట్టుకొనియు; ఆమంత్రయితుం= వీడుకొనుటకు; ఆరేభె=ఆరంభించెను.

అంత, నాభరతుండు, మహాత్ముండగుభరద్వాజ మహాముని చెప్పినమాటనువిని, చేమోడ్పుగీలించి, యాయన, పాదంబులుపట్టుకొని, పోయివచ్చెదననిచెప్పెను. అని, తాత్పర్యము.

తతః ప్రదక్షిణం కృత్వా భరద్వాజం పునఃపునః
భరతస్తు యయౌ శ్రీమా నయోధ్యాం సహమంత్రిభిః. ౧౯

టీక॥తతః=అటుపిమ్మట; శ్రీమాన్=అధికమయినకాంతిగల; భరతస్తు=భరతుఁడును;భరద్వాజం= భరద్వాజుని గూర్చి; పునఃపునః=మాటిమాటికి ; ప్రదక్షిణం=ప్రదక్షిణమును; కృత్వా=చేసి;మంత్రిభిస్సహ=మంత్రులతోఁగూడ; అయోధ్యాం= అయోధ్యాపట్టణమునుగూర్చి; యయౌ=పోయెను.

అంత, శ్రీమంతుండగుభరతుండు,భరద్వాజమహర్షికిఁ బలుమాఱుప్రదక్షిణంబులుగావించి, మంత్రులంగూడియయోధ్యాపట్టణంబునకుబోయెను.

అని, తాత్పర్యము.

యానైశ్చ శకటైశ్చైవ హయై ర్నాగైశ్చ సా చమూః
పున ర్నివృత్తా విస్తీర్ణా భరతస్యాను యాయినీ, ౨౦

టీక॥భరతస్య=భరతునియొక్క ; విస్తీర్ణా=విశాలమైన; సా=ఆ; చమూః=సేన;పునః=మఱల; నివృత్తా=మఱలినదై; యానైశ్చ= వాహనములతోను; శకటైశ్చైవ= బండ్లతోను ; హయైః=గుఱ్ఱములతోను; నాగైశ్చ=ఏనుంగులతోను; అనుయాయినీ=వెంబడించునది ; అభూత్ (అధ్యాహృతము)=అయినది.

విస్తీర్ణంబగునాభరతునిసేన శిబికాదులతోనుశకటంబులతోను, గుఱ్ఱంబులతోను ఏనుంగులతోను ,ఆభరతుని వెంబడించిపోయినది-

అని, తాత్పర్యము.

తత స్తే యమునాం దివ్యాం నదీం తీర్త్వోర్మిమాలినీమ్
దదృశు స్తాం పున స్సర్వే గంగాం శుభజలాం నదీమ్, ౨౧

టీక॥తతః=అంత; తే= వారలు; సర్వే=అందఱును;ఊర్మిమాలినీం=అలలపఙ్క్తులుగల; దివ్యాం=శ్రేష్ఠమయిన; యమునాం=యమునయను; నదీం=నదిని; తీర్త్వా=దాటియు ; శుభజలాం=మంచిజలముగల; తాం=ఆ;గంగాం=గంగయను ; నదీంపునః=నదిని, దదృశుః=చూచిరి.

అంతవారలందఱు, నుత్తమనదియు నధికముగానలలు గలదియునగు

యమునానదిందాఁటి మంచినీళ్లుగలగంగానదింజూచిరి. అని, తాత్పర్యము.

తాం రమ్యజలసంపూర్ణాం సంతీర్య సహబాంధవః
శృంగిబేరపురం రమ్యం ప్రవివేశ ససైనికః. ౨౨

టీక॥సహబాంధవః = బంధువులతోఁగూడినవాఁడును; ససైనికః= సైనికులతోఁగూడినవాఁడునగు; సః (అధ్యాహృతము)=ఆభరతుఁడు;రమ్యజలసంపూర్ణాం=రమణీయమయినజలముచేనిండిన;తాం=ఆగంగానదిని; సంతీర్య=దాఁటి;రమ్యం = సుందరమయిన;శృంగిబేరపురం= శృంగిబేరపురమును;ప్రవివేశ=ప్రవేశించెను.

ఆభరతుఁడు, బంధువులను సైనికులనుంగూడి, రమణీయజలముగల యాగంగానదిందాఁటి ? రమణీయంబగు శృంగిబేరపురంబునకుఁబోయెను, అని, తాత్పర్యము.

శృంగిబేరపురాద్భూయ స్త్వయోధ్యాం సందదర్శ హ

టీక॥సః(అధ్యాహృతము)= ఆభరతుఁడు- శృంగిబేరపురాత్= శృంగిబేరపురముకన్న; భూయస్తు= పిమ్మటను ; అయోధ్యాం=అయోధ్యాపురిని; సందదర్శ=చూచెను. "హ"అనునది పాదపూరణార్థము.

భరతుండు,శృంగిబేరముననుండి వెడలిపోయి,యయోధ్యాపురినిజూచెను. అని, తాత్పర్యము.

అయోధ్యాంచ తతో దృష్ట్వా పిత్రా భ్రాత్రా వివర్జితామ్. ౨౩
భరతో దుఃఖసంతప్త స్సారథిం చేద మబ్రవీత్

టీక॥భరతః=భరతుఁడు; పిత్రా= తండ్రిచేతను; భ్రాత్రా= అన్నచేతను;వివర్జితాం=విడువఁబడిన;అయోధ్యాంచ=అయోధ్యాపట్టణమును; దృష్ట్వా=చూచి;తతః=అంత, దుఃఖసంతప్తః=దుఃఖముచేమిక్కిలియుడపింపఁజేయఁబడినవాఁడై; సారథిం= సారథిని గూర్చి; ఇదంచ=ఈమాటను; అబ్ర

వీత్ = చెప్పెను-

భరతుండు, తండ్రియన్నల యిద్దఱి చేతనువిడువఁబడిన యయోధ్యా పట్టణంబుఁజూచినంతనె, పరమదుఃఖంబు నొంది, సారథిఁజూచి, యీమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

సారథే పశ్య విధ్వస్తా సాఽయోధ్యా న ప్రకాశతే. ౨౮
నిరాకారా నిరానందా దీనా ప్రతిహతస్వరా

టీక॥ సారథే = సారథీ; పశ్య = చూడుము, సా = ఆ; అయోధ్యా = అయోధ్యాపురి; విధ్వస్తా = చెడినదై; నిరాకారా = మంచియాకారములేనిదై; నిరానందా = సంతోషములేనిదై; దీనా = దైన్యమునొందినదై; ప్రతిహతస్వరా = కొట్టబడినధ్వనిగలదై; నప్రకాశతే = ప్రకాశింపకున్నది,

సారథీఆయోధ్యాపురి, మిక్కిలియురామ దుఃఖపీడితయయి, వికారమునొందినీరానందయయి దీనయయి హీనస్వరంబుగలదై కాంతిహీనయయి యున్నది, చూడుము, అనిసారథితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, త్రయోదశోత్తరశతతమస్సర్గః
ఇదిస్పష్టార్థము;
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండత్రయోదశోత్తరశతతమసర్గటీక,
ముగిసినది.



శ్రీ

## చతుర్దశోత్తరశతతమసర్గప్రారంభః.

స్నిగ్ధగంభీరఘోషేణ స్యందనేనోపయాన్ప్రభుః
అయోధ్యాం భరతః క్షిప్రం ప్రవివేశ మహాయశాః. ౧

టీక॥ మహాయశాః= అధికమయిన కీర్తిగలవాఁడును; ప్రభుః= నాయకుండునగు ; భరతః = భరతుఁడు ; స్నిగ్ధ గంభీరఘోషేణ = సున్నైనదియు గంభీర మయినదియు నగుధ్వనిగల ; స్యందనేన = రథముచేత; ఉపయాన్= పోవుచు;క్షిప్రం= శీఘ్రముగా; అయోధ్యాం = అయోధ్యాపట్టణమును; ప్రవివేశ= ప్రవేశించెను.

మహాయశుండును ప్రభుండునగు భరతుండు , శ్రావ్యంబును గంభీరము నగు ధ్వనిగల రథంబునంబోవుచు, శీఘ్రంబున, నయోధ్యాపురిం బ్రవేశించెను. అని, తాత్పర్యము.

బిడాలోలూకచరితా మాలీననరవారణామ్
తిమిరాభ్యాహతాం కాళీ మప్రకాశాం నిశామివ. ౨

టీక॥ బిడాలోలూకచరితాం= పిల్లులయొక్కయు గుడ్లగూబలయొక్కయుసంచారముగలదియు ; ఆలీననరవారణాం = దాఁగినమనుష్యులునుఏనుంగులునుగలదియు; అప్రకాశాం = కాంతి లేనిదియు ; తిమిరాభ్యాహతాం=చీకటిచేఁగొట్టబడినదగు ; కాళీం = కృష్ణపక్షమునందలి; నిశామివ (స్థితాం)=రాత్రివలెనున్నదియునగు; అయోధ్యాంప్రవివేశ ( అధ్యాహృతము ఇట్లుముందును)= అయోధ్యాపురినిఁబ్రవేశించెను.

అప్పుడయ్యయోధ్యాపురి, పిల్లులునుగుడ్లగూబలునుదిరుగుటగల్గిమనుష్యసంచారముగాని, గజంబులసంచారముగాని యెంతమాత్రము లేక, కాంతి హీనయయి, చీకటిక్రమ్మినకృష్ణపక్షరాత్రివలెఁ జూపట్టుచుండినది.

అని, తాత్పర్యము.

రాహుశత్రోః ప్రియాం పత్నీం శ్రియా ప్రజ్వలితప్రభామ్
గ్రహేణా భ్యుత్థితేనై కాం రోహిణీ మివ పీడితామ్. ౩

టీక॥ రాహుశత్రోః= చంద్రునియొక్క; ప్రియాం=ప్రియమైన ; పత్నీం= భార్యయును; శ్రియా= కాంతిచేత; ప్రజ్వలితప్రభాం= ప్రకాశించుచున్న కాంతిగలదియు; అభ్యుత్థితేన= ఎదురునిలిచిన; గ్రహేణ = క్రూరగ్రహముచేత; పీడితాం = పీడింపఁబడినదియునగు; ఏకాం=ఒకటైన;రోహిణీమివ(స్థితాం)= రోహిణివలెనున్న; అయోధ్యాం=అయోధ్యాపురిని=ప్రవివేశ=ప్రవేశించెను.

చంద్రునిప్రియపత్నియును గాంతిమతియునగురోహిణి; యంగారకగ్రహముచేఁబీడింపఁబడిదుఃఖించునట్లు , అయ్యయోధ్యాపురిరామ దుఃఖంబునం బీడింపఁబడియుండినది.

అని, తాత్పర్యము.

అల్పోష్ణక్షుబ్ధసలిలాం ఘర్మోత్తప్త విహంగమామ్
లీనమీనఝషగ్రాహాం కృశాం గిరినదీమివ. ౪

టీక॥అల్పోష్ణక్షుబ్ధసలిలాం= కొంచెమయినదియు వేఁడిచేఁ గలఁగి నదియునగుజలముగలదియు ; ఘర్మోత్తప్తవిహంగమాం=ఎండచేఁదపింపఁజేయఁబడినపక్షులుగలదియు; లీనమీనఝషగ్రాహాం= లయముపొందిన మత్స్యములును పెద్దమత్స్యములును మొసళ్లునుగలదియు; కృశాం= కృశించినదియునగు; గిరినదీమివ (స్థితాం)= పర్వతనదివలెనున్నట్టి;అయోధ్యాంప్రవివేశ=అయోధ్యాపురినిబ్రవేశించెను.

జలంబంతయు నెండకుఁగాఁగి వేఁడిమిఁబొందఁబక్షులుదల్లడింప,మీనంబులును మొసళ్లును మొదలగు జలజంతువులు నాశంబునొందఁ, గాంతిహీనయయి యుండునట్టియెండకాలమునందుఁ గృశించిననదియుంబోలె, నయోధ్యాపట్టణంబు, కాంతిహీనయయి యుండినది. అని, తాత్పర్యము.

విధూమా మివ హేమాభా మధ్వరాగ్నే స్సముత్థితామ్




హవిరభ్యుక్షితాం పశ్చాచ్ఛిఖాం విప్రలయం గతామ్. ౫

టీక॥ విధూమాం= పొగలేనిదియు; హేమాభాం = బంగారముయొక్క కాంతివంటికాంతిగలదియు ; పశ్చాత్ =పిమ్మట; హవిరభ్యుక్షితాం=హవిస్సుచేఁబ్రోక్షింపఁబడినదియు; విప్రలయం=నాశమును; గతాం= పొందినదియును; అధ్వరాగ్నేః= యాగాగ్నియొక్క; శిఖామివ(స్థితాం)= జ్వాలవలెనున్న; అయోధ్యాం ప్రవివేశ= అయోధ్యాపురింబ్రవేశించెను.

మొదటధూమములేక, బంగారమువలె, వెలుంగుచుండి పిదపదధ్యాదిహవిస్సుఁబ్రోక్షించుటచేలీనమయి యుండుయాగాగ్నియందలి జ్వాలకైవడి, నయోధ్యకాంతిహీనయయియుండినది. అని, తాత్పర్యము.

విధ్వస్తకవచాం రుగ్ణగజవాజిరథధ్వజామ్
హతప్రవీరా మాపన్నాం చమూ మివ మహాహవే. ౬

టీక॥ మహాహవే= మహాయుద్ధమునందు; విధ్వస్తకవచాం=ధరింపఁబడిన కవచములుగలదియు; రుగ్ణగజవాజిరథధ్వజాం=నశించినయేనుంగులును గుఱ్ఱంబులును రథంబులును టెక్కెములును గలదియు; హతప్రవీరాం=చంపఁబడిన మేటివీరులుగలదియు; ఆపన్నాం= ఆపదనొందిన ; చమూమివ(స్థితాం)= సేనవలెనున్న ; అయోధ్యాం ప్రవివేశ=అయోధ్యాపురింబ్రవేశించెను.

మహాయుద్ధంబునందు మేటివీరులుమడిసియు, గవచంబులువిఱిగియు, నేనుంగులునుగుఱ్ఱంబులునుజచ్చియు రథంబులునుధ్వజంబులును భిన్నంబులయ్యాజికుఱవడియున్న సేనపగిదినయోధ్యాపురికనుపట్టుచుండినది. అని, తాత్పర్యము.

సఫేనా సస్వనా భూత్వా సాగరస్య సముత్థితామ్
ప్రశాంత మారుతోద్ధూతాం జలోర్మిమివ నిస్స్వరామ్. ౭

టీక ॥ సఫేనా=నురుగుతోఁ గూడినదియు; సస్వనా= ధ్వనితోఁ గూడినది




యు; భూత్వా=అయి; సమృద్ధితాం=తేలినదియు; ప్రశాంత మారుతోద్ధూతాం=శాంతమయినగాలిచేగదలింపఁబడినదియు, కావుననే; నిస్స్వనాం=ధ్వనిలేనిదియునగు; సాగరస్య=సముద్రముయొక్క; జలోర్మిమివ(స్థితాం)=జలతరంగమువలెనున్న; అయోధ్యాం ప్రవివేశ=అయోధ్యాపురింబ్రవేశించెను.

నురుగుతోను మహాధ్వనితోనుఁగూడి, లేచియంత గాలియణంగుటవలన; విగతగతిధ్వనియయి రూపుమాయునట్టి సముద్రతరంగమువలె, నయోధ్యాపురిదీనయయియుండినది. అని, తాత్పర్యము.

త్యక్తాం యజ్ఞాయుధై స్సర్వై రభిరూపైశ్చ యాజకైః
సుత్యాకాలే వినిర్వృత్తే వేదిం గతరవామివ. ౮

టీక॥ సుత్యాకాలే= యాగసమాప్తిదివసము; వినివృత్తే=కడచినదగుచుండఁగా; సర్వైః=సమస్తమయిన; యజ్ఞాయుధైః= యాగముకొఱకైనసినిముట్లచేత; అభిరూపైః= ఉత్తమములగు; యాజకైశ్చ=ఋత్విజులచేతను; త్యక్తాం=విడువఁబడినదియు; గతరవాం పోయినధ్వనిగల; వేదిమివ (స్థితాం)=యాగవేదికవలెనున్న; అయోధ్యాం ప్రవివేశ= అయోధ్యాపురిం బ్రవేశించెను.

యాగసమాప్తియయిన పిమ్మట; ఋత్విజులందఱు యాగమునకుఁ గావలసినపనిముట్లనన్నింటినిం దీసికొని పోవుటం జేసి, ధ్వనిలేకయుండుయాగవేదికవలె; నయ్యయోధ్యాపురి యుండినది. అని, తాత్పర్యము.

గోష్ఠమధ్యే స్థితా మార్తా మచరంతీం తృణం నవమ్
గోవృషేణ పరిత్యక్తాం గవాంపత్ని మివోత్సుకామ్. ౯

టీక॥ గోష్ఠమధ్యే=ఆవులకొట్టమునడుమను; స్థితాం=ఉన్నదియును; ఆర్తాం=దుఃఖితయును; నవం=లేఁతదయిన; తృణం= పచ్చికను, అచరంతీం=భక్షింపకున్నదియు; గోవృషేణ= ఆఁబోతుచేత; పరిత్యక్తాం=విడువఁబడిన

గ్రియును; ఉత్సుకాం= ఆఁబోతుండూడను త్సాహముగలదియునగు;గవాం= ఆవులయొక్క;పత్తిమివ(స్థితాం)= సమూహమువలె నున్న ; అయోధ్యాం ప్రవివేశ= అయోధ్యాపట్టణమునుప్రవేశించెను.

ఆఁబోతుచే విడువఁబడి, యావులకొట్టమునందు ఆఁబోతునె దలంచుకొనుచు, లేతపచ్చికనైనందినక, దుఃఖితయయియుండుగోసమూహమువలె,నయ్యయోధ్యాపురిదీనయయియుండినది అని, తాత్పర్యము.

ప్రభాకరాద్యై స్సుస్నిగ్ధైః ప్రజ్వలద్భి రివోత్తమైః
వియుక్తాం మణిభి ర్జాత్యై ర్నవాం ముక్తావళీ మివ.౧౦

టీక॥ ప్రజ్వలద్భిరివ(స్థితైః)= మండుచున్నట్లున్న; సుస్నిగ్ధైః= మిక్కిలియుసుందరమయిన; ఉత్తమైః= శ్రేష్ఠములయిన; ప్రభాకరాద్యైః= పద్మరాగము మొదలుగాఁగల;జాత్యైః=మంచిజాతియందుఁబుట్టిన; మణిభిః= రత్నములచేత; వియుక్తాం= విడువఁబడిన; నవాం=నూతనమయిన; ముక్తావళీమివ(స్థితాం)= ముక్తాహారమువలె నున్న; అయోధ్యాం ప్రవివేశ= అయోధ్యాపత్తనమునుప్రవేశించెను,

కాంతిచేజ్వలించుచుండు సుందరమయినపద్మరాగాదిమణులుగూర్చిన,పతకములేనినూతన ముక్తాహారమువలె, నయ్యయోధ్యాపురి కాంతిహీనయయియుండినది.అని, తాత్పర్యము.

సహసా చలితాం స్థానా న్మహీం పుణ్యక్షయా ద్గతామ్
సంహృతద్యుతివిస్తారాం తారామివ దివ శ్చ్యుతామ్. ౧౧

టీక॥పుణ్యక్షయాత్ = పుణ్యనాశమువలన; స్థానాత్=స్వస్థానమునుండి;సహసా=తటాలున; చలితాం = చలించినదియు; మహీం=భూమిని ; గతాం=పొందినదియు; సంహృతద్యుతివిస్తారాం=పోఁగొట్టఁబడినకాంతి గలదియు; దివః=ఆకాశమునుండి;చ్యుతాం=జాఱినదియునగు; తారామివ

(స్థితాం)=నక్షత్రము వలెనున్న; అయోధ్యాం ప్రవివేశ= అయోధ్యాపట్టణమును బ్రవేశించెను.

పుణ్యంబంతయు నశించినపిదపc, దటాలున నాకాశంబుననుండి నేలcబడి కాంతిహీనమయి యుండు నక్షత్రము పగిదినయోధ్యాపట్టణము; పాడుపడి యుండినది. అని, తాత్పర్యము.

పుష్పనద్ధాం వసంతాంతే మత్తభ్రమరనాదితామ్
ద్రుతదావాగ్నివిప్లుష్టాం క్లాంతాం వనలతామివ. ౧౨

టీక॥వసంతాంతే= వసంతఋతువుతుదయందు; పుష్పనద్ధాం=పూలచేcగట్టcబడినదియు; మత్తభ్రమర నాదితాం= మదించినతుమ్మెదలచే ధ్వనింపcజేయబడినదియు; ద్రుతదావాగ్నివిప్లుష్టాం=వేగవంతమగు దావానలముచేc గొంచెము దహింపబడినదియు; క్లాంతాం=వాcడినదియునగు; వనలతామివ (స్థితాం)= అడవితీcగవలెనున్న; అయోధ్యాం ప్రవివేశ=అయోధ్యాపురింబ్రవేశించెను.

వసంతాంతంబునc బుష్పంబులచే నలంకారమయి మధురంబుగా ధ్వనించుచుండు భ్రమరంబులతోc నొప్పచుండి, దావాగ్నిచేc గొంచెము దహింపcబడివాడుటంజేసి; కాంతిహీనమయి యుండు వనలతయుంబోలెనయోధ్యాపురికాంతిహీనయయియుండినది.

అని, తాత్పర్యము.

సంమూఢనిగమాం స్తబ్ధాం సంక్షిప్తవిపణాపణామ్
ప్రచ్ఛన్నశశినక్షత్రాం ద్యామివాంబుధరైర్వృతామ్. ౧౩

టీక॥ సంమూఢనిగమాం= మోహమునొందినమార్గములుగలదియు; స్తబ్ధాం=చలనములేనిదియు; సంక్షిప్తవిపణాపణాం= సంకోచమునొందినవిక్రయమునుఅంగడివీధియునుగలదియు కావున నే; ప్రచ్ఛన్నశశినక్షత్రాం=మూయబడినచంద్రనక్షత్రములుగల; అంబుధరైః=మేఘములచేత; వృతాం = కట్టcబడిన; ద్యామివ(స్థితాం)= ఆకాశమువలెనున్నదియునగు; అయోధ్యాం

ప్రవివేశ = అయోధ్యాపురింబ్రవేశిం చెను.

అయోధ్యాపురి మార్గమునందు జనసంచారములేక యంగళ్లుమూయఁ బడియుండుటంజేసి, మేఘముచేఁగప్ప బడినచంద్రనక్షత్రములుగల యాకాశం బుపగిదిం జూపట్టినది.

అని, తాత్పర్యము.

క్షీణపానోత్తమై ర్భిన్నైః శ్శరావై రభిసంవృతామ్
హతశౌండా మివాకాశే పానభూమి మసంస్కృతామ్. ౧౪

టీక॥ఆకాశే=బయలునందు; క్షీణ పానోత్తమైః=నశించినమద్యశ్రేష్ఠము లుగలవియు; భిన్నైః=పగిలినవియు నగు; శరావైః=పాత్రములచేత; అభిసంవృతాం=కప్పఁబడినదియు; హత శౌండాం=చంపఁబడినమదించినజనులు గలదియు; అసంస్కృతాం= సంస్క రింపఁబడనిదియునగు; పానభూమిమి వ(స్థితాం)= పానభూమివలెనున్న; అయోధ్యాం ప్రవివేశ= అయోధ్యాపు రింబ్రవేశించెను.

అనావృతప్రదేశంబున, మధురమం తయుక్షీణించిపాత్రంబులుపగిలి , మత్తజనులుచంపబడియుండయనలంకృత మయినపానభూమివలెనయ్యయోధ్య, కాంతిహీనయయియుండినది.

అని, తాత్పర్యము.

వృక్ణభూమితలాం నిమ్నాం వృక్ణపాత్రైస్సమావృతామ్
ఉపయుక్తోదకాం భగ్నాం ప్రపాంనిపతితా మివ. ౧౫

టీక॥ వృక్ణభూమితలాం=పగిలిన నేలగలదియు; వృక్ణపాత్రైః=పగిలి నపాత్రములచేత; సమావృతాం= క ప్పఁబడినదియు; నిమ్నాం=పల్లమయి నదియు; ఉపయుక్తోదకాం=ఉపయో గింపఁబడినజలముఁగలదియు;భగ్నాం= విఱిగినదియు; నిపతితాం=పడినదియు నగు; ప్రపామివ(స్థితాం)= చలిపంది లివలెనున్న; అయోధ్యాం ప్రవివేశ = అయోధ్యాపురింబ్రవేశించెను.

పగిలిననేలయుఁబగిలినపాత్రములు నుగలిగి , జలమంతయుక్షీణించి, విఱి గినేలంబడినచలిపందిలివలె, నయ్యయో ధ్య,కాంతిహీనయయియుండినది.

అని, తాత్పర్యము.

విపులాం వితతాంచైవ యుక్తపాశాం తరస్వినామ్
భూమౌ బాణై ర్వినిర్భిన్నాం పతితాం జ్యామివాయుధాత్. ౧౬

టీక॥విపులాం=విశాలమును ; వితతాంచైవ=వ్యాపించినదియు; యుక్తపాశాం=మంచిత్రాడుగలదియు; తరస్వినాం=బలవంతులయొక్క ; బాణైః=బాణములచేత; వినిర్భిన్నాం=ఛేదింపఁబడినదియు ; ఆయుధాత్=వింటినుండి; భూమౌ= నేలయందు; పతితాం=పడినదియునగు ; జ్యామివ (స్థితాం)=అల్లెత్రాటివలెనున్న;అయోధ్యాంప్రవివేశ = అయోధ్యాపట్టణముఁబ్రవేశించెను.

వింటనారోపింపఁబడి, యుద్ధకాంలంబునంబ్రశేరులబాణంబులచేఖండింపఁబడివింటనుండి నేలంబడినదృఢంబగు నల్లెత్రాటికైవడి,నయ్యయోధ్య ప్రకాశహీనయయియుండెను.

అని, తాత్పర్యము.

సహసా యుద్ధశౌండేన హయారోహేణ వాహితామ్
నిక్షిప్తభాండా ముత్సృష్టాం కిశోరీ మివ దుర్బలామ్. ౧౭

టీక॥సహసా=తటాలున ; యుద్ధశౌండేన = యుద్ధసమర్థుండగు; హయారోహేణ = గుఱ్ఱమునెక్కువానిచేత ; వాహితాం = ఎక్కఁబడినదియు; నిక్షిప్తభాండాం=విడువఁబడినయలంకారములు గలదియు ; ఉత్సృష్టాం = విడువఁబడినదియు ; దుర్బలాం = దుర్బలయగు ; కిశోరీమివ (స్థితాం)= ఆడుగుఱ్ఱపుపిల్లవలెనున్న; అయోధ్యాంప్రవివేశ= అయోధ్యాపురింబ్రవేశించెను.

యుద్ధసమర్థుండును హయారోహణకుశలుండునగువానిచేనారోహింపఁబడియలసియుతండు విడుచుటంజేసి భూషణంబులుదీయఁబడినపిదప డస్సి కాంతిహీనయయియుండు దుర్బలం బగునలేత యాడుగుఱ్ఱమువలె, నాయయోధ్యదీనయయియుండినది.

అని, తాత్పర్యము.

శుష్కతోయాం మహామత్స్యైః కూర్మైశ్చ బహుభి ర్వృతామ్

ప్రభిన్నతటవిస్తీర్ణాం వాపీ మివ హృతోత్పలామ్. ౧౮

టీక॥ శుష్కతోయాం=ఎండినజలముగలదియు; మహామత్స్యైః= పెద్దమత్స్యములచేతను ; కూర్మైశ్చ =తాఁబేళ్లచేతను; వృతాం=కప్పఁబడినదియు; ప్రభిన్నతటవిస్తీర్ణాం=పగిలినగట్లుగలదిగనుకనేవిశాలమయినదియు; హృతోత్పలాం=అపహరింపఁబడినకలువలుగలదియునగు;వాపీమివ(స్థితాం)=నడబావివలెనున్న; అయోధ్యాం ప్రవివేశ= అయోధ్యాపురింబ్రవేశించెను.

ఎండిపోయినజలముగలదియుఁ, బెక్కుమత్స్యకూర్మంబులతోఁగూడినదియుఁ, నెండిన కలువలు గలదియు , గట్లుపగులుటచే విశాలమయినదియునగునడబావివలెనయోధ్యాపురి , కాంతిహీనయయియుండినది.

అని, తాత్పర్యము.

పురుషస్యాపహృష్టస్య ప్రతిషిద్ధానులేపనామ్
సంతప్తామివ శోకేన గాత్రయష్టి మభూషణామ్. ౧౯

టీక ॥ అపహృష్టస్య=దుఃఖితుండగు; పురుషస్య=పురుషునియొక్క; ప్రతిషిద్ధానులేపనాం=విడువఁబడిన మైపూఁతగలదియు; శోకేన = దుఃఖముచేత; సంతప్తాం=మిక్కిలియుదపింపఁజేయఁబడినదియు; అభూషణాం=సొమ్ములులేనిదియునగు ; గాత్రయష్టిమివ (స్థితాం)=కట్టెవంటిదేహమువలెనున్న; అయోధ్యాంప్రవివేశ=అయోధ్యాపురింబ్రవేశించెను,

మైపూఁతలేనిదియు, దుఃఖముచేదపింపఁజేయఁబడినదియు భూషణవర్జితంబునగుదుఃఖితుండయినపురుషుని దేహమువలె, నాయయోధ్యా పట్టణము నిస్తేజస్కమైయుండినది.

అని, తాత్పర్యము.

ప్రావృషి ప్రవిగాఢాయాం ప్రవిష్టస్యాభ్రమండలమ్
ప్రచ్ఛిన్నాం నీలజీమూతై ర్భాస్కరస్య ప్రభామివ. ౨౦

టీక॥ ప్రావృషి= వర్షాకాలము; ప్రవిగాఢాయాం=వృద్ధినొందఁగా; అభ్రిమండలం = మేఘసమూహమును; ప్రవిష్టస్య= ప్రవేశించినట్టి; భాస్కరస్య=సూర్యునియొక్క;నీలజీమూతైః= నల్లనిమేఘములచేత; ప్రచ్ఛన్నాం= కప్పఁబడిన; ప్రభామివ(స్థితాం)=కాంతివలెనున్న,అయోధ్యాంప్రవివేశ = అయోధ్యాపురింబ్రవేశించెను.

మంచివర్షాకాలంబున, సూర్యుండు మేఘంబులంజిక్కియుండునప్పుడు, నల్లనిమేఘంబులచేఁ గప్పఁబడినయతనికాంతియుంబోలె, నయోధ్య, పాలుపటియుండెను ; అట్టియయోధ్యనుభరతుండుప్రవేశించెను.

అని, తాత్పర్యము.

భరతస్తు రథస్థస్సన్ శ్రీమాన్ దశరథాత్మజః
వాహయంతం రథశ్రేష్ఠం సారథిం వాక్య మబ్రవీత్. ౨౧

టీక॥ శ్రీమాన్=అధికమయినకాంతిగలవాఁడును; దశరథాత్మజః=దశరథునికొడుకునగు;భరతస్తు=భరతుండును, రథస్థస్సన్=రథమునసున్నవాఁడై; రథశ్రేష్ఠం=రథోత్తమమును ; వాహయంతం=తోలుచున్న; సారథిం=సారథినిగూర్చి; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

శ్రీమంతుండును దశరథమహారాజకుమారుండునగుభరతుండు, రథంబుననేయుండి, రథంబుఁదోలుచున్నసారథింజూచి, యిట్లని, జెప్పెను.

అని, తాత్పర్యము.

కిన్ను ఖల్వద్య గంభీరో మూర్ఛితో న నిశమ్యతే
యథాపుర మయోధ్యాయాం గీతవాదిత్రనిస్స్వనః. ౨౨

టీక॥యథాపురం= మునుపటియట్లు; అద్య = ఇప్పుడు ; అయోధ్యాయాం=అయోధ్యాపట్టణమునందు;గంభీరః=అధికమయినదియు;మూర్ఛితః=వ్యాపించినదియునగు ; గీతవాదిత్రనిస్స్వనః=గానములయొక్కయు వాద్యములయొక్కయుధ్వని ; కిన్ను = ఏల; ("ఖలు" అనునది పాదపూరణార్థము)

ననిశమ్యతే=వినఁబడలేదు.

మునుపటియట్లిప్పుడయోధ్యాపట్టణంబున, గీతవాద్యంబులధ్వనిగంభీరముగావినఁబడదేలః అని, తాత్పర్యము.

వారుణీమదగంధశ్చ మాల్యగంధశ్చ మూర్ఛితః
ధూపితాగరుగంధశ్చ న ప్రవాతి సమంతతః. ౨౩

టీక॥ వారుణీమదగంధశ్చ= మద్యము యొక్క మదముగలిగించువాసనయును; మాల్యగంధశ్చ=పుష్పమాలికలవాసనయును;ధూపితాగరుగంధః= ధూపము వేయఁబడిన యగరుయొక్క వాసనయును;మూర్ఛితః= వ్యాపించినదై; సమంతతః=అంతటను;నప్రవాతి=వీవకున్నది.

మద్యగంధమును పుష్పమాలికలవాసనయును, అగరుధూప గంధమును, మునుపటియట్లుపట్టణమంతయు వ్యాపించి,గుబాళింపకున్నది.

అని. తాత్పర్యము.

యానప్రవరఘోషశ్చ స్నిగ్ధశ్చ హయనిస్స్వనః
ప్రమత్తగజనాదశ్చ మహాంశ్చ రథనిస్స్వనః. ౨౪
నేదానీం శ్రూయతే పుర్యా మస్యాం రామే వివాసితే

టీక॥ రామే=రాముఁడు; వివాసితే=అరణ్యమునకుఁబంపఁబడినవాఁడగుచుండగా;ఇదానీం=ఇప్పుఁడు;అస్యాం= ఈ; పుర్యాం=పట్టణమునందు; యానప్రవరఘోషశ్చ= వాహన శ్రేష్ఠముల యొక్క ధ్వనియును; స్నిగ్ధః= శ్రావ్యమయిన;హయనిస్స్వనశ్చ= గుఱ్ఱముల ధ్వనియును; ప్రమత్తగజనాదశ్చ= మదించిన యేనుంగుల ధ్వనియును ; మహాన్=గొప్పదగు; రథస్స్వనశ్చ= రథములధ్వనియును; నశ్రూయతే=వినఁబడకున్నది,

రాముండువనంబునకుఁబోవుటంజేసి , యిప్పుడయోధ్యాపురియందు , శిబికాద్యుత్తమ వాహనముల ధ్వనియును; నశ్వంబులధ్వనియును మదఁపుటేనుంగులగర్జితంబును,రథంబుల శబ్దంబులునువినరాకున్నవి.

అని, తాత్పర్యము.

చందనాగరు గంధాంశ్చ మహార్హాశ్చ నవస్రజః. ౨౫
గతే హి రామే తరుణా స్సంతప్తా నోపభుంజతే

టీక॥ రామే=రాముండు; గతే=పోయినవాండగుచుండగా ; తరుణాః = యౌవనవంతులు; సంతప్తాః= తపింపంజేయంబడినవారలై ; చందనాగరుగంధాంశ్చ= చందనాగరుగంధంబులను; మహార్హాః= శ్రేష్ఠములయిన; నవస్రజః=నూతనమైనపుష్పమాలికలను; నోపభుంజతే= ఉపభోగింపకున్నారు.

రాముండడవికిం బోవుటవలనం, బ్రాయపువాండ్రందఱు, దుఃఖితులయి చందనాగరుగంధంబులను, ఉత్తమంబులగు నూతనపుష్పమాలికలను, ధరింపకున్నారు. అని, తాత్పర్యము.

బహి ర్యాత్రాం నగచ్ఛంతి చిత్రమాల్యధరా నరాః. ౨౬
నోత్సవా స్సంప్రవర్తంతే రామశోకార్దితే పురే

టీక॥ రామశోకార్దితే=రామదుఃఖముచేంబీడింపంబడిన ; పురే=అయోధ్యాపట్టణంబునందు; నరాః = మనుష్యులు; చిత్రమాల్యధరాః= నానావిధములయిన పుష్పమాలికలను ధరించినవారలయి; బహిః= వెలుపల; యాత్రాం = పయినమును; నగచ్ఛంతి= పొందకున్నారు. ఉత్సవాః= ఉత్సవములు; నసంప్రవర్తంతే=జరగకున్నవి.

అయోధ్యాపట్టణమునందు జనులందఱు రామదుఃఖపీడితులయి యుండుటంజేసి పురుషులు, మంచి పుష్పమాలికలు దాల్చి విహారార్థముబహిస్థ్సలంబుల సంచరింపకున్నారు ; ఉత్సవంబులును జరగకున్నవి.

అని, తాత్పర్యము.

సహి నూనం మమ భ్రాత్రా పురస్యాస్య ద్యుతి ర్గతా. ౨౭
నహి రాజ త్యయోధ్యేయం సాసారే వార్జునీ క్షపా

టీక॥మమ=నాయొక్క; భ్రాత్రా సహ=అన్నతోంగూడ; అస్య=ఈయయోధ్యాపట్టణముయొక్క ; ద్యుతిః= కాంతి; గతా=పోయినది. ఇయం=ఈ;

అయోధ్యా =అయోధ్యాపురి; సాసా రా = మహావర్షముతోఁగూడిన ; అ ర్జునీ=శుక్లపక్షమునందలి; క్షపేవ= రాత్రివలె; నరాజతిహి= ప్రకాశింప కున్నదిగదా!

నాయన్నరామునితోఁగూడనేయా యయోధ్యాపురి కాంతిపోయినట్లున్న ది; ఇదివాస్తవము ; మహా వర్షము తోఁగూడినశుక్లపక్షరాత్రివలె నాయ యోధ్యయెంతమాత్రముప్రకాశము లే కున్నది. అని, తాత్పర్యము.

కదాను ఖలు మే భ్రాతా మహోత్సవ ఇవాగతః. ౨౮
జనయిష్య త్యయోధ్యాయాం హర్షం గ్రీష్మ ఇవాంబుదః

టీక॥కదానుఖలు=ఎప్పుడు; మే = నాయొక్క; భ్రాతా=అన్న; మహో త్సవఇవ= మహోత్సవమువలె; ఆగ తః = వచ్చినవాఁడై ; అయోధ్యా యాం = అయోధ్యాపట్టణంబునందు; హర్షం=సంతోషమును;గ్రీష్మే=గ్రీష్మ ఋతువునందు; అంబుదఇవ= మేఘము వలె; జనయిష్యతి= కలిగించును?

నాయన్నరాముండు, మహోత్స వంబువోలెవచ్చి , గ్రీష్మఋతువునందు మేఘంబుపగిది, నీయయోధ్యయందలిజ నులకెప్పుడు సంతోషంబుగలిగింపఁ గ లఁడు? అని, తాత్పర్యము.

తరుణై శ్చారువేషైశ్చ నరై రున్నతగామిభిః. ౨౯
సంపతద్భి రయోధ్యాయాం నాభిభాంతి మహాపథాః

టీక॥సంపతద్భిః = సంచరించుచు న్న; తరుణైః=యౌవనవంతులగు;చా రువేషైశ్చ= సుందరమయినయలంకా రముగలవారలును; ఉన్నతగామిభిః= గర్వంబుతోఁగూడు నట్లుగా నడచునట్టి వారలునగు; నరైః= మనుష్యులచేత; అయోధ్యాయాం= అయోధ్యయంద లి;మహాపథాః= రాజమార్గములు; నాభిభాంతి=ప్రకాశింపకున్నవి.

సుందరంబగునలంకారంబు దాల్చి సగర్వంబుగానడచు నట్టి ప్రాయపు వాండ్రుసంచరింప కుండుటచే నయో

ధ్యా రాజమార్గంబులు, ప్రకాశిం పకున్నవి. అని, భరతుండు, సారథి తోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవం బహువిధం జల్పన్ వివేశ వసతిం పితుః. ౩౦
తేన హీనాం నరేంద్రేణ సింహహీనాం గుహామివ

టీక॥ సః(అధ్యాహృతము)=ఆభరతుఁడు; ఏవం=ఇట్లు; బహువిధం=పలువిధములుగా; జల్పన్=చెప్పుచు; తేన=ఆ; నరేంద్రేణ=దశరథమహారాజుచేత; హీనాం=విడువఁబడినదియు; సింహహీనాం=సింహముచేఁ విడువఁబడిన; గుహామివ(స్థితాం)=గుహవలెనున్నదియనగు; పితుః=తండ్రియొక్క; వసతిం = గృహమును; వివేశ=ప్రవేశించెను.

ఇట్లాభరతుండు, నానావిధంబుల సారథికిం జెప్పుచు, దశరథ మహారాజ విహీనంబగుటవలనసింహహీనంబగుగుహపగిదింజూపట్టుచున్న, దశరథమహారాజగృహముం బ్రవేశించెను,

అని, తాత్పర్యము.

తదా తదంతఃపుర ముజ్ఝితప్రభం
సురైరివోత్సృష్ట మభాస్కరం దినమ్. ౩౧
నిరీక్ష్య సర్వంతు వివిక్త మాత్మవాన్
ముమోచ బాష్పం భరత స్సుదుఃఖితః

టీక॥ తదా=అప్పుడు; ఆత్మవాన్=ధైర్యవంతుండగు; భరతః=భరతుఁడు; సురైః=దేవతలచేత; ఉత్సృష్టం=విడువఁబడిన; అభాస్కరం=సూర్యుఁడులేని; దినమివ=పగలువలె; ఉజ్ఝితప్రభం=విడువఁబడినకాంతిగలదియు; వివిక్తం=జనరహితంబునగు; తత్=ఆ; అంతఃపురం=అంతఃపురమును; సర్వం=అంతను; నిరీక్ష్యతు=చూచినంతనె; సుదుఃఖితః=మిక్కిలియు దుఃఖమునొందినవాఁడై; బాష్పం=కన్నీటిని; ముమోచ=విడిచెను.

అప్పుడు, మహాత్ముండగు నాభరతుండు, దేవాసురయుద్ధంబున దేవత

లుపరాజితలయి రాహువుచే సూర్యుం డుగొట్టఁబడినపిదపదివారాత్ర విభాగ శూన్యంబుగానుండిన దినంబు పగిదిఁ గాంతిహీనంబయి జనరహితం బయి యున్నయాయంతఃపురం బంతయుం జూచి, పరమదుఃఖితుండై, కన్నీరువిడిచెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, అయోధ్యాకాండే, చతుర్దశోత్తరశతతమస్సర్గః.

ఇది, స్పష్టము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండచతుర్దశోత్తరశతతమసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

పంచదశోత్తరశతతమసర్గప్రారంభః.

తతో నిక్షిప్య మాతౄ స్స అయోధ్యాయాం దృఢవ్రతః
భరత శ్శోకసంతప్తో గురూ నిద మథాబ్రవీత్. ౧

టీక॥ తతః=అటుపిమ్మట ; దృఢవ్రతః=దృఢమయినవ్రతముగల; సః=ఆ; భరతః=భరతుఁడు ; అయోధ్యాయాం=అయోధ్యాపురియందు ; మాతౄః=తల్లులను; నిక్షిప్య=ఉంచి; అథ=పిమ్మట; శోకసంతప్తః=దుఃఖము చేమిక్కిలియుఁదపింపఁజేయఁబడినవాఁడై; గురూన్=గురువులనుగూర్చి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, దృఢవ్రతుండగునాభరతుండు, అయోధ్యయందుఁదల్లులనువిడిచి, పరమదుఃఖితుండైవసిష్ఠాదులంజూచి, యీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

నందిగ్రామం గమిష్యామి సర్వా నామంత్ర యేద్యవః
తత్రి దుఃఖ మిదం సర్వం సహిష్యే రాఘవం వినా. ౨

టీక॥నందిగ్రామం=నందిగ్రామము నుగూర్చి; గమిష్యామి= పోయెదను ; అద్య=ఇప్పుడు,వః=మిమ్ము;సర్వాన్= అందఱను ; ఆమంత్రియే = వీడుకొనెదను. తత్రి= ఆనందిగ్రామమందు, రాఘవంవినా= రామునివిడిచి ; ప్రాప్తం (అధ్యాహృతము)=పొందఁబడిన; ఇదం=ఈ; దుఃఖం= దుఃఖమును;సర్వం=సమస్తమును;సహిష్యే = ఓర్చియుండెదను.

నేనిప్పుడునందిగ్రామంబునకుఁ బోయెదను; ఇప్పుడెమిమ్ముల నందఱనువీడుకొనుచున్నాను; అచ్చట, రామ వియోగంబునంగలిగిన యీదుఃఖమునంతయు సహించియుందును ; అయోధ్యయం దెంతమాత్రముసహింపఁజాలను. అని,తాత్పర్యము.

గతశ్చ వాదివం రాజా వనస్థశ్చ గురు ర్మమ
రామం ప్రతీక్షే రాజ్యాయ సహి రాజా మహాయశాః. ౩

టీక॥రాజాచ= దశరథమహారాజును; దివం=స్వర్గమును; గతోహి = పొందినాఁడుగదా! మమ = నాయొక్క; గురుశ్చ= అన్నయయినరాముండును; వనస్థః=అడవియున్నాఁడు. రాజ్యాయ=దొరతనముకొఱకు;రామం= రామునిః ప్రతీక్షే= నిరీక్షించుచున్నాను. మహాయశాః= అధికమయినకీర్తిగల; సః=ఆరాముఁడు; రాజాహి = రాజుగదా!

నాతండ్రిదశరథ మహారాజు మృతిబొందినాఁడుగదా ! నాయన్న రాముండును అడవికిఁ బోయినాఁడు ; ఇఁక,మహాయశుండగు నారాముండెకదా రాజుగావలసినది; కావున రాజ్యంబునకాయన వచ్చువఱకును గాచియుండెదను. అని,భరతుండు వసిష్ఠాదులతోఁ జెప్పెను.అని,తాత్పర్యము.

ఏత చ్ఛ్రుత్వా శుభం వాక్యం భరతస్య మహాత్మనః
అబ్రువ న్మంత్రిణ స్సర్వే వసిష్ఠశ్చ పురోహితః.౪




టీక॥ మంత్రిణః = మంత్రులు; సర్వే = అందఱును; పురోహితః = పురోహితుండగు; వసిష్ఠశ్చ = వసిష్ఠుండును; మహాత్మనః = పూజ్యమయినస్వభావము గల; భరతస్య = భరతునియొక్క; ఏతత్ = ఈ; శుభం = మంగళకరమగు; వాక్యం = మాటను; శ్రుత్వా = విని; అబ్రువన్ = చెప్పిరి.

మహాత్ముండగు భరతుండు చెప్పినధర్మిష్ఠంబగునీమాటనువిని, మంత్రులునుబురోహితుండగు వసిష్ఠుండును, భరతుంజూచి, ఇట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

సుభృశం శ్లాఘనీయం చయదుక్తం భరత త్వయా
వచనం భ్రాతృవాత్సల్యా దనురూపం తవైవ తత్. ౫

టీక॥ భరత = భరతుండా; త్వయా = నీచేత; భ్రాతృవాత్సల్యాత్ = తోఁబుట్టువునందుప్రేమవలన; యత్ = ఏ; వచనం = మాట; ఉక్తం = చెప్పఁబడినదై; తత్ = అది; సుభృశం = మిక్కిలియు; శ్లాఘనీయంచ = కొనియాడఁదగినదియు; తవైవ = నీకే; అనురూపం = తగినది.

భరతుఁడా! నీవిప్పుడు భ్రాతృవాత్సల్యంబునం జెప్పినమాట, మిక్కిలియు శ్లాఘనీయమయియున్నది; ఇట్టిమాట చెప్పుటకు, నీకేతగును.

అని, తాత్పర్యము.

నిత్యం తే బంధులుబ్ధస్య తిష్ఠతో భ్రాతృ సౌహృదే
ఆర్య మార్గం ప్రపన్నస్య నానుమన్యేత కః పుమాన్. ౬

టీక॥ తే = నీవు; నిత్యం = ఎల్లప్పుడును; బంధులుబ్ధస్య = బంధువులయందాసక్తిఁగొన్నవాఁడవై; భ్రాతృసౌహృదే = భ్రాతృస్నేహమునందు; తిష్ఠతః = ఉన్నవాఁడవై; ఆర్యమార్గం = పెద్దలమార్గమును; ప్రపన్నస్య = పొందినవాఁడవై యుండఁగా; కః = ఏ; పుమాన్ = పురుషుఁడు; నానుమన్యేత = సమ్మతింపఁడు.

నీవుఁ బంధువులయందుఁ బ్రేమగల




వాఁడవై అన్నదమ్ములయందు స్నేహము నుంచినన్నా ళ్లమునవలంబించియుండఁగా, నెవ్వఁడుసమ్మతింపఁడు? అనిమంత్రులుభరతునితోఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

మంత్రిణాం వచనం శ్రుత్వా యథాభిలషితం ప్రియమ్
అబ్రవీ త్సారథిం వాక్యం రథో మే యుజ్యతా మితి. ౭

టీక॥ సః (అధ్యాహృతము) = ఆభరతుఁడు; యథాభిలషితం = కోరికచొప్పుననున్నదియును; ప్రియం = సంతోషకరంబునగు; మంత్రిణాం = మంత్రులయొక్క; వచనం = మాటను; శ్రుత్వా = విని; సారథిం = సారథినిగూర్చి; మే = నాయొక్క; రథః = రథము; యుజ్యతాం = కూర్పఁబడుఁగాక." ఇతి = అని; వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంత, భరతుండు, మంత్రులుతనయిష్టప్రకారము చెప్పుటకు సంతసించి, సారథింజూచి, తనరథంబు నాయత్తంబు గావింపనియోగించెను.

అని, తాత్పర్యము.

ప్రహృష్ట వదన స్సర్వా మాతౄ స్సమభి వాద్య సః
ఆరురోహ రథం శ్రీమా౯ శత్రుఘ్నేన సమన్వితః. ౮

టీక॥ శ్రీమా౯ = అధికమయినకాంతిగల; సః = ఆభరతుండు; ప్రహృష్టవదనః = సంతసించిన ముఖముగలవాఁడై; మాతౄః = తల్లులను; సర్వాః = అందఱను; సమభివాద్య = నమస్కరించి; శత్రుఘ్నేన = శత్రుఘ్నునితో; సమన్వితః = కూడినవాఁడై; రథం = రథమును; ఆరురోహ = ఎక్కెను.

శ్రీమంతుండగుభరతుండు, సంతోషంబునొంది, తల్లులకందఱకునమస్కరించి, శత్రుఘ్నునితోఁగూడ రథంబు నారోహించెను. అని, తాత్పర్యము.

ఆరుహ్యచ రథం శీఘ్రం శత్రుఘ్న భరతా వుభౌ

స ౧౧౫

యయతుః పరమప్రీతౌ వృతౌ మంత్రిపురోహితైః. ౯

టీక॥శత్రుఘ్నభరతౌ=శత్రుఘ్న భరతులు;ఉభౌ=ఇద్దఱు;పరమప్రీతౌ= మిక్కిలియు సంతోషించినవారలయి; రథం=రథమును; ఆరుహ్యాచ= ఎక్కియు;మంత్రిపురోహితైః=మంత్రులచే తనుబురోహితుండగు వసిష్ఠునిచేతను; వృతౌ=పరివేష్టింపఁబడిన వారలయి; శీఘ్రం=శీఘ్రముగా; యయతుః=పోయిరి.

అట్లు,ఆభరతశత్రుఘ్నులిద్దఱు, పరమసంతోషంబునరథంబు నారోహించి,మంత్రులనుబురోహితుండగు వసిష్ఠుండునుబరివేష్టించినడవ,శీఘ్రంబునంబోయిరి.అని,తాత్పర్యము.

అగ్రతో గురవ స్తత్ర వసిష్ఠ ప్రముఖా ద్విజాః
ప్రయయుః ప్రాఙ్ముఖా స్సర్వే నందిగ్రామో యతోఽభవత్. ౧౦

టీక॥తత్ర=అందు;గురవః=గురువు లయిన; వసిష్ఠప్రముఖాః= వసిష్ఠుండు మొదలుగాఁగల; ద్విజాః= బ్రాహ్మణులు; అగ్రతః=ముందట; ప్రాఙ్ముఖాః= తూర్పు ముఖముగలవారలయి; యతః=ఎచ్చట; నందిగ్రామః = నందిగ్రామము; అభవత్=ఉండెనో; తత్ర (అట్టిప్రదేశము) = అచ్చటికి; ప్రయయుః=పోయిరి.

అందు,వసిష్ఠుండు మున్నుగాగురువులందఱు,అగ్రభాగంబున,ప్రాఙ్ముఖులయి, నందిగ్రామంబుండు స్థలంబునకుంబోయిరి.అని, తాత్పర్యము.

బలంచ తదనాహూతం గజాశ్వరథసంకులమ్
ప్రయయౌ భరతే యాతే సర్వేచ పురవాసినః. ౧౧

టీక॥ భరతే=భరతుండు;యాతే= పోయినవాఁడగుచుండగా; అనాహూతం=పిలవఁబడనట్టి; గజాశ్వ రథసంకులం=ఏనుంగులచేతను గుఱ్ఱంబుల చేతను రథంబులచేతను నిండినట్టి;తత్=ఆ; బలంచ=సైన్యమును; ప్రయయౌ= పోయినది. పురవాసినః= పట్టణముననుండువారలు; సర్వేచ= అందఱును; ప్ర

యయుః(అధ్యాహృతము)= పోయిరి. భరతుండుపోఁగానే, యతండు ర మ్మనిచెప్పకున్నను , గజాశ్వరథసంకు లంబుగనాసైన్యంబంతయునతని వెంబ డించినది; ఆయయోధ్య యందుండు జనులందఱును , అతనివెంటంబోయి రి. అని, తాత్పర్యము.

రథస్థ స్సహిధర్మాత్మా భరతో భ్రాతృవత్సలః
నందిగ్రామం యయౌ తూర్ణం శిరస్యాధాయ పాదుకే. ౧౨

టీక॥భ్రాతృవత్సలః= అన్నదమ్ము లయందధికప్రేమ గలవాఁడును ; ధ ర్మాత్మా = ధర్మస్వభావుండునగు; సః=ఆ;భరతః=భరతుఁడు; రథస్థః= రథముననున్నవాఁడై; పాదుకే= రా మునిపావకోళ్లను;శిరసి=తలయందు; ఆధాయ=ఉంచుకొని ; తూర్ణం= శీఘ్రముగా;నందిగ్రామం= నందిగ్రా మమును;యయౌ=పొందెను.

భ్రాతృవత్సలుండునుధర్మాత్ముం డునగుభరతుండు,రథగతుండై, రామ పాదుకలశిరంబుననుంచుకొని, శీఘ్రం బుననందిగ్రామంబునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

తతస్తు భరతః క్షిప్రం నందిగ్రామం ప్రవిశ్యసః
అవతీర్య రథా త్తూర్ణం గురూ నిద మువాచహ. ౧౩

టీక॥తతస్తు=అటుపిమ్మట;సః=ఆ; భరతః=భరతుండు; క్షిప్రం= శీఘ్ర ముగా; నందిగ్రామం=నందిగ్రామము ను; ప్రవిశ్య=ప్రవేశించి; తూర్ణం= శీఘ్రముగా;ఉవాచ=చెప్పెను ("హ" అనునది పాదపూరణార్థము.)

అంత,భరతుండు , శీఘ్రంబున నం దిగ్రామంబుఁబ్రవేశించి, రథంబుడిగ్గి , గురువునుజూచి, యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము,

ఏత ద్రాజ్యం మమ భ్రాత్రా దత్తం సన్న్యాస వత్స్వయమ్
యోగక్షేమవహేచేమే పాదుకే హేమభూషితే. ౧౪

స ౧౧౫

టీక॥ఏతత్=ఈ; రాజ్యం=రాజ్యము; మమ=నాకు; దత్తం= ఇయ్యబడినది. హేమభూషితే= బంగారముచే నలంకరింపఁబడిన; ఇమే=ఈ; పాదుకే = పావకోళ్లను; యోగక్షేమవహే=యోగక్షేమములంగల్గించునది.

నాయన్నరాముండు, రాజ్యంబున నాయొద్దరక్షణార్థమయియుండి యున్నాఁడు; బంగారముచే నలంకృతము లగు నీపాదుకలు ఈరాజ్యమునకు ; యోగక్షేమంబులుగలిగించునని, గురువులతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

భరత శ్శిరసా కృత్వా సన్న్యాసం పాదుకే తతః
అబ్రవీ ద్దుఃఖ సంతప్త స్సర్వం ప్రకృతిమండలమ్. ౧౫

టీక॥తతః=అంత; భరతః=భరతుఁడు; సన్న్యాసం=సన్న్యాసభూతమయిన; రామప్రతినిధిభూతపుయిన యనుట; పాదుకే=పావకోళ్లను; శిరసా=తలచేత; కృత్వా=ధరించి; దుఃఖసంతప్తః= దుఃఖముచేత మిక్కిలియుఁదపింపఁజేయఁబడినవాఁడై; ప్రకృతి మండలం=జనులసమూహమగు; సర్వం = అంతనుగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

అంత, భరతుండు, రామప్రతి నిధిభూతములయినపాదుకలను శిరసావహించి, పరమదుఃఖితుండై జనులనందఱంజూచి, యిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

ఛత్రం ధారయత క్షిప్ర మార్యపాదా విమౌ మతౌ
ఆభ్యాం రాజ్యే స్థితోధర్మః పాదుకాభ్యాం గురో ర్మమ. ౧౬

టీక॥క్షిప్రం=శీఘ్రముగా; ఛత్రం=గొడుగును; ధారయత = ధరింపఁజేయుఁడు. ఇమౌ=ఈపాదుకలు; ఆర్యపాదౌ= పూజ్యుండగు రామునిపాదములుగా; మతౌ=ఎన్నఁబడినవి. మమ=నాయొక్క; గురోః=అన్నయగు రామునియొక్క; ఆభ్యాం=ఈ; పాదుకాభ్యాం=పాదుకలచేత; రాజ్యే= రాజ్యమునందు; ధర్మః=ధర్మము ; స్థితః=ఉన్నది.

ఈపాదుకలకు శ్వేతచ్ఛత్రాదులం బట్టుఁడు; ఇవే, రాముని పాదములు; ఈ




పాదుకలచేతనే, రాజ్యంబున ధర్మ ముసురక్షితమయియుండును.

అని, తాత్పర్యము.

భ్రాత్రా హి మయి సన్న్యాసో నిక్షిప్తస్సౌహృదా దయమ్
త మిమం పాలయిష్యామి రాఘవాగమనం ప్రతి. ౧౭

టీక॥ భ్రాత్రా= అన్నచేత; సౌహృదాత్ = స్నేహమువలన; మయి = నాయందు; అయం= ఈ; సన్న్యాసః= నిక్షేపము; నిక్షిప్తో హి= ఉంచఁబడిన దిగదా! రాఘవాగమనం ప్రతి= రాముని రాకనుగూర్చి, తం= అట్టి; ఇమం= ఈనిక్షేపమును ; పాలయిష్యామి = పాలించెదను.

నాయన్న రాముఁడు, స్నేహంబున, నాయొద్దనీనిక్షేపంబు నుంచినాఁడు; కావున, నేను, అతండువచ్చువఱకును, దీనింబాలింపుచుండెదను.

అని, తాత్పర్యము.

క్షిప్రం సంయోజయిత్వా తు రాఘవస్య పున స్స్వయమ్
చరణౌ తౌ తు రామస్య ద్రక్ష్యామి సహపాదుకౌ. ౧౮

టీక॥ అహం= నేను; పునః= మఱల; స్వయం= నేను; క్షిప్రం = శీఘ్రముగా; రాఘవస్య= రామునికి; సంయోజయిత్వా తు= కూర్చి; రామస్య= రామునియొక్క, సహపాదుకౌ= పాదుకలతోఁగూడిన; తౌ= ఆ; చరణౌ తు = పాదములను; ద్రక్ష్యామి= చూచెదను.

రాముండువచ్చినపిదప , శీఘ్రంబున , నీపాదుకలనతనిపాదంబులకుఁదొడిగి , పాదుకాసహితంబులగునతని పాదంబులంజూచెదను.

అని, తాత్పర్యము.

తతో నిక్షిప్తభారోఽహం రాఘవేణ సమాగతః
నివేద్య గురవే రాజ్యం భజిష్యే గురువృత్తితామ్. ౧౯

టీక॥ తతః= అంత; నిక్షిప్తభారః= ఉంచఁబడినభారముగల; అహం = నేను; రాఘవేణ= రామునితో; సమాగతః= కూడినవాఁడనై ; గురవే= అన్న






కొఱకు; రాజ్యం = రాజ్యమును; నివేద్య=ఒప్పగించి; గురువృత్తితాం=గురుశుశ్రూషగలవాఁడునగుటను; భజిష్యే=పొందఁగలను.

అంత, రాముండువచ్చినపిదప,నీరాజ్యభారంబునాయనకప్పఁగించి, తండ్రికింబోలెనాయనకు శుశ్రూష సేయుచుండెదను. అని, తాత్పర్యము.

రాఘవాయచ సన్న్యాసం దత్వే మే వరపాదుకే
రాజ్యంచేద మయోధ్యాంచ ధూతపాపో భవామి చ. ౨౦

టీక॥అహం(అధ్యాహృతము)=నేను; రాఘవాయ=రామునికొఱకు; సన్న్యాసం= నీప్రతినిధిభూతమయిన; ఇమే=ఈ;వరపాదుకే= శ్రేష్ఠమయిన పాదుకలను; ఇదం=ఈ; రాజ్యంచ= రాజ్యమును; అయోధ్యాంచ=అయోధ్యాపురిని;దత్వా=ఇచ్చి; ధూతపాపశ్చ=పోఁగొట్టఁబడినపాపముగలవాఁడను;భవామి=అయ్యెదను.

అట్లు, రామప్రతినిధిభూతములయినయాపాదుకలనురాజ్యంబును అయోధ్యాపురిని రామునకొప్పగించి , నాతల్లికైకేయివలనంగలిగిన యపకీర్తిం బోఁగొట్టుకొనెదను.

అని, తాత్పర్యము.

అభిషిక్తేతు కాకుత్థ్సే ప్రహృష్టముదితే జనే
ప్రీతి ర్మమ యశశ్చైవ భవేద్రాజ్యా చ్చతుర్గుణమ్. ౨౧

టీ॥ కాకుత్థ్సే=రాముఁడు;అభిషిక్తే=అభిషేకింపఁబడినవాఁడగుచుండఁగా!జనే=జనము; ప్రహృష్టముదితే= గగుర్పాటునొందినదియుసంతసించినదియునగుచుండఁగా; మమ=నాకు; ప్రీతిః=సంతోషమును; రాజ్యాత్= రాజ్యముకన్న; చతుర్గుణం= నాలుగింతలయిన; యశశ్చైవ= కీర్తియును; భవేత్=కలుగును.

రాముండుపట్టాభిషిక్తుఁడై,జనులందఱుఁబరమసంతుష్టులయినపిదప , నాకు రాజ్యమునకు నాలిగింతయిన కీర్తియునుసంతోషంబును గలుగును. అని, భరతుండు,జనులతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.




ఏవంతు విలపన్ దీనో భరత స్స మహాయశాః
నందిగ్రామే కరోద్రాజ్యం దుఃఖితో మంత్రిభి స్సహ. ౨౨

టీక॥ మహాయశాః= అధికమయిన కీర్తిగలవాఁడగు; సః= ఆ;భరతః= భరతుఁడు; ఏవం=ఇట్లు;విలపన్తు=విలపించుచునే: దీనః= దైన్యమునొందినవాఁడై;దుఃఖితః=దుఃఖమునొందినవాఁడై; మంత్రిభిస్సహ=మంత్రులతోఁగూడ; నందిగ్రామే= నందిగ్రామమునందు; రాజ్యం=దొరతనమును; అకరోత్=చేసెను.

మహాయశుండగు, నాభరతుండు ఈప్రకారముగ విలపించుచుదీనుండైదుఃఖితుండై,మంత్రులంగూడి, నందిగ్రామమునదొరతనంబుఁ గావించెను.

అని, తాత్పర్యము.

స వల్కల జటాధారీ మునివేషధరః ప్రభుః
నందిగ్రామేఽ వస ద్వీర స్ససైన్యో భరత స్తదా. ౨౩

టీక॥ వీరః=పరాక్రమశాలియు ; ప్రభుః=నాయకుండునగు; సః=ఆ;భరతః=భరతుఁడు; తదా=అప్పుడు; వల్కలజటాధారీ=నారచీరలనుజటలను ధరించినవాఁడై;మునివేషధరః=మునివేషంబుదాల్చినవాఁడై; ససైన్యః=సైన్యములతోఁగూడినవాఁడై;నందిగ్రామే = నందిగ్రామమునందు ; అవసత్=వాసముచేసెను.

పరాక్రమవంతుండును ప్రభుండునగునాభరతుండట్లు జటావల్కలంబులు దాల్చిమునివేషధరుండై, సమస్తసేనాసమేతుండై, నందిగ్రామంబున వాసంబుసేయుచుండెను.అని, తాత్పర్యము.

రామాగమన మాకాంక్షన్ భరతో భ్రాతృవత్సలః
భ్రాతు ర్వచనకారీచ ప్రతిజ్ఞాపారగ స్తథా. ౨౪

టీక॥భ్రాతృవత్సలః= తోఁబుట్టువునందధికప్రీతిగల;భరతః= భరతుండు; రామాగమనం=రాముని రాకను ; ఆకాంక్షన్=కోరుచు;భ్రాతుః = అన్నయొక్క; వచనకారీచ= మాటను జేయువాఁడునై;తథా=అట్లు ; ప్రతిజ్ఞాపారగః= ప్రతిజ్ఞయొక్కయంతమును బొందువాఁడై;అభవత్(అధ్యాహృత




ము)=ఉండెను.

భ్రాతృవత్సలుండగుభరతుండు, తనయన్నరామునిరాకకెదురు సూచుచు, రామునియాజ్ఞ చొప్పుననడచుకొనుచుఁ, దనప్రతిజ్ఞను నిర్వాహించు కొనుచుండెను. అని, తాత్పర్యము.

పాదుకే త్వభిషిచ్యాథ నందిగ్రామే వసత్తదా
భరత శ్శాసనం సర్వం పాదుకాభ్యాం న్యవేదయత్. ౨౫

టీక॥అథ=అంత; భరతః= భరతుఁడు; తదా=అప్పుడు; పాదుకేతు=పాదుకలనే; అభిషిచ్య=అభిషేకించి; నందిగ్రామే=నందిగ్రామమునందు; అవసత్=ఉండెను. శాసనం= రాజకార్యమును; సర్వం=సమస్తమును; పాదుకాభ్యాం = పాదుకలకొఱకు; న్యవేదయత్=విన్నవించెను.

భరతుండు, రామపాదుకలకుఁ బట్టాభిషేకంబు గావించి, నందిగ్రామంబున నివాసంబు సేయుచు, రాజకార్యంబునంతయు, రామపాదుకలకువిన్నవించుచుండెను. అని, తాత్పర్యము.

తతస్తు భరత శ్శ్రీమా నభిషిచ్యార్యపాదుకే
తదధీన స్తదా రాజ్యం కారయామాస సర్వదా. ౨౬

టీక॥తతస్తు=అంతను; తదా= అప్పుడు; శ్రీమాన్= అధికమయినకాంతిగల; భరతః=భరతుఁడు; ఆర్యపాదుకే=పూజ్యుండగురామునిపాదుకలను; అభిషిచ్య=అభిషేకించి; సర్వదా=ఎల్లప్పుడును; తదధీనః= ఆపాదుకలయధీనుఁడై; రాజ్యం= దొరతనమును; కారయామాస=చేసెను.

అట్లు, శ్రీమంతుండగు భరతుండు, రామునిపాదుకలకుఁ బట్టాభిషేకము గావించి, యెల్లప్పుడునా పాదుకలకు సేవసేయుచు, రాజ్యంబుఁ జేయుచుండెను. అని, తాత్పర్యము.

తథాహి యతాఽర్య ముపైతికించి
దుపాయనం చోపహృతం మహార్హమ్




సపాదుకాభ్యాం ప్రథమం నివేద్య
చకారపశ్చాద్భరతో యథావత్. ౨౭

టీక॥ తదా=అప్పుడు; కించిత్=ఒకానొక; యత్=ఏ; కార్యం = కార్యము; ఉపైతి=వచ్చునో; మహార్హం=శ్రేష్ఠమయిన; ఉపాయనంచ=కానుకయును; ఉపహృతం=తేబడినదో; తత్=(అధ్యాహృతము) దాని; సః=ఆ; భరతః=భరతుఁడు; ప్రథమం=మొదట; నివేద్య=ఒప్పగించి; పశ్చాత్=పిమ్మట; యథావత్=యథాయుక్తముగా; చకార=చేసెను.

రాచకార్యమేమైనగలిగినప్పుడుగాని, యెవ్వరైనసామంతులుగొప్పకానుకందెచ్చినప్పుడుగాని, దాని, భరతుండు, మొదలుపాదుకలకునివేదించి, యటుపిమ్మట, గార్యంబునడుపును.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, పంచదశోత్తరశతతమస్సర్గః
ఇదిస్పష్టార్థము;

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండపంచదశోత్తరశతతమసర్గటీక, ముగిసినది.



శ్రీ.

షోడశోత్తరశతతమసర్గప్రారంభః.

ప్రతిప్రయాతే భరతే వసన్రామ స్తపోవనే
లక్షయామాస సోద్వేగ మథౌత్సుక్యం తపస్వినామ్. ౧

టీక॥ భరతే=భరతుఁడు; ప్రతిప్రయాతే=మఱలఁబోయినవాఁడగుచుండఁగా; రామః=రాముఁడు; తపోవనే=తపోవనమునందుఁ; వసన్=వాసముసేయుచు; తపస్వినాం=ఋషులయొక్క; సోద్వేగం=భయంబుతోఁగూడిన; ఔత్సుక్యం=మఱియొక యాశ్రమంబునకుఁబోఁగోరికని; లక్షయామాస=ఊహించెను.

అంతభరతుండుపోయినపిదప, రాముండాతపోవనంబుననివాసముసేయుచు,నందలిఋషులు భయంబునొంది, యాశ్రమాంతరంబునకుఁ బోఁ గోరియుండుటనువారియింగితాదులవలనం దెలిసికొనెను.

అని, తాత్పర్యము.

యే తత్ర చిత్రకూటస్య పురస్తా త్తాపసాశ్రమే
రామ మాశ్రిత్య నిరతా స్తా నలక్షయ దుత్సుకాన్. ౨

టీక॥సః(అధ్యాహృతము)=ఆరాముఁడు! యే=ఏఋషులు; పురస్తాత్=మున్ను;చిత్రకూటస్య=చిత్రకూటముయొక్క;తత్ర=ఆ; తాపసాశ్రమే=ఋష్యాశ్రమమునందు;రామం=రాముని; ఆశ్రిత్య=ఆశ్రయించి; నిరతాః=ఆసక్తులయియుండిరో;తాన్=ఆఋషులను;ఉత్సుకాన్=పోఁగోరికగలవారలనుగా; అలక్షయత్ = ఊహించెను.

మున్ను;చిత్రకూట పర్వతమునందలిఋష్యాశ్రమమునందు, రామునాశ్రయించియున్నఋషులందఱు, నయ్యాశ్రమంబువిడువఁగోరియుండుటను,రాముండు,వారియింగితాదుల వలనఁ గనుంగొనెను. అని, తాత్పర్యము.

నయనై ర్భ్రుకుటీభిశ్చ రామం నిర్దిశ్య శంకితాః
అన్యోన్య ముపజల్పంత శ్శనై శ్చక్రు ర్మిథః కథాః. ౩

టీక॥ తే(అధ్యాహృతము)= ఆఋషులు; శంకితాః=భయపడినవారలయి; నయనైః=కన్నులచేతను ; భ్రుకుటీభిశ్చ=బొమ్మముళ్ల చేతను ; రామం= రాముని; నిర్దిశ్య=చూపి, అన్యోన్యం= ఒండొరులనుగూర్చి; ఉపజల్పంతః = చెప్పుకొనుచు; మిథః=రహస్యముగా; కథాః=మాటలను; చక్రుః=చేసిరి.

ఆఋషులు, భయంబున, నయనంబులను గన్నుబొమ్మలచేతను రామునిం జూపుచు, నొండొరులతో రహస్యంబున మాటలు చెప్పుకొనిరి.

అని, తాత్పర్యము.

తేషా మౌత్సుక్య మాలక్ష్య రామ స్త్వాత్మ నిశంకితః
కృతాంజలి రువాచే ద మృషిం కులపతిం తతః. ౪

టీక॥ రామస్తు=రాముండును; తేషాం=ఆఋషులయొక్క; ఔత్సుక్యం= పోఁగోరికను; ఆలక్ష్య=ఊహించి; ఆత్మని=తనయందు; శంకితః=సందేహించినవాఁడై; తతః= అంత; కృతాంజలిః= చేయఁబడిన చేమోడ్పుగలవాఁడై ; కులపతిం = ఆశ్రమపతి యగు; ఋషిం=ఋషినిగూర్చి; ఇదం= ఈ మాటను; ఉవాచ=చెప్పెను.

రాముండును, అట్లు, ఋషులందఱు నయ్యాశ్రమంబువిడిచిపోఁగోరుటంజూచి , తనవలననేమైననపరాధముసంభవించినదోయనిశంకించి కులపతియగు ఋషింజూచి చేమోడ్పుగీలించి, యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

నకచ్చి ద్భగవన్ కించి త్పూర్వవృత్త మిదం మయి
దృశ్యతే వికృతం యేన విక్రియంతే తపస్వినః. ౫

టీక॥ భగవన్=భగవంతుఁడా! మయి=నాయందు; ఇదం= ఈ; పూర్వవృత్తం=మునుపటిచర్య; కించిత్=కొంచము; వికృతం=వికారమునొందినదిగా; నదృశ్యతేకచ్చిత్=చూడఁబడదుగదా. యేన=దేనిచేత; తపస్వినః= ఋషులు; విక్రియంతే= వికారము నొందుచున్నారో?

భగవంతుఁడా! ఈఋషులందఱుమన స్సునవికారమునొందియున్నారే; నా మునుపటివృత్తాంతములో నేదియు; త ప్పులేదుగదా? అని, తాత్పర్యము.

ప్రమాదా చ్చరితం కచ్చి త్కించిన్నా వరజస్య మే
లక్ష్మణస్య ఋషిభి ర్దృష్టం నానురూప మివాత్మనః. ౬

టీక॥ మే=నాయొక్క; అవరజస్య= తమ్ముఁడైన; లక్ష్మణస్య= లక్ష్మణుని యొక్క; ప్రమాదాత్=ఏమఱుపాటువ లన; ఆత్మనః=తనకు ; నానురూపం= తగినదికానట్టి("ఇవ" అనునదివాక్యాలంకారార్థము); చరితం= చేయఁబడినకార్యము; ఋషిభిః= ఋషులచే త; నదృష్టంకచ్చిత్ = చూడఁబడలేదుగదా?

నాతమ్ముండగులక్ష్మణుఁడు, దనకనురూపముగానట్టియకార్యమునుఁ, బ్రమాదవశంబునం గావింపలేదుగదా?

అని, తాత్పర్యము.

కచ్చి చ్ఛుశ్రూషమాణా వ శ్శుశ్రూషణ పరా మయి
ప్రమదా భ్యుచితాం వృత్తిం సీతా యుక్తం నవర్తతే. ౭

టీక॥ వః=మిమ్ము= శుశ్రూషమాణా= సేవించుచున్నదియు ; మయి= నాయందు; శుశ్రూషణపరా= సేవించుటయందాసక్తురాలునగు ; ప్రమదా= స్త్రీయయినః సీతా= సీత; యుక్తం=సరిగా; అభ్యుచితాం = యోగ్యమయిన; వృత్తిం=ఆచారమును; నవర్తతేకచ్చిత్=చేయదా యేమి?

మీకును నాకును శుశ్రూషసేయునట్టి నాభార్యసీత, యెట్టైన, మీవిషయంబున నడచుకొనఁదగినట్లు ; యుక్తముగాఁ, బ్రవర్తింపకున్నదా యేమి. అని, రాముండు కులపతియగు ఋషితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

అథ ఋషి ర్జరయా వృద్ధ స్తపసాచ జరాం గతః
వేపమాన ఇవోవాచ రామం భూతదయాపరమ్. ౮

టీక॥ అథ=అటుపిమ్మట; జరయా=ముసలితనముచేత; వృద్ధః=వృద్ధిఁబొందినవాఁడును; తపసాచ=తపస్సుచేతను; జరాం=ముసలితనమును; గతః=పొందినవాఁడునగు; ఋషిః=ఋషి; వేపమానఇవ=వడఁకుచున్నవాఁడువలె; భూతదయాపరం=భూతదయయందాసక్తుఁడగు; రామం=రామునిగూర్చి; ఉవాచ=చెప్పెను.

అంత, మిక్కిలియుముసలివాఁడును మహాతపస్సంపన్నుండునగు నాకులపతి ముసలితనముచేవడంకుచు, భూతదయాశాలియగురాముంజూచి, యిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

కుతః కల్యాణ సత్త్వాయాః కల్యాణాభిరతే స్తథా
చలనం తాత వైదేహ్యా స్తపస్విషు విశేషతః. ౯

టీక॥ తాత=నాయనా! కల్యాణసత్త్వాయాః=మంగళకరమయిన స్వభావము గలదియు; తథా=అట్లు; కల్యాణాభిరతేః=మంగళమునందాసక్తిగలదియునగు; వైదేహ్యాః=సీతాదేవికి; విశేషతః=విశేషించి; తపస్విషు=ఋషులయందు; చలనం=ధర్మలోపము; కుతః=ఎక్కడిది?

నాయనా! మంగళస్వభావురాలును మంగళానుష్ఠానపరయునగు సీతాదేవికిఎప్పుడునుధర్మవ్యతిక్రమముగలుగదే; అందుఋషులవిషయమయినయెట్లుగలుగును, అని, తాత్పర్యము.

త్వన్నిమిత్త మిదం తావ త్తాపసాన్ ప్రతివర్తతే
రక్షోభ్య స్తేన సంవిగ్నాః కథయంతి మిథః కథాః. ౧౦

టీక॥ త్వన్నిమిత్తం=నీకారణమువలన; రక్షోభ్యః=రాక్షసులవలన; ఇదం=ఈ; భయం(అధ్యాహృతము)తావత్=భయముమాత్రము; తాపసాన్ప్రతి=ఋషులనుగూర్చి; వర్తతే=సంభవించుచున్నది. ఋషయః (అధ్యాహృతము)=ఋషులు; తేన=అందుచేత; సంవిగ్నాః=భయపడినవారలై; మిథః=అన్యోన్యమునుగూర్చి; కథాః=మాటలను; కథయంతి=చెప్పుచున్నారు.




నిమిత్తమయి, రాక్షసుల వలన, మునులకుమహాభయము సంభవించుచున్నది; అందువలనభయపడి, ఋషులు ఒకరితోనొకరు చెప్పుకొనుచున్నారు.
అని, తాత్పర్యము.

రావణావరజః కశ్చి త్ఖరో నామేహ రాక్షసః
ఉత్పాట్య తాపసాన్ సర్వాన్ జనస్థాన నికేతనాన్. ౧౧
ధృష్టశ్చ జితకాశీచ నృశంసః పురుషాదకః
అవలిప్తశ్చ పాపశ్చ త్వాంచ తాత నమృష్యతే. ౧౨

టీక॥ తాత=నాయనా! ఇహ=ఇచ్చట; ధృష్టశ్చ= దిట్టతనముగలవాఁడును; జితకాశీచ= జయింపఁబడినయుద్ధముగలవాఁడును; నృశంసః=క్రూరుండును; పురుషాదకః = పురుషులనుభక్షించువాఁడును; అవలిప్తశ్చ= గర్వితుండును; పాపశ్చ= పాపములుసేయువాఁడునగు; రావణావరజః=రావణునితమ్ముఁడైన; ఖరోనామ=ఖరుఁడనుపేరుగల; కశ్చిత్=ఒకానొక ; రాక్షసః = రాక్షసుఁడు; జనస్థాననికేతనాన్=జనస్థానమునందునికిగల; తాపసాన్= ఋషులను; సర్వాన్ = అందఱను; ఉత్పాట్య=పెల్లగించి; త్వాంచ= నిన్నును; నమృష్యతే=ఓర్వకున్నాఁడు.

నాయనా! ధృష్టుండును యుద్ధంబునుసరకుసేయనివాఁడును గ్రూరుండును బురుషమాంసభక్షకుండును గర్వితుండును బాపిష్ఠుండునగు రావణానుజుండు ఖరుండనురాక్షసుండొకరుఁడు, జనస్థానంబునంజేరి, యచ్చటనుండు మునుల నందఱంబాఱందోలినాఁడు ; అతండు; నిన్నుఁజూచియోర్వఁజాలకయిచ్చటమునులను బాధించు చున్నాఁడు.
అని. తాత్పర్యము.

త్వం యదా ప్రభృతి హ్యస్మి న్నాశ్రమే తాత వర్తసే
తదా ప్రభృతి రక్షాంసి విప్రకుర్వంతి తాపసాన్. ౧౩

టీక॥ తాత=నాయనా! త్వం= నీవు; అస్మిన్=ఈ; ఆశ్రమే=ఆశ్రమమునందు; యదాప్రభృతి=ఎప్పుడుమొదలు; వర్తసే=ఉన్నావో; తదా=అదిమొదలు




కోసి; రక్షాంసి = రాక్షసులు; తాపసాన్=మునులను; విప్రకుర్వంతి=బాధించుచున్నారు.

నాయనా! నీవీయాశ్రమమునకు వచ్చిచేరినది మొదలు, రాక్షసులు, మునుల నానావిధములబాధించుచున్నారు.

అని, తాత్పర్యము.

దర్శయంతిహి బీభత్సైః క్రూరై ర్భీషణకై రపి
నానారూపై ర్విరూపైశ్చ రూపై ర్వికృతదర్శనైః. ౧౪

టీక॥ తే(అధ్యాహృతము)= ఆరాక్షసులు; బీభత్సైః = నిందితములును; క్రూరైః=కఠినములును; భీషణకై రపి= భయంకరములును; విరూపైశ్చ= వికృతరూపములు గలదియు; వికృత దర్శనైః= వికృతములగు కండ్లుగలవియునగు; నానారూపైః= నానావిధరూపములచేత; భయం(అధ్యాహృతము)= భయమును; దర్శయంతిహి = చూపుచున్నారుగదా.

ఆ రాక్షసులు, బీభత్సరూపములును, క్రూరములును భయంకరములును వికృతములును వికృతనేత్రములునగు, నానావిధరూపములుచూపి, మునులకుభయంబు గలిగించెదరు. అని, తాత్పర్యము.

అప్రశస్తై రశుచిభి స్సంప్రయోజ్యచ తాపసాన్
ప్రతిఘ్నం త్యపరాన్ క్షిప్ర మనార్యాః పురత స్థ్సితాః. ౧౫

టీ॥ పురతః=ముందు; స్థితాః= ఉన్నట్టి; అనార్యాః= దుష్టులగు రాక్షసులు; తాపసాన్=మునులను; అప్రశస్తైః= నిందితములును; అశుచిభిః = అపరిశుద్ధములునగు పదార్థములతో; సంప్రయోజ్యచ= కూర్చియు ; క్షిప్రం=శీఘ్రముగా; అపరాన్ = ఇతరులను; ప్రతిఘ్నంతి=వధించుచున్నారు.

పూర్వవర్తులగు రాక్షసులు, కొందఱీ మునులకయి నిందితములును అపరిశుద్ధంబులగు ద్రవ్యంబులఁబడవైచి, మఱికొందఱువధింపుచున్నారు.

అని, తాత్పర్యము.

తేషు తేష్వాశ్రమస్థానే ష్వబుద్ధ మవలీయచ
రమంతే తాపసా స్తత్ర నాశయంతోల్పచేతసః. ౧౬

టీక॥ అల్పచేతసః = క్షుద్రబుద్ధులగు రాక్షసులు; తేషు తేషు = ఆయా; ఆశ్రమస్థానేషు = ఆశ్రమపదములందు; అబుద్ధం = తెలియకుండునట్లు; అవలీయచ = డాఁగియుండియు; తత్ర = అచ్చట; తాపసాన్ = మునులను, నాశయంతః = నశింపఁజేయుచు; రమంతే = విహరించుచున్నారు.

క్షుద్రబుద్ధులగు నా రాక్షసులుకొందఱు, అయ్యాయాశ్రమంబులం దెలియకుండునట్లు డాఁగియుండి యచ్చటిమునులనువధింపుచు, విహరింపుచున్నారు.

అని, తాత్పర్యము.

అపక్షిపంతి స్రుగ్భాండా నగ్నీన్ సించంతి వారిణా
కలశాంశ్చ ప్రమృద్నంతి హవనే సముపస్థితే. ౧౭

టీక॥ హవనే = హోమము; సముపస్థితే = జరగుచుండగా; స్రుగ్భాండాన్ = స్రుక్స్రువంబులను హోమద్రవ్యంబులను; అపక్షిపంతి = పాఱవేయుచున్నారు; వారిణా = జలముచే; అగ్నీన్ = అగ్నిహోత్రములను; సించంతి = చల్లార్చెదరు. కలశాంశ్చ = ఖండములను; ప్రమద్నంతి = మర్దించుచున్నారు.

హోమము సేయునప్పుడువచ్చి, స్రుక్స్రువంబులను హోమద్రవంబులనుబాఱవైచి, యగ్నిహోత్రంబుల జలంబులంజల్లార్చి, సమిత్ఖండంబులను విఱిచి చూర్ణముగావించెదరు.

అని, తాత్పర్యము.

తై ర్దురాత్మభి రామృష్టా నాశ్రమాన్ ప్రజిహాసవః
గమనాయాన్యదేశస్య చోదయం త్యృషయోద్యమామ్. ౧౮

టీక॥ ఋషయః = ఋషులు; దురాత్మభిః = దుష్టబుద్ధులయిన; తైః = ఆరాక్షసులచేత; ఆమృష్టాన్ = వ్యాపింపఁబడిన; ఆశ్రమాన్ = ఆశ్రమములను; ప్రజి

హాసవః=విడువఁగోరినవారలయి;అన్య దేశస్య= ఇతరదేశముయొక్క; గమ నాయ=పోవుటకొఱకు; అద్య=ఇప్పుఁ డు; మాం=నన్ను; చోదయంతి=పే్ర రించుచున్నారు.

అట్లగుటంజేసి, ఋషులందఱు,మ రాత్ములగు నారాక్షసులసంచారముగ లయాశ్రమంబులనువిడిచి, యితరప్రదే శంబునకుఁ బోవలయునని ఇప్పుడునా తోఁజెప్పుచున్నారు, అని,తాత్పర్యము.

తత్పురా రామ శారీరా ముపహింసాం తపస్విషు
దర్శయంతిహి దుష్టాస్తే త్యక్ష్యామ ఇమమాశ్రమమ్. ౧౯

టీక॥ రామ= రాముఁడా! తత్= అందువలన; తే=ఆ;దుష్టాః= దుష్టుల గురాక్షసులు;పురా=ముందు;తపస్వి షు=మునులందు; శారీరాం=దేహసం బంధియగు; ఉపహింసాం = హింస ను; దర్శయంతిహి = చూపుదురుగ దా! ఇమం=ఈ;ఆశ్రమం=ఆశ్రమము ను; త్యక్ష్యామః=విడిచెదము.

రాముఁడా! అట్లుకావున, ఆదుష్ట రాక్షసులు, ఇంకముందు , ఇయ్యాశ్ర మంబున, మునులవధింపనారంభింతురు; కాబట్టియీయాశ్రమంబువిడిచెదము.

అని,తాత్పర్యము.

బహుమూలఫలం చిత్ర మతిదూరా దితో వనమ్
పురాణాశ్రమ మేవాహం శ్రయిష్యే సగుణః పునః. ౨౦

టీక॥ఇతః=ఇచ్చటనుండి; అతిదూ రాత్=మిక్కిలియుదూరంబున;బహు మూలఫలం=అధికములయినగడ్డలును ఫలములునుగలదియు;చిత్రం= ఆశ్చర్య కరమయినదియునగు; వనం= అడవి; అస్తి(అధ్యాహృతము)=కలదు . అ హం=నేను;పునః=మఱల ; సగణః= సమూహముతోఁగూడినవాఁడనై; పు రాణాశ్రమమేవ= మునుపటియాశ్రమ మునే;శ్రయిష్యే=ఆశ్రయించెదను.

ఇక్కడికి,బహుదూరంబున, సమృ ద్ధమూలఫలంబగునొక్క మహావనంబు గలదు; నేను , ఈఋషిసమూహముం గూడి,యందున్నమునుపటి యాశ్రమం బునకే,మఱలఁబోయెదను.

అని,తాత్పర్యము.

ఖర స్త్వయ్యపి చా యుక్తం పురా తాత ప్రవర్తతే
సహాస్మాభి రితో గచ్ఛ యదిబుద్ధిః ప్రవర్తతే. ౨౧

టీక॥ఖరః=ఖరుఁడు; పురా=ముందుః;త్వయ్యపి=నీయందును ; అయుక్తం=అయోగ్యముగా; ప్రవర్తతే=ప్రవర్తించును. బుద్ధిః=తలంపు;ప్రవర్తతేయది=కలుగునేని;ఇతః = ఇచ్చటనుండి;అస్మాభిస్సహ=మాతోఁగూడ; గచ్ఛ=రమ్ము.

ఇందు, ముందుఖరుండు, నీకును బాధగావించును;నీకుసమ్మతియగునేని, నీవును, మాతోఁగూడనిచ్చటనుండి రమ్ము.

అని, తాత్పర్యము.

స కళత్రస్య సందేహో నిత్యం యత్తస్య రాఘవ
సమర్థస్యాపిహి సతో వాసో దుఃఖ మిహా ద్యతే. ౨౨

టీక॥ రాఘవ=రాముఁడా! యత్=ఎందువలన;సకళత్రస్య=భార్యతోఁగూడిన;తస్య= ఆయుద్ధసన్నద్ధునకు ; నిత్యం=ఎల్లప్పుడును; సందేహః= సందేహమో;తత్ (అధ్యాహృతము)= అందువలన; సమర్థస్యసతోపి=సమర్థుండవైయున్నను; తే=నీకు;అద్య=ఇప్పుడు;వాసః=ఉండుట;దుఃఖంహి=కష్టముగదా!

రాముఁడా ! యుద్ధసన్నద్ధుండగు వాఁడుభార్యాసహితుండై యుండునేని,యతనికెట్లును సందేహమే; కావున, నీవుసమర్థుండవయిననీకిప్పుడిచ్చటవాసము సేయుటచే మిక్కిలియుఁ గష్టము సంభవించును.అని , కులపతి రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్తవంతం రామ స్తం రాజపుత్ర స్తపస్వినమ్
నశశాకో త్తరై ర్వాక్య మవ బద్ధం సముత్సుకమ్. ౨౩

టీక॥ రాజపుత్రః= రాచకొమరుండగు; రామః=రాముఁడు;ఇతి= ఈప్రకారము;ఉక్తవంతం = చెప్పినవాఁడును; సముత్సుకం=పోఁగోరుచున్నవాఁ



డునగు; తం=ఆ; తపస్విగనం= ఋషిని; ఉత్తరైః=శ్రేష్ఠములయిన; వాక్యైః= మాటలచేత; అవబద్ధం= నిలుపుటకు; నశశాక=చాలఁడయ్యె.

రాచకొమరుండగు రాముండు, ఈ ప్రకారమునం జెప్పఁ బడినం బయిన యమ్మహర్షిని ఏన్నిమాటలు చెప్పియు, నిలుపఁజాలఁడయ్యె.

అని, తాత్పర్యము.

అభినంద్య సమాపృచ్ఛ్య సమాధాయ చ రాఘవమ్
స జగా మాశ్రమం త్యక్త్వా కులైః కులపతి స్సహ. ౨౪

టీక॥సః=ఆ; కులపతిః = మునిసమూహనాయకుండగు మునీంద్రుండు; రాఘవం= రాముని; అభినంద్య= సంతోషపఱచి; సమాపృచ్ఛ్య= వీడుకొని; సమాధాయచ=ఒప్పించియు; కులైస్సహ= ఋషిసమూహములతోఁ గూడ; ఆశ్రమం=ఆశ్రమమును; త్యక్త్వా= విడిచి; జగామ=పోయెను.

కులపతియగు నామహర్షి, రాముని సంతోషపఱచి వీడ్కొని సమాధానపుమాటలు చెప్పి యొప్పించి, ఋషిసమూహసహితుండై, యయ్యాశ్రమంబు విడిచి పోయెను.

అని, తాత్పర్యము.

రామ స్సంసాద్య త్వృషిగణ మనుగమనా
ద్దేశా త్తస్మా త్కులపతి మభివాద్య ఋషిమ్
సమ్యక్ప్రీతై స్తై రనుమత ఉపదిష్టార్థః
పుణ్యం వాసాయ స్వనిలయ ముపసంపేదే. ౨౫

టీక॥రామః = రాముఁడు; కులపతిం = సమూహనాయకుండగు; ఋషిం=ఋషిని; అభివాద్య=నమస్కరించి; ఋషిగణం=మునిసమూహమును; అనుగమనాత్=వెంబడించుటవలన; తస్మాత్=ఆ; దేశాత్= ప్రదేశమునను౦డి; సంసాద్య=పంపి; ప్రీతైః= సంతసించిన; తైః=ఆఋషులచేత; సమ్యక్= చక్కఁగా, అనుమతః= అనుసరింపఁబడినవాఁడై; ఉపదిష్టార్థః= ఉపదేశింపఁబడిన ప్రయోజనముగలవాఁడై; వాసాయ=నివాసముకొఱకు; పుణ్యం= పవి



త్రిమయిన; స్వాలయం= తనయింటిని; ఉపసంపేదే=పొందెను.

రాముండు, కులపతియగు మహర్షికి నమస్కరించి, ఋషుల నందఱం గొంతదూరము వెంబడించిపోయి, వారలవలన నుపదేశంబు గొని, యనుజ్ఞ నొంది, పవిత్రంబగు తనపర్ణశాలకుం బోయెను. అని, తాత్పర్యము.

ఆశ్రమం త్వృషివిరహితం ప్రభుః
క్షణమపి విజహౌ స రాఘవః
రాఘవంహి సతత మనుగతా
స్తాపసా శ్చార్షచరితధృతగుణాః. ౨౬

టీక ॥ ప్రభుః = సమర్థుండగు; సః=ఆ; రాఘవః=రాముండు; ఋషివిరహితం=ఋషులచేవిడువంబడిన; ఆశ్రమంతు= ఆశ్రమమును; క్షణమపి= కొంతకాలముననైన; నవిజహౌ=విడువండయ్యె. తాపసాశ్చ = మునులును; ఆర్షచరితధృతగుణాః = ఋషిసంబంధి చరిత్రముచేతధరింపంబడిన యనురాగగుణముగలవారలయి; రాఘవం=రాముని; సతతం=ఎల్లప్పుడు ; అనుగతాః హి=అనుసరించుచుండిరిగదా!

రాముండు, మునిజనార్హంబులగు నాచారమునువిడువకుండుటచే, సంతోషితులై; ఋషులందఱు , నెల్లప్పుడు రామునిననుసరించియే యుండిరి; కావున రాముండును ,ఋషులుపోయినవెనుక, నయ్యాశ్రమముతత్క్షణమువిడువం దగినదయ్యు, వారలయందలి, ప్రేమచేఁగొంతకాలమునులకునివాసముగా నుండి నయ్యయ్యాశ్రమమును శీఘ్రింబునవిడువ జాలకుండెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, షోడశోత్తరశతతమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ షోడశోత్తరశతతమసర్గటీక, ముగిసినది.

---

శ్రీః

## సప్తదశోత్తరశతతమసర్గ ప్రారంభః.

రాఘవ స్త్వథయాతేషు తపస్విషు విచింతయన్
న తత్రారోచయ ద్వాసం కారణై ర్బహుభి స్తదా. ౧

టీక॥ రాఘవస్తు= రాముండు; తపస్విషు=మునులు; యాతేషు = పోయినవారలగుచుండఁగా; అథ= అంతట;తదా=అప్పుడు;బహుభిః= పెక్కులయిన;కారణైః = కారణములచేత; చింతయన్=ఆలోచించుచు;తత్ర= ఆయ్యాశ్రమమునందు;వాసం= ఉనికిని; అరోచయత్=ఇచ్ఛింపఁడయ్యె.

ఆఋషులందఱుఁబోయినపిమ్మట, రాముండు, పెక్కుకారణంబులనాలోచించి,యయ్యాశ్రమంబు ననుండఁగూడదనినిశ్చయించెను. అని, తాత్పర్యము.

ఇహ మే భరతో దృష్టో మాతరశ్చ సనాగరాః
సా చ మే స్మృతి రన్వేతి తాన్నిత్య మనుశోచతః. ౨

టీక॥మే= (తృతీయార్థమందు షష్ఠి) నాచేత;ఇహ=ఇచ్చట; భరతః= భరతుఁడు;దృష్టః= చూడఁబడినాఁడు. సనాగరాః=పౌరులతోఁగూడిన; మాతరః=తల్లులును;దృష్టాః (అధ్యాహృతము)=చూడఁబడిరి. తాన్= వారలనుగూర్చి;నిత్యం=ఎల్లప్పుడును; అనుశోచతః=దుఃఖించుచున్నట్టి; మే=నాకు; సా=ఆ;స్మృతిశ్చ=జ్ఞప్తియును;అన్వేతి=వెంబడించును.

నేనునీయాశ్రమమునందే భరతుని, పౌరులను, నాతల్లులనుం జూచినాను.

కావున, నీయాశ్రమము నుజూచినప్పుడం తయు, వారలు జ్ఞప్తికివచ్చి, నాకుమిక్కి లియుదుఃఖము గలుగచుండును.

అని, తాత్పర్యము.

స్కంధావారనివేశేన తేన తస్య మహాత్మనః
హయహస్తికరీషైశ్చ ఉపమర్దః కృతో భృశమ్. ౩

టీక॥ మహాత్మనః = పూజ్యమయిన మనస్సుగల; తస్య = ఆభరతునియొక్క; తేన=ఆ ; స్కంధావారనివేశేన=సేనానివేశముచేత; హయహస్తికరీషైశ్చ= గుఱ్ఱములయొక్కయు నేనుంగులయొక్కయు నెరువులచేతను ; భృశం=మిక్కిలియు ; ఉపమర్దః= చెఱుపు; కృతః=చేయఁబడినది.

మహాత్ముండగునాభరతునిసేనయిచ్చటవిడచుటవలన , అశ్వగజంబులలద్దులచే , నాశ్రమంబంతయుఁజెడియున్నది. అని, తాత్పర్యము.

తస్మా దన్యత్ర గచ్ఛామ ఇతి సంచింత్య రాఘవః
ప్రాతిష్ఠత స వైదేహ్యా లక్ష్మణేనచ సంగతః. ౪

టీక॥ సః=ఆ; రాఘవః= రాముఁడు; తస్మాత్=అందువలన; అన్యత్ర=మఱియొకస్థలమునకు; గచ్ఛామి= పోయెదము; ఇతి = అని; సంచింత్య=ఆలోచించి; వైదేహ్యా=సీతాదేవితోను; లక్ష్మణేనచ=లక్ష్మణునితోను; సంగతః= కూడినవాఁడై; ప్రాతిష్ఠత = బయలుదేఱెను.

అట్లగుటంజేసి, ఈస్థలంబువిడిచిమఱియొకస్థలంబునకుఁబోవలయును; ఇట్లు, రాముండాలోచించి, సీతాలక్ష్మణులంగూడిఁబయలుదేఱిపోయెను.

అని, తాత్పర్యము.

సోఽత్రే రాశ్రమ మాసాద్య తం వవందే మహాయశాః
తంచాపి భగవా నత్రిః పుత్రవ త్ప్రత్యపద్యత. ౫

టీక॥ మహాయశాః= అధికమయినకీర్తిగల; సః=ఆరాముఁడు; అత్రేః = అత్రిమహామునియొక్క; ఆశ్రమం= ఆశ్రమమును; ఆసాద్య=పొంది; తం =

శ్రీ

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

## అయోధ్యాకాండ విషయసూచిక.

సర్గసంఖ్య. విషయములు.

సర్గసంఖ్య. విషయములు.

సర్గసంఖ్య. విషయములు.

సర్గసంఖ్య. విషయములు.

౧౯ రాముండు, ఆరాత్రియంతయునత్రిశ్రమంబుననేయుండి, ప్రాతఃకాలంబునలేచి, కాల్యకరణీయంబులందీర్చికొని, ఋషులుచూపిన మార్గంబున, దండకారణ్యంబునకుఁబోవుట.

అయోధ్యాకాండవిషయసూచి,

సమాప్తము.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

మంగళమస్తు.



ఆయత్రిమహామునిని;వవందే=నమస్కరించెను. భగవాన్ = అధికమయిన మాహాత్మ్యముగల; అత్రిశ్చాపి=అత్రిమహామునియును;తం=ఆరామునిని; పుత్రవత్=కొడుకునువలె ; ప్రత్యపద్యత=స్వీకరించెను.

మహాయశుండగు నారాముండు, అత్రిమహాముని యాశ్రమంబునకుఁ బోయి,యమ్మహామునికినమస్కారంబుగావించెను;ఆయనయు,రామునిఁ, గొడుకునుంబోలె,నాదరించెను.

అని, తాత్పర్యము.

స్వయ మాతిథ్య మాదిశ్య సర్వ మస్య సుసత్కృతమ్
సౌమిత్రించ మహాభాగాం సీతాంచ సమసాంత్వయత్. ౬

టీక॥సః(అధ్యాహృతము)= ఆయత్రిమహాముని; స్వయం = తానే;అస్య=ఈరామునకు ; సుసత్కృతం= మిక్కిలియు సత్కారము గలుగునట్లుగా;ఆతిథ్యం=అతిథిపూజను; సర్వం= సమస్తమును;ఆదిశ్య=చేసి; సౌమిత్రించ=లక్ష్మణుని;మహాభాగాం= పూజ్యమయినభాగ్యముగల;సీతాంచ= సీతాదేవిని;సమసాంత్వయత్= అనునయించెను.

ఆయత్రిమహాముని;రామునకుఁదానే,యతిథిసత్కారమంతయుఁ జక్కఁగాఁగావించి,లక్ష్మణుని, మహాభాగురాలగుసీతాదేవినిం బ్రియవచనంబులనాదరించెను. అని, తాత్పర్యము.

పత్నీంచ సమనుప్రాప్తాం వృద్ధా మామంత్ర్య సత్కృతామ్
సాంత్వయామాస ధర్మజ్ఞ స్సర్వభూతహితే రతః. ౭

టీక॥ధర్మజ్ఞః=ధర్మము నెఱింగినవాఁడును; సర్వభూతహితే = సమస్తప్రాణులమేలునందు ;రతః=ఆసక్తుఁడునగునత్రిమహాముని; సమనుప్రాప్తాం=సమీపమునకువచ్చిన;వృద్ధాం= ముసలిదియు;సత్కృతాం= పూజింపఁబడినదియునగు; పత్నీంచ= భార్యనుగూడ;ఆమంత్ర్య=పిలిచి; రామాదీన్ (అధ్యాహృతము) = రామాదులను; సాంత్వయామాస=ఊరడించెను.

ధర్మజ్ఞుండునుసమస్తప్రాణిహితరతుండునగునత్రిమహాముని, సమీపం

బుననున్నవృద్ధురాలునుసర్వలోక పూజితయునగుతనభార్యంబిలిచి , భార్యయుండానును , రామాదులనాదరించిరి. అని, తాత్పర్యము.

అనసూయాం మహాభాగాం తాపసీం ధర్మచారిణీమ్
ప్రతిగృహ్ణీష్వ వై దేహీ మబ్రవీ దృషిస త్తమః. ౮

టీక॥ఋషిస త్తమః= ఋషి శ్రేష్ఠుండగునత్రిమహాముని; "మహాభాగాం= పూజ్యమయినభాగ్యముగలదియు; తాపసీం= తపస్వినియు ; ధర్మచారిణీం=ధర్మమునాచరించునదియునగు; అనసూయాం=అనసూయను; ప్రతిగృహ్ణీష్వ=ప్రతిగ్రహింపుము " ఇతి (అధ్యాహృతము)=అని;వై దేహీం = సీతా దేవినిగూర్చి;అబ్రవీత్ =చెప్పెను.

ఋషిశ్రేష్ఠుండగునత్రిమహాముని, సీతా దేవింజూచి,మహాభాగురాలును దపస్వినియుధర్మానుష్ఠానపరయునగునన సూయా దేవికినమస్కారంబు గావింపుమనిచెప్పెను.అని, తాత్పర్యము.

రామాయ చాచచక్షే తాం తాపసీం ధర్మచారిణీమ్

టీక॥సః(అధ్యాహృతము)= ఆయత్రిమహాముని; తాపసీం= తపస్వినియు;ధర్మచారిణీం= ధర్మమునాచరించునదియునగు;తాం= ఆయనసూయను;రామాయచ=రాముని కొఱకును;ఆచచక్షే=చెప్పెను.

ఆయత్రిమహాముని, రామునకును, మహాతపశ్శాలియుఁబరమ ధార్మికురాలునగు,ననసూయా దేవితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

దశవర్షాణ్యనా వృష్ట్యా దగ్ధే లోకే నిరంతరమ్. ౯
యయా మూలఫలే సృష్టే జాహ్నవీచ ప్రవర్తితా
ఉగ్రేణ తపసా యుక్తా నియమైశ్చాప్య లంకృతా. ౧౦
దశవర్షసహస్రాణి యయా తప్తం మహ త్తపః
అనసూయా వ్రతైస్స్నాతా ప్రత్యూహాశ్చ నివర్తితాః.౧౧
దేవకార్య నిమి త్తంచ యయా సంత్వరమాణయా

స ౧౧౭

దశరాత్రం కృతా రాత్రి స్సేయం మాతేవ తేఽనఘ. ౧౨

టీక॥ అనఘ=పాపరహితుండవగు రాముఁడా! దశవర్షాణి=పదిసంవత్సరములు; అనావృష్ట్యా=వర్షము లేమిచేత; లోకే=లోకము; దగ్ధే=దహింపఁబడగా; యయా=ఎవ్వతెచేత; నిరంతరం=ఎల్లప్పుడును; మూలఫలే=గడ్డలునుపండ్లును; సృష్టే = సృజింపఁబడినదో; జాహ్నవీచ=గంగానదియు; ప్రవర్తితా=కలిగింపఁబడినదో, యయా= ఎవ్వతెచేత; దశవర్షసహస్రాణి=పదిసంవత్సరముల వేలు; పదివేల సంవత్సరములననుట; మహత్ =గొప్పదగు; తపః=తపస్సు; తప్తం=చేయఁబడినదో; ప్రత్యూహాశ్చ=విఘ్నములును; నివర్తితాః = తొలగింపఁపడినవో; దేవకార్యనిమిత్తం= దేవతాకార్యమునిమిత్తమయి; సంత్వరమాణయా=వేగిరపడుచున్న; యయాచ= ఎవ్వతెచేతను; దశరాత్రం= పదిరాత్రులు; రాత్రిః= ఒకటేరాత్రిగా; కృతా= చేయఁబడినదో; సా=అట్టి; ఉగ్రేణ= తీక్ష్ణమయిన; తపసా=తపస్సుతో; యుక్తా= కూడినదియు; నియమైశ్చాపి=నియమములచేతను; అలంకృతా= అలంకరింపఁబడినదియును; వ్రతైః= కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతములచేత; స్నాతా=స్నానముచేసినదియునగు; ఇయం=ఈ; అనసూయా=అనసూయాదేవి ; తే=నీకు; మాతేవ=తల్లివంటిది.

పాపరహితుండవగు రాముఁడా! ఈయనసూయాదేవి మున్ను పదిసంవత్సరములువర్షములేక మహాక్షామము సంభవించి లోకంబు లన్నియు దగ్ధములగుచుండునప్పుడు , ఋషులకుఫలమూలంబులసృజించి, గంగానదినింగూడఁ బ్రవహించుచుండునట్లు గావించినది; పదివేలసంవత్సరంబులత్యుగ్రతపంబు గావించినట్టిమహాప్రభావురాలును; కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతంబులు పెక్కులాచరించినది, ఋషులకుంగల్గు తపోవిఘ్నంబులన్నియు నివారించుచుండును; మఱియుమున్నొకప్పుడు దేవకార్యనిమిత్తమయి, పదిరాత్రులు ఒకటేరాత్రిగాఁజేసి, మన్నన వడసియున్నది, నీవిమ్మహాదేవిని దల్లినింబోలె, బూజింపుము శ్రేయస్సుగలుగును.

అని, తాత్పర్యము.

తా మిమాం సర్వభూతానాం నమస్కార్యాం యశస్వినీమ్

అభిగచ్ఛతు వైదేహీ వృద్ధా మక్రోధనాం సదా. ౧౩
అనసూయేతి యా లోకే కర్మభిః ఖ్యాతి మాగతా

టీక॥యా = ఎవ్వతె; అనసూయేతి=అనసూయయని; లోకే=లోకమునందు; కర్మభిః = కార్యములచేత; ఖ్యాతిం=ప్రసిద్ధిని; ఆగతా= పొందినదో; తాం(అధ్యాహృతము)=అట్టి; సర్వభూతానాం = సమస్తప్రాణులకును; నమస్కార్యాం = నమస్కరింపఁదగినదియు; యశస్వినీం= అధికమయినకీర్తిగలదియు;వృద్ధాం= ముసలిదియు; సదా= ఎల్లప్పుడును; అక్రోధనాం=కోపములేనిదియునగు; ఇమాం= ఈయనసూయను; వైదేహీ=సీతాదేవి; అభిగచ్ఛతు=పొందునుగాక.

అద్భుతకర్మంబులచేత లోకంబునం దంతయుననసూయాదేవియనిప్రఖ్యాతిగావించినట్టిదియు సమస్త ప్రాణులకును నమస్కార్యయును మహాయశశ్శాలినియు వృద్ధురాలునుగోపరహితయునగు నీయనసూయాదేవిని, సీతాదేవినమస్కరించుఁగాక. అని, అమ్మహాముని రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవం బ్రువాణం త మృషిం తథే త్యుక్త్వా స రాఘవః. ౧౪
సీతా మువాచ ధర్మజ్ఞా మిదం వచన ముత్తమమ్

టీక॥సః=ఆ; రాఘవః= రాముఁడు;ఏవం=ఇట్లు; బ్రువాణం= చెప్పుచున్న; తం=ఆ;ఋషిం= అత్రిమహర్షినిగూర్చి;తథేతి=అట్లేయని;ఉక్త్వా = చెప్పి;ధర్మజ్ఞాం = ధర్మము నెఱింగిన; సీతాం=సీతాదేవినిగూర్చి;ఇదం = ఈ; ఉత్తమం=శ్రేష్ఠమయిన;వచనం= మాటను; ఉవాచ= చెప్పెను.

అంతనా రాముండు, అత్రిమహాముని చెప్పినమాటనువిని ; యాయనకట్లేయనిచెప్పి, ధర్మజ్ఞురాలగుసీతాదేవిం జూచి, యుత్తమంబగునీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

రాజపుత్రి శ్రుత మిదం మునే రస్య సమీరితమ్. ౧౫
శ్రేయోర్థ మాత్మనా శీఘ్ర మభిగచ్ఛ తపస్వినీమ్

టీక॥ రాజపుత్రి = రాచకొమార్తెయగు సీతాదేవీ! అస్య=ఈ; మునేః= ఋషియొక్క; ఇదం=ఈ; సమీరితం= మాట; శ్రుతం= వినఁబడినదా? ఆత్మనః=నీయొక్క; శ్రేయోర్థం = శ్రేయస్సుకొఱకు; శీఘ్రం=శీఘ్రముగా; తపస్వినీం= తపశ్శాలినియగు యనసూయాదేవిని, అభిగచ్ఛ=సేవింపుము.

రాజపుత్రివగు సీతా, యిమ్మహాముని సెలవిచ్చినమాటను విన్నావుగదా, కావున నీ శ్రేయస్సుకొఱకు శీఘ్రంబున నీయనసూయామహాదేవిని సేవింపుము. అని, రాముండు, సీతాదేవికిం జెప్పెను.

అని, తాత్పర్యము.

సీతా త్వేతద్వచ శ్శ్రుత్వా రాఘవస్య హితైషిణః. ౧౬
తా మత్రిపత్నీం ధర్మజ్ఞా మభిచక్రామ మైథిలీ

టీక॥ మైథిలీ=మిథిలయందుఁబుట్టిన; సీతా=సీతాదేవి; హితైషిణః = మేలుగోరునట్టి; రాఘవస్య = రామునియొక్క; ఏతత్=ఈ; వచః = మాటను; శ్రుత్వాతు=విన్నంతనె; ధర్మజ్ఞం= ధర్మము నెఱింగినదియు; అత్రిపత్నీం= అత్రిమహామునిభార్యయునగు; తాం= ఆయనసూయను; అభిచక్రామ = ప్రదక్షిణించెను.

అంత, సీతాదేవి, తనమేలుగోరువట్టి రాముండుచెప్పినమాటనువిని, ధర్మజ్ఞురాలగు నాయనసూయాదేవికిఁ బ్రదక్షిణముగావించెను.

అని, తాత్పర్యము.

శిథిలాం వలితాం వృద్ధాం జరాపాండురమూర్ధజామ్. ౧౭
సతతం వేపమానాంగీం ప్రవాతే కదళీ యథా
తాంతు సీతా మహాభాగా మనసూయాం పతివ్రతామ్. ౧౮
అభ్యవాదయ దవ్యగ్రా స్వనామ సముదాహరత్

టీక॥ సీతా=సీతాదేవి; అవ్యగ్రా= ఏమఱుపాటులేనిదై; శిథిలాం=శిథిలములయినయవయవములుగలదియు; వలితాం=ముడతలుగలదియు; వృద్ధాం= ముసలిదియు; జరాపాండురమూర్ధజాం=ముసలితనముచేఁదెల్లనైన వెండ్రుకలుగలదియు; ప్రవాతే = పెనుగాలియందు; కదళీయథా= అరఁటిచె

ష్టువతే; పతతం=ఎల్లప్పుడును; వేపమానాంగీం=వడంకుచున్న యవయవములుగలదియు; మహాభాగాం= పూజ్యమయిన భాగ్యముగలదియు ; పతివ్రతాం=పతివ్రతయునగు; తాం=ఆ;అనసూయాంతు=అనసూయాదేవిని ; అభ్యవాదయత్= నమస్కరించెను; స్వనామ=తనపేరును, సముదాహరత్= చెప్పెను.

సీతాదేవి,శిథిలాంగియు, దేహము నంచుముడతలుగలదియువృద్ధురాలును ముసలితనంబునంజేసి తెల్లనైన వెంట్రుకలుగలదియు(ప్రవాతంబునc గదళీవృక్షముంబోలెగడగడవడంకుచున్నదియు మహాభాగురాలునుబతివ్రతయునగు నయ్యనసూయాదేవికి,స్వనామోదాహరణపూర్వకముగా,నమస్కారంబుగావించెను. అని, తాత్పర్యము.

అభివాద్యచ వైదేహీ తాపసీం తామనిందితామ్. ౧౯
బద్ధాంజలిపుటా హృష్టా పర్యపృచ్ఛ దనామయమ్

టీక॥ వైదేహీ= సీతాదేవి; అనిందితాం=నిందింపఁబడనట్టి; తాపసీం= తపస్విని యగు; తాం = ఆయనసూయాదేవిని;అభివాద్యచ=నమస్కరించియు; బద్ధాంజలిపుటా= కట్టఁబడిన దొప్పవంటి చేమోడ్పుగలదై; హృష్టా= సంతసించినదై; అనామయం= ఆరోగ్యమును;పర్యపృచ్ఛత్=అడిగెను,

అట్లు,సీతాదేవి,అనిందితయగు నాయనసూయామహాదేవికి నమస్కారంబుగావించి, పరమసంతోషంబునచేమోడ్పుగీలించి,యారోగ్యంబునడిగెను,
అని, తాత్పర్యము.

తత స్సీతాం మహాభాగాం దృష్ట్వా తాం ధర్మచారిణీమ్. ౨౦
సాంత్వయంత్య బ్రవీ ద్ధృష్టా దిష్ట్యా ధర్మ మవేక్షసే

టీక॥ తతః=అటుపిమ్మట;సా (అధ్యాహృతము)=ఆయనసూయ;ధర్మచారిణీం=ధర్మమునాచరించునదియు; మహాభాగాం = పూజ్యమయినభాగ్యములుగలదియునగు ; తాం= ఆ; సీతాం=సీతాదేవిని;దృష్ట్వా= చూచి; హృష్టా = సంతసించినదై ; సాంత్వయంతీ=అనునయించుచు; అబ్రవీత్=

చెప్పెను. దిష్ట్యా= భాగ్యముచేత; ధర్మం=ధర్మమును; అవేక్షసే= చూచుచున్నావు.

అంత, ననసూయాదేవి, మహాభాగురాలునుఁబరమ ధార్మికురాలునగు సీతాదేవింజూచి, పరమసంతోషంబునొంది, మధురవాక్యంబున నిట్లని చెప్పెను. నీభాగ్యవశంబునంజేసి, నీకిట్లు; పాతివ్రత్యరూపధర్మబుద్ధి గలిగియున్నది. అని, తాత్పర్యము.

త్యక్త్వా జ్ఞాతిజనం సీతే మాన మృద్ధించ భామిని. ౨౧
అవరుద్ధం వనే రామం దిష్ట్యా త్వ మనుగచ్ఛసి

టీక॥ భామిని= స్త్రీ్రివగు;సీతే= సీతాదేవీ;త్వం=నీవు;దిష్ట్యా=భాగ్యముచేత; జ్ఞాతిజనం=బంధుజనులను; మానం=అహంకారమును;ఋద్ధిం= సంపదను; త్యక్త్వా=విడిచి=వనే= అడవియందు; అవరుద్ధం= నిబంధింపఁబడిన; రామం= రాముని; అనుగచ్ఛసి= వెంబడించుచున్నావు!

సీతాదేవీ! నీవు, బంధుజనమును అహంకారమును ఐశ్వర్యము అన్నింటిని విడిచి, అడవికిఁదఱుమఁబడిన, రాముని వెంబడించి వచ్చి యున్నావే! నీభాగ్యమేమని చెప్పవచ్చును.

అని, తాత్పర్యము.

నగరస్థో వనస్థోవా పాపోవా యదివా శుభః. ౨౨
యాసాం స్త్రీణాం ప్రియో భర్తా తాసాం లోకా మహోదయాః

టీక॥ యాసాం=ఏ; స్త్రీణాం = స్త్రీలకు; నగరస్థోవా = పట్టణంబుననున్నవాఁడుగాని; వనస్థోవా= అడవినున్నవాఁడుగాని; పాపోవా= పాపిష్ఠుఁడుగాని; శుభోయదివా=ధార్మికుఁడుగాని; భర్తా = పెనిమిటి; ప్రియః=ఇష్టుఁడో; తాసాం=ఆస్త్రీలకు; మహోదయాః = అధికమయినవృద్ధిగల,లోకాః= లోకములు;స్యుః (అధ్యాహృతము)=కల్గును.

ఏస్త్రీలు, పెనిమిటిపట్టణంబుననున్నను , అడివిలోనున్నను, దరిద్రుఁడైనను పాపిష్ఠుఁడైనను, అతనివిడువక సేవించుచుందురో,ఆస్త్రీలకు, ఉత్తమలోకములుకలుగును.

అని, తాత్పర్యము.

దుశ్శీలః కామవృత్తో వా ధనైర్వా పరివర్జితః. ౨౩
స్త్రీణా మార్యస్వభావానాం పరమం దైవతం పతిః

టీక॥ ఆర్యస్వభావానాం=పూజ్యమయినస్వభావముగల; స్త్రీణాం = స్త్రీలకు; దుశ్శీలః=దుస్స్వభావముగలవాఁడుగాని; కామవృత్తోవా = స్వేచ్ఛాచారముగలవాఁడుగాని; ధనైః = ధనములచేత; పరివర్జితోవా= విడువఁబడినవాఁడు గాని; పతిః= పెనిమిటి; పరమం=ఉత్తమమయిన; దైవతం = దైవము.

దుష్టస్వభావుండైనను, స్వేచ్ఛాచారసంపన్నుఁడైననుదరిద్రుండైనను, పెనిమిటియే, ధార్మిక స్త్రీలకుఁబరమదేవత. అని, తాత్పర్యము.

నాతో విశిష్టం పశ్యామి బాంధవం విమృశంత్యహమ్. ౨౪
సర్వత్ర యోగ్యం వైదేహి తపః కృత మివావ్యయమ్

టీక॥ వైదేహి = సీతాదేవీ! అహం= నేను; విమృశంతీ=ఆలోచించుచు; అతః=ఈ రెంటికన్నను; విశిష్టం= అధికుండగు; కృతం=చేయఁబడిన; అవ్యయం=నాశములేని; తపఇవ = తపస్సువలె; సర్వత్ర= అన్నిఁటను; యోగ్యం=సమర్థుఁడైన; బాంధవం=బంధువును; నపశ్యామి=చూడను.

సీతాదేవీ! నేనెంతయాలోచించినను, పెనిమిటికన్న, మహాతపస్సువలె సర్వావస్థలయందును రక్షించునట్టిబంధువెవ్వండును, నాకుఁగనుపడలేదు. అని, తాత్పర్యము.

నత్వేవమవగచ్ఛంతి గుణదోష మసత్త్స్రియః. ౨౫
కామవక్తవ్య హృదయా భర్తృనాథా శ్చరంతియాః

టీక॥యాః=ఎవ్వరు; కామవక్తవ్య హృదయాః=మన్మథాధీనమయిన మనస్సుగలవారలును; భర్తృనాథాశ్చ= పెనిమిటులనుయాచించు వారలునయి; చరంతి=తిరుగుదురో; తాః (అధ్యాహృతము)= ఆ; అసత్స్త్రియః =

దుష్టస్త్రీలు; ఏనం=ఈ; గుణదోషంతు= గుణదోషమును మాత్రము; నావగచ్ఛంతి=ఎఱుంగరు.

మన్మథాధీనమానసలయి పరపురుషులం గోరుచుండిరుగుచుండునట్టి దుష్టస్త్రీలకు ఈధర్మసూక్ష్మము తెలియదు. అని, తాత్పర్యము.

ప్రాప్నువంత్య యశశ్చైవ ధర్మభ్రంశంచ మైథిలి. ౨౮
అకార్యవశ మాపన్నా స్త్రియో యాః ఖలు తద్విధాః

టీక ॥ మైథిలి= సీతాదేవీ; తద్విధాః=అట్టి; అకార్యవశం=అకార్యాధీనతను; ఆపన్నాః= పొందినట్టి; స్త్రియః= స్త్రీలు; యాః(సంతి)=ఎవ్వరుగలరో; తాః(అధ్యాహృతము)=ఆ స్త్రీలు; అయశశ్చైవ=అపకీర్తిని; ధర్మభ్రంశంచ=ధర్మమునుండి జారుటను; ప్రాప్నువంతిఖలు= పొందుచున్నారు గదా!

అట్లు, కామాధీనులయి దుర్మార్గంబునం బ్రవర్తించునట్టి, దుష్టస్త్రీలు, ఇహలోకంబున నపకీర్తిఁ బొంది, పరలోకంబునను భయంకర నరకంబుఁ బొందుదురు. అని, తాత్పర్యము.

త్వద్విధా స్తు గుణై ర్యుక్తా దృష్టలోకపరావరాః. ౨౯
స్త్రియ స్స్వర్గే చరిష్యంతి యథా ధర్మకృత స్తథా

టీక॥త్వద్విధాః=నీయట్టి; గుణైః= గుణంబులతో; యుక్తాః= గూడినవారలును; దృష్టలోకపరావరాః= చూడఁబడినలోకమునందలిమంచి చెడులుగలవారలునగు; స్త్రియస్తు= స్త్రీలుమాత్రము; ధర్మకృతః = ధర్మమునాచరించువారలు; యథా=ఎట్లో; తథా= అట్లు; స్వర్గే=స్వర్గమునందు ; చరిష్యంతి=సంచరింపఁగలరు.

నీయట్టిగుణవంతులును, మంచి చెడులు తెలిసినవారలునగు నుత్తమస్త్రీలు, ధార్మికులచాడ్పున, స్వర్గంబున విహరింపుచుందురు.

అని, తాత్పర్యము.

తదేవ మేనంత్వ మనువ్రతా సతీ
పతివ్రతానాం సమయానువర్తినీ. ౩౦

భవస్వ భర్తుః స్సహధర్మచారిణీ
యశశ్చ ధర్మంచ తత స్సమాప్స్యసి

టీక॥తత్=అందువలన ; త్వం=నీవు;ఏవం=ఇట్లు;ఏనం= ఈ పెనిమిటిని; అనువ్రతాసతీ=అనుసరించినదానవగుచు;పతివ్రితానాం = పతివ్రతలయొక్క;సమయానువర్తినీ= ఆచారమున నుసరించుదానవై;భర్తుః= పెనిమిటికి ; సహధర్మచారిణీ = కూడధర్మము నాచరించుదానవు;భవస్వ (భవ)=అగుము. తతః=అందువలన;యశశ్చ=కీర్తిని; ధర్మంచ=ధర్మమును;సమాప్స్యసి=పొందఁగలవు.

అట్లగుటంజేసి,నీవిప్పటివలెనే,పెనిమిటిని ననువర్తింపుచుఁ , బతివ్రతల యాచారము ననుసరించి , పెనిమిటితోఁగూడధర్మంబు నాచరింపుచుండుము;నీకుఁగీర్తియునుధర్మంబును గలుగును.అనియనసూయసీతకుఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే,సప్తదశోత్తరశతతమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ సప్తదశోత్తరశతతమసర్గటీక,
ముగిసినది.

---



౨౭౨

అష్టాదశోత్తరశతతమసర్గప్రారంభః.

సాత్వేవ ముక్తా వైదేహీ అనసూయాఽనసూయయా
ప్రతిపూజ్య వచో మందం ప్రవక్తు ముపచక్రమే. ౧

టీక॥ అనసూయా= అసూయలేనట్టి; సా=ఆ; వైదేహీతు = సీతాదేవియు; అనసూయయా= అనసూయాదేవిచేత; ఏవం=ఇట్లు; ఉక్తా= చెప్పఁబడినదై; ప్రతిపూజ్య=పూజించి; మందం=తిన్నఁగా ; వచః=మాటను; ప్రవక్తుం=చెప్పుటకు- ఉపచక్రమే = ఆరంభించెను.

అంతనసూయారహితయగు సీతాదేవి, యనసూయాదేవి చెప్పినమాటనువిని, యమ్మహాదేవింబూజించి,వినయంబున;దిన్నఁగా నిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

నైత దాశ్చర్య మార్యాయా యన్మాం త్వ మభిభాషసే
విదితం తు మమాప్యేత ద్యథా నార్యాః పతి గురుః. ౨

టీక॥త్వం=నీవు; మాం=నన్నుగూర్చి; అభిభాషసే(ఇతి)యత్= చెప్పుచున్నావనునదియేదిగలదో; ఏతత్ =ఇది ; ఆర్యాయాః=పూజ్యురాలగునీకు; నాశ్చర్యం=ఆశ్చర్యకరముకాదు. యథా= ఎట్లు; నార్యాః= స్త్రీకి; పతిః= పెనిమిటి; గురుః=అధికుఁడో; ఏతత్= ఈ సంగతి; మమాపితు= నాకునుగూడ; విదితం=తెలిసినది.

నీవు; నాకిట్లుపదేశించుట, సకలలోకపూజ్యయగు నీకాశ్చర్యకరముగాదు; స్త్రీకిఁ బెనిమిటియే దైవమనునదినాకును దెలిసియున్న సంగతియే.

అని, తాత్పర్యము.

యద్య ప్యేష భవే ద్భర్తా మమార్యే వృత్తవర్జితః
అద్వైధ ముపచర్తవ్య స్తథా ప్యేష యయా భవేత్. ౩

టీక॥ ఆర్యే= పూజ్యురాలవగుననసూయాదేవీ; మమ=నాయొక్క; ఏషః= ఈ; భర్తా= పెనిమిటి; వృత్తవర్జితః= ఆచారహీనుఁడు; భవేద్యద్యపి= అయినప్పటికిని; తథాపి= అట్లయినను; ఏషః=ఈపెనిమిటి; అద్వైధం= భేదములేనట్లు; ఉపచర్తవ్యః=సేవింపఁబడవలసినవాఁడు; భవేత్=అగును,

పూజ్యురాలవగుననసూయాదేవీ! ఒకవేళనాపెనిమిటియాచారహీనుండై యున్నను; అప్పటికిని; నేనతనికిసేవసేయవలసినదిగానేయున్నదిగదా!

అని, తాత్పర్యము.

కిం పున ర్యో గుణశ్లాఘ్య స్సానుక్రోశో జితేంద్రియః
స్థిరానురాగో ధర్మాత్మా మాతృవ త్పితృవ త్ప్రియః. ౪

టీక॥ యః= ఏపెనిమిటి; గుణశ్లాఘ్యః= గుణంబులచే గొనియాడఁదగినవాఁడుగాను; సానుక్రోశః = దయతోఁగూడినవాఁడుగాను; జితేంద్రియః= జయింపఁబడినయింద్రియములు గలవాఁడుగాను; స్థిరానురాగః= స్థిరమయిన ప్రేమగలవాఁడుగాను ; ధర్మాత్మా= ధర్మస్వభావుఁడుగాను; మాతృవత్= తల్లివంటివాఁడుగాను; పితృవత్= తండ్రివంటివాఁడుగాను; ప్రియః=ఇష్టుండుగాను; భవేత్=ఉండునో; సః(అధ్యాహృతము)=అట్టివాఁడు; కింపునః (వక్తవ్యః) చెప్పఁబడవలయునా యేమి?

అట్లుండఁగా, గుణవంతుండును దయాశాలియు, జితేంద్రియుఁడును నాయందు స్థిరమయినయనురాగముగలవాఁడును ధర్మాత్ముండును నాకుదల్లియుంబోలెఁ బ్రియంబు సేయువాఁడును దండ్రియుంబోలె హితంబొనగూర్పువాఁడును మోహనాకారుండునగు పెనిమిటిని సేవించుటకు చెప్పవలయునా యేమి?

అని, తాత్పర్యము,

యాం వృత్తిం వర్తతే రామః కౌసల్యాయాం మహాబలః
తా మేవ నృపనారీణా మన్యాసా మపి వర్తతే. ౫

టీక॥మహాబలః= అధికమయినబలముగల; రామః= రాముఁడు; కౌసల్యా యాం=కౌసల్యాదేవియందు; యాం= ఏ; వృత్తిం=వృత్తిని; వర్తతే= సేయు

స ౧౧౮

నో; అన్యాసాం=ఇతరులగునట్టి; నృపనారీణాం= (సప్తమ్యర్థమందుషష్ఠి) రాజస్త్రీలయందును; తాసు ఏవ=అట్లే; వృత్తిః; వర్తతే=చేయును.

మహాబలుండగు రాముండు, కౌసల్యయం దెట్లు వర్తించునో, అట్లే ప్రకారముగ, నితర రాజస్త్రీలయందును వర్తించును. అని, తాత్పర్యము.

సకృ ద్దృష్టాస్వపి స్త్రీషు నృపేణ నృపవత్సలః
మాతృ వద్వర్తతే వీరో మాన ముత్సృజ్య ధర్మవిత్. ౬

టీక॥నృపవత్సలః= రాజునందభక్తి గలవాఁడు; వీరః = పరాక్రమశాలియగు; ధర్మవిత్=ధర్మము దెలిసినరాముఁడు; నృపేణ = దశరథమహారాజుచేత; సకృత్=ఒకసారిమాత్రము; దృష్టాసు=చూడఁబడిన; స్త్రీష్వపి=స్త్రీలయందును; మాతృవత్=తల్లియందువలె; మానం=అహంకారమును; ఉత్సృజ్య=విడిచి; వర్తతే=ఉన్నాఁడు.

పితృవత్సలుండును ధర్మవేత్తయునగు పరాక్రమవంతుండు రాముండు, తండ్రి యొకసారిమాత్రముకంటఁజూచినట్టి స్త్రీలకుంగూడఁ, దల్లికింబోలె. మానంబువిడిచి, శుశ్రూష సేయుచుండును.

అని, తాత్పర్యము.

ఆగచ్ఛంత్యాశ్చ విజనం వన మేవం భయావహమ్
సమాహితం మే శ్వశ్ర్వాచ హృదయే తద్ధృతం మహత్. ౭

టీక॥ ఏవం=ఇట్లు; భయావహం=భయముగలిగించునట్టి; విజనం=జనులులేని; వనం=అడవినిగూర్చి; ఆగచ్ఛంత్యాః=వచ్చుచున్న; మేచ=నాకును; శ్వశ్ర్వాచ=అత్తగారిచేతను; సమాహితం=ఉపదేశింపఁబడినది. తత్ = ఆ; మహత్= గొప్పసంగతి; హృదయే=మనసునందు; ధృతం=ధరింపఁబడినది.

నేను, భయంకరంబునువిజనంబునగునరణ్యంబునకువచ్చునప్పుడు, నాకుఁ బాతివ్రత్యమునుగుఱించి,నాయత్తకౌసల్యయుపదేశించినది, నేనుదానిమనంబుననుంచుకొనియున్నాను.

అని, తాత్పర్యము.

పాణిప్రదానకాలేచ యత్పురా త్వగ్నిసన్నిధౌ
అనుశిష్టా జనన్యాఽస్మి వాక్యం తదపి మే ధృతమ్. ౮

టీక॥ పురా= మున్ను; అగ్నిసన్నిధౌ=అగ్నిహోత్రసన్నిధానమునందు; పాణిప్రదానకాలేచ = వివాహకాలమునందును; మే = నాయొక్క; జనన్యా=తల్లిచేత; యత్=దేనిని; అనుశిష్టా=ఉపదేశింపఁబడినదానను; అస్మి= అయితినో; తత్=ఆ, వాక్యమపి= మాటయు; ధృతం=ధరింపఁబడినది.

మున్ను, నావివాహకాలంబున, నగ్నిహోత్ర సన్నిధానంబున, నాతల్లి యుఁ, బాతివ్రత్యధర్మంబు నుపదేశించియున్నది; దానినింగూడ, మఱవకమనసులోనుంచి కొనియున్నాను. అని, తాత్పర్యము.

నవీ కృతంతు తత్సర్వం వాక్యై స్తే ధర్మచారిణి
పతిశుశ్రూషణా న్నార్యా స్తపో నాన్య ద్విధీయతే. ౯

టీక॥ధర్మచారిణి=ధర్మమునాచరించునట్టియనసూయాదేవీ! తత్=అది; సర్వంతు=అంతయు; తే= నీయొక్క; వాక్యైః=మాటలచేత ; నవీకృతం=నూతనముగాఁజేయఁబడినది. నార్యాః=స్త్రీకిఁ; పతిశుశ్రూషణాత్= పతిసేవకన్న; అన్యత్ = ఇతరమయిన; తపః=తపస్సు; నవిధీయతే=విధింపఁబడదు.

పరమధార్మికవగుననసూయాదేవీ! నీవుచెప్పినమాటలవలన, నాకిప్పుడదంతయుం జక్కఁగాజ్ఞప్తికి వచ్చినట్లయినది; స్త్రీకిఁబతిసేవకన్నమఱి యేతపస్సునులేదు. అని, తాత్పర్యము.

సావిత్రీ పతిశుశ్రూషాం కృత్వా స్వర్గే మహీయతే
తథా వృత్తిశ్చ యాతా త్వం పతిశుశ్రూషయా దివమ్. ౧౦

టీక॥సావిత్రీ=సావిత్రీదేవి; పతిశుశ్రూషాం=పతిసేవను; కృత్వా= చేసి; స్వర్గే=స్వర్గమునందు ; మహీయతే= పూజ్యయగుచున్నది. తథావృ




త్రిః=అట్టియాచారముగలః;త్వం = నీవును; పతిశుశ్రూషయా= పతిసేవచేత;దివం=స్వర్గమును;యాతా= పొందినదానవు;భవిష్యసి(అధ్యాహృతము) = కాఁగలవు.

సావిత్రీదేవిపతిశుశ్రూషం గావించిస్వర్గలోకంబునవెలుంగుచున్నది ; నీవును అదేప్రకారమయినబతిశుశ్రూషసేయుటంజేసి, స్వర్గంబు నొందగలవు. అని, తాత్పర్యము.

వరిష్ఠా సర్వనారీణా మేషా చ దివి దేవతా
రోహిణీ న వినా చంద్రం ముహూర్తమపి దృశ్యతే.౧౧

టీక॥సర్వనారీణాం = సమస్తస్త్రీలలోను; వరిష్ఠా= ఉత్తమయగు ; ఏషా=ఈ;దేవతా=దేవతయయిన;రోహిణీ= రోహిణీదేవి;దివి= ఆకాశమునందు;చంద్రంవినా=చంద్రునివిడిచి;ముహూర్తమపి = కొంచము సేపైనను; నదృశ్యతే=చూడఁబడదు-

సమస్తస్త్రీలలోనుత్తమయగు రోహిణీదేవియాకాశంబునఁజంద్రుని విడిచికొంచెముసేపైనను.అగుపడదు.
అని, తాత్పర్యము.

ఏవం విధాశ్చ ప్రవరా స్త్రియో భర్తృదృఢవ్రతాః
దేవలోకే మహీయంతే పుణ్యేన స్వేన కర్మణా. ౧౨

టీక॥ఏవంవిధాః= ఇట్టి;ప్రవరాః= ఉత్తములయిన; భర్తృదృఢవ్రతాః= పెనిమిటివిషయమునందు దృఢమయినవ్రతములు గలవారలగు; స్త్రియశ్చ= స్త్రీలును; స్వేన=తమదైన; పుణ్యేన= పుణ్యరూపమయిన;కర్మణా= కార్యముచేత; దేవలోకే= స్వర్గమునందు; మహీయంతే=వెలుంగుచున్నారు.

మఱియుఁ, బెక్కు-పుణ్యస్త్రీలు,ఇట్లు దృఢంబగు పాతివ్రత్యంబుననుష్ఠించి,తమ పుణ్యబలంబున , స్వర్గలోకమునందు,వెలుంగుచున్నారు. అని, సీతాదేవియనసూయాదేవితోఁజెప్పెను,
అని, తాత్పర్యము.

తతోఽనసూయా సంహృష్టా శ్రుత్వోక్తం సీతయా వచః




స ౧౧౮

శిరస్యాఘ్రాయ చోవాచ మైథిలీం హర్షయంత్యుత. ౧౩

టీక॥ తతః=అటుపిమ్మట; అనసూయా=అనసూయాదేవి; సీతయా= సీతాదేవిచేత; ఉక్తం = చెప్పఁబడిన; వచః=మాటను; శ్రుత్వా= విని; సంహృష్టా=సంతసించినదై: మైథిలీం= సీతను; హర్షయంత్యుత= సంతోషపాటు నొందించుచు నె; శిరసి=తలయందు; ఆఘ్రాయ=మూర్కొని యు; ఉవాచ= చెప్పెను.

అంత, నయ్యనసూయాదేవి, సీతాదేవిచెప్పినమాటనువిని, బరమసంతుష్టయయి, సీతాదేవిగసంతోషపాటునొందునట్లుశిరంబుమూర్కొని, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

నియమైర్వివిధై రాప్తం తపోహి మహదస్తి మే
తత్సంశ్రిత్య బలం సీతే ఛందయే త్వాం శుచిస్మితే. ౧౪

టీక॥ శుచిస్మితే=తెల్లనిచిఱునగవుగల; సీతే=సీతాదేవీ! మే = నాకు; వివిధైః=నానావిధములగు; నియమైః = నియమములచేత; ఆప్తం=పొందఁబడిన; మహత్ =అధికమయిన; తపః = తపస్సు; అస్తిహి=కలదుగదా! తత్ =ఆ; బలం=బలమును; సంశ్రిత్య=ఆశ్రయించి; త్వాం=నిన్ను; ఛందయే=వరించునట్లు చేయుచున్నాను.

తెల్లనిచిఱునగవుగలసీతాదేవీ! నానావిధనియమంబుల సంపాదింపఁబడిన తపస్సునాకుమిక్కిలియునధికముగానున్నది; కావుననీయిష్టంబునెఱవేర్తును; నీ కేమికావలయును? చెప్పుము. అని, తాత్పర్యము.

ఉపపన్నం మనోజ్ఞంచ వచనం తవ మైథిలి
ప్రీతా చాస్మ్యుచితం కిం తే కరవాణి బ్రవీహి మే. ౧౫

టీక॥ మైథిలి=సీతాదేవీ; తవ= నీయొక్క; వచనం = మాట; ఉపపన్నం = యుక్తముగాను; మనోజ్ఞం చ=మనోహరముగాను; వర్తతే (అధ్యాహృతము)= ఉన్నది. అహం (అధ్యాహృతము) చ= నేనును; ప్రీతా=

స ౧౧౮

సంతసించినదానను; అస్మి= అగుచున్నాను. తే=నీకు; ఉచితం=యుక్తమగుదాని; కిం=ఏమిటిని; కరవాణి=చేయుదును. మే=నాకొఱకు; బ్రవీహి=చెప్పుము.

సీతాదేవీ! నీమాటయుపపన్నముగాను; మిక్కిలియుమనోహరముగానున్నది; నాకుమిక్కిలియుసంతోషముగలిగినది; నీకోఱకు-యేమి? నేనేమిసేయవలయును? చెప్పుము. అని, యనసూయాదేవిసీతకుం జెప్పెను.

అని, తాత్పర్యము.

తస్యా స్తద్వచనం శ్రుత్వా విస్మితా మందవిస్మయా
కృత మిత్య బ్రవీ త్సీతా తపోబలసమన్వితామ్. ౧౬

టీక॥ సీతా=సీతాదేవి; తస్యాః=ఆయనసూయాదేవియొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; విస్మితా= ఆశ్చర్యమునొందినదై; మందవిస్మయా=తిన్ననినవ్వుగలదై; తపోబలసమన్వితాం = తపోబలముతోఁగూడిన యనసూయాదేవింగూర్చి; కృతమితి=చేయఁబడినదని; అబ్రవీత్= చెప్పెను.

సీతాదేవియు, నయ్యనసూయాదేవిమాటనువిని, యాశ్చర్యమునొంది, చిఱునగవుమొగంబున నంకురింపనయ్యనసూయాదేవింజూచి, "ఈమాటతోచాలును; నాకు, గావలసినంతచేసినట్లే" యని, చెప్పెను. అని, తాత్పర్యము.

సా త్వేవ ముక్తా ధర్మజ్ఞా తయా ప్రీతతరాభవత్

టీక॥ధర్మజ్ఞా= ధర్మము నెఱింగినట్టి; సాతు=ఆయనసూయయు ; తయా=ఆసీతచేత;ఏవం=ఇట్లు; ఉక్తా= చెప్పఁబడినదై ; ప్రీతతరా= మిక్కిలియుసంతోషించినది; అభవత్ =అయినది.

ధర్మజ్ఞురాలగు నాయనసూయాదేవి, సీతాదేవిచెప్పినమాటను విన్నంతనె, మఱియునధికసంతోషంబు నొందినది. అని, తాత్పర్యము.

సఫలంచ ప్రహర్షంతే హంత సీతే కరోమ్యహమ్. ౧౭

టీక॥హంత=సంతోషము!అహం=నేను; ప్రహర్షంచ = సంతోషమును;

తే=నీకొఱకు; సఫలం=ఫలముతోఁగూడినదానినిగా ; కరోమి= చేయుచున్నాను.

సంతోషము! నాకునీయం దిప్పుడు గలిగిన సంతోషంబునునీయందు సఫలముగావింపవలెను.

అని, తాత్పర్యము.

ఇదం దివ్యం వరం మాల్యం వస్త్ర మాభరణానిచ
అంగరాగంచ వైదేహి మహార్హం చానులేపనమ్. ౧౮

టీక॥ వైదేహి=సీతాదేవీ! ఇదం=ఈ; దివ్యం= స్వర్గమునందుబుట్టిన ; వరం=శ్రేష్ఠమయిన; మాల్యం=పుష్పమాలికయును; వస్త్రం = వస్త్రమునుఆభరణానిచ=సొమ్ములును; అంగరాగంచ=కుంకుమము హరిచందనము మున్నగుదేహమునకు రంగు గలుగుటకుఁబూయుద్రవ్యమును;మహార్హం=శ్రేష్ఠమయిన,అనులేపనంచ= మైపూతయును; అస్తి(అధ్యాహృతము)=ఉన్నది.

సీతాదేవీ! ఈదివ్యంబగుపుష్పమాలికయును;వస్త్రమును ఆభరణంబులును, అంగరాగమును నుత్తమంబగుపరిమళగంధమును ఉన్నది.

అని, తాత్పర్యము.

మయా దత్త మిదం సీతే తవ గాత్రాణి శోభయేత్
అనురూప మసంక్లిష్టం నిత్య మేవ భవిష్యతి. ౧౯

టీక॥సీతే= సీతాదేవీ! మయా = నాచేత;దత్తం=ఇయ్యఁబడిన;ఇదం = ఇది; తవ= నీయొక్క ; గాత్రాణి= అవయవములను; శోభయేత్ =ప్రకాశింపఁజేయును. నిత్యమేవ= ఎల్లప్పుడును;అనురూపం= తగినదిగాను; అసంక్లిష్టం=బాధలేనిదిగాను; భవిష్యతి = ఉండఁగలదు.

సీతాదేవీ! నేనొసంగినట్టి; యీదివ్యమాలికాదులు, నీదేహంబునకు మిక్కిలియుఁ బ్రకాశంబు సేయుచుండును;ఇదియెప్పటికిని నశింపదు; నీసౌందర్యంబునకును గుణంబుగా దివ్యతేజంబున, వెలుంగుచుండును.

అని, తాత్పర్యము.

అంగరాగేణ దివ్యేన లిప్తాంగీ జనకాత్మజే
శోభయిష్యసి భర్తారం యథా శ్రీ ర్విష్ణు రవ్యయమ్. ౨౦

టీక॥ జనకాత్మజే= జనకమహారాజుకూఁతురైనసీతాదేవీ! త్వం(అధ్యాహృతము)=నీవు; దివ్యేన=శ్రేష్ఠమయిన; అంగరాగేణ= మైపూఁతచేత; లిప్తాంగీ= పూయఁబడినదేహముగలదానవై ; నిత్యం= ఎల్లప్పుడును; భర్తారం=పెనిమిటిని ; అవ్యయం=నాశములేని;విష్ణుం=విష్ణుదేవుని; శ్రీర్యథా= లక్ష్మీదేవివలె; శోభయిష్యసి= ప్రకాశింపఁజేయుదువు.

జనకమహారాజుకొమార్తెవగు సీతాదేవీ! నీవిదివ్యంబగునంగరాగమును బూసికొని ; లక్ష్మీదేవియవ్యయుండగు విష్ణువునకుసంతోషంబుసేయునట్లు, నీభర్తకుమిక్కిలియు సంతోషంబుగలిగింతువు.అని, యనసూయాదేవి, సీతకుంజెప్పెను.అని, తాత్పర్యము.

సా వస్త్ర మంగరాగంచ భూషణాని స్రజ స్తథా
మైథిలీ ప్రతిజగ్రాహ ప్రీతిదాన మనుత్తమమ్. ౨౧

టీక॥ సా=ఆ; మైథిలీ=సీతాదేవి, అనుత్తమం=తనకన్న శ్రేష్ఠములేని; ప్రీతిదానం=సంతోషముచేనివ్వఁబడిన; వస్త్రం=వస్త్రమును; అంగరాగంచ = మైపూఁతను ; భూషణాని=సొమ్ములను; తదా=అట్లు; స్రజః=పుష్పమాలికలను; ప్రతిజగ్రాహ=పుచ్చుకొనెను.

ఆసీతాదేవి,అట్లనసూయాదేవిచేఁ బ్రీతిపూర్వకంబుగా నివ్వఁబడినయుత్తమంబులగు,వస్త్రమును, అంగరాగమును,సొమ్ములను,పుష్పమాలికలను, బ్రతిగ్రహించెను.అని,తాత్పర్యము.

ప్రతిగృహ్యాచ తత్సీతా ప్రీతిదానం యశస్వినీ
శ్లిష్టాంజలిపుటా తత్ర సముపాస్త తపోధనామ్. ౨౨

టీక॥యశస్వినీ= అధికమయినకీర్తిగల;సీతా= సీతాదేవి ; ప్రీతిదానం=సంతోషముచేనివ్వఁబడిన;తత్= దాని;ప్రతిగృహ్య=పుచ్చుకొని;తత్ర=




అచ్చట; శ్లిష్టాంజలిపుటా= కూర్పఁబడిన;దోప్పవంటిచేమోడ్పుగలదై; తపోధనాం=తపస్సేధనముగాఁగల యనసూయాదేవిని;సముపాస్త = సేవించెను.

అంత,మహాయశశ్శాలినియగుసీతాదేవి,యనసూయాదేవిచేఁ బ్రీతిపూర్వకంబుగానొసంగంబడిన వస్త్రాదులం బ్రతిగ్రహించి,యచ్చటనేచేమోడ్పుగీలించి,యమ్మహాదేవిని సేవింపుచుండెను. అని, తాత్పర్యము.

తథా సీతా ముపాసీనా మనసూయా దృఢవ్రతా
వచనం ప్రష్టు మారేభె కాంచి త్ప్రియకథా మను. ౨౩

టీక॥దృఢవ్రతా=దృఢమయినవ్రతముగల; అనసూయా= అనసూయాదేవి; తథా=అట్లు;ఉపాసీనాం= సేవింపుచున్న; సీతాం=సీతను; కాంచిత్=ఒకానొక;ప్రియకథాం అను= సంతోషకథనుద్దేశించి;వచనం= మాటను; ప్రష్టుం=అడుగుటకు;ఆరేభే=ఆరంభించెను.

దృఢవ్రతయగు ననసూయాదేవి, యట్లు సేవాపరయయియున్నసీతాదేవింజూచి, యొకానొకప్రియకథంగుఱించి,యడుగనారంభించెను.

అని, తాత్పర్యము.

స్వయంవరే కిల ప్రాప్తా త్వమ నేన యశస్వినా
రాఘవేణేతి మే సీతే కథా శ్రుతి ముపాగతా. ౨౪

టీక॥సీతే=సీతాదేవీ;త్వం= నీవు; స్వయంవరే=స్వయంవరమునందు;యశస్వినా=అధికమయినకీర్తిగల; అనేన=ఈ;రాఘవేణ = రామునిచేత; ప్రాప్తాకిల=పొందఁబడినావుగదా! ఇతి=ఈ; కథా=కథ;మే=నాయొక్క; శ్రుతిం=చెవిని;ఉపాగతా=పొందినది.

సీతాదేవీ! మహాయశశ్శాలియగురాముండు, నిన్నుస్వయంవరంబునంబొందినాఁడుగదా! ఈసంగతిని నేనును వినియున్నాను.అని, తాత్పర్యము.




తాం కథాం శ్రోతు మిచ్ఛామి విస్తరేణ చ మైథిలి
యథానుభూతం కార్త్స్న్యేన తన్మే త్వం వక్తుమర్హసి. ౨౫

టీక॥ మైథిలి=సీతాదేవీ! తాం=ఆ. కథాం=కథను; విస్తరేణచ = విస్తరముచేతను; శ్రోతుం=వినుటకు ; ఇచ్ఛామి=కోరుచున్నాను. త్వం=నీవు; తత్=ఆవృత్తాంతమును; యథానుభూతం=అనుభవింపఁబడినదానిని అతిక్రమింపక; కార్త్స్న్యేన=సాకల్యముచేత; మే=నాకొఱకు; వక్తుం = చెప్పుటకు; అర్హసి=తగుదువు.

సీతాదేవి ! ఆకథనంతయు సవిస్తారంబుగా వినవలెనని కోరుచున్నాను : కాఁబట్టి; జరిగినదిజరిగినట్టుగా, నాకాకథనంతయు నీవుచెప్పవలయును. అని, యనసూయాదేవి, సీతనడిగెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తాతు సా సీతా తాం తతో ధర్మచారిణీమ్
శ్రూయతా మితి చోక్త్వా వై కథయామాస తాం కథామ్. ౨౬

టీక॥ తతః=అంత; సా=ఆ; సీతాతు=సీతాదేవియు ; ఏవం=ఇట్లు; ఉక్తా=చెప్పఁబడినదై; ధర్మచారిణీం=ధర్మము నాచరించునట్టి; తాం=ఆయనసూయాదేవినిగూర్చి; శ్రూయతామితి=వినఁబడుఁగాకయని; ఉక్త్వాచ=చెప్పియు; తాం=ఆ; కథాం=కథను; కథయామాస=చెప్పెను.

అంత , నాసీతాదేవి, యనసూయమాటనువిని , పరమధార్మికయగు నమ్మహాదేవింజూచి, వినుమని, యీకథఁజెప్పందొడంగెను.

అని, తాత్పర్యము.

మిథిలాధిపతి ర్వీరో జనకో నామ ధర్మవిత్
క్షత్రధర్మే హ్యభిరతో న్యాయతః శాస్తి మేదినీమ్. ౨౭

టీక॥ మిథిలాధిపతిః= మిథిలకుఁబ్రభుండును; వీరః=పరాక్రమశాలియు; ధర్మవిత్ = ధర్మము నెఱింగినవాఁడునగు; జనకోనామ=జనకుండను పేరుగ




లవాఁడు; క్షత్రధర్మే = క్షత్రియధర్మమునందు; అభిరతః=ఆసక్తుఁడై; న్యాయతః=న్యాయంబున; మేదినీం= భూమిని; శాస్తిహి= పాలించుచున్నాఁడుగదా!

పరాక్రమవంతుండును ధర్మవేత్తయునగుమిథిలానాథుండు జనకమహారాజనువాఁడు, క్షత్రియధర్మంబున వలంబించి, యథాన్యాయంబుగ భూమింబాలింపుచుండును.

అని, తాత్పర్యము.

తస్య లాంగలహస్తస్య కర్షతః క్షేత్రమండలమ్
అహం కిలోత్థితా భిత్త్వా జగతీం నృపతేస్సుతా. ౪౮

టీక॥ తస్య = ఆజనకమహారాజు; లాంగలహస్తస్య=నాగేలుహస్తమునందుఁగలవాఁడై; క్షేత్రమండలం = యాగోపయుక్తమయినమండలాకార భూమిని; కర్షతః=దున్నుచుండఁగా; నృపతేః=రాజుయొక్క; సుతా=కొమార్తెనగు; అహం=నేను; జగతీం = భూమిని; భిత్త్వా=భేదించి; ఉత్థితాకిల=ఉద్భవించితినిగదా!

ఆజనకమహారాజు, నాఁగలిచేఁబూని, యాగోపయుక్తమగు మండలాకారక్షేత్రమును దున్నుచుండఁగా నేనుభూమినిభేదించియుద్భవించి.యామహారాజునకుఁగొమార్తెనైతిని.

అని, తాత్పర్యము.

స మాం దృష్ట్వా నరపతి ర్ముష్టివిక్షేపతత్పరః
పాంసుకుంఠితసర్వాంగీం జనకో విస్మితో౽భవత్. ౪౯

టీక॥ ముష్టివిక్షేపతత్పరః=ఓషధుల పిడికిళ్లనుజల్లుటయందు దాసక్తుఁడైన; సః=ఆ; నరపతిః=మనుష్యులకుఁబ్రభువైన; జనకః= జనకమహారాజు; పాంసుకుంఠితసర్వాంగీం= దుమ్ముచేఁగప్పఁబడిన సమస్తావయవములును గల; మాం=నన్ను; దృష్ట్వా=చూచి; విస్మితః= ఆశ్చర్యమునొందినవాఁడు. అభవత్=ఆయెను.

అప్పుడు, ఓషధులనుబిడికిళ్లనుజల్లుచున్నయాజనకమహారాజు, దేహమంతయుదుమ్ముతోఁబ్రాదుర్భవించిననన్నుం జూచి.పరమాశ్చర్యంబునొందెను.

అని, తాత్పర్యము.

అనపత్యేన చ స్నేహా దంక మారోప్య చ స్వయమ్
మమేయం తనయే త్యుక్త్వా స్నేహో మయి నిపాతితః. ౩౦

టీక॥ అనపత్యేనచ=సంతానములేని జనక మహారాజుచేత; స్నేహాత్=స్నేహమువలన; మాం (అధ్యాహృతము)=నన్ను; స్వయం=తాను; అంకం=తొడను; ఆరోప్య=ఎక్కించి; ఇయం=ఇది; మమ=నాయొక్క; తనయా=కొమాళ్లె; ఇతి=అని; ఉక్త్వా చ=చెప్పియు; మయి=నాయందు; స్నేహః=చెలిమి; నిపాతితః=ఉంచఁబడినది.

అంత, జనకమహారాజు, సంతానహీనుండగుటంజేసి, స్నేహంబున నన్నుత్సంగంబునంజేర్చి, నాకొమాళ్లెయిదియనిచెప్పుచు, నాయందు స్నేహంబుంచెను. అని, తాత్పర్యము.

అంతరిక్షేచ వాగుక్తా ప్రతిమా మానుషీ కిల
ఏవ మేత న్నరపతే ధర్మేణ తనయా తవ. ౩౧

టీక॥ నరపతే= జనకమహారాజా; ఏతత్=ఇది; ఏవం=ఇట్లు; ఇయం (అధ్యాహృతము)= ఈచిన్నది; ధర్మేణ=ధర్మముచేత; తవ=నీయొక్క; తనయా=కొమాళ్లె; ఇతి (అధ్యాహృతము)=అని; అంతరిక్షే=ఆకాశమునందు; అప్రతిమా=సరిలేనిదియు; అమానుషీ=మనుష్యసంబంధికానిదియునగు; వాక్ చ=మాటయును, ఉక్తా కిల= చెప్పఁబడినదిగదా!

అప్పుడు "జనకమహారాజా! ఇదివాస్తవము; ఈచిన్నది ధర్మమున నీకొమాళ్లెయగుచున్నది." అని, యాకాశంబుననసదృశంబగు నమానుషవాక్కుపుట్టినది. అని, తాత్పర్యము,

తతః ప్రహృష్టో ధర్మాత్మా పితా మే మిథిలాధిపః
అవాప్తో విపులా మృద్ధిం మా మవాప్య నరాధిపః. ౩౨

టీక॥ తతః=అటుపిమ్మట; ధర్మాత్మా= ధర్మస్వభావుండగు ; నరాధిపః=మనుష్యులకుఁబ్రభుండును; మిథిలాధిపః=మిథిలకుఁబ్రభుండునగు , మే=నాయొక్క; పితా=తండ్రియగు జనకమహారాజు; ప్రహృష్టః= సంతసించిన




వాఁడై; మాం=నన్ను; అవాప్య=పొంది; విపులాం=అధికమయిన; బుద్ధిం=వృద్ధిని; అవాప్తః=పొందినాఁడు.

అంత, ధర్మాత్ముండగు నాతండ్రి జనకమహారాజు, ఆకాశవాణినివిని సంతసించి, నన్నుం దీసికొని, పరమసంతోషంబునొందెను. అని, తాత్పర్యము.

దత్తా చాస్మీష్టవద్దేవ్యై జ్యేష్ఠాయై పుణ్యకర్మణా
తయా సంభావితా చాస్మి స్నిగ్ధయా మాతృసౌహృదాత్. ౩౩

టీ॥ పుణ్యకర్మణా=పుణ్యములయిన కర్మములు గల జనకమహారాజుచేత; అహం(అధ్యాహృతము)=నేను; జ్యేష్ఠాయై=మొదటిదైన; ఇష్టవద్దేవ్యై=ఇచ్ఛగలభార్యకొఱకు; దత్తాచ=ఇయ్యఁబడినదానను; అస్మి=అయితిని. స్నిగ్ధయా=స్నేహముగల; తయా=ఆబిడచేత; మాతృసౌహృదాత్=తల్లికింగలుగు స్నేహమువలన; సంభావితాచ=గౌరవింపఁబడినదానను; అస్మి=అగుచున్నాను.

పుణ్యకర్ముండగు జనక మహారాజు, నన్నుఁదీసికొనిపోయి, తనమొదటిభార్యకొసంగెను; ఆబిడయుఁ, దల్లివలెనే స్నేహంబుననన్నుఁబోషించుచు వచ్చినది. అని, తాత్పర్యము.

పతిసంయోగ సులభం వయో దృష్ట్వాతు మే పితా
చింతా మభ్యగమద్దీనో విత్తనాశా దివాధనః. ౩౪

టీక॥ పితా=తండ్రియగుజనకమహారాజు; మే=నాయొక్క; పతిసంయోగసులభం=పెనిమిటితోఁ గలయుటకు యోగ్యమయిన; వయః=వయస్సును; దృష్ట్వాతు=చూచినంతనె; దీనః=దుఃఖితుండై; అధనః=దరిద్రుఁడు; విత్తనాశాదివ=ధననాశమువలనంబోలె; చింతాం=చింతను; అభ్యగమత్=పొందెను.

అంత, నాతండ్రి జనకమహారాజు, నాకువివాహయోగ్యవయస్సువచ్చుటం జూచి, దీనుండై, ధననాశంబునొందిన దరిద్రుండువలె; దుఃఖంబునొందెను. అని, తాత్పర్యము,




సదృశా చ్చాపకృష్టాచ్చ లోకే కన్యాపితా జనాత్
ప్రధర్షణా మవాప్నోతి శక్రేణాపి సమో భువి. ౩౫

టీక॥లోకే=లోకమునందు; కన్యాపితా=కూఁతురుతండ్రి;భువి= భూమియందు;శక్రేణ=దేవేంద్రునితో,సమోపి=సమానుండైనను; సదృశాచ్చ=సరియయినదియు;అపకృష్టాచ్చ=తక్కువయయినదియునగు; జనాత్ = జనమువలన; ప్రధర్షణాం= తిరస్కారమును;అవాప్నోతి=పొందును.

లోకంబునఁ,గూఁతురు [illegible] దేవేంద్రసదృశుండైనను, సరివారిలోనుదక్కువవారిలోను దిరస్కారము నొందును.అని,తాత్పర్యము.

తాం ధర్షణా మదూరస్థాం దృష్ట్వా చాత్మని పార్థివః
చింతార్ణవగతః పారం నాససా దాప్లవో యథా. ౩౬

టీక॥పార్థివః=జనకమహారాజు; తాం=ఆ; ధర్షణాం = తిరస్కారమును; ఆత్మని=తనయందు ; అదూరస్థాం=సమీపంబుననున్నదానిఁగా; దృష్ట్వాచ=చూచియు;చింతార్ణవగతః= దుఃఖసముద్రమునొందినవాఁడై ; అప్లవోయథా=తెప్పలేనివాఁడువలె; పారం=గట్టును; నాససాద = పొందఁడయ్యె.

జనకమహారాజు, అట్టితిరస్కారముతనకింకశీఘ్రింబుగనేగలుగుటకున్నదనితెలిసికొని , దుఃఖసముద్రంబునంబడి,తెప్పలేనివాడుసముద్రంబు గట్టు చేరంజాలనట్లు , దానినంతంబు నొందడయ్యె.
అని,తాత్పర్యము.

అయోనిజాం హి మాం జ్ఞాత్వా నాధ్యగచ్ఛ ద్విచింతయన్
సదృశం చానురూపంచ మహీపాలః పతిం మమ. ౩౭

టీక॥మహీపాలః= భూమికిఁబ్రభువయినజనకమహారాజు;మాం =నన్ను;

అయోనిజాం= యోనియందుఁ బుట్టని దానిఁగా; జ్ఞాత్వా=ఎఱింగి; విచింతయన్=ఆలోచింపుచు; మమ= నాకు; సదృశంచ=సరియయినవాఁడును;అనురూపంచ=తగినవాఁడునగు;పతిం= పెనిమిటిని; నాధ్యగచ్ఛద్ధి = ఎఱుంగఁడ వ్వాఁగదా!

జనకమహారాజు, నేనయోనిజనగుటందలపోసి, యెంతయాలోచించినను, నాకుఁదగిన పెనిమిటి, యాయనకుదొరకఁడయ్యె. అని, తాత్పర్యము.

తస్య బుద్ధి రియం జాతా చింతయానస్య సంతతమ్
స్వయంవరం తనూజాయాః కరిష్యామీతి ధీమతః. ౩౭

టీక॥సంతతం=ఎల్లప్పుడును;చింతయానస్య=ఆలోచించుచున్న;ధీమతః= బుద్ధిమంతుఁడగు;తస్య=ఆయనకు; "తనూజాయాః=కొమార్తెకు; స్వయంవరం=స్వయంవరమును; కరిష్యామి= చేసెదను" ఇతి=అనునట్టి; ఇయం= ఈ;బుద్ధిః=బుద్ధి;జాతా=పుట్టినది.

అట్లునిరంతరము నాలోచింప నాలోచింప బుద్ధిమతుండగు నాజనకునకు,"కొమార్తెకుస్వయంవరంబు గావించెదను" అని, బుద్ధిపుట్టినది.

అని, తాత్పర్యము.

మహాయజ్ఞే తదా తస్య వరుణేన మహాత్మనా
దత్తం ధనుర్వరం ప్రీత్యా తూణీ చాక్షయసాయకౌ. ౩౮

టీక॥తదా = అప్పుడు; మహాయజ్ఞే = గొప్పయజ్ఞమునందు; మహాత్మనా= అధికమయినప్రభావముగల; వరుణేన=వరుణునిచేత; తస్య= ఆజనకమహారాజునకు; ప్రీత్యా=సంతోషముచేత; ధనుర్వరం=ధనుశ్శ్రేష్ఠము; దత్తం=ఇయ్యఁబడినది. అక్షయ సాయకౌ=నాశములేని బాణములుగల; తూణీచ= అమ్ములపొదులును; దత్తౌ (అధ్యాహృతము)=ఇయ్యఁబడినవి.

మున్నుమహాయజ్ఞంబున; దేవతలు సంతసించిప్రేరేపింపఁ మహాత్ముండగు

వరుణుఁడు, జనకమహారాజునకు; ఉత్తమంబగు ధనుస్సును, తఱుగని బాణంబులుగల యమ్ములపొదులును ఒసంగియుండెను.

అని, తాత్పర్యము.

అసంచాల్యం మనుష్యైశ్చ యత్నేనాపి చ గౌరవాత్
తన్నశక్తా నమయితుం స్వప్నేష్వపి నరాధిపాః. ౪౦

టీక॥గౌరవాత్ = బరువగుటవలన; మనుష్యైశ్చ = మనుష్యమాత్రులచేత; యత్నేనాపి= ప్రయత్నముచేసైనను; అసంచాల్యం= కదలింపనలవిగానట్టి; తత్ = ఆధనుస్సును ; నమయితుం=వంచుటకు. నరాధిపాః=రాజులు ; స్వప్నేష్వపి=స్వప్నములయందైనను; నశక్తాః= సమర్థులుకారు.

ఆధనుస్సుమిక్కిలియుబరువగుటవలన, మనుష్యమాత్రులు దానినెంత కష్టపడినను; గదలింపఁజాలరు; అట్లుండుటవలన రాజులు స్వప్నంబునందైనను, దానివంచుటకు,సమర్థులు కాఁజాలరు.

అని, తాత్పర్యము.

తద్ధనుః ప్రాప్య మే పిత్రా వ్యాహృతం సత్యవాదినా
సమవాయే నరేంద్రాణాం పూర్వ మామంత్ర్య పార్థివాన్. ౪౧

టీక॥సత్యవాదినా= సత్యంబుజెప్పునట్టి, మే=నాయొక్క;పిత్రా=తండ్రిచేత; పూర్వం=మొదట ; పార్థివాన్=రాజులను;ఆమంత్ర్య=పిలిచి; నరేంద్రాణాం= రాజులయొక్క; సమవాయే=గుంపునందు;తత్=ఆ;ధనుః= ధనుస్సును;ప్రాప్య=పొంది; వ్యాహృతం= చెప్పఁబడినది,

అంత, సత్యవాదియగు నాతండ్రి రాజులనందఱఁబిలిచి , రాజసదమునాధనువుంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇదంచ ధను రుద్యమ్య సజ్యం యః కురుతే నరః
తస్య మే దుహితా భార్యా భవిష్యతి న సంశయః. ౭౩

టీక॥ యః=ఏ; నరః = మనుష్యుఁడు; ఇదం=ఈ; ధనుశ్చ=ధనుస్సును; ఉద్యమ్య=ఎత్తి; సజ్యం=అల్లెత్రాటితోఁ గూడినదానిఁగా; కురుతే= చేయునో, మే=నాయొక్క; దుహితా= కొమార్తె; తస్య= అతనియొక్క; భార్యా=భార్య; భవేత్=కాఁగలదు; సంశయః=సందేహము; న=లేదు,

ఎవ్వఁడు, ఇమ్మహాధనుస్సును ఎత్తి సజ్యంబుగావించునో; నా కొమార్తె అతనిభార్య కాఁగలదు; ఇంక సందేహములేదు. అనిజనకమహారాజు చెప్పెను.

అని, తాత్పర్యము.

తచ్చ దృష్ట్వా ధనుశ్శ్రేష్ఠం గౌరవా ద్గిరిసన్నిభమ్
అభివాద్య నృపా జగ్ము రశక్తా స్తస్య తోలనే. ౭౪

టీక॥ నృపాః= రాజులు; గౌరవాత్ =బరువువలన; గిరిసన్నిభం= పర్వతముతోసమానమయిన; తత్= ఆ; ధనుశ్శ్రేష్ఠం=ధనురుత్తమమును; దృష్ట్వా చ=చూచియు; తస్య= దానియొక్క; తోలనే=కదలించుటయందు; అశక్తాః= అసమర్థులయి, అభివాద్య= నమస్కరించి; జగ్ముః=పోయిరి.

అంత, రాజులందఱు, పర్వతాకారమయినయాధనుస్సుంజూచి, దానిం గదలింపఁజాలక, దానికి నమస్కారము గావించిపోయిరి.

అని, తాత్పర్యము,

సుదీర్ఘస్య తు కాలస్య రాఘవోఽయం మహాద్యుతిః
విశ్వామిత్రేణ సహితో యజ్ఞం ద్రష్టుం సమాగతః. ౭౫
లక్ష్మణేన సహ భ్రాత్రా రామ స్సత్యపరాక్రమః

టీక॥సుదీర్ఘస్య=మిక్కిలియు దీర్ఘమయిన; కాలస్యాతు = కాలమునకును;మహాద్యుతిః= అధికమయినకాంతిగల; సత్యపరాక్రమః = సత్యమయినపరాక్రమముగల; రాఘవః=రఘువంశమునందుబుట్టిన ; అయం=ఈ; రామః=రాముఁడు; విశ్వామిత్రేణ = విశ్వామిత్రునితోఁ; సహితః = కూడినవాఁడై;భ్రాత్రా=తమ్ముఁడయిన;లక్ష్మణేనసహ=లక్ష్మణునితోఁగూడ ; యజ్ఞం=యాగమును ; ద్రష్టుం=చూచుటకు;సమాగతః=వచ్చినాఁడు.

అంత బహుకాలమునకు, కాంతిమంతుండును సత్యపరాక్రముండు నగు నీరాముండును,అతనితమ్ముండు లక్ష్మణునితో, విశ్వామిత్రసహితుండై , యజ్ఞముంజూడవచ్చినాఁడు.

అని, తాత్పర్యము.

విశ్వామిత్రస్తు ధర్మాత్మా మమ పిత్రా సుపూజితః. ౮౫
ప్రోవాచ పితరం తత్ర భ్రాతరౌ రామలక్ష్మణౌ

టీక॥తత్ర=అప్పుడు;ధర్మాత్మా=ధర్మస్వభావముగల;విశ్వామిత్రస్తు= విశ్వామిత్రుండును; మమ = నాయొక్క; పిత్రా = తండ్రిచేత; సుపూజితః = చక్కఁగాఁబూజింపఁబడినవాఁడై;పితరం= తండ్రినిగూర్చి;భ్రాతరౌ=అన్నతమ్ములయిన ; రామలక్ష్మణౌ= రామలక్ష్మణులనుగురించి; ప్రోవాచ=చెప్పెను.

ధర్మాత్ముండగు విశ్వామిత్రుండు, నాతండ్రిచేఁబూజితుండై,నాతండ్రింజూచి, రామలక్ష్మణులువచ్చినవృత్తాంతముం జెప్పెను.

అని, తాత్పర్యము.

సుతౌ దశరథ స్యేమౌ ధనుర్దర్శనకాంక్షిణౌ. ౮౬

టీక॥ఇమౌ=వీరలు; దశరథస్య=దశరథునియొక్క; సుతౌ= కొడుకులు. ధనుర్దర్శన కాంక్షిణౌ = ధనుస్సుఁజూచుటంగోరుచున్నవారలు.

వీరలిర్వురుదశరథునికొడుకులు ; నీయొద్దనుండు ధనుస్సుం జూడ వచ్చి

నారు. అని, తాత్పర్యము.

ధను ర్దశరథాయ రామాయ రాజపుత్రాయ దైవికమ్

టీక॥ రాజపుత్రాయ= రాచకొమరుండగు; రామాయ= రామునికొఱకు; దైవికం=దేవతలవలనవచ్చిన ; ధనుః=ధనుస్సును ; దర్శయ = చూపుము.

రాజపుత్రుండగు రామునకు, నీవు దేవతలొసంగినధనుస్సుంజూపుము. అని, విశ్వామిత్రుండు, నాతండ్రితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యు క్తస్తే న విప్రేణ తద్ధను స్సముపానయత్. ౪౭

టీక॥ సః(అధ్యాహృతము)= ఆజనకమహారాజు; తేన=ఆ; విప్రేణ = విశ్వామిత్రునిచేత; ఇతి=ఇట్లు , ఉక్తః= చెప్పఁబడినవాఁడై; తత్ =ఆ; ధనుః= ధనుస్సును ; సముపానయత్ = తెచ్చెను.

అంత, జనకుండు, విశ్వామిత్రు వచనంబువిని, యాధనుస్సుం దెచ్చిచూపెను. అని, తాత్పర్యము.

నిమేషాంతరమాత్రేణ తదానమ్య స వీర్యవాన్
జ్యాంత మారోప్య ఝడితి పూరయామాస వీర్యవత్. ౪౮

టీక॥ వీర్యవాన్=అధికమయిన పరాక్రమముగలః సః=ఆరాముండు; నిమేషాంతరమాత్రేణ= ఱెప్పపాటంత వ్యవధానమునసే; వీర్యవత్ =అధికమయిన సారముగల ;తత్ = ఆధనుస్సును; ఆనమ్య=వంచి; జ్యాంతం= అల్లెత్రాడుఅంతమునందుగల్గునట్లుగా; ఆరోప్య=ఎక్కుపెట్టి; ఝడితి=శీఘ్రముగా; పూరయామాస=పూరించెను.

పరాక్రమవంతుండగు నారాముం

డు, నిమేషాంతరమాత్రంబుననే, సారవంతంబగునాధనువువంచి, యల్లెతాటనెక్కవెట్టి, శీఘ్రింబునంబూరించెను.

అని, తాత్పర్యము.

తేన పూరయతా వేగా న్మధ్యే భగ్నం ద్విధా ధనుః
తస్య శబ్దోఽభవ ద్భీమః పతితస్యా శనే రివ. ౪౯

టీక॥ పూరయతా= పూరించుచున్న; తేన=ఆ రామునిచేత; వేగాత్= వేగమువలన; ధనుః=ధనుస్సు; మధ్యే= నడుమను; ద్విధా= రెండుగా; భగ్నం= విఱువఁబడినది. తస్య= దానియొక్క; శబ్దః=ధ్వని; పతితస్య=పడిన; అశనేః= పిడుగుయొక్క; శబ్దః(అధ్యాహృతము) ఇవ=ధ్వనివలె; భీమః= భయంకరముగా; అభవత్=అయినది.

రాముండు పూరించునప్పుడు, ఆ వేగంబునకు, ధనుస్సు, నడుమ, రెండుగావిఱిగినది; ఆశబ్దము, పిడుగుపడునప్పుడుగలుగుశబ్దమువలెభయంకరంబుగావినబడినది.

అని, తాత్పర్యము.

తతోఽహం తత్ర రామాయ పిత్రా సత్యాభిసంధినా
నిశ్చితా దాతు ముద్యమ్య జలభాజన ముత్తమమ్. ౫౦

టీక॥ తతః=అంత; తత్ర=అప్పుడు; అహం=నేను; సత్యసంధినా= సత్యమయినదలంపుగల; పిత్రా= తండ్రిచేత; ఉత్తమం=శ్రేష్ఠమగు; జలభాజనం=నీటికలశమును; ఉద్యమ్య= ఎత్తి; రామాయ=రామునికొఱకు; దాతుం=ఇచ్చుటకు; నిశ్చితా=నిశ్చయింపబడినాను,

అంత, సత్యప్రతిజ్ఞుఁడగు నాతండ్రి, రామునకొసగనిశ్చయించి, జలకలశంబునెత్తినాఁడు.

అని, తాత్పర్యము.

దీయమానాం నతు తదా ప్రతిజగ్రాహ రాఘవః

అవిజ్ఞాయ పితు శ్ఛంద మయోధ్యాధిపతేః ప్రభోః. ౫౧

టీక॥ రాఘవః=రాముఁడు; అయోధ్యాధిపతేః=అయోధ్యకుఁబ్రభుండును; ప్రభోః=సమర్థుఁడునగు; పితుః=తండ్రియొక్క; ఛందం= అభిప్రాయమును; అవిజ్ఞాయ= డెలిసికొనక; దీయమానాం=ఇవ్వఁబడుచున్న; మాం (అధ్యాహృతము)=నన్ను; నతుజగ్రాహ=ప్రతిగ్రహింపనేలేదు.

అప్పుడు, నాతండ్రినన్ను; రామునకు;ఇవ్వఁబోగా, అయోధ్యానాధుండగుదనతండ్రి దశరథునియభిప్రాయంబు డెలిసికొనక , ప్రతిగ్రహింపనని చెప్పెను. అని, తాత్పర్యము.

తత శ్శ్వశుర మామంత్ర్య వృద్ధం దశరథం నృపమ్

మమ పిత్రా త్వహం దత్తా రామాయ విదితాత్మనే. ౫౨

టీక॥ తతః=అటుపిమ్మట; మమ=నాయొక్క; పిత్రాతు = తండ్రిచేతను;శ్వశురం=మామయయిన;వృద్ధం = ముసలివాఁడగు; నృపం = మనుష్యులంబాలించునట్టి ; దశరథం= దశరథుని; ఆమంత్ర్య=పిలిచి; అహం=నేను; విదితాత్మనే=తెలియఁబడినపరమాత్మగల; రామాయ=రామునికొఱకు ; దత్తా=ఇవ్వఁబడినాను.

అంత, నాతండ్రి,నామామయయినవృద్ధుండగుదశరథమహారాజునురప్పించి, పరమాత్మవేత్తయగు రామునకు, నన్నొసంగెను.

అని, తాత్పర్యము.

మమచైవా నుజా సాధ్వీ ఊర్మిళా ప్రియదర్శనా

భార్యార్థే లక్ష్మణస్యాపి పిత్రా దత్తా మమ స్వయమ్. ౫౩

టీక॥ మమ = నాయొక్క ; అనుజా=చెల్లెలును; సాధ్వీ=సత్స్వభావముగలదియు; ప్రియదర్శనా= సంతోషకరంబగుచూచుటగలదియునగు; ఊర్మిళాచైవ=ఊర్మిళయును; మమ= నాయొక్క; పిత్రా= తండ్రిచేత; స్వయం=తానే;లక్ష్మణస్యాపి=లక్ష్మణునకును; భార్యార్థే = భార్యానిమిత్తము; దత్తా=ఇయ్యఁబడినది.

మఱియు, నాతండ్రి, సాధ్వియుఁ జూపరులకు సంతోషంబు సేయునదియునగు నాచెల్లెలనూర్మిళను, లక్ష్మణునకు భార్యగానొసంగెను.

అని, తాత్పర్యము.

ఏవం దత్తా స్మి రామాయ తదా తస్మిన్ స్వయం వరే
అనురక్తా స్మి ధర్మేణ పతిం వీర్య వతాం వరమ్. ౫౪

టీక॥తదా=అప్పుడు; తస్మిన్ = ఆ; స్వయంవరే= స్వయంవరంబునందు; ఏవం=ఇట్లు; రామాయ=రామునికొఱకు; దత్తా = ఇయ్యఁబడినదానను; అస్మి = అగుచున్నాను. వీర్యవతాం=అధికమయిన పరాక్రమముగలవారలలో=వరం=శ్రేష్ఠుండగు పతిం= పెనిమిటినిగూర్చి ; ధర్మేణ= ధర్మముచేత; అనురక్తా= అనురాగముగలదానను; అస్మి=అగుచున్నాను.

అప్పుడుస్వయంవరంబునందు , ఈ ప్రకారంబున, నాతండ్రినన్ను రామునకొసంగెను; అంతనేనును ; బరాక్రమవంతులలోనుత్తముండగు నాపెనిమిటియందు,ధర్మంబుచొప్పున, ననురాగంబుగలిగియున్నాను. అని సీతాదేవి యనసూయాదేవికింజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే,అష్టాదశోత్తరశతతమస్సర్గః.

ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండాష్టాదశోత్తరశతతమసర్గటీక, ముగిసినది.

---

శ్రీ.

ఏకోనవింశోత్తరశతతమసర్గప్రారంభః.

అనసూయాతు ధర్మజ్ఞా శ్రుత్వా తాంమహతీం కథామ్
పర్యష్వజత బాహుభ్యాం శిరస్యాఘ్రాయ మైథిలీమ్. ౧

టీక॥ధర్మజ్ఞా= ధర్మము నెఱింగినట్టి; అనసూయాతు=అనసూయయు; తాం=ఆ; మహతీం= గొప్పదగు ; కథాం=కథను; శ్రుత్వా=విని; మైథిలీం= సీతాదేవిని; శిరసి=తలయందు; ఆఘ్రాయ=మూర్కొని; బాహుభ్యాం=చేతులచేత; పర్యష్వజత=కవుఁగిలించెను.

ధర్మజ్ఞురాలగు ననసూయాదేవి, ఆకథనంతయువిని, సీతాదేవిని, శిరంబునమూర్కొని, బాహువులంగవుఁగిలించుకొనెను. అని, తాత్పర్యము.

వ్యక్తాక్షరపదం చిత్రం భాషితం మధురం త్వయా
యథా స్వయంవరం వృత్తం తత్సర్వం హి శ్రుతం మయా. ౨

టీక॥త్వయా=నీచేత; వ్యక్తాక్షరపదం=స్పష్టములయినయక్షరములును బదములునుగల్గునట్లుగా; చిత్రం= ఆశ్చర్యకరముగా; మధురం= మనోహరముగా; భాషితం=చెప్పఁబడినది. యథా= ఎట్లు; స్వయంవరం= స్వయంవరమును; వృత్తం=నడచినదో; తత్ = అది; సర్వం=అంతయు; మయా= నాచేత; శ్రుతం హి=వినఁబడినదిగదా!

అక్షరములునుబదములును స్పష్టము

లుగా. నాశ్చర్యకరంబుగామధురంబుగాఁజెప్పితివి; స్వయంవరమునడచినవిధమునంతయువింటిని.

అని, తాత్పర్యము.

రమేహం కథ యా తే తు దృఢం మధురభాషిణి

టీక॥మధురభాషిణి = మధురముగాఁజెప్పునట్టిసీతా! అహం = నేను; తే=నీయొక్క; కథయాతు= కథచేతను; దృఢం=అధికముగా; రమే=సంతసించుచున్నాను.

మధురముగా మాటలాడునట్టిసీతాదేవీ! నీకథనువినుటవలన, నాకుమిక్కిలియుసంతోషంబుగలిగినది.

అని, తాత్పర్యము.

రవి ర స్తంగత శ్శ్రీమా నుపోహ్య రజనీం శివామ్. ౩

టీక॥శ్రీమాన్= అధికమయినకాంతిగల; రవిః=సూర్యుఁడు;శివాం=మంగళకరమయిన; రజనీం= రాత్రిని; ఉపోహ్య=పొందించి; అస్తంగతః = అస్తమించెను.

శ్రీమంతుండగు సూర్యుండు; మంగళకరంబగురాత్రినిసమీపింపఁజేసి, యస్తమించెను. అని, తాత్పర్యము.

దివసం ప్రతికీర్ణానా మాహారార్థం పతత్రిణామ్
సంధ్యాకాలే నిలీనానాం నిద్రార్థం శ్రూయతే ధ్వనిః. ౪

టీక॥ఆహారార్థం= ఆహారముకొఱకు;దివసం = పగలు ; ప్రతికీర్ణానాం=వ్యాపించినవియు ; సంధ్యాకాలే= సాయంకాలమునందు ; నిద్రార్థం=నిద్రకొఱకు; నిలీనానాం = దాఁగినవియునగు; పతత్రిణాం=పక్షులయొక్క; ధ్వనిః= శబ్దము; శ్రూయతే=వినఁబడుచున్నది.

ఆహారార్థముపగలంతయుఁదిరిగి, సంధ్యాకాలంబున నిద్రించుట కొఱకు వృక్షంబులంజేరినపక్షులు సేయుకలకల ధ్వనిఃవినంబడుచున్నది.

అని, తాత్పర్యము.

ఏతేచా ప్యభిషేకార్ద్రా మునయః కలశోద్యతాః
సహితా ఉపవర్తంతే సలిలాప్లవవల్కలాః. ౫

టీక॥ అభిషేకార్ద్రాః=స్నానముచే దడిసినవారలును ; కలశోద్యతాః = ఎత్తఁబడినకలశములుగలవారలును; సలిలాప్లుతవల్కలాః=జలముచేఁదడుపఁబడిననారచీరలుగలవారలునగు; ఏతే=ఈ; మునయశ్చాపి=మునులును; సహితాః= కూడినవారలయి; ఉపవర్తంతే=వచ్చుచున్నారు.

ఇదిగో యీమునులును, సాయంకాలికస్నానముగావించి, జలకలశంబులం బట్టుకొని , నీటందడసిన వల్కలంబులతో, గుంపులు గుంపులుగా వచ్చుచున్నారు. అని, తాత్పర్యము,

ఋషీణా మగ్నిహోత్రేషు హుతేషు విధిపూర్వకమ్
కపోతాంగారుణో ధూమో దృశ్యతే పవనోద్ధతః. ౬

టీక॥ ఋషీణాం=ఋషులయొక్క; అగ్నిహోత్రేషు= అగ్నిహోత్రములయందు; విధిపూర్వకం=యథావిధిగా; హుతేషు = వ్రేల్వంబడినవగుచుండఁగాఁ; కపోతాంగారుణః= పావురముయొక్క మెడవలెనవ్యక్తరాగమయిన; ధూమః=పొగ; పవనోద్ధతః=గాలిచేనెగురఁగొట్టఁబడినదై; దృశ్యతే=చూడఁబడుచున్నది.

ఋషులు, అగ్నిహోత్రంబుల యథావిధి వ్రేల్చుటం జేసి, పావురము మెడవలెనవ్యక్త రాగమయిన ధూమంబు గాలికి, గగనంబున కెగసి చూపట్టుచున్నది. అని, తాత్పర్యము.

అల్పపర్ణా హి తరవో ఘనీభూతాః స్సమంతతః
విప్రకృష్టేపి దేశేస్మి న్నప్రకాశంతి వై దిశః. ౭

టీక॥ అల్పపర్ణా అపి=కొంచెముపత్రములుగల; తరవో హి=వృక్షములును; సమంతతః=అంతటను; ఘనీభూతాః= దట్టముగానున్నవి; విప్రకృష్టే= విరళమయినదైనను; అస్మిన్=ఈ; దేశే= ప్రదేశంబునందును; దిశః=దిక్కులును; న

ప్రకాశంతి=ప్రకాశింపకున్నవి.

స్వల్పముగాఁ బత్రములుగల వృక్షములుగూడఁ జీకటిబలంబునంజేసి , దట్టముగా నాకులు గలిగినట్లు చూపట్టుచున్నవి; ఎచ్చుగావృక్షుంబులులేనియీ ప్రదేశంబునంగూడ, దిక్కులు ప్రకాశింపకున్నవి. అని, తాత్పర్యము.

రజనీచరసత్త్వాని ప్రచరంతి సమంతతః
తపోవనమృగాహ్యేతే వేదితీర్థేషు శేరతే. ౮

టీక॥రజనీచరసత్త్వాని=రాక్షసులు నుపిశాచులును ; సమంతతః=అంతటను;ప్రచరంతి=తిరుగుచున్నవి . ఏతే=ఈ; తపోవనమృగాః=తపోవనమునందలిమృగములు; వేదితీర్థేషు = వేదిస్థానములయందు; శేరతే= పరుండుచున్నవి.

రాక్షసులునుపిశాచంబులునుసంచరించుచున్నారు;తపోవనమునందలి మృగంబులు, వేదిస్థానంబునందుఁ బరుండియున్నవి,చూడుము.

అని, తాత్పర్యము.

సంప్రవృత్తా నిశా సీతే నక్షత్రసమలంకృతా
జ్యోత్స్నాప్రావరణ శ్చంద్రో దృశ్యతే భ్యుదితోం బరే. ౯

టీక॥సీతే=సీతా!నక్షత్రసమలంకృతా=నక్షత్రములచేనలంకరింపఁబడిన; నిశా=రాత్రి;సంప్రవృత్తా= ప్రవర్తించినది.జ్యోత్స్నాప్రావరణః= వెన్నెలయావరణముగాఁగల; చంద్రః=చంద్రుఁడు;అంబరే=ఆకాశమునందు; అభ్యుదితః=ఉదయించినవాఁడై; దృశ్యతే=చూడఁబడుచున్నాఁడు.

సీతా!నక్షత్రములతోఁగూడ రాత్రి వచ్చినది;చంద్రికాలంకృతుండగు చంద్రుండు,ఆకాశంబునఁగన్నులపండువుగఁజూపట్టుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

గమ్యతా మనుజానామి రామస్యానుచరీ భవ

కథయంత్యాహి మధురం త్వయాహం పరితోషితా. ౧౦

టీక॥గమ్యతాం= పొందఁబడుఁగా క. అనుజానామి=అనుమతించెదను. రామస్య=రామునకు; అనుచరీ= వెంబడించుదానవు; భవ=అగుము . మధురం=మనోహరముగా; కథయంత్యా= చెప్పుచున్న; త్వయా=నీచేత; అహం= నేను; పరితోషితాహి = సంతోషపఱుపఁబడినానుగదా!

నీవింకఁబోయి, రామునితోఁగూడనుండుము; నేననుజ్ఞ నొసంగెదను; నీవుమధురంబుగాఁ గథం జెప్పుటంజేసి, నాకుమిక్కిలియు సంతోషంబు గలిగినది. అని, తాత్పర్యము.

అలంకురు చ తావత్త్వం ప్రత్యక్షం మమ మైథిలి
ప్రీతిం జనయ మే వత్సే దివ్యాలంకారశోభితా. ౧౧

టీక॥మైథిలి=సీతాదేవీ!త్వం = నీవు;మమ=నాయొక్క; ప్రత్యక్షంతావత్ =ప్రత్యక్షమునను;అలంకురుచ= అలంకారమునుంజేసికొనుము. వత్సే= బిడ్డా!దివ్యాలంకారశోభితా= దివ్యమయినయలంకారముచేఁబ్రకాశించుదానవై;మే=నాకు; ప్రీతిం=సంతోషమును;జనయ=కలిగింపుము.

సీతాదేవీ!నీవునాయెదుటనెయలంకారంబుజేసికొనుము; దివ్యాలంకారంబుననొప్పుచున్న దానవై; నాకుసంతోషంబుగలిగింపుము. అని, యనసూయాదేవి,సీతతోఁజెప్పెను.

అని,తాత్పర్యము.

సా తథా సమలంకృత్య సీతా సురసుతోపమా
ప్రణమ్య శిరసా తస్యై రామం త్వభిముఖా యయౌ. ౧౨

టీక॥సురసుతోపమా = దేవకన్యతోఁబోలిकగల;సా=ఆ;సీతా= సీతాదేవి;తథా=అట్లు;సమలంకృత్య = అలంకరించుకొని;శిరసా=తలచేత ; తస్యై=ఆయనసూయాదేవికొఱకు; ప్రణమ్య=నమస్కరించి; రామం= రాము




నిగూఢిః; అభిముఖాతు=ఎదురుమొగమయినదై;యయా=పోయినది.

దేవకన్యతోఁ బోల్కిగల సీతాదేవి,చకెగానలంకరించుకొని,యయ్యనసూయాదేవికి, సాష్టాంగముగ నమస్కరించి, రామునొద్దకుఁబోయెను.

అని, తాత్పర్యము.

తథాతు భూషితాం సీతాం దదర్శ వదతాం వరః
రాఘవః ప్రీతిదానేన తపస్విన్యా జహర్షచ. ౧౩

టీక॥ వదతాం=మాటలుచెప్పువారలలో; వరః=శ్రేష్ఠుండగు రాముండు; తథా=అట్లు;భూషితాం=అలంకరింపఁబడిన;సీతాం= సీతాదేవిని; దదర్శ= చూచెను. రాఘవః= రాముఁడు; తపస్విన్యా=అనసూయాదేవియొక్క;ప్రీతిదానేన=సంతోషముచే గలుగుదానముచేత; జహర్షచ=సంతోషించెను.

మాటలుజెప్పువారిలో నుత్తముండగు, రాముఁడు, అలంకృతమయివచ్చిన సీతాదేవింజూచి, అనసూయాదేవిగావించిన ప్రీతిదానంబునకు.మిక్కిలియు సంతోషించెను. అని, తాత్పర్యము.

న్యవేదయత్తత స్సర్వం సీతా రామాయ మైథిలీ
ప్రీతిదానం తపస్విన్యా వసనాభరణస్రజమ్. ౧౪

టీక॥తతః=అంత;మైథిలీ= సీతాదేవి; రామాయ= రామునికొఱకు; తపస్విన్యాః= అనసూయాదేవియొక్క; ప్రీతిదానం=సంతోషముచేనివ్వఁబడిన; వసనాభరణస్రజం=వస్త్రమును ఆభరణమును బుష్పమాలికలను; సర్వం= సమస్తములను; న్యవేదయత్=తెలిపెను.

అంత,సీతాదేవి,యనసూయాదేవి తనకుఁబ్రీతిచేవస్త్రాభరణాదులొసంగుట మొదలగు వృత్తాంతము నంతయు రామునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము,

ప్రహృష్ట స్త్వభవ ద్రామో లక్ష్మణశ్చ మహారథః







మైథిల్యాస్సత్క్రియాం దృష్ట్వా మానుషేషు సుదుర్లభామ్. ౧౫

టీక॥ రామః=రాముండును; మహారథః=తన్నును తన సారథిని గుఱ్ఱమును కాపాడుకొనుచు; బదునొకండు వేల మందివిలుకాండ్రతోఁ బోరునట్టి; లక్ష్మణశ్చ=లక్ష్మణుఁడును; మానుషేషు=మనుష్యులయందు; సుదుర్లభాం=మిక్కిలి యు దుర్లభమయిన; మైథిల్యాః=సీతాదేవియొక్క; సత్క్రియాం=పూజను; దృష్ట్వా=చూచి; ప్రహృష్టః=మిక్కిలియు సంతసించినవాఁడు; ("తు" అనునది పాదపూరణార్థము) అభవత్=అయ్యెను.

మనుష్యుల కెవ్వరికిని బొందనలవి గానట్టి సీతాదేవివలనం గలిగిన సత్కారముం జూచి రాముండును మహారథుండగు లక్ష్మణుండును మిక్కిలియు సంతోషంబు నొందిరి. అని, తాత్పర్యము.

తత స్తాం శర్వరీం ప్రీతః పుణ్యాం శశినిభాననః
అర్చిత స్తాపసై స్సిద్ధై రువాస రఘునందనః. ౧౬

టీక॥ తతః=అంత; శశినిభాననః=చంద్రునితో సమానమయిన ముఖముగల; రఘునందనః=రాముఁడు; సిద్ధైః=తపస్సిద్ధి నొందిన; తాపసైః=ఋషులచేత; అర్చితః=పూజింపఁ బడినవాఁడై; ప్రీతః=సంతోషించినవాఁడై; పుణ్యాం=పవిత్రమయిన; తాం=ఆ; శర్వరీం=రాత్రిని; ఉవాస=ఉండెను.

అంత, జంద్రుంబోలు ముఖంబుగల, రాముండు, తపస్సిద్ధిసంపన్నులగు ఋషులచేఁ బూజింపఁబడుచుఁ, బరమసంతోషంబు నొంది, పుణ్యంబగు నారాత్రి యంతయు, నచ్చట నుండెను.

అని, తాత్పర్యము.

తస్యాం రాత్ర్యాం వ్యతీతాయా మభిషిచ్య హుతాగ్నికాన్
ఆపృచ్ఛేతాం నరవ్యాఘ్రౌ తాపసా న్వనగోచరాన్. ౧౭

టీక॥ తస్యాం=ఆ; రాత్ర్యాం=రాతిరి; వ్యతీతాయాం=కడచినదగుచుం




ఆరాత్రి గడచిన పిమ్మట, ప్రాతః కాలంబున, ఋషులు దఋస్నానంబు గావించి, హోమాదులు నిర్వర్తించుచున్న పిదప, బురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులు, వారియొద్దకుఁ బోయి, పోయివచ్చెదమని చెప్పిరి. అని, తాత్పర్యము,

డగా; నరవ్యాఘ్రౌ= పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులు; అభిషిచ్య= స్నానము చేసి; హుతాగ్నికాన్=వేల్వఁబడిన యగ్ని హోత్రములుగల; వన గోచరాన్= అడవియందుఁడునట్టి; తాపసాన్=ఋషులను; ఆపృచ్ఛేతాం=వీడుకొనిరి.

తా వూచు స్తే వనచరా స్తాపసా ధర్మచారిణః

వనస్య తస్య సంచారం రాక్షసై స్సమభిప్లుతమ్. ౧౮

టీక॥ వనచరాః=అడవియందుఁదిరుగునట్టి; ధర్మచారిణః=ధర్మమునాచరించువారలగు; తే=ఆ; తాపసాః=ఋషులు; తౌ = ఆరామలక్ష్మణులను గూర్చి; రాక్షసైః=రాక్షసులచేత; సమభిప్లుతం=బాధింపఁబడిన; తస్య = ఆ; వనస్య = అడవియొక్క; సంచారం = సంచారమును; ఊచుః = చెప్పిరి.

వనచరులును ధర్మానుష్ఠానపరులునగు నామునులు, ఆరామలక్ష్మణులం జూచి యవ్వనంబునం గలుగు రాక్షసబాధ నిట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

రక్షాంసి పురుషాదాని నానారూపాణి రాఘవ

వసం త్యస్మిన్ మహారణ్యే వ్యాళాశ్చ రుధిరాశనాః. ౧౯

టీక॥ రాఘవ = రాముఁడా! అస్మిన్=ఈ; మహారణ్యే= గొప్పయడవియందు; పురుషాదాని= పురుషులం దినునట్టి; నానారూపాణి= నానావిధరూపములుగల; రక్షాంసి=రాక్షసులు; వసంతి=ఉన్నారు; రుధిరాశనాః= నెత్తురెయాహారముగాఁగల; వ్యాళాశ్చ=క్రూరమృగంబులును; వసంతి(అధ్యాహృతము)=ఉన్నవి.

రాముఁడా! ఇమ్మహారణ్యంబునం

దు ; పురుషభక్షకులగు నానావిధరూపములుగల రాక్షసులున్నారు ; రక్తమే యాహారముగాఁగల క్రూరమృగంబులనేకంబులున్నవి.

అని, తాత్పర్యము.

ఉచ్ఛిష్టం వా ప్రమత్తం వా తాపసం ధర్మచారిణమ్
అదన్త్యస్మి న్మహారణ్యే తా న్నివారయ రాఘవ. ౨౦

టీక॥ రాఘవ = రాముఁడా ! అస్మిన్ = ఈ ; మహారణ్యే = గొప్పయడవియందు ; రాక్షసాః ( అధ్యాహృతము) = రాక్షసులు ; ఉచ్ఛిష్టంవా = ఎంగిలినొందినవానిఁగాని ; ప్రమత్తంవా = ఏమఱియున్నవానిఁగాని ; ధర్మచారిణం = ధర్మమునాచరించునట్టి ; తాపసం = మునిని ; అదంతి = భక్షించెదరు.

రాముఁడా ! ఇమ్మహారణ్యంబున, రాక్షసులు చేరి, మునులు ; ఉచ్ఛిష్టులుగానుండునప్పుడుగాని యేమఱియుండునప్పుడుగాని , పట్టిభక్షింపుచుందురు.

అని, తాత్పర్యము.

ఏష పన్థా మహర్షీణాం ఫలాన్యాహరతాం వనే
అనేన తు వనం దుర్గం గన్తుం రాఘవ తే క్షమమ్. ౨౧

టీక॥ రాఘవ = రాముఁడా! ఏషః = ఇది ; వనే = అడవియందు ; ఫలాని = పండ్లను ; ఆహరతాం = తెచ్చునట్టి ; మహర్షీణాం = మహర్షులయొక్క ; పంథాః = మార్గము. అనేనతు = ఈమార్గముచేతనే ; దుర్గం = చొరనలవిగాని ; వనం = అడవిని ; గంతుం = పొందుటకు ; తే = నీకు ; క్షమం = యుక్తము.

రాముఁడా! మహర్షులడవియందు ఫలంబులు దెచ్చుకొనుటకుఁ బోయి వచ్చుమార్గంబిది ; నీవీమార్గంబుననె దుర్గంబగువనంబుఁ బ్రవేశించుట యుక్తము. అని, మునులు , రామలక్ష్మణులకుం జెప్పిరి. అని, తాత్పర్యము.

ఇతీవ తైః ప్రాంజలిభి స్తపస్విభి
ర్ద్విజైః కృతస్వ స్త్యయనః పరన్తపః

వనం సభార్యః ప్రవివేశ రాఘవ
స్స లక్ష్మణ స్సూర్య ఇవాభ్రమండలమ్. ౨౨

టీక॥ పరంతపః = శత్రువులందపింపంజేయునట్టి; సభార్యః = భార్యతోఁగూడినవాఁడును; సలక్ష్మణః = లక్ష్మణునితోఁగూడినవాఁడునగు; రాఘవః = రాముఁడు; ఇతీవ = ఇట్లు; ప్రాంజలిః = మంచిచేమోడ్పుగల; తపస్విభిః = అధికమయినతపస్సుగల; తైః = ఆ; ద్విజైః = బ్రాహ్మణులచేత; కృతస్వస్త్యయనః = చేయఁబడిన మంగళాచరణముగలవాఁడై; వనం = అడవిని; సూర్యః = సూర్యుఁడు; అభ్రమండలమివ = మేఘమండలమునువలె; ప్రవివేశ = ప్రవేశించెను.

శత్రువులందపింపంజేయునట్టి రాముండు, ఇట్లామునులుసవినయంబుగాఁ బ్రార్థించి గావించుమంగళాచరణంబుఁగైకొని, సీతాలక్ష్మణులంగూడి, సూర్యుండు మేఘమండలంబు బ్రవేశించువిధంబున, దండకారణ్యముం బ్రవేశించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, శ్రీమద్వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం సంహితాయాం
శ్రీ మ ద యో ధ్యా కాం డే,
ఏకోనవింశత్యుత్తరశతతమస్సర్గః.
అయోధ్యాకాండస్సమాప్తః.
ఇదిస్పష్టార్థము,

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండైకోనవింశత్యుత్తర
శతతమసర్గటీక ముగిసినది.

అయోధ్యాకాండటీకసమాప్తిఁబొందినది.

స ౧౧౯

శ్రీమదయోధ్యాకాండపఠనశ్రవణంబులఫలము
బ్రహ్మాండపురాణమునం జెప్పఁబడినది.

"కాండం ద్వితీయం శృణ్వన్ యః ప్రోక్తేన నియమేనతు
సోగ్నిసాయుజ్య మాప్నోతి పఠనాద్వాపి శాస్త్రతః"

(" రెండవదైనయయోధ్యాకాండంబును యథోక్తనియమంబున విన్నవాఁడు, అగ్నిసాయుజ్యమునొందును; యథావిధిగ బఠించుటవలనను అదే ఫలంబుసిద్ధించును". )

శ్రీసీతారామ పరబ్రహ్మణేనమః.

శుభమస్తు.

